శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy)**


సంపుటము ౧౯. { ప్రమోదూతనామసంవత్సరము. చైత్ర వైశాఖమాసములు. } సంచిక ౧.





కాకినాడ:

సూర్యరావుచేఁ బరిషత్కార్యాలయమునఁ

బ్రకటింపఁబడినది.

పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు 3. { విడిసంచిక రు ౦-౮-౦.

1930

# విషయసూచిక.

# పరిషత్ప్రయోజనములు.



తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసంగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రిందఁ బొందుపఱుపఁబడు చున్నవి:—

i తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వాంకష మగునిఘంటు వొకటి రచించి ప్రచురించుట;

ii తెలుఁగుభాషకు సజాతీయేతరభాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణము రచించి ప్రచురించుట;

iii ఆధునికశాస్త్రగ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట;

iv ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యములైన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగు దేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొకటి రచించి ప్రచురించుట;

v సర్వవిషయములనుగుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసఁగుట;

vi ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట;

vii తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొక పత్రికను బ్రకటించుట;

viii తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గుఱించి చర్చించుటకుఁగాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట;

ix తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్య పట్టములను, యోగ్యతాపత్రికలను నొసంగుట;

x ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట- ఇందుఁ బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును; వ్రాఁతప్రతులుగూడ నుండవలయును;

xi తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపకరించు నన్ని కార్యములను జేయుట.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక.

కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౧౯ { ప్రమోదూతనామసంవత్సరము. చైత్ర వైశాఖమాసములు. } సంచిక ౧

## విజ్ఞప్తి.

పరిషత్పత్త్రికకు శుక్లసంవత్సరముతోఁ బదునెనిమిదివత్సరములు నిండినవి. బాల్యము తీరి నూత్నయౌవనముచే నలరారుచున్నది. సరససాంగిత్యంబును నానాకళాపారీణత్వమును గలిగి సహృదయామోదసంధాయిని యగునని వేఱ చెప్పనవసరము లేదు. పదునెనిమిదవసంపుటమునఁ గాళిందీకన్యాపరిణయము నందలి ద్వితీయభాగమును, ఆంధ్రధాతుమాలను బ్రకటించితిమి. ఈ పందొమ్మిదవసంపుటమున ననంతకవికృత రసాభరణమును, ఆంధ్రీకృతరసమంజరిని, షోడశకుమారచరిత్రమును బ్రకటింపఁదలఁచితిమి. షోడశకుమారచరిత్ర మసంపూర్ణముగ నుండుటచే మాయొద్దనున్న భాగములనే పరిష్కరించి పాఠకలోకమున కీయ సమకట్టితిమి. మఱియొక నూతనవిషయము:- శిష్టు కృష్ణమూర్తి శాస్త్రికవిచే రచియింపఁబడిన కారికావళినుండి చిన్నయసూరి తన వ్యాకరణసూత్రముల రచియించె నని పలువురు తలంచుచున్నారు. మదరాసులో నారాయణవనము వకుళాభరణముగారివలనఁ జిన్నయసూరిగారిచే రచియింపఁబడిన సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణమును, బాలవ్యాకరణసూత్రములకంటె విపుల మగు నాంధ్రశబ్దానుశాసనమను నాంధ్రవ్యాకరణసూత్రములను సంగ్రహింపఁగలిగితిమి. వానిని గూడ నీసంపుటముననే ప్రకటించుచున్నాము. పాఠకమహాశయు లందఱును మాపత్త్రికయందుఁ బూర్వముకంటె నత్యధికమగు నభిమానమునుఁ గనఁబఱిచి మమ్ములను బ్రోత్సహింతు రని విశ్వసించుచున్నాము.

ప॥ అ॥

# అచ్యుతరాయ లెవ్వరు ?

సాహిత్యవిద్యాప్రవీణ, బులుసు వేంకటరమణయ్యగారు,
విజయనగరము.

---

విజయవిలాసప్రబంధకర్త యగుచేమకూర వేంకటకవి తనవిజయవిలాసగ్రంథమునఁ గృతిపతివంశమును వర్ణించుచుఁ గృతిపతిపితామహుఁ డగుచెవ్వప్పనాయకు నభివర్ణించుసమయమున-

గీ. కని నచ్యుతరాయలదేవి యైన, తిరుమలాంబకుఁ జెలియలై తేజరిల్లు
మూర్తమాంబను బెండ్లియై కీర్తి వెలయు, చెవ్వవిభుఁడు మహోన్నతశ్రీఁ జెలంగె.

అని చెప్పెను. ఇందువలన నచ్యుతరాయఁడు చాల గొప్పరాజనియు, నతనికిఁ దోడియల్లుఁ డగుటవలనఁ జెవ్వరాజునకుఁ గీర్తిప్రతిష్ఠలు కలిగిన వనియుఁ దెలియుచున్నది. కావున నచ్యుతరాయలు పేరెన్నికఁ గన్నవాఁడును జెవ్వనాయకుని బంధుకోటిలోనివాఁడును గావలయును.

శ్రీకృష్ణదేవరాయల యనంతరము దక్షిణాంధ్రదేశమును బరిపాలింప నాయకరాజులు నియమింపఁబడిరి. వా రందఱును శూద్రకులజులు; ఈయంశము వేంకటకవియే-

"ప్రకటశ్రీహరియంఘ్రిఁ బుట్టి హరుమూర్ధం బెక్కి యాపాదమ
స్తకమున్ వర్ణనకెక్కు తల్లి సహజోదంచత్కులోత్పన్ననా
యకరత్నం బని యచ్యుతేంద్రరఘునాథాధీశ్వరస్వామికిన్
సకలైశ్వర్యములన్ నిజేశువలనన్ సంధిల్లఁగాఁ జేయుతన్.

అని కంఠోక్తిగఁ బల్కియున్నాఁడు.

చెవ్వప్పనాయకుని తోడియల్లుఁ డగునచ్యుతరాయ లెవ్వ రని ప్రశ్న కలుగక మానదు. ఆంధ్రసార్వభౌముఁ డగుశ్రీకృష్ణదేవరాయలకు సవతి తమ్ముఁ డగునచ్యుతదేవరాయలే యీయచ్యుతరాయ లని శ్రీలక్ష్మణరావుపంతులుగారి "ఆంధ్రవిజ్ఞానసర్వస్వము"[The Telugu Encyclopaedia]నందుఁ గలదు. మఱియు శ్రీలక్ష్మణరావుగారు రచించిన "మహమ్మదీయమహాయుగము" నందుఁ గూడ నిట్లే కల దని జ్ఞాపకము. ఈరీతినే బంధుత్వముం గలిపి నచోఁ గృష్ణరాయని జన్మవృత్తాంతమునందలి పుక్కిటిపురాణమును నమ్మి,

అతనితమ్ముఁ డగునచ్యుతదేవరాయలుకూడ నట్టివాఁడే యని యంగీకరింపవలసి వచ్చుచున్నది.

మఱియు మహాస్కదీయమహోయుగము చివర శ్రీలక్ష్మణరావుగారు శ్రీకృష్ణదేవరాయలతల్లి కులకాంతయే కాని భోగకాంత కాదని నిరూపించుచు దానికిఁ బ్రమాణముగఁ దమకు లభించిన "అచ్యుతరాయాభ్యుదయ" మ్మను గీర్వాణకావ్యమునందలి శ్లోకముల నిచ్చిరి. ఆయచ్యుతరాయలే యీయచ్యుతదేవరాయ లనియుఁ జెవ్వప్పనాయకుని తోడియల్లుఁ డనియు వారు వ్రాసిరి. అచ్యుతరాయాభ్యుదయముం బట్టి చూచినచో నచ్యుతదేవరాయలతల్లి* సవతులు ముగ్గురిలోను జాల నుత్తమురా లనియుఁ, బట్టపుదేవి యనియుఁ దెలియుచున్నది. అట్టి దేవేరికొడుకు కొంకనాయకవంశచూడామణికిఁ దోడియల్లుఁ డగుట పొసఁగునా ?

వీరేశలింగముపంతులుగారు తమకవులచరిత్రమున, చేమకూర వేంకటకవివిషయమున వ్రాయుచుఁ జెవ్వప్పనాయకుని తోడియల్లుఁ డగునచ్యుతరాయలు కృష్ణదేవరాయలకుమారుఁ డని వ్రాసిరి. కృష్ణదేవరాయల జననవృత్తాంతమున సందేహ ముండుటచే రాజు లెవ్వరును దమకన్యకల నాతని కీయనందున నతఁ డొకనాయకరమణీమణిని బెండ్లియాడె ననియు, నామెయం దతని కచ్యుతరాయ లనుకొడుకు కల్గె ననియు వా రాశయపడిరి.

కాని యిది సరిగా నుండునట్లు తోఁపదు. కృష్ణరాయఁడు క్షత్రియుఁడే యని ప్రమాణములు చాలఁ గలవు. అట్లు కృష్ణరాయనిజననవిషయమున సందేహము లున్నను, కృష్ణరాయలకుఁ బురుషసంతాన మున్న దనుటలోఁ బ్రమాణము లల్పములు. ఒకకుమారుఁడు కల్గెననియు, నతఁడు పిన్నవయసునందే మరణించె ననియు, నతనిమరణమునకుఁ దిమ్మరుసుమంత్రియు నతనికుమారుఁడును గారకు లని ప్రవాదము కల్గె ననియు, గొన్నిచరిత్రలవలన మనకుఁ దెలియుచున్నది. ఏ మయినను శ్రీకృష్ణదేవరాయల కున్న దనుకొన్న పురుషసంతాన మొక్కటియు బాల్యమునందే నష్టమైన దనుట నిశ్చయము. ఇట్టియెడ నచ్యుతరాయలు కృష్ణరాయని కొడుకగుటయుఁ, జెవ్వప్పనాయకుఁ డతని తోడియల్లుఁ డగుటయు సంభవింప దని చెప్పవచ్చును.

---

*నరసరాజు భార్యలు 1. తిప్పాంబ. 2. నాగాంబ. 3. ఓబాంబ. అందోబాంబయే పట్టపుదేవి. చూ. మహాస్కదీయమహోయుగము.

రాజు నాల్గుజాతులవనితలను బెండ్లియాడుట పురాణధర్మశాస్త్రప్రసిద్ధ మగుటచే నచ్యుతరాయలతండ్రి క్షత్త్రియుఁడైనను, శూద్రభార్యయందతని కచ్యుతరాయలు కలుగుట విరుద్ధము కానేర దని కొందఱయాశయము కావచ్చును. కాని క్షత్త్రియుఁడు నాల్గుజాతులస్త్రీలను బెండ్లియాడుట కధికారము లేదు. క్షత్త్రియుఁడు బ్రాహ్మణవనితను బెండ్లియాడరాదు. బ్రాహ్మణునికే యట్టిహక్కు కలదు. క్షత్త్రియుఁడు క్షత్త్రియాదిజాతిత్త్రితయజాతకన్యలం బెండ్లియాడవచ్చు నని యందు రేమో? అట్లు జరుగువివాహములు గ్రంథస్థములే కాని యాచారమున నేకాలమునఁ గలవో మన మెఱుఁగము. మనకు లభించిన చారిత్త్రికవిషయములలో నట్టివి యున్నటులు మనము చూడలేదు, కావున దానిని బ్రమాణముగఁ దీసికొనుట సరికాదు.

మఱి యొకవాదము- చెవ్వప్పనాయకుఁడు నాయకకులజుఁడైనను, రాజ్యనిర్వహణముఁ జేయుచుండుట నతఁడు క్షత్త్రియసమానుఁడు. కావున నతఁడు మూఁడుజాతులస్త్రీలను బెండ్లియాడవచ్చు నేమో యని- కాని, రాజ్యనిర్వహణమాత్త్రమున శూద్రుఁడు క్షత్త్రియుఁ డగుట సంభవించునా? అపుడు క్షత్త్రియవనితలఁ బెండ్లియాడ వీలగునా? ఆంధ దేశమున రెడ్డిప్రభుత్వకాలమున రెడ్డిరా జెవ్వరైన క్షత్త్రియవనితను గాని, వైశ్యవనితను గాని పరిణయమాడినట్లు మనము చెప్పఁగలుగుదుమా? ఇయ్యది యుక్తికిఁ గాని యనుభవమునకుఁ గాని, సరిపడ లేదు. ఇంతకుఁ బూర్వము నిరూపింపఁబడిన వాదమునఁ బురాణాదు లొకటి రెం డనుకూలించునేమో కాని యిం దట్టి గ్రంథస్థప్రమాణమును లేదు. కాన, నీవాదమును సరిగా లేదని తోఁచుచున్నది.

పైకారణములఁబట్టి విజయవిలాసకృతిభర్త యగురఘునాథనాయకుని తాత యగుచెవ్వప్పనాయకుఁడు కృష్ణరాయనితమ్ముని తోడియల్లుఁ డని చెప్పి యచ్యుతదేవరాయలకుఁ గళంక మారోపించుట, కృష్ణరాయని జననవృత్తాంతమున సందేహము సకారణముగఁ జూపించుట బాగు లేదు, గానఁ, జేమకూర వేంకటకవిగారి యచ్యుతరాయ లచ్యుతదేవరాయలకంటె భిన్నుఁ డని చెప్పవలెను.

దక్షిణాంధ్రరాజులచరిత్ర నాకు లభింపకపోవుటచే వారిలో (నాయక రాజులలో) నచ్యుతరాయ లనునాతఁ డొకఁ డున్నాఁడో లేఁడో నిశ్చయము

గఁ జెప్పఁజాలను. కాని విజయవిలాసముంబట్టి వేఱొకఁ డుండియుండవలెనని తోఁపక మానదు. అతఁ డొకగొప్పనాయకరాజై యుండవలెను.

కానఁ బాఠకు లగుపండితప్రకాండులు దక్షిణాంధ్రనాయకరాజుల చరిత్రను బాగుగ విమర్శించి ప్రమాణముల సేకరించి, అనేకవిధములగు దురభిప్రాయములకుఁ దావు నిచ్చి, మనలను వంచించి యజ్ఞాతవాస మొనర్చు నాయచ్యుతరాయ లెవ్వరో, యతఁ డేకాలమునాఁటివాఁడో విమర్శించి యీయాంధ్రసాహిత్యపరిషత్పత్రికయందే యొకవ్యాసమును బ్రకటింపవలె నని వినయపూర్వకముగ వేఁడుకొనుచున్నాను.

---

# కవితాశక్తి.

కవిభూషణ:—శతావధాని దోమా వేంకటస్వామిగుప్తగారు.

---

మ. కవితాశక్తి నుతించి పల్కుటకు శక్యంబౌనె యెవ్వారి కా
భవజూటాటవికాస్థలీప్రవిలుఠత్స్వర్వాహినీవేగసం
భవదుత్తుంగఘుమంఘుమారవముతో వాదంబు గావించు మే
ల్జవముం జెంది సభాస్థలీబుధులకుం సంతోషముం గొల్పుటన్. ౧

మ. కవితాశక్తి నుతించి పల్కుటకు శక్యంబౌనె యెవ్వారి కైం
ద్రవనోదారసుధాసరోవరసువర్ణాబ్జావళీకర్ణికా
ళివినిర్యన్మకరందబిందువితతిన్ లెక్కింపఁ బోనట్టి మే
ల్చవులం దేల్చి సుధీజనంబుల కొగిన్ సంతోషముం గూర్చుటన్. ౨

మ. కవితాశక్తి నుతించి పల్కుటకు శక్యంబౌనె యెవ్వారికే
నవురా! నాఁగ దిగంతకాంతశరచంద్రాహీనడిండీరకీ
ర్తి వెసం గూర్చి ధరావరోత్తమశిరశ్శ్రేణీమణీమాన్యతం
భువినిం గొల్పి యుముక్తినిం బరమునం బూన్కిం దగం జేర్చుటన్. 3

మ. కవితాపద్మముఖీమనోహరుఁడు వీఁకన్ స్వీయమార్గైకతమం
దువహిం జెందక యుం దిరస్కృతి గనుం బో! యేఁడో యవ్వాఁడు తా
భువి నేకాతపవారణంబుగను బ్రోవుం జేయువాఁ డౌత మా
నవునాయంచును లెక్కకుం గొనఁడు; నుత్యంబుల్ కవితోద్ధతుల్. ౪

శా. కైతంబందలి యందచందముల వేడ్కం జెందుచుం జొక్కి యుం
జేతోమోదము నొందువారలకు నీసింధూత్తరప్రావృతో
ర్వీతాటంకవతీపతిత్వ మెదకున్ లెక్కింపుగాదన్నచో
బాతిల్లంగవితామహత్త్వ మెవరున్ వర్ణింపఁగా నేర్తురే. ౫

చ. లలితకళావతంస మయి ప్రాజ్ఞజనాళికి సన్నుతంబునై
విలసదమర్త్యనాథపదపీఠనికాకనకాబ్జకర్ణికా
గళదమృతోపమానమధుగణ్యతఁ జెందుకవిత్వరీతికిన్
విలువగ నెల్లసంపదలు వేల్చియు నేని క్రయంబుఁ దీర్తుమే? ౬

శా. సొమ్ముల్ గోరదు సీర లారయదు నేశుద్ధాంతగేహమ్ము ని
ద్ధమ్ముం జేయఁ బనుండదున్ బోరుగువాదాలుండ వైనన్ సమ
స్తమ్మున్ లోఁబడఁజేసి సర్వదిగుదాత్తవ్యాప్త సత్కీర్తిలా
భమ్ముం గొల్పును; గైతఁ బోలె సుఖలాభం బేది సంధించెడిన్. ౭

మ. ధనము న్నే నిహసౌఖ్యలాభముల నందన్వచ్చు; దానంబు లి
చ్చిన ఖర్చే, దపమున్నచోఁ బరమునం జెందందగున్ ముక్తి; కా
ని నిగారంపుఁగవిత్వమెంతయును నిర్ణిద్రైహికాముష్మికో
రునిరౌపమ్య సుఖంబులం గొలుపు సుశ్లోకంబు సంధించియున్. ౮

శా. బాలుండుం బసరంబుఁ బాము పని భావంబందు గానంబులో
లీలన్ గాంచి ముదంబునొందు; నయినం జెన్నౌ కవిత్వప్రభా
శీలం బాసకలం బెఱుంగు ప్రభువే శ్రీకంఠుఁ డేనిం గడున్
వాలాయం బిదమిత్థమంచుఁ బలుకన్ వర్ణింపనే శక్యమౌ? ౯

(ఈపద్యము లప్పుడప్పుడు రచించినవి.)

# మారుతి స్తవరాజము.

శతావధానులు, రామకృష్ణ సీతారామసోదరకవులు. గజ్జలకొండ-

---

శ్రీరఘురామపాదసరసీరుహభృంగిపతీ! సమస్తదే
వారిచమూసమూహకుధరాధిపహేతి! మహోన్నతాకృతీ!
దూరితభక్తభీతి! పరితోషితవారిజసూతి! నిత్యశృం
గారవిభూతి! భాస్వరదఖండకృపామతి! ప్రోవుమారుతీ! ౧

ఉ. ఆతతభక్తమోక్షద దయారతి! భూమిసుతాముఖాంబు
జజ్యోతి! రణావనీవిజితశూరతతీ! దశకంధరాస్త్రభి
ద్ధేతి! నిరస్తసంసృతి! నగేశసమాకృతి! శ్రీమదంజనా
సూతి! యశోవిభూతి! పరిశుద్ధమతీ! రిపుఘాతి! మారుతీ! ౨

ఉ. ధీర! యుమాకుమార! వనధిప్రతిమానగభీర! దుష్టసం
హార! మరుత్కిశోర! కలుషానలవార్షికధార! సత్యసం
చార! సువర్చలాహృదయసారసబంభర! సర్వసద్గుణా
ధార! యశోకకాననవిదార! మహారణశూర! మారుతీ!

ఉ. సంగరరంగదుర్మదనిశాచరశూర శిరస్సరోజసా
రంగ! దయాంతరంగ! పరరాజవిభూతితమఃపతంగ! వ
జ్రాంగ! మహాసురాళిదురహంకృతిభంగ! యుమాముఖాబ్జసా
రంగ! నిజాశ్రితాఘపవనార్భకపాళిభుజంగ! మారుతీ! ౪

ఉ. బాల! కృపాలవాల! పరిపంథిగణాటవికీల! దుర్మదా
భీల! జగద్విశాల! పృథివీవరసన్నుత సత్యశీల! ధీ
లోల! ధృతోగ్రశైల! బుధలోకమనోరథపాల! దీర్ఘలాం
గూల! ధగద్ధగద్ధగితకోటిదివాకరపాల! మారుతీ! ౫

ఉ. అక్షకుమారముఖ్యదనుజావళిగంధగజేంద్రబాలహ
ర్యక్ష! ధరాత్మజాధిపపదాంబుజసేవనదక్ష! భక్తసం
రక్ష! కృపాకటాక్ష! పరరాజచమూపతిశిక్ష! వానరా
ధ్యక్ష! సమస్తభక్తనికరావననిస్తులదీక్ష! మారుతీ! ౬

ఉ. ధన్య! సమస్త దానవవిదారణదక్షకపీశలోక మూ
ర్ధన్య! జగచ్ఛరణ్య! మునిరాట్కులమాన్య! మహౌఘవహ్నిప
ర్జన్య! అగణ్యపుణ్య! పరిరక్షితవారిజగర్భదేవరా
జన్య! వశీకృతారిమదసైన్య! విశోషితదైన్య! మారుతీ! ౭

ఉ. దండము నీకు దీనజనతాఘనతాపవితానకంజవే
దండ! ప్రచండవేగపరితశ్శకలీకృతభూతకాండ! బ్ర
హ్మాండకటాహపూర్ణభయదాకృతికాంతి వినిర్జితోగ్రమా
ర్తాండ! మునీంద్రవంద్యతరుణారుణపద్మసజుండ! మారుతీ! ౮

ఉ. హృద్యకవిత్వవేద్య! విబుధేశభవామయపాళిదేవతా
వైద్య! దశాననాద్యసురవర్గరణాగ్రనిశాతమార్గణా
భేద్య! విదారితారిజనవిస్తృతిమారణవిద్య! పండితా
రాధ్య! సుధారసోపమవిరాజితవాగనవద్య! మారుతీ! ౯

ఉ. వానరశూర! శూరగణవర్ణితదోర్యుగసార! సారవి
జ్ఞానవిచార! చారకులనాయకభంజనధీర! ధీరదై
త్యాచలవజ్రధార! కుధరాత్మజనందితవీర! వీరగా
రీసకుమార! మారజనకేడ్యవచోమృతసార! మారుతీ! ౧౦

# గ్రంథస్వీకారము.

(1) ఆంధ్రభారతకవితావిమర్శనము:- (Studies in Andhra Bharata) కోరాడ రామకృష్ణయ్య ఎం. ఏ. గారిచే రచియింపఁబడినది. ఆంధ్రపత్రికా ముద్రణాలయమున- ముద్రింపఁబడినది. వెల 2—0—0

ఈగ్రంథము మద్రాసువిశ్వకళాపరిషత్తులో గ్రంథకర్తగారొనర్చిన పరిశోధనఫలిత మని పీఠికయందుఁ జెప్పఁబడినది. ఆంధ్రవాఙ్మయమున మహాభారత మగ్రస్థానము నలంకరించుచున్నది. భాషాస్వరూపనిర్ణయమందును శైలియందును, రచనానైపుణ్యమునందును నమూల్యమై ప్రబంధకవులకుమార్గదర్శకమై ప్రమాణగ్రంథముగ నొప్పుచున్నది. అట్టిగ్రంథమును బాగుగ విమర్శించి నన్నయతిక్కనలనాఁటి యాంధ్రభాషాస్వరూపమును నిర్ణయింపవలసియున్నది. వారిగ్రంథరచనాపద్ధతుల నెట్టులు తరువాతిప్రబంధకవు లనుకరించిరో, మహాభారతమున కట్టిలోకోత్తరప్రశస్తి యెందువలనఁ గలిగినదో భాషాభిమానము గల ప్రతియాంధ్రుఁడును జర్చించి తెలిసికొనవలసియున్నది. మ॥ సూర్యనారాయణశాస్త్రిగారు రచియించిన మహాభారతవిమర్శన మనుగ్రంథము వావిళ్లవారిచే ముద్రింపఁబడియున్నది. కాని యందు విపుల మగు చర్చ గానరాదు. గ్రంథకర్తగారు తాము విశ్వకళాపరిషత్తునందుఁ బరిశోధనల జరుపుచు భారత విమర్శనమును రచియించుచు విపుల మగుగ్రంథమును మనకొసఁగినందులకు మన మభినందింపవలసియున్నది.

ఈగ్రంథమునఁ బ్రథమాధ్యాయమున భారతమునకుఁ బూర్వవాఙ్మయస్వరూపము చర్చింపఁబడినది. శాసనములందలి యాంధ్రభాషాస్వరూపము నిరూపింపఁబడినది. కాని నన్నయకుఁ బూర్వమునఁ గలగ్రంథములు మన కెవ్వియును లభించియుండలేదు. అట్టిగ్రంథము లెవ్వియును లేవని యనేకులు విశ్వసించుచున్నారు. నన్నెచోడుఁడు నన్నయకుఁ బూర్వుఁడని కొందఱును, అర్వాచీనుఁడని కొందఱును వాదములు సలుపుచున్నారు. శాసనములు భాషాస్వరూపనిర్ణయమునం దుపకారకములని మన మంగీకరింపవలసియున్నది. అయినను గేవలము వానిమీఁదనే యాధారపడి భాషాస్వరూపనిర్ధారణ మొనర్చుట సమంజసము కాదని మాయభిప్రాయము. తాళపత్రగ్రంథములయందును మన

కట్టివిషమసమస్యయే యుదయించుచున్నది. ప్రాచీనగ్రంథములయందలి ప్రయోగములవైచిత్ర్యము భాషాస్వరూపమో, లేఖకప్రమాదమో యిదమిత్థమని నిర్ణయింప వలనులేదు. ప్రథమాధ్యాయమున గ్రంథకర్త చర్చించినవిషయములు విమర్శనీయములు. తెలుఁగువారు మధ్యపరగణాలలోని తేల్ నామకనదీప్రాంతవాసు లగుటచే నాపేరు వచ్చినదనియుఁ, దరువాత, త్రిలింగ, త్రినగ శబ్దములనుండి యుత్పత్తి కల్పింపఁబడిన దనియు వ్రాసినవిషయము ప్రమాణములపై నాధారపడియుండలేదు.

రెండవ యధ్యాయమున భారతరచనాకాలమున మతస్థితి దెలుపఁబడినది. జైనబౌద్ధమతవిజృంభణము నడచి హిందూమత పునరుద్ధారణమునకై చోళులు, పల్లవులు మొదలగువారు ప్రయత్నములు సల్పినకాలమునందు భారతాంధ్రీకరణ మొనర్పఁబడిన దనియు, నన్నయ మూల మగు సంస్కృత భారతమునకంటెఁ దనయాంధ్రీకరణమున వైదికమతమును విశేషముగఁ బ్రశంసించె ననియు నిరూపింపఁబడినది. అరణ్యపర్వశేషభాగము, ఎఱ్ఱాప్రెగడ స్వతంత్రకవిత్వమా లేక శిథిలభాగపూరణమా యను విషయమును జర్చించి గ్రంథకర్త యెఱ్ఱాప్రెగడ తనకవిత్వమునందుఁ దిక్కన ననుసరించిన సందర్భములఁ బొందుపఱిచి, యారణ్యపర్వభాగము, ఎఱ్ఱాప్రెగడ స్వతంత్రవిరచితమే కాని శిథిలభాగపూరణము గానేర దని నిర్ణయించియున్నారు.

మూఁడు నాలుగు అధ్యాయములందుఁ దిక్కనకవిత్వ విమర్శన మొనర్పఁబడినది. తిక్కనశైలి, రసపోషణము, భావములు, పాత్రోచితసంభాషణాదికములు విరాటపర్వమునుండి యుదాహరణములతోఁ జర్చింపఁబడినవి. మూఁడవయధ్యాయమున తిక్కన యాంధ్రీకరణపద్ధతి వివరింపఁబడినది. గ్రంథకర్తకు విరాటపర్వము దక్క ప్రమాణ మగుసంస్కృత భారతము లభింపమిం జేసి విరాటపర్వమునుండియే యుదాహరణములఁ గైకొంటి నని పీఠికయందుఁ దెలిపియున్నాఁడు. తిక్కనార్యుని యాంధ్రీకరణమునకును సంస్కృతభారతమునకును జాల వ్యత్యాసము గలదు. అట్లే యాంధ్రమునఁ గల యాంధ్రీకరణము లన్నియు స్వతంత్రములే. శ్రీనాథుని శృంగారనైషధరచనాతత్త్వమును గాంచిన నిది విస్పష్ట మగును. భావం బుపలక్షించియు, రసంబు పోషించియు,.........ఔచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు.. ......' రచించితి నని నైషధమున శ్రీనాథుఁడు దెల్పుకొనియు

న్నాఁడు. తిక్కనసోమయాజియు మూలగ్రంథమును దన యిష్టానుసారము రసపోషణమునకై మార్చి యాంధ్రమహాభారతమును రచించినాఁడు. మూలమగు సంస్కృతభారతము ప్రథమమున 28000 శ్లోకములు గలిగి జయమను పేరితో వ్యవహరింపఁబడుటయు, తరువాత భారతము మహాభారతమునై లక్షయునిరువదియైదువేల శ్లోకములై యుండుటయు మనకు విదితమే. భారత మన్ని పెక్కుమార్పులను జెంది, నైజస్వరూప మెట్టిదియో తెలియుటకు వీలులేనిస్థితిలోనుండుట భారతీయుల దురదృష్ట మనియే చెప్పనగును. శ్లోకములుమాత్రమేగాక యధ్యాయములును జేర్పఁబడినవి. మూలభారతమును సంస్కరించి ప్రకటించుటకై పూనాపట్టణమున భండార్కరుసమితివారిచేఁ బ్రయత్నమొనర్పఁబడుచున్నది. రామకృష్ణయ్యగారు తిక్కనయాంధ్రీకరణమును విమర్శింపుచు, సంస్కృతభారతమునందలి కథాభాగమును మార్చిన ప్రతిస్థలమునందును తిక్కన రచనానైపుణ్యము వెల్లడియగుచున్నదని నిరూపించుటకు విశేషశ్రమపడియున్నారు. కొన్నితావులఁ దిక్కనయాంధ్రీకరణము ననుసరించి మూలభారతము దాక్షిణాత్య ప్రతుల సంస్కరింపఁబడిన దని నిర్ధారణము మొనర్చినారు. ఇవి యతిశయోక్తు లనియే చెప్పవలసియున్నది.

మూలభారతమును మార్చిన ప్రతిఘట్టమునందును దిక్కనయే యతిశయించె నని మనము నిరూపింప నవసరము లేదు. సంస్కృతభారతకవుల యుద్దేశమును తిక్కనయుద్దేశము నొక్కటి గావు. తిక్కనయాంధ్రీకరణము, హృద్యమై హృదయంగమమై పొలుపారుచున్న దనుటయే మనకుఁ గావలసినది. తిక్కనకవిత్వమునుగూర్చి యాంధ్రలోకమున వేఱభిప్రాయము లే దని కంఠోక్తిగాఁ జెప్పవచ్చును.

నాల్గవయధ్యాయమున గ్రంథకర్త తిక్కన కళాచాతుర్యమును విశదీకరించుటకై ప్రయత్నమొనర్చియున్నారు. తిక్కన రచియించిన భారతాంధ్రీకరణము నందు, విరాటపర్వ మగ్రస్థానము నలంకరించుననుటలో సందియము లేదు. కాని మిగిలినభాగములనుండి కూడ నుదాహరణములఁ గైకొనిన బాగుగనుండియుండు నని తోఁచెడిని. తిక్కనయందు మనము ముఖ్యముగ గమనింపవలసిన విషయములగు, నాటకరచన ననుసరించు భావప్రకటనము, కథావస్తుసంఘటనము, ఔచిత్యప్రదర్శనము, వివిధభావప్రదర్శనముల కనుకూలమగు

శైలియు, పాత్రపోషణమును మహాభారతమునం దంతయు సంపూర్ణముగఁ బ్రదర్శింపఁబడియున్నది.

మఱియొక విషయము:—వాగనుశాసనుఁ డగు నన్నయభట్టు కవిబ్రహ్మనాఁబడు తిక్కన సోమయాజి వీరలలో నెవర గ్రగణ్యులను విషయమున భిన్నాభిప్రాయము గలదు. ఎఱ్ఱాప్రెగడకు వీరిరువురకు దరువాతి స్థానమొసంగి యున్నారు. ఆంధ్ర భారత కవితావిమర్శన మనుపేరి గ్రంథమును రచింపుచుఁ దిక్కనకవిత్వ విమర్శనము మాత్రము విపులముగ నొనర్చుటచే గ్రంథప్రాశస్త్యమున కొక్కింత కొఱంత వాటిల్లిన దని చెప్పక తప్పదు. నన్నయ యెఱ్ఱాప్రెగడలకును నీగ్రంథమునఁ దగినస్థాన మీయవలసియున్నది. అ దెట్లున్నను, ఈ గ్రంథమును రచించి యాంధ్రలోకమున కుపకారమొనర్చిన గ్రంథకర్త ప్రయత్నము సర్వజనాదరణీయ మనియే చెప్పనగును.

(2) స్వప్నయాత్ర—ఇది 168 పుటల (క్రౌను) అఖ్యాయిక. కడప మ్యునిసిపల్ హైస్కూలునందుఁ బ్రధానాంధ్రపండితులు జనమంచి శేషాద్రిశర్మగారిచే రచియింపఁబడినది. ఇందలికథ, స్వప్నమూలకము. "ప్రస్తుత మీ గ్రంథకర్తను గృపాపరతంత్రుఁడైన శ్యామసుందర చక్రవర్తి హిమాలయమునకు బిలుచుకొనిపోయి యందుఁ గల మహనీయస్థలములం జూపి యందు మహాత్ములు సంభాషించున ట్లొనర్చి దానిమూలమునఁ దనభక్తులకుం గలసందేహంము తొలఁగఁజేసెను. పామరులు నస్మద్విషయములు సత్యములు గావనియు, మాయావులు పల్కుమాటలు విశ్వాస ముంచఁదగినవి కా వనియు వానిని నమ్మిన భాగుపడఁ జాల రనియు స్పష్టము గావించెను.........మహాత్ములసంభాషణములే యిందుఁ గలముఖ్యవిషయములు. వారి యాశయములే యిందుఁగలవు...... మొత్తముమీఁద నీయాఖ్యాయిక భక్తిని మతాభిమానమును గలిగించును. అని "కాశ్యపుఁడు" గ్రంథప్రారంభమున వ్రాసియున్నాఁడు. వెల 1-0-0. చెన్నపురము, వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండు సన్సువారి యొద్ద దొరకును.

(3) నీతిసింధువు—ఈయాఖ్యాయికను, బై శేషాద్రిశర్మగారే రచియించిరి. పై వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండు సన్సువారే ప్రకటించిరి. 167 పుటలు (క్రౌను) 12 తరంగములుగలది (నవల). "కాశీనగరమున ఘనుమద్ఘ

ట్టమున నివసించిన నామిత్రులు బ్రహ్మశ్రీ రాచకొండ అన్నయ్యశాస్త్రిగారు కొన్నియాఖ్యాయికలను వ్రాయ నన్నుఁ బ్రోత్సహించుటయే గాక వానికి వలయు సాధనముల వ్రాసియుఁ బంపిరి. అందొక్క కథ నాశ్రయించి దీనిని వ్రాసి నీతిసింధు వని నామకరణము చేసితిని. ఇందుఁ బ్రధానముగా స్వేచ్ఛాచారపరాయణులు తుదకు దుఃఖముల పాలగుదు రనియు శాస్త్రాచారముల నవలంబించి సత్యసంధులై తగువారు గౌరవము నొందుదు రనియు నీతిద్వయము పొడకట్టు." అని శర్మగారు తమ నవీనసమాలోచనములో లిఖించిరి. ఏవో కొన్ని పేరులు మార్పఁబడినవి, గాని కథ యంతయు జరిగినదేనఁట. నలువది యేండ్లకు నించుమించుగాఁ దగుకాలమునఁ గలకథయఁట- వెల రు 1-0-0.

(4) ఆంధ్ర వాఙ్మయసూచిక — (ముద్రితాముద్రిత గ్రంథములపట్టిక) ఆంధ్ర గ్రంథమాల- ౧౧-వ గ్రంథము. బ్ర॥ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ప్రకటించినది. ఆ 1927 సంవత్సరము చివరవఱకు ముద్రితములయిన ఆంధ్రగ్రంథములయు, ఆంధ్రసాహిత్య పరిషత్తు పుస్తకభాండాగారమున, తంజావూరు సరస్వతీ పుస్తకభాండాగారమున, చెన్నపుర ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునఁ గల యముద్రితాంధ్రగ్రంథముల యకారాదిసూచికయు నిందుఁ జేర్పఁబడినది. దీనికి నాగేశ్వరరావుపంతులుగారు వ్రాసిన బ్రహ్మాండమైన 108 పుటలపీఠిక యలంకారముగా నున్నది. ముద్రితగ్రంథములకును ముద్రితగ్రంథకర్తలకును అకారాది సూచిక గలదు. గ్రంథముల విషయవిభాగము చేయఁబడినది. ఈగ్రంథ మాంధ్రలోకమునకు నిధివంటిది. వెల 2-0-0 చెన్నపురి, ఆంధ్రపత్రికాకార్యాలయమున దొరకును.

(5) ధర్మపాలుఁడు — ద్వితీయభాగము, ఆంధ్రప్రచారిణీగ్రంథమాల ౬౧వ గ్రంథము. చరిత్రాత్మకమైననవల. రాఖాలదాసబంధోపాధ్యాయవిరచితమునకు వేమల సత్యనారాయణశాస్త్రిగారి యాంధ్రీకరణము. వెల ౧-౮-౦

(6) రహస్యశోధనము—(డిటెక్టివునవల) ఆంధ్రప్రచారిణీగ్రంథమాల ౬౨వ గ్రంథము. భూతగృహమును రచించిన గుంటి సుబ్రహ్మణ్యశర్మగారు, (కళ్యాణమర్గము) గ్రంథకర్త. వెల 1-8-0 ఇదియును పైగ్రంథమును పిఠాపురములో ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయములో దొరకును.

(7) ఆండాళ్ తిరుక్కళ్యాణము—శ్రీ వ్రతము- తిరుప్పారావు-, తులసీపూజ- విద్వాన్ నారాయణవనము కూరత్తాళ్వారయ్యంగారిచే విరచితము.

ఇది యొక సమరసగ్రంథము, నీతిదాయకము. ఇందుఁ బైకమత్యము, పాతివ్రత్యము, స్వాతంత్ర్యము, దేవభక్తి, చరిత్ర, భారతీయుని దేశసంబంధము, మొదలగు విషయముల కాటపట్టయి భక్తిరసంబును దెలుపుచున్నది- దీనియంతర్లక్ష్యము జనులలోఁ గలిపికోలుతనము, పనిచేయునివారిని బనికిఁబురికొల్పుట, ఐహికవిషయము, భాగవతసేవామూలకముగా భగవత్సేవ...ఇది యాబాలగోపాలము చదువఁ దగినది. ఆండాళ్ తిరుకల్యాణము వచనము, శ్రీవ్రతము, పద్యములు-తులసీపూజ కల్యాణిరాగముతోడి ద్విపద. వెల 0-4-0. కావలసినవారికి నారాయణావనము వకుళాభరణముగారియొద్ద- 22 పచ్చప్ప మొదలివీథి, కోమలేశ్వరముపేఁట చెన్నపురిలో దొరకును.

(8) గణోదయము—(హరివిలాసము) అను నీలాపనిందానివారణము. ఇది గోదావరిజిల్లాలోని కొమరిపురి (రామచంద్రపురము తాలూకాలోనిది) నివాసులు, "అభినవపోతరాజు బిరుదాంకితులు శ్రీమాన్ చిలకమర్తి నారాయణకవిగారిచే రచియింపఁబడినది. ఈకవి పందొమ్మిదవ శతాబ్దములో నున్నవాఁడు. ఈగణోదయమే కాక యీకవి భాగవతదశమస్కంధపూర్వభాగము (యక్షగానము) శ్రీవేణుగోపబాలశతకమును గూడ రచించెను. ఈయన సంచారకవి. అందందు వీరు వినిన క్రొత్తదేశీయపదముల నక్కడక్కడఁ దమకవిత్వములోఁ జేర్చిరి. మఱియు వీరు చాటుధార లనేకములు రచించిరి. తమపాలములో తృణరాజి యధికముగా నున్నదని యధికారులతోఁ జెప్పు సంబంధమున, తృణరాజిసీసమాలిక యనిచెప్పిరి. 20 చరణములలో "అమడ తుత్తురు బెండ యత్తపత్తి గునుకు గాడిదె గడపరి కాశివేప" ఇట్లు తృణరాజిపేరులతో నిండియున్నది. గణోదయము కవిత్వము ఆంధ్రగీర్వాణ పదములు సమానముగాఁ గలిగి యమకములతో నిండియున్నది. భాష చక్కగానున్నది. మూఁడాశ్వాసములు. సుమారు మున్నూఱుపద్యములు గలవు. మచ్చునకై కొన్ని పద్యములు :—

క. సందా వినఁగందాఁ గన, నందా నీమతికి నవ్వ నందా ధరకుం
గుందా పొందా నేయిది, కందా నిందాను నీలకందాఘుకచా.

శా. ఘంటాకాహళశంఖదుందుభిమృదంగధ్వానముల్ హెచ్చి మి
న్నంటం దత్పురి రాజమార్గమున నొయ్యారంబు దీపింప నా
వెంటవ్వచ్చెడి దంభవేషహరిఁ బ్రావీణ్యంబుతోఁ గాంచె ము
క్కంటిం గడ్పున నుంచు మేటి యున్నద్గాగం బుత్కటంబై తగన్.

ఉ. తప్పున నెప్పుడుప్పుతన తప్పుని యప్పరమేశు గొప్పగాఁ
జెప్పిన మెప్పుగాదు మఱి చెప్పని వొప్పది రప్పుపోదు నీ
వొప్పులకుప్పవౌచు నెద నొప్పక యాతనిఁ ద్రిప్పఁ దప్పఁగాఁ
గప్పవశంబె కప్పినను గప్పునె యిప్పుని దెప్ప నేటికిన్.

చ. తనతనయామణి క్మిణిని దానవవైరికి నాతఁ డీయ న
వ్వనరుహపత్రలోచనుఁ డవారితదోషముచేతఁ గ్రమ్మరన్
జనపతి కమ్మహేంద్రము నొసంగి సరోరుహనేత్రుఁ గైకొనెన్
ఘనుల విరోధ మెగ్గగుచుఁ గన్పడకుండఁగ రిత్తవోవునే.

(9) వేణుగోపబాలశతకము——ఇదియును బైనారాయణకవి రచించినది యే. వేణుగోపాలశతకము, రామలింగశతకములవంటిది. దీనికిఁ దూటిశతకము మడుగుశతకము ననుపేరులు గలవు. చాటుధారగాఁ జెప్పినాఁ డనుకొను తృణరాజ సీసమాలిక నీశతకములో ౬౮ పద్యములు క్రిందఁ జేర్పఁ బడినది. శతకమును రచించుటకుఁ గారణము లగు రెండుపద్యములు మచ్చుచూపుఁడు.

సీ. తొలుతఁ గాశ్యపుఁడేల తుల్యానదిని దెచ్చె నీయూరఁగాఁపురం బేలవచ్చె
నేట మాతాత యిల్లేల గల్గఁగ మెచ్చె దానికై యేల మాతండ్రి నచ్చె
స్థలదాత యేటిలో స్థల మేల మాకిచ్చె నింటి చెంగట మడుగేల హెచ్చె
నింటిస్థలంబేల యేటను బడఁజొచ్చె మేటినీరున నేల మెరక విచ్చె
నేమి యంటినో నీమన సేలవిచ్చె, నేటిలో నీరు మాయొడ్డు నేల ద్రచ్చెఁ
గాన నాయందు నీకేల కరుణవిచ్చెఁ, గొమరపురిపాల (శ్రీ) వేణుగోపబాల.

సీ. అతిభీతి మతికిఁ జేయఁ దొడంగెనీయేఱు మడుగుతో మఱిమఱి మాకుఁబోరు
మున్నీరు తెగఁబాఱు మొనసియుండులనీరు గగనమంటెనుదరంగములబారు
భూరిప్రవాహంబు లూరిలోనికిఁ జేరుఁ గనుఁగొనభయదమైకాంచుహోరు
తొల్లి యెందును లేదు తూటిలోఁ గలతీరు నిగిడి మమ్ములఁ జేరనీయదూరు
మీరు గనకున్న లేరు వేమారు నేరు, వారు వీరును రక్షింపఁబోరు రారు
వసుధ నెవ్వారుఁ గారు నీవంటివారు, కొమరపురిపాల (శ్రీ) వేణుగోపబాల.

ఈ రెండుపుస్తకములును గాకినాడవాస్తవ్యులు అమరవాది వేంకటాచార్యులుగా రొసంగినవి.

# కవిదర్పణచ్ఛందము.

(కీ. శే. పక్కి వేంకటనరసయ్యకవివిరచితము.)

-కుప్పిలి నరసింహము-

ఈకవితల్లజుఁడు క్రీ. శ. 1800 ప్రాంతమున విజయనగరమునకుఁ జేరువనున్న కోరాడగ్రామములో జన్మమునొందెను. ఇతఁడు శిష్టకరణసంజాతుఁడు; భారద్వాజసగోత్రుఁడు; నారాయణమంత్రిపుత్రుఁడు. కోరాడలోఁ బ్రాథమికవిద్య ముగిసినతోడనే విశాఖపట్టణములోని యల్లిపురముఁ జేరెను. అచట మహామహోపాధ్యాయ శ్రీపరవస్తు వేంకటరంగాచార్యులయ్యవారులుంగారి జనకులు, సర్వశబ్దసంబోధనీకర్తలునగు శ్రీమాన్ శ్రీనివాసాచార్యులయ్యవారులుంగారి నాశ్రయించి సంస్కృతాంధ్రములయం దత్యంతపాండిత్యము సంపాదించెను. మాతృభాష యగునోఢ్రభాషతోఁ గూడ బహుభాషల నభ్యసించినభాషాభిమాని. ఇతఁడు వైష్ణవమతాభిమాని; తనగ్రంథముల నన్నింటిని భద్రాద్రిరఘురాముని కంకిత మొసఁగెను. ఈతనికవిత్వము సలక్షణమై, మృదుమధురమై, మనోహరముగ నుండును. ఇక్కవిరచియించినకృతులు:-1. శకుంతలాపరిణయము, 2. అమరపదకల్పద్రుమము, 3. నారాయణస్తవము, 4. మదనసాయకాపరిణయము, 5. నారాయణశతకము, 6. కుమారీశతకము- ఈవిద్వత్కవిగ్రంథముల నన్నిఁటిని నాంధ్రు లెఱుఁగకపోయినను కుమారీశతకమును మాత్ర మెఱుఁగని వా రుండరు. కవిదర్పణచ్ఛందమునఁ గవి తనసూక్ష్మబుద్ధిఁ జూపించెను. ఇయ్యది ప్రాథమికవిద్యార్థుల కనువుపడనిదైనను పండితులకుఁ బ్రౌఢిఁ జూపకమానదు. విశాఖపట్టణక్రైస్తవోన్నతపాఠశాలప్రధానాంధ్రోపాధ్యాయుఁడై యుండి తనగ్రంథముల నాంధ్రసారస్వతమున కర్పించి క్రీ. శ. 1860 ప్రాంతమున వేంకటనరసకవి కీర్తిశేషుఁడయ్యెను.

క్రీ. శ. 1836 న మనకవిరచియించిన శాకుంతలాపరిణయాద్యనేకగ్రంథముల నిటీవల వారికుమారుఁడు, కీర్తిశేషుఁడు నగు పక్కి సూర్యనారాయణగారచ్చొత్తించిరి. ఈసూర్యనారాయణగారాంగ్లమునఁ బ్రవేశపరీక్షఁ దేలి గీర్వాణాంధ్రములఁ గూడ నభ్యసించిరి. వీరికిఁ బుత్రసంతతి లేదు. సూర్యనారాయణగారిభార్యయుఁ బుత్రికయు మాత్ర మిప్పటివఱకు నల్లిపురమున సజీవులై యున్నారు.

# కవిదర్పణచ్ఛందము.

క. వనచరవనచరవిప్రా
వనిపద్వయబుద్ధకలికివరపురహరవా
గినమోమామావాగవికవి
శనిఫణియుగగురుబుధకుజచంద్రులఁ దలఁతుక్. ౧

గీ. అనుచు దేవతారాధన మాచరించి
సారమతిఁ బక్కి వేంకటనారసింహ
నామధేయుండఁ గవిదర్పణం బనంగ
ఛంద మొనరింతు సంక్షేపసరణిఁ దెలియ. ౨

ఆ. పొల్లు సున్న దీర్ఘములు గల్గువర్ణముల్
గురువు లంత్రు లఘు లగును గడమవి
గురువు గయనఁగా లఘువు లయనందగు
వగణహగణము లగు లఘుగలములు. 3

గీ. ఆదిమధ్యాంతముల లఘుల్ యరతలగును
గురులు భ-జ-సలకునుమనల్ గురులఘువులు
భ-ర-త-నల-నగ-సలలింద్రులరయ న-హాలు
రవులు పదునాల్గురిందు వేర్పఱుపనేల. ౪

గీ. ఇంద్రులాఱుగు రినులిద్దఱెసఁగుసీస
మునఁ బొకం డిద్దఱింద్రు లింకిద్దఱినులు
తేఁటగీతికి నత్రయద్విసురనాథు
లేగు రినులాఁటవెలఁది వల్లిరుతిగలను. ౫

గీ. గగభజసనలముల త్రిశరగణములుగ
నారిటను నలజములొందు నంత్యగురువు
నసమజగణంబులేదు ప్రాసాన్వితంబు
కందము పరచతుర్థాదిఁ గదియు విరతి. ౬

గీ. భరనభారలగంబు లుత్పలము, నజభ
జాజరలుచంపకము, మసజసతతగలు,
సభరనమయవల్ శామలబ్జజదశమిహి
రత్రయోదశయతులు సప్రాసకములు. ౭

సీ. తలకట్టు దీర్ఘమై త్వౌత్వంబు లొక్కటి గుడి ఋత్వ మేత్వంబు నడరునొకట
గొమ్ము నోత్వంబుఁ జేకూడునొక్కటిగాఁగ యతులకుస్వరబంధమమరునిట్లు
ద్విత్వంబు లుండిన విడరాదు ప్రాసకు లడలు లళల్ ప్రాసలను సమంబు
యతులలోపలనయహాలునణల్ ళడలైక్యములుదోదనాహ్వానములును గాన
సంశయంబులు ఫుతములు సమను సుప్ర
తిప్రనిర్దురధిన్యుపాతివ్యపాభ్యు
దాజవాపిపరాపరు లరయఁ గచట
తపలు నుపసర్గవర్గముల్ తత్క్రమమున. ౮

సీ. అచ్చుచ్చుతో స్వరయతి యనునాసికల్ గాకవర్గములు వర్గయతిప్రాగ
నుస్వారవర్గబిందుయతి యంతముతోడ పుఫుబుభులుమువర్ణమునకుఁబోల్చె
యతిదీర్ఘమైన కృష్ణాప్లుతం బచ్చుతోఁ ప్రాదికీడుపసర్గలందు రెండు
ద్విత్వంబు లసమానవృత్తి సంయుక్తంబు చఛజఝశషసలు సరసయతులు
మిగులుతెక్కటు లొక్కటై మెఱయుచుండుఁ
బ్రాసయతియగుఁ జెలువారుప్రాసమున్న
నిమెలు ఋవడియటందురు ఋత్వమునకు
పవలు లడలు రలలభేదఫణితిఁదనరు. ౯

గీ. పదకవిత్వంబునకుఁ దాళఫణితి యతులు
ప్రాసములుగాని గణము నిర్ణయము లేదు
కడమ వృత్తాదు లాయాయిగతులఁబట్టి
తేఁటగా లక్షణంబులఁ దెలియవచ్చు. ౧౦

# కీర్తిశేషులు రాయిసాహేబు గుమ్మడూరి వేంకట రంగారావుపంతులుగారు, ఎం. ఏ.

రాయిసాహేబు గుమ్మడూరి వేంకటరంగారావుపంతులుగారు తిరువలిక్కేణిలో మే నెల ది 20 తేదీని వైకుంఠపదప్రాప్తి నొందిరని వినుటకు మిగుల దుఃఖించుచున్నారము. వీరు ఆంధ్రసాహిత్యపరిషత్తు చెన్నపురిలోనున్నపుడు 1917 సంవత్సరము మొదలు పరిషత్తు కాకినాడకు మార్పఁబడు వఱకుఁ సుమారు పదిసంవత్సరములు దానికిఁ గార్యదర్శులుగా నుండిరి. పరిషత్తుపై వీరికిఁ జాలఁ బ్రీతి. కావుననే యొక్కనాఁడు కీ॥ శే॥ శ్రీశ్రీ బొబ్బిలి మహారాజావారిని దీసికొనివచ్చి పరిషత్కార్యస్థానము, నడిచేయు పనులు చూపి చెప్పిరి. తరువాత వారు పదివేలరూపాయలు దయచేసిరి. వీ రాంగ్లభాషనువలెనే యాంధ్రభాషను గూడ సమానగౌరవముతోఁ బాటించి యనవరతమును రెండు గ్రంథములను జదువుచుండువారు. ఆంధ్రభాషయందు చక్కని పాండిత్యముగలవారు. కావుననే చిరకాలము మద్రాసు విశ్వవిద్యాలయములో కళాశాలతరగతుల కాంధ్ర పాఠ్యపుస్తకనిర్ణాయకసభకుఁ గార్యదర్శిగానుండిరి. ఆపరిచయముననే మైసూరు విశ్వవిద్యాలయమునను బెనారస్ హిందూ విశ్వవిద్యాలయముననుగూడ వీరాంధ్రగ్రంథనిర్ణయసభలయందు సభ్యులై యాయాతరగతులకుఁ బుస్తకముల నిర్ణయించుచుఁ బరీక్షాపత్రములనంపుచు నుండువారు. వీరాశ్రితవత్సలులు. ఆశ్రయించినవారి కన్నివిధములఁదగుసహాయము చేయువారు. చెన్నపురిలో వీరెఱుంగని పెద్దయుద్యోగులు గృహస్థులును లేరని చెప్పవచ్చును. ఇతరుల కెవ్వరికో నేమి కార్య మున్నను దాము వారియొద్దఁ జెప్పి కార్యసానుకూలముం జేయించువారు. తిరువలిక్కేణి హిందూహైస్కూలునకుఁ గార్యదర్శులుగానుండిరి. విద్యావిషయమున విద్యార్థులకు వీరుచేయుచుండిన సహాయ మత్యధికము. పండితపక్షపాతి. చెన్నపురిభూస్వాముల సంఘమునకుఁ గార్యదర్శిగానుండిరి. కావుననే సమస్త భూపాలురును వీరికిఁ బరిచయులైయుండిరి. జీవదయాపరులు. వీరి యింట రమారమి 10-12 గోవులుండెడివి. లేచినదిమొదలు పరుండువఱకు వారికి గోసేవ ముఖ్యకృత్యము. ఒక్కదానిని విక్రయించువారుకారు. కొనినవాఁడు దానిని బాధించుననియుఁ దిన్నగా మే

పఁడనియు వారిభయము. జీవదయగలవారుకావుననే మద్రాసులో జంతుహింసానివారక సంఘపక్షమున వెలువడుచుండు నొక పత్రికలోని యాంధ్రభాగమునకు వీరు ప్రకాశకులుగానుండి తాము వ్యాసములు వ్రాయువారు. బంధుప్రియులు. స్నేహపాత్రులు అగుటచేతనే వీరి యరుగులమీఁదికి నిత్యమును, స్వతంత్రులు, నధికోన్నతోద్యోగులు ధనికులునగు వారెందఱో వచ్చివృత్తాంతపత్రికలను జదువుచు వారితోఁ గలసి యానందించి పోవుచుండువారు. వీరికొక్కతమ్ముఁడును, చెల్లెలును గలరు. మేనల్లుండ్రున్నారు. చాలకాలము క్రిందటనే కళత్రవిహీనమైనది. సంతానములేదు. వీరైనను 50 సంవత్సరములు దాటినవారుగాని వృద్ధులుగారు. వీరి యకాలమరణ మన్నితరగతులవారికిని శోకదాయకమైన దని చెప్పుటకంటె నిపుడు విశేషించి వ్రాయఁజాలము. వీరిబంధువుల కాశ్వాసమును, వీరియాత్మకు శాంతియు శ్రియఃపతి దయచేయుఁగాక.

ఓమ్.

శుభమస్తు.

# నలకీర్తికౌముదీ.

---

## ద్వితీయః సర్గః

శ్లో. అథాప్తదూత్యో నిషధాధినాథః పురం విదర్భాధిపతేః ప్రపేదే
ముక్తాఫలస్రజ్మశిచిత్రరథ్యాం శశీ సనక్షత్రగణా మివ ద్యామ్. ౧
ప్రతప్తకార్తస్వరవేశ్మజాలాం మహేన్ద్రనీలోపలహర్మ్యమాలామ్
చంద్రాశ్మసౌధాంతరలోలడోలాం విశాలచామీకరచన్ద్రశాలామ్. ౨
సువర్ణహర్మ్యాగ్రచరోడుచక్రాం అర్కేన్దుమార్గాయితజాలరంధ్రామ్
విచిత్రరత్నాఞ్చితశక్రచాప నీకాశచామీకరతోరణాన్తామ్. ౩
విచిత్రరత్నాభరణేన్దుకాన్త ముఖంచ కాఞ్చీకమనీయశోభామ్
లసత్పతాకామలకాభిరామాం రామా మి వాశేషమనోభిరామామ్. ౪
తత్రేన్దుకాన్తోపలబద్ధకుడ్య మేకత్ర నీలాశ్మనిబద్ధభిత్తి
అన్యత్ర తేజస్తిమిరాయమానం మహేన్ద్రచాపద్యుతితోరణాఙ్గమ్. ౫
చన్ద్రాశ్మనీలోపలశాతకుమ్భ స్తమ్భోల్లసత్కృత్రిమపుత్రికాభిః
సభాసమాసం ధృతదీపికాభ రైచ్ఛిష్ట సాన్తఃపురవేశ్మ రాజ్ఞః. ౬
రాజోర్ధ్వరాకేన్దుసమప్రకాశో మధ్యేసభం మధ్యగతాం సఖీనామ్
తత్రోడుమధ్యోజ్జ్వలభామధ్యు దదర్శ భైమీ మివరోహిణీం సః. ౭
కచాతిబృన్దోల్లసదాస్యపద్మా మిన్దీవరాభాక్షియుగోడుదన్తామ్
నాభ్యాలవాలోద్భవరోమరాజి లతాగ్రసౌవర్ణ్యఫలస్తనీం తామ్. ౮
బాలా మబాలేన్దుముఖీం తదర్ధఫాలాం తదన్తస్థలలాటికాన్తామ్
కామస్య సాక్షా దివ రాజ్యలక్ష్మీం లక్ష్మీం నృపాబ్ధిప్రభవా మి వాన్యామ్. ౯
విధుం విధాతా విదధే కి మాస్య మస్యా స్సముద్ధృత్తిత ముజ్జ్వలాభమ్
అహ్లాదకత్వం మనస స్త్రిలోకీ లోకస్య యాయాత్ర్తథమన్యథేదమ్. ౧౦
ప్రతిశ్రుతార్థాకరణే మహాఘ మాలోచ్య భైమీ మభికోపి పశ్చాత్
అన్తర్హితో సా వశరీరి ణీవ తా మి త్యవోచ ద్ధిమశైలధైర్యః. ౧౧

సురేశకీనాశ హుతాశపాశినామామృతాశా అపి ముక్తదారాః
అత్యప్సర స్త్వా మభికా ధరిత్రీం ప్రాప్తా వదామః కిము తేద్య భాగ్యమ్.
ఏతే మహాన్త స్సురలోకనాథాః అద్యాశు నాథీభవితుం తవోత్కాః
త త్త్రైక మిష్టం త్వ మభీష్టలక్ష్మ్యా వృణీష్వ దేవోత్తమ మాప్తలాభే. ౧౩

ఇన్ద్రం వృణీషే యది లోకనాథ మేష్య త్యుపేన్ద్ర స్తవ దేవరత్వమ్
గుణౌఘరత్నాఢ్యనృపాబ్ధిపుత్ర్యా, పుత్రీ పయోధే రపి యాతృభావమ్.
సర్వాన్తరస్థం యది కాంక్షసేగ్నిం పుత్రః కుమార స్సురసైన్యపాలః
భవిష్యసి త్వం సదృశీచ తాభ్యాం స్వాహాస్వధాభ్యా మతిదివ్యకాన్తే.
దేవం వృణీషే యది ధర్మరాజం భవిష్యత స్తే శ్వశురౌ దివాకృత్
సంజ్ఞాచ దేవీ భవతా సురాణాం మత్తేభకుమ్భ స్తని దేవరా చ. ౧౬
అపాంపతిం కామయసే యది త్వ మబ్జాక్షి చన్ద్రాశ్మవినిర్మితేషు
సౌధేషు నీలోపలకుట్టిమేషు విహార మేష్య స్యుడుపుష్పవత్సు. ౧౭
మృదూద్గళద్వారిజశీతవాతపీతేష్టసంభోగపరిశ్రమేషు
కల్పద్రుమాలాకలితేషు తేన సమం చ దేవోపవనేషు నిత్యమ్. ౧౮
యః కశ్చి దేతేషు వృత స్త్వయా చేన్మహేన్ద్రముఖ్యే ష్వమరేషు భైమి
పాతాళభూస్వర్గనివాసినీభ్య స్త్వ ముత్తమా భామిని సున్దరీభ్యః. ౧౯

స్వస్సున్దరీయావనభుక్ప్రకామ్యలావణ్యత స్త్వత్యమరీపురాభూః
స్వప్రాప్త్యురుప్రేమసురప్రభావా దాయుష్యతో ప్యత్యమరీ భవా ద్య. ౨౦
నిశమ్య వాచం తదుదీరితాం సా స్ఫుటాక్షరాం సుస్థిరచిత్తవృత్తిః
అదృశ్యమానం మనసా విచిన్త్య కించి ద్బుభుత్సు స్తమువాచ భైమీ. ౨౧
కం కామయే హం కమనీయరూప వక్ష్యామి తం తే శశిశుభ్రకీర్తిమ్
కో వా భవా న్మే వద వాక్పటుత్వే వాచస్పతి ర్వాథ పతంజలి ర్వా. ౨౨
తథేతి పృష్టోపి పునఃపున స్స తానేవ దేవాన్ ప్రశశంస రాజా
కరోషి మచ్ఛ్రుత్యతిథిం స్వవృత్తం న త్వం పున స్సేతి జగాద భూయః.
ప్రశ్నా కృతా త్వద్విషయా మయైషా ప్రత్యుత్తరం తే మరగోచరంయత్
పృచ్ఛా మ్యహం త్వాం నవిరుద్ధవాదం వదామ్యుద న్తంశ్రుణుభో మదీయమ్
సదావిశుద్ధం చ కళాభిరామం సత్సఙ్గలాభా దతిశోభమానమ్
రాజాన మాప్తుం విబుధం మదీయం చేతో భృశం కామయతేహి నాన్యమ్,

తాం శ్లిష్టవాచం స జగాద భూయః పాణిగ్రహా స్తే శశినో హ్యలభ్యః
నరస్య బాలే మరకామితాయాః నాగః కురాజస్య మితాయుషస్స్యాత్.
మనోనలం కామయతే మదీయ మితి బ్రువన్తీం స జగాద రాజా
గృహ్ణాసి పాణిం యది పావకస్య మనోరథో మే ఫలితోద్య జాతః. ౨౮
వదన్త మేవం పునరాహ భైమీ మహేన్ద్రముఖ్యా మహితప్రభావాః
నమోస్తు తేభ్యో ఖలు వందితేభ్యో మత్ప్రాణనాథస్తు స వైరసేనిః. ౨౯
నిశమ్య తత్త ద్గదితం యువాయం హృష్టాన్తరఙ్గోపి విశుద్ధబుద్ధిః
విచిన్త్య కించి న్మనసా బభాషే భూయోపి భూమీంద్రసుతాం స రాజా.
నలో మితాయు ర్మితసమ్ప దేకలోకేశ్వర స్తే మృతపా హ్యమర్త్యాః
అక్షయ్యసంపద్బహులోకనాథా శ్చిన్త్యం త్వయై వాత్రహి తారతమ్యమ్.
నలోపి నాలం నలినాక్షి ... దేవేషు వైరం విరచయ్య యాతుమ్
సౌఖ్యం వదస్వ త్వ మరాళకేశి సుఖీ కుత స్స్యా ద్బలవద్విరోధీ. 3౦
శాపం ప్రదాతుం చ విధాతు మేనం రాజ్యచ్యుతం భ్రష్టసమస్తకృత్యమ్
అలం భవేయుః కుపితా నలం తే తేషా మశక్యం వద కిం త్రిలోక్యామ్.
బ్రువన్త మేవం సభయాహ భైమీ భూయోపి రత్నస్య చ కాఞ్చనస్య
శోభా వహా స్స్యాన్భువి కాచమణ్యో ర్యోగస్తు శోభాం వదకిం తనోతి.
పులోమపుత్రీ మనుమాయ శక్రో న మానుషీం ప్రార్థయితుం కిలార్హః
ఆఘ్రాయ జాతీకుసుమం షడంఘ్రి రపేక్షతే కిం ను వదస్వ తుమ్బీమ్.
ప్రతీక్షమాణాసు సదాప్సరస్సు వ మానుషీం యాచితు మర్హ తీన్ద్రః
మరన్దపూర్ణే ష్వరవిన్దబృన్దే ష్విన్దిన్దిరో వాఞ్ఛతి కిం వ దార్కన్. 3౧
గృహ్ణాతి పాణిం స నలో నచే న్మే పూరేచ వారాం జ్వలితేనలే వా
త్యక్ష్యామి పీత్వాపి విషం శరీరం స్పృశామి నాన్యం కృతసంవి దేషా.
శ్రుత్వేతి వాచం తదుదీరితాం స సురేశ్వరాణా ముపసృత్య పార్శ్వమ్
చకార తచ్ఛ్రుత్యతిథిం నలో థ యాథాతథం స్వశ్రుతభైమ్యుదన్తమ్.
సురాః పురైవ శ్రుతభైమ్యుదన్తా దూతీముఖా త్తేథ నలాదపీమం
శ్రుత్వా మతిం చక్రు రవాప్త జాలా స్తద్వఞ్చనార్థం కపటం విధాతుమ్.
అథా ప్యనుజ్ఞాప్య సురేశ్వరేణ నలాయ దేవాస్త్వనలప్రధానాః
బభూవు రన్యోన్యకృతాత్తసంజ్ఞాః నలీకృతాః స్వాకృతిభిః ప్రభావాత్. 3౨

దేవర్షిసంశ్రావితభీమపుత్రీస్వయంవరాఖ్యాక్షణవీక్షణోత్కాః
విచిత్రరత్నాభరణోజ్జ్వలాఙ్గా స్తత స్సువస్త్రాదృతదివ్యరూపాః. ౪౦
భోగస్థమణ్యుజ్జ్వలమౌళిరత్నా భోగీశ్వరా వాసుకితక్షకాద్యాః
భోగై శ్శుభై ర్భోగవతీ సపత్నీం ప్రాపుః పురీం భీమమహీమఘోనః. ౪౧
ద్వీపాధినాథా బహవోథభీమపురీ మనేకద్వీపయూథరథ్యామ్
అసంఖ్యసాఙ్గధ్వజినీసమేతా స్సంస్తూయమానా బహు వన్దిబృన్దైః. ౪౨
నరేన్ద్రపుత్రా నళినాభవక్త్రా స్సర్వే యువాన శ్శతపత్రనేత్రాః
నిజాఙ్గతర్జితపుష్పచాపాః పురీ మవాపు శ్శతశ స్సువంశ్యాః. ౪౩
సంహూయ సర్వేపి తథా త్రిలోకీలోకేశ్వరా స్తత్ర సమగ్రసైన్యాః
ఆస న్వతేయు ర్న యథా ధరిత్ర్యాం తిలావకీర్ణా జనతోపరి ద్రాక్. ౪౪
సమేయుషః స్వాం నగరీం సమస్తా న్నరేన్ద్రపుత్రా నభిగమ్య భీమః
సంపూజ్య రాజా శిబిరేషు పశ్చాత్ స్వస్తోపచారేషు నివేశ్య తుష్టః. ౪౫
సభాం మహిస్తమ్భసహస్రజుష్టాం రాజా ససభ్యై రనుగమ్యమానః
విచిత్రరత్నస్థగితాన్తరాళసౌవర్ణవేదీం తత అవివేశ. ౪౬
స్వర్ణస్థలీసాంధ్యపయోదరమ్యే నవాధికాభోజ్జ్వలరత్నతారే
ప్రధానవర్గగ్రహమణ్డలే సో రాజా సభావిష్ణుపదే రరాజ. ౪౭
రాజా సభామధ్యగత స్తతోహం కులాని శీలాని వదే దమీషాం
సమాగతానాం చరితాని చేహ కో ద్యేతి చిన్తాకులవృత్తి... ౪౮
సత్రా విధాత్రాచ్యుతముఖ్యదేవా స్సమేయుషః కుణ్డిన మేకదైవ
నాథాం స్త్రిలోక్యా శ్శతశో విలోక్య వాగ్దేవతా మిత్యవదం స్తదానీమ్. ౪౯
వార్తా మిమాం వాణి శృణుష్వ భామా భీమాత్మజా భూ దగరాజకన్యా
హరో నలః పాపహరాభిధానో లోకేశ్వరో భూతికృతాఙ్గరాగః. ౫౦
స్వయంవరార్థం విహితోద్యమేన పిత్రా తదీయేన జగత్యధీశాః
ప్రాప్తాః కృతాహూతయ ఇంద్రముఖ్యా స్సురా నరేంద్రాశ్చ పురీం ఫణీంద్రాః.
యా హ్యద్య దేవి త్వ మితో ధరిత్రీం కులాని శీలా న్యభిధాతు మేషామ్
రాజ్ఞాం చరిత్రాణి చ రాజపుత్ర్యై స్వశ్రేయసే స్యాక్షే మహత్ప్రశంసా. ౫౨
సంవర్ణ్య రాజ్ఞ స్సముపాగతాం స్తా న్నలేన భైమీం సహ సంఘటయ్య
నిర్వర్త్య కళ్యాణమహం మహోత్సం స్వభర్తృపార్శ్వం పునరా శ్వుపైహి.

తతః కణాదాక్షపదప్రణీతవిద్యారదాళిద్వయదీపితాశా
శ్రుతిస్మృతిస్వస్వనిజాక్షియుక్తా మునీరితవ్యాకరణస్ఫురద్వాక్. ౧౪
సఙ్గీతసాహిత్యలసత్కుచోచ్చా త్రయీమయోన్నేయవళిత్రయాన్తా
సాంఖ్యోరుయుగ్మాద్వయవాదపాదా మధ్యేసభం సా పతతార బాలా. ౧౫
స్వకాన్తిపూరప్రసరప్రకాశదిక్చక్రవాళాం ధృతసున్నవేత్రామ్
సభాన్తరజ్యోతిస్మితమన్దహాసాం స్వర్ణప్రవాళాయుతకణ్ఠనాళామ్. ౧౬
గృహీతసౌవర్ణవిచిత్రరత్నప్రభాపరిద్యోతితపాదుకాన్తామ్
వివిస్మయే వీక్ష్య విభు స్సభాన్తస్సంసూతస్వల్పలతాయమానామ్. ౧౭
స్థిత్వా ముహూర్తం తదవస్థయాసౌ పురస్స్ఫురన్మూర్తి మముం విలోక్య
త్వ మాగతా సీహ కుతో ద్య మాతః పవిత్రితం మద్గృహ మి త్యువాచ.
స్వర్గాఙ్గనాఙ్గ మపహాతు మశక్య మీశం
ముక్త్వా కథంచన శివాసి కి మాగతేహ
పత్యుర్ముఖాబ్జగణసంచరణచ్ఛలేన
త్వం నిర్గతా భువ మితో ద్య సరస్వతీ (వా.) ౧౯
త్వ మబ్ధిజా వా ప్రవిహాయ విష్ణుం ప్రాప్తాసి భూలోకవిలోకనోత్కా
ఉతాగతా కిం ను మదీయభాగ్యలక్ష్మీర్మనః పూరయితుం మమ త్వమ్. ౨౦
సా శారదా శారదచంద్రచంద్రికా స్మితాఙ్కురాభా విశదాం విభోస్సభామ్
ప్రకుర్వతీ భూపతి మి త్యువాచ స్తువన్త మి త్యాత్మనివిష్టలోచనమ్. ౨౧
రాజన్ పద్మభవాదిసర్వవిబుధై స్సంప్రార్థితా ప్రేషితా
నామ్నాహం చతురాస్యహంసవరటీ దేవాఙ్గనాస్వాగతా
భూత్వా త్వద్దుహితు స్సఖీచ వరణే రాజ్ఞాం సురాణా మహం
వంశాని ప్రథితాని శీలచరితా న్యావర్ణయామి స్ఫుటమ్. ౨౨
మూర్తా థ సా తద్గృహదేవ తేవ వాణ్యేవ మాఖ్యాయ కరే గృహీత్వా
భైమీం నిశాన్తాన్తర మావివేశ వధూషు వధ్వోహి వసన్తి లోకే. ౨౩
భైమీం తతో జీవసువ శ్చిరన్త్య స్సౌవర్ణవేద్యంతరరత్నపీఠే
నివేశ్య తాం చమ్పకతైలపాత్రం పురో నిధాయాశిష మేవ మూచుః ౨౪
అనేకరత్నాకరమేఖలా త్వం తం సప్తరత్నాకరమేఖలాయాః
పతిం పతిం ప్రాప్నుహి పార్వతీవ శివం శివం స్యాదుదుపార్ధశాలే. ౨౫

వళక్షసిద్ధార్థకమిశ్రదూర్వాయవాఙ్కురైస్సాన్ద్ర మమూ శ్చిరంట్యః
నిచిక్షిపు స్తైల ముపాత్తబాణకౌక్షేయకాయాః శిరసి ప్రహృష్టాః. ౬౬
లోధ్రపిష్టపరిమార్జితతైలా మఙ్గరాగపరిలిప్తనిజాఙ్గామ్
...వినిన్యు రథ మజ్జనగేహం యోషిత స్సువదనా స్సహతూర్యమ్.
తాం రత్నపీఠే వినివేశ్య తత్ర భైమీం చలత్కుణ్డలమణ్డితాస్యాః
నార్యః కరావర్జితశాతకుమ్భకుమ్భస్థతోయైః స్నపయాంబభూవుః. ౬౭
సఖ్య స్తతః క్షౌమనివాసినీం తాం సౌవర్ణపీఠే వినివేశ్య భైమీమ్
విభూషణై స్థాపితరత్నదీప్తైః విభూషయాంచక్రు రలం ప్రగల్భాః. ౬౮
సఖ్యా కయాచి త్ప్రథమం ప్రయత్నా న్మృగాఙ్కకల్పే మృగనాభిక్లృప్తః
భ్రూదమ్భకామప్రణతా న్తరస్థశిలీముఖోభూ త్తిలక స్తదాస్యే. ౭౦
స్వకాయకణ్డూత్యపనోదనాయ ప్రాప్తస్ఫురత్కణ్టకకేతకాళిః
భోగస్థరత్నాయితపుష్పమాలా విభాతి వేణీ భుజగీవ భైమ్యాః. ౭౧
నాసావిభూషార్పితవజ్రహీర బాలేన్దువన్నూన్నతికరక్తశుభ్రా
వళిత్రయా దఙ్గుళినోదనోత్థా త్తాన ముష్టిమధ్యేతి బభూవ బుద్ధా. ౭౨
తత్పాదా మణికుట్టిమాటనపరిశ్రాన్తా వమన్తా నవం
రక్తం యావకదమ్భతో మణిలసన్మఞ్జీరనాదచ్ఛలాత్
క్రోశన్తా చ విలోక్య భిన్నహృదయా ధాత్రీ నఖాంశూత్కర
శ్రీగన్ధద్రుమపల్లవా నభినవా నగ్రే స్తృణాతీవ హి. ౭౩
భృఙ్గానవాప్తిప్రతిపన్నఖేదా కృత్వావనే గన్ధఫలీ తపోలమ్
తన్నాసికాభూ దనుభూతగన్ధా స్వపార్శ్వనేత్రీకృతభృఙ్గసేవ్యా. ౭౪
స్నాతా ఘటాభ పరిముక్తపయోభి రాప్త
కౌశేయకాశకుసుమా లసదాస్యపద్మా
ఆముక్తమౌక్తిక విభూషణసస్యపూర్ణా
భాతీవ భీమతనయా శరదుర్వ రేయమ్. ౭౫
అలంకృతా స్వర్ణవిభూషణై రలం రతోజ్జ్వలద్భిః నిజగాత్రశోభితైః
విష్ణో ర్జగన్మోహనవేషధారిణో మూర్తి ర్ద్వితీ యేవ రరాజ భీమజా. ౭౬
వక్త్రే జీవసువః ప్రఫుల్లనయనా వృద్ధా శ్చిరంట్య శ్శుభాః
భైమీం పాణియుగేన వన్దితపదాం మన్దాక్షనమ్రాననామ్

ఉత్థాప్య ప్రమదప్రపూర్ణమనసో మూర్ధన్యుపాఘ్రాయ తాం
కల్యాణాం సముపైహి సాంప్రత మితి ప్రోచు శ్శుభాస్స్వాశిషః. ౨౭

తథాఘాసురేభ్యో బహుభ్యశ్చ భైమీసురేభ్యోమహాద్భ్యస్సమస్తృత్యవీక్ష్య
సకాశే లసత్తారకానీకాశకాన్తిం ఘనానీలవేణీం నవన్దేథ వాణీమ్. ౨౮

సా మన్దస్మితతర్జితాతివిశదజ్యోత్స్నాస్ఫురచ్ఛారదా
భైమీం శారదపుణ్డరీకవదనాం విస్రోఘవాక్సారదామ్
తా మూచే శిరసాభివాదనపదాం మన్దస్మితాం శారదా
బాలే త్వా మభియాతు సర్వజగతీసామ్రాజ్యలక్ష్మీః స్వయమ్. ౨౯

ఇతి శ్రీనలకీర్తికౌముద్యాఖ్యే లక్ష్మీపదలాఞ్ఛనే అగస్త్యకృతౌ మహా
ౕవ్యే ద్వితీయః సర్గః.

---

చతుష్థః సర్గః

తతః ప్రయాతే ష్వఖిలేషు తేషు సురేషు భూపేషుచ పన్నగేషు
నలో ప్యువాస శ్వశురాలయే సో మాసం నవోఢాం స్వవశం నినీషుః. ౧
తత శ్శుభంయూ దివసే సదారః ప్రస్థాపితో సౌ శ్వశురేణ రాజా
పద్యా త్రిరాత్రం వసతౌ సహైవ క్రమేణ కళ్యాణపురీ మగా త్స్వామ్.
అధీతవేదా నలరాజధాన్యాం ద్విజా ఉతన్యానుజలబ్ధవర్ణాః
స్వస్థా మహీస్థా అపి భాన్తి కల్పద్రుమాయమానాస్స్వవనీపకానామ్. ౩
యాః క్షత్రియై రుత్తమవంశజాతైః పూర్ణా పరప్రాణ రిరక్షుభిః పూః
ప్రాణా న్విముచ్యాపి నిజా న్మహద్భి ర్భీతిం ప్రపన్నై ష్వభయప్రదై శ్చ. ౪
వైశ్యా విపణ్యార్పితచిత్రరత్నప్రభాసముద్ద్యోతితభానుభాసః
సహస్రభానుం బహుచిత్రభానుం కుర్వన్తి పుర్యాం నిషధేశ్వరస్య. ౫
కళ్యాణపుర్యుత్తమధర్మముఖ్యత్రివర్గశుశ్రూషణతత్పరై ర్వా
పూర్ణా కులాచారరతై ర్మహద్భిః శ్రియా సదాభూద్వృషలైర్వృషాప్తైః.
యత్ర ధ్వజానాం పటమారుతేన శీతేన సౌధాగ్రసముచ్ఛ్రితానామ్
అధ్వశ్రమా హేళిహయా వినేతుం శ్రాంతాః క్షణం తత్ర హి విశ్రమన్తి.
ప్రాప్య క్షణం స్ఫాటికహర్మ్యమాలాం భూత్వేన్దుగౌరా హరిదశ్వవాహాః
నీలోపలాసఙ్ఘటసౌధభాజః ప్రాపుః పున ర్యత్ర నిజాఙ్గకాన్తిమ్. ౮

నీలాశ్మసోపానితదీర్ఘికాసు కహ్లారనీలోత్పలవారిజానామ్
సావర్ణ్యభాజాం మకరన్దగన్ధ మాఘ్రాయ జానన్తి హి యత్ర భృఙ్గాః. ౯
సౌధాగ్రసంస్థాః శశభృన్మణీనాం విధుం స్వవక్త్రేన్దుసమం విధాతుమ్
యత్రాఙ్గనాస్తత్పరభాగతోత్థా కుర్వన్తి కస్తూరికయా కళఙ్కమ్. ౧౦
యత్సౌధవాతాయనరన్ధ్రమార్గా ద్గచ్ఛన్ శశీ నిత్యమభూత్కళఙ్కీ
తత్రత్యదీపాగ్రమషీవినీలమధ్యో నపఙ్కా న్న శశా న్న చైణాత్. ౧౧
ఆశాన్తభాక్స్ఫాటికసౌధశుభ్రభాసో మహాత్యాః కపటా న్నలస్య
పురీ సురాణాం నగరీం గరీయ స్యలం హసన్తీవ విభాతి యోర్వ్యామ్. ౧౨
వస్వోకసారాభ్యధికా శ్రియా యా సురేష్టదై ర్భూమిసురై రుపేతా
చలత్పతాకాపటపాణినా ద్యాం కళ్యాణపు ర్యాహ్వయతే స్మ యోద్ధుమ్.
ఖేయస్థపాథఃప్రతిబిమ్బితోడుగణోచ్ఛకారస్వరసారసాలా
యా పూర్ణల స్యోజ్జ్వలహైమహర్మ్యా రసాతలేలాద్యుగతీవ రేజే. ౧౪
సైన్యైః స్వకీయైః శ్వశురార్పితై శ్చ పదాతివాజీభశతాఙ్గపూర్ణైః
అతీతసంఖ్యై రభినన్ద్యమానో నలో విశత్తాం నగరీం నృపైశ్చ. ౧౫
తా వీక్షితుం మణ్డన మర్ధకౢప్తం త్యక్త్వా తదైవోజ్ఝితసర్వఖేలాః
అభ్రేషు సౌదామనికా ఇవాశు హర్మ్యేషు చక్రుః పద మాయతాక్ష్యః.
కాచి న్మృగాక్షీ నయనం పురస్తా ద్వామేతరం సంభ్రమతోఽఞ్జనాక్తమ్
విధాయ తద్వఞ్చితవామనేత్రా జగామ వాతాయనసన్నికర్షమ్. ౧౬
మార్గే రయా త్కాచి దలం వ్రజన్తీ తమాలపత్రం మృగనాభిక్లృప్తమ్
చకారపూర్ణప్రతిబిమ్బితాస్యే పాణ్యర్పితే దర్పణ ఏవ బాలా. ౧౭
ప్రసాధికా మప్రతిపాల్య కాచి త్పాటీర పఙ్కాఙ్కితపాదపద్మా
జతుద్రవేణారచితాఙ్గరాగా వినిర్యయౌ సంభ్రమతో మ్బుజాక్షీ. ౧౮
స్నాతోత్థితామ్బుఃకణసిక్తమూర్తి స్తథైవ కాచి త్సరసః ప్రయాన్తీ
స్వేదామ్బుబిన్దుచ్ఛురితేవ రేజే సందర్శనాత్ప్రాక్స్మరణేతు రస్య. ౨౦
పథి వ్రజన్త్యా త్వరయా కయాచి ద్గతి ప్రకమ్పాత్ శ్లథకేశపాశః
అగ్రాహి తద్దర్శనజోత్కయా ద్రాగ్బద్ధుం కృతానాదరయా కరేణ. ౨౧
రయా ద్గతే ర్విశ్లథనీవివాసః కాచి ద్గృహీత్వా నిబిడం కరేణ
అహ్నాయ వాతాయనమార్గ మన్యా జగామ తద్దర్శనజాతహర్షా. ౨౨

(52) వచననైషధము- గ్రం. సం. 263.

ఇది దాక్షిణాత్యుఁడు వ్రాసినవచనము. దక్షిణదేశమునం దున్నయాంధ్రుఁడే కావచ్చును. భాష గ్రామ్యము గా నున్నది. కథ కేవలభారతములోనిదే కాదు నైషధకథకూడఁ గొంత చేర్చినాఁడు; అటువనైషధకథ కూడఁ జేరియున్నదేమో యన్న ట్లున్నది. గ్రంథము పెద్దదియే కాని సంపూర్ణము గాదు; ఉన్న దున్నట్లు కొంతభాగము చూపఁబడును.

"అదిన్ని మీరున్ను కూడి వుండ్డేటప్పుడు అది చెప్పగా మీకు సకలమున్ను తెలియపోసున్నది. ఓనళమహారాజా। మీరు శీఘ్రముగా పోతే దానికి ప్రాణము నిలుచును, ల్యాకపోతే నిలువచాలదు కాబట్టి అతిశీఘ్రముగా మీరు పొండ్డని చెప్పి ఆనళమహారాజు దగ్గిర వుత్తారపు తీసుకొని ఆఅంసము తనకూటముతో కూడా యెగిరి ఆకాశమార్గముగా పోయి బ్రహ్మాయొక్క మానస సరస్సులో పోయి చేరెను వింట్టిరా ధర్మనందనా। అవతల ఆనళమహారాజు అంసను అంప్పించ్చివేశిఁ మన్మధుని కోపించ్చుకొని విరహతాపము తాళజాలక అలిసి క్రిందపడి నిద్రపోయేటప్పుడు మన్మదుడు వచ్చి తంన్ను దమయంతితో కూడా చేరుకొన్నట్టుగా స్వప్నంకని లేచి కలగనినామని లేచి చూచి వఖరితోనుంన్ను మాటాడగనే మన్మధబాణములు చురుకు చురుకుమని నాటేట్టందుచేతను నిండ్డావ్యాకులముతో- అంన్నమూ హారనిద్ర ల్యాకనే హరికీర్తనము చేసుకొనుచుంన్ను వఖక్షణం వఖయుగముగా కాలం దొబ్బుకొని నళమహారాజు వుండ్డెను...."

"వోయి ఋషులార నేను నాపురుషుడుంన్ను నాబిడ్యలుంన్ను కూడుకొని వుండ్డేద్దానికి యెన్నిదినాలు చెల్లు నని అడుగగ మునీశ్వరులు యోచనచేశి అంమ్మా దమయంత్తి యింక్కా మూడుసంవ్వత్సరములు పోయినవెనుక నీవున్ను నీపురుషుడుంన్ను నీబిడ్యలుంన్ను చేరివుండ్దురు. అప్పుడు మేము చెప్పినమాటను నీవు తలచుకొపోసునావు" ఈవాక్యములు కడపటనున్నవి తరువాతకథ లేదు. 79 పుటలు- కవిపేరు తెలియదు.

(53) తపతీసంవరణోపాఖ్యానము- గ్రం. సం. 292.

పద్యకావ్యము- కొట్ర నరసింహాకవివిరచితము. చతుర్థాశ్వాసము చివర గద్య మి ట్లున్నది.

" ఇది శ్రీనరసింహావర ప్రసాదలబ్ధవాగ్విచిత్ర కౌశికసగోత్రపవిత్ర

కొట్రు నారాయణార్యపుత్ర నయగుణవిధేయ నరసింహనామధేయప్రణీతంబైన సంవరణోపాఖ్యానం బను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము."

అద్దంకి గంగాధరకవికృత తపతీసంవరణోపాఖ్యాన మొక్కటి కాకినాడ సుజనరంజనీముద్రాక్షరశాలలో నచ్చుపడినది గలదు. ఇందు నడుమనడుమఁ గొన్ని పత్రములు లేవు. ప్రారంభము కనఁబడదు. కవిత్వము 'సరసమైనది. ఉన్నపత్రములు వరుసగా లేవు. కొంతభాగము శిథిలమైనది. కొన్నిపద్యములు మచ్చుచూపఁబడును.

సు. మధురంబై యతిశీతమై విమలమై మందానిలాలోలమై
సుధతో సాటువయై మనోహరమునై శుద్ధంబునై యొప్పు నీ
పథికవ్రాతవిదాహతాపహరణప్రావీణ్యతోయంబు త్వ
ద్విధమెవ్వారు నుతింపనోపుదురు కావేరీ నదీరత్నమా.

చ. ఖరకరధాటికి న్వెఱచి కాదె హిమంబు కురంగలాంఛనా
గురుకుచశైలదుర్గములఁ గూపముల న్గతి న్మూఁకునీడల
శరణము నొందె నట్టియెడ సందియమైనఁ దుషారవేళలం
దరయఁగ నందు వేఁడి మెనయఁ బనియేమి జగత్ప్రసిద్ధిగన్.

మ. హితునిం గన్గొని పక్షై నాపురికి నీవే తెంచి యిక్కార్యమున్
మతిదోఁప న్సచిమంతుతోఁ దెలిపి హేమంబు ల్సుచేలంబులు
న్వితత శ్రీయుత రత్నభూషణములు న్విఖ్యాత తత్తన్క్రియో
చితవస్తూత్తర మిచ్చి పంపు మని పంచెం గౌతుకావాప్తుఁడై.

క. యమునానది పుణ్యానికా, యమునా నది యింపెసంగె నంభోనిధి సం
భ్రమదా భ్రమదాపహావి, భ్రమదారితదురితదావపావక యగుచున్

ఉ. అంతఁ బురంబు వెల్వడి నిరంతరభూసురకోటి సంతతా
క్రాంతము రాజమార్గపరికల్పితభూరితరాన్నసత్రశు
ద్ధాంతము వేదశాస్త్రనిజతత్త్వనిశాంతము చోళమండల
ప్రాంతము సహ్యజాసలిలభావుకవంతముఁ గాంచె వేడుకన్.

(54) ప్రపన్నజనచింతామణి. గ్రం. సం. 331.

ఇది యొకపద్యకావ్యము- కవిపేరు తెలియఁజేయు భాగము లేదు. ఇందు పరబ్రహ్మలక్షణ వినిర్ణయ ప్రకరణము, పూర్ణాచార్యావతార ప్రకరణము, సంప్రదాయ రత్నాకరప్రకరణము నని కొన్నిభాగములు గలవు-

విశిష్టాద్వైతమతసంప్రదాయము తెల్పఁబడినది. కవిత్వము సొగసైనది గాదు. ఒక్కొక్క ప్రకరణమున 50, 60, 80 పద్యములు గలవు. అన్నియుఁ గందములే.

క. కదలక నిలిచినవారికిఁ, గొదవేమియు లేదు శౌరి కొనసాగించుకా
మదిలోఁ దలఁచిన కోర్కులు, తుదముట్టఁగఁ జేయునతఁడు తోడాసింపకా

క. ఎఱిఁగించెద బరవస్తును, దిరుమలయం దవతరించెఁ దిరుమలపతిచేఁ
బెరుఁగును సాదము నందిన, పెరియగు గోవిందులకును బెరియన్నకునూ.

క. కూడారగించెఁ దిరువడి, తోడను సహభోజనంబు దొలఁగక శబరికా
జాడలు వెన్నక యామెచె, వేడుకతో నారగించె విష్ణుఁడు ప్రీతికా

క. పరవస్తగు రంగేశులు, చరణద్వయ మైనవారు శఠ వైరులు త
చ్చరణులు యతిరాజులు త, చ్చరణులుపరయోగివారిచరణులుజియ్యారూ.

క. ఉండఁదగుచోటు గురువరు, నుండను నెపుడుండఁ దగును నది మే లదిలే
కుండిన హరిసన్నిధిలో, నుండుట గుణ మితరచోట్ల నుండఁగఁ జెప్పరూ.

క. తనుబాధింతురు రాజులు, ధనమిన్నని దొంగవాండ్రు దాయాదులు స్త్రీ
జనములు మందులు పెట్టుదు, రనయము కామాదిలోభ మైనది ధనమూ.

కడపట కులశేఖరాళ్వారుల ముకుందమాలయు, అష్టశ్లోకియుఁ మొదలగునవి గలవు.

(55) చాటుధారాపద్యములు

ఈపద్యములు గ్రం. సం. 2531 భాగవతములో ౧౨౭వ పత్రము తరువాయిని శ్రీమన్నన్నగురుభ్యోనమః అని యొకపత్రములో వ్రాయఁబడియున్నవి. గ్రంథభాగములోఁ గలసిపోయినవే గాని క్రొత్తగాఁ జేర్చినవి కావు.

సీ. "శ్రీకరకవిభటాశ్రితజనావళులకు విరివిగా సిరులూరు వెల్లటూరు
తాంబూలకదళికాజంబీరతతులచే విస్ఫూర్తిఁగుచుఁ గేరు వెల్లటూరు
ద్విజరాజవిట్ఛూద్రసుజనవ్రజమునకు వేల్పుగి డ్డనమీఱు వెల్లటూరు
సతతంబు దేవతాసంతర్పణంబుల వేడుకల్చేకూరు వెల్లటూరు
అట్టి వెల్లటూరు కధిపతులైనట్టి, కమలకాళిపతుల గరుడవృషభ
గమనులను పినాకఘనశార్ఙ్గహస్తుల, శూలికేశవులను జాలఁ దలఁతు.

క. పురుషోత్తమ లక్ష్మీపతి, సరసిజభవ వామదేవ సంస్తుత్యహరీ
నరసఖ శౌరి జనార్దన, గరుడగమన పాండురంగ కలుషవిభంగా.

క. శ్రీమానినీమనోహర, దామోదర వాసుదేవ దశరథతనయా
 కామితఫలదాయక ని, న్నేమఱు వినుతింతు విజనవేములచెన్నా.
క. వర్ణించెద హరిభక్తిని, బ్రార్థించెద నీదుదివ్యపాదాబ్జంబుల్
 కర్తయు నీవని సతతముఁ, గీర్తించెద వెల్లటూరి కేశవమూర్తీ.
క. కమలాప్తుని శిష్యుఁడవై, కమలాప్తుని వంశ్యుఁడైన ఘనునకు సీతా
 ప్రమద సుఖం బెఱిఁగింపవె, యమడాలలో వెలసినట్టి యంజనితనయా.
గీ. దహనమిత్రపుత్ర తపననందనమిత్ర, శక్రరిపులఁ బట్టి విక్రమమున
 భంగపఱిచినట్టి బలవంతుఁడవు నీవ, యమడవాళ్ళనుండు నాంజనేయ.
క. కోటిమదనసౌందర్య ని, శాటభయద శూలహస్తశార్ఙ్గధరసఖా
 పాటించి నిన్నుఁ బొగడెదఁ, దాటిపరితి రామలింగ ధవళశుభాంగా.
క. కంతుని జనక మురాంతక, శాంతహృదయ తావకాంఘ్రి జలజంబులు నే
 సంతతమును మదిలోపలఁ, జింతించెదఁ దాటిపర్తి చింతలరాయా.
శ్లో. వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేఃపౌత్ర మకల్మషమ్
 పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్.
శ్లో. మునిం స్నిగ్ధాంబుదాభాసం వేదవ్యాస మకల్మషమ్
 వేదావాసం సరస్వత్యా వాసం వ్యాసం నమామ్యహమ్.
శ్రీవేదవ్యాసభగవాన్ నారాయణాయనమః
శ్లో. తత్త్వవిద్యాపయఃపూర వర్ధితచ్ఛాత్రబాలకమ్
 రాగయోగసుధాతాన్త్ర్ర సుబ్రహ్మణ్యగురుంభజే.
క. విద్వత్కుజకంఠీరవుఁ, డద్వైతవిచారి షణ్మతాధికగుణసం
 పద్విభవమతోద్ధరుఁ డ, స్మద్వరగురు సుబ్బయోగిమండను గొలుతున్.
శ్రీమదస్మద్గురుభ్యోనమః"- అనికలవు.

(56) పృథుచరిత్రము- గ్రం. సం. 534.

ఈప్రబంధ మెన్నియాశ్వాసములదో కాని పరిషద్గ్రంథాలయములో నున్నది యసంపూర్ణగ్రంథము- తృతీయాశ్వాసములోఁ గొంతభాగమును జతుర్థాశ్వాసములోఁ గొంతభాగమును మాత్రము కలవు. తృతీయాశ్వాసాంతగద్య మిట్లున్నది.

"ఇది శ్రీమత్పంచాక్షరీపంచదశాక్షరీమంత్రప్రసాదాసాదితైకసంథాగ్రహణనవ్యకావ్యవిద్యావధాన షట్సహస్రసుల ప్రధాన ప్రధాన హరితహరితస

గోత్రపవిత్ర చరిత్రప్రభట్ట పట్టమట్టపోతనామాత్యపౌత్ర పెద్దనామాత్య పుత్ర సారసారస్వతవిభ్రాజి సరస్వతిసోమయాజిప్రణీతం బైనవృషుచరిత్రం బనుమహాప్రబంధంబునందు తృతీయాశ్వాసము-

క. శ్రీమద్గంగాజూటీ, హైమవతీభానుమితమహత్త్వగుణమయ
  తాత్వామితమూర్త్యనుషంగా, ప్రేమావితశిఖితురంగ భీమయలింగా!

ఇది చతుర్థాశ్వాసాదిపద్యము. కృతి భీమలింగేశ్వరస్వామి కీయఁబడినది. ఈకవి గోదావరీమండలములోనివాఁ డనుకొనవచ్చును. కృతిద్రాక్షారామభీమలింగమున కిచ్చుటయుఁ దత్సమీపముననే వెలువలపల్లిలో పట్టమట్టవా రుండుటయుదానికిఁ గారణము. పట్టమట్ట సోమనాథకవి యనునతఁడు స్కాందపురాణములోని సూతసంహితను దెనిఁగించి బిక్కవోలిప్రభు వగుకామారెడ్డి కంకితముచేసెను. సోమనాథకవియు సోమయాజియు జ్ఞాతులే యని తోఁచుచున్నది. సూతసంహితను గృతినొందిన కామారెడ్డి షట్చక్రవర్తిచరిత్రమును రచించిన మల్లారెడ్డియన్న. ఈమల్లారెడ్డియే శివధర్మోత్తరమను గ్రంథమును రచించి తనయన్న కామారెడ్డికిఁ గృతియిచ్చెను. కామారెడ్డికాలము కవులచరిత్రమునకుఁ దెలియలేదఁట. మల్లారెడ్డి ఇబ్రాహింకాలములోనివాఁడనియు ౧౫౫౦- ౧౫౮౧ సం॥ లో నుండుననియు నిర్ణయించియే యున్నది. కావున కాలనిర్ణయములోఁ జిక్కులేదు. బిక్కవోలును గోదావరిజిల్లాలోని బిక్కోలని కవులచరిత్ర మనుకొనుచున్నది. రాజమహేంద్రవరమును బాలించిన వీరభద్రరెడ్డి మొదలైనరెడ్లసంబంధుఁ డనితోఁచుచున్నదనుచున్నది. అది నిజాం రాజ్యములోని సిద్ధరామేశ్వరక్షేత్రమునకుఁ జేరిన బిక్కవోలు గాని యీబిక్కోలు గాదు. దోమకొండసంస్థానాధీశ కామినేని వంశసంభూత రాజామల్లారెడ్డికవిప్రణీత శివధర్మోత్తరము పీఠికఁ జదివినఁ దేటపడును. దానిని శ్రీరాజా మహారణనీరవంత్ బహద్దరుగారు దోమకొండ సంస్థానాధిపు లచ్చువేయించి ప్రకటించిరి. మల్లారెడ్డి షట్చక్రవర్తిచరిత్రను రచించినపిమ్మట రచించిన దగుటచే శివధర్మోత్తరము విషయమును బలువురు తెలిసికొనుటకు వలనుపడలేదు.

సరస్వతీసోమయాజి గోత్రసూత్రాదులు పైగద్యమువలననే స్పష్టమగుచున్నవి, కవిత్వము రసవంతమైనది. చూడుఁడు-

మ. అనలం బున్నది నీమమండలములో నవ్వేఁడి లేకున్న నీ
తనుమధ్యంబున లాంచనచ్ఛలమునం దద్ధూమ ముప్పొంగునో
వనితామానసదేహదుస్సహతరజ్వాలాశిఖావైఖరుల్
గనునో నీయమృతస్వరూపకరముల్ కాకోలకంఠాకృతుల్.

ఉ. ఏమని దూఱుదాన జగదీశ్వర నిన్ను సముద్రనేమిమ
ద్భామినిగా మహాఘనులఁ గన్నదిగా కమలాసపత్నిగా
సోముని మూర్తిగా యనక చూచెద వాగ్రహదృష్టి నయ్యయో
కామునితల్లిఁ జెప్పెడిదిగాక నృపాలుర నేల చెప్పఁగన్.

ఉ. అత్త సుధాబ్ధిపుత్రికిని నాయమకోడలికొమ్మ శారదా
మత్తచకోరనేత్రికిని మైత్రియ కాని విరోధ మెయ్యెడన్
హత్తగఁ జేయఁ డీధరకు నాదిమభూపతి ప్రజ్ఞ యెట్టిదో
చిత్తజమిత్రశత్రులకుఁ జేయు మహత్తరమిత్రభావముల్.

ఉ. సారసజీవనంబులను సర్వజగజ్జనజీవనంబులన్
నీరసతీవ్రధాములఁ నిష్ఠురతం దపియింపఁజేయఁగా
సారసబంధుశబ్దమును సర్వజగజ్జనబంధుశబ్దమున్
సూరున కింకఁ జెల్ల దనఁ జొచ్చిరి వేసవి నెల్లవారలున్.

ఈపృథుచరిత్రము సంపూర్ణప్రతి యున్నవారు పరిషత్తునకుఁ బ్రతి వ్రాసికొనుట కొక్కసారి పంపఁగోరెదము.

## (57) ముక్తిచింతామణి- గ్రం. సం. 539.

ఇది యొక్క వేదాంతపద్యగ్రంథము. మూఁడాశ్వాసములు. కవి అండలూరి మల్లికార్జునకవి- గద్యము. "ఇది శ్రీమదఖిల విద్వత్కవిజేగీయమాన నరసకవితావిచిత్రాండలూరి శరభనార్యపుత్ర సమధిగతవీరశైవాచారవిధాన మల్లికార్జునాభిధానప్రణీతంబైన ముక్తిచింతామణి యనువేదాంతప్రబంధంబునందు రాజయోగనిరూపణం బన్నది సర్వంబును దృతీయాశ్వాసము."

ఈగ్రంథమును సృష్టికరణకులజుఁడును ముఖీకాశీపతిపృథ్వీమండలరమణలబ్ధవిభవుఁడు నగు కృష్ణమంత్రి కంకిత మిచ్చెను. ముఖీకాశీపతిపృథ్వీరమణుఁడు శృంగవరపుకోటప్రభువు. శృంగవరపుకోట విశాఖపట్టణమండలములో నున్నది. ఈకృష్ణమంత్రి, పాత్రుని కృష్ణమంత్రి కావచ్చును. గ్రంథప్రారంభము:—

ఉ. (శ్రీ)కుచకుంకుమాంకిత విశాలవక్షుఁడు వెంకటేశ్వరుం డెంతయు
స్తోకదయారసంబు పయిదోఁచె ననం దగుభక్తలోక ర
క్షాకరుఁ డిందిరాధరుఁడు శాశ్వతవైభవలక్ష్మి నిచ్చి సు
శ్లోకుని గృష్ణమంత్రి నతిశోభనదృష్టిఁ గృతార్థుఁ జేయుతన్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా- అని- కృత్యాదిపద్యములు వివ
రంబడినవి. ప్రథమాశ్వాసాంతమునందు-

చ. అతిబలభీమ సృష్టికరణాన్వయవారిధిసోమ కీర్తి గుం
భితకకుబంత బంధుకవిమిత్రవనాంత వసంత సాధువ
ర్ణితకృతధర్మ సద్గుణవినిర్జితశాత్రవమర్మ మేరుప
ర్వతసమధైర్య కాశిపతిరాజహితా ద్యఖిలకార్యధీమణీ.
ఘనవైభవసాంద్ర సృష్టికరణకులేంద్రా! అను మొదలగునవి కలవు.

క. (శ్రీ)ముఖకాశీపతిప్రభు, భూమండలరమణలబ్ధవిభవైశ్వర్యో
ద్దామముఖనీపంకజనీ, స్వామిఘృణికృష్ణమంత్రి సామంతగుణీ.

ఇది ద్వితీయాశ్వాసాదిపద్యము. ఆశ్వాసాంతపద్యములు లేవు.
తృతీయాశ్వాసాదినిగూడ "(శ్రీ)ముఖకాశీపతి" యనుపద్యమే కలదు.
తృతీయాశ్వాసాంతపద్యములును లేవు. కవిత్వము మచ్చుచూడుఁడు.

గీ. అన్యసాధనంబు లన్నిటికన్నను, బోధనంబు మోక్షసాధనంబు
పాకమునకు వహ్నిపగిది నీజ్ఞానంబు, గలుగకున్న ముక్తిగలుగ దనఘ.

చ. వెలుచ ఘటాదులందుఁ బ్రతిబింబితమైన నభంబు మాడ్కి లో
నిలిచి యుపాధిసంగతి ననేకవిధంబుల భిన్నమూర్తియై
చెలఁగి శివుండు ప్రొద్దులు నశించినఁ గేవలుఁడై చిదాత్మయై
యలరుటఁజేసి యాశివుని కన్య మొకించుక లేదు చూడఁగన్.

చ. మనసు నివృత్తిగాక లవమాత్రము చిత్తము శుద్ధిగాదు లో
నొనరఁగఁ జిత్తశుద్ధి గనకుండిన జ్ఞానము లేదు జ్ఞానమా
త్మను సమకూడకున్నఁ బరతత్త్వముఁ గానరు తత్త్వ మబ్బకం
గనుఁగొనరాత్మ నాత్మకడగానక ముక్తులుగారు యెవ్వరున్.

శార్వరి సం॥ అధికఆశ్వియుజ బ ౧౦ ఆ॥ వరకు మలాల పాపయ్య
వ్రాసెను.

(58) ఆంధ్రకుసుమావళి—గ్రం. సం. 552.

వారణాసి వేంకటరాయకవిప్రణీతము.

ప్రారంభపద్యములంబట్టి కవియుద్దేశము తెలియును.

క. శ్రీకంఠ భక్తవత్సల, లోకైకస్తుత్యనామ లోకాతీతా
శ్రీకశిమికోటపురహర, శ్రీకర త్రిపురాంతకాఖ్య శివశివలింగా !

గీ. పొసఁగ నాంధ్రశబ్దపుష్పంబు లొకకొన్ని, పద్యరూపగుచ్ఛపటలిఁ జేసి
యదియు మీకు మదికి నర్పణచేయుదుఁ, జిత్తజారి దీనిఁ జిత్తగింపు.

గీ. ఆంధ్రకుసుమావళియనునట్టిపేరఁ, దెనుఁగుభేదములొకకొన్ని తేటపఱుతుఁ
గోరి సత్కవిపల్కు లాధారముగను, దేవ నీదగుకరుణచేఁ దెలిసినట్లు.

గీ. ఆంధ్రశబ్దశాస్త్ర మనువార్ధి నేర్పాటు, చేయనోరుల కెట్లుచెల్ల నేర్చు
నల్లసానిపెద్ద నన్నయభట్టాది, శబ్దవేత్తలకును జనునుగాక.

గీ. తొలుత సంజ్ఞల నొకకొన్ని దెలిపిపిదప, సంధిభేదంబులొకకొన్ని జాడదెలిపి
శబ్దసంగతు లెఱిఁగినసరణిఁ జెప్పి, యందుమార్గంబుఁ జెప్పెదనరసికొనుఁడి.

ఈకవిగద్యము—

"ఇది శ్రీమద్గౌతమసగోత్ర వారణాసిలక్ష్మీనృసింహార్యతనూభవ వేంకటరాయనామధేయప్రణీతంబైన యాంధ్రకుసుమావళి యనుశబ్దశాస్త్రంబునందు సంజ్ఞాపరిచ్ఛేద సంధిపరిచ్ఛేద శబ్దపరిచ్ఛేదంబులు సర్వంబును నేకాశ్వాసము" మచ్చుపద్యములు—

గీ. దీర్ఘవర్ణమందుఁ దేరిచూడంగను, సున్న లేనియట్లు నున్నయట్లు
నర్ధబిందు వనఁగ నరసున్న యనఁగను, పేర నిదియుఁ జెల్లు బేర్మిరుద్ర.

క. పుల్లింగశబ్దజాలము, చెల్లు మహత్తులనఁగ మఱి స్త్రీజడపశ్వా
ద్యుల్లసిత శబ్దజాలము, నెల్లెడ నమహత్తులనఁగ నిక్క్రియఁజెల్లున్.

క. నీవును వచ్చితి వనఁగను, వావిరి మరియొకఁడు వేఱె వచ్చినయట్టే
నీవును జనుమని యనఁగను, భావంబున వేఱె యొకని బంపెదననుట౯.

"శేనాధిపత్యం శేషాచార్యులు నల సం॥ జేష్ట బ ౧ లక్ష్మింవారం సరికి యీకుసుమావళిలో వక్రప్రకరణం వ్రాసె నని తెలియగలందులకు సజ్జనులయినవారిని ప్రార్థిస్తాను" అని చివరనున్నది.

శ్రీరస్తు.

# రసాభరణము.

ప్రథమాశ్వాసము. *

శ్లో. శృంగారహాస్యకరుణా రౌద్రవీరభయానకాః
బీభత్సాద్భుతశాంతాఖ్యా రసాః పూర్వైరుదాహృతాః.

సీ. చారుశృంగారరసస్థాయి రతి యగు హాస్యరసస్థాయి హాస మరయఁ
గరుణరసస్థాయి పరఁగ శోకంబు రౌద్రస్థాయి క్రోధమై తనరుచుండు
వీరరసస్థాయి వెలయు నుత్సాహంబు తలఁప భయానకస్థాయి భయము
ప్రకట జుగుప్స బీభత్సరసస్థాయి విపులాద్భుతస్థాయి విస్మయంబు
విమలశాంతరసస్థాయి శమ మనంగ, నిట్లు నవరసములకు నూహింపఁగలిగి
యంచితస్థాయిభావంబు లతిశయిల్లుఁ, బ్రసవఫలరాసులకుఁ బాదపంబులట్లు.
రత్యాది నవకమునకుం, బ్రత్యేకము లక్షణములు పన్నుగ నార్య
స్తుత్యములై హృద్యము లగు,నత్యుత్తమలక్షణముఁ బ్రియంబునఁ దేర్తున్†

క. తరుణులుఁ బురుషులు నితరే, తరసంభోగేచ్ఛ వెలమి దలకొనఁగాఁ ద
త్పరమతిఁ దివురుట శృంగా, రరసజ్ఞులమతమునందు రతి యన నెగడున్.

— రతికి నుదాహరణము —

ఉ. మారుఁడు రూపవంతుఁడు, హిమద్యుతి చల్లనివాఁడు, రమ్యసం
చారవినోదశీలుఁడు వసంతుఁడు, వెండియు సద్గుణాఢ్యు లు
న్నారు మహీశు లెవ్వరును నాహృదయంబున కింపు గారు నా
కోరిక సర్వసేవ్యుఁ డగు గోకులనాయకుఁడే తలోదరీ.

క. క్రూరత లేని వికారా, కారాద్యము లెచటనైనఁ‡ గలిగినవేళన్
బోరనఁ దోతెంచు మనో, హారవికాసంబు పేరు హాసం బయ్యెన్.

— హాసమున కుదాహరణము —

ఉ. శౌరి రఘుప్రభుండు రవిజాత పయోనిధి యంచు గోపికల్
తోరపుఁదీఁగెతోఁకలును దోఃపదయానముఁ బూని వానరా
కారమెలర్పఁ దాఁటుచును గంతులువేయుచుఁ బాఱుతెంచి త
త్తీరనగంబునన్§ శిలలు దెచ్చి గుభుల్లున వేతు రార్చుచున్.

*కృత్యాదిపద్యములు లభింపలేదు. †దేల్తున్ ‡లెచటనైనన్ §త్తీరనగరంబులున్ (ఇందలి పాఠభేదములు చెన్నపురి దొరతనమువారి లిఖితపుస్తకభాండాగారప్రతినుండి గ్రహింపఁబడినవి.)

క. విధివశమునఁ దనప్రజకగు, నిధనాదులు వినినఁ దనదు నెమ్మనమున న
త్యధిక మగునెగులు వొడమిన, నధీరమతిఁ బొగుల శోక మపగతశోకా!

— శోకమున కుదాహరణము —

ఉ. అన్న! సభాస్థలంబున దురాత్మకులై తలవట్టి యీడ్చి రం
దున్న ప్రభుల్ గనుంగొనఁగ నొల్వఁ దొణఁగిరి చీర శూరులు
న్నన్ను నుపేక్ష చేసిరి యనాథఁ జుమీ కరుణింపు దిక్కు నీ
వన్న వధూటిమాట విని యక్షయ మంటివి నెత్తమాడుచున్.

క. ఏపున నితరులద్రోహా, లాపాదులు తనదువీనులన్ సోఁకినచో
నేపురుషునిమదిఁ బొదలుఁ బ్ర, కోపజ్వలన మది నెగడఁ గ్రోధ మనంగన్.

— క్రోధమున కుదాహరణము —

ఉ. తిట్టులు పెక్కు సైఁచితి మతి స్మనుజాధముఁ డేలక్రొవ్వునో
యిట్టులు ధర్మరాజుసభ నెగ్గులు వల్కిన చైత్యకోటి ము
ప్పెట్టులఁ దూలఁదోలు మదభీప్సితదర్శన మీసుదర్శనం
బెట్టులు సేయునో యిచట నిందఱుఁ జూతురుగాక చైద్యునిన్.

క. లోకోత్తరకృత్యంబులు, గైకొని యవి *యెడపకుండఁ గావించుదృఢా
స్తోకప్రయత్న మది సుగు, ణాకర యుత్సాహ మనఁగ నభినుతి నొందున్.

— ఉత్సాహమున కుదాహరణము —

ఉ. బాణునిఁ గాతునంచుఁ బటుబాహుబలంబున నడ్డగించి యా
స్థాణుఁడు దానునుం బ్రమథసంఘముఁ బన్నినఁ బన్నునీ రణ
క్షోణిఁ బరాక్రమస్ఫురణ సూపెద శత్రుని యేపు మాపెదన్
శోణితపట్టణంబు వెసఁ జొచ్చెదఁ ద్రుంచెద దైత్యుహస్తముల్.

క. ఘోరము లగునత్యుగ్రా, కారాదులవలన మనసు కళవళపడఁగా
సైరింపరాక తూలుట, యారయ భయ మనఁగ నెగడు నభయవిధాయీ.

— భయమున కుదాహరణము —

ఉ. మించుగఁ బాంచజన్య మెలమిం గరపద్మయుగంబునందుఁ గీ
లించి నిజాధరోష్ఠమున లెస్సగఁ బూర్చి మురారి లీలఁ బూ
రించిన గుండియ ల్వగిలి త్రెళ్ళెను భీతి నశేషదైత్యులుం
జంచలచిత్తులై నలుదెసం జెడి పాఱిరి తద్ఘనధ్వనిన్.

---

*యడపకుండ.

క. మేదోమాంసాసృక్క, ల్యాదివివిధమష్టదర్శనాదులవలనం
ప్రాదుర్భవించుహేయం, బేది యది జుగుప్స యనఁగ నెన్నికకెక్కున్.

— జుగుప్స కుదాహరణము —

ఉ. చిక్కిరి నేఁడు రక్కసులు సీ బలభద్రునిముష్టిఘట్టనం
బుక్కిటిమద్యముల్ రుధిరపూరము నొక్కటిగా బుగుల్కొనం
గ్రక్కుచు సీరధారఁ దెగి కండలు గుండెలుఁ గీకసంబులుం
దక్కక చిక్కుజీరువడి దగ్గఱ రాలెఁ బూతిగంధముల్.

క. క్షితిఁ గారణంబుకంటెను, వ్యతిరిక్తం బైనయట్టి యభినవకార్య
స్థితిదర్శనచేతోవి, స్మృతి* విస్మయ మనఁగ నుల్లసిల్లు ముకుందా.

— విస్మయమున కుదాహరణము —

చ. కొడుకఁడ వైననీకు నిదె కొస్సనుచున్ సెలవిం గరాంగుళిం
బిడి భువనప్రపంచము లనేకము లంగిటఁ గాంచె నందులోఁ
గొడుకున కుస్సవెట్టు తనకోమలరూపము నొప్పఁ గాంచి య
ప్పడఁతి యశోద నివ్వెఱఁగుపాటు వహించె మనోగతంబునన్.

క. ఎరవగు† సంసారం బ, స్థిరముగఁ గని నిర్వికారచేతనుఁ డగు న
ప్పురుషుని సుఖదుఃఖాద్య, స్మరణము లోకంబునందు శమ మైచెల్లున్.

— శమమున కుదాహరణము —

చ. కటకట! రాజ్య మంత్యనరకం బటె దేవపదంబు లన్నియుం
గుటిలనిశాటభర్జనలకు న్సదనం బటె యింక సౌఖ్య మే
మిటఁ గల దంచు సర్వమును మిథ్యగఁ జూచు బుధాళి లోనిసం
కటములు బాహ్యదుర్దశలుఁ గ్రాఁగు గదాధరరక్షణంబునన్.

క. స్థాయిత్వం బీభావని, కాయంబున కేమిట న్విఘాతము లేకు
చ్ఛేయ మగు వెండి యేమిటఁ, బాయక తలకొను రసానుభవ మనిరేనిన్.

వ. స్థాయిభావములు సజాతీయ విజాతీయంబులం జెడక దృఢవిభావ సదమలానుభావ సాత్త్వికభావసంచారికభావముల రసములై వర్తించు నందు సజాతీయ విజాతీయభావము లెట్టి వనిన.

క. అరయ సజాతీయములై, జరగు నిజస్థాయిభావజనితాంతరముల్
సొరిది విజాతీయములై, జరగుఁ బరస్థాయిభావజనితాంతరముల్.

*విస్మృతి †ఇఁవక

వ. మఱి విభావం బెట్టి దనిన.

క. చను నాలంబన ముద్దీ, పన మనఁగా ద్వివిధమై విభావము మఱి యం
దున నాలంబన మన్నది, ననుపమసమవాయికారణము రసమునకున్.

వ. మఱియు నిమిత్తకారణం బగు నుద్దీపనవిభావం బెట్టి దనిన.

క. ఇల నుద్దీపన మొకటియు, నలి నాలంబనగుణం బనంగాఁ దచ్చే
ష్టలు నా దదలంకృతి యన, నలరుఁ దటస్థములు నాఁగ నగు నలు దెఱఁగుల్.

క. తొలఁగదు కార్యము మొదలం, గలసియుఁ జేయు సమవాయికారణమది తాఁ
గలయక కార్యమొనర్చును, నలిఁ దొలఁగు నిమిత్తకారణం బనునది తాన్.

క. అనుభావంబు కటాక్షం, బును భుజవిక్షేపణంబు మొదలయి కార్య
త్వనిరూఢి నుల్లసిల్లును, విను స్తంభాదు లష్టవిధసాత్త్వికముల్.

క. తగు సంచారము లనఁగా, మొగి నిర్వేదాదిభావములు ముప్పదిమూఁ
డగు రసికులమతమున నవి, జగమున సహకారు లగుచు సన్నుతి కెక్కున్.

గీ. కారణముఁ గార్యము సహకారిచయము, నైవిభావాదు లిట్లఁగి నతిశయిల్లు
నీసమూహంబు రసములం దెట్లయట్లు*, నడచుఁ దత్తద్రసానుగుణంబుగాఁగ.

ఉ. ఆదట వర్ధమానవిభవాతిశయంబున వార్ధులట్లు ర
త్యాదులు వీచుల ట్లుదయమా నడఁగుం బెరభావపంక్తి ని
ర్వేదముఖోపభోగరుచివృద్ధిరసం బది నాట్యసంగతిన్
మోదమెలర్ప సభ్యులమనోగతులం† దగు కార్యమై చనున్.

క. రసములవలనరసంబులు, పొసఁగఁగ నుదయించు ననియుఁ బూర్వోక్తముగన్
వసుమతి నొకరసమున కొక, రసము విరసమనియుఁ జనుపురాకృతకృతులన్

సీ. శృంగారమునఁ బుట్టెఁ జెచ్చెర హాస్యంబు గలుగు రౌద్రంబునఁ గరుణ మఱియు‡
వీరంబువలన భావింప నద్భుతమగుఁ బటుభయానకము బీభత్సఁ బొడముఁ
బరఁగు శృంగారబీభత్స లొండొంటికి హాస్యంబుఁ గృపయు నన్యోన్యరిపులు
రౌద్రాద్భుతములు పరస్పరద్విషులు మిథ్యాహితు ల్వీరభయానకములు
త్రివిధలక్షణముల§ దీపించు నన్నియు, రూపమునఁ దలిర్ప రూపరసము
వాక్ప్రవృత్తిదోఁప వాగ్రసంబగుఁ గ్రియ, లందుఁ గానఁబడుఁ గ్రియారసంబు.

సీ. శృంగారముత్పలాంచితము విష్ణుఁడు రాజు1 తెలుపు హాస్యము గణాధిపుఁడు భర్త2
కరుణ కషాయంబు కాలుఁ డేలిక రౌద్ర మవ్యక్తరాగంబు హరుఁడు వరుఁడు

---

* కెల్లనిట్లు † మనోగతులుం ‡ రౌద్రమునఁ బ్రఖ్యాతకరుణ § లక్షణములు 1. భర్త
2. ఱేఁడు.

వీరంబు గౌరంబు విభుఁడు వజ్రి భయానకము ధూమ్రరుచి మహాకాళుఁడీశుఁ
డసితంబు బీభత్స మధిపతి నంది యద్భుతము పీతము దయితుండు బ్రహ్మ
వర్ణముల నెల్ల మీఱి యస్వామిపరత, వెలయుని శ్వేతధృతిభావములను శాంత
మిట్లు రసవర్ణముల రసాధీశ్వరులను, గోరి యెఱుఁగుట రసికత గోపకృష్ణ.

క. ఎసఁగం దొమ్మిది విలస, ద్రసములు తత్తదధిదేవతాసహితము గా
రసశాస్త్రకోవిదులమా, నసములకు నుదాహరింతు నవపద్యములన్.

శృంగారరసము——

ఉ. శ్రీకుచకుంభకుంకుమరుచి స్మణిరోచులు వైజయంతికా
స్తోకమరీచులుం గనకశోభితవస్త్రములు న్నిజోజ్జ్వల
శ్రీకి నవీనవిస్ఫురణఁ జేయఁగ గోపవధూసమేతుఁడై
గోకులవీథుల న్మెఱయు గోపకుమారుఁ డుదారలీలతోన్.

హాస్యరసము——

ఉ. నిక్కి జటాగ్రపుటస్థతటినిం దనతొండము సాఁచి పేర్చి యా
చక్కటి గౌరి సూడ నిలఁ జల్లినఁ బెక్కుముఖంబులై చనన్
గ్రక్కున శూలిహస్తదశకంబున నాఁపినభంగి* సూచి మై
గ్రక్కదలంగ నవ్వుచును గంతులువేసె గజాస్యుఁ డుబ్బుచున్†.

కరుణరసము——

చ. హరి నొకనాఁడునుం గొలువరా బహుబాధలఁ గొంద నుష్ణులై
తిరి నరులార దిక్కుగలదే భవదుష్కటకోకబాష్పముల్
ఘోరిఁ బారి నేఱులై మిగులఁ బొంగి సముద్రసమంబులయ్యెఁ దె
ప్పరముగ నంచు నారకులఁ బల్కెఁ గృతాంతుఁడు గన్నరంబునన్

రౌద్రరసము——

చ. కుపితకపర్ది యుద్ధమునఁ గూలుఁ బురత్రయ మొండెఁ గాక యీ
త్రిపురనిశాటకోపమునఁ దీఱు జగత్త్రితయంబు నొండె నా
విపులపరాక్రమం బొకని వీక్షణ నేర్చునె నాఁగ భూరథం
బపుడు త్రినేత్రుఁ డెక్కె నిశితాస్త్రసువర్ణశరాసనాఢ్యుఁడై.

వీరరసము——

ఉ. స్రుక్కక చక్కనై నిలుపు శూరుఁడ వైనను మార్కొనంగ నీ
వెక్కడఁ బోయెదంచుఁ గడు నేపున వృత్రుని బెట్టు దాఁకె ను

* నాఁగినభంగి † డుబ్బెన్.

క్కైక్కిన వజ్రధారల నహీనమయూఖము లంతరిక్షమున్
దిక్కులు బిక్కటిల్లఁ నదితిప్రియపుత్త్రుఁ డుదగ్రలీలతోన్.

భయానకరసము—

ఉ. ఆలమునందు ఘోరదనుజావళిఁ గూల్చి నిజాస్యరేఖనా
భీలత దోఁప వాలు జళిపించుచు హుంకృతు లుల్లసిల్లఁగా
శూలికిఁ దత్పరాక్రమముఁ జూపెడువేడుక నేగునమ్మహా
కాళి విజృంభణంబుఁ గనఁ గాలునికైనను భీతిపుట్టదే.

బీభత్సరసము—

చ. దురమున నందికేశ్వరుఁడు దుర్దముఁడై నుఱుపంగ రాక్షసో
త్కరవరగాత్రముల్ మెదిగి కాళ్లును జేతులు నుత్తమాంగముల్
బమలును వీఁపులుం బిఱుఁదుఁ బ్రక్కలు రూపఱ ప్రగ్గిరొంటె* పైఁ
బురపుర మ్రింగుచుం† గదురు భుగ్గున నామట నున్నవారికిన్

అద్భుతరసము—

చ. చెలువుగఁ బచ్చిమంటఁ దగఁజేసిన కుండనుదేహ మందులో
జల మనలంబు నాయనలసంఘము మీఁదట నోలివాయు వి
‡ట్టలముగ నొక్క బట్టబయటం బదిలంబుగ నిల్పి పెక్కురూ
పుల సృజియించె బ్రహ్మ తలపోయఁగఁ జిత్రచరిత్రుఁ డెవ్వఁడన్.

శాంతరసము—

ఉ. మ్రొక్కిన వెక్కిరించినను మోదిన గంధము దెచ్చి పూసినం
ద్రొక్కిన నెత్తుకొన్నఁ గృపతోఁ గుడిపించినఁ బస్తువెట్టిన
న్నిక్కను స్రుక్కులేక తరుణీజనులందును స్రూఁకులందుఁ దా
నొక్కవిధంబ కా మెలఁగుచుండు మహాత్ములఁ జెప్ప నొప్పగున్.

క. నవరసములయందును గా, రవమున శృంగారవీరరౌద్రాద్భుతముల్
భువి లోకోత్తరనాయకు, నవిరళమున నాశ్రయించు నది యెట్లనినన్.

సీ. రసము నాయకసమాశ్రయమునఁ బ్రావీణ్యుఁ డగునటుచేష్టల నైనఁ దచ్చ
ధాకర్ణనంబున నైన సామాజికప్రకరానుభావ్యమై పరఁగుచుండుఁ
బరగతంబయ్యు సద్భావనచే రసోదయవిశేషము విరుద్ధంబు గాదు
మఱియుఁబూలత్యాదిమహిళాప్రసంగంబువినుచుసభ్యులుఙ్గ నిజవనితలందుఁ

*రొంటిపై †బాఁగుమఱి ‡ట్టలముగనొక్క బయిటం బదిలంబుగనిల్పియు వానిపెక్కురూ.
ఙ్గసభ్యుల.

దలఁపు నిలుప* రసాశ్రయత్వంబు గలుగ†
ననుకరణమాత్రమై యుండు నాశ్రయంబు
గాదు, భావకత్వాదులు గలిగెనేని
వాఁడు సామాజికులయట్టివాఁడ యపుడు.

క. ప్రకటనటుఁ డరయ సామా, జికసముఁ డగునేని వానిచే ననుభావా
దికమెట్లాదవు ననిన వా, నికి నిది యభ్యాసజనితనిపుణత యుమ్మెన్.

ఉ. వాసన నొప్పుప్రేమ మిరువంకల లేకొకవంకఁ జెప్పిరే
నేసతియైనఁ బల్వురకు నిచ్చయొనర్చుటఁ జెప్పిరేని త
ద్భాసురలీల మ్లేచ్ఛమృగపక్షిగతంబుగఁ జెప్పిరే రసా
భాసముగా నెఱుంగుదురు భావకులీత్రివిధప్రయోగముల్.

వ. అందును.

క. ఆరయ సంజ్ఞాప్రకరణ, మీరీతిఁ దనర్చి వెలయు నిట రత్యాది
స్ఫారప్రకరణమును శృం, గారప్రకరణము నాయకప్రకరణముల్.

క. నవరసనాథశ్రీనిధి, నవఖండమహీతలంబునకు నొడయఁ డొగిన్
నవనలినాసనజనకుఁడు, నవనిధిసదృశుండు సజ్జనవ్రజమునకున్.

గద్యము.

ఇది శ్రీవాణీవరప్రసాదలబ్ధవాగ్వైభవ తిక్కనామాత్యసంభవ సుకవిజన
విధేయ అనంతనామధేయ ప్రణీతంబైన రసాలంకారంబునందు‡
నవరసస్థాయిభావంబులును సజాతీయవిజాతీయంబులును
విభావానుభావసాత్త్వికభావసంచారికాభావంబులును
రసజన్మరసవిరోధాదులును సంజ్ఞాప్రకర
ణంబు నన్నది ప్రథమాశ్వాసము.

---

*నిలుపు †గలదు ‡రసాభరణ మని వాడుకలోను గ్రంథాదిని గలదు.

శ్రీరస్తు.

# రసాభరణము.

## ద్వితీయాశ్వాసము.

---

క. శ్రీయుతుఁడు భక్తలోకమ, నోయుతుఁ డాధ్రువవిభీషణుల నాకల్ప
స్థాయిగ రక్షించిన కరు, ణాయుతుఁడగు ధ్రువపురీశుఁ డధిపతి మాకున్.

క. మును సాధారణరూపం, బునఁ బ్రథమస్థాయిభావముగఁ గ్రమగతిఁ జె
ప్పిన రతికిని సాధారణ, వినుతవిశేషంబు లిచట వివరింపఁదగున్.

మ. రతి దానాయకనాయికాదిపరతన్ రంజిల్లు శృంగారమై
క్షితిలో దేవగురుద్విజాదిపరతం జెన్నొందు సద్భక్తియై
సుతమిత్రాశ్రితసోదరాదిపరతన్ సొంపారు వాత్సల్యమై
మితి చెప్పంగలదే రసస్థితికి బేర్మిం జూడఁగా నెయ్యెడన్.

వ. ఇట్టి శృంగారభక్తివాత్సల్యంబుల కుదాహరణము—

శా. ప్రేమం జూచిరి ప్రాణనాథుఁ డనుచున్ బింబాధరీరత్నముల్
స్వామిత్వప్రణిపత్తిమైఁ గొలిచి రోజం బౌరలోకంబు చే
తోమోదంబునఁ బుత్త్రభావనఁ గడుం దోతేర నంతన్ ఘన
శ్రీమీఱ న్వసుదేవదేవకు లొగిన్ సేవించి రావెన్నునిన్.

వ. మఱి తత్సజాతీయ విజాతీయంబు లెట్టి వనిన.

క. మొదల సజాతీయం బను, నది విభునకు నాయికాంతరాలోకనమై
పొదలు విజాతీయం బను, నది క్రోధాఖ్యంబు రెండు నహితము రతికిన్.

ఉదాహరణము—

ఉ. ఎన్నఁడు చూచె నన్ను నతఁ డింపుదలిర్పఁగ నాఁటనుండియు
న్నన్నన వెల్తిగాఁడు, పరమానవతీసతిపొంతఁ బోఁడు, ప్ర
చ్ఛన్నవిరోధి మజ్జనని చాడ్పులువాఱఁగ నేమి పల్కిన
న్నిన్నిక పోవుఁగాని తరుణీ మదిఁ గ్రోధము లేదు శౌరికిన్.

వ. మఱి విభావాదు లెట్టివనిన.

సీ. పరఁగ శృంగారవిభావంబులందు నాలంబనోద్దీపనలక్షణములు
నాలంబనంబు నాయకనాయికాకృతి రససమవాయికారణము దాన
ఘటకల్పనకు మృత్తికయుఁబోలె వెండి యుద్దీపనమ్మును నాల్గు తెఱఁగులందు
గురుతరాలంబనగుణము దా రూపయౌవనముఖ్యమై చేష్ట లనుపమాన

శ్రీరస్తు.

# షోడశకుమారచరిత్రము *.

## ద్వితీయాశ్వాసము. †

క. శ్రీమద్విరించితరుణీ, కోమలవీణానినాదకూలంకషవా
గ్భామాభిరామ సుకవి, స్తోమనుతౌన్నత్య యన్నసూరామాత్యా. ౧

వ. ‡ అక్కమలాకరుండును, బుద్ధిసాహాయ్యుండు ను వివేకనిధియు ను గాంతిమంతుండు ను యశఃకేతుండు ను గరుణాకరుండు ను బ్రభాకరుండు ను జిత్రకరుండు ను నీతిమంతుండు ను ననుమంత్రితనూజు లెనమండ్రును, భీమభటుండు ను దీర్ఘబాహుండు ను దృఢముష్టి యు విక్రమకేసరియు నను దండనాయకతనయులు నలువురును, మతిమంతుండును గళానిధియు వసంతకుండు నను పురోహితపుత్రకులు మువ్వురును, బ్రాణమిత్రులై నిరంతరంబును బరివేష్టించి కొలువ నొక్కనాఁడు. ౨

మ. చెలులుం దానును వేడ్కమీఱ విలసచ్ఛృంగారుఁడై తత్పురీ
లలితోద్యానములందుఁ బుష్పితలతాలాస్యంబు లీక్షింపుచు
న్గలకంఠీభ్రమరీనినాదము లగణ్యప్రీతి సంధిల్ల లీ
లలఁ జేసెన్ జనమేజయాత్మజుఁడు కాలక్షేప మేపారఁగన్. ౩

వ. ఇట్లు వినోదపరాయణుం డై యొక్కశీతలతరుచ్ఛాయాతలంబున నెచ్చెలులుం దానును సుఖాసీను లై యున్న సమయంబున సాధకుం డొక్కరుండు నిజేచ్ఛనరిగి వారలం గని చేరవచ్చిన నక్కుమారుండు వినతి నాతని నాదరించి మీ రెవ్వ రెచటి కేగెద రని యడిగిన. ౪

క. సాధకుఁడ నేను సుమహా,(సాధి) కు నొకసిద్ధుఁ గొలిచి యతనిపనుపునన్
సాధింపఁ గడిఁదియగునది, సాధింపఁగ నిశ్చయించి చనుచున్నాఁడన్. ౫

సీ. అది యెట్టి దనిన వింధ్యాటవిలోపలఁ గరమొప్పు శింశుపాతరువుదండఁ
బారావతాక్షుఁ డన్పన్నగేశ్వరుపాల వైదూర్యకాంతి యన్వాలు వహ్ని
దీధితి యనియెడు దివ్యరత్నము గల దావాలు ధరియించి యాతఁ డేడు
దీవులు నేలు నాదివ్యరత్నముకడ్డైనఖిలసిద్ధులు గల వధిప నేను
దాని నిప్పుడుసాధింపవలనుమెఱసి, యెంతుననుటయునలరిమహీశసుతుఁడు
సఖుల నీక్షించి వారల సమ్మతమున, నతనితో నిట్లు లనియె నత్యాదరమున.

---

* షోడశరాజకుమారచరిత్రము— షోడశనందనచరిత్రము— అనియుఁ గలదు.

† ప్రథమాశ్వాసము పూర్తిగ లేదు. గ్రంథపాతములు మెండు.

‡ కమలాకరుఁడు జనమేజయుని రెండవకుమారుఁడు— కథానాయకుఁడు. § కతన.

శా. ఏను స్వమంత్రులం దోడువచ్చెదము నీ కీప్రొద్దు యన్నన్ ధరి
త్రీనాథాత్మజు నిచ్చ మెచ్చుకొనుచున్ దివ్యౌషధిశ్రేణితో
స్నానంజేసి రసంబు తత్పదములం దొట్టించి యప్రస్థలీ
యానోదగ్రత వారుం దానుం జని వింధ్యారణ్యదేశంబునన్. ౭

గీ. పాంశుసంఛన్న మైనకూపంబుం డడవి
దాని చేరువ శింశుపాతరువుక్రింద
నగ్నికుండంబుం బొడఁగని యచట నిలిచి
తనసచివులు రక్షకులుగాఁగ నియమమున. ౮

వ. సుస్థిరాసనాసీనుం డై సాధకుండు ఖదిరేంధనంబుల వేల్వం దొడంగిన-

క. బిగిచన్నులుం దెలికన్నులు, నగుమోమును మెఱుఁగుమేనునయనాసదం
బుగఁ బద్మనయన యొక్కతె, యగణిత విభ్రమముతోడ నరుదెంచుటయున్

సీ. అలినీలవేణికచాంధకార బుచే మదనాంధకారంబు పొదివికొనఁగ
నరుణారుణాధరయధరరాగంబుచే భావజరాగంబు పట్టుకొనఁగఁ
జంచలనేత్రదృగ్జాలంబుచేత దర్పకబాణజాలంబు పర్వికొనఁగ
నురుకుచకుచచక్రయుగముచే శంబరరిపుజైత్రచక్రంబు ద్రిప్పుకొనఁగ
నుల్లముగరంగ వైశికపల్లవిలఁగ, ధైర్య మెడలంగ మంత్రతంత్రములుమఱచి
తలఁపుఁజూపునన గనఁదగిలియుండ, సంయమభ్రష్టుఁడై యుండెసాధకుండు.

వ. ఇట్లు సాధకుండు కామాతురుం డై మంత్రసామర్థ్యంబు గోలుపోయిన.

క. పారావతాక్షుపనుపున, ఘోరతముం బడర భూతకోటులు భయదా
కారత సాధకుఁ బొదివి మ,హారవ మెసఁగంగ నార్చి యాగ్రహమొప్పన్.

వ. కడకాలు వట్టి దవ్వులం బడవైచిన వాని వెదక సంభ్రమించి యందఱు
నన్నివంకల నమ్మహాటవి దరియం జొచ్చి వెదకి వెదకి దిగ్భ్రమనొంది వచ్చిన
జాడ యెఱుంగక యొండొరులం బొడగానక తిరుగుచుండ భూపాలనంద
నుండు కొన్నిదివసంబులు చెలులం దడవి యొక్కనాఁ డొక్కయేటిదరి
నరుగుసమయంబున. ౧౪

ఉ. గ్రాహము తన్నుఁ బట్టినఁ గిరాతుఁ డొకండు ఘనార్తిఁ గూయుచు
న్సాహసమార నానృపతినందనుఁ డానదిఁ జొచ్చి యుద్ధతి
న్బాహుశితాసి దానివదనంబు రయంబున వ్రచ్చి బోయ న
వ్వాహిని వెల్వరించుటయు వాఁడు ముదంబెసఁగంగ నమ్రుఁడై. ౧౫

క. పూని యకారణబాంధుఁడ, వై నాప్రాణములు గాచి తనసమానకృపాం
భోనిధి నను నీదాసుని, గా నేలితి, రమ్ము నాయగారమ్మునకున్. ౧౬

వ. అని తా నేలెడి కిరాతపల్లికిం దోడ్కొని చని సముచితసంభావనంబు లొన
రించి నిజగృహంబులలో నొక్కరమ్యసదనంబున నునిచిన నుండి నాఁటి
నిశాసమయంబున రత్నదీపప్రభావిభాసితం బగుతన్నివాసంబు గలయం
గనుంగొనునప్పుడు దైవయోగంబున. ౧౭

చ. ఒకపురినెమ్మిఁ గాంచి ప్రియమొందఁగ బంధములూడ్చి పట్టి యం
గకములు దువ్వి దానిమెడఁ గట్టినరజ్జువు గాంచి పీడ్చినన్
శకునిసమాకృతిం దొరఁగి చయ్యన భీమభటాభిధానుఁ డై
ప్రకటవినీతి మ్రొక్కుటయు రాసుతుఁ డద్భుతమోదమగ్నుఁ డై. ౧౮

వ. అత్యంతసంభ్రమంబునం బరిరంభణం బొనరించి యతనిపునఃపునఃప్రణా
మంబు లాదరించి సమీపంబున నునిచికొని కరంబు కరంబునం గీలించి
నీ కీరూపంబునకుం గారణం బేమి యని యడిగినఁ గరంబు వినయంబున
న(తండ)తని కి ట్లనియె. ౧౯

క. ఆపన్నగంబు కతనమున, నాపన్నత మిమ్ముఁ బాసి యలజడి నశనా
యాపీడ నొంది యుజ్జయి, నీపురముం జేరి మేను నెఱిచెడి తూలన్. ౨౦

సీ. ఏ నొకముసలియింటికి నరిగి నా కాహార మొసరింపు మనుడుఁ బ్రీతి
వెలయించి భోజనవేళయందాఁకను నది నన్ను శయనింపు మనిన శయ్య
నుండి చూచుచు నుండ నొకకొన్నియవలది ధరణిమీఁదటఁ జల్లెఁ దత్క్షణంబు
మొలచి గుబ్బన నేచి ఫలియింప సక్తువు గావించి యదియుఁ బాకంబుచేసి
యొక్కపాత్రంబులోపలనునిచిప్రాఁత, యవలఁబాకంబుగావించియదియునొక్క
కంచమునఁ బెట్టి యొకచీర గప్పి దొంతి, నునిచి యది నీరుదేరంగఁ జనియెనంత.

వ. అది కపటకృత్యంబుగా నెఱింగి. ౨౨

గీ. పాత్రముల సక్తువులు పోడుపడఁగఁ బెట్టి, యంబరం బది కప్పినయట్లు కప్పి
యేను శయనతలంబున మేను సేర్చి, కన్నుమూసినపోలిక నున్నయంత. ౨౩

వ. ఆజంత యరుగుదెంచి నేఁ జేసినవిధం బెఱుంగక యత్యంతరయంబున.

క. నా పేర నిర్ణయించిన, యాపాత్రము నాకుఁ బెట్టి యవ్వలిపాత్రన్
వేపుచ్చుకొని భుజించుచు, నాపాపపుజంత మేఁక యయ్యె నరుసుగన్.

వ. దానిం గనుంగొని నివ్వెఱఁగందుచు నాకుం బన్నినయురుల నీవ తగిలితే

యనుచు నవ్వుచు భుక్తోత్తరంబున నొక్కరజ్జువున దానికంఠంబు బంధించి తిగిచికొనుచు నొక్కసూనరిగృహంబునకుం జని జట్టి యిచ్చెద ననిన నతని భార్య యెఱింగి నాచెలియలి నిట్లు చేసితే కాని మ్మని జంకించిన వెఱచి యయ్యజంబు విడిచిపెట్టె దేవాలయంబునకుం జని నిద్రించితి నదియు నదియు వైరంబుగాఁ బాటించి నాచొప్పునం జనుదెంచి యేను మయూరం బగునట్లుగా నీత్రాడు మత్కంధరాంతరంబున బంధింపంబోలు నేనును బర్హిభావంబు నొంది బోయలచేతం బట్టువడి యిచ్చటికి వచ్చి దేవరచేపడి తిర్యగ్భావనిర్ముక్తుండనై భవదీయదర్శనంబునఁ గృతార్థుండనైతి నని పలికి యొక్కవిన్నపం బవధరింపు మని యిట్లనియె. ౨౬

సీ. వేగంబ యిచ్చట వెడలంగవలయుఁ గిరాతు లుద్ధతులు ద్వారమున వెడలి
పోవంగఁ గనుఁగొన్నఁ బొలియింతు రీత్రాటివలన మయూరభావములుదాల్చి
యీగవాక్షమ్మున నేగుద మని నృపతనయుకంఠమున నాత్రాడు గట్టె
నెమలియైయపుడురాకొమరుండు వెడలిత్రాడూడ్చియాతనిచేతి కొసఁగుటయును
నాగుణము కంఠమునఁ గట్ట నాక్షణంబ, తానుబర్హియైవెడలిరాసూనుచేత
బంధనిర్ముక్తుఁడై యాత్మభావ మొంది,కడురయంబున నాపల్లె వెడలి వచ్చి.

వ. తనమతమున కుల్లసిల్లుమహీనాథకుమారుండునుం దానును గానసమార్గంబున నరిగి యరిగి. ౨౭

చ. దళ మగుచీఁకటిం దెరువు దప్పి పదంబులు నొప్పిగూరినన్
సొలసి వనంబులోన నొకశుష్కమహీజముక్రింద నుండఁగా
లలితనిశాకిరాతమహిళాకచభారవిభాసితాబ్జినీ
దళమును బోలి తూర్పుదెసఁ దారకరా జుదయించె నత్తఱిన్. ౨౮

చ. నెలవొడువంగఁ జిత్రముగ నీరసభూరుహ మాకువెట్టి మొ
గ్గల విరిపూవులం దనరి కాచి ఫలించినఁ దత్ఫలావళుల్
దళముగ నారు మోదమునఁ దద్రస మానటఁ గ్రోలి దాన నాఁ
కలియును దప్పియుం దొలఁగఁగా ముద మందుచు నున్నయంతటన్ 30

గీ. ఆకుజము గుణాకరాఖ్యమిత్రుండగు,టయునునద్భుతంబుఁ బ్రియముఁ దనర
నర్థితోడ నప్పు డాలింగనము చేసి, యిట్టు లగుటకుఁ గత మేమి యనిన.

సీ. ఆపాముకినుకచే నంచఱఁ బెడఁబాసి యడవులలో మిన్నుఁ దడవి తడవి
యిచ్చోట నొక్కమునీశ్వరుండు సమాధి నుండు టెఱుంగక యురక నేను

బ్రణమిల్లి చెలులును రాసుతుండు నెచట నెబ్బంగినున్నవా రెఱుఁగఁ జెప్పు
మనుచుఁ గార్యార్థినై యుందండప్రార్థింప జపవిష్ణుమునకు నాతపసి కినిసి
వట్టితరువవు గమ్మన్న వంతనొంది, వేఁడుటయు నాదరించి నీవిభుఁడుఁ జెలియు
నిచ్చటికి రాఁగలరు వారి లేగుదేర, నెలమిఁబొందిఫలింతు వా రెలమినొండ.

క. దళముగ ఫలింప నీఫలములు రసముల వారు తృప్తిఁబొందుదు రంతన్
ఫలవృతాకృతి విడుచుచుఁ, జెలువంబుగ వారిఁగదిసి చెలఁగెద వనినన్.

వ. ఆక్షణంబ నీరసవృక్షంబ నైతి దేవర యిచ్చటికి విచ్చేయుకతంబున శాప
విముక్తుండనై తావకదర్శనంబున ధన్యుండ నైతి నిప్పు డప్పరమమునీంద్రుం
డెందేని యున్నవాఁ డనినం దద్దర్శనలాభప్రమోదతరంగితాంతరంగు లగు
చు నతండును దానును నొక్కపథంబున నరుగుసమయంబున, ౩౪

క. పాగలు దోడుగుక యొకయెల, నాగయుఁ దానును నభంబునం జనిజనిభూ
భాగంబున ముగురం* గని, వేగంబున నవతరించి వినతుం డైనన్.

—। చిత్రకరునివృత్తాంతము. ।—

వ. వీఁడె మనచిత్రకరుండు వచ్చె నిట్టిచిత్రంబునుం గలదె యని యుల్లంబున
నుల్లసిల్లుచు వానిం బరిపాటి నందఱుం బరిరంభణం బొనరింప నంగనయు
ముసుంగిడి తొలంగి యుండె నంతఁ దారొక్కయెడ నాసీనులై యున్నచోఁ
గమలాకరుండు చిత్రకరుని వదనంబునం జూక్కి నిలిపి నీ కీఖేచరత్వంబు
మహత్త్వంబు నెట్లు గలిగె నని యడిగిన- ౩౬

మ. అహికోషంబున నట్లు వాసి చని వింధ్యారణ్యమధ్యంబునన్
సహజస్ఫూర్జితతేజు లిద్ధ ఋషుల్ సత్త్వాఢ్యు లై కామిత
స్పృహఁ దర్శింపఁగ వారిఁజేరఁ జని గంభీరోక్తి వారించి దు
స్సహవాదంబున కెద్ది హేతు వనిన న్వాంత్యోరుసంరంభు లై. ౩౭

వ. ఒక్కపాత్రంబును నొక్కలాతంబును నొక్కపాగదోయినిం జూపి- ౩౮

శా. ఈపాత్రంబు నిరంతరేష్టఫలదం, బీయష్టి న్రాయంగ నే
రూపంబైనను నిక్కువంబ యగుఁ, జేరుం గోరుచో టన్నరుం
డీపాగ ల్దొడినప్డు, మత్పితృధనం బీవస్తువు ల్వీని కై
కోపంబారఁగఁ బోరఁగావలసె మాకుం బాలుపోకుండుటన్. ౩౯

క. అనుటయు నతిమత్సరతం, బెనఁగెడు వారలను గాడుపెట్టి పఱచి నై
కొనియెద నీవస్తువు లని, మనమున నూహించి చతుర(మతి) మేపారన్.

* మగుడంగని- శబ్దరత్నాకరము- ఉదాహరణము.

షోడశకుమారచరిత్రము.

క. ఇరువురు సంగడి విడువక, పరువునఁ జనుచోటఁ గడవఁబాఱెడువాఁ డీ
వరవస్తువులకు నొడయఁడు, సరభసగతి నరుగఁ డనిన సమ్మోదమొదవన్.

క. ఏ విడువఁగ సమస్తువులు, గావున నొండొరులఁ గడవఁగాఁ జాలక యా
దేవారులు దవ్వరిగిన, నావలఁ బాఱితి రని నెమ్మనమున నలరుచున్.

క. త్వరతో యష్టియుఁ బాత్రయుఁ,గరమునఁ గబళించి పాదుకలుదొడిగి యేనం
బరగతి...నాయుంజక, పురమున కరిగితిఁ గుమారపుంగవ వినుమా. ౮౩

క. అందొక్క వృద్ధకామిని, మందిరమున విడిసి తదభిమతధనములు పెం
పొందఁగ నిచ్చియు నప్పురి,యందొప్పెడుకాంత గలదె యనియడుగుటయున్.

ఉ. రత్నరథుండు దానసురరత్నము మాపురిరాజు తత్సుతన్
రత్నవతీసమాఖ్య హరిరత్ననిభాలకఁ బోలుకన్యకా
రత్నము లేదు లోకమున రాజితలీలల నెప్డునుండు నా
రత్నగృహంబునం దనుచు రాసుత యుండెడు మేడఁజూపినన్. ౮౪

వ. నాఁటినిశాసమయంబున మదీయపాదుకామహానుభావంబునఁ దదీయసౌ
ధంబునకుం జని రత్నకళికాలోకం బగుతదంతరంబున. ౮౫

క. తొంగలిఱెప్పల మెఱుఁగులు, తొంగలిగొనుమేనువదనతోయరుహంబున్
రంగారఁ దల్పమున న,య్యంగన నిద్రింపఁజూచి యాత్మగతమునన్.

క. నాఁగతి మున్ను నెఱుంగదు, నేఁగతి మెచ్చినపువాఁడ నీసతి నిద్రా
రాగము లగుచూపుల నను,రాగము వొడమునొ యమ్మ రాగ మొదవునో!

ఉ. అగ్గల మైనమోహమున నల్లన నేనొకయింతడాసినన్
దిగ్గన మేలుకాంచి సుదతీమణి వింతదనంబు లేక తా
నిగ్గులుమీఱు కన్నుఁగవ నెయ్యపుఁ జూపులు సందడింపఁగా
డగ్గఱునేని నాకు నిట డక్కు మనోభవరాజ్యసంపదల్. ౮౬

క. అనుచుండ సౌధపాలుఁడు, తనప్రియ కొకకథను జెప్పి తద్వేళకు నా
కనుకూలంబై కడునిం,పెనయంగా నొక్కపద్య మిట్లని చదివెన్.

ఉ. లాలితరూపయావనవిలాసమనోహర మైతనర్చు నీ
లాలక నిద్రవోవఁ గని యాదటఁ గౌఁగిట మేలుకన్పఁగాఁ
జాలక యాత్మఁ దక్కిన విచారములొందఁగ నూరకుండ నా
కూళఁడు కామరాజ్యమునకు న్వాలిగాఁడె తలంచిచూడఁగన్. ౮౭

క. అనుపలు కుపదేశముక్రియ, ఘనమోహము నిగుడఁజేయఁగ దిరెపఁతమకం
బునఁ గౌఁగిలించి యమ్మా, నిని మెలుపారంగ నేను నిద్ర దెలిపిసన్.

క. చంచలనేత్రము లమరఁగ, సంచలతయు సమ్మదంబు సంశయము మది
న్మించిన హస్తస్వస్తిక, కంచుకి యగునింతి యొప్పు గడుసలరింపన్.

ఉ. ఇచ్చ జనించువేళ్ల నొకయించుక వింతదనంబుసేయుమిన్
మచ్చికలేక యుండియును మచ్చిక లగ్గలమైన బాలికిం
బొచ్చెము లేని సౌఖ్యములఁ బొందితి మేము రహస్యవేళలం
బచ్చనివింటి దేవరప్రభావము భావములం గనంపదే! ౫౦

వ. ఇట్లయ్యింతియు నేనును నత్యంతమోహంబునం గంతుని గృతార్థుని
గావించి తదనంతరంబ- ౫౧

క. నావృత్తాంతముఁ బేరును, నావెలఁదికిఁ జెప్పి రాత్రి యంగనతోడన్
భావజుకేళిం దేలుచు, నావిడిదల దివసవర్తనంబు గడుపుదున్. ౫౨

ఉ. ఇప్పగిది న్రహస్యముగ నే నొనరింపఁగ బోటు లొక్కనాఁ
డప్పురుఁబోఁడి చన్నుఁగవ నంగజముద్రలు గాంచి రాజుతోఁ
జెప్పకయున్నఁ దప్పనుచు శీఘ్రమునం జని యేకతంబునం
జెప్పినఁ గూఁతులాగునకుఁ జిత్తములోపల వంతమీఱఁగన్. ౫౩

చ. తనసుతవర్తనంబు విదితంబుగ నారయఁ బ్రోడనొర్తుఁ బం
చిన నది యేగుదెంచి యొకచెంగట నుండి రతాంతవేళ మా
నినియును నేను మైమఱచి నిద్దురవోవఁగఁ జూచి ప్రోడలీ
ల నెఱయ నాదుచేలమున లత్తుకరేఖలు వ్రాసె నచ్చుగన్. ౫౪

క. అంబుజముఖి యిటు లడియా, ళంబులు గావించి చెప్ప లాతూంకసమే
తాంబరుఁ బురిఁ దడవుండు ర, యంబున నని రాజు భటచయంబుంబనిచెన్.

వ. ఆవృత్తాంతం బంతయు రాజసదనాంతర్వర్తినియగు నావృద్ధజంతచేత విని
యచ్చట నునికి యకార్యం బని నిశ్చయించి పాదుకాసమన్వితపాదుండనై
పాత్రయు లాతంబునుం గొని యాక్షణంబ కమలాక్షి యున్న సౌధంబున
కుర జని సకలంబు నెఱింగించి గమనోన్ముఖుండ నగుటయు నిన్నుం బాసి
నిమేషం బైనను బ్రాణంబులు నిర్వహింపనేర నీతోడన వచ్చెదఁ దోడు
కొని పొమ్మనిన నిమ్మగువం గరంబులం బొదివికొని గగనగమనంబున వచ్చి
వచ్చి యిచ్చట దేవరం గాంచి యానంద కంపళితభావుండ నగుచు నవ
తరించితి ననుచు విన్నవించి, ౬౦

గీ. భక్ష్యభోజ్యలేహ్యపానీయచోష్యముల్, సంకుమదపటీరచంద్రమృగమ
దములు పాత్రమహిమఁ దత్క్షణమాత్రన, వడసి నెచ్చెలులకుఁ బతికినొసఁగి.

వ. మఱియు నక్కుమారు నాలోకించి. ౬౨

క. నాయష్టిమహత్త్వంబున, నీయెడ దేవరకు నుండ నిరవుగ సకల
శ్రీయుత మైతగుపట్టణ, మాయతముగ వ్రాయునాఁడ నని యుత్సుకుఁడై.

సీ. మణిహేమవిస్తారమందిరప్రాకార సౌధదేవాలయసంచయములు
ఘనసత్త్వబంధురగంధర్వసింధురదుర్ధమసుభటసందోహాళములు
వరధరణీదేవవైశ్యశూద్రాదినానాజాతు లైనజనావళులును
నిరుపమలావణ్యసురుచిరగుణగణ్య పణ్యపుణ్యాంగనాప్రకరములును
సన్నుతగృహోపవనములు సర్వనిధులు, నెఱయ వ్రాసిన నన్నియునిక్కువంబు
లై త్రిలోకీపురీరాజ్య మనఁగఁదగిన, పట్టణమువొల్చెఁ గన్నులపండువగుచు.

వ. ఇట్లు చిత్రంబుగాఁ జిత్రకరుండు పురంబు నిర్మించి దానికిం జిత్రపురం బని
పేరిడి యందు రాజమందిరంబునఁ గమలాకరకుమారుని సింహాసనాసీనుం
గావించి తానును భీమభటుండును గరుణాకరుండును, సముచితప్రకారం
బులం గొలుచుచు మణికనకభాసురనివాసంబుల విశిష్టవిభవంబుల నుల్ల
సిల్లుచున్నంత. ౬౫

చ. చెలువుగ నొక్కలాతమునఁ జిత్రకరాఖ్యుఁడు పట్టణంబుగా
వలసినయట్టిరూపములు వ్రాయఁగ నన్నియు నిక్కువంబు లై
మలవడఁ దత్పురీరమణుఁడై కమలాకరుఁ డన్విభుండు భూ
వలయము నేలఁజొచ్చె ననువార్త జగంబుల నెల్ల నిర్వాసినన్. ౬౬

క. ఎసఁగిన యీవార్తలు విని, మసలక వేకదలి కాంతిమంతుండును బు
ద్ధిసహాయుండును మోదం, బెసఁగంగా నరిగి యానృపాగ్రణిఁ గనినన్.

క. ఆనెచ్చెలులం గని యా, స్థానంబున నున్నమంత్రితతియును దానున్
మానవపతి యెదురుగఁ జని, మే నలరం గౌఁగిలించి మించినవేడ్కన్.

వ. సింహాసనంబు చేరువ సముచితాసనాసీనులం గావించి హరివదనంబు లవ
లోకించి- ౬౯

గీ. మమ్ము బాసియరిగి ... ... ... దత్తుఁడనురాజుపురిఁ జేరి తత్తనూజుఁ
డగువిజయసేనుతోడ సఖ్యమ్ము చేసి, యుచితవృత్తిమైఁ దిరుగంగ నొక్కనాఁడు.

శ్రీరస్తు.

# సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణమ్.

శ్లో. అస్తి కల్పద్రుమః కోపి జాతరూపలతావృతః
వేఙ్కటగాద్రిశిఖారూఢః స్మరతాం పరమార్థదః.

## (1) సంజ్ఞాపరిచ్ఛేదః.

శ్రేయః ప్రమేయవిజ్ఞానమ్.

సిద్ధి ర్లోకతః- తదుపదేష్టా న్వేష్టవ్యః. ఆంధ్రభాషాసంబంధినీ సిద్ధి ర్లోకవ్యవహారా దవగంతవ్యా-తర్హి శాసన మిద మనారంభణీయ మిత్యాశఙ్క్యాహ శాసన మితి.

శాసన మిదం దిక్ప్రదర్శనమ్—అజ్ఞాతదిశం దేశం జిగమిషోః పాన్థస్య మార్గం పృచ్ఛతః పురుషేణ కేనచి దేవం యాహీతి హస్తనిర్దేశేన దిశో దర్శనవ దిదం శాసన మధిజిగమిషూణాం ప్రథమప్రవృత్తా వుపకారకం భవతీ త్యర్థః.

సంస్కృతప్రాకృతే ప్రకృతీ-కేడియము=ఖేటకము; బాడిగ=భాటకము; కడియము=కటకము; పడియము=పటకము; కన్నియ=కన్యక; వన్నియ=వర్ణకము; ఆడియ=అఖకము.

ఏషా వికృతిః

తత్సమా తద్భవా దేశ్యా చేతి త్రిధా.

అచ్ఛా సంస్కృతసమేతరా

పఞ్చాశత్ సంస్కృతస్య వర్ణాః

ప్రాకృతస్య కతిపయన్యూనాః

అత్ర ద్వివిధా అదిదు ర్వక్రావైచావచో బిన్దుయుగమ్

కగచజయుగటడణతదనపబమయరలవసహళాస్తు హలః

ఋగ్విసర్గయుజ్ఞఙశషా స్సంస్కృతసమయోగినః

కచటతపాః పరుషాః

గజడదబా స్సరళాః

ఉభయేఃకఃపాః

హలః పరే స్థిరాః

చుస్తాలవ్యే తాలవ్యః

అన్యత్ర దన్త్యః

అక్కజాదిషు. (కంచంత- కాచాకు-పచ్చాపక్విత్యాదీనా మక్కజాదిత్వా త్సాధుత్వ మవగన్తవ్యమ్)

రాజన్యవిభ(క్త్యాళేః)

ఇతో బహువచనే సంస్కృతసమస్యోపధా చోః-(ఇత ఉదన్తస్య ఉపధా తాలవ్యో తాలవ్యో నస్యాతామ్)

తౌ సవర్ణౌ-(దన్త్యతాలవ్యౌ సవర్ణౌ)

విభక్త్యాగమచార్థోనుద్రుతిః- (ఆగమవిభక్తికాన్తచార్థోనుద్రుతిః)

తదస్తం ప్రత్యప్రకృతికమ్
అన్యత్రలా
ఇతి బిన్దుః
నస్థిరపరః
డుజీటేః పూర్ణః
హ్రస్వా త్ఖిణ్ణస్యవా
ఇఙ్కాఙటుచుఙడుషు
పదాదే ర్నిత్యమ్
సర్వత్ర రలసంయోగే సమానపదే.
(రలసంయోగే ఇతికిమ్- మ్రాఙ్ను ఇత్యత్ర అతఏవ నపూర్ణః)
నదీర్ఘా త్సాధ్యః
అన్త్యాక్షరంటిః
అచఃప్రథమా త్సర్వసుజ్ఞం సమానపదే.
యణాలఘుః (లఘుశ్చ)
ఏజప్లితో హ్రస్వః
చితో హలో ద్వే
ఇత్యచి (జిత్యచి హలో ద్వే)
చితః ప్రథమస్య. (ప్రథమస్యకిం- పుడుచో డస్య మాభూత్, అప్పుడు)
సర్వత్ర సంయోగే సమానపదే-(ఎనమలొమ్మయో ర్నుకః పూర్ణబిన్దు ర్నిత్యం స్యా త్తూమా- ఎనమండుము, లొమ్మండుము.)
ఆశ్వాసాన్తే వివక్షితైకవిభక్త్య విశేషణై ర్మంగళం కుర్యాత్
తదుపర్యాడా విశేషాంత్తైః
అచః ప్రాణాః
ఏ జ్వక్రః
ఐ జ్వక్రతమః
హలః ప్రాణినః
చయః పరుషాః
జశ స్సరళాః
శేషాః స్థిరాః
నోద్రుతః
ఋౠవర్ణౌ రలతుల్యౌ
ప్రాసే బహుళమ్
పాదాద్యక్షరం వళిః
ద్వితీయం ప్రాసః
లగౌ గలౌ వహౌ
నహౌ సూర్యౌ
నలనగసలభరతా ఇన్ద్రాః
యాద్యాః ద్వికలాద్యా శ్చన్ద్రాః
వాదయశ్చ గణాః
ప్రత్యయో వర్ణకః
చుర్దవయో స్తాలవ్యః
అన్యత్ర దన్త్యః
అనుస్వారా ద్వర్ణకస్య టః (డిష్టః)
దోడో న్యతరస్యామ్
నవసతౌ- (నస్థానా ద్దోడో అన్యతరస్యామ్)
ధాతువ డన్యోపి.
మహాన్తోఽ స్త్రీతిర్యగ్జడాః
పేలపిండిప్రభృతిషు ములోపో దృశ్యతే.
కర్తృకర్మైకభ్య స్సుకృత్
నత్రిసంయోగః
ద్విపూర్వలోపధా ల్లోపః
బహువచన ఇతి వక్తవ్యమ్ (అన్యథాపాటలోపల నిత్యత్ర లత్వాపత్తిః-లోపలనిత్యస్యాత్ర సుప్త్వభావాత్.)

## (2) సన్ధిపరిచ్ఛేదః.

అచోఽయ డచః పరా దచి

ఉతోఽచి (ఉత స్పృష్టైః)

విభక్తే రప్రథమాయా బహుళమ్

చువర్ణకస్య

అతః

ఇతః కిమాదేః

ప్రథమోత్తమరిమోర్వా

నిత్యం మధ్యమస్య

న క్త్వః

క్త్వాపి సవర్ణే దృశ్యతే

అచో అపదాదా వసంద్వయకోః

ద్రుతలోపే

ఆమ్రేడితే ప్రాయః

ఆకో

కుత్వాదేః ఏ ష్టుచ్

నిట్రాడు నిట్రాయి చెయ్యాదేర్లోపః- పదాదావే వేష్యతే- వాయిండి- హాలి బహుళం-

ప్రథమామాత్రా త్పరుషాణాం బహుళం గసడదవాః

నాచ్ఛికాద్రసాసే సాంస్కృతికానామ్

జడసంబోధనకాకుభ్యో వా

సమాస ఇతి వక్తవ్యమ్- (అన్యథా కడు నలుకే త్యత్రాపి స్యాత్- నచ నుకా వ్యవధానాన్న భవతీతి వాచ్యమ్. స్వాజ్ఞస్య స్వవ్యవధాయకత్వాభావాత్)

వీచికాపత్రికాభ్యాం సర్వ ఋకో త్తరపదే.

పడుగొమ్ము లిత్యాదిషు న ప్రతిషేధః ఇతి వక్తవ్యమ్.

ఊరుంగాయేత్యాదిషు నుగపి దృశ్యతే.

నిత్యం ద్వన్ద్వే

దీర్ఘా ద్బహుళం

కొనుడే రనుప్రయుక్తస్య వా.

స్వతః ప్రకృతికా త్సరళాః

కన్యాదిభ్యోన్త్యలోపిభ్యః పరుషాణాం గజామతాః- (కజ్నెదరె ఇతివా కనె దరె ఇతి వేతి సన్దేహః)

తేషు ద్రుతస్య బిన్దు ర్బహుళమ్

ఖో ఘో న్వాత్

నాచి

ఉతః సుపో వా

సువర్ణకే అనాదేః- మేనోః క్త్వాపి. (పూంబోండి)

నిత్యం సమాసే

న సోదరాదిషు-(ననుకి సోదరాదిషు)

షుయి ద్రుతస్య పూర్ణబిన్దు రన్యతరస్యామ్

సచయ శ్చరి వికృతిః

ఊద్ధృతో రందా నుగ్నిత్యమ్

ముక్కుకో ర్వా

నపదాద్ర్హస్వా త్ఖణ్డాలోపా

వికృతిశ్చ పరుషాణాం ఖరి

ద్రుత స్యాచో వా లోపః

నిత్యం సమాసే

ద్రుతాత్

మధ్యమమో ర్వా

నాచి

కువర్ణకాద్వా

సర్వత్రామ్రేడితేముజః-(నిచ్చనిచ్చలు, సారెసారెకు, తేపతేపకు, వారివారికి, వారివారిచేత, తమతమవలన, తడవతడవకు, ఇత్యాదిదర్శనాన్నాన్తః ఇత్యేవన్యాసః కర్తవ్యః)
కేషాంచి ట్టేః
సుపః
కడాదే రంగస్య టచ్
త్రోష్ట్వాదే ర్లోపః- తోద్రోపు, రారాపు, రారాపిడి.
హ్రస్వో ద్విర్వచనే హల్యాచ్ఛికస్య నిత్యమ్
చః పరసవర్ణః
అనుకృతౌ విసర్గస్య లోపః
హలో ద్వే
దీర్ఘా ద్బహుళమ్
మః
ఓన్నమసో అతః
వువిషయస్య నిత్యం వుక్
నాసన్ధి ర్వాక్యవిరామే దోష ఇత్యాద్యాః
నుక్ప్రత్ట్విభక్తౌ
నిత్య ముద్వృత్తోః
జికిషష్ఠ్యో రచి సమాసే- (కొమ్ముకొనేత్యాదిదర్శనా ద్విధి రయం ప్రాయికశ్చ వక్తవ్యః)
హల్యస్మిన్నపి దృశ్యతే
కొమ్ముకోనేత్యాది దర్శనా దస్య క్వాప్యప్రవృత్తిః
అత ఉకసుమస్య
చిఱుతాదా ట్టోపః
పోతౌ తద్ధితే
నఖరి పరుషాణాం వికారః
నస్వత్వం గురువిరామబంధాన్తే
ఏకపదేచ
లటిః
ముక్కుకో రన్తా దేకవచనే నేతి వక్తవ్యమ్
పత్యాదా వనుబిన్దౌ పూర్ణబిన్దు ర్బహుళమ్
పొదరిల్లు, బొక్కరిల్లు, వాలురమ్ము, పాంపరమ్ము- ఇతి నిపాతసూత్రమ్. కొని పోవోః కొంపోవుః, విజయముచే యోర్వేంచేయుః- (ఆగమనే) కర్మణిపత్యర్థేషుయుచః పూర్ణబిన్దుర్వా.
నాచః
మృతౌ న్నిత్యమ్
అదన్తానాం నిత్య ముండ్వాదయః
ప్రాంతాదే రుత్తరపదే బహుళమ్- (ప్రాంత, లేంత, క్రేవ, పూవు, ఆవు) తథా స్యాస్మిన్నితి ప్రయోగతో వేద్యః-సూత్ర మిదం ప్రత్యాఖ్యాయ గణసూత్రం కర్తవ్యమ్.
శేషస్య క్రిందోః క్రి నిత్యమ్
సంగోర్వాదయః-(ముంగాలు, ముంజేయి, ముంగొంగు, ముంగురులు, ముందల)
కెంధూళి కెంజడ పూంబోండి
ము క్పరుషేషు
కుతశ్చి ద్ధలో ద్వే
నవాన్తా త్తార్వాదిషు
హ్రస్వోద్విర్వచనే హల్యాచ్ఛికస్య

చో హలి పరసవర్ణః
యస్యాపిదృశ్యతే డప్పి (డుజి)
ద్రుతస్యాపి లోపో న్యతరస్యామ్.
శేష స్యాంగలోపే అవిశిష్టస్య.
ఋతః షష్ఠ్యా ను ము శ్వరపదే.
ఉతః......

## (3) అజన్తః పరిచ్ఛేదః.

మహాన్తో స్త్రీతిర్యగ్జడాః
తద్విశేషణాని-(అమహద్వ త్త్రిశాచా
ద్యా గ్రహాభూతగణాస్సదా। క్లీబా
మిత్రాదయః పుంవ ద్విభాషా మ
హదర్థకాః)
క్వాపి వ్యత్యయోపి దృశ్యతే
మిత్రాద్యాః క్లీబాః పువద్వా
డుమధ్యతో డ్డుజిః
జితి బిన్దుః
డుముపులవ స్సుసః
అసో నుః
చేతతోడా టాసః
కువర్ణకోయినాసహా కయిాత్యుదీరితో
బుద్ధిః-(అయంతావ న్న సమ్మతః-
తథా నహీష్యతే సతా-అయినాస
హాకోః కయిరితినిర్దేశః-అత ఏవ త
త్రసర్వాంశమాత్రస్య వశిత్వమూరీ
క్రియతే- సంఘాతగ్రహణఫలంతు
నకో నివృత్తిరితి ధ్యేయమ్)
కొఱకు కయి జేసః
వలన కంటె పట్టయో జసిసః
కు యొక్క లోపల జసుః
అందు నా జిపః-(అందుక్-జిపః.)

నుక్ టాపః-(టాబాదేశస్య నుగాగ
మస్య స్యాత్)
ఉవృతోరందా
నుక్వాకో ర్వా
న కయి పట్టి యొక్కానామ్
చేతతోడ లోపలానా మజ్ఞస్య లోపః.
ఏకవచనస్య డుమతో వానిః-(ఏక ఇ
త్యనుక్తే లటాసహితాదపిస్యాత్-
స్వాంగస్య స్వవ్యవధాయకత్వాభా
వాత్)
క. దనుజులయాపుల వరుణుడు, దన
దిక్కున నునిచినాడు. తత్కార్య
ముకై, మనకుం. భోవలె నిద్దెస,
కనఘా చనదీరు నేని యనుగు మ
చటికిన్.
ఏః కునువృక్రియాణామ్ (ఏః కునువృ
నా మయుష్మదః)
ఇతోడుజిః నాదేశోనుమత్వః
దీర్ఘస్య నామ్నో హ్రస్వః
వృథాయా వా
నపదా ద్యేకాచః
లు జసః
శసాదే ర్బహువచనస్య లట్
ఉతో జడా దేకత్వేనః

జడా దుత్తోందో ర్ణః
న మా మీ తమభ్యః.
మన మేమో ర్వా- (మనలు..వశానుల రుధిరం బిడి)
తస్యకా్వపి నగందా
షష్ఠీ సమాసే
నిత్యముదృతోః కౌ
డుజతో నిగ్నగా వేకవచనే
ఊదృతో ర్వా
మహతః పుంసి డుజ్
సోరితి పూరణీయమ్
అత ఉః
దీర్ఘపూర్వలోపధ్వా త్పుపో లోర్ధః.
అమహాత్ క్లీబాభ్యాం సోర్ణుః
ముగసో వా
మోర్ణ్వుబో (మోః-న్ల-ంబొవా)
చరితాదిభ్యో బహుళం లోపః.
అనుపసర్జనస్య
స్త్రియాః
ఇగ్లారాయుగ్భ్యసోనిః-(ఇగ్లారైయుగ్భ్యః సోనిః ఇతి వక్తవ్యమ్-ఉత్సృష్టానుబంధస్య చ కేవలస్య చ ఉగిత్వేన సంగ్రహాత్)
వృద్ధాదే ర్డుజో వా
సాపోక్తతః సంస్కృతాత్ప్రబుద్ధేరత్.
అనుపసర్జనస్య
ఆతః క్వాపి సంజ్ఞాయామ్ (ఆరగ్వపి)
భృశాదే ర్ణుః వా
కుత్రచి దాద్యబహువచనవ్యక కయోః.
నిత్యం సురాభూమ్ని స్వర్గిషు.
స్త్రీవ దసిద్ధసమాసే
అసురో వా

సర్వత్ర దూతాదయః
మహాత్త్వే బహుళమ్
కంధరాదయః క్లీబవత్
బహువచనే నిత్య మిత ఉః
ఆచ్ఛిక స్యోపోత్తమస్య చేతః
నరలఢోపధాష్టాఢ్యాదీనామ్
ఓర్గోరుః
ఉగ్బహుళ మసోః
వురో ర్మహాత్తః
మహాతో వుః
గోర్నిత్యమ్ (తౌగోర్నిత్యం)
జస్వాదే ర్వోర్లోపః- జస్వాదేర్వో ర్వా లోపః
క్వా ప్యాచ్ఛికస్య వుః
భువో భువః (క్షితౌ నిత్యమ్)
కద్రావః ఉవ ఙాగమాంతరి
ఋతో డః
విధాత్రాదే ర్వా
ఈవర్ణైః
అస్త్రీవిషయశ్చ ఋతో డః-(ఋకారాన్తస్య ప్రాతిపదికస్య డ ప్రత్యయస్యాస్య తు స్త్రీప్రత్యయవిషయస్య-స్త్రియామేవ తస్య స్త్రీప్రత్యయ విషయత్వే న స్త్రియాం నస్యాదిత్యర్థః)
కర్త్రాదేరత ఉః
తస్య గోవ ద్వ్యర్థా
వర్గాదే ర్వా
రైగ్లావో ర్దోర్వా
నావో నావః
ఉత స్సంబుద్ధే. రః
అదితో రామ స్త్రియాం ద్విపా

దూరాద్ధూతే ప్లుతః
మహాదుత్తో ప్లుతాత్
నిత్య మారగ్నిసః
మధ్యమయోగే వా
నగారోః
అనుప్రయుక్తస్య లారకో లోపః
హలన్తం స్వన్తం ప్రాతిపదికమ్
అస్వన్త మస్వన్తతుల్యమ్
అకస్సర్వనామస్థానమ్
ఇక్చ-(యద్వా అగికా సర్వనామస్థానమ్)
ఝుఘ్లిలః
దీర్ఘాజ్జిద్వా
మతుపం
ఋత్విగాదే రస్
విద్వదాదిమతుపో ర్నిత్యమ్
హృద్విపో ర్విద్వదాదిత్వం వక్తవ్యమ్
స్త్రీప్రత్యయవిషయస్య స్త్రీయాంవా- స్త్రీప్రత్యయం యథానుశాసనమ్- విశేష్యనిఘ్నశ్చ-పుంస్యమహాత్తో మహాత్యాం స్త్రీప దాలుః-క్వచిధ స్యాప్యపి-పేదాదేః- నిత్యమకః-బల్లిదాదేః- బాహుళకాన్నుమస్య నిత్యం-మనుమరాలు-భీర్వాదిభ్యః.
దేవశర్మాదే రనుపసర్జనస్య డః
మహాతో భగవదాదే రానఙ్వా
ఆత్మేమనిచోః
పురోధసః
నిత్యం యువాదేః
వేధసః- (అనుపసర్జనస్యకిం- పోషితదేవశర్ముండు, మహాత్ముఁడు, మహామహిముఁడు-అక్రోధనపురోధుండు, ఆరాధితపురోధసుఁడు, ప్రాప్తయువుండు, తోషితవేధసుండు, తోషితవేధుండు)
స్త్రీపద్వః-పుంసి మహాతో బ్రహ్మాణః.
ప్రకృతి మప్రయుక్తమ్
ప్రకృతిద్వితయమ్
స్త్రీయాం బల్లిదాద్యదన్తానా మాలు రనుప్రయుజ్యతే- ఇహాల్భ్యాం చుక్పుకో రుట్- ఆలా వనుప్రయుక్తే.
రాజ్ఞ ఉఙ్
జగదింద్రజితో ర్లోపో వా
అపయఃప్రభృతే స్సః
నిత్య ముపసర్జనస్య
అత్ర మహాతోనుపసర్జనస్య
అప్సరసామ్
హృద్విపో ఠక్- (హృద్విపోః-హృది డివి ఇతిన్యాసః కర్తవ్యః)
నభవదాదే రత్రయోగః
స్త్రీవత్ జీత్

—( అచ్ఛికాః. )—

అచ్ఛికా బహవః స్త్రీసమాః
కేచన క్లీబసమాః
బల్లిదాదయః సంస్కృతతుల్యాః
తుకసాని ర్డుజ్ (మహాతో డుజ్ జీటసమాసః అహామతోముక్)
ఈకాభ్యాం తద్ధితాభ్యామ్- నిత్యాం తద్ధితే- పన్నెకాఁడు, చిన్నెలాఁడి, తద్ధితే కిం, గిన్నియయందు, అన్నెలరిమ.
మహాతశ్చ మగాదేః
క్వాప్యమహాతః

ఇయస్య పర్నామ్నః (ఇయస్య నామ్నః
  శేః బహుళగ్రహణం కర్తవ్యమ్)
నసన్ధి యాదేః
నిత్యం తద్ధితే
ఎడో తేర్లోపః
మాంతో సో నిరుః
కలన్యాదే ష్టేః కుక్
రేనుగోన్వో ర్గుజ్
నిత్యం సమాసే
తో బహువచనే
లుక్వన్యాదేః
జామ్యాదే ర్వా
మాడాదే రతః
డలటరా ముతః
కో టేః-(రోట్టిః)
లడోరద్వియుక్తయో రలఘు ర్లః
అస్యమహతో డ్యక్ మగాదేః
తదేతదో ర్వా
షిత స్తద్ధితస్య
బంధు శ్వశ్రువాచినో ర్యుకః
నిత్యం లః
డో బహువచనశ్లిష్టస్య
నళో ల్లోడో లలస్య రలోః
అస్యడు మహతో డ్యక్
తదేతదో ర్నిత్యమ్
టేడు ర్నిత్యమ్
అమహతః కాషః (గిజిగాడు
లోరాల్యాదే ర్ద్వః
ఉపవిభక్తే స్సలోరుణ్వా
డోపవిభక్తిసలో డుణ్వా
లేః
హ్వానిత్యం లోరః

పగతాదేర్మహతః
పగాత్తుషాత్ రటోతోవా
మహత స్సర్వనామ్నః
కాదలఘుః
అనాగమా త్తాషః-(అనాగమాత్తాషః
  నిత్య మలఘుః-అతః చూపఱు)
చయోర్వా
అత స్తద్ధితాత్ -(వేటకాఱు)
క్వాపిహలో రలయో రుల్లుకౌ )క్వాపి
  వ్యంజనా ద్రలయో రుల్లుకౌ)
రాగమా న్నిత్యం రోలః

## —। సర్వనామాని ।—

అన్నిప్రభృతిసంఖ్యా స్సర్వనామాని
తదాద్యా స్త్రయ స్త్రికః
త్రికస్య తచ్ఛబ్దోను ప్రవిశ్య తే సుపి
ఇత ఏకవ దమహతః (ఇ దేకవ
  దమహత్వే)
సంఖ్యాయా అస్యార్థబాహుళ్యే (అ
  స్యార్థబాహుళ్యే సంఖ్యా)
నిర్గుటౌ ద్వితీయాదౌ
దు దేకవచనే
దాన దీన దేన ఇతి రూపాణాం కిం
మానం ప్రణేతవ్యమ్
నిలో ఉణ్ణావ్యతరస్యా మజౌ
మహతోపి జిషః
అనాగమా ద్రటో నిత్యం రిః (అసం
  యుక్తరటో నిత్య మిః)
తదేతదో ర్బహువచనే రః
నిత్యం వు ట్సుపి
తే స్తకూ్వజాయా మేకవచనే
ముగ్గురికి నలుగురి కిటి

కొంచెపుబుద్ధులు మానుము, వంచన కపటంబు విడిచి వనజదళాక్షున్
ఉంచుము చిత్తములోపల, నెంచిన మదిమెఱుకగన్న యినకులకన్నా.
మనసును బ్రాణము నొక్కటఁ, బనుపడి భ్రూమధ్యమందుఁ బరిణతమైనం
గనవగు నంతట బ్రహ్మం, బెనయఁగ మది నెఱుకగన్న యెఱగుడికన్నా.
కనుదృష్టి లక్ష్యమందున, నెనయించినఁ గాని లేద యెఱుకయు సుఖమున్
వినినంత బ్రహ్మమౌనా, యెనయఁగ మది నెఱుకగన్న యినకులకన్నా.
అది యిది యనియెడి దృశ్యము, లొదవక నిదమాదివృత్తిలో వెలిఁగెడిస
చ్చిదమృతనిర్మలగగనం, బిది యనరా యెఱుకగన్న యెఱగుడికన్నా. ౪౪
కదలక యుండెడి పదమున, సదమలమతి మనసు నిలిపి శాంతాత్ముఁడవై
కుదురొంది బ్రహ్మతత్త్వం, బిది యనరా యెఱుకగన్న యెఱగుడికన్నా. ౪౫
మది నాత్మతత్త్వమెఱుఁగుచు, సదమలచిత్తమున బహుళసంకల్పముల
న్మద మణఁచి సచ్చిదమృతం, బిదియనరా యెఱుకగన్న యెఱగుడికన్నా.
మదమత్సరాదు లుడుపుచు, వదలని గురుపాదభక్తివాంఛాభిరతిం
బొదలుచు సచ్చిద్రూపం, బిది యనరా యెఱుకగన్న యెఱగుడికన్నా.
మచ్చికమాయల సతతము, ముచ్చటగా నున్నచింత మొనయక నీవున్
అచ్చుపడ గురుని గనుటది, హెచ్చుటరా యెఱుకగన్న యెఱుగుడికన్నా.
కంతుకము క్రియను సతతము, గంతులు వేయుచును దిరుగు కఠినపుఁ జిత్తం
బంతయు నణఁచినయప్పుడె, యెంతైనను సుఖమటన్న యెఱగుడికన్నా.
సంచితము తెగును నిలువదు, నుంచిన లక్ష్యంబుమీఁద నుపరతి గన్నన్
మించొకటి కానఁబడు జగ, మెంచఁగ మదియెఱుకగన్న యెఱగుడికన్నా.
గంగకు యమునకు సందున, సంగతిగాఁ ద్రోవ గనిన సమరస మారా
తంగైన బ్రహ్మపదమున, నింగితమా నెఱుకగన్న యెఱగుడికన్నా. ౫౧
బిందువు నాదముఁ గళయునుఁ, బొందుగ సరికూర్చినపుడె పొసఁగును జిత్తం
బందుకొను బ్రహ్మబోధం, బిందున మఱియెఱుకగన్న యినకులకన్నా. ౫౨
వింటివి నాదము గ్రక్కున, నుంటివి చిత్సౌఖ్యమందు నుపరతితోడన్
అంటివి బ్రహ్మము నేనని, యింటన్నటియెఱుకగన్న యినకులకన్నా. ౫౩
యమునను నుండెడిచిత్తముఁ, గ్రమమున గంగకును దార్చి కైవల్యముతో
నమన్స్తం బొనరించుచు, నమలం బగునెఱుకగన్న యఱగుడికన్నా. ౫౪

గంగను నుండెడి చిత్తము, సంగతిగా వాణియందు సమరసమై ని
స్సంగత బ్రహ్మము తా నగు, నింగితముగ నెఱుకగన్న యెఱుగుడికన్నా.
గంగను యమునను సతతము, రంగుగ విహరింపుచున్న రమణిని వేగ౯
శృంగాటము నెక్కించిన, నింగితముగ నాదమన్న యెఱుగుడికన్నా. ౫౬
బిందువు నొందిన చిత్తము, నందుకు నూర్ధ్వంబుగాను నమరిన ప్రభతోఁ
బొందించి బయలు గనుచుం, దిందిరతో నెఱుకగన్న యెఱుగుడికన్నా. ౫౭
బిందువుఁ గనుఁగొనినంతనె, యందుకొనుం దిన్నగానె యాపోజ్యోత్యా
పొందున బయలగు విశ్వ, మ్మిందిరకృప నెఱుకగన్న యెఱుగుడికన్నా. ౫౮
కోటరముఁ దూటి వేగమె, పాటిల్లుచు నున్న కన్యభావము గనియా
మేటగు నానందం బను, నేట న్విహరింపు మన్న యినకులకన్నా. ౫౯
చిత్తము నిలుచుట యరుదా, యిత్తఱిఁ జర మచర మెల్ల నీశ్వరుగానే
బత్తిని నత్తిన చిత్తం, బెత్తఱిరా యెఱుగకన్న యినకులకన్నా. ౬౦
దృశ్యము దర్శన మొకటై, నశ్వర మగునిహము మఱచి నాదము గనుచే
వశ్యము సహజానందం, బీశ్వరకృప నెఱుకగన్న యినకులకన్నా. ౬౧
చూపును మనసును నొకటై, ప్రాపించినయంతలోన ఫాలాగ్రమునం
బ్రాపగు ప్రభ కనఁబడునా, యేపున మది యెఱుకగన్న యినకులకన్నా.
అష్టాంగపూజ చేసిన, శిష్టత నీమనసు నిలిచి శివపద మొందు
న్నష్ట మగు దృశ్య మత్తఱి, నిష్టముగా నెఱుకగన్న యినకులకన్నా. ౬౩
మూలపుబంధము నీవును, జాలఁగ బంధించితేని సమరస మారా
మేలగు చిత్తము నంతట, నీలీలను నెఱుకగన్న యినకులకన్నా. ౬౪
శృంగాటమందు సతతము, రంగుగ విహరింపుచున్న రమణిని నీవు౯
సంగతిఁ బొందుట యరుదా, యింగితముగ నెఱుకగన్న యినకులకన్నా.
చూపులు రెండును నొకటై, ప్రాపించిన లక్ష్యమందుఁ బ్రజఁ గనవచ్చు౯
ఏపున నంతట బయలౌ, నీపగిదిని నెఱుకగన్న యినకులకన్నా. ౬౬
కోపము నుబ్బును గర్వము, నేపున దిగనాడి నంత నిం పొనరించుం
దాపసవృత్తికి సహజం, బీపనుపున నెఱుకగన్న యినకులకన్నా. ౬౭
బిందువు నేత్రముమధ్యను, బొందుగఁ గూడుండుసట్టి పోఁడిమి గని యా
పొందునఁ జిత్తము నిల్పిన, నిందిర నీ కబ్బు రన్న యినకులకన్నా. ౬౮

తా నని యెఱిఁగిన యెఱుకే, తా నని మది నిల్పనేని తలఁపుడిగి తగం
దా నగుఁ బరమానందం, బే నని మది యెఱుకగన్న యినకులకన్నా. ౭౯
గురువాక్యము సత్యంబుగ, నిరవొందఁగ నిల్పనేని యిందిర తనకుం
గరుణించి ముక్తిత్రోవను, నెఱిఁగించుర యెఱుకగన్న యినకులకన్నా. ౮౦
చిత్తము ప్రీతులు మఱచిన, నత్తుకొనుం దిన్నగాను యానందము, తా
నత్తఱి మఱపగు జగమిా, యెత్తున మదియెఱుకగన్న యినకులకన్నా.
మరిగినవిషయము లుడిగిన, నిరవొందఁగ బ్రహ్మబోధ నెఱుఁగఁగవచ్చున్
గుఱిగని విడువుము దానిని, నెఱిఁగినమది యెఱుకగన్న యినకులకన్నా.
వాయువు చలనము వాసన, వాయక యది కూడె నేని వ్యాపగు మన సా
చాయను గనఁబడు విశ్వము, నీయనువున యెఱుకగన్న యినకులకన్నా.
దేహంబు కీడుమేల్లను, దేహికిఁ వ్యాపించి యుండు దేహముతోడ
న్నోహము దిగవిడిచిన య, ద్దేహంబును జెందునన్న ధేయని కన్నా. ౮౪
తన్నెఱుఁగు నెఱుక బ్రహ్మము, పన్నుగ నాయెఱుకఁ దెల్పు ప్రభుఁడే గురుఁడౌ
మిన్నగ వారిపదంబుల, నెన్నుచు మది యెఱుకగన్న యినకులకన్నా. ౮౫
నిరతంబు బ్రహ్మపదమునఁ, జరియించెడి యోగివరునిఁ జేరున్ జగమున్
మఱవక బ్రహ్మము తానౌ, నిరవొందఁగ నెఱుకగన్న యినకులకన్నా.
జీవత్వ మొందినప్పుడె, భావింపఁగ దేహబాధ పాయకయుండున్
జీవుఁడు సంవిద్రూపము, భావించిన లేవురన్న భవములు కన్నా. ౮౭
జీవుఁడు చేసినకర్మము, భావింపఁగ దేహమగుచు భంగము నొందున్
జీవత్వ ముడిగి బ్రహ్మము, నీవై విహరింపు మన్న నిజముగఁ గన్నా. ౮౮
జీవుఁడు జగమున మరిగిన, వేవేగమె దేహమెత్తి విహరించునయా
జీవుఁడు తత్త్వముఁ జెందిన, నావెరవున బ్రహ్మమన్న యఱుగుడికన్నా. ౮౯
మారుతము మనసు నొకమై, సారెకుఁ గూడుండెనేని సమరస మొప్పం
జేరును బ్రహ్మపదంబున, నీరీతిని నెఱుకగన్న యినకులకన్నా. ౯౦
అంతర్లక్ష్యమునందున, మంతనతోఁ గూడి నీవు మార్గము గనినన్
సంతతము బ్రహ్మబోధం, బింతేరా యెఱుకగన్న యినకులకన్నా. ౯౧
నాసికముకొనను జిత్తశ, భాసిల్లును నందు నీదు భావము కుదురై
యాసచెడి నిల్చినంత న, దే సుఖముర యెఱుకగన్న యినకులకన్నా. ౯౨

అన్నమయప్రాణమై తగుఁ, జెన్నుగఁ బ్రాణంబువలనఁ జెలఁగును మనసా
పన్నత జ్ఞానం బేకత, మెన్నఁగ నానంద మన్న యినకులకన్నా. ౮౩
నాసికముతుదను జూ్పులు, వేసారక నిల్పనేని వేగమె కళకుఁ
డాసును జిత్తం బంతట, నీసున మది యెఱుకగన్న యినకులకన్నా. ౮౪
స్థూలము కనుగ్రుడ్డనఁదగు, లాలితముగ నందునాడు లలనయె సూక్ష్మం
బాలోఁగారణ మాంపై, ప్రేలెడికళ పురుషుఁ డన్న వినరా కన్నా. ౮౫
ఇంద్రియవృత్తులు మనసే, సందడిపడకుండ నిలిపి సమరస మొప్పం
బొందించుఁ దత్త్వమందున, నిందిరకృపయెఱుకగన్న యినకులకన్నా. ౮౬
వృత్తులు బన్నిన మనసగుఁ, బొత్తుగ నొకచోటఁ గూడి పొసఁగిన నెఱుకౌ
నిత్తెము దానిని నెఱిఁగిన, యత్తఱి నది బ్రహ్మ మన్న యఱుగుడికన్నా.
కొందల మందఁగ నేటికి, సందేహము వీడి నంత సమరస మొప్పం
బొందును జిత్పద మందున, నిందిర నీ కబ్బురన్న యినకులకన్నా. ౮౮
సందేహ మేల వినుమా, పొందుగ నిన్నాళ్లఁ గూడి పొసఁగిన సుఖముం
జెందక విడువుమ యంతట, నిందిరకృప గలుగునన్న యినకులకన్నా. ౮౯
ఎఱిఁగినపురుషుం డంతటఁ, దిరముగ మఱి యింటనున్నఁ దిరుగుచు నున్నం
బరతత్త్వంబునఁ జిత్తం, బిరవొందఁగ నిల్పురన్న యినకులకన్నా. ౯౦
తనువెల్ల వెదక నేటికి, గనుపాపలనున్నరూపు గనుఁగొనినంత
న్వినవన్న బ్రహ్మబోధం, బెనయించుర యెఱుకగన్న యినకుల కన్నా.
మాయపుజగమున సుఖ మని, యేయెడ విహరించుచున్న నింపొదవదయా
చేయుము గురుపదసేవను, నేయనువున నెఱుకగన్న యినకుల కన్నా.
తనువునఁ బుట్టిన మన మది, కనుఁగొని యది యణఁచి నీవు కాలాంతకునిం
గనుసన్న నెఱుఁగ ముక్తిర, యెనయఁగ మది నెఱుకగన్న యినకులకన్నా
ఇంతని విడిచినయంతనె, సంతోషముతోడ మనసు సమరస మౌ నా
చింతలు వీడిన ఫల మిది, యెంతైనను నెఱుకగన్న యినకుల కన్నా. ౯౪
గంతులు వేయుచు సతతము, నింతులపొంతలను జేర నింపొదవదయా
సంతతము గురునిఁ గనఁదగు, నెంతైనను నెఱుకగన్న యినకులకన్నా.
ఇంద్రియవృత్తులు తానేఁ, సందడిపడకుండ నిల్పి సమరస మొప్పన్
అందెడి తేజము తానే, యిందున మది నెఱుకగన్న యినకులకన్నా. ౯౬

అంతయుఁ దా నని యుండుమ, యంతకు మది నిల్వదేని నంతకు వెలియై
సంతోషమంది నిల్చిన, నంతేరా యెఱుకగన్న యఱుగుడికన్నా. ౯౭
జగమును బ్రహ్మము నందున, జగమందున బ్రహ్మ ముండుఁ జెందదు వానిన్
వగవక కనుమీ నీమది, నగణితముగ నెఱుకగన్న యఱుగుడికన్నా. ౯౮
కాయము నమ్మినయంతనె, మాయకు హిత వగుచుఁ జాల మమతలు గలుగుం
గోయుమి యరిషడ్వర్గం, బీయనువున నెఱుకగన్న యినకులకన్నా ౯౯
కనవలె విశ్వము మన మని, కొనవలె గురుపూజ సేసి కోమలపదముల్
మనవలెఁ జిత్పదమందున, నెనయఁగ మదినెఱుకగన్న యినకులకన్నా.
చిత్తము చిత్కళయందునఁ, బొత్తుగఁ గూడుండెనేని బొలఁతుకకృపచే
నత్తరి సంశయ మంతట, నెత్తుర యిది యెఱుకగన్న యినకులకన్నా.
యోగము వల్లనె చిత్తము, వేగమె కుదురొంది జ్ఞానవిభవముఁ గనురా
బాగుగ నంతయుఁ దానౌ, నీగతి మతి నెఱుకగన్న యెఱుగుడికన్నా.
కర్మము గతియే సత్యము, నిర్మల మగునీదుబుద్ధి నిరతము దానిన్
అర్మిలి బెనఁగుచుఁ దిరుగును, మర్మము దైవంబుదాని మనుపురకన్నా.
కర్మమునఁ బుట్టి జీవుఁడు, కర్మము తనతోడుగాఁగఁ గాలము పుచ్చుం
గర్మవిహీనం బైనను, కర్మలమగు యోగమందు నిల్పురకన్నా. ౧౦౪
కర్మంబు నిండి యుండఁగ, నిర్మల మగుబోధనొంది నిలుకడఁగను నా
కర్మము విఫలం బైనను, మర్మము గని జ్ఞానసిద్ధి మనురా కన్నా. ౧౦౫
మనసు తిరంబుగ నిల్చినఁ, దనువెల్లను జ్ఞానమయము తలఁగక నిల్చుం
గనుసన్న నీవుగనుమీ, యెనయఁగ మది నెఱుకగన్న యినకులకన్నా ౧౦౬
విశ్వం బంతయుఁ జిత్కళ, నశ్వర మగురూప మొంది నయ మెఱుఁగరయా
శాశ్వతపరమానందం, బీశ్వరకృప నెఱుకగన్న యినకులకన్నా. ౧౦౭
కరువలిఁ జూడఁగ బ్రహ్మం, బిరవొందఁగఁ గానిపించి యింపొనరించున్
మఱువక దానినిబొందుట, యెఱుఁగురమది నెఱుకగన్న యినకులకన్నా ౧౦౮
దేహం బంతయుఁ జిత్కళ, యూహింపుము మనసునిలిపి యుపరతి గనినన్
మోహము చెడికనఁబడురా, సోహంబని యెఱుకగన్న సొంపునఁగన్నా ౧౦౯
మనసున వృత్తులు నిలిపెడి, యనువున్నది వినుము నీవు ననవరతంబుం
గనుఁగొని చిత్కళ యంతట, నెనయించిననిల్చురన్న యినకులకన్నా. ౧౧౦

కర్మము చక్కన యైన, న్నిర్మలముగ యోగసిద్ధి నిరతము గల్గుం
గర్మము వితథం బైనన, కర్మము పొంతనె ఫలంబు గలుగుర కన్నా. ౧౧౦

బిందువు నాదము దేహము, పొందుగ నీరెంటి యందుఁ బొసఁగినకళ తాఁ
జెందిన బ్రహ్మము బయలే,యిందిర కృప నెఱుకగన్న యినకులకన్నా.౧౧౧

వెలయును జిత్కళ యంతటఁ, దలపోయఁగ వేఱులేదు తత్త్వమునందుం
బలు చింతలుడుగఁదానై,యిలఁగనఁబడు నెఱుకగన్నయినకులకన్నా.౧౧౨

చిత్తము చిత్కళఁ బొందిన, నత్తఱి నీమనసు వృత్తి యీసుడిగి తగఁ
హత్తును బ్రహ్మపదంబున, నెత్తర యిది యెఱుకగన్న యినకులకన్నా.౧౧౩

మనసును సుస్థిరమైనను, దనువు నదృశ్యంబు నొందుఁ దలఁపుడిగితగం
గనఁబడుఁ తేజం బంతట,నెనయఁగ మది నెఱుకగన్న యినకులకన్నా౧౧౪

గురువహాని బోధ చెప్పినఁ, బరఁగంగాఁ గర్మసిద్ధి ఫలమొనరించు
న్నిరతమునీమదినుంచుమ, యెఱిఁగితివిర యెఱుకగన్న యినకులకన్నా౧౧౫

కర్మగుణు తెలుఁగుటకున్నై, మర్మము గ్రహచార మనుచు మార్గము దెలియ
న్నిర్మల బుద్ధులు దెలియుట, యర్మిలి నది తెలివిరన్న యనయముకన్నా ౧౧౬



నడుమఁ గొన్ని తప్పు లెక్కుడుగానున్న పద్యములు తీసివేయఁబడినవి. చివరఁ గొన్ని పద్యములు భావరహితములు, నర్థశూన్యములు, కన్నాయని చివరఁబెట్టి రచించిన యితరుల పద్యములు గలవు. అవియునిందుఁ జేర్పఁబడలేదు. కవి పేరు లేదు, కన్నయ్యయేమో!

శ్రీరస్తు

# తేర పా వ న శ త క ము.

— కర్ణాట తేరపకవి —



## — సీ స ప ద్య ము లు —

శ్రీపార్వతీసూను సేవించి హరిపాదపద్మములకు మ్రొక్కి భర్గుఁ దలఁచి
శారదాభర్త కంజలిచేసి పద్మను గీర్తించి గిరిజకుఁ గేలుమొగిచి
పలుకులజవరాలిఁ దలచి సుపర్ణుని నుతియించి హనుమంతు మతిఁ దలంచి
వాల్మీకులకు బహువందనంబులుచేసి పారాశరుల నాత్మఁ బ్రస్తుతించి
సీసపద్యంబులను (జెప్పి వ్రాసి) చెలఁగ, శతకమొనరించి నీకిత్తుజగతివెలయ
ననఘకర్ణాటతేరపావన నరేంద్ర, రమ్యగుణసాంద్ర దశరథరామచంద్ర ౧

శ్రీరామపదపద్మసారసంగ్రహామత్తమధుపాయమాన(సన్యాసుఁడను)
శ్రీరామనామ విశేషలేఖనసక్తకాయమానకరాంగుళాంచితుఁడను
అమలకర్ణాట (తేరప యనువాఁడను) నాంచారమాంబికా నందనుఁడను
బ్రాహ్మణాశీర్వాదపాత్రభూతుఁడ సూరిసేవనావా............
......మనీషులలోపలఁ బేరుఁబొంది, నాఁడ నీకృపఁగృతిచేసినాఁడఁ గోరి
నన్నుదయఁజూడు(మీకరుణాం)తరంగ,రమ్యగుణసాంద్రదశరథరామచంద్ర!

మొదలఁ బురాణార్థములు వినియెఱుఁగను గావ్యనాటకములగతు లెఱుంగ
ఛందాదిలక్షణశాస్త్రంబు లెఱుఁగను సంధిసమాసోక్తిజాడ లెఱుఁగ
(భావ)రసస్థాయిభావంబు లెఱుఁగను వృత్త్యలంకారప్రవృత్తు లెఱుఁగఁ
దత్సమతద్భవాంతర్గతాంధ్రమ్ముల భేదమ్ము లెఱుఁగ సమ్మోద మమర
నీపదధ్యానమున మఱి నీకథావ, ధానమునఁ గైతచెప్పెదఁ బూని వినుము
అనఘ కర్ణాటతేరపావన నరేంద్ర, రమ్యగుణసాంద్ర దశరథరామచంద్ర 3

నిన్నెఱింగినుతింప నిగమాగమంబులు నేరవు బ్రహ్మాది నిఖిలదేవ
వరులెఱుంగఁగలేరు వాచామగోచరచారిత్రుఁడవునాటఁ గోరి నేను
నిన్నుఁ బూని నుతింపనేర్తునా నేర నన్నైన నూరక యుండ కాదరమున
నిన్నెన్నఁ బూనుట నేఁటికి నావాక్కు చెలఁగి పావనముగాఁ జేయఁగాదె
నిన్ను నెన్ననివాక్కులునిన్నుఁజూడ,కున్నకన్నులుకన్నులాసన్నుతాంగ-యనఘ.

శ్రీరామ జయరామ సీతామనోహర కౌస్తుభమణిహార ఘనశరీర
తాటకాంతక పరంధామ కల్పితక్షేమ కామితప్రదనామ ఖలవిరామ
చిత్తగించి మదీయచిత్తమందువసించి నాకల్బిషము లోంచి నన్నుఁగావు
నీకన్న నన్యులీలోకంబునఁ లేరు పాపంబులను బాప భయము లుడుపఁ
జపలచిత్తుఁడమత్తుఁడశఠుఁడనీచ,వర్తనుఁడనెట్లుప్రోచెదో(వరద)నన్ను-ననఘ
భానువంశాబ్ధి సంభవచంద్రమా హేమ రమణీయమణిదామ రామ రామ
బలవచ్ఛరౌఘనిర్దళితాసురస్తోమ రణరంగబలభీమ రామ రామ
మానినన్నుతమహామహిమానుభవనామ రక్షితసుత్రామ రామరామ
కమనీయతరదేహకాంతినిర్జితకామ రాజితాభ్రశ్యామ రామ రామ
యాత్రితాఖిలకల్పకారామరామ, సామగానకృ...మరామరామ,యనఘ-
దండంబు నీకు వేదండసంరక్షక దండంబు కంజాతధవళనేత్ర
దండంబు నీకుసత్కవిజనస్తుతచర్య దండంబు సంతతౌదార్యధుర్య
దండంబునీకు మార్తాండవంశోద్భవ దండంబు కీర్తిసత్పిండితాశ
దండంబునీకుఁ గోదండకాండాన్విత దండంబు బ్రహ్మాండభాండజనక
దండమఖిలప్రభంజనోద్దామబాణ,దండమక్షయసాయకాంతరితతూణ-యనఘ-
మారీచదనుజవిదారణా(స్త్ర)పరాకు భానువంశోత్తంస బహుపరాకు
తాటకాసుసమీరదందశూకపరాకు, పరమపావననామ బహుపరాకు
పాపభంజన జగత్ప్రథితచర్యపరాకు భవపాపమోచన బహుపరాకు
గాధేయసవనరక్షాదీక్షిత పరాకు పాషండమతదూష బహుపరాకు
పవనతనయానుమోదక బహుపరాకు, పంక్తికంధరసంహార బహుపరాకు-
దండంబు ఖండేందుమండనకోదండకాండఖండనబాహుదండ నీకు
వందనం బిందిరాసుందరీవదనారవిందసంగతదృఙ్మిళింద నీకు
జోహారు దేహాంతదేహవిమోహాహిదాహాభిధాననిధాననీకు
జేజె భూజోద్యాన రాజరాజద్గోత్ర రాజకందర వేశ్మరాజనీకు
మ్రొక్కునిక్కుచెవుల్జక్కి నెక్కుతూర్పు,దిక్కుదొరనేలువేల్పులదిక్క నీకు-ననఘ-
ఖలునైన దయఁజూచికాతు వన్నందుకు రూపింపగాకాసురుండె సాక్షి
యరిపక్షుఁ డనియెన్న కాప్తీకరించుట కనుగతుండౌవిభీషణుఁడె సాక్షి
యాపన్నులగువారి నరసిరక్షించుటకును దండకారణ్యమునులె సాక్షి
హీనునైనను జగన్మాన్యుఁ జేతు వన్నందుకు గుహుఁడె మున్ముందు సాక్షి
నీవు సర్వజ్ఞుఁడౌటనునిశ్చయించి, యెంచి ముద్రికహనుమకిచ్చిందె సాక్షి-

త్రిపురభీకరమహాదేవశరాసనభంగంబుచేసె నీబాహుబలము
క్షత్రకులాంతక జామదగ్న్య  *  *  *
*  *  *  *  *  *  *

నీవైభవంబు

పరశురాముని భంగపఱిచినప్పుడు చూడవలవదా నీరౌద్రకలితవృత్తి
సాకేతపురమహాసౌధాగ్రమునఁ జూడవలవదా నీభోగవర్తనంబు
కన్నులఁగనఁగల్గినందుకుఁ గాయమంది, ధాత్రిపైఁబుట్టినందుకు దండనుండి॥
కపులసైనికులుగాఁగైకొని వారిచేఁ బనులు చేయించిన ప్రాభవంబు
లఘువుగాఁ గొండఱాళ్ళను నీళ్ళఁదేలించియలఘుసేతువుగట్టినట్టి మహిమ
మానవాకృతిఁబూని దానవావలి నాజిఁ జంపివైచిన మహాసాహసంబుఁ
బాదరేణువుచేతఁ బాషాణ మింతిగా నోలిఁజేసిన యింద్రజాలవిద్య
నెవరిదగ్గఱనేర్చితో యెఱుఁగమబ్బ, మాయకాఁడవు నిన్నెన్నమాతరంబె॥
ధీరదరిద్రాంధకారం బడంప నీమంత్రంబు గ్రీష్మార్కమండలంబు
పరుషపాపారణ్యభస్మంబుసేయ నీమంత్రంబు దావాగ్నిమహితకీల
నరుల సంసారాబ్ధిఁదరియింపఁజేయ నీమంత్రంబుదృఢయంత్రమహితనౌక
ఘోరజాడ్యాహీంద్రవారం బడంప నీమంత్రంబు తార్క్ష్యసమాగమంబు
మహిని నీనామమంత్రసమానమంత్ర,రాజమింక లేదుజనులకుఁదేజమొసఁగ॥
తపసియై నీనామజపముసేయఁగఁ గదా వాల్మీకి కడు దొడ్డవాఁడు నగుట
చెల్మి నీతోఁ గోరి చేసినందునఁ గదా యినజుండు కిష్కింధ కేలికగుట
దాసుఁడై నీయాజ్ఞ తలకొని చేసినందునఁగదా హనుమంతుఁడనఘుఁడౌట
ఎంచ నిన్నాశ్రయించినందునఁ గదా యవ్విభీషణుఁడు దీర్ఘాయుఁడగుట
కాకపోయిన వీర లీలోకమందుఁ
బెందుదురె యింతపదవి నిన్ జెందకున్న, ననఘ॥                ౧౫

మీనమై వారాశిలోన డాఁగినసోమకాసురుండను దైత్యు నరసి యందు
వధియించి మించి యవ్విధిచోదితంబుగా వేదంబులను దెచ్చి విధికినిచ్చి
బీజపూరితమునై తేజరిల్లెడునోడ మునుఁగకుండఁగఁబట్టి మునుపు మనువు
నందుపైనెక్కించి యఖిలలోకంబులుఁ బ్రళయకాలంబునఁ బ్రబలిసప్త
సాగరంబులునొక్కటై వేగముంప,నొక్కరుండవు భీతి లేకుండువౌర,యనఘ॥

విబుధు లంబుధి దర్వ విధిపంపునను బోయి మందరాచలము నమందగతిని
బెకలించి నలిమించి తకమకల్పడు చెత్తుకొనివచ్చి దానిసంతన యెఱుంగ
కంబుధిలో వైవ నది మునుంగఁగ దాని నెత్తిపట్టుటకు బత్నేమిలేక
కొండెత్తి మముఁబ్రోవు గోవింద గోవింద మాకెవ్వ రికదిక్కు లేకమంచు
ననుచు వేల్పులు మ్రొక్కఁగా నపుడు కూర్మ
రూపమునఁ గొండమోయవే పేర్పునందు, ననఘ॥ ౧౮

మును హిరణ్యాక్షుఁ డంచనఁ గొప్ప నొకగొప్పరక్కసుండెంతయును క్షమిఁ దాఁటి
వేల్పుల నని గెల్చి విశ్వమంతయుఁ దానె యేలుచుఁ ధరఁ జుట్టి కేలఁబట్టి
జలధిలోపల వైవఁ జనుచున్నఁ గనివాని వడినాఁచి త్రోవలోపల వరాహ
రూపంబు ధరియించి కోపంబుతోవాని ఱొమ్ముఁ గొమ్మునఁ జిమ్మిదొమ్మిచేసి
రణములోమృతినొందించి ప్రణుతిచేసి, వేల్పులెన్నఁగఁబ్రోవవావిశ్వమెల్ల, నన॥

కడఁగియంతట హేమకశిపుఁ డంచనువాఁడు హరిమీఁదఁబగఁబూనియరిగి సకల
దిక్కుల వెదకి తానెక్కడ నాతనిఁ గనలేక వేల్పుల గాసిచేసి
జగము లేలుచునుండి సదమలాత్మకుఁడైన ప్రహ్లాదుఁడనుపుత్త్రవరుఁడు పుట్టి
హరిభక్తుఁడై జగంబంతయు హరినిండి యున్నవాఁ డనిన నెందుండెఁజూపు
మతనిననికంబమడఁచినసందునృహరి, రూపమునఁబుట్టికొట్టవాపాపినతని, నన॥

వినుతింపఁ దగు విరోచనపుత్త్రుఁ డగుబలి బలవంతుఁడై జగత్ప్రభుతఁ బూని
సత్యధర్మములకాస్పదుఁడునై శాస్త్రోక్త విధి జన్నమొక్కటి వేల్పఁ జేయఁ
గశ్యపాత్మజుఁ డవై కడుగుజ్జురూపున నాతనిఁ జేరి విఖ్యాతిమీఱఁ
బుడమిమూఁడడుగు లప్పుడు దానముగఁ గొనియఖిలలోకంబులనాక్రమించి
బలిని బాతాళమున వైచి బలవిరోధి
కఖిలసామ్రాజ్య మీయవా యవనివెలయ, ననఘ॥ ౨౦

భార్గవాన్వయ మతిపావనంబుగ జమదగ్ని మహాముని తపమునకును
శరచాపములు ఖండపరశువుఁ గరముల ధరియించి భూభారహరణమునకు
సంకల్పమొనరించి జగతీతలస్థితరాజులోకము నెల్ల నాజిలోన
మర్దించి మూఁడేడుమాఱులు తత్క్షతజకుశపాణివై పితృగోత్రజులకు
రక్తమునఁదర్పణము చేసి రౌద్రవృత్తి, భూమికశ్యపునకుదారవోసినట్టి, యమల॥

పౌలస్త్యవంశసంభవరావణాదిరాక్షసబాధితామర సమితి దుగ్ధ
సింధుగర్భాంతరసీమభూభృత్కుండలీంద్రతల్పోపరి హేతుభూత

యోగనిద్రారతినుండిన హరిఁజేరి తమపాటుదెల్పిన దశరథాభి
ధానవంశనుఁడవై దశముఖు మర్దించి సీతతోఁగూడ సాకేతమందు
నుండుఁ బ్రమదాలు వేలీను లఁదముగను,
బొమ్మటంచును రాముఁడై పుట్టితౌర, యనఘ॥ ౨౨
వసుదేవదేవకీవరగర్భమునఁబుట్టి రోహిణేయునితోడ మోహమమర
నందయశోద లానంద మొందఁగ మందఁదోలుచు గోపకులాలి గొల్వ
శకటతృణావర్త బకధేనుకాళింగ కంసాదివైరుల గర్వమడఁచి
పాండవహితముగాఁ బౌరవాన్వయులగు దుర్యోధనాదుల దురమునందు
ద్రుంచఁజేసి ధరిత్రిపై రామకృష్ణ
రూపములఁ దాల్చితౌర మున్నే పృథివిరాట, యనఘ. ౨౩
పరమైనధర్మంబు ధరనహింసయటంచు సకలాగమంబులు చాటుచుండ
హింసాస్పదంబులై యెలమిమీఱు మఖాదికర్మముల్బహుకష్టకరములనుచు
బౌద్ధాగమంబులు పాటించి తత్క్రియ సిద్ధంబుగాఁజేయ బుద్ధిఁదలఁచి
యొక్కజోలియులేక యొకరితోఁగూడక యొకరితోమాటాడ కూరకుండి
ప్రజలు చెడుపాటుఁజూచుచు సుజనులెన్న
బౌద్ధరూపంబుఁబూనిన పరమపురుష, యనఘ. ౨౪
కలియుగాంతంబునఁ జెలరేఁగి యవనులు చలపట్టిసత్క్రియా కలితధర్మ
కర్మముల్ నశియింపఁగాఁజేయుచును సాధుజనులబాధించుచు సంచరించు
వారిపైఁ గోప మవారితగతిఁజేసి వాజిపై నెక్కి దుర్వారఖడ్గ
ధారచే వారలతలలు డుల్లఁగనేసి దుష్టవర్తనజాత దోషముడుపఁ
గలికితనమున జగములుగనినుతింపఁ, బెంపుదీపింపవెలసినవిమలచరిత, యన.
నాథభూతుఁడవై యనాథులకెల్లను బురుషోత్తముఁడవునై మూఁడులోక
ములు నేలునాఁడవై మునిచిత్తసేవ్యుఁడవై నీపదంబిచ్చు నంతదాత
వై దేవదేవుఁడవై నీవునుండఁగా నల్పార్థదుని మానవాధమాధ
ముని గొన్నిపల్లె తేలినవాని బేరుఁబెంపునులేనివాని గాపురుషు నొకని
సేవచేయుటకై కోరిపోవుచుందు, రయ్యయో యెంతమూర్ఖులీయవనిమేము, నన.
దేశదేశంబులుఁ దిరిగి దుర్జనసేవచేసి దుష్టాన్నంబుమేసి కొండ
లాల్లు నీళ్లనుడాసి వేళ్ళతోఁ గుజములు పీఁకి వార్థులుదాఁటి యేకతమునఁ
బుడమిన్వ్రచ్చుచు రాత్రులుపగనిశక్తితోమంత్రముల్చదువుచుయంత్రమూని

శవములమీఁదశ్మశానములోనుండి యూసచేఁ బనులిట్టు లానిచేసి
గాసిఁబొందిననొకగ్రుడ్డిగవ్వమైన,దొరకదాయెమతేమినీకరుణలేక, యనఘ॥
భిక్షమెత్తుక తిని బీదనై యొకనాఁడు నది పుట్టకుండిన నంబుద్రావి
పంచతిన్నెలమేను బఱచుక పైత్రోలుగప్పుక పడియుండి కుప్పె తనకుఁ
జేదోడుగా నాల్గు వాదోడుగా నీడ బంట్రౌతుగాఁ గాల్గు బండిగాఁగ
నూరచావడినుండి కోరుచుండును మహాదేశాధిపత్యంబు తెలివిలేక
మూర్ఖుఁడింతియకాకనీమూర్తిఁదలఁచి,నిన్నుఁబొందెదననఁడుతానింతయైన,నన
పుట్టినప్పటనుండి పొంచి బెబ్బులివలె మునురొప్పుచుండు నీముసలితనము
జాడ్యమై వైరులచందాన దేహంబు బాధించుచుండు విరోధమూని
యేమూలడాగినఁ దా మఱపోనీక పట్టివేధించు నీపాడులేమి
భిన్నఘటంబునందున్న వారివిధాన నాయువు దిగజాఱు ననుదినంబు
నేమిసుఖమనుభవించెదరిందుజనులు, వట్టికష్టమె నీవుచేపట్టకున్న,ననఘ.
తీవంచమోముల దేవరమనవి మున్నాలించి వేల్పులయలమటలును
విని రక్కసుల మెక్కుదణి పది తేరులదొరకుఁబుట్టైమునితోనఁబోయి
నల్లద్రావుడుమూఁక పుల్లనే పాతని జన్నంబునెఱవేర్చి చని బిఱాన
మినుసికదయ్యంబుమేటివి ల్దునుమాడి నేలచూలిని బాళిఁ గేలుపూని
యేలికలమిత్తిబాఁపనిమూలఁద్రోసి, నీమపెన్బొబ్బలుఁజేరవేమొ దమునర,నన.
అంతట మీయయ్య మంతనంబున నిన్ను నిలతేనిఁ జేయుట కిచ్చసేయు
నడివిని కైకది సైఁపక నినుఁగాన కంపను దనచూలి నవనినేలఁ
బంపఁ బెన్మిటిని మున్పటిమాట నీటుగా వేఁడిన లే దనఁగూడ కతఁడు
పలవింప:గని నీవు వనికి నయ్యిల్లాలుఁ దమ్ముఁడుఁ దోడురా నెమ్మినేగి
చిత్రకూటాచలప్రాంతచిత్రతోట,జాంతరంబున నుంటివే యనుజభక్తి,నన.
గండకవేదండకాండారిఖడ్గశార్దూలభల్లూకాదిదుష్టజంతు
సంతానసంగతసరళతిందుకహరిచందనమందారకందరాళ
ముఖతరూత్కరవనమునిరక్షణాదృతి ఖరదూషణప్రముఖప్రశస్త
దనుజమర్దనభవసునకోపరావణప్రహితమాయామృగప్రహరణావ
సరసమాహృతసీతను నరసికొనుచుఁ, బంపఁజేరవె సుగ్రీవుపంపుసేయ,నన.
వరసమీరాత్మజవచనసంప్రీణిత సుగ్రీవుతోమైత్రి చొచ్చిచేసి
వాలినొక్కమ్మునఁ గూలనేసి తదీయపురికి సుగ్రీవుని దొరనుజేసి

నలుదిక్కులకు వానరుల సీత వెదకఁగాఁ బంపినవారిలోఁ బవనతనయుఁ
డంబుధిదాఁటి మహారంభమున లంకఁజొచ్చి యచ్చటసీత నచ్చువిూఁ
నరసిరక్కసులనుజంపిపురముగాల్చి,వచ్చిచెప్పినముదమందవామహాత్మ,యన.
అంతవానరులతో నతిశీఘ్రగతినేగి వారిధితటము నవారితముగఁ
జేరి సేతువుగట్టి ధీరాఢ్యుఁడై లంక ముట్టడివేయించి మొనసి కుంభ
కర్ణేంద్రజిన్ముఖ్య ఘనరాక్షసులతోడ రావణుఁ బరిమార్చి రావణాను
జన్మునకును రాజ్యసంపద నొనఁగూర్చి యచలముఖంబున జనకకన్య
నెలమిఁ గైకొని పుష్పకం బెక్కి యోధ్య
నేలవే తమ్ములనుగూడి యినకులేశ, యన. ౩౪
పట్టాభిషిక్తుఁడై దిట్టతనీవున్న యవసరంబున నగస్త్యాదిమునులు
చనుదెంచి నినుఁగాంచి సంతోషమున నెంచి రావణకథలెల్లఁ గేవలముగ
వినుపించిపోయిన వెనుకరాజ్యముసేయుచుండి సీతను వనినుండఁ బనిచి
తురగమేధముఁజేసి ధరణిలో నవనిజ పోయినపిమ్మటఁ బుత్రకులకు
రాజ్యమిచ్చి సహోదరరాష్ట్రజనులు
గొలువ నిజపురిఁజేరవా కువలయేశ, యన. ౩౫
అంకోలతరువు నయ్యంకోలబీజంబు లెలమితో మున్నాశ్రయించినట్లు
సూచికాజాలంబు లేచి చయ్యన నయస్కాంతోపలంబుతోఁ గలసినట్లు
నేలనుండిన వృక్షమూలమునందు జనించి యలరారు తీవె చుట్టల్లినట్లు
నెచ్చోటఁబుట్టిన యేఱులు నీటితోఁ గడునేగి వార్ధిలోఁ గలిసినట్లు
చేరి నినుఁ బాయకుండెడు చిత్తవృత్తి
భక్తియని యెన్నఁబడు మానిపటలిచేత, ననఘ. ౩౬
ఉదయంబునకు లేచి ముదముతో నీనామధేయంబుఁ బఠియించుదినముదినము
పరిశుద్ధుఁడైపోయి భక్తితో నీరూపు చూచిసంతోషించుచూపుచూపు
అనువేళలందు నీయాలయంబులు చుట్టి బడిబడివచ్చు నయ్యడుగులడుగు
లవనిసోఁకఁగ నీపదాంబుజంబులకెల్ల దండంబువెట్టినతనువుతనువు
కాకభక్ష్యాన్నములుదిని కడుపువెంచి
తలఁచి నిర్గోల్వకుండినతనువుతనువె, యన. ౩౭
కాశికాపురిఁజేరి కాయసంశుద్ధిగా విశ్వనాయకుని సేవింపలేదు
శేషాచలంబు సంతోషంబుగాఁజేరి వేంకటేశ్వరుని సేవింపలేదు

కాంచీపురంబున కంచితగతిమీఱ వరదరాజును జూడనరుగలేదు
శ్రీరంగనాయకు సేవించుటకు నెంచి శ్రీరంగమునుగోరి చేరలేదు
మీఱి నేఁజేయుపాప మేతీరునణఁగు
నీవు తప్పిన నా కెవ్వ రింక దిక్కు, అనఘ. ౩౮

పాప మీఁపని సేయఁ బోకురా యని యనియని బుద్ధిపూర్తిగా నదియె సేయు
నీద్రోవ నరుగరా యిదికష్టతర మని యనియని యాద్రోవనరుగుచుందు
నీమాట లాడరా యిది మంచి చెఱుపని యనియని యామాట లాడుచుందు
నీతిండి దినఁగరా యిదిదురన్నంబని యనియని యాతిండి దినుచునుందు
నరుఁడు నిలుపంగలేక దుష్కరపుమనసు
నతని నేరీతిఁ ద్రోచెదో కుతలనాథ, యనఘ. ౩౯

సారంబులేని సంసారాటవిని జొచ్చి దిక్కెఱుంగక నేను దిక్కుగతులఁ
దిరుగుచు నిది దీని తెరువని యెఱుఁగక భ్రమియించుచుండుదు భ్రాంతిచేత
నిదిద్రోవ రమ్మని యింపుతోఁ జెయ్యిచ్చి వెంటఁబెట్టుక పోవ్రదంట లేఁడు
నీవు తప్పక నాకుఁ ద్రోవ చూపింపుము నాకు నీవేదిక్కు లోకమందు
నెందుకన్నను జెప్పెద ముందు నీవు, దీనరక్షకనామంబుఁ బూనుకతన, నన.

పరుషాద్రిగుహాలలోపలనుండి తరులతాచ్ఛాదితవనకుంజసమితినుండి
యెండలో నెండుచుఁ జండమారుతహతిఁ దూఁగుచు నీళ్లలోఁ దోఁగుకొనుచు
వానలోఁ దడియుచుఁ గానలో మిడుకుచు మంచులో వణకుచుఁ జంచలముగఁ
గొండలపై నేటిదండలఁ గోనల మేనుల నలయించి మించి తపము
చేయనేటికిఁ దనయింటిచాయనుండి, మనసు నిన్నంటఁ జేసినఁ గనఁడె ముక్తి, యన.

మేఘంబునుండి భూమికి జాఱువర్షధారల రీతి జడలు భూస్థలిని వ్రాలఁ
బాదాగ్రమున నిల్చి పవను నిరోధించి యుపవాసముల మేను నొలఁగఁ జేసి
ఖేచరీప్రముఖార్యసూచితముద్రలు చూచుచుఁ దమలోనఁ జోద్యమందు
చుందు రింతియెకాక ముందెందుఁ జెడకుండు ద్రోవఁ జూడఁగలేరు భావమందుఁ
బొందఁ జేయుచు సచ్చిదానందమయుఁడ
వైన నీమోక్ష మందరే మానివరులు, అనఘ. ౪౦

స్ఫటికోపలమువలె స్వచ్ఛుఁడౌనాత్మని గ్రమ్ముక మ్మాయ వికారుఁ జేయ
నతఁడు తన్మయుఁడునై యామెతోఁ గలయిక మనసను కొడుకును మమతమీఱఁ
గనిపించినంత నాతఁడయుఁడు తనతండ్రివలె జగంబంతయుఁ గలయ నిలిచి

రహీనవద్వారపురంబు లన్నియుఁ గట్టుకొని యిన్వారాంతఃపు రనుపరిగ్ర
హించివారలతోఁగూడి మించి తనకు, దీటు లేరనిగర్వించె డినదినంబు,నన.
అయిన్టిఅంతఃపురలో నాప్తులై ప్రవృత్తనుభార్య మగనితో నెనసియుండు
నెపతెగకుండ నిర్వృత్తనురెడవభార్య సత్కృష్ణ స్వభావమెఱఁగి
మెలఁగుచుండును నిట్టు లెలమినుండఁగఁ బ్రవృత్తికిఁబుట్టినన్మాతపేజులగుచు
మోహకామాదికపుత్రులు పలువురు పిన్నదానికని వివేకముఖ్య
సుతులు పెక్కండ్రు జనియించి రతుల మతులు
నుర్విపై నిండి మోహాదు లుండిరప్పు, డనఘ. ౪౪
అంతమీఁదటఁ గనిష్ఠాత్మజు లహంచి తాముండ నెలప్రవిష్ఠరాశిఁగాన
కన్నిదేశములు వా రాక్రమించుటఁ జూచి కడుసల్గి వారితోఁగలహమూని
పోరాడి బలిమిచే ధీరులై యొకకొన్ని పురములు పిడిపించి భూరిశక్తి
నందఁడ వసియి ప సదియు సైఁకకె సైన్యయుక్తులై కామాదు లూరనూర
వెదకివారలఁదఱుముచు విశ్వమంత, తామయైనిండియుండి రెంతయుడుకించి॥
కాముండు రతిఁగూడి ఘనసూనశరముల నలయించుచును లోకములఁ జరించెఁ
గ్రోధుండు హింసతోఁ గూడుక నొకరిపై నొకరల్గి పోరాడుచుండఁజేసె
లోభుండుతృష్ణతో లోలుఁడై యాడుచుఁబరులసొమ్ములమీఁద బాళిగొలిపె
మోహుండు భ్రాంతితో ముచ్చటాడుచువచ్చి యందఱికన్నిపై నాసనిలిపె
నప్పుడేమని చెప్పుదు నవనిలోన, నరులు చెడిభ్రష్టులైపోవుటిరవుమీఱ,నన.
ఇది రాత్రి యిది పగ లిది పర్వ మని యెన్న కంగనాలింగితు లైనవారుఁ
గోపంబు చేసినఁ బాపమంచనక యందఱిమీఁదఁ గోపంబు నెఱపువారు
నొకరిసొమ్మెత్తుక నుఱుకరాదనక నందఱిసొమ్ము లెత్తుక నుఱుకువారుఁ
బుత్రదారాదికపోషణనిరతులై యెడఁబాయలేక లోనడలువారు
చి చెడిపోయి రెల్లెడవిశ్వమందు, నన॥ ౪౭
వేశ్యాలయంబుల విమలాసవాస్వాదగ ... ... లోఁ
బట్టెమంచము మీఁదఁ బవళించి రాత్రు లిట్టుగిడి
... ... ... జపమాలపూస లెన్ను
శాస్త్రవేత్తల మని యంతే ... ... ... ...
...రులమోసపుచ్చుచు భ్రాంతిగొల్పు, చర్థసంగ్రహ మొనరిం ౪౮
ఈరీతి ... ... ... చాగిఁజూచి

వస్తువివేకుని వకదిక్కు శాంతుని నొకదిక్కు సంతోష ...
... ... ... చ్చియమనియమాదులఁ గ్రమమువిూఱ
విద్యాసహాయులై ... ... ... ర
మఱియుఁ దనుగూడిరాఁగ నన్నుకముతోవి,
... ... ... జూచి కాముఁడులోలోనఁగరఁగఁ దొడఁగె
శాంతుని త ... ... ... వృథంగె
సంతృప్తుఁడెదురాఁ జనుదేరఁ గని లోభుఁడు ...
దూరంబుగాఁజూచి మోహాండుభీరుఁడై మూలఁదూఱె,
యందఱునుముక్కులైరి మున్నుందునొండి. ౪౯

తరునరపురజంతుపరిపూర్ణమగువిశ్వ మంత యసత్యమం చరసి భోగ
ములు మేఘగతతటిత్తులవలెఁ జంచలం బులునంచెఱింగి యంబువుసతప్త
లోహంబుపైఁబడి లోలోన నడఁగిన ట్లాయువు తనువులో నడఁగిపోవు
నంచెఱిఁగిమఱిఁగి యహికఁ తిగతమునై భేకంబు దంశవ్యపేక్షఁజేసి
నటులు కాలాహిగ్రస్తుఁడై యజ్ఞుఁడాత్మ
భోగములుగోరుతనపోవుపోక దెలియ, కనఘ॥

సకలార్థములును నార్జనచేసి మనుజుఁడు దేహంబుఁ బోషించు దినదినంబు
నది దానికేకాక యాదేహికంటదు నతఁడు నిర్లేపుఁడౌ టాత్మజాను
జాదులేకస్థానజనితులైనను నదీకాష్ఠంబులట్టుల కలసి సంత
కూటంబువలె నుండి గుప్పునఁ దమతమ త్రోవలఁబోదురు తొలుతఁజేసి
కొనినకర్మంబులకు ననుగుణములైన
ఫలములందుచుఁ బుట్టుచుఁ బొలియుచుందు, రనఘ॥ ౫౧

తరుమూలముననుండి జరుగునీడయుఁబోలి సిరి మూలనుండియు జరుగుచుండు
నీరుపైఁ గరడు జన్మించి లయించిన గతిఁ బుట్టి వయసందె కలసిపోవు
స్వప్నలబ్ధంబైన వసుసంచయములీలఁ దరుణులపొందు వతథ్యఁబునొందుఁ
గట్టగాఁ దినఁ దటాకమువారిగతి నాయు వల్పమై దినగతి నరుగుచుండుఁ
దలఁప సంసృతి జగతి గంధర్వనగరు
మాడ్కినిమిషములో మాయమగుచుఁ బోవు, ననఘ॥ ౫౨

కేవలాహంకారభావంబుచే నను నాయిల్లు నాసేల నాధనంబు
నాబిడ్డ లని చాల నమ్మి యిమ్ములరక్తమాంసమజ్జాస్థ్యాయుమయము నైనఁ

# కాకినాడ పరిషత్కార్యాలయమున వెలకు దొరకు గ్రంథములు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయకవి | | రు | 0 | 8 | 0 |
| 2 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి | ... | ... | 0 | 10 | 0 |
| 3 | సంపూర్ణరామాయణము-ఋగ్వేదకవి వేంకటాచలపతికవి | | ... | 1 | 0 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము-తాళ్ళపాక పెదతిరుమలార్యుడు ... | | ... | 0 | 2 | 0 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము- శ్రీమాన్ కపిస్థళం కృష్ణమాచార్యులుగారు బి. ఏ., యల్. టి. | ... | ... | 0 | 8 | 0 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టు సర్వశాస్త్రికవి | ... | ... | 0 | 2 | 0 |
| 7 | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు ... | | ... | 0 | 3 | 0 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము- జ. రామయ్యపంతులుగారు, బి. ఏ., బి. ఎల్. | ... | ... | 0 | 8 | 0 |
| 9 | కావ్యాలంకారచూడామణి- విన్నకోట పెద్దయకవి | ... | ... | 0 | 8 | 0 |
| 10 | చంద్రభాను చరిత్రము-తరిగొప్పుల మల్లనకవి | ... | ... | 1 | 0 | 0 |
| 11 | అకారాద్యముద్రిత గ్రంథసూచిక | ... | ... | 0 | 8 | 0 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | | ... | 0 | 12 | 0 |
| 13 | శివతత్త్వసారము-మల్లికార్జున పండితారాధ్యులు | ... | ... | 0 | 12 | 0 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్య పంతులుగారు బి. ఏ., బి. ఎల్. | .. | ... | 0 | 8 | 0 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి | ... | ... | 0 | 12 | 0 |
| 16 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | | ... | 0 | 8 | 0 |
| 17 | Dravidian Lexicography జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్. | ... | ... | 0 | 4 | 0 |
| 18 | హరిస్వరంగములు-కొత్తపల్లి సూర్యరావుగారు | ... | ... | 0 | 8 | 0 |
| 19 | నారసింహపురాణము ఉత్తరభాగము-హరిభట్టు | ... | ... | 1 | 0 | 0 |
| 20 | మన్నారుదాస విలాసనాటకము—రంగాజమ్మ | ... | ... | 0 | 8 | 0 |
| 21 | జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయకుడు | | ... | 0 | 12 | 0 |
| 22 | కాళిందీకన్యాపరిణయము (మొదటిభాగము) అహోబలపతి | | ... | 1 | 0 | 0 |
| 23 | రెడ్డినాటి రెండుశాసనములు | ... | ... | 0 | 4 | 0 |
| 24 | ఆంధ్రధాతుమాల | ... | ... | 0 | 12 | 0 |
| 25 | కాళిందీకన్యాపరిణయము (ద్వితీయభాగము) అహోబలపతి. | | ... | 0 | 8 | 0 |

Printed by M. Rangiah at the Cocanada Printing works, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy)**


సంపుటము ౧౮. { ప్రమోదూతనామసంవత్సరము. జ్యేష్ఠాషాఢమాసములు. } సంచిక ౨.





కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచేఁ బరిషత్కార్యాలయమునఁ
ప్రకటింపఁబడినది.

చందా { పోస్టువ్యయములతో సంవత్సరమునకు రు 3. } { విడిసంచిక రు ౦-౮-౦.

1930

# ప్రతిష్ఠాపకులు.

శ్రీ రాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరువారు, పిఠాపురము మహారాజావారు. పరిషత్పూర్వాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

# ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు- ఉయ్యూరు జమీందారువారు.

శ్రీ రాణీ వస్సహాయా వేంకట సుభద్రయ్యమ్మ జమీందారుగారు-తుని రాణీగారు.

కీ. శే. శ్రీ బొబ్బిలి మహారాజావారు

# ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

# అధ్యక్షుడు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ. బి. ఎల్.

# కార్యదర్శులు.

దర్భా వేంకటశివరామశర్మగారు బి. ఏ. బి. ఎల్.

కిడాంబి రఘునాథాచార్యులుగారు ఎం. ఎ. బి. ఎల్.

# కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు.

రావుసాహెబ్ డాక్టర్ వేమూరి రామకృష్ణారావుగారు ఎం. ఏ, ఎల్. టి. PH. D.

(ఉపాధ్యక్షుడు.)

శ్రీ త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు.

కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు.

తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు.

అల్లాడి వేంకటరామయ్యగారు.

కోకా వెంకటసుబ్బారావు నాయుడుగారు.

కే. వేటూరి వేంకటరామశాస్త్రిగారు.

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.

పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మారావు నాయుడుగారు.

# వి ష య సూ చి క.

# పరిషత్ప్రయోజనములు



తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసఁగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రిందఁ బొందుపఱుపఁబడు చున్నవి:—

i తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వాంకషమగునిఘంటువొకటి రచించి ప్రచురించుట;

ii తెలుఁగుభాషకు సజాతీయేతరభాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణము రచించి ప్రచురించుట;

iii ఆధునికశాస్త్రగ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట;

iv ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసఁగుటయు, లభ్యములైన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగుదేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్రమొకటి రచించి ప్రచురించుట;

v సర్వవిషయములనుగుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసఁగుట;

vi ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బడసి పరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట;

vii తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొకపత్రికను బ్రకటించుట;

viii తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గుఱించి చర్చించుటకుఁగాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట;

ix తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్యపట్టములను, యోగ్యతాపత్రికలను నొసంగుట;

x ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట- ఇందుఁ బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును; వ్రాఁతప్రతులుగూడ నుండవలయును;

xi తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి సహకరించు నన్ని కార్యములను జేయుట.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

| సంపుటము ౧౯ | ప్రమోదూతనామసంవత్సరము. జ్యేష్ఠాషాఢమాసములు. | సంచిక ౨ |
| --- | --- | --- |

## *అలంకారములు — స్వభావోక్తి.

సాహిత్యవిద్యాప్రవీణ, బులుసు వేంకటరమణయ్యగారు,
విజయనగరము.

---

విచక్షణు లగుసహృదయులారా!

ప్రభుసమ్మితము లగు వేదశాస్త్రములును సుహృత్సమ్మితము లగుపురాణేతిహాసములును మనుష్యులను హితమునఁ బ్రవర్తింపఁజేసి యహితమునుండి మరల్చుచున్నవి. కావ్యములుకూడ నిక్కార్యములనే యొనర్చుచున్నను ధ్వనిప్రధానములై యని కాంతాసమ్మితము లగుట వానికి గౌరవ మబ్బినది. అట్టి కావ్యము ధ్వనిప్రధానక మగుచో నుత్తమము వ్యంగ్యము ప్రధానమగుచో మధ్యమము. వ్యంగ్యమే లేనిచో నధమకావ్యము. త్రివిధమగు నీకావ్యమునకును గుణాలంకారము లుత్కర్షాధాయకములు.

కావ్యమునకు శోభఁగలుగఁజేయుటలో రీతి వృత్తి గుణములు కూడఁ జాలవఱకుపయోగించుచున్నను, వానియన్నింటికంటె నలంకారముచే నెక్కువశోభ నాపాదించును. శరీరమునకు సౌందర్యమును గలుగఁజేయుటలో నలంకారము లెట్లో, కావ్యమునకుఁ జారుతను సంపాదింప నలంకారము లట్లివి. అలంకారము లాభరణస్థానీయము లగుట.

---

*ఇది నారచించిన సంస్కృతవ్యాసమున కాంధ్రీకరణము.

"హారాదివ దలఙ్కారా స్తత్రస్యుః........"।

అనిలక్షణజ్ఞులు చెప్పుచున్నారు. కావున నలంకారములు వ్యక్తములు. శౌర్యాదిగుణములం బోలుగుణము లంతరింద్రియధర్మము లగుట నవ్యక్తములు- అనఁగాఁ దెలిసికొన మిక్కిలి దుర్ఘటములు మఱియు

"నకాన్త మపి నిర్భూషం విభాతి వనితాముఖమ్"

అని విచక్షణులసూక్తి కావున నుత్తమకావ్య మగుధ్వనియందును తప్పక యలంకారము లుండితీరవలె నన్నపుడు, మధ్యమాధమకావ్యములలోఁ గూడ నవి తప్పక యుండవలె నని వేఱుగఁ జెప్పవలయునా? కావుననే సాహిత్యమీమాంసాశాస్త్రము గుణవృత్తిరీత్యాది వస్తుసామగ్రి యున్నను నలంకారములే యెక్కువగ నుండుటవలనను, ప్రధానము లగుటవలనను అలంకారశాస్త్ర మని చెప్పఁబడుచున్నది. ఇం దలంకారములే పెక్కు లగుటఁ బ్రతాపరుద్రీయవ్యాఖ్యాత యగుకుమారస్వామి †ఛత్త్రిన్యాయము నంగీకరించెను.

అలంకారములు లేకున్నఁ గావ్యమునకు శోభయే లేదు. "దోషములు లేక గుణాలంకారములఁ గల్గినశబ్దార్థములు కావ్యము" అను కావ్యలక్షణమున నలంకారములఁ జేర్చియున్నారు. అలంకారములు లేని కావ్యము కావ్యము కానేర దని యర్థము. అలంకారావశ్యకతం గూర్చి పలువురు చర్చించిరి. ప్రమాణముల నిట నిచ్చుచున్నాను.

నిర్దోషం గుణవత్కావ్య మలఙ్కారై రలఙ్కృతమ్ ।
రసాన్వితం కవిః కుర్వన్ ప్రీతిం కీర్తించ విన్దతి॥

భోజుని సరస్వతీకంఠాభరణము

కావ్యం స్ఫుటవదలంకారం గుణవ ద్దోషవర్జితమ్. (అగ్నిపురాణము)
కావ్యం రసాదిమ ద్వాక్యం శ్రుతం సుఖవిశేషకృత్ ।
అది పదేనాలఙ్కారపరిగ్రహః ॥-(అలంకారశేఖరము)
"—ప్రజానాం వ్యుత్పత్తి మభిసంధాయ సూరయః।
వాచాం విచిత్రమార్గాణాం నిబబంధుః క్రియావిధిమ్॥
తైశ్శరీరం చ కావ్యానా మలఙ్కారాశ్చ దర్శితాః।

† ఛత్త్రిన్యాయము- పదుగురు ప్రయాణముచేయువారిలోఁ జాలమంది ఛత్త్రములఁబట్టుకొని యిద్దఱు ముగ్గురు మానిసులు [illegible] చువారు "ఛత్రిణో గచ్ఛన్తి" అనఁగా గొడుగులు ధరించిన వారు వెళ్లుచున్నారని యందురు.

శరీరం తావదిష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ॥

*　　*　　*　　*　　*

కావ్యశోభాకరాన్ ధర్మా నలఙ్కారాన్ ప్రచక్షతే॥-(కావ్యాదర్శము)

కావ్యం గ్రాహ్య మలఙ్కారాత్ । సౌందర్య మలఙ్కారః॥

సదోషగుణాలఙ్కారహానాదానాభ్యామ్॥"

(వామనునికావ్యాలంకారసూత్రములు)

"వాక్యం రసాత్మకం కావ్య" మ్మనువిశ్వనాథకవిరాజుగారును, "రమణీయార్థప్రతిపాదకశ్శబ్దః కావ్య" మ్మను జగన్నాథపండితరాజుగారును అలంకారములు కావ్యమున కుత్కర్షాధాయకములని యంగీకరించియేయున్నారు.

"తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలఙ్కృతీ పునఃక్వాపి

అని శ్రీమదాచార్యమమ్మటుఁడు తనయలంకారాకర మగుఁగావ్యప్రకాశమున నొకానొకచో నలంకారములు లేకున్నను కావ్యతాహాని కలుగదని యభిప్రాయపడినను అలంకారము లుండనక్కఱలే దని యాయనమతము కాదని మాత్రము మన మనుకొనవలెను. అలంకారము లుండితీరవలె ననియే యతని మతము. స్ఫుటాలంకారములే యుండవలె ననియు, అవి లేనియపుడస్ఫుటాలంకారములైనఁ దప్పక యుండవలె ననియు నతఁడే యిట్లు వ్రాసికొనెను.

"క్వాపీత్యనే నైతదుచ్యతే । య త్సర్వత్ర సాలఙ్కారతౌ-

క్వచిత్ స్ఫుటాలఙ్కారవిరహేఽపి నకావ్యత్వహానిః॥"

కావున నలంకారము లుండవలె ననియే యాచార్యునిమతము. విజ్ఞుల ప్రతివాక్యము నేదో యొకయలంకారము లేకయుండదు. అలంకారములను విడిచి కవి కావ్యమును జేయ సమర్థుఁడు కాఁజాలఁడు.

దేనఁ గావ్య మలంకరింపఁబడునో- అనఁగా నేద్ది కావ్యమునకు సౌందర్య మాపాదించునో యదియే యలంకారము. కావ్యమునకు సౌందర్యమిచ్చి యలంకరించునది కావుననే తక్కినవానికంటె నుత్కృష్ట మగునలంకార మన్వర్థ మగుచున్నది. దీని కియ్యెడ నున్నంతసామర్థ్య మితరవస్తుజాలమునకుఁ గలుగఁజాలదు.

ఆయలంకారములు శబ్దాలంకారము లనియు, నర్థాలంకారము లనియు నిరుతెఱంగులు. అనుప్రాసయమకాదిశబ్దాడంబరముకలవి శబ్దాలంకారములు.

అర్థమైచిత్ర్యముకలవి- అర్థాలంకారములు. ఈరెంటిలో శబ్దాలంకారముల కంటె నర్థాలంకారములే యెక్కువగఁ గావ్యశోభాధాయకము లగుటఁ బ్రధాన ములు. కావ్యమునకు వ్యంగ్యమే ప్రధానము కదా! వ్యంగ్యము వస్తువనియు, నలంకారమనియు, రసమనియు, మూఁడువిధములు. అందలంకార మన నర్థా లంకారమునే గ్రహింపవలెను. శబ్దాలంకారములకు శబ్దమే మూల మగుటచే నెన్నఁడును వానికి వ్యంగ్యత్వము సంభవింపదు. మఱియు రసప్రధాన మగు కావ్యమున ననుప్రాసయమకాదిశబ్దాలంకారముల నెన్నఁడును గూర్పఁగూ డదు. అట్లుకాక కూర్చినచో రసవిచ్ఛేదము కలుగును. శబ్దాలంకారములు ప్రయత్నసాధ్యము లగుటచే సులలితపదములు కాక కఠినపదములను గూడ వాడవలెను. కాన శబ్దాలంకారరహిత మగురచనమే సర్వజనహృదయంగమ మయి సులలితపదబంధబంధురమయి ప్రకాశించును. శబ్దాలంకారములు కల కావ్యము సులభముగ నర్థబోధకము కానేఱదు. రసాస్వాదపరు లగుశ్రోతల కీశబ్దాలంకారము లర్థము నీయఁజాలక విఘ్నము లాచరించుచు వారిని విము ఖుల నొనర్చును. అర్థాలంకారములు గుణీభూతవ్యంగ్యము లగుట మధ్యమ కావ్యములు కూడ నగును. శబ్దాలంకారము లన్ననో వ్యంగ్యరహితము లగుట వాని కెల్లపుడు నధమకావ్యతయే కాని మధ్యమకావ్యత కలుగఁజాలదు.

అర్థాలంకారము లిన్ని యని నిశ్చయింప నవకాశము లేదు. వస్తుస్వభా వముల ననుసరించి కల్పింపఁబడిన యీయలంకారములు సంఖ్యాతీతములు. చమత్కారపుసొత్తొకరిదేకాదు. వ్యక్తులబుద్ధివిశేషముం బట్టి చమత్కారము లనంతములు. చమత్కారమూలకము లగునలంకారము లంతముకల వని యెవ్వఁ డనసాహసించును ? నాట్యాచార్యుఁడును, నాట్యశాస్త్రకర్తయు నగు నాచా ర్యభరతునికాలమునకు నాలుగేయలంకారములు. దండ్యాచార్యుఁడును

"కావ్యశోభాకరాన్ ధర్మా నలఙ్కారాన్ ప్రచక్షతే ।
తేచాద్యాపి వికల్ప్యన్తే కస్తాన్ కార్త్స్న్యేన వక్ష్యతి॥

(కావ్యాదర్శము.)

అని చెప్పుచు సూక్ష్మముగ ముప్పదియై దలంకారములనే చెప్పెను. నవీనాలంకారికు లగునప్పయదీక్షితులు నూటి కెక్కువగ నలంకారముల నంగీ కరించిరి. వేవిధముల మహాత్ము లలంకారములఁ జెప్పిరి. చెప్పుచున్నారు. చెప్పఁగలరు కూడను. కాన నియ్యవి యనంతములు.

అనంతము లగునీయర్థాలంకారములలోఁ గొన్ని ప్రధానములు. మఱి కొన్ని యప్రధానములు. అన్నియలంకారములకును సమానాధికారముండదు కదా! అన్నింటిలో నేదో యొకయలంకారమే ముఖ్యముగా నుండియుండును.

అర్థాలంకారము లన్నింటిలో నుపమాలంకారమే ప్రధాన మని యెంచి కొందఱాలంకారికులు దానినే తొలుదొల్త నిరూపించిరి. అప్పయ దీక్షితులుగారు స్వరచిత మగుచిత్రమీమాంసయం దుపమాలంకారమే యన్ని యలంకారములకును మూల మని చెప్పుచు, దానినే తొలుత నిరూపించుచుఁ దక్కినయలంకారము లన్నియు నందే యంతర్భవించు నని చెప్పినారు. "అన్ని యలంకారములలో వక్రోక్తి (అతిశయోక్తి) యుండు ననియు, నతిశయోక్తి చెప్ప కుండిన సొగసే లేదనియు, నదియే, మూలభూత మనియుఁ గావ్యమునకు జీవిత మనియు" నని కుంతకమహాశయులు తమ వక్రోక్తిజీవితమున నిరూపించి యున్నారు. ఇఁక నాచార్యదండిప్రభృతు లన్ననో స్వభావకథనమును విడిచినఁ గావ్యమునకు నలంకారమునకును శోభయే లేదని తలఁచి దానినే సకలాలంకారమూలభూతముగఁ జెప్పి యాస్వభావోక్త్యలంకారమునే తొలుత నిరూపించియున్నారు.

ఇఁక సవిమర్శముగఁ బరిశీలించినచో నేయలంకారమం దైనను వస్తుస్వభావము చెప్పఁబడియే యుండును. ఆస్వభావమే లేనిచో నలంకారమొక యింతైన శోభింపదు. స్వభావకథన మలంకారమునకు జీవాతువు వంటిది. వస్తుస్వభావముం గప్పిపుచ్చి కవు లుపాయాంతరమున నావస్తువు నలంకరింపఁ జాలరు. చూడుఁడు. నిదాఘకాలవర్ణనపరుఁ డగుకవి యప్పటికిఁ దోఁచినదిని వర్ణించుచు మందమందముగ వీఁచుమలయమారుతముల వలెనే యుల్లమును జల్లఁజేయు నీవేసఁగిగాడుపు లెంతటిహృదయానందకరములుగ నున్నవి? అని వర్ణించినచో రమణీయముగ నుండునో యరమణీయముగ నుండునో యాలోచింపుఁడు. అట్లే సూర్యుఁడు శీతకిరణుఁ డని, చంద్రుఁడు చండకరుఁ డని యెవ్వఁడును వర్ణింపఁడు. విరహివిషయమును వర్ణించునపుడు చంద్రుఁడు తప్పక చండకరుఁ డనియే వర్ణింపనగును. ఆవర్ణన మౌచిత్యమునుబట్టి యుండవలెను. కావున వస్తుస్వభావమును విరోధింపవీలులేదు. ఉన్నస్వభావమునకే వన్నెలను జిన్నెలను జెక్కి మనకవిశేఖరు లనేకాలంకారములను గల్పించుచుందురు. అందు స్వభావ ముండక తప్పదు.

రమణీముఖమునఁ జంద్రునియందువలెనే స్వాభావికము లగుగుండ్రఁదనము, నాహ్లాదత యు నుండుటవలెనే యారెంటికిని సామ్యము సరిపడి "ఈమెముఖము చంద్రునివలె నున్న" దను నుపమాలంకారము, "ఈమెముఖము చంద్రుఁడే" అను రూపకమును "ఈచంద్రుఁడు చంద్రుఁడే కాఁడు. వనితాముఖమే చంద్రుఁ" డను నపహ్నవాలంకారము, నిట్లే యనేకాలంకారము లుద్భవించుచున్నవి.

వస్తుతత్త్వమును దిరస్కరింపఁ గవి సమర్థుఁడు కానేరఁడు. స్వభావమున నున్నతము లగు మేడలఁ జూచియే "ఇప్పురంబాదలి యుప్పరిగలు మింటి నంటుచున్న" వని వర్ణింపఁబూనుకొనును. తాఁటియాకుగుడిసెలఁ జూచి యెన్నఁడైన నిట్లు వర్ణింపఁదొరకొనునా? ధనికునిఁజూచి "నీ వింద్రుఁడవు, చంద్రుఁడవు కుబేరుఁడ"వని వర్ణించిన వర్ణింపవచ్చును గాని గర్భదరిద్రుని గాంచి యట్లు వర్ణింపనగునా? దరిద్రుని బరిహసించుచున్నా వని చూచువా రాతనిని నిందింపకుందురా? అట్లు దరిద్రుని, దరిద్రకుటీరముల నెకసక్కె మాడుట తగునా?

స్వభావము వలెనే యతిశయోక్తికూడ సర్వాలంకారసాధారణముగ నున్నది. ముఖము చంద్రునివలె నున్న దనునుపమలో స్వభావ మున్నను, "చంద్రుఁ డెక్కడ! ముఖమెక్కడ! ఈసామ్యము కేవలస్వాభావికము కాదు. కాన నతిశయ మిందున్న" దని యనవచ్చును. అట్టియెడ నతిశయము లేదని మాతలంపుకాదు. కాని స్వభావాతిశయోక్తుల కొకభేదము కలదు. అతిశయకథన మొకించుకంతయును లేనిస్వభావ సహోక్త్యాదు లగునలంకారములు, అర్థాంతరన్యాసాద్యలంకారములు కలవు. స్వభావమును విడిచి మాత్ర మొక్కయలంకారమును లేదు.

అట్లగుట నుపమాదులలో నతిశయము కలదు. స్వభావ మల్పము. అయ్యలంకారము స్వభావకథనవిశ్రాంతము కాదు కావున నే యట్టియెడ ధర్మము కాల్పనికము. చూడుఁడు.—"వసంతకాలో హనుమా నివాగతః" అనునెడ సామాన్యధర్మము కాల్పనికము కాక స్వాభావిక మే మైనఁ గలదో. అట్లని యుపమ లన్నియుఁ గల్పితధర్మములు కలవనియే చెప్పఁగలమా? స్వాభావికములును గలవు. అవియే మిక్కిలి యాదరణీయములు. వస్తుస్వభావకథనము కల యుపమలనే సంగ్రహించుటనే కాళిదాసునకు "ఉపమా కాళిదాసస్య" అనుగౌరవము కలిగినది. చూడుఁడు.

"గచ్ఛతి పురః శ్శరీరం ధావతి పశ్చా దసంస్తుతం చేతః
చీనాంశుక మివ కేతోః ప్రతివాతం నీయమానస్య॥   శాకుం—

శరీరమా ముందునకు నడచుచున్నది. కాని స్థైర్యములేని యీమనసో! గాలికెదురుగఁ దీసికొనిపోఁబడు [ఎదురుగాలినుంచిన] జెండాయొక్క బట్ట వలెనే వెనుకకుఁ బరు విడుచున్నది. [పతాకదండమునకును శరీరమునకును సామ్యము.]

"సఞ్చారిణీ దీపశిఖేవ రాత్రౌ యం యం వ్యతీయాయ పతింవరా సా।
నరేన్ద్రమార్గాట్ట ఇవ ప్రపేదే వివర్ణభావం సస భూమిపాలః॥"   రఘు.

[పతిని వరింప స్వయంవరసభకు వచ్చినయిందుమతి యేయేరాజును దాటిపోయెనో, ఆయారాజు—రాత్రి రాజమార్గమునుండి తీసికొనిపోఁబడు దీప మేయేసౌధమును దాటునో ఆయాసౌధము వైవర్ణ్యము పొందినట్లే వైవర్ణ్యమును బొందె నని యర్థము.]

ఈయుపమాలంకారముల రెండిటియందును కొంచెమైన నతిశయ మున్నదా! ఈరెండవయుపమయే కాళిదాసునకు దీపశిఖాకాళిదా సనుబిరుద మును బ్రసాదించినది. స్వభావమును వర్ణించుటలో నతనికిఁ గలనేర్పు మఱొ కనికి లేదు. కాన స్వభావవర్ణనమున కెక్కుడుగౌరవ మొసఁగిన మనప్రాచీ నులే కాళిదాసుం గూర్చి,

"పురా కవీనాం గణనాప్రసంగే కనిష్ఠికాధిష్ఠితకాళిదాసా।
అద్యాపి తత్తుల్యకవే రభావా దనామికా సార్థవతీ బభూవ॥"

అని వచించియున్నారు. "ఉపమాకాళిదాసస్య" అనునట్లే "స్వభా వోక్తిః కాళిదాసస్య" అని కూడ నుండనోపును. స్వభావకథనమే మిక్కిలి రమణీయ మగుట స్వభావోక్తియే యాద్యగణనీయ మనియు, సర్వాలంకార మూలభూత మనియు, నుత్కృష్ట మనియు నామతము

ఉపమాదులు కల్పనమూలములు, స్వభావోక్తియం దణుమాత్రమును గల్పనావాసనయు లేదు.

వస్తుస్వభావము నందఱును జెప్పఁగలరు. కాని యాచెప్పుటలో సౌం దర్యమును జోడించుటకు మాత్ర మొకకొందఱికే శక్తికలదు. రమణీయతఁ గల్గునపుడే స్వభావోక్తి యలంకార మగును. అలంకార మననేమి? చమత్కృ తిని గల్గుఁగఁజేయునదియే కదా! కావుననే.

"స్వభావోక్తి రసౌ చారు యథావ ద్వస్తువర్ణనమ్।''

అని స్వభావోక్తిలక్షణమును ప్రాచీనాలంకారికులు నిర్వచించిరి. ఈస్వభావకథనమును విడిచి యేయలంకారము నుండ దని యే యెంచి యిది సర్వాలంకారజీవాతుభూత మని యంగీకరింపఁబడినది. ఆచార్యదండిప్రభృతు లగు ప్రాచీనాలంకారికులును కొందఱు నవీనాలంకారికులును స్వభావోక్తియే గొప్ప దని దానినే యర్థాలంకారములలో నిరూపించిరి.

"స్వభావాఖ్యాన ముపమా రూపకం దీపకావృతీ।

... ... ... ... ...

నానావస్థం పదార్థానాం రూపం సాక్షా ద్వివృణ్వతీ।
స్వభావోక్తిశ్చ జాతిశ్చే త్యాద్యా సాలంకృతిః॥" దండి.

"అర్థ స్యాలంకారా వాస్తవ మౌపమ్య మతిశయః శ్లేషః।
ఏషామేవ విశేషా అన్యేతు భవన్తి నిశ్శేషాః॥"
"వాస్తవమితి తజ్జ్ఞేయం క్రియతే వస్తుస్వరూపకథనం యత్।
పుష్టార్థ మవిపరీతం నిరుపమ మనతిశయ మశ్లేషమ్॥" రుద్రటః-
"అల మర్థ మలఙ్కర్తుం యే వ్యుత్పత్త్యాదివర్త్మనా।
జ్ఞేయా జాత్యాదయః ప్రాజ్ఞై స్తేఽర్థాలఙ్కారసంజ్ఞయా॥

... ... ... ... ...

నానావస్థాసు జాయన్తే యాని రూపాణి వస్తునః
స్వేభ్య స్స్వేభ్యో నిసర్గేభ్య స్తాని జాతిం ప్రచక్షతే॥'' భోజః-

అగ్నిపురాణమున నర్థాలంకారవిషయమును జెప్పుచు—

"అలఙ్కరణ మర్థానా మర్థాలఙ్కార ఇష్యతే।
తం వినా శబ్దసౌందర్య మపి నాస్తి మనోహరమ్।
అర్థాలఙ్కారరహితా విధవేవ సరస్వతీ।
స్వరూప మథ సాదృశ్య ముత్ప్రేక్షాతిశయా వపి।

... ... ... ... ... ...

స్వభావ ఏవ భావానాం స్వరూప మభిధీయతే ।

అని యర్థాలంకారవిషయమును, స్వభావోక్తివిషయమును జెప్పఁబడినవి. వీరుదివారు ప్రాచీనులు. నవీనులలో నొకరిని జేర్తొందును.

"అర్థాలఙ్కారాః స్వభావోక్తి రుపమాదయశ్చ। తత్రస్వభావోక్తే ర్వస్తుస్వభావవర్ణనస్వరూపత్వాత్, స్వభావవర్ణనంచ వస్తూనాం ప్రకృతం చేత్తద్వస్తూని ప్రత్యక్ష మివ దర్శయిత్వా సహృదయమనాంసి నితరా మాకర్షతీతి తస్యా అతీవ చమత్కారిత్వా త్తామేవ ప్రథమమాహ—

"నానావస్థం పదార్థానాం రూపం సాక్షాద్వివృణ్వతీ-" ఇతి॥ కావ్యదీపిక.

కావ్యదీపికాకారుఁ డన్నింటిలో స్వభావోక్తియే మిక్కిలి యుత్కృష్టతమ మైన దని చెప్పినాఁడు. రుద్రటుఁడు స్వభావాదులు నాలుగే ముఖ్యము లగునలంకారము లనియుఁ, దక్కిన వన్నియు నీనాల్గింట నంతర్భవించు ననియు "ఏషామేవ విశేషా అన్యేభవన్తి" యనుమాటచేఁ జెప్పియున్నాఁడు. కానఁ గొన్నియలంకారములకు స్వభావోక్తిమూల మని తేలినది. కాని యన్నింటికిని స్వభావోక్తియే మూల మని నామతమును నిరూపింతును.

స్వభావాఖ్యానమున కొక్కచారుతయే కాక ప్రత్యక్షీకరణమును శోభాధాయకము, అప్రత్యక్షవిషయములను గూడఁ బ్రత్యక్షీకరించు కవియే కవి. అట్టిస్వభావోక్తియే స్వభావోక్తి. ప్రత్యక్షీకరణము లేనిస్వభావోక్తి యలంకారము కాఁ జాలదు. దీనితత్త్వమును బాగుగ నెఱిఁగిన యాచార్యదండి "నానావస్థం పదార్థానాం రూపం సాక్షాద్వివృణ్వతీ।" అని చెప్పు టెంతయు సమంజసము. కావున నాలక్షణమునే మనము స్వీకరింతము. కవి స్వభావవర్ణనమున నిపుణుఁడైనను, అప్రత్యక్షవిషయములను బ్రత్యక్షీకరించు సామర్థ్య మాతనికి లేనిచో నాతని స్వభావోక్తియేమియు రాణింపదు. అట్టిసామర్థ్యమును భగవంతుఁ డందఱికి ననుగ్రహించియుండలేదు. అట్లు చూపించుకవులు కాళిదాసప్రభృతులు ముగ్గురు నల్గురే కలరు. చూడుఁడు.

" గ్రీవాభంగాభిరామం ముహురనుపతతి స్యందనే బద్ధదృష్టిః
పశ్చార్ధేన ప్రవిష్టశ్శరపతనభయా ద్భూయసా పూర్వకాయమ్।
దర్భై రర్ధావలీఢై శ్శ్రమవివృత ముఖభ్రంశిభిః కీర్ణవర్త్మా
పశ్యోదగ్రప్లుతత్వా ద్వియతిబహుతరం స్తోకముర్వ్యాం ప్రయాతి॥
[శాకుం.

[వెనువెంటనే వచ్చురథమును సొగసుగ మెడవంచి చూచుచు, శరపతనశంకచే (వెఱుగుచే) ముడుచుకొనిపోవుచు, నలసటచే నోరు తెరువఁబడ నందుండి సగముసగము కొఱికినదర్భలు జాఱియంతటను జాఱుచుండ నాలేఁడి

ఘంగున కుప్పిగంతులు వేయుచున్నది. (అవలీలగఁ దాఁటిపోవు చున్నదని భావము.)]

ఓపాఠకమహాశయా ! భీతిలి పాఱిపోవు నామృగపోతమును రక్షింపు ము. దానిగమనమును బరికింపుము. జాగ్రత్త. జాగ్రత్త. కనుమూసి తెఱచు నంతలో నది కడుదవ్వేగఁగలదు. ఏ మట్లు వింతగఁజూచుచున్నావు ? ఆమృగపోతము నీకుఁ గనుపింపనేలేదా? దానికేమి, ముందుమార్గమునుండి ప్రక్కకు మఱలిపోవుట. అవిగో ! అవిగో ! ఆవచ్చుచున్న యశ్వములు మనలను ద్రొక్కిపోఁగలవు. చూడు మవెట్లున్నవో !

ముక్తేషురశ్మిషు నిరాయతపూర్వకాయాః
నిష్కమ్పచామరశిఖాః నిభృతోర్ధ్వకర్ణాః
ఆత్మోద్ధతై రపి రజోభి రలఙ్ఘనీయాః
ధావం త్యమీ మృగజవాక్షమయేవ రథ్యాః ॥ [శాకుం.

[సారథి కళ్లెముల విడిచినంతనే ముక్కిలి సాఁగినవై చలింపనిచామరము లవంటి శిఖలు కలిగి (కేసరములు) చెవుల నిక్కఁబొడిచి, దామెగురఁగొట్టిన ధూళికంటెను ముందుగ నుండి (ధూళినతిక్రమించిన) న యీరథాశ్వములు లేఁడిపరుగుం గాంచి పంతముపట్టినవా యనఁ బరుగులిడుచున్నవి.

పాఠకులారా ! తా మెప్పుడైన నట్టియశ్వములఁ గాంచితిరా ? లేనియెడల వానిని క్షణమాత్రము కాంచుఁడు. ఱెప్పపాటుకాలముననే యవి మన దృష్టిపథమునుండి తప్పిపోఁగలవు. ఏ మనుచున్నారు ! పరాగమునఁ గంటికేమియు నగపడకున్నదనియా ? రండు. రండు. అదిగో రథము. దానినెక్కుటచే మి ? రాజుకోపపడునేమో యని యనుచున్నారా ? కవిబ్రహ్మగారిపూనుకు మైనది. మనల నెవ్వరు నడ్డఁజాలరు. సావధానముగఁ గూర్చుంటిరా ! ఇఁకఁ గనుఁడు.

"యదాలోకే సూక్ష్మం వ్రజతి సహసా తద్విపులతాం
యదర్ధేవిచ్ఛిన్నం భవతి కృతసంధాన మివతత్ ।
ప్రకృత్యా యద్వక్రం తదపి సమరేఖం నయనయో
ర్నమే దూరే కిఞ్చిత్ క్షణమపి న పార్శ్వే రథజవాత్ ॥ [శాకుం

[చూచుటకుఁ జిన్నదగునవస్తువు వేగముగనె పెద్దదగుచున్నది. సగము విచ్ఛిన్నమైనదియును సమముగనేయున్నది, స్వభావమున వక్రమగునదియు

చిన్నగనున్న ట్లే యగపడుచున్నది. (మనకు) దూరమున నేమియులేదు. (అది వెంటనే సమీపించుటచేత) సమీపమున నేమియులేదు. (అది వెంటనేదాఁటుటచేత.) ఈరథవేగమే యిందుఁగారణము.]

ఏమనుచున్నారు ? రథవేగమునఁ దల తిరుగుచున్న దనియా ? కొలది కాలములోనే మన యాశ్రమమునకుఁ జేరుకొందము, భయము వలదు. క్షణ మాత్రమోర్చియుండుఁడు. జాగ్రత్తసుఁడీ ! రథమునుండి పడఁగలరు- ఓహో ఏమో ఆలోచించు చున్నట్లున్నది. చెప్పెదరా! ఏమనుచున్నారు? ఇట్టివేగము నెచటను గనలే దనియా ? మీ రెప్పుడైన రైలుబండి నెక్కితిరా ? ఎక్కియే యున్నచో నిట్లు వింతపడరు.

ఇదిగో ! ఆశ్రమముఁ జేరితిమి. చాలఁగ నలసితిమి. కాన నిటక్షణ మాత్రము నేదఁ దేరుదము. ఆహా ! ఏమితపోవనము !

"ఆకీర్ణ మృషిపత్నీనా ముటజద్వారరోధిభిః
అపత్యై రివ నీవారభాగధేయోచితై ర్మృగైః ॥
సేకాన్తే మునికన్యాభి స్తత్ క్షణోజ్ఝితవృక్షకమ్ ।
విశ్వాసాయ విహఙ్గానా మాలవాలామ్బుపాయినామ్ ।
ఆతపాత్యయసంక్షిప్తనీవారాసు నిషాదిభిః ।
మృగై ర్వర్తితరోమన్థ ముటజాఙ్గణభూమిషు ॥	[రఘు.

[మునిపత్నుల సంతానములవలెనే యున్న లేళ్లు పర్ణశాలద్వారముల నరికట్టి నివ్వరిధాన్యములఁ దినుచున్నవి. మునికన్యలు చెట్లకుదుళ్లయందు నీళ్లు పోయఁగాఁ, బక్షులుత్రాగుటకువచ్చినవి, తక్కినచిన్న చెట్లకుఁగూడ నపుడునీళ్లు పోసినచోఁ పాఱిపోవునేమోయని వారువానికి నీళ్లుపోయుట మానిరి. సాయంతన మగుట నెండపోవుటచే నెండఁబోసిననీవారము లోకచోనంగణభూమిపైఁ బోకపోయఁబడినవి. వానిచుట్టును లేళ్లు నెమరువేయుచుఁ గూరుచున్నవి.

ఆహా ! ఏమివనము ! మిత్రులారా ! ఎవ్వతె యామె చెలికత్తెలతోనట నున్నది ? ఆమె చెట్లకు నీరోసి యలసినట్లున్నది. చూడుఁడు.

" స్రస్తాంసా వతిమాత్రలోహితతలౌ బాహూ ఘటోత్క్షేపణాత్
అద్యాపి స్తనవేపథుం జనయతిశ్వాసః ప్రమాణాధికః ।
స్రస్తం కర్ణశిరీషరోధివదనే ఘర్మామ్భసాం జాలకం
బన్ధే స్రంసిని చైకహస్త యమితాః పర్యాకులా మూర్ధజాః॥ [శాకుం

[సేచనఘటముల నెత్తుటచే నామెచేతు లెఱ్ఱగఁ గందిపోయినవి. భుజములు జాఱిపోయినవి. నిట్టూర్పు లిప్పటికిని స్తనములకంపమును బుట్టించుచున్నవి. కర్ణములందలి దిరిసెనలడ్డిన చెమ్మటలు జాఱుచున్నవి. కొప్పు వీడిపోవ (సేచనపుతొందరచే) పెన్నెరు లొక్కచేతనే ముడివేయఁబడినవి.]

ఏమీ! ఇది మఱియొకవనమువలె నున్నది. నిశ్చయముగ నీపర్ణశాల మఱొకటియే! ఎవరచట జంపతుల వలె నున్నారు! ఓహో! తెలిసినది. నిశ్చయముగ వారు సీతారాములే. పాఠకులారా! వేగమరండు. పోవుదము. ఏమందురా!

"కిమపికిమపి మన్దం మన్దమాసక్తయోగా
దవిరలితకపోలం జల్పతో రక్రమేణ।
అశిథిలపరిరమ్భవ్యాపృతైకైకదోష్ణో
... ... ... ... ... [ఉత్తరరామచరిత్రము.

(ఎక్కువ ఆసక్తితో నెడతెగకుండనుండు రీతి మెల్లమెల్లగ నేమేమో చెప్పుకొనుచు నిరువురిచెక్కిళ్లను మిక్కిలి దగ్గఱించుచు శిథిలముకాని బిగియారు కౌఁగిటియం దుద్యోగించు బాహువులుకలవారై) మిక్కిలి యానందమునఁ దేలుచున్న యాదంపతులు మనలఁజూచినచో వారియానందమునకుఁ దప్పక యంతరాయము కలుగును. మఱియు, సుఖపరవశు లగుదంపతులం గాంచి నిలుచుట తప్పుకాదా మఱి?

ఏమనుచున్నారు? వెనుకటివనములో నేమో కోలాహల మగుచున్నదనియా? అచటికి మఱల వెళ్ళవలె ననుచున్నారా? సరే. రండు. అయ్యో! ఇదేమిది? శకుంతల నత్తవారింటి కంపుచుఁ గణ్వుఁ డిట్లేడ్చుచున్నాఁ డేమి? ఏమీ? మునులుకూడ విచారించుటకలదా! అతఁడేమనుచున్నాఁడు?

"యాస్యత్యద్య శకున్తలేతి హృదయం సంస్పృష్ట ముత్కంఠయా
కంఠః స్తంభితబాష్పవృత్తి కలుష శ్చిన్తాజడం దర్శనమ్।
వైక్లబ్యం మమ తావ దీదృశ మహో స్నేహా దరణ్యౌకసః
పీడ్యన్తే గృహిణః కథం ను తనయా విశ్లేషదుఃఖైర్నవైః॥"- శాకుం

(శకుంతల అత్తవారింటికిఁబోవునని యాత్రము మెండైనది. స్వరము గద్గదికమైనది. చింతచేఁ గన్నులకేమియుఁ గన్పింపకున్నది. అడవిలో ముక్కుమూసికొని జపముచేసికొనుచున్న మునికి- నాకు, కొంతకాలము పరిచయము

వలననే యింతటిదుఃఖము కలుగుచుండఁ దమయాఁడుబిడ్డలను గ్రొత్తగ నత్తవారిండ్ల కంపుగృహస్థులు సరాగు లెట్టి పరితాపమునఁ బీడింపఁబడుదురో కదా!)

ఈదృశ్య మెంతటిజాలి కలుగఁజేయుచున్నది! ఇచట నుండదుఃఖము కలుగుచున్నది. పాఠకులారా? రండు. మఱియొక యెడకుఁ బోవుదము.

చూడుఁడు. అదిగో; రాజుగారిదర్బారు. దుష్యంతచక్రవర్తి యాసీనుఁడై యున్నాఁడు. చూడుఁడు. దూరమున శకుంతలయు, మునికుమారులును గలరు. కనుఁడు. దుష్యంతుఁ డేమనుచున్నాఁడు! అయ్యో! అయ్యో! గాంధర్వవిధిని వివాహమాడియు, శకుంతలను దా నెఱుఁగఁడఁట! మునికుమారులో- తమదగ్గఱగ నామెఁ జేరనీయకున్నారే. పాప మా యబల యేమిచేయఁగలదు,'

"ఇతః ప్రత్యాదేశాత్ స్వజన మనుగన్తుం వ్యవసితా
ముహు స్తిష్ఠే త్యుచ్చై ర్వదతి గురుశిష్యే గురుసమే।
పునర్దృష్టిం బాష్పప్రసరకలుషా మర్పితవతీ..."                 శాకుం

(రాజు తిరస్కరించుటచేఁ దమవారిని జేరఁబోయి, "ఉండుండు" మని తండ్రిగారిశిష్యుఁడు కఠినముగఁ బల్కఁ నేమియుఁ జేయలేక తిరిగి రాజునెడ బాష్పములునిండిన దృష్టిని బ్రసరింపఁజేసిన దా శకుంతల.) ఓయీ దుష్యంతా! నీవు పాషాణముకంటెను గఠినుఁడవు. అమాయిక యగునీబాల నిట్లు తిరస్కరించు టొప్పగునా?

మఱియొక రంగమిది. దుష్యంతుఁ డవగతశకుంతలావృత్తాంతుఁడై తన్నునిందించుకొనుచు మారీచాశ్రమమునఁ బ్రవేశించును. అప్పు డటనున్న శకుంతల

"వసనే పరిధూసరే వసానానియమక్షామముఖీ ధృతైకవేణిః।
అతినిష్కరుణస్యశుద్ధశీలా......దీర్ఘంవిరహవ్రతం బిభర్తి॥ (శాకుం

(మిక్కిలిమురికిపట్టిన బట్టకట్టుకొని, ఉపవాసములచే మొగమెండిపోవ, నొంటిజడనే దాల్చి దుష్యంతుఁడు కారణముకాఁగా నాశుద్ధశీల యగు శకుంతల విరహవ్రతమున నున్నది.)

అమ్మయ్య! అవగతమైనది. ఇదియంతయు స్వప్నావస్థ. మనకవి యన్నియు నప్రత్యక్షవిషయము లయ్యును దనకవితానైపుణ్యమునఁ బ్రత్యక్షీకరించి

నాఁడు. అందు స్వభావోక్తియే యుండుటచేత వాని కాగౌరవము కలిగినది. కాన నీశోభస్వభావోక్తి లేనిచోటఁ గలుగనేఱదు. ''అయ్యా! మీారీపైశ్లోకములలో నేదో యొకశోభ యున్నదని చెప్పుచున్నారే ఆశోభయేమిటి "అని పాఠకులు ప్రశ్నించుచో సమాధానము చెప్ప మాత్రముకానేఱదు. రసాస్వాదపరు లగుసహృదయులే దానిని నిర్ణయింతురుగాక!

అప్పయదీక్షితులవారు తమచిత్రమీమాంసయం దుపమాలంకారమే సర్వాలంకారమూల మనిచెప్పియున్నారు. బాగుగ విమర్శించినచో స్వభావోక్తియే సకలాలంకారజీవాతుభూత మని యంగీకరింపవలెను. వారుపమలో నన్నియలంకారములను జాలవఱ కిమిడ్చియున్నను స్వభావోక్తి నిముడుపన్గొనర్పలేదు. ఉపమలో స్వభావోక్తి యంతర్భవింపదు. స్వభావోక్తియం దుపమ యంతర్భవించును. కాన వారిమతమున ను స్వభావోక్తియే యుక్తప్రశస్తతమును. స్వభావవర్ణనము లున్నకవితకే గౌరవమెక్కువ. అతిశయ మంతటి యుత్తమముకాదు. నడుమఁ గొంతకాలమున నతిశయోక్తికి గౌరవము కలిగినను, ఇక్కాలమున నతిశయమును లెక్కచేయరు. ఉన్నదున్నట్లుగఁ జెప్పి యందుసౌరభ్యమును, సౌందర్యమును మేళవించుటయే యిప్పటివారి కవితావధి. ప్రాచీనకాలమునఁ గూడ నట్లే యుండెడిది.

స్వభావోక్తి యన్నియలంకారములందును గలుగుటను గొంచెముగ నిరూపింతును. ''చంద్రునివలె ముఖముకలదు. (ఉపమ.) 2 ముఖము చంద్రుఁడే (రూపకము) 3 ముఖమునకుఁ జంద్రుఁడే సాటి. చంద్రునకు ముఖమేసాటి (ఉపమేయోపమ) 4 ముఖము చంద్రుఁడనియే యూహింతును. (ఉత్ప్రేక్ష) 5 ఈనెల నెలకాఁడు వనితాముఖమే నెల (అపహ్నుతి). 6 చూడుఁడు; నల్లకలువలనుండి వాడికోలలు వెడలుచున్నవి (అతిశయోక్తి)" ఇవి యుపమేయోపమానములకు స్వాభావికమగుధర్మము లేకయుండనేరవు. కాన వీనియందు స్వభావము కలదు.

(సాయంకాలవర్ణనమున) పద్మములును, స్వైరిణీముఖములును ముకుళించుచున్నవి (తుల్యయోగిత) శత్రువులతోఁగూడ నారాజుగారికీర్తి దిగంతములకేఁగెను (సహోక్తి). ఖలులు లేకుండుట నీరాజుగారిసభ ప్రకాశించుచున్నది (వినోక్తి). రాహువధూకుచములను వ్యర్థమొనర్చిన విభునకు నమస్సు (పర్యాయోక్తి). స్వభావోకు లేకాని వేఱుకాదు. "మస్తదీపము

జ్వలించుచున్నను హృదయమున స్నేహత్వయము కాలేదనువిశేషోక్తియు, కఠినములు, వాడికలవి కాని యస్త్రములమరుఁడు లోకముల జయించుచున్నాఁడనువిభావనయు, వచనచమత్కారముకలస్వభావములేగదా! "రక్తుఁడగుచంద్రముఁ డైంద్రీముఖమును, జంబించుచున్నాఁ"డను సమాసోక్తి యర్థాంతర విశిష్టస్వభావోక్తియే. పక్షులలో నింద్రునికంటె వేరొకనినేమియుఁ గోరని చాతకమే ధన్యమ"ను నప్రస్తుతప్రశంస స్వాభావికము, దానివలనను బ్రస్తుత మగుస్వాభావికమే చెప్పఁబడును.

"త్రైలోక్యమునుండియు నున్నతింగనుటకుఁ బండితులు వంగినడచుచున్నా"రనువిచిత్రమును, "ఈమె గతజలసేతుబంధన మొనర్చె"నను లలితమును "మహాత్ములకు నసాధ్యమేమి?" అను నర్థాంతరన్యాసమును, బ్రస్తుత వర్ణన నిబద్ధము లగుట స్వాభావికము లనిచెప్పనొప్పును. కాన నంతటికిని మూలము స్వభావోక్తి యనియే మామతము.

ప్రాచీనాలంకారికులు స్వభావోక్తికే యున్నతస్థానము నిచ్చికవులకుఁ బ్రోత్సాహము చేయుటచే వారు స్వభావనిబద్ధము లగునర్థాలంకారములను వాడియున్నారు. కావుననే వారికీర్తి జగమెల్లెడ వ్యాపించినది. పాశ్చాత్య విద్వత్ప్రకాండులు వారిగ్రంథములకే గౌరవ మొసఁగిరి. అతిశయోక్తి యన వారికేమాత్రమును రుచింపదు. వారికేకాదు. సామాన్యముగ నందఱికి నని చెప్పవచ్చును. కావున, నడిమికాలపుగ్రంథముల కంతటిగౌరవము కలుగ లేదు. రసపరతంత్రుఁ డగుకవి యతిశయోక్తి నంగీకరింపఁజాలఁడు.

అర్థాలంకారములు కల్గి-అందు స్వభావోక్తి యెక్కుడుగ నుండి, లలిత పదబంధురమై, యర్థకాఠిన్యములేక యుండుకవితనే మనపూర్వు లాదరించి యుండిరి. కాని, పరిణామ మనునది ప్రకృతిసిద్ధ మగుటచే నది మనవాఙ్మయమునందును బ్రవేశించి యతిశయమూలకాలంకారముల ప్రతిభ యొక వెలుఁగువెలిఁగించినది. స్వభావోక్తి మూలఁబడినది. సౌశబ్ద్యము తిరస్కరింపఁబడినది. శబ్దాలంకారపద్ధతియే స్వీకృతమయ్యెను. ఓజోగుణమువన్నెకెక్కెను. హనుమన్నాటకానర్ఘరాఘవాదిదృశ్యకావ్యములలోఁ గూడ నెంతటి రసభంజకముగ నతిశయములును, శబ్దాలంకారములును నిరూపింపఁబడినవో చూడుఁడు. అట్టియెడ శ్రవ్యకావ్యముల సంగతి వేఱ చెప్పవలయునా?

కాన స్వభావోక్తినే యవలంబించి మనప్రాచీనులమార్గమును ద్రొక్కుటయే యుత్తమ మని నాకుఁదోఁచుచున్నది.

# మిత్రప్రబోధము.

—కవితావినోద- అల్లంసెట్టి అప్పయ్యగారు, పొందూరు—



ఉ. శిష్టవరేణ్యబోధితవిశిష్టసనాతనమార్గగామివై
కష్టసుఖంబు లాత్మకృతకార్యములంచుఁ దలంచి యన్నిటం
దుష్టివహించి నిర్దళితదోషుఁడవైన నొకప్పు డింతయున్
భ్రష్టముకాదు నీవిమలభావవికాసరుచిరంబు మిత్రమా !

సా. అస్తోకంబగు తత్త్వబోధనకళావ్యాసంగ మాసద్గురూ
పాస్తిం గాని లభింపనేర దది సంప్రాప్తంబు నీకైన వి
ధ్వస్తాఘుండవు నై జితేంద్రియుఁడవై వర్తించి యాశాలతా
విస్తారంబును ద్రుంచి సత్పథము నన్వేషింపవే మిత్రమా !

శా. నీయజ్ఞానము మాని యస్థిరసుఖానీకం బపేక్షింప కా
శ్రేయంబైన యఘౌఘము ల్తొలఁగ యత్నింపందగున్ దాన సు
శ్రేదాయకమా ! మదుక్తులను నీచిత్తంబులో నిల్పుమీ
మాయామేఘసమీరణుం గొలిచి క్షేమంబుండుమీ మిత్రమా !

ఉ. ఈసచరాచరంబులు మహిం జనియించినచోట నెన్నఁడేన్
వాసిదొలంగి కూలుటది వాస్తవ మానని నీ వెఱుంగవే ?
గాసిలనేల నైజమది గావున నిశ్చలతత్త్వచింతనా
భ్యాసుఁడవైన నీకు బహుభంగుల మేలు లభించు మిత్రమా !

శా. శ్రుత్యంత శ్రవణానుమోదమతి సంశుద్ధాంతరంగుండవై
యత్యంతం బగుసాధనంబున నగణ్యప్రాభవం బంటియుఁ
నిత్యానిత్య పదార్థచింతన మహానిర్నిద్రభావంబు మై
సత్యాశ్చర్యఫలంబు నంది సుఖివై హర్షింపుమా మిత్రమా!

శా. ఆద్యంబున్ నిరవద్యమున్ బుధజనాత్యంతానుమోదంబు, స
ద్విద్యావేద్యముఁ జిద్విలాస మగు నవ్విఖ్యాతతేజోమయం
బుద్యద్దీప్తి నుపాస్తిసేయు మదె నీకుత్సాహసంపాదనం
బుద్యోగింపుము తొల్లి దుర్విషయవాదోల్లంఘనన్ మిత్రమా!

# సంస్కృతదూతకావ్యోత్పత్తివికాసములు.

ఆయూరి వేంకటవీరరాఘవాచార్యులుగారు,

(గతసంచికావశేషము.)

9\. శ్లో. కృత్వా కార్యం మనుపున రిదం కీర్తిమేనాం చ లబ్ధ్వా
ప్రత్యావృత్తః పునరపి (సఖే కా) న్తయా సఙ్గతః సన్
చేతో రమ్యే విహార సలిలే స్వేచ్ఛయా నిమ్నగానా
మవ్యాపన్నౌ విహగయువయో రస్తు సంయోగలక్ష్మీః.

ఇతి శ్రీ భట్టవామనస్య కృతిః హంససన్దేశః సమాప్తః.

LVII హంససన్దేశము—61 :—ఇందు వేదాన్తాత్మకము లగు 110 శ్లోకములు గలవు. గ్రంథకర్తృనామ మనుపలబ్ధము. ఈకావ్యము దార్శనిక వస్త్వాత్మక మైనప్పటికి సరళకవితాసురభిళ మని తోఁచెడి. సంస్కృతసాహిత్య పరిషత్పత్రికలో నుల్లేఖింపఁబడిన యీకావ్యాద్యశ్లోకము నుదాహరించెద.

శ్లో. కశ్చిన్మాయామృగవశగతః కర్మణా ముహ్యమానో
భక్త్యా శమ్భో శ్చరణగతయా ముహ్యమానో నిషణ్ణః
రామో య ద్వజ్జనకసుతయా దణ్డకారణ్యభూమౌ
క్షేత్రే ప్రాప్తే క్వచన పురుషః కల్పయామాసవాసమ్.

LVIII హంససన్దేశము-62 :—రఘునాథదాసకృతము.

LIX హంసదూత-63 :—కవీన్ద్రాచార్యసరస్వతి నిర్మితము. ఇందు 40 శ్లోకములు గలవు.

LX హృదయదూత. 64:—భట్టహరిహరనిర్మితము. వసన్తతిలకావృత్తాత్మకము.

---

61\. "Journal of the Royal Asiatic Society" 1884; P. 450.

62 "వంగసాహిత్యపరిచయము" 850 పు. [D. C Sen]

63 'A Classified List of Sanskrit Manuscripts in the Palace Library at Tanjore'. Burnell, P. 1637.

64 A"Handscriften verzeichnisse der Koniglichen Bibliothek" Weber, I, no 571 (b) P. 227, No. 3087 of 'Ratnasamuchchaya' a comprehensive & classified catalogue of Skt. books—Mehr Chand Lachhman Das, Lahore 1928 also supplement to the same, P 48; No, 32. This Kavya has been published in Bombay.

—: కాళిదాసమేఘదూతకుం బరిపూరణగ్రంథములు. :—

కాళిదాసీయ మేఘదూతకు నధునాతనరచితము లగుపరిపూరణగ్రంథములు (Sequels) మూఁడుగలవు. i మల్లికల్ రామశాస్త్రిరచిత "మేఘప్రతిసన్దేశము." (ii) త్రైలోక్యమోహనగుహానియోగికవికృత "మేఘదౌత్యము" (i) స్వర్గతకోరాడరామచన్ద్రవిద్వత్కవికృత "ఘనవృత్తము."

LXI "మేఘప్రతిసన్దేశ (65) మతిమనోరంజకముగా నున్నది. ఇందు యక్షస్త్రీ నిజభర్తయొక్క వృత్తాంతమును వినినవెంటనే ప్రత్యుత్తరరూపముగ నామేఘునితోడనే తనస్థితియుఁ దనకుటుంబపరిస్థితియు వర్ణించి చెప్పెను.

LXII "మేఘదౌత్యము (66)న యక్షస్త్రీ తనభర్త ప్రవాసశిక్షను దొలఁగింపుమని కుబేరుని ప్రార్థించుట, కుబేరుఁడావెను సఫలీకృతమనోరథంజేయుట, యక్షయక్షస్త్రీ సమాగమము నభివర్ణింపఁబడెను.

LXII *ఘనవృత్తము—67 "తత్సందేశం జలధరవరో దివ్యవాచా చచక్షే" "శ్రుత్వా వార్తాం జలదకథితాం తాం ధనేశోఽపి సద్యః" అను శ్లోకద్వయముతో మేఘసందేశమున సంక్షేపింపఁబడిన మేఘుని యలకానగర్యాగమనము [సన్దేశనివేదనము, యక్షాంగనాస్థితి, తచ్ఛుభవార్తాహరణము, శాపాన్తమున యక్షయక్షాంగనాసంగమము మొదలగుసంశములు] ఘనవృత్తమున విపులీకరింపఁబడినవి. సందేశమును మాత్రముం దెల్పును గావునఁ గాళిదాసుని కావ్యము మేఘసందేశమనఁ బడియెను. యక్షసందేశశ్రవణానంతరము మేఘుని వృత్తాంతముం దెల్పుఁగావునఁ బ్రకృతకావ్యము ఘనవృత్త మనఁబరఁగును. మహాకవి కాళిదాసుఁడు సీతను గురించిన హనుమత్సందేశమును మనస్సున నుంచికొని మేఘసందేశమును రచించినట్లులే రామచంద్రకవియు నద్దానిననుసరించి "గంభీరేణ స్తనితవచసా భవ్యపాత్రం వధూటీ భావక్షైతి స్ఫుటమకథయ ద్రామమే వాంజనేయః" అని రచించె.

---

65. జయాలయముద్రాలయము, మైసూరు. 1923.

66. Sanyal & Co., 25, Roy Bagan St., Calcutta, 1909

67. కవియొక్క పౌత్రులగు శ్రీకోరాడ రామకృష్ణయ్యగారిచేఁ నవిజీవితము, టీకా, ఆంధ్రపద్య, టీకాతాత్పర్యములతోఁ బ్రకటితము. ద్వితీయముద్రణము— రామమోహనముద్రణాలయము, ఏలూరు. 1917.

పూర్వమేఘమునఁ గాళిదాసుఁడు "మార్గం తావ చ్ఛృణు కథయతః" అని యలకానగరికిఁ బోవుమార్గముం జెప్పుమిషచేఁ దనయప్రతిమవర్ణనాకౌశలముం జూపెను. ఉత్తరమేఘమున నలకానగరరామణీయకమును, యక్షస్త్రీవిరహావస్థయు, సందేశముం జెప్పి రెండుశ్లోకములతో హఠాత్తుగా ముగించెను. మేఘసందేశరసాస్వాదన పరాయణులు కథ నామూలచూడము విన నుత్కంఠతు లగుటం జేసి యంతదనుక రమ్యమై వారినానందార్ణవమున డోలాయమానము గావించుచుండిన కావ్యమును రెండుశ్లోకములతో విధిలేక మూయవలసి వచ్చెఁ గదా యని పరితప్తహృదయు లగుదురు. ఘనవృత్త మట్టియసంపూర్తికథను బూర్తిచేసి యక్షయక్షాంగనా సమాగమప్రకారముం జెప్పి వారి కుత్కంఠోపశమముం జేయును.

ఈకావ్యము ద్విసర్గాత్మకము. ప్రబంధాది ప్రక్రియారూపమున మొదటమూఁడు శ్లోకములు (అమందాక్రాంతములు) గలవు. పిమ్మట మొదటి సర్గమున 92 మందాక్రాంతావృత్తములు గలవు. రెండవసర్గమున 83 శ్లో॥ గలవు. ఇందు 72 శ్లో॥ మందాక్రాంతములు, మిగిలినవి వివిధవృత్తములు. ప్రబంధప్రక్రియలోఁ గవి యిట్లు వ్రాసియున్నాఁడు:—

శ్లో. శ్రీకాళిదాసకవిరాజవిక్లుప్తమేఘ
సందేశకావ్యపరిపూరణలాలసామే
సర్వేప్సితప్రణయనక్షమకల్పవల్యా
స్సూనైస్స్వయత్నరచితై రుపశోభనంన

శ్లో. జానన్నపీదమనిశం మనసోఽవశత్వా
త్తత్పూరణే పరిణివర్తయితుం నదక్షః
కావ్యం కరోమి ఘనవృత్తపదం మహాంతో
మృష్యన్తు సాదరధియా దయయా విలోక్య॥

ఈకావ్యమునందలి యొండురెండు శ్లోకముల నుదాహరించెద.

1 శ్లో. ఇత్యుక్తోసా సపది జలద స్తేన దీనాత్మనాలం
శ్రుత్వా కామం సరసహృదయ ప్రాగ్రణీత్వాత్ప్రహృష్టః
లోకేదీనావన మనుపమం పుణ్యమాదత్త ఏవం
సంతః ప్రోచు స్తదిహహి మయా తోషణీయ స్సఖామే. 1 స. 1 శ్లో.

2 శ్లో. వల్లీ ర్వన్యా రుచిరకుసుమ స్తోమగుచ్ఛాభిరామా
యాంతాయాంత ప్రసవవిలసత్పుష్పలిట్పక్తిరమ్యాః
హీరాంకూరస్ఫురణముకుళా శ్శశ్వదాలోక్యరాగీ
తీక్ష్ణశ్వాసై ర్గ్లతకిసలయం దూషితం దంతచేలమ్. I. 39

3 శ్లో. కాలేక స్మిం శ్చ న రతివిధా భేదత స్సంప్రసక్తం
లాక్షారాగం హృదయకలితం మత్పదారోపితం తమ్
సందర్శ్యైవం పదపిసరణం కిన్ను తే యుక్తమాగ్
త్యక్త్వా వ్రీడా చకితమనసం మాం నినాయాతిమోదమ్. II స.31 శ్లో*

—: దూతకావ్యోత్పత్తి :—

[ఈవ్యాసరచనమున శ్రీమత్పండిత చిన్తాహరణచక్రవర్తి కావ్యతీర్థుల యాంగ్లవ్యాసమే కాక, 'సంస్కృతసాహిత్యపరిషత్పత్త్రిక' లోఁ బ్రకటింపఁబడిన దూతకావ్యవిషయక మగు నాయనవ్యాసము (VIII సం. 4 సం. అగస్టు 1927) కూడ నుపకరించినది.]

సముపలభ్యదూతకావ్యములలోని కెల్లఁ గాళిదాసకృత "మేఘదూత" మే ప్రాచీనతమము. రచనాపాటవముచేతను, భావభాషాసమావేశకౌశలము చేత నీకావ్యరాజము, సంస్కృతసాహితీసామ్రాజ్యమున కధీశ్వరత్వము వహించుచున్న దని చెప్పనగును. ప్రియుఁడు తనప్రాణప్రియకుఁ గాని, ప్రియురాలు తనహృదయేశ్వరునకుఁ గాని యచేతనపదార్థముచేఁ బ్రేమసందేశము పంపుట దూతకావ్యములయందలి 'కథాబీజము'. ఈదృశప్రణయసందేశప్రేషణమే దూతకావ్యముల ముఖ్యలక్షణము. విచిత్ర మగు నిట్టి యనుత్తమకవితాభావ విశేషము, నీదృశమనోహరకావ్యనిర్మాణకల్పన మహాకవి కాళిదాసోపజ్ఞాసము ద్భూతములో, లేక పురాణోపవర్ణితాఖ్యానములనుండి కాని, గ్రన్థాన్తరముల నుండి కాని సమధిగతములో నిశ్శంకనీయముగఁ బ్రతిపాదింపఁజాలము. కాళిదాసునికంటెఁ బ్రాక్తనకాలమునఁ గూడ నచేతనములకు దూతత్వము కల్పింపఁబడియే యున్నది. పణులసవిధమునకుఁ గుక్కురరూపముతో నున్న "సరమ" ను దూతగాఁ బంపుట ఋగ్వేదోపనిబద్ధమైయున్నది. (X మం. 108 సూ.)

భారతవర్షీయేతిహాసము లగుశ్రీమద్రామాయణ మహాభారతములలో హేతువాదవివేకశూన్యము లగుప్రాణులు ప్రేమసందేశములఁ దీసికొని వెడలి, దూతకార్యమును నిర్వహించినట్టులు వర్ణింపఁబడియున్నది. సీతానేత సీతాన్వి

కమునకు [V. కాం. 44 శ్లో] నామె యాయసయొద్దకు [V. కాం. 40 శ్లో] ను హనుమంతుని సందేశహరునిగాఁ బంపుట యాదికవికోకిలముచే వర్ణింపఁబడియున్నది. నలునిసన్నిధినుండి వచ్చిన రాజహంసమును దమయన్తి తిరుగ నలసవిధమునకుఁ బంపుట మహాభారతములో [III స. 5331—2] నువర్ణింపఁబడియున్నది.

పూర్వోల్లిఖితగ్రంథములలో దేనియందును వివేకిహీనమగు సామాన్యజంతువులు దౌత్యమునకు నియుక్తములు గాలేదు. వార్తాహరణమునకు నియుక్తము లగునిర్జీవము లన్నిటికి మనుష్యవాక్కు, నించుక హేతువాదవివేకము మొదలగు నసాధారణశక్తు లున్నట్లుగాఁ వర్ణింపఁబడియుండెను. ఇట్లు లచేతనములు వార్తావాహకములుగా నియోగింపఁబడినట్లు వర్ణించుట యం దుత్తమకవితావైభవము మృగ్యము. అయినప్పటికి నీపురాణోదితవిషయములు కాళిదాసు నీదృశకావ్యనిర్మాణమున కున్ముఖునిగాఁ జేసె ననుట యసమంజసము కానోపదు. ఈవిషయము నాతఁడే "ఇత్యాఖ్యాతే" అను నుత్తరమేఘశ్లోకమున సూచించియున్నాఁడు. అందుచే "మేఘదూత"రచనావసరమున జానకియొద్దకు జానకీజాని హనుమంతుని దూతగాఁ బంపుట కాళిదాసుని దృక్పథమున నుండె నని యెంచనగు. వ్యాఖ్యాతృసార్వభౌముఁడు, మ. మ. కోలాచల మల్లినాథసూరియు నీసందర్భమున "సీతాంప్రతి హనూమత్సందేశం మనసి నిధాయ కవిః కృతవాన్" అని పరంపరాగత మగు నొక జనశ్రుతిని వ్రాసియున్నాఁడు. తత్ప్రాక్తనవ్యాఖ్యాత యగుదక్షిణావర్తనాథుఁడు గూడ "మేఘదూత" వ్యాఖ్యారంభమున నీకావ్యనిదానము నిట్టులే సూచించియున్నాఁడు.

కాళిదాసునకుఁ బూర్వము భారతవర్షమున, నితరదేశములలోఁ గూడ దూతకావ్యముల కనురూపము లగుగ్రంథములు గలవు. "కాకవిలాప" సంజ్ఞక బౌద్ధజాతకము [297 సంఖ్య] లో నార్తుఁ డగు నొకానొక కాముకుఁడు, చేతన మైనప్పటికి జ్ఞానలవశూన్య మగువాయసమును దనప్రాణప్రియా సవిధమునకు దూతగాఁ బంపుట వర్ణింపంబడియున్నది.

* "కాకవిలాపజాతకమ్" [297 సం] "తంపణపురి సంఙబసూతే ఉత్తాసేసుం పోతత్థణిసిన్నో గచ్ఛన్తం కాకం దిఖా తావ ఖరం పితంవేదణం అగణేత్వా పియభరియాయ సాసణం పేసేతుం కాకం ఆమన్తేన్తో ఇమా గాథాఆహా.

"ఉచ్చైసకుణ ఓమూణాపత్తియాణ విహఙ్గమ బజ్జసిఖ్ కత్వం వామురుం చిరం భోసాకరస్సతి ఇదం ఖోసా నజాణాతి అసిం సత్తి ఇచపోడిడతం సాచణ్డే కామాత్తికోధం తస్మే తపతి నో ఇధ ఏస ఉప్పలసన్నాహో తిక్ఖిం ఉస్సీసకే కతం కాసియుఞ్చముదుం చన్దం తప్పతు ఫలాకామియా" *

నాగార్జునాచార్యుని "ప్రజ్ఞామూలా శాస్త్రటీక"కు- చీనా (Chinese language) భాషానువాదకాఁడగు 'Hsu kan' అను నాతఁడు, క్రీ. శ. ద్వితీయశతాబ్దిలోనే [196—221 క్రీ. శ] మేఘదౌత్యముం గల్పించి యున్నాఁడు. ఒకానొక నారీమణి తనప్రాణేశ్వరు నొద్దకు మేఘుని దూతగాఁ బంపినట్టు లాతఁడు వర్ణించియున్నాఁడు. ఆకవి వాక్యముల కాంగ్లానువాదమునుల్లేఖించెద.

" O Floating clouds that swim in heaven above
Bear on your wings these words to him I love "
[Giles: 'History of Chinese Literature.' Pp. 119—20]

ఈగ్రంథజాల మంతయుఁ గాళిదాసునకు సుపరిచిత మని యనుటకుం బ్రబలప్రమాణములు లేవు. ఆతనికి 'చీనా' కవి కావ్య మపరిచిత మని యనుకొనినను, సార్వజనీనము లగు పురాణజాతకములు తెలిసి యుండు నని మన మూహింపనగును. తక్కినవిషయముల కేమియన్నను, నచేతనదౌత్యమునకైనను గాళిదాసునకీగ్రంథములు మార్గదర్శకము లని తోఁచెడిని.

దూతకావ్యప్రణయనప్రవృత్తి కాళిదాసోపజ్ఞాసముద్భూత మని యనుట కూడ నయుక్తము కాదని తోఁచెడి. ఏలన, హనుమంతునికి మానవ సామాన్య మగుజ్ఞాన మున్నట్టులు, మహాభారతాంతర్గతనలోపాఖ్యానములో సింహసకు మానుషభాష, హేతువాదవివేచనము మొదలగు నప్రాకృతశక్తు లున్నట్టులు వర్ణింపఁబడుటయందుఁ గవితారససౌరభము శశవిషాణకల్పంబు. దీనికి భిన్నాభిప్రాయము లున్న వనినను, నీఘట్టములు కవికులగురువున కుపజీవ్యము లగునంతటి యుత్తమకవితాసురభిళములు గానోపవు. శ్రీమద్భాగవతము [X స్కం. 47 అ.] లో నభివర్ణింపఁబడిన 'యుద్ధవదౌత్యము' 52 వ అధ్యాయములోని 'వృద్ధద్విజదౌత్యము'ను శృంగారరసవిషయకము లైనను; గాళిదాసునకివి యుపజీవ్యములా, కాళిదాసానుకరణజన్యములా యనువిషయము నేఁటివఱకు విబుధధిషణానికషోపలమునఁ బరిష్కృతి నంద లేదు. ఎట్లులైనను గాళిదాసుని కావ్యమునందలి యితివృత్తము, భారతరామాయణముల

యందలి యీదృశవస్తువులకంటె రమణీయతలో సర్గ గ్రహణ్యా ననునంలో నానంతయు సందియము లేదు.

కాళిదాసమేఘసందేశసాధమునకు జాతకకథేతివృత్తము పునాదివంటిదని కొందఱయభిమతము. చైనికకవికృతిగూడ నీకావ్యసాధమున కాలంబ మని చెప్పవచ్చును. ఈగ్రంథములోని యితివృత్త మించుక భిన్నముగా నైనను భారతవర్షములో వ్యాపించియుండనోపు. తత్కృతి కాళిదాసునకు "మేఘసందేశ" రచనాకాలమున బీజారోపణమునకైన నింగనుక యుపకీర్ణమై యుండనోపు. ఈవిషయముల నిరంకుశముగా నిరసింపఁజాలము.

కాళిదాసుని కవితాకల్పవల్లి కీయీకావ్యకల్పముహీరుహము లుపఘ్న సదృశము లనుట యాకవిసార్వభౌమున కావంతయు న్యూనత నాపాదింపను. ఖండాంతరకవులగ్రంథములలోఁ గూడ దీనికి సామ్యము గానవచ్చుచున్నది. ఆంగ్లనాటకనిర్మాతృచక్రవర్తి యగు "షేక్స్పియర్" (Shakespeare) మహాకవికిని, కవితాసాహితీసామ్రాజ్యలక్ష్మికి నధీశ్వరుఁడగు "మిల్టన్" (Milton) మహాకవికిని బూర్వగ్రంథము లుపజీవ్యము లైనవి. "షేక్స్పియర్" నాటకములలోపలి యొండు రెండు నాటకములకు మాత్ర ముపజీవ్యగ్రంథముల (Sources) విద్వల్లోకము నిర్ణయింపఁజాలదయ్యె. తక్కిననాటకము లన్నింటికి నితివృత్త మాతఁడు పూర్వగ్రంథములనుండి స్వీకరించినదే. అంతమాత్రముచే నాతని కవితాప్రతిభలకుఁ గీర్తిమూర్తికిఁ గళంక మానహింపదు. అమెరికా ఖండమునందలి కవిశిరోమణి యగు "ఎమర్సన్" (Emerson) అను నాతఁడు "షేక్స్పియర్" కవిం గూర్చి వ్రాసిన వ్యాసమున నిట్టులు వ్రాసియున్నాఁడు.

"Greatmen are more distinguished by range and extent, than by originality.

The greatest genius is the most indebted man."

ఆంగ్లసారస్వతమునందలి యనేక మహాగ్రంథములకు విమర్శవ్యాఖ్యాదుల రచించినట్టి "వెరిటీ" పండితుఁడు (A W Verity) "షేక్స్పియర్" యొక్క కవితోపజీవనముంగూర్చి యిట్టులు వ్రాసియున్నాఁడు.

"It is one of the commonplaces of criticism that Shakespeare's works are not remarkable for originality of plot and incident. There are indeed, only two or three of which some original has not been discovered. Delineation of character, with the

treatment of incident as a medium of characterisation, is primarily what constitutes his supremacy.'' [Prof. Verity's ed. of "Hamlet". Intro. P. XII. 1926.]

"వెరిటీ" పండితుఁడే 'కావ్యనాటక' మనఁ దగు 'మిల్టన్' మహాకవి గ్రంథము 'కోమస్' (Comus) యొక్క పీఠికలో, ఈ గ్రంథరచనావసరమున 'మిల్టను' కవి కాధారభూత గ్రంథ ప్రసంగము నుపేక్షించుట కాని, యాయా గ్రంథము లితనికుపజీవ్యములు కావని నిరసించుట కాని యామహాకవికి మహా ణ్యాపాదకములు గా వని యిట్లులు వ్రాసియున్నాఁడు.

"It is not doing Milton any real service to ignore or deny his indebtedness to these various sources. Absolute, unqualified originality is practically impossible. Literature is a series of echoes, and one of the tests of genius is to take inferior work and tune it to finer issues. Has the artist breathed fresh suggestion into things old? has he added things new? If we can answer 'yes' to each of these questions, his record is clear'' [Prof. A W Verity's ed. of "Comus" Intro. P. XXXIII; 1914]

అభిజ్ఞానశాకుంతలము, రఘువంశము, కుమారసంభవము మొదలగు నవి రచించుటకుఁ గాళిదాసునకుఁ బురాణము లుపజీవ్యములు గా లేదా! [ఈవిషయముంగూర్చిన విపులసమాలోచనమును మున్ముందుఁ బ్రకటింపఁబడెడి, మత్కృత మగు 'కవితాహరణవిచారము'—'The Ethics of Plagiarism' అను వ్యాసమునఁ గననగు.

విషయప్రదర్శనాపాటవము [Power of representation] మానవ శీలపరిశీలనావసరమున నిశితదృష్టి [Penetrative insight into human nature] మానవస్వభావవర్ణనాసందర్భమున నౌచిత్యము [Right and effective delineation of the characters of a poetic composition.] మొదలగు విషయములే, కవిప్రజ్ఞారత్నపటలికి నికషోపలములు. ఈలక్షణము లచేఁ బరీక్షించిన, మేఘదూతయం దేవేని పూర్వకవితానుకరణము లున్నను కేవలముఁ దత్కావ్యకల్పనముచేతనే కాళిదాసుఁడు కవితాసార్వభౌమపీఠము నలంకరింప నర్హుఁ డని ఘంటాఘోషమునఁ జెప్పనగును. దూతకావ్యముల కుపజీవ్యముః లనఁబడు పురాణములలో నీదృశఘట్టముల యందునకైనం గాన రాని యుత్తమకవితాలక్షణములు 'మేఘదూత' యందుఁ గానవచ్చుట లేదా? కాళిదాసునివలెనే విక్రమాదిత్యవిద్వద్గోష్ఠి నలంకరించిన నవరత్నములలో

యౌవనోత్థభావహావాద్య లయ్యలం, కృతుల నూపురాది వితతభూష
లౌ దటస్థములు పికాదులు దండచ,క్రములగతి నిమిత్తకారణములు.

వ. అం దాలంబన కుదాహరణము—

చ. మెఱుఁగులపుంజ మీతరుణిమేను సుధాకరుకాంతిచేఁగ యీ
తెఱవశరీర మీయబలదేహము క్రొవ్విరితావిక్రొవి నా
నొఱపగు చక్కఁదనమున యుజ్జ్వలవాసవరత్నరాజమై
మెఱసినగోపకృష్ణుఁడు సుమీ పొసఁగుఁగా హృదయేశ్వరుండుగాన్.

వ. మఱి యుద్దీపనభావకంబులందు నాలంబనగుణంబున కుదాహరణము—

చ. ఉదరకృశత్వముం బిఱుఁదునున్నతి*యుం జనుదోయిక్రొవ్వియుం
బొదలిన నీలవేణియును బున్నమచందురుని నాదరించు న
వ్వదనముఁ గన్నుదోయిగరువంబును దృక్కిటికింతమొప్పునే
మదనునితల్లి దా ననుట మానిని యౌవనమందె† తెల్పెడిన్.

వ. ఉద్దీపనంబునందు శృంగారచేష్ట లన్నవి భావ, హావ, హేలా, మాధుర్య, ధైర్య, లీలా, విలాస, విచ్ఛిత్తి, విభ్రమ, కిలికించిత, భావసూచక, కుట్టమిత, బిబ్బోక, లలిత, కుతూహల, చకిత, విహృత, హాసంబు లనం బదునెనిమిది యయ్యెం దత్స్వరూపోదాహరణంబు లెట్టి వనిన.

క. మానితమైనరసాభి, జ్ఞానమునకు యోగ్యమగుట‡ ననుభావంబై
దాన నొకించుక గానఁగ, నైనవికాసంబు పేరు హావం బయ్యెన్.

భావహావములకు రెంటికి నుదాహరణము—

ఉ. ఆలతి చేసి వల్లకి నఖాగ్రమునన్ శ్రుతిఁగూడ మీటుచున్
బాలకి నిర్విశంకగతిఁ బాడెఁడు§ బాల్యమునందు నీకథల్
మే లనవచ్చు నవ్వనిత మిండతయయ్యును బాడుచుండె సి
గ్గేల తనూలతం బులక లించుక యేల వహించెఁ గేశవా.

క. భావంబున సువ్యక్తం, బైవిక్రియ దోఁప హేలయగు నాభరణా
భావమునందును నంచిత+, భావము మాధుర్య మనఁగఁ బ్రస్తుతికెక్కున్

హేల కుదాహరణము—

చ. ఇతరు లెఱుంగకుండఁ గమలేక్షణ నీహృదయంబులోన దాఁ
చితి మఱ వైరి నించుకయుఁ జెప్పవు చెప్పకయున్నమాను నీ

* బిఱుఁదియున్నతి. † యౌవనమందుఁ. ‡ కయోగ్యమనుట. § బాడుడు. + నుదంచిత.

యతులతనూలతం బులక లంతట నిండఁగఁ బర్వ నీమనో
గతమున నున్నగోప్యము ప్రకాశముగా నిదె చాటిచెప్పెడిన్.

మాధుర్యంబున కుదాహరణము—

క. గెలిచిరి ముజ్జగములు నీ, లలనలు కృష్ణస్వభావలావణ్యత నో
చెలిమఱియున్నగెసేయుట, పొలుపుగఁదద్భూషణములు*భూషించుఁజుమీ

క శీలమువదలమి† ధైర్యం, బాలోకింపంగఁ బ్రియుని యట్లం బ్రియయుం
బోలఁగ నాగతిచేష్టలు, చాలఁగ నొనరించెనేనిఁ జను లీలయనన్.

క. కులసతులు మాట దప్పుటఁ, దలవంపుల నెల్లచో గదాధరుని గుణం
బులు న న్నెలయింపెడినో, చెలియా నేనింక నేమిసేయుదుఁ జెపుమా.

లీల కుదాహరణము—

క. హరి యెం దరిగిన నరుగును, హరియెయ్యెడనున్న నుండుహరిచేయుపనుల్
బరువడిఁ దానుంజేయును, హరికి సతివ తోడునీడ యైనది చెలియా.

క. ప్రియశుభదర్శన మగుప్ర, క్రియపేరు విలాసమగు ధరిత్రిని విచ్ఛి
త్తియనంగాఁ బొల్పగు నా,రయసర్వాభరణములకు రమ్యంబైనన్.

విలాసమున కుదాహరణము—

ఉ. భామ ముకుందుఁ జూచె విలసద్బహులీలలు మేళవింపఁగాఁ
ప్రేమరసోదయస్ఫురణపెల్లున నొక్కట సాత్త్వికంబు లు
ద్దామత నంకురించె విదితంబుగ నిట్టివిలాససంపదం
గాముని శిల్పచాతురి జగంబున సన్నుతికెక్కె నెంతయున్.

క. పలుదొడవులు నాకేటికిఁ, బలుదొడవులు కృష్ణరచితభావజచిహ్నం
బు లను తెలుంగునఁ గోమలి, పొలుపారెడుఁగంటికొంచెపుందొడవులతోన్.

క. కడురయమునఁ దొడవులు వి
డ్వడఁ దొడుగుట విభ్రమంబు భయమును బ్రియమున్
వెడగినుకయు మొదలుగఁ జొ
ప్పడునే గిలికించితంబు పతిఁ గవయునెడన్.

విభ్రమమున కుదాహరణము—

క. తరుణి తను శౌరి రమ్మని, కరుణించుటఁ బ్రియసఖీముఖంబున విని ని
ర్భరసంభ్రమమునఁ దొడిగెం,గరములనందియలుఁగాళ్లఁగరవలయములన్

* ననుభూషణములు. † వదలిన.

కిలికించితమున కుదాహరణము—

క. వనజముఖికమరె బృందా,వనమున నేకతమ నల్లనప్రభుఁడు ప్రియం
బునఁ గొంగుపట్టఁ* గంపిత, తనువునబొమముడియుగద్గదస్వరమునొగిన్.

క. పతి దడవఁగ నుదయంబగు, సుతనూరుహసమితి భావసూచకమయ్యెన్
రతిసమ్మర్దమున నపరి,మితసౌఖ్యము కలిమి కుట్టమిత మనఁ బరఁగెన్.

భావసూచకమున కుదాహరణము—

క. శౌరికథాశ్రవణసుధా,సారంబున నలరియును వ్రజశ్రీ యొప్పెన్
శారీరవంచనంబున, వారింపఁగనేర రవయవంబులఁ బులకల్.

కుట్టమితమున కుదాహరణము—

క. కసమసతో హరి గవయుటఁ, గుసుమశరాంకములు సఖికి గొండించిన సి
గ్గెసఁగఁగ నమ్రాననయై, వసుధాతల మిందువదన వ్రాయుచు నుండెన్.

క. వరుని ప్రసంగమున ననా,దర మది బిబ్బోక మనఁగ ధారుణి నెగడున్
భరితసుకుమారగాత్రాం,తరవిన్యాసంబు పేరు దా లలిత మగున్.

బిబ్బోకమున కుదాహరణము—

ఉ. ఆతతసంపదాఢ్యుఁ డగునంతియకాదు వదాన్యుఁడౌ జగ
జ్జాతసముల్లసద్భరణశాలిభుజాపరిఘుండు నౌ కళా
స్ఫీతుఁడు నౌ మురారి యని చెప్పఁగనేల ప్రియోక్తు లల్పమా
దూతిక చాలుఁ జాలు† మరుతూపులు దాఁకినఁ దాఁకనీ తుదిన్.

లలితమున కుదాహరణము—

మ. మొలనూ లున్నవరత్ననూపురములున్ మ్రోయం బదన్యాసలీ
లలు చేపిచినఁ గంకణక్వణనజాలం బొప్ప నుద్యన్మృదూ
క్తు లొనర్పన్ దరహాసచంద్రికలు నిక్కన్ గోపకృష్ణాంతికో
జ్జ్వలదాభీరవధూలలామలవిభాస్వద్భూషి యిం తొప్పునే.

క. ఆపోవక ప్రియుఁ జూచెడి, చాపలము కుతూహలంబు శశిముఖి భీతిం
‡జూపులు పచరింపఁగడుఁ, జూపట్టుట చకిత మనఁగ సొంపు సెలంగెన్.

కుతూహలమున కుదాహరణము—

క. హరి గరుడారూఢుండై, యరుదేరఁగఁ జూచుటకు రయంబున సతు లె
క్కిరి హర్మ్యములు విమాన,స్ఫురితసురాంగనలతోడఁ బురణించుగతిన్.

---

*గొంగుముట్ట. †చాలుఁదోలు. ‡జూపులు చలింపఁగాఁగడుఁ.

చకితమున కుదాహరణము—

చ. ఎఱుఁగకయుండి యొండొఁ జెలి యేమియుఁ జెప్పక యొండె బిట్టు ద
గ్గఱినఁ దలంకి చూచు సతికన్నుల విప్పును భ్రూవిలాసముల్
దరము మనోజవిభ్రమవిధంబును నిం పొనరించు శౌరి దా
మఱియును నవ్విలాస మొకమాటు గనుంగొనఁ గోరు వేడుకన్.

క. మును ప్రాణేశ్వరుఁ గూడుట, యొనరఁగ సిగ్గువడి చెప్పకుండుట విహృతం
బనఁ జను నెలప్రాయంబున, ననువగు మధురస్మితంబు హాసం బయ్యెన్.

విహృతమున కుదాహరణము—

క. గిరితటమునఁ గలవఁట పో, హరినఖమౌక్తికము లనిన నది యేల పయో
ధరతటము మూసికొనుచుం, దరుణీ లజ్జింప నింతదాన వె చెపుమా.

హాసమున కుదాహరణము—

క. అసదృశభావనగుణమున, హసించు నెంతెంత మధుర మగునట్లుగఁ బ్రే
యసియు నంతంతయుఁ బొదలుం, గుసుమశరునిజయము నమ్మఁ గుందుని ప్రియముల్

క. అగు నీపదు నెనిమిదియును, మొగి నుద్దీపనవిభావములఁ బో విదితం
బగు నాలంబనచేష్టలు, జగదేకాలంబన ప్రశస్తశరీరా.

మఱియు నుద్దీపనాలంకృతి :—

సీ. మట్టెలమ్రోఁతలు మణినూపురారావములకిశోరంబు లై ముద్దుఁజూఫ
నంగుళీయకరోచు లంగదాదికరుచిశ్రేణి నెదుర్కొని చెలిమిసేయ
రత్నచేలాంచలప్రభలు మౌక్తికహారలతలతోఁ గలసి మేలంబులాడ
బవిరల తళుకులు పద్మరాగోజ్జ్వలతాటంకరుచులకు సాటికెక్కఁ
దొడఁగి భూషణలక్ష్ములుతో డుసూపు, కరణిఁ జను దెంచి రధికశృంగారమమరఁ
బౌరకాంతలు కౌస్తుభాభరణలలిత, మణికిరీటకుండలుఁ గంసమర్దిఁ జూడ.

ఉద్దీపనస్థలంబు లెట్టి వనిన—

చ. పికములుఁ గీరశారికలు భృంగతతుల్ మృదువాయువు ల్వలా
హాకనినదంబుఁ జంద్రునుదయంబు వనంబును దీర్ఘికల్ హిమో
దకము సుగంధవస్తువులుఁ దన్మాలము *ల్వరగేహముల్ ఋతు
ప్రకరము దూతికోక్తియు విపంచియు నాది యగుం దటస్థముల్.

* ల్వరగేహమంబురుట్ప్రకరము.

అందు ఋతువులు—

సీ. నిసికంబె మేలు మానిసి గానరాదు మాచునఁ గృష్ణుపాలికిఁజనఁగఁగలరు
చలి విచ్చువందాఁక సైరించు మని శౌరి నింౘుఁగౌఁగిటఁ దడ వుండఁగలరు
పువ్వులనెపమునమవ్వంపుఁదోఁటలఁ బలుమాఱుహరిఁగూడిమెలఁగఁగలరు
వివ్వలి ఘనమంచు వెన్నునితోఁ దీఁగెచప్పరంబులఁ బ్రొద్దు జరపఁగలరు
చదలనుఱిమినగోవిందుఁబొదలఁగలరు,జలవిహారంబుచక్రితోఁజలుపఁగలరు
నాఱుఋతువులయందుశాఖ్యాంతరముల,గోపికలభాగ్యమెట్టిదోకోతలంప.

క. ఘనతరముగ నిటు వివరిం,చిన వెల్ల విభావగతుల చేసన్నలు నాఁ
గనుసన్నలు మొదలైనవి, యనుభావము కార్యభాగ మది యె ట్లన్నన్.

ఉ. సన్నపు *నవ్వు బాల శశిచంద్రిక నవ్వఁ గటాక్షదీధితుల్
తిన్ననిక్రొమ్మెఱుంగులకు దీకొన నెయ్యపుబోటిఁ బిల్చు చే
సన్నలు మావికెంజిగురుచందము క్రిందుపడంగఁ జేయు నీ
కన్నియ వెన్నునిం గవయుకాంక్షఁ జమీ వలరాజు నోమెడిన్.

క. ఊహింపఁగ ననుభావో, దాహరణం బిద్ది; యింకఁ దగ సాత్త్వికసం
దోహము లక్షణములును ను,దాహరణముఁ జేసి తెలుపఁ దగు నెట్లనినన్.

వ. అఘగతం బగు సుఖదుఃఖభావనం జేసి భావింపంబడు నంతఃకరణత్వంబు సత్వంబు, తత్సంభవంబులై సాత్త్వికంబు లనంగా స్తంభప్రళయరోమాంచస్వేదవైవర్ణ్యకంపాశ్రువైస్వర్యంబు లెనిమిది యయ్యె, నందు:—

క. తలకొనిన రాగభీత్యా, దులకతమునఁ జేష్టలెల్లఁ బోలఁగి శిలాదా
రులఁ జేసినయ ట్లుండినఁ,గలిత స్తంభాఖ్యసాత్త్వికం బై నెగడున్.

స్తంభమున కుదాహరణము-

క. ఒడ్డారపుఁబట్టి కడు,న్వొక్కరి యగుశౌరిఁ జూచి వెఱవడి యిదె శ్రీ
బిడ్డఁడు తనబాణంబుల, కొడ్డినగుఱిపోలెఁ గదలకున్నది కంటే.

క. రూఢిగ సుఖదుఃఖాదుల, గాఢేంద్రియమూర్ఛనంబు గదిరిన నది దాఁ
బ్రౌఢకవీంద్రులచేతను, గూఢతఁ బ్రళయ మను సత్త్వగుణమై పరఁగున్.

ప్రళయమున కుదాహరణము—

క. శ్రీనిధిఘనలావణ్యాప, యోనిధిలోఁ మునుఁగఁబోలు నుల్ల మబలకున్
వీనులఁ గన్నుల వినదుం, గాన దనం జెలుల కెల్లఁ గడు నెరవయ్యెన్.

* నవ్వుచాలు శశి.

క. ఖ్యాతసుఖాదులవలనఁ బ్ర,జాతం బగురోమవితతి సరభసముగఁ బ్ర
ద్యోతించిన నది విద్యా,స్వీతులు రోమాంచ మని గణింతురు* ప్రీతిన్.
క. శ్రమరతిఘర్మాదులచే, విమలశరీరములయందు విస్ఫుట మగున
చ్చెమటకు నభిధానము స్వే,దముగాఁ బల్కుదురు సమ్మదమున నభిజ్ఞుల్.

రోమాంచస్వేదంబుల కుదాహరణము—

క. మనసున హరి నాలింగన, మొనరింపఁగఁ బోలుఁ బులక లొదవె నతివకుం
జనసీక యతివఁ గైకొని,పెనఁగుటఁ గాఁబోలు ఘర్మబిందువు లెసఁగెన్.
క. మదకోపవిషాదాదుల, నుదయించినపాండురత్వ మొగిఁ బ్రస్ఫుట మై
వదనమునఁ దేటపడునే, నది వైవర్ణ్యంబుపేర నలవడి యుండున్.
క. మోదమున నేని రోషభ,యాదుల నేనియును గంప మధికంబగుఁ దా
నేదేహిదేహమున నది, మేదిని వేపథు వనంగ† మెఱయుచునుండున్.

వైవర్ణ్యవేపథులు రెంటికి నుదాహరణము—

క. శ్యామసమంచితమేఘ, శ్యాముని దలఁపంగ నేమిచందమొకో నె
మ్మోము గడు వెల్లనయ్యెను, గాముఁడు జంకింపకున్నఁ గంపము గదిరెన్.
క. సంతోషరోషదుఃఖా,క్రాంతస్వాంతులకుఁ బొడము కన్నులనీళ్లల్
చింతింప నస్రులని వ,ర్ణింతురు భావవిదు లగుమనీషులు కృతులన్.
క. ఆనందాదులవలనం, గానంగా నైనయట్టి గద్గదభాషి
త్వానూనత వైస్వర్యా,ఖ్యానంబున నుల్లసిల్లు నాగమసరణిన్.

అస్రువైస్వర్యంబులు రెంటికి నుదాహరణము—

క. ఎం దరిగితి కృష్ణుఁడ నా,డెందము గరు‡పొడిచి తన్ను డీకొనునస్రుల్
డిందించుకొనుచుఁ బలుకఁగఁ, గందర్పుఁడె తెలియు దానిగద్గదభాషల్.
క. ప్రణుతము లగుసాత్త్వికల,క్షణముల నిటు చెప్పి యింక సంచారికల
క్షణములు ముప్పదిమూఁడును, గణుతించి సలక్షణములుగా నొనరింతున్.
వ. అవి యెయ్యవి యనిన నిర్వేద గ్లానిశంకా సూయా మద శ్రమాలస్య దైన్య చింతా మోహ స్మృతి ధృతి వ్రీడా చపలతా హర్షావేగ జడతా గర్వ విషాదౌత్సుక్య నిద్రాపస్మార సుప్తిప్రబోధామర్షావహిత్థోగ్రతా మతి వ్యాధ్యున్మాద చరమ త్రాసవితర్కంబులు ముప్పదిమూఁడును సంచారికాభావములు.

* స్వీతులురోమాంచమనిరచింతురు. † మేదినిపైఁగంపమనఁగ.
‡ డెందము గురుపొడిచి తన్నెదుర్కొనునస్రుల్-

క. శోకాసూయాతత్త్వవి, వేకాదుల నన్యరుచులు విడుచుట నిర్వే
దాకృతి దానఁ గలుగు బా, ష్పాకులతాదైన్యచింత లాదిగఁ దలఁతోఁ.

నిర్వేదమున కుదాహరణము—

ఉ. చందనచర్చ లేల విలసద్ఘనసారలవంబు లేలొకో
యెందును లేనిచల్లఁదన మీక్షణరోచులఁ గల్గువాని నా
నంద మెలర్ప సర్వభువనంబులునుం గుణసౌరభంబుపెం
పొందఁగఁజేయువానిఁ గమలోదరుఁ దోకొని రావె నెచ్చెలీ.

క. గ్లాని యనఁగ రతికారణ, మైన సొలపుపేరు వెండి యాత్మారిష్టం
బైనపనిఁ దలఁచి యది యె, గ్లానో యని తలఁకుచుండునది శంక యగుఁ.

గ్లాని కుదాహరణము—

క. లోకత్రయము వహించిన, యాకృష్ణుని మోచితిం గుచాగ్రింబున నా
కీకముఖ సాహసంబున, నా కీయలయికకుఁ గారణము మఱి గలదే.

క. ఒరు లెఱుఁగకుండ నంతః, కరణంబును శౌరితోడుగడ చేసితి నేఁ
బరిచయము నిబిడపులకో, త్కరము బయలువఱుపునో కదా ననుఁ బ్రజకుఁ.

క. ఇతరోత్కర్ష సహింపమి, సతతంబు నసూయ మోదసమ్మోదములం
గృతమదిరాపానాదుల, నతిశయముగ నుద్భవించు నదె మదమయ్యెఁ.

అసూయ కుదాహరణము—

క. సదమల రూపగుణంబున, నది దా నాకంటె నెక్కుడా చూడఁగ నే
మిదపంబుననొకొ వెన్నుఁడు, వదలక చేపట్టె జాంబవంతుసుకూఁతుఁ.

మదమున కుదాహరణము—

క. పలుమఱుఁ బ్రస్ఖలితోక్తులు, పలుకుచు నెలుఁగెత్తి నగుచుఁ బటురక్తిమఁ గ
న్నులు దేఱఁగ సోలెడిఁ దొ, య్యలి హరిపరిరంభచింతనామృతమదమే.

క. ఉపరిసురతాదిఖేదం, బపరిమితస్వేదకారి యది శ్రమ మగు న
చ్చపుసోమరి యై కర్త, వ్యపుఁబనులకు నైనఁ జొరమి యాలస్య మగుఁ.

శ్రమమున కుదాహరణము—

క. మరుజనకుఁడు నీయింటికి, నరుదేరఁగ నేల చెలఁగి యట్టును నిట్టుం
దిరిగెదు ఘర్మాంబుకణో, త్కరమున మైపూఁత గరఁగి దస్సితి చెలియా.

ఆలస్యమున కుదాహరణము—

క. వరగృహభార మటుండెను, శరీరపోషణము చేయఁజాలదు కంటే
తరుణీమణి హరిగొద్దను, మఱి బలిమిని జేయుతత్సమాగమలీలఁ.

క. చేవ చెడి తనవిరోధిం, దా వేఁడుట దైన్య మంత్రు తనకు నభీష్టం
బేవంక వచ్చునో యని, యావేదనఁ బొరలుచుండు టది చింతయగున్.

దైన్యమున కుదాహరణము—

క. మత్ప్రతిఁ గృష్ణుని బిలువఁగ, నుత్పలనయన చని తడసె నోమ స్మర నే
డుత్పలబంధునితీవ్రస,ముత్పతనము మాన్పుమయ్య మ్రొక్కెద నీకున్.

చింత కుదాహరణము—

క. గురుజనములు చేరినఁ జె,చ్చెరఁ జూడదు పలుక దెంత చీరిన నభ్యం
తరయుతుఁ డగుపురుషోత్తము,కరుణవడయు పనికి సతివగలియూహించున్.

క. భీతిని దుఃఖావేశత, నాతత మగు చింతనముల నగుమూర్ఛకుఁ బే
రైతనరు మోహ మనునది,భూతివిషయమైన యెఱుక పో స్మృతి యనఁగన్.

మోహమున కుదాహరణము—

క. ప్రకటమనోభవాతపనిరంతరదీర్ఘదివంబు లెట్టకే
లకుఁ గడతేర్చి దూతిఁ దగులాగునఁ బిల్వఁగఁబంచి యొక్కగో
పిక యభిరామవేషమునఁ బ్రీతి నలంకృతిచేసి కృష్ణుఁ డిం
చుకవడి రాకయున్నయెడ సోమకరావళి దాఁకి మూర్ఛిలున్.

స్మృతి కుదాహరణము—

క. ఉరమునఁ బాయకయున్నది, సిరి దా ము న్నేమి తపము చేసెనొ జలజో
దరుమే నించుక సోఁకినఁ, బరితోషము మేను నిండి పాయదు నాకున్.

క. ధృతియగు సంజ్ఞానాభీ,ప్సితసిద్ధుల నితరవాంఛ శిథిల మగుట, స
న్నుతుల మనోరాగాదుల, మతి సంకోచనము కలిమి మఱి వ్రీడయగున్

ధృతి కుదాహరణము—

క. నీవల్లభుఁ డరయఁగ ల,క్ష్మీవల్లభుఁ డమ్మ మేలు మేలు లతాంగీ
నీవు కృతకృత్యురాలవు, పో వీక్షించెద వసారముగ జగ మెల్లన్.

వ్రీడ కుదాహరణము—

క. వాడలవాడల వనితలు, వేడుకపడి చూడవచ్చి విలసితపింఛా
చూడునిఁ గృష్ణుని జూడఁగఁ,దోడనె నయనములు గప్పెఁ దొంగలిఱెప్పల్

క. ఘనమగురాగద్వేషా, ద్యనవస్థానంబు చపలతాఖ్యము హర్షం
బన నొప్పు నుత్సవాదులఁ, జనుఘర్మజలాదికృత్ప్రసక్తిఁ దలంపన్.

నాగమోదన్తాదోః
తనివా హ్రస్వః
టదున్వాజ్ఞు
డిలోర్వః
పిర్వా
హ్రస్వాత్తదర్థస్య మహాతః
ఏకస్య వో హ్రస్వే లోపః
మహాత్యాం నిత్యం వక్
చిద్వా
వకో రి స్త్రికా
ముపత్త్రః
తహ్యతోహేదితౌ వా
అన్యత స్తదర్థస్య (అత స్తపర్థా ద న్యాస్త్రికార్థానా ముపధా రిత్యేషః)
శేషస్య హే నిత్యమ్
నీనో ర్బహువచనే నోమః
ఏతివా
తాభ్యాం సుసో వునూ
జసో రుమూ
చితౌ మన్మాటా వమ్శసోః
సుసి నోలుగ్వా
ఏదాతః
ఈలోరగ్వా జసి
ఉభయార్థోమనః
తతోజసోముః
లట్చ్చసః
ఆత్మనో స్మద్వత్ప్రథమయోః
జసో రుర్వా
నకాలుపి

మన్బహువచనే
దావా
హ్రస్వేన స్వరోః
టికైకాకైకా స్తయోః ప్రే ల్లోపః
ఏకస్యహోరేతః-ఒకపురుషుఁడు
అతోవా-ఒకోపురుషుఁడు
కోద్వనానుకి-ఒక్కపురుషుఁడు
రుస్త్రాభ్యాౌటః-ఒండుపురుషుఁడు
టిఙ్ణకానినిత్యమ్-ఒంటిపురుషుఁడు
ఎక్కటి
మజోనిః
రుస్త్ర (అత్రవిచార్యమ్)
నిత్యం మహాతః
రుగ్రువుకా వకర్మధారయే
రుగ్రువుకా వన్యతరస్యామ్ (ఒకరుండు, ఒకరువుండు, నోత్తరపదే సమానాధికరణే-ఒరుఁడు, ఒరువుండు)
రుగ్రువునా వకర్మధారయే వా
మనోరస్యాలఘు అలః బహువచనే
మహాత్యా మేద్వ త్తవర్ణకో నిత్యమ్
రాత్తస్య తుర్వా
ఓత్రరః
ఒరిమ భావే
ఒండు రామ్రేడితే ఆద్యాక్షరే
నిత్యం కర్మవ్యతీహారే
అగుగసనత్యే
ఒరు స్సమానాధికరణే సమాసే పూర్వస్య
ద్విరుక్త మిదమ్

ఓరుః క్వాపి
నిత్యం నాలుగోః నలుః
ద్వివాచినఇరుః
అష్టసప్తార్థయో రెనమతోర్మ్హా
నూత్రౌ
మూండ్రో ర్ద్రుజో లోపః
తతోహాలో ద్వే
గువునోర్వా
పల్వాదయోరాణా సుపి
పల్వాదే రుతో గుక్
వేః
నేర్డః
పెక్కోరదావ
ఇరోరిద్దః
నిత్యం దే ర్వింశత్యాదే ర్లోపః
అతోసిద్ధస్యడ్యక్
అతో లఘూడ్యక్ (లఘూ కొందఱు)
పలోర్గునోవా
పదేర్వ్యల్లోపౌ
దేరుకస్సంఖ్యాయా మాష్టం ద్వంద్వే
ద్వివాచిని నిత్యం డ్యక్
సర్వనామాని ప్రకృత్యా సమానాధిక రణఉత్తరపదే (న వికార స్సర్వనా మ్నః సమానాధికరణ ఉత్తరపదే)
నహ్యేకార్థస్య రుగ్రువు ట్టికః (ఏకార్థస్య రుగ్రువుకౌ టక్చ-ఏకార్థస్య కోపధ స్య ఇక్ టితయ ఉపవిభక్త్యయః)
అచినుక్
ఉరోనుక్

నద్వంద్వేనుక్
ఐదో రేనుః
ఏఁబదిః పంచాశత్
అఱువది షష్టిః
డెబ్బదిస్సప్తతిః
ఎనుబది రశీతిః
మహద్వస్త్రమహత్యాంధాతుసర్వనామ్నో ర్బహువచనమ్.
గోయిప్రభృతే ష్టేః స్త్రీవిభక్తౌ
ఆసూ వేకవచనే బహుళమ్
అంగిల్యాదే ష్టిః
ఇరుతో ష్టి కస్సర్వనామ్నో నిత్యమ్-ఇరుగేలు, నలువంకలు-టిగాప్నోతి-నచ విభక్తిలోపా న్నేతి వాచ్యమ్-నాలుగిటిమర్మమిత్యత్రాపి తదనాప త్తేః)
నిన్నాదేః
ఏమ్యాదే రన్యతరోనిత్యమ్ (ఏమ్యాదే రన్యతరస్య)
గోర్వాదే ష్టిః
ఇక్
నద్వంద్వకర్మధారయోపూర్వస్య (ఇతి వక్తవ్యమ్, ఇతి నవక్తవ్యమ్-ఉత్తర పదే సమానాధికరణే ప్రకృతివద్భా వానుశాసనాత్ గోరుగొమ్ములితిద్వం ద్వార్థనిషేధః)
అదన్వాదేః
సంఖ్యాయా ఇతిష్టికివా (పదియిటికి)

అశిరసయోః(ఇక్తికోః పరయో రజ్గస్య ఇత్వంనస్యాత్)
అజ్గస్యోత ఇః స్వాజ్గేతాలవ్యేఽచి (నాలుగు, నెత్తురు, నుదురు)
నాలుగ్వాదే రన్తిమస్య
నేక్తికోరశిః (నడుమ,కొఱుత) ఇక్తికోః కిం-నాలుగిటి -
ఇంచుగాచ్ఛికస్య బహుళమ్(ఆచ్ఛికస్య కిం-కరుణించె)
అజ్ఝప్రభృతే స్తిక్
చేఁదో స్తిః
ఏడుజి
డిక్తుతో రుపధాలోపః
ఇత్వం ట్యాదేశే నేతివాచ్యం(నుదుటికి, ఆదేశే కిం,పొడిగిటికి,కుదిటికి, నెత్తుటికి, ఎదుటికి, కథం తవిటికీతి పురుటికీతిచ)
క్రిందుమీఁదుముందునాం టావః పోః
ఇంచుకి బహుళమ్
నోపవిభక్తే రశి.
నాశి (కథం మూఁడిట నాల్గిట నిత్యాది, మగిడిరి,మగిడె)
నలిడియోరశేపి నక్తవ్యమ్
అప్రభృతీన్యవ్యయాని
యుప్రభృతేర్నుక్
నద్వంద్వేనుసుపవిభక్తౌ (అఱుత, నడుము, నాలుగిటికి, నెత్తుటికి, నుదుటికి)

## (4) కారకపరిచ్ఛేదః.

సంస్కృతవ ద్విభక్తిః
టాసశ్చైతః (కర్తరీతి యోజ్య మితి స్ఫురతి)
సహార్థే తోడః
సంసృజ్యత్యాదిషు
తుల్యార్థయోగే
కరణే బహుళమ్
ఆఖ్యాతురుపయోగే జసిసః
నాప్రధానాద్యేతృయోగే
అవధి ర్వైరమత్యర్థే
వచ్యర్థానామముఖ్యకర్మణః షష్ఠీ చాన్యతరస్యామ్
జసిసో వలనః
గృష్ణోత్యాదిషు చేతోవా
పట్టిగే తౌ గుణక్రియయోః
అన్యస్మాదపి దృశ్యతే
కంటెనన్యార్థానాం యోగే నిర్ధారణే.
సంఖ్యా ప్రమాణ సర్వనామ తత్సమానాధికరణేషుయత్పూర్వం ప్రయుజ్యతే తతః ప్రథమా.
తస్య షష్ఠీబహుళమ్
అజాతే రపత్యస్య ప్రకృతేః
భయార్థాది యోగే
జేసః

మర్షణార్థేకర్మణః
బుధ్యాదీనాం ప్రయోజ్యకర్తుః
సంబంధే ప్రాయశో యోక్తః
సమః కుః
నిర్ధారణే లోపలః
విషయాదిశబ్దాంతరర్థే
క్త్వాపిభేదకస్య కోః ప్రథమాన్యతరస్యామ్- (కృశమధ్య ల్పదివేవు రంగనల తోఁ గ్రీడింప-అత్ర సర్వనామ్నాః విశేషణానాం చ ప్రథమా)
భూవ్యవధానే నిత్యం సుపః (నిత్యపదమపి నేయమ్)
సర్వనామభేద్యయో ర్యత్ ప్రాక్ ప్రయుజ్యతే తతో బహుళమ్. (కథం వస్తు తూమెండింటికి వెల నాలుగురూకలితి, లోకమంతటికీతి చ)
కాలాధ్వనోః
జడా త్కార్షణి ద్వితీయా వా (జడాక్త్రింకుండేటియందుఁ, తాఁ జేటియందు, ఆలియుందు, గుఱ్ఱములు మూఁట నాల్గిట నొక్కమేఁక ఇతి- షోపవిభక్తికాత్ టాజ్యోరశి కర్తృప్రాణినా మ్నోః.

క. ధృతరాష్ట్రభూపతికి వృద్ధతకతమునఁజిత్త మొకవిధముగామి సుతో। ద్ధతిమూన్పఁడు నాఁ డమన స్సతఁ బిదపం బుట్టె యిపుడు శాంతుండయ్యెన్.

(ఉద్యోగ- ౧. ఆ.)

అన్యస్మాత్ సప్తమ్యాశ్చ ద్వితీయా.
ద్వి. అలరుచు జాతివైరాదులు లేక

పులఁగునానావిధమృగసమూహములవసిలాంబు జీర్ణపర్ణాశులై తపము లొనరించుతపసుల యోగిపుంగవులఁ బన్నగఖేచరప్రవరగంధర్వ కిన్నరాదుల వాలఖిల్యాదిమునులఁ గడునొప్పి బ్రహ్మలోకమువోలె-
ఇతిరంగనాథః బాలకాండే. కథ మత్ర భిసోద్వితీయా-అప్రసిద్ధః ప థమా టాయోగే- కథం నీవు కొట్టంబడుట
ఉపవిభక్తే రసేకార్థా త్తృతీయాసప్తమ్యోరశ్
త్తే రమహతః
ఉపవిభక్తేష్టాజ్యోరశ్
కాలాత్ జసేః ప్రభృత్యర్థయోగే నిత్యమ్- (నాఁటఁబట్టి, నాఁటఁగోలె, ఏతత్సూత్ర మపనీయ చికః కారకే చేతిసూత్రయుక్త్యా క్రియా ప్రకరణే యోజ్యమ్.)
అవధినిర్దేశే సర్వస్మాన్నిత్యం షష్ఠీ
స్త్రీసమభేదకస్య బహుళ మేకవచనమ్
భూవ్యావాయే బహువచన స్యేతి వక్తవ్యమ్
క్త్వాపిద్యంతస్య
నిత్యం ప్రీహిభ్యః- ఫలే బహువచనమ్.
నిర్గచ్ఛ త్యనతరత్యర్థానా మపాదానం కర్మ.
విశ్లిష్యత్యర్థేవా.
ఏలోః ప్రయోజ్యకర్తా. (ఏల్వాదేః ప్రయోజ్యకర్తా)
ప్రయోజ్యస్య నుజ్యభిధానే
హేతౌ మనవలనాధ్య శ్చేపిర్వా నుప్రయుజ్యతే.

జించె. నాలవనాఁడు ముగిసె. నాలవనాఁటికి ముగిసె. నాలవనాఁటితో ముగిసె.

సనుస్తకౌ- (ఆపురుషుండు- వృట్; ఈపురుషుండు- వృట్; ఏపురుషుండు- ఎవ్వః-ఏకాంత- ఎవ్వ; ఒక పురుషుండు- రుక్, రువృక్; ఒక నాఁడు. టిక్.

అంటొట్లు, అప్పటప్పు, అట్టాఁక, అట్టాఁకలి, అఁడడి, ఆకొత్తు, ఇల్లరి- "ఇప్పుడమికినన్ను శాశ్వతవిభుండుగఁ గోరెదరెల్ల వారలుౘ" (ఉత్తరరామా-పు- 3.)

అవారణమైవినినిశ్చయంబుగా- కలపంబు లభినవగంధంబులుగఁ గూర్చి-ముడికొక్కభంగిగా సెత్తులు వట్టియుచ్చు - అయిల్లాలు, ఈరాజు, ఉల్లాకు, ఉవ్వెత్తు, ఏడాకులరఁటి- ఏరాలు, ఒడ్డోలగము, ఓరంత, కంపిరుగుడు.

వర్ణాభిధానాని:—బాఁపండు, బాఁపఁడు, బాఁపన; పాఱు, పాఱుండు, రాచ, కోమటి, బేరి, బేహారి, వాని, గొల్లండు, గొల్లఁడు; కంచర, కస్సర, కంసాల, వడ్లం (డ్రం) గి, వడ్ల, కాసె, కుమ్మర, మంగల, మంగి, చాకల, చాకి, సాలె, జాండ్ర, ఈండ్ర, ఈడిగ, కజ్జలి, రెడ్డి, కమ్మ, వెలమ, బలిజె, మేదర, ప్రే, బచ్చు, మాల, మాదిగ, చెంచు, కోయ, సవర, బోయ, ఎఱుకు, సుకాల, సావల, ఒడ్డె, ఉప్పర, గొడగరి, పాకి, చచ్చుడి, బెస్త, తెలిక, గాండ్ల, అఱవ, మఱవ.

---

## సమాసః.

త్రివిధా స్సాంస్కృతి కాచ్ఛిక మిశ్రభేదాత్

సాంస్కృతికో ద్వివిధ స్సిద్ధసాధ్య శ్చేతి. (కథం- ఒంటిగాఁడు-మగాదిపాఠాత్)

జికః సర్వనామమ్యస్తం సమానాధికరణేన సమస్యతే

అమహాత్సంఖ్యా

స్త్రీసమః

అచ్ఛికే నద్వంద్వః-నను విభునిగఁ గోరెదరు. అత్ర నసమాసః విభక్తేః శ్రవణాత్. నచాలుకసమాసః. నీవు రక్షకుఁడుగ.

క్రియావిశేషణాన్నజీర్భవతి రనుప్రయుజ్యతే

నుజేర్వా

జికాత్తచ్ఛబ్దః

తి కధికటిష్టగాదిభ్యః

స్త్రీసమవర్ణాభ్యాం బహుళమ్. (జికస్యాః శ్చేతి దుర్జప్రకరణే సమాసః యోజ్యమ్)

సమాసః

సర్వనామమ్యస్తం బహుళమ్

ఉత్తరపదే కిమ్. (కుతో నస్యా చ్చేసిన యుల్లు- ఇత్యత్ర-

కుడుము- అస్యాపః నీః

అనుమ్వాదేశః
జికాత్పరతః అట్టిర్వాహ్యా దుత్తరపదే.
అవికృతస్సిద్ధః
సాధ్వోన్యః
తత్పురుషస్సంస్కృతవత్ప్రాయశః
జికమ్యస్త స్సమానాధికరణేన సమస్యతే
షిరవ్యయో ధాతుసామ్యే మిజినా.
జికేన జికః
రోః ప్రభృతయః షలిఘః
క్వాప్యాచ్ఛికస్షినుజ్
బహువ్రీహి క్వాపి త్రిసమవానేవ దృశ్యతే
కప్పురగంధి-కఱకంఠా.
ఉపమానం మేనునా త్రియామ్-(ఉపమానాన్నేనో ర్ఫోఁడి త్రియాం-పూఁబోఁడి)
భోజ్యం తిండినా
నికా త్తచ్ఛబ్దోనుప్రయుజ్యతే
త్రిక త్రిసమాభ్యాం బహుళమ్
సర్వస్మా త్సంబంధే
యుష్మదస్మ దాత్మార్థానాం రుగ్వోత్తరపదే
తుల్యార్థే బోశా ద్వితీయా
చిచ్చోఱగుఱకౌ- (చిచ్చుఱు చిచ్చుఱా ఉత్తరపదే)
శతస్య ఱోష్ట సంఖ్యాయాం ద్వంద్వే నిత్యమ్
అనుత్తరపదస్య పదేర్దునుక్
హాల్యుక్
ఇర్విద్దఱోః- పన్నుః పన్నెండు (పండ్రెండు)
ఆచ్ఛికస్య ద్వగోరేకవచనం ప్రాయశః
నిత్యం సంఖ్యోత్తరస్య
సమిశ్రస్య
ఉతస్సత్తమ్యా అలి గుత్తరపదే
తృతీయా పంచమ్యో రత ఇః
పాఁతాదే రఞ్జస్య బహుళం లోపః
నవార్థాదీనా మేకశః కేషుచిత్
అర్థస్య మగ్రాత్తౌ
రేయే నడేః కిక్
చిన్నపిన్నయో ష్టగ్నాఁటౌ
రుక్మానబోహ్మయో రిగ్గా నిత్యమ్
వాఁడో రన్సా
పాఁవరమ్ము
నిత్యమాలా వనుప్రయుక్తే
జవశ్చ జవ్వనేః
ఊరు కసంస్కృతసమస్య చ
నామ్వాదేరేకార్థస్య షష్ఠ్యామోః పజ్నుగచి
నమిన్నాపాదిషు
జికస్య
అన్యస్య లు క్సమానాధికరణేషు
పేర్వాదేర్వా (వాలమ్మ, పాఱమ్మ)
నున్నస్య నును ర్నాలి.
పెద్దస్య పెనుః-(పెద్దమ్రాను = అరుళః- పెనుబాము = అజగరః)
పెన్నురచి-
నిత్యం మోః పుంపుణౌ
తచ్ఛబ్దస్య లక్చి ర్బహుళమ్
ఆమ్రేడితస్యాయిః (అత త్రికా దామ్రేడిత స్యాయి ర్వా)
అనుప్రయుక్తస్య నిత్యం లోపః
టిమో మహతో వావాః
చిఱుతోదీనాం ఛేర్వా
మూఁడో ర్దజో నిత్యమ్
తత్లో హాలో ద్వే

గుర్వోవా

నరశలః

త్రికాదేకివాలో నూష్మరః

నుక్పతిభ్యస్థయోర్నిత్యమ్

తనజి

ఉతస్త్రీసమపుంపుణాం జసి చయి

లుప్తాజస్య

పదే స్తామునవార్థయోః

సంగోర్వాదయః

హ్రస్వాదన్యస్వ హలాద్వే

నిక్కలాదయః

ధికస్యనిక్-ధికస్యని క్వాస్య త్సమానాధికరణేఉత్తరపదే-చల్లనివాఁడు, చల్లవాఁడు, సమానాధికరణే కిం-చల్లగా, నల్లగా-కథం తమ్ముకుఱ్ఱలు, అల్లువాఁడు, కొడుకుఁగుఱ్ఱ, అన్నయట్లు ఇత్యాదా నాట్టి ర్దృశ్యతే-తమ్ముఁవాఁడు.

పూర్ణార్థతః

నవార్థా త్రార్వాదిషు

జివద్ద్వంద్వే తచ్ఛబ్దస్య లోపః

క్రిందోఃక్రి

ద్రుతస్య

ననుజిలటః

ఊరఁగిండాదిషు

జిపోబహుళమ్

క్వాపిచేతతోడవలనానామ్

అంద్వవోరతః

నజరాదుతః

నిత్యమితః

ఓమతస్థానార్థ స్యోత్తరపదస్య టి

నాజే ర్నురాన్వా

ఏకేతరసంఖ్యాపచనం సమానాధికరణే నామహతా సమస్యతే.

జీకాదట్టర్వాను ప్రయుజ్యతే - మగవాఁడు, తచ్ఛబ్దః - అల్లువాఁడు, టీషః-తమ్ముఁవాఁడు, గొల్లవాఁడు.

మగాదిత్రికస్త్రీసమేభ్యో బహుళమ్ - (మగఁడు, మనుమఁడు, ప్రేఁడు, ముదుకఁడు, బాఁపఁడు, గొల్లఁడు, జాణఁడు, పాఁపఁడు, రాయఁడు, బొట్టెఁడు, ఏతే మగాదయః)

సర్వస్మా త్సంబంధే- (రామునంతవాఁడు, రామునట్టివాఁడు, రామునియంతవాఁడు, రామునియట్టివాఁడు, నీయట్టివాఁడు, నీయంతవాఁడు, అత్ర సమాసో అర్థస్యనిరూప్యతే)

కులవాచకాదితివక్తవ్యమ్

నబాఁపాత్

కన్యోశ్చటేష్టిక్

యుష్మదస్మదాత్మార్థానాం దుగ్వోత్తరపదే-ఉత్తరపదేకిం. నాది ఇత్యత్ర దుజ్నదృశ్యతే, అతదర్థేకిం-నావాఁడు, నాయది?

యుష్మదస్మదాత్మార్థానాం తల్లోపేదుగ్వా

నలాద్విభ్యో వాయోర్వః

మ్యన్తస్త్రీసమయోః ప్రాజ్నిత్రికా ప్రయోజ్యౌ

ఉ రానజ్విషయస్య రోవా- (అనజ్విషయస్య ఋుతోరః)

దీర్ఘసమాసే జీప్చక్వాహ్రస్వః

అనుప్రయుక్తస్య నిత్యం లోపః

అన్నిప్రభృతయ స్సర్వనామాని-(అన్ని

క. ఆనృపనందనుసోదరి, మానసభవురాజ్యలక్ష్మి మదిరావతి య
న్నానవతీతిలకం బు,ద్యానవిహారంబు సలుప నరిగెడువేళన్. ౨౧

క. విలసితమరాళరాజీ, కలకల మెసఁగంగ మెలఁగు కమలిని వోలెం
గలనూపురకాంచీమం,జులరావము లెసఁగ నింతి చూడ్కికి సొక్కెన్. ౨౨

క. హారావళిలో నయ్యం, భోరుహలోచనకుచాగ్రములు గనుపట్టెన్
శారదనదిఁ గానంబడు, హారిసరోజాతకుట్మలాగ్రములగతిన్. ౨౩

ఉ. అవ్వనజాక్షిఁ జూచి హృదయంబున రాగము నివ్వటిల్లఁగా
నివ్వెఱఁగంది ఱెప్ప లిడనేరక చూడఁగ ధైర్యమూలముల్
ద్రవ్వెడుచూపుల న్వికచతామరసాసన చూచె నామదిం
బువ్విలుకాఁడు దట్టముగఁ బువ్వుశరంబులఁ దూఱనేయఁగన్. ౨౪

క. పులకలుఁ జెమరును గంపము, నెలకొన నొకమాఱునందు నిలిచితి నేను
జ్జ్వలపుష్పబాణబాణా, కులిత యగుచు నెట్టకేనిఁ గోమలి చనియెన్.

వ. ఏనును మీనకేతనోదార శరాసారవిదారిత మానసుండ నగుచు విజయసేనుం గొలువ నరిగి యవసరం బగునంతకు నగరిలో నొక్కెడ వసియించి మదిరావతినిం జింతింపుచున్నంత నన్నాతి యుపమాత గనుంగొని కన్నుసన్న నన్నుం జేరి ధవళాంబరంబునం బొదివినకెందుకంబు చందంబున నున్న పూదండ నాకుం జూపి యి ట్లనియె. ౨౬

క. ఏమితపం బొనరించితొ, మామదిరావతి ప్రియంబు మదిఁ గదురంగాఁ
దా ముదముతోడఁ గట్టిన, యీమాలిక నన్ను నీకు ని మ్మనిపలికెన్. ౨౭

క. వేయింటికి నీవ మనో, నాయకుఁడవు మేదినీశనందన యని తా
నాయుజ్జ్వలదామంబును, నాయుఱుతం బెట్టె నాననము వికసిల్లన్. ౨౮

క. ఆలలన తాన కట్టిన, మాలిక ధరియింపఁ దద్రమణికరములగా
ఢాలింగన మొనరించిన, యాలా గొందుటయు సుఖమయాత్ముఁడ నైతిన్.

వ. అ ట్లత్యంత మోదాయత్తచిత్తుండ నై యన్నాతి నన్ను వరియించు నని యున్నంత. ౩౦

క. జగతీపతి తనపుత్త్రికిఁ, దగువరుఁ డని యొక్కరాజతనయునకుఁ దగ
న్మృగనేత్ర నిచ్చువాఁడై, యగణితశుభలగ్ననిశ్చయము సేయుటయున్.

క. అమ్మాట పిడుగుమ్రోఁతవి,ధమ్మునఁ గర్ణములు పగులఁ దాఁకుటయును ను
ల్లమ్ము గడుఁ దల్లడిల్లఁగఁ, గ్రమ్మెడు విరహాగ్నిసెఁకపరాక తరలఁగన్. ౩౨

వ. అత్తఱి మదిరావతిపుత్తెంచినపరిచారిక యొక్కతె యరుగుదెంచి నన్నాఱడించి యబ్బోటి తనయాడినమాటలు వినుమని యిట్లనియె. ౮౩

ఉ. భూమివరుండు తన్ను నొక భూపకుమారున కిచ్చునంచు నీ
వేమియుఁ జింతఁ బొందవల దీక్కియ నిన్ను వరింతు నెంతయుం
బ్రేమ దలిర్ప నొడ్లను వరింపఁగ నామది కియ్యకోలు గా
దామనుజేంద్రుఁ డేల నను నన్యుల కిచ్చు ననాదరంబునన్. ౮౪

గీ. అనెడుపల్కు సుధాసేక మగుచుఁ జెవుల
నలరఁజేసె డెందంబు కొందలము మాన్పెఁ
జలన మొందినప్రాణంబు నెలవుకొలిపె
నూతనాంగజరాగంబు నూలుకొలిపె. ౮౫

వ. అమ్మగువమాటలు విని నమ్మి యిమ్మెయి నూఱడిల్లి యున్నంతఁ గొన్నిదినంబులకు లగ్నదివసంబు వచ్చుటయు. ౮౬

సీ. రాజనిశ్చితుఁ డైన రాజకుమారకుం డభినవవిభవంబు లతిశయిల్ల
నసమానమణితోరణాలంకృతం బైన రాజమార్గంబున రమణతోడ
నానావిధవిభూషితానేకజనములు చెలువారఁ దనచుట్టు బలసికొలువఁ
గనకహర్మ్యము లెక్కి కామినీజనములు తనమీఁద శేషాక్షతములు చల్ల
వివిధశోభనవాద్యము ల్విస్తరిల్ల, నతులవందిమాగధజనస్తుతులు చెలఁగఁ
బ్రీతి మదిరావతీకన్యఁ బెండ్లియాడ, వైభవోన్నతు లలరార వచ్చుటయును.

క. ఏ నావిభవము గనుఁగొని, మానసమునఁ జాలఁ గుంది మదిరావతిపై
నూనిన యాస విడిచి యతి, దీనతఁ బురి వెడలి పోయి ధృతి మాలి వెసన్.

క. కాయజవేదన కోర్వక, కాయము విడువం గడంగఁగా దైవగతిన్
నాయున్నయెడకు బుద్ధిస,హాయుఁడు వచ్చుటయుఁ గాంచి హర్షం బెసఁగన్.

వ. గాఢాలింగనం బొనరించి వృత్తాంతం బంతయు నెఱింగించినం జింతింపవలదు నీహృదయవల్లభ నీకు సిద్ధించునుపాయంబు గలిగెడు నని యూఱడించి నీపడినయట్ల యేనునుం బడితి నాకథ వినుమని యిట్లనియె. ౯౦

గీ. అట్లు వింధ్యాద్రి మిమ్ముఁ బాసి యరిగి యేను
బెక్కుగహనంబులు తరించి యొక్కయడవి
నిందిరామందిరం బయి యందమందు
శంఖపాలాఖ్య నొప్పారుసరసిపొంత.

క. పలువురుబోటులతోడను, జలకేళి యొనర్ప వేడ్కఁ జనుదెంచిన యు
జ్జ్వలయౌవనైకవసతిని, విలసితరూపవతి నొక్క వెలఁదిం గంటిన్. ౯౨
క. అంగనకబరీమేఘమును, నంగతటిత్స్ఫూర్తియుఁ జూచి యనురాగముతో
నంగజకేళీమయూరము, భంగిని సన్నద్ధవిఘూర్ణభావుఁడ నైతిన్. ౯౩
క. ఆకాంతయు నన్నచట వి,లోకనములఁ జూచుచుండె లోలాక్షికయై
యాకొలనివంక నొక్కము,హాకరి యప్పటికి వచ్చె నంభోవాంఛన్. ౯౪
మ. గళదుద్యన్మదరంజితభ్రమకరేఖం గాలకూటచ్ఛవిః
కలితోదంచితమందరంబు విధ నై కర్ణానిలాలోల దీ
ర్ఘలసన్నిర్మలచామరంబుల బలాకావేష్టితాభ్రంబునా
నలి గర్జిల్లెడు నాగజంబుఁ గని కాంత న్గొందలం బందఁగన్. ౯౫
వ ఓడకోడకు మని యక్కామినిం జేర నరుగుటయు. ౯౬
క. అతిభీతిరాగయోగో, ద్ధతకంపచ్ఛేదపులకితప్రసభసము
న్నతకుచము లురము గాడఁగఁ, నతివ నను౦ గౌఁగిలించె నతిరభసమునన్.
చ. కనుకలిఁ జిక్కి యేను బిగికౌఁగిటఁ జేర్పఁగఁ గోరునాసరో
జనయన యపు కుంజరమిషంబునఁ బైపడి యిట్లు కౌఁగిలిం
చినఁ బులకించి యిట్టి దని చెప్పఁగరాని సుఖంబుఁ జెప్పిన
న్నను నెఱుఁగంగనేరక మనంబున నేన కరంగుచుండితిన్. ౯౮
వ. ఇవ్విధంబున నభినవసౌఖ్యంబు లనుభవించి యే నయ్యేనుంగు నుద్దేశించి.
ఉ. ఓకరిరాజ నీకతన నుత్పలలోచన దాన వచ్చి న
న్నేకొని కౌఁగిలించె వికసిల్లుచు నిట్టి పరోపకారికి
న్నీకుఁ బ్రియాసమాగమము నిచ్చలుఁ గావుతఁ దత్తరోల్లస
చ్ఛీకరశీకరప్రకరసేకసుఖంబులు నివ్వటిల్లఁగన్. ౧౦౦
వ. అని దీవించితిం దదనంతరంబ యాసామజంబు నపారానుసీత్కారపూరితశీ
కరాసారమండితం బైన కరదండం బార్చుచు నామీఁదన కవిసిన నయ్యింతి
నోసరిలం జేసి. ౧౦౧
క. కరికరము వట్టికొని,... ... ... ...
వెరవుమెయి దాఁటి యరిగితి,మరలి కనుంగొనకమున్నమహితరయమునన్.
క. ఏను గరికడ్డుపడునా, లోనన నెచ్చెలులు పద్మలోచనఁ గొనుచుం
గాననము దరిసి రెచ.................. ౧౦౩

వ..........రంబ ప్రవేశించి యున్నంత దంతావళంబు సరఃప్రాంతంబున నెంతయుం దడవు విహరించి యది తొలంగి చనుట యెఱింగి యయ్యెడ వెడలి యన్యోలనాగ చనిన వలని......బున. ౧౦౪

ఉ. ఆవనజాక్షి నేవలన నారసి కానక యాతురుండనై
భావజవహ్నిఁ గ్రమ్మికొని భావము గాల్పఁ జరించునంత రా
జీవవిరోధిమండలము చిచ్చుఱపిడ్గను బోలె నెన్నఁ
... ... ... ... ... ...చుమ్. ౧౦౫

వ. అప్పు డేపారు మదనానలతాపంబున కోర్వక మరణోద్యుక్తుండనై యాంగికంబు లగుశుభసూచకంబులు గల్గిన నంగనం గనుంగొనియెద నను... ...డనై పెక్కెడలం జరించి యిక్కడకు నరుదెంచి నిన్నుఁ గాంచితి నని తనవృత్తాంతంబుఁ జెప్పిన యనంతరంబ మనోభవాధీనమానసుండనైన నన్నాలసించి యి ట్లనియె. ౧౦౬

క. ... ... ... ... ... మునిగుడికిం
జనిలో నొక్కెడ నుండఁగ, మనకోర్కి ఫలించు నిచట మసలఁగ నేలా. ౧౦౭

క. అని పలికి నన్నుఁ దోడ్కొని, చనఁగా నిరుపురముఁ బుష్పసాయకుగుడికిం
జని గర్భగృహంబున న,మ్మనస... ... ... ... ... ౧౦౮

వ. ... ... యంబునం గరదీపికాసముదయంబు వెలుఁగ సాంద్రోల్లిఖితారూఢ మై యమందవిభవంబున, ౧౦౯

క. ఘనవాద్యఘోషభీషణ, జనవననిధి నడుము లక్ష్మిసరణి నమరుచుం
జను ... ... ... ... నంగజుగుడికిన్ ౧౧౦

గీ. వచ్చి చెలువందఁగా నెల్లవారి నిలిపి, యొక్కతియ గుడిసొచ్చి చిత్తోద్భవునకు
మ్రొక్కి కరకమలంబులు మోడ్చి నిలిచి, కన్నునీరొల్కి నిట్లని విన్నవించె.

క. అగణితవిలాసు నొక్కని ... ... ... ... ...
... ... కవేలయొక్కని, మగఁ డని తగిలింపఁ దగునె మనసిజ నీకున్,

క. ప్రాణేశవిరహ మోర్వం, బ్రాణము విడిచెదను మీఁదిభవమున నైనం
బ్రాణేశ్వరుఁ గందర్పరతి, ప్రాణే..................... ౧౧౩

వ. నిర్భరతరం బగుసాహసంబున గర్భగృహంబు సొచ్చి కంఠంబున నురి యిడుకొనుటయు. ౧౧౪

క. బాలిక డగ్గఱియెత్తి కు, చాలింగనపులకకలిత మగుకేల మెడం
గీలుకొనిన యురి వచ్చిన, నాలోకించి నను నెఱిఁగి యాసమయమునన్.

క. ఆనందకంపలజ్జల, నూనినమదితోడ వెచ్చనూర్చుచు నయ్యు
జ్జ్వానన సబాష్పగద్గద, యై నన్నుం గౌఁగిలించె నత్యనురక్తిన్. ౧౧౬

వ. అట్లు ప్రియాలింగనసౌఖ్య తరంగితాంతరంగుండ నై యామకరంగలోచనం
గనుంగొని, ౧౧౭

క. వనజాతనేత్ర యడలకు, నిను వెరవునఁ గొనుచుఁ బోదు నిమిషములోనన్
మనపాలిపుణ్యదేవత, మనసిజుఁ డిచ్చోటఁ గూర్చె మనలం గరుణన్.

వ. అని యూఱడించు సమయంబున బుద్ధిసహాయుండు నన్నుం గనుంగొని యి
ట్లనియె, ౧౧౯

చ. వెలఁదుకభూషణంబులును వేషము నచ్చుపడంగఁ దాల్చి యే
వెలువడి పెండ్లికన్యయన వేడుక నందల మెక్కి యేగెదం
గలజను లెల్లఁ బాయ వెసఁ గామిని దోడ్తొనిపోయి యంబికా
నిలయములోన నుండు మని నేర్పున ధైర్యము విస్తరిల్లఁగన్. ౧౨౦

చ. కచభర మూడ్చి నుంమురుముగా నిడి మించినపూవుగుత్తులం
గుచ్ఛములు గాఁగఁ గట్టుకొని కోమలి భూషణవస్త్రమాలికా
ప్రచయము దాల్చి మీసములు రాని మొగంబునఁ గాంతిమొప్పఁగా
నచలగతి న్ముసుంగిడి లతాంగిగతి న్వెలి కల్ల నేగినన్. ౧౨౧

వ. పరిజనంబులు సంభ్రమంబున నద్దియు నెఱుంగక యాందోళిక యెక్కించు
కొని క్రందుకొనం గొలిచి యందఱు నరిగిన. ౧౨౨

క. మదిరావతిఁ దోడ్కొనిచని, మదిరాగం బెసఁగ దుర్గమందిరమున నె
మ్మది రాగిల్లుచు నుండఁగ, నది రాజ్యముకంటె నాకు హర్షముచేసెన్.

వ. అట్లుండునంత బుద్ధిసాహాయ్యుండు మూఁడవజామునఁ బ్రియకామినీ సహి
తుం డై యచ్చటికి వచ్చిన నచ్చెరు వంది పిచ్చలించుచున్న యంతరం
గంబు లలర గాఢాలింగనం బాచరించి యిచ్చెలువ యెచ్చట నీకుం జే
కుఱె ననిన హాసభాసిత వదనుం డగుచు ని ట్లనియె. ౧౨౪

ఉ. ఏ వనితాకృతి న్నగరికేగి నృపాత్మజయుండునట్టి య
య్యోవరి కేగి తల్పమున నొప్ప ముసుంగిడి యున్నయంత న

న్యాభవరకన్యఁగాఁ దలఁచి పొల్తుకయొక్కతె చేరవచ్చి తా
నావనజాక్షిచిత్తగతి యంతయు మున్నె యెఱుంగుఁగావునన్. ౧౨౫

వ. ఎవ్వరు వినకుండ నల్లన నిట్లనియె. ౧౨౬

ఉ. వందఁగనేల యట్ల వలవంత దొఱంగుము రాజకన్యకుం
బొందఁగవచ్చునమ్మ తనబుద్ధికి వచ్చినవాని దంత్రి యా
త్మం దలపోసి యిచ్చినయతండు వరుం డని యుండు నెమ్మితో
నందనినృపానిపండులకు నజ్ఞులు సాఁపరు పద్మలోచనల్. ౧౨౭

క. ఈవేగుజాము పెండిలి, యీవిధమున నుండు టుచితమే తలపోయన్
భావజవహ్నియడంగెడు, భావంబున ధైర్య మింత పట్టుకొలుపుమా.

క. మానసభవు శిఖవేఁడిమి, యే నెఱుఁగనె దీని ననఁగ నేఁటికి విరహా
గ్లానిం గుందుచు మానిని, గానేరక యున్నదానఁ గమలదలాక్షీ. ౧౨౮

గీ. శంఖపాలాఖ్య నొప్పారుసరసి పొంత, నుగ్రథాకారు నొక్క(కుమారు)ఁజూచి
యుల్లమలరంగఁజేరుచోనొకగజంబు,విధివశంబుననముఁబాపెఁబేఁకఁగదిసి.

క. కరి ప్రాణేశ్వరుఁ బాపిన, విరహమునకు నోర్వలేక వేఁదురునై యా
ఘ్రిరుఁడు దగిల్చినచిచ్చున, నురిసెద నదిమొదలుగాఁగ నుత్పలనయనా.

క. నాపుడు మత్ప్రియఁగా మది, భావించి మునుంగు వృచ్చి భావం బలరన్
నీవల్లభుఁడను నే నని, నావృత్తాంతంబుఁ జెప్పినం దెలిసి వెసన్.

క. అంగము తాపము వాయఁగ, నంగన నను గౌఁగిలించి నూత్నాగరంగం
బొంగెడునాదెసఁ గనుఁగొని, యంగనయిట్లనుచుఁబలికెనతిమృదుఘోషతిన్.

క. ఈమదిరావతితల్లియు, నామాంతయుఁ దోడఁబుట్టినార ట్లగుటన్
భూమీశునాజ్ఞఁ బెండ్లికి, నే ముదమున వచ్చి కంటి నిచ్చట నిన్నున్.

వ. అని చెప్పిన నత్యంతసంతుష్టాంతరంగుండ నై మదిరావతీకల్యాణనిమిత్త
మదిరాపానమత్త పరిజనప్రతీహారద్వారపాలాదుల వంచించి వచ్చితి నని
చెప్పిననువ్పొంగుచు నీప్రొద్ద కదలి యిద్దఱము నన్నార్థుల(?)మై యింతులం
దడవికొని కాంతారమార్గంబున నరుగుదెంచి యిచ్చట దేవరం గాంచి కృ
తార్థుల మైతి మని చెప్పిన నద్భుతరసాయత్తచిత్తుం డయ్యెఁ దదనంతరంబ.

క. ఆనరనాయకుఁ డత్తఱి, నేనికవేఁటాడ దూర మేగి యొకమహా
కాననములోన దుర్గా, స్థానముఁ గని యచటఁ జేరఁ జనియెడునంతన్.

వసంతకునికథ.

క. పరమేశ్వరి కతిభక్తిని, నరబలి యొసరింప వచ్చినకిరాతులు వ
న్నరపాలునిఁ గని పట్టిన, నరులవిడిచి భీతిఁ గాననముఁ దూఱుటయున్.

క. బుధ్యధికుండు వసంతకు, వధ్యశిలాగ్రమునఁ గాంచి వసుధాధీశుం
డధ్యానందుం డగుచున్, విధ్యనుకూలతకు నాత్మ వికసిల్లంగన్. ౧౩౯

క. తనమంత్రులుఁ దానును వా, హనములు వే డిగ్గ చేర నరిగి యతని బం
ధనము లెడలించి యాలింగనముల నొసరించియుపుడు ఘనమోదమునన్.

వ. అతండును దానును సముచితోపాయనంబు లిచ్చి దేవికి సాష్టాంగదండప్ర
ణామంబు లాచరించి శీతలతరుచ్ఛాయ నాసీనులై యుల్లాసంబున సత్తరం
డడుగఁ దమవృత్తాంతం బెఱిఁగింపఁ దదనంతరంబ వసంతకుండు కరయు
గంబు మొగిచి మహీకాంతున కిట్లనియె. ౧౪౦

రూపిణీకథ.

క. భూరమణ నిన్ను వెదకుచు, ఘోరాటవిలోనఁ దిరుగఁ గొందఱు చోరుల్
క్రూరత మీఱఁగ నొకచే, హారిధనంబు హరియింప నతఁ డాతురుఁడై.

క. మొఱవెట్టఁగ నావైశ్యుని, వెఱ పంతయుఁ బాపి చోరవీరుల నెల్ల
న్నుఱుమాడి యాతఁ డెంతయు, వెఱఁగందఁగ సొమ్ములెల్ల వెసనొసఁగుటయున్.

వ. అత్యంతసంతోషంబున నతండు వినతుం డై నన్ను బహువిధంబులం గొని
యాడి మదనోల్లాసం బనుతనపురంబునకుఁ దోకొనిపోయి యపారధనంబు
లిచ్చి సంభావించె నప్పురంబు బహువిధ వినోదాస్పదంబు. ౧౪౩

సీ. శుకుఁ డైన నవ్వీటి జోటులఁ జూచిన భంగంబు నొందు దర్పకునిచేత
శివుఁ డైన నప్పురిచెలువలఁ జూచిన మరులొందు భావసంభవునిచేత
శరజన్ముఁ డైన నప్పురికామినులఁ గన్న రాగాంధుఁ డగు రతిరాజుచేత
వరదుఁ డైనను నన్నగరకాంతలను గన్న మదనాతురుండగు మదనుచేత
బ్రహ్మచర్యంబులకు నెల్లఁ బాయుదెరువు, వివిధనియమంబులకు నెల్లవీడుకోలు
మహితభోగంబులకు నది మందిరంబు, ల............ న్మథోల్లాసపురము.

సీ. హాటకహర్మ్యంబు లంగ రేఁకులవారు* పరిచారికావళి భటచయంబు
స్మరబంధచిత్రము ల్మకినలమంచము ల్మరుపు గీరంబులుఁ బారువంబు

(1) ఈపద్యము మూఁడవయాశ్వాసములో నున్నదని- శబ్దరత్నాకరము.

లాలవట్టంబులుఁ గీలుబొమ్మలు మంచి పైఁడిపన్నారులుఁ బట్టుతెరలు
నిలువుటద్దములు గంటల యుయ్యాలలు హంసతూలికపాన్పులు దోమతెరలు
సారమృగమదకర్పూరచందనములు, లలితచీనాంబరాదులు పొలుపుమిగిలి
చెలువుమీఱ మనోహర శ్రీల మెఱసి, యొప్పుదురు వారకామినులప్పురమున.

వ. ఇట్లు మనోహరంబై యొప్పు నప్పురంబుననుండి యొక్కనాఁడు దేవాలయంబున కరిగి రూపిణి యనునర్తకినృత్యంబు చూచుచుండ నయ్యంగన నన్నుం గనుఁగొని యంగజాయత్తచిత్తయై తనయనురక్తి చెప్పి నాపాల్కి దూతికం బుత్తెంచిన నది ప్రార్థించి తోడ్కొనిపోనఁ దత్సదనంబునకుం జనిన నది యనురాగంబున నాతోడి యిష్టోపభోగంబులం దగిలి, ౧౪౬

ఉ. మెచ్చదు వీటిలోనఁ బెఱమిండల నెవ్వరిఁ దన్నుఁ గోరి వే
యిచ్చెద మన్న నందికొనదీ దొకయప్పుడుఁ దల్లితోడ నా
యిచ్చిన యీగి సెప్పికొను నెందునుబాయుట కోర్వ దాత్మలో
నచ్చపలాక్షి నన్నుఁ బ్రియమారఁగఁ బొందినయంతనుండియున్. ౧౪౭

క. ఎడపక నాఁడునాఁటికిఁ, గడునూత్నము లైన రతులఁ గౌతుక మొదవం
బడఁతి యలరింప నెక్కుడఁ, బొడిచితె ప్రొద్దయని యింపు పొంపిరివోవన్.

వ. నిరంతరానుమోదంబున నున్నయవసరంబున, ౧౪౯

సీ. *జిత్తుల వట్టంబు జఱభి మాటలపోతు పలుగాము డాకిని బందికత్తె
చెడుగు బమ్మెతకత్తె చిక్కొంకి రక్కెస యోడిసి జూదరిక......
... ... ... ... దినంబులు పోరిపోరి. ౧౫౦

క. ఈపగిదిఁ బోరియును నను, రూపిణిఁ బాపఁగలేక క్రూరత నొకరే
పాపాత్మిక యది నాప్రా, ణాపాయ మొనర్పఁ దలఁచి యతిదౌష్ట్యమునన్.

క. రూపిణికి నాకుఁ జొక్కిడి, యాపొలఁతుకఁ బాపి యిద్ద ఱితివలచేతన్
మోపించుకొనుచుఁ గొని చని, వే పాఱెడు నీటిలోన విడిచి యరిగినన్.

క. మోచుకొని యరుగునప్పుడు, చూచుచునుండియును నేను జొక్కుకతమునన్
లేచి చనలేక నదిలో, వైచిన నొకకొంతతడవు వఱద నరుగఁగన్. ౧౫౩

క. అంగంబు నీటిలోన ము, నింగినఁ జొక్కెడలుటయును నెఱిఁబడి యేనుం
డంగ వఱదఁబడి యొకమా, తంగముఁడొక్క ననుఁ జేరె దైవవశమునన్.

---

* యతియెట్లు?

దనువు బ్రహ్మంబని తాఁ జెడు టింతె కాకది బ్రహ్మ మెన్నఁటికైన నగునె
దేహంబు నేనను తెలివి యవిద్యది సంసారహేతువై జనులఁ జెఱచు
సచ్చిదానందమయుఁ డను సత్యమైన
వస్తువనువాఁడు నినుఁ జేరవార్యగతిని, యనఘ। ౫౨

శివధర్మవర్ధనశీలుఁడ వగునీవు శివధర్మవర్ధనశీలుఁ డగుట
పుణ్యజనావనస్ఫురణుఁడై తగునీవు పుణ్యజనావనస్ఫురణుఁ డగుట
అరిదరకరుఁడుగా కలరుచుండెడు నీవు నరిదరకరుఁడవై యలరుచుంట
సంతతాశ్రితవిభీషణత గాంచని నీవు సంతతాశ్రితవిభీషణతఁ గాంచు
టద్భుతం బయి కనుపట్టె నౌర నేఁడు
ఊఁడ వెట్లయినను నను వాఁడు గలఁడె, యనఘ॥ ౫౩

జ్యాకర్షణోద్యద్భుజాప్తి గల్గిననీకు జ్యాకర్షణోద్యద్భుజాప్తి తగదె
సంతతామోదకుజాప్తి గల్గిననీకు సంతతామోదకుజాప్తి తగదె
మేఘనాదప్రాప్తి మెచ్చుచుండెడినీకు మేఘనాదప్రాప్తి మెచ్చఁ దగదె
సంతతాహీనప్రసక్తత దగునీకు సంతతాహీనప్రసక్తి తగదె
జగతిఁ దలపోయ నని సర్వజనములెన్న
వెలసితివి బళి సత్క్రియా కలిత విభవ, యనఘ॥ ౫౪

ఘననీలముల నేలఁగల లీలగలమేని డాలువాఁ డరులఁ బోఁద్రోలువాఁడు
బలువెక్కసపురక్కసులఁ జెక్కఁగలవాలుగలుగువాఁ డవనిపై వెలుఁగువాఁడు
చెలిగోరి నలిమీఱి వెలిఁబాఱి మలఁజేరి పోవువాఁ డమరులఁ బ్రోవువాఁడు
తనుగప్పుకొన నొప్పుగను గొప్పబంగరు వలువవాఁడు డిమోని చెలువవాఁడు
వీరశృంగారరసము లాకారమూని
నటులనుండెడి వాఁడు నన్నరయుఁగాత, యనఘ॥ ౫౫

నినుఁబోలు దొర లోకమున లేఁడు నీవంటి దేవదేవుండు నుతింప లేఁడు
కులరూప వితరణగుణముల పురుషుల దృష్టి చిత్తముల హరించినట్టి
వాఁడవు మఱి దొడ్డవాఁడవు సిరులిచ్చువాఁడ వన్నిటను బళి ప్రోడ వెన్నఁ
దరమె నీగాంభీర్యధైర్యవీర్యస్థైర్య వినయాదిగుణముల విశ్వమందు
శేషునకునైన మఱియు నశేషనిగమ,
ఘోషునకునైన జగతిలోపల మహాత్మ, యనఘ॥ ౫౬

హరికుమారుని బట్టి హరికుమారుని గొట్టి హరికుమారుని వని కనిచినావు
ఖరకరాన్వయుఁడవై ఖరకరీంద్రుని ఖరనఖరాయుధుని మాడ్కి నలకినావు

కమలాప్తుఁడై పూని కమలాప్తుపై నప్పిౕకమలాప్తశరములఁ గప్పినావు
శేషుఁడవయ్యు నశేషలోకంబులు శేషునితలలపైఁ జేర్చినావు
ఏమి చెప్పుదు నీమహాహీనచర్య
లార్యులకుఁగాక యితరులకగునె తెలియ, ననఘ॥ ౫౭
మునుశుక్తిఁగని వెండి యని భ్రాంతిచేఁ జని పనిఁబూని చేకొనఁబాఱినట్లు
నిండి బయల్వారు నెండమావులఁ గని వారిపూరం బని చేరినట్లు
తనముందుఁ బడియున్న త్రాడు నెంతయుఁ జూచి పామటంచనిభీతిఁబఱచినట్లు
పిండిఁ గల్పిన నీళ్ళు దండనుండఁగఁజూచి పారి క్షీరమని త్రావఁబూనినట్లు
దేవదేవుఁడ వని నిన్నుఁ దెలియ కన్య
దేవతలఁ జేరఁబోదు రీక్షీరమతులు, అనఘ॥ ౫౮
దేహమస్థిర మని తెలిసి దేహముమీఁద మోహంబు విడువక మూఢుఁ డగుచు
నాయు వల్పంబని యరసి యాయువుమీఁదియాసఁ బోనాడక యజ్ఞుఁడగుచు
సారసంపదలెల్ల జలబుద్బుదము లని పరిహరింపఁగ లేక బద్ధుఁడగుచు
సంసార మత్యంతహింసాకరం బని తొలఁగఁజాలక లోభకలితుఁడగుచు
నరుఁడు మునుఁగుచుఁ దేలుచు ధరణినుండి
కడకు నరకంబుఁజేరు నీకరుణలేక, యన॥ ౫౯
త్రిభువనోద్వేజకప్రభుతఁ బూనిన రావణాసురు నని నేర్చి వాసవాది
దేవతల్ నుతియింప దివ్యకోదండంబు వామహస్తంబున వసుధమీఁద
నిల్పి నిల్చుక మఱి నిరుపమేతరహస్తమున నొక్కశరమును మొనసిపూని
త్రిప్పుచు నారక్తదీప్తలోచనుఁడవై శరదారితాంగనిస్సరదమేయ
రక్తసంసిక్తుఁడై మోక్షిరపులమాడ్కి, వెల్గు శ్రీవీరరాముఁడవీవకావె, యన॥
కల్పవృక్షచ్ఛాయఁ గాంచననవరత్నసింహాసనమున నాసీనుఁ డగుచు
వామాంగముననుసీతామహాదేవియు జలదసంగతతటిత్స్ఫురణి వెలుఁగ
నగస్త్యపాగస్త్యమార్కండేయకౌశికముఖ్యమౌనులు శాస్త్రములనుదెల్పఁ
బరమభక్తుఁడయిన పవనాత్మజునకుఁ దత్త్వోపదేశముఁ జేయుచుచిత్తఘణితిఁ
బ్రేమమీఱఁగఁ బట్టాభిరాముఁ డగుచు
నవని వెలుఁగొందు నిన్ను నేనాశ్రయింతు, నన॥ ౬౧
అంభోధిమథన దివ్యాస్త్రనిర్జితనిర్జరారాతిచయ విజయాభిధాన
దానతర్పితవిప్రతతిసమర్పితమహాశీర్వాదలబ్ధవిశేషవిభవ

భవసమర్చితపాద భవవారివహపాలితాఘకృన్మనుజ మహానుభావ
భావజాభాంగ సంభావనీయచరిత్ర మిత్రవంశాంభోజ మిత్రరూప
నేత్రసౌందర్యజితపద్మగాత్రకలిత,కనకమయనేత్రకరధృతకనత్రవేత్ర,యనఘ॥
సీతామనోహరాశ్రితభక్తమందార శూరవంశోద్ధార శుభవిహార
హారకేయూరముద్రాదిభూషణభూషితావయవానంత శేవకాప్త
యాప్తాఖిలాశాంతరాధిపత్యాపత్యభూతసత్కుశలవ పూతచరిత
చరితమహావ్రత సరిదధీశవిహారమందిర సుందర వందనీయ
వందివందితగుణగణ నందితార్థి,బృందబృందావనాగతానందసుకర, యనఘ॥
నిర్గుణనిరపాయ నిర్లేపనిరవద్య నిస్సంగ నిర్మోహ నిత్యసత్య
చిన్మయ చిద్రూప చిత్సేవ్య చిన్మాత్ర చిదచిదాత్మక యోగిచింత్య మహిమ
దద్వాచ్య తద్భేద్య తద్భోజ్య తత్సాధ్య తత్త్వవినిశ్చిత తత్త్వగమ్య
పరమ తేజోమయ పరిహృతామయ మహాద్వంద్వ నిర్ద్వంద్వ పదప్రదేయ
హేయసంసారనిస్తారహేతుభూత, పాదపంకజ సర్వసంపద్విధేయ, యనఘ॥
నారాయణానంత నరసింహ వామన దామోదరాచ్యుత కామపాల
కృష్ణహృషీకేశ కేశవ పరమాత్మ వాసుదేవ ముకుంద వారిజాక్ష
పక్షీంద్రవాహన రక్షితత్రిభువన వనవాసవాసవవర్ణితాంఘ్రి
వల్లవపల్లవీప్రాణేశ పరమేశ యోగిహృద్ధ్యేయ వియోగయోగ
భోగదూరాచలాఖండపుణ్యమూర్తి,సకలదిక్పాలితామేయసరసకీర్తి,యనఘ॥
హారమందారడిండీరకర్పూరగోక్షీరనీహారశతారకాశ
తారకహారహీరశారదనీరదాహీంద్రసితాంభోజచంద్రచంద్రి
కామరతురగహంసైరావతామృతశారదాభాపగాశంఖకుంద
కల్పకకలశాబ్ధికామపాలమహోక్ష తార్క్ష్యనగవాబ్జజతనయసముద
యాచ్ఛకీర్తిప్రపూరితాజాండభాండ,చండకోదండమండితోద్దండపాణి,యనఘ॥
మంగళంబులకెల్ల మంగళం బైయుండు నీనామధేయంబు నిరతమందుఁ
బరలోకమున కేగుపాంథుల కీనామధేయంబు దివ్యపాథేయగ్రంథి
ధర్మవృక్షములకిద్ధ ణిపై నీనామ ధేయంబు బీజమై తేజరిల్లుఁ
గామితార్థములెల్లఁ గలిగింప నీనామధేయంబు ఘనకామధేనువౌర
(సరస)నీనామ మత్యంత సౌఖ్యసమితి, దాయకంబగుధీరసంతతులకెల్ల, నన॥
(శ్రీ)రామనామంబు కోరి పఠించిన బ్రహ్మహత్యాది పాపములుగ్రుంగు
(శ్రీ)రామనామంబు కోరి పఠించినఁ దాపత్రయంబులు దారిపోవు

శ్రీరామనామంబు కోరిపఠించిన దుష్టగ్రహంబులు తొలఁగిపోవు
శ్రీరామనామంబు కోరిపఠించిన దారిద్ర్యదుఃఖము దొలఁగిపోవుఁ
గాన శ్రీరామనామంబు మానవులకు
సకలసౌఖ్యప్రదంబునై జగతి వెలయు, సన॥ ౯౮

సిరుఁజేరుకొని ముక్తిఁగవియెద నంటినా నానాలు కా పనిఁ బూనలేదు
నీరూపుఁగనిముక్తి నెనసెద నంటినా నాకన్నుఁగవ దగనాసగొనదు
నీకథల్విని ముక్తి నెనసెద నంటినా నాకర్ణములు వినరాక మరలు
నీపూజచే ముక్తిఁ బ్రాపింతు నంటినా నాకరంబులు దాని నాటనియవు
ఏమిసేయుదు నాపను లేమిసాగ, నబలుఁ డనుగానరక్షింపుమరసినన్ను, సన॥

శిరముపై ధగధగ మెఱయు కిరీటంబు కంఠసీమను మణికౌస్తుభంబు
కరముల నవరత్నకంకణవ్రాతంబు లత్యచ్ఛభుజముల నంగదములు
నంగుళంబులయందు నంగుళీయకములు శ్రోణిస్థలిని హేమశ్రోణిసూత్ర
మంఘ్రియుగ్మంబున నమల మంజీరమ్ము లంగమ్మునందు హేమాంబరమ్ము
నెంచిమదిలోననీకునర్పించిమించి, చాలముదమందుచుందునినొఁలిఁజూచి॥యన॥

శ్రీరామ నీనామపారాయణముసేయు వారికి భవభవభయము విడుగు
శ్రీరామ నీనామపారాయణముసేయువారియఘౌఘంబు లాఱుచుండు
శ్రీరామ నీనామపారాయణముసేయు వారి కింపైనసంపద లొగలుగు
శ్రీరామ నీనామపారాయణముసేయువారికి నీపాదభక్తి గలుగు
నంతఁగడ తేఱివాఁడు దేహాంతమందు, నీపురంబందువసియించునిన్నుఁబొందు॥

వేదశాస్త్రాభ్యాసవిధి విసర్జనచేసి నిత్యనైమిత్తికకృత్య మెడలి
స్వాచారములు మాని వాచింపఁగారాని వాక్యముల్పల్కుచు వర్జనీయ
వస్తువు ల్విడువక వైర మూరక కొనితెచ్చుచుఁ దముఁదామె మెచ్చుకొనుచు
వంచించి పరుల ద్రవ్యంబులార్జించుచుఁగులహీనులనుగోరికొలుచుకొనుచుఁ
బాపములుచేయుచుందురీప్రజలవారి, నెట్లుప్రోచెదొ కడకది నీకెతెలియు॥

శీతభీతి దొలంగి ప్రాతర్జలంబులఁ గాయశుద్ధికి మునుఁగంగ లేదు
చపలచిత్తతమాని జపమాలలనుబూని తిన్నగా నీనామ మెన్నలేదు
నిష్ఠఁబోనాడక నిలుకడగా నుండి వీనుల నీకథల్ వినఁగలేదు
భక్తితప్పింపక పరమార్థమునఁదెచ్చి యెంచి నిన్ప్రాలఁ బూజింపలేదు
ఏమియెఱుఁగనిమందుఁడ నెట్లు నన్నుఁ, బతితపావనప్రోచెదో గతులొసంగి, యన॥

అంగనాలింగనసంగమంబులు మహామంగళంబు లటంచు మదిఁదలంచుఁ
గరిరథాశ్వాందోళికానుగాదులు మహాసౌఖ్యదంబులటంచు సంభ్రమించుఁ
గాంచననవరత్నసంచయంబులు మహాభోగాస్పదములంచు బుద్ధినెంచుఁ
జందనతాంబూలమందారదామాదు లందంబు లని మేనియందు నించు
నింతె కాకను నీదేహమంతమందు, మంటిపాలని తెలిసినిన్నంటఁడెంత,నన॥
ఘనకేశికచభారగరిమఁ గాంచియు మోహఘోరాంధకారమగ్నుండుగాక
చపలేక్షణానేత్రజలజంబు లరసియుఁ జంచలచిత్తుఁడై మించిపోక
చంద్రాననాముఖచంద్రు నీక్షించియు వెలవెలపాటుతోఁ గలఁతపడక
గగనమధ్యామధ్యగతి నిరీక్షించియు జీవితసందేహ భావమంద
కధికదృఢచిత్తుఁడై నిన్ను నాత్మనిలిపి,భజనసేయునరుండు నీపదముఁ జెందు,నన॥
అంగనాలింగనసంగమంబుల నాసఁ జెంది కామాకులచిత్తుఁ డగుచు
దేశదేశంబులఁ దిరుగుచుఁ దినరానితిండ్లకు లోకువై తినఁగఁ జనుచుఁ
జేయనిపనులెల్లఁ జేయుచుఁ గులహీననరనాథులను గొల్వఁ బరువులిడుచుఁ
గల్లమాటలు పల్కి చెల్లవారలఁ జేరి యాచించుచును గష్ట మనుభవించుఁ
గానిచీయిదిరోఁతనిపూనిదాని,విడిచి నిను జేరఁగోరఁడిప్పాపమిజనుఁడు,నన॥
అజ్ఞానధారుణి నతితీక్ష్ణవిజ్ఞానకుంతాయుధంబుచేఁ గోరి త్రవ్వి
కామాదివైరుల ఖరతరవైరాగ్యనామాసిచేఁ ద్రుంచి నాల్గుదెసల
బలిచల్లి మోహాహి నెలమినీమంత్రంబుచేఁ గట్టి పడవైచి శోకమీఱ
నాశాపిశాచిని నందుండకుండ నీయంత్రంబుఁజూపించి యవలికనిపి
భక్తిదివ్యాంజనమునేత్రపాళినలఁది,కడఁగిరామనిధానంబుఁగనఁగవలయు॥
శ్రీరామనామంబు చేతిచింతామణి శ్రీరామనామంబు సిద్ధఘుటిక
రామనామము గృహారామకల్పకశాఖి రామనామము భక్తకామధేను
రావణారిచరిత్ర కేవలామృతధార రావణారిచరిత్ర పావనంబు
దశరథాత్మజుసేవ దగు పెన్నిధానంబు దశరథాత్మజుసేవ తాపహరము
మనుజులకు నెల్లఁ గావున మానకతని,సేమమునఁగొల్చువారల కేమికొదవ॥
శ్రీరామనామంబు కోరిపఠింపని నోరుగా దది పెద్దభేరిగాని
శ్రీరామనామంబు కోరిలిఖింపని కరముగా దది ఘోరశరముగాని
శ్రీరామనామంబు కోరియాలింపని చెవులుగా వవి కొండగవులుగాని
శ్రీరామపదములు చేరిక మ్రొక్కని మేను మేనుగాదది యెండుమ్రానుగాని
రామమూర్తిని బూజింప రానిచాని,పుట్టు గాదది చీమలపుట్టగాని, యన॥

మంత్రంబులకు మూలమంత్రమై శ్రీరామమంత్రంబు జగతిలో మహిమకెక్క
బీజంబులకు నాదిబీజమై శ్రీరామబీజంబు ధరణిలోఁ దేజమందు
సూక్తంబులకుముఖ్యసూక్తమై శ్రీరామసూక్తంబుధాత్రిలో శుభముగాంచు
వేదంబులకు ముఖ్యవేదమై శ్రీరామవేదంబు ధరణిలో వెలయుచుండు
మహిని శ్రీరామతత్త్వసమానమైన, తత్త్వమింక లేదుపరమసద్గతులొసంగ॥

శ్రీరామ యని భుజించినమాత్ర నన్నంబు పరమపవిత్రమై పాప ముడుపు
శ్రీరామ యని రచించిన కార్యజాతంబు సఫలమై తగమహాసౌఖ్యమొసఁగు
శ్రీరామ యని వచించిన వాక్యవర్గంబు నిహపరప్రదమునై యింపునింపు
శ్రీరామ యని జపించిన జపవ్రాతంబు నక్షయఫలదమై యతిశయిల్లు
రామరామయటంచని నేమమలరఁ, జేరిపాయింప సర్వార్థసిద్ధియగును,నన॥

ఆసన్నమైన దివ్యాన్నంబు విడనాడి తిరిపెపుఁగూటికై తిరిగినట్లు
తృషితుఁడై జాహ్నవీతీర్థంబుఁ బోనాడి బావిత్రవ్వింపఁగాఁ బఱచినట్లు
పెరటిలోపలి కల్పవృక్షంబు నఱుగక మును లోభినడుగఁగాఁ జనినయట్లు
కల్పితతూలికాతల్పంబు వర్జించి ముండ్లపైఁ బవళింపఁ బోయినట్లు
ఖలులు సర్వేశ్వరుని నిన్నుఁగొలువ కన్య
దేవతలఁ గొల్వఁబోదురు తెలివిలేక, యన॥ ౮౨

దశరథమూలకందప్రసూతంబునై కైకయీసుతకాండ కలితమగుచు
సౌమిత్రివిస్తృతశాఖాయుతంబునై భూరివానరపత్రపూర్ణమగుచు
వాల్మీకిమునికావ్యవారివర్ధితమునై రావణానుజసుమభాజి యగుచు
సీతాతనూలతాశ్రితమునై పవమాన తనయఫలాఢ్యమై ధరణివెలయు
రామకల్పద్రుమంబు నేఁగామమరయఁ, జేరికొలిచెద సర్వార్థసిద్ధికొఱకు,నన॥

శివధనుర్భంగంబుచేసినప్పుడు మహీపతులెన్నఁదగు మహాద్భుతరసంబు
తండ్రియానతిఁగొని దండకాటవిఁ జేరనరుగునప్పుడు కరుణారసంబు
తనుబెండ్లియాడుమంచనుశూర్పణఖమోమునరసిమాటాడు చో హాస్యరసము
ఖరదూషణాదిరాక్షసులతోడుత రణరంగంబుఁ జేయుచో రౌద్రరసము
గానిపింపంగ జగతిలో ఘనచరిత్ర, నిలిపిభక్తులరక్షింపఁదలఁచితౌర,యన॥

పట్టాభిషేకసంపదఁబూని సీత నంకముఁ జేర్చునపుడు శృంగారరసము
మూలబలంబు నిర్మూలంబుఁజేయుచు విలుఁబూనునప్పుడు వీరరసము
కండలు మొండెముల్ నిండనెత్తురుచేల్లు పాఱించునపుడు బీభత్సరసము

వారాశిఁజేసి దుర్బలమీఁద శయనించు సమయంబునందున శాంతరసము
గానుపింపంగ జగతిలో మానవావన, తాండవమండితివేర సీతావిహార, యన॥
మునువిరాధుఁడు సీతఁ గొనిపోవఁగని డీనగతిఁ బూను నీకేమి కారణంబు
అలరావణుఁడు సీత నపహరించెనటంచుఁ జలపింప నీకేమి పామరంబు
జనకజకొఱకునై కని లోకములనెల్లఁ గాల్పఁబూను టదెంత కఃకనవృత్తి
మాయామృగమువెంట మమతచేఁబరువెత్తు నరుగ నీకేమంత యజ్ఞతాప్తి
సర్వలోకేశ్వరుండవై సాక్షివగుచుఁ, జ్ఞానయానందమూర్తివై చెలఁగునీకు॥
శీతలచ్ఛాయావిశిష్టసద్వనముల సత్ప్రభక్తితో వేసినట్టివారు
వాపికూపతటాకకూపఘట్టంబుల ననుదినం బొనరించునట్టివారు
క్షుత్పీడితార్థసత్తృప్తిప్రపూర్తిగా నన్నదానము చేసినట్టివారు
పరమమహాపాపపటలంబు విరియింపఁ దీర్థయాత్రాంతిఁ జరుగువారుఁ
గోరిపొందఁగరానియీగురుపదంబు,నీపదధ్యానమునఁబొందునిపుణుఁడిందు॥
తొలియుద్ధమున మహాబలముతో రథమెక్కి రావణాసురుఁడు విభ్రాజితముగఁ
జనుదెంచి వానరసైన్యంబుపై ఘోరశరములు వర్షించి చక్కుపఱచి
లక్ష్మణు నని నొంచి లఘుగతి నేతేర హనుమంతునెక్కి నీవాగ్రహమున
విరథుని గావించి వెంబడిఁ బడికిరీటంబులుఁ బడనేసి యంబరంబు
గాఁడఁగా నేసి రౌద్రవిక్రమవిహార, కలననపడిన వేళ నిస్తనఁదరంబె, యన॥
కుంభకర్ణుని రణకుంభిని గుంభిని సంరంభమున హరిచంపినట్లు
మకరాక్షు శరభగ్నమకరాక్షు పక్షీంద్రుఁ డక్షీణగతి నహి నణఁచినట్లు
అగ్నివర్ణుని బరుషాగ్నివర్ణశరాళి నగ్నివర్ణము శరంబార్చినట్లు
రావణు భువనవిద్రావణు నద్రీంద్రు నద్ర్యరియసి తెగటార్చినట్లు
నెలమిఁదెగటార్చి విజయలక్ష్మీవివాహ, మంగళముఁబొందితోరణరంగమందు
ననఘకర్ణాటతేరపావననరేంద్ర, రమ్యగుణసాంద్ర దశరథరామచంద్ర. రా
తనమహావిద్యచేఁ దాఁగప్పఁబడీ తన్నుఁ దానెఱుంగఁడు తన్నుఁ దానెఱింగి
యుండిన సీతకై దండకాటవిలోనఁ బలవించునా మఱి పరువులెత్తి
పలవించ నెందుకుఁ బదుగురితో సాటిగాఁగ దేవుండెట్లు గాఁగలండు
రాముఁడంచని కొంద ఱేమఱి యీరీతిఁదా మవిద్యావ్యాప్తిఁ దగిలిమిగులఁ
బల్కుచుందురు పల్కినఁ బల్కనిమ్ము, పల్కినందుననీకేమిచుల్కఁదనము, అన॥
నీరూపసౌందర్య మారూఢిభావించుపంచాస్త్రవైరి యేర్పడ నెఱుంగు
నీపేరు సారుచి నిరవధి జపియించు మంచుగుబ్బలిపట్టి మది నెఱుంగు

నీమహామహిమంబు ప్రేమతో రామాయణంబు చెప్పినమౌని నాథుఁడెఱుఁగు
నీమంత్రసారంబు నెఱికాశిలో నుపదేశమిచ్చెడు తారకేశుఁడెఱుఁగుఁ
గాని యితరులెఱుంగఁగాఁగలరె తెలివి, నిన్నువర్ణనసేయసంపన్నవిభవ,య॥

కరువలిమేఁతమై పఱపుపైఁ బవళించి వెల్లఁటినుఁగు పెనువీఁపునెక్కి
కూనక్రొన్నెలతాల్పుతోనునేస్తముచేసి నలువపడంతితోఁ బలుకులాడి
గుజ్జువేలుపుతండ్రికొండతోఁ జెండాడి దండెతాళముఁబూను తపసిడాసి
యీఁగిన్నెరానును బండులిగిలింపఁగాఁ జేసి వేల్పుగిడ్డిని బాలవెల్లిరోసి
మించె సౌరార నీకీర్తిచంచలాక్షి, యంచితప్రౌఢి జగములం దభినుతింప
ననఘ కర్ణాట తేరపావననరేంద్ర, రమ్యగుణసాంద్ర దశరథరామచంద్ర. ౯౨

శ్రీరామదేవుఁ డాశ్రితరక్షణముసేయ మదిలోనఁదలపోసి మమతచేసి
వేదోపనిషదబ్ధి వేడ్కతో వాల్మీకి మందరాచలముచే మథనచేసి
వినుతసుగ్రీవచంద్రుని నీలకౌస్తుభ మాణిక్యమును నీలమత్తకరిని
బవనసంభవకల్పపాదపంబును గైకయీజ్యేష్ఠ నవనికన్యేందిరాల
లామనభినవరామాయణామృతంబు, నందుఁబుట్టించిబుధులకందందనిచ్చె, నన॥

రామాయణము సర్వకామితఫలదంబు రామాయణము నవరసమయంబు
రామాయణము బుధారామకల్పకశాఖ రామాయణము శతక్రతుఫలంబు
రామాయణము మహారాజసంస్తవ్యము రామాయణము దేవరాజ్యదంబు
రామాయణము ఘోరరక్షోఘ్నమంత్రంబు రామాయణము సుపుత్రప్రదంబు
మహిని రామాయణాధికమైన మంత్ర,మరయ నింక లేదు భక్తులనరసి ప్రోవ

ధ్యానంబునీకు నిత్యానందసందోహ యావాహనంబు నీకమరవంద్య
హేమాసనము నీకహీనసుందరతను పాద్యంబునీకు సంవేద్యమహిమ
అర్ఘ్యంబునీకుఁ గృపానర్ఘ్యభూషణ స్నానంబునీకు విజ్ఞానరూప
అంబరంబులు నీకు శంబరారికుమార భూషణంబులునీకుఁ బోషితార్య
గంధసుమధూపదీపాన్నకలితభక్ష్య, భోజ్యనైవేద్యములునీకుఁ బూజ్యచరిత

పరిపూర్ణచంద్రబింబముమెట్టి కందిచ్చి పొంగారుగంగను భంగపఱిచి
బలవైరిగజము చెంపలు చళీమనఁగొట్టి పల్లుబోటిని దలవట్టియాడ్చి
పనిఁబూని వేల్పుగిడ్డిని బారిగఱపించి ప్రల్లదంబున హరిమొల్లెపట్టి
బుడుతక్రొన్నెలతాల్పు మెడఁబట్టుకొని నెట్టి పాఁపఱేనితలలపై పట్టిచుట్టి
రట్టుపడఁగద నీకీర్తిగట్టువాఁడు, మట్టుమేరమెఱుంగ కెప్పట్టుఁదిరిగి, యన॥

కాంచనమాలికాకలితతురంగసంగతమహారథమునై వితతహేమ
రత్నభూషాంబరరాజితమూర్తివై కూర్చుండి భరతుండు గొడుగు రావ
లానుజశత్రుఘ్నులానిచామరములు సుగ్రీవుండును గుంచె వొచ్చిపట్టి
విసరుచుండఁగ హరివీరులు తురగవారణయానులై వెంట రాగవాద్య
ములను మ్రోయంగ సాకేతపురమునందు
వచ్చుచోఁ జూడవలచె నీ ప్రభుత తేర, యనఘ॥ ౯౭

జాతినీతులుమాని చనరాని యువతులఁ బొందిచేసినపాపమొందకుండ
గురువిప్రమానిసత్పురుషులఁ జెలఁగి నిందచేసినపాపమొందకుండఁ
దెలియకజ్ఞానసంకలితుండనై నీసేవ పొందిచేయని పాపమొందకుండ
దుష్ప్రతిగ్రహమహాదురితాన్నములు దిని ముందుచేసినపాప మొందకుండ
నన్నుఁగాపాడిరక్షించు సన్నుతాంగ, పతితపావన లక్ష్మీశపరమపురుష, యన॥

నీపాదములమీఁద నిశ్చలతరభక్తి నీభక్తజనులతో నిరతసక్తి
నీకథాశ్రవణాభినిరతి నీమూర్తిసందర్శనంబునను నిత్యప్రవృత్తి
నీనామజపమున మానని వాగ్వృత్తి నీగుణంబుల నెన్న నిబిడసక్తి
నీసేవయొనరింప నిరుపమ మగుశక్తి నిన్నువర్ణనసేయ నిపుణసూక్తి
కలిగియుండఁగ నాకు నిక్కముగ వరము
కరుణతోనిచ్చి రక్షించు సరసిజాక్ష, యనఘుకర్ణాట। ౯౯

శ్రీరమాశ్రితవక్ష సేవకావనదీక్ష మత్తారికులశిక్ష మహానిరీక్ష
రాజీవదళనేత్ర రమణీయతరగాత్ర కారుణ్యరసపాత్ర కాంతిమిత్ర
సీతాకళత్ర విస్తీర్ణసితచ్ఛత్ర కాస్యపమునిగోత్ర ఘనచరిత్ర
కపటనాటకసూత్ర కల్పితబహుచిత్ర కవితాకృతిస్తోత్ర కనకవేత్ర
దనుజకులజైత్ర వర్ధితధర్మసత్ర, పాపలతికాలవిత్ర సత్పార్థమిత్ర
యనఘుకర్ణాట తేరపావననరేంద్ర, రమ్యగుణసాంద్ర దశరథరామచంద్ర॥

అనియిట్లు సకలలోకాధీశ్వరుని పేర వితతాగమాంతసన్నుతుని పేర
నురుతరకర్ణాటవరవంశసంభవుఁడైన యుళక్కియంచ వేడుపాని
తమ్ముఁడఁ గామాక్షితాయి పెంచినవాఁడఁ జిరవిప్రపాదసంసేవనాప
యాతకల్మషుఁడఁ దేరాభిధానుఁడ నన్ను రక్షింపుమనుచు శ్రీరామమూర్తి
కంకితంబుగ శతక మియ్యది నఁజెప్పి, యొప్పగించితిఁ గైకొమ్ము...
అనఘుకర్ణాట తేరపావననరేంద్ర, రమ్యగుణసాంద్ర దశరథరామచంద్ర। ౧౦౧

# సుబ్రహ్మణ్యశతకము.

—( బృహత్తేరకం నాగశాస్త్రికృతము )—

## సీసపద్యములు.

శ్రీకంఠవరపుత్ర శృంగారతరగాత్ర సన్నుతిస్తుతిపాత్ర జలజనేత్ర
వల్లీమనోహార వాహీకృతమయూర యఖిలలోకాధార యరివిదార
దేవసేనాలోల దివిజసన్నుతశీల కుధరజాబాల సద్గుణ విశాల
భానుకోటిప్రతాప బ్రహ్మణ్యవరరూప యమరసేనాటోప యహికలాప
నీదుపేరింట శతకంబు నేర్చినట్టులు, విన్నవించెద వినవయ్య వేడ్కమీఱ
శూరసంహార కిరిగిరిసుఖవిహార, సుకవిజనగేయ శ్రీబాలసుబ్బరాయ. ౧

సంతతమ్మును నిన్ను సంస్మరించుచు భూమి సంచరించెడువాఁడె సజ్జనుండు
నీపదాంభోజముల్ నిర్లజ్జుఁడై సదా భజనచేసెడువాఁడె భాగవతుఁడు
నిర్మలచిత్తుఁడై నిన్ను సేవించుచు ధర నుండువాఁడె పో ధన్యుఁ డరయ
సకలచరాచర సంవాసియౌ నిన్నుఁ బూజసేసెడువాఁడె పుణ్యపరుఁడు
వీను లలరంగ నీనామగానరసము, విని సుఖించెడువాఁడె వివేకఘనుఁడు,
శూరసంహార కిరిగిరిసుఖవిహార, సుకవిజనగేయ శ్రీబాలసుబ్బరాయ.

మంచు కోర్వనివాఁడు మార్తాండుఁ గనినట్లు ఘనరోగి ధన్వంత్రి గాంచినట్లు
క్షుద్బాధితుఁడు దివ్యసుధ గన్గొనినయట్లు కడు దరిద్రుఁడు నిధిఁ బడసినట్లు
జడమధ్యగతునకు నుడుప మబ్బినయట్లు ధరఁ దపస్వికి సిద్ధి దొరకినట్లు
తిమిరావృతుఁడు మంచి దివ్వెఁ జూచినయట్లు శిశువు తల్లినిజూచి చెలఁగినట్లు
నిన్నుఁ గనుఁగొంటి శుభములు నిండఁ గంటి
భూరిదారిద్ర్యభూతంబు పాఱఁగంటి, శూరసంహార. 3

నట్టింటిలో నుండు నవ్యనిక్షేపంబు గానక యాచించువానికరణి
నమృత ముపేక్షించి యౌషధకాంక్షియై వనమూలికల కేగువానిపోల్కిఁ
గల్పకంబులఁ బాసి కాంతారములలోను దుమ్మచెట్లను బోయి నమ్మురీతి
భాగీరథిని వీడి పల్వలోదకముల వెదకి గ్రుంకులు వెట్టు వెఱ్ఱిమాడ్కి
నిన్ను నేమఱి మూఢుఁడై యన్యసురలఁ
గొలువఁ బోవుట వ్యర్థంబు కువలయమున, శూరసంహార.

సమమైన జనులతోఁ జౌకనసేయక కుజనసేవారతిఁ గోరనీక
దారిద్ర్యబాధచేఁ దడఁబడనీయక ఋణసంకులంబుల మునుఁగనీక
శూలాదిరోగముల్ సుడివెట్టనీయక నీచకర్మంబులు తోఁచనీక
నీపాదముల భక్తి నెన్నొ నేమఱనీక కాలకింకరుల దేపాలుగాక
దేవనీదివ్యకరుణార్ద్రదృష్టిఁజూచి, కాచిరక్షించు నన్ను శంకరకుమార
శూరసంహార కిరిగిరిసుఖవిహార, సుకవిజనగేయ శ్రీ బాలసుబ్బరాయ. ౧

తాపత్రయాదులు తగిలించుకొన్నవి వరద సుబ్రహ్మణ్య కరుణఁజూడు
దారిద్ర్యభూతంబు తల్లడఁబెట్టెని వరద సుబ్రహ్మణ్య కరుణఁజూడు
అప్పులవార్లు నొప్పింపఁజూతురు వరద సుబ్రహ్మణ్య కరుణఁజూడు
శూలాదిరోగముల్ సుక్కంగఁజేయును వరద సుబ్రహ్మణ్య కరుణఁజూడు
ఇట్టివేళల నన్ను పేక్షింపఁ దగదు, గరిమరక్షించునన్ను శంకరకుమార, శూ.

పుట్టినప్పుడె నభోభూభాగములఁబట్టి తాళంబువేయఁగఁ దలఁచినావు
కరగతశక్తిచేఁ గ్రౌంచభూమీధరంబునను గవాక్షిక పొడిచినావు
సప్తమాతృకలను సమరరంగంబున దట్టించి మట్టుగాఁ బెట్టినావు
అలకృత్తికాదుల నమరావతీపురంబునను శాశ్వతముగ నునిచినావు
నిన్ను మొఱవెట్టు నీభక్తనికరములకు
దురితములుఁగొట్టి ప్రోచుట దుర్ఘటంబా, శూర. ౨

పూలమాలికలు వేవేలు పైఁదాల్చిన దేవుం డనుచు నిన్నుఁ దెలియలేరు
ఘనజీవరత్నభూషణరాజి గల్గినఁ బ్రభుఁడటంచును నిన్నుఁ (బట్ట) లేరు
ఖ్యాతిఁ బీతాంబరవ్రాతశోభితుఁడైన నీశ్వరుం డనుచు నిన్నెఱుఁగలేరు
మేళవాద్యము లెంతకోలాహలం బైన దిక్కు నీవని వచ్చి మ్రొక్కలేరు
భక్తజనముల పరితాపబాధ మాన్చి
యభయ మొసఁగిన నిను దేవుఁ డంద్రుగాని, శూర. ౩

వేలాయుధంబు నేవేళఁ బూనఁగనేల సకలరక్షకుఁడైన స్వామినాథ
వన్నెమీఱుమయూరవాహన మేమిటికన్నిటవెలసిన హరకుమార
కరమున నేవేళఁ గరవాల మది యేల పరిపంథి యెవ్వఁడు భవవిదూర
యీకుక్కుటధ్వజమేల ......నిఖిలలోకంబుల నెగడినావు
ఇన్ని బిరుదులు బిరుదు గా వెల్లఫ్రౌడ్డఁ, గరుణ భక్తులరక్షించుబిరుదుగాని
శూరసంహార కిరిగిరి సుఖవిహార, సుకవిజనగేయ శ్రీ బాలసుబ్బరాయ. ౫

ఇరుకరంబులు గలనరుని వేఁడినయంత వెఱవవద్దని చేయివేయుఁగాని
యొక్కపూఁటకు బత్త్యమున్న వానిని వేఁడఁ గలకొద్దిఁగొమ్మని పలుకుఁగాని
రెండుకన్నులు గల్గి యుండువాఁ డైనను గరుణించు భృత్యులఁ గాంక్షతోడ
నిరుచెవుల్ బధిరుఁడౌపురుషుఁ డైననుజనుల్ మొఱపెట్టుటేమని మొనసివినును
అనిన నీరాఱుకరములు ధనముఁగనులుఁ, జెవులుగలిగియుభక్తులుచేరినిన్నుఁ
జాల మొఱవెట్టవినరాదె మాలకించి, సుకవిజనగేయ శ్రీబాలసుబ్బరాయ.

శ్రీకంఠసుతుఁడను ఖ్యాతి గావలెనంటె దుర్జనంబులఁ బొడ్చి త్రోయవలయు
శక్తిధరుండను సుక్తి రావలె నంటె నిర్దయాత్ములఁ జేరనీయవలదు
శూరసంహారుఁ డన్పేరు కావలె నంటె నీచవర్గంబులఁ ద్రుంచవలయు
సుబ్రహ్మణ్యమూర్తివై ప్రబలఁగోరితి వంటె భూసురవ్రాతంబుఁ బ్రోవు మిపుడె
నాఁడు చేసినపనులు కాంచి యటునె, నేఁడుచేసిన నీపేరు నెగడుఁగాక, శూ.

నీతల్లి చక్రాంతికూఁతురై దయలేక మగనిదేహంబును సగము చేసె
నీతండ్రి యేపాటి నీతిజ్ఞుఁ డందును పట్టణంబులు గాల్చి ప్రబలినాఁడు
నీయన్న యెంతటి నిర్మలుం డందును ఘనకాంక్షఁ ద్రోవలు కాచినాఁడు
నీమేనమామ యేనిజమువాఁ డందునా కొంచెమై కపుల యాచించినాఁడు
వారివలెఁ గాక నీవైన వసుధలోన, నాశ్రయించినభక్తుల నాదరించి
మంచివాఁడని పేరు కల్పించుకొమ్మ, సుకవిజనగేయ శ్రీబాలసుబ్బరాయ.

తల్లి రాజ్యముచేసి ధర్మవర్ధనియని జనముచేతను జాల వినుతికెక్కెఁ
దండ్రి సర్వజ్ఞుఁడై ధర రాజశేఖరుం డనుచు వేదములచే నతిశయిల్లె
సోదరుం డాశ్రితశుభకారియై సర్వజనులచే నగ్రపూజలను గాంచె
వరదుఁడై సద్భక్తవత్సలుండయి మామ శరణుఁ జెందినవారిఁ గరుణఁగాచె
వారికన్నను మిక్కిలి వసుధలోన, నాశ్రయించిన భక్తులనాదరించి
మంచివాఁ డనుపేరు గల్పించుకొమ్మ, సుకవిజనగేయ శ్రీబాలసుబ్బరాయ.

సురరాజు మెచ్చి కూఁతురు నిచ్చె నంచును గర్వభూయిష్ఠంబు గాంచినావా
...శిగొట్టి చెఱదెచ్చినానని గర్వభూయిష్ఠంబు గాంచినావా
క్రౌంచపర్వతము భేదించినానని మించి గర్వభూయిష్ఠంబు గాంచినావా
...యికిమేనల్లుఁడైతి నటంచు గర్వభూయిష్ఠంబు గాంచినావా
బాలుఁడైతేని గర్వంబు కరుణఁజూచిన సొమ్ము యేమిపోవు(?) శూ. ౧౮

శూరతారకవైరి విరులఁ ద్రుంచిన గర్వంబుచేత నేకాంత మగునొ
భువనంబులకును బ్రభువును దానని యెంచి గర్వంబుచేత నేకాంతమగునొ
భక్తసందోహంబు        కడులోభమునను నేకాంత మగునొ
దేవసేనాతన్వితో వేడుకలు మీఱి మంతనంబాడ నేకాంత మగునొ
...రాగినఁ జెలువట్టి, గిరిమ సంతసమూని నేకాంతమగునొ
యింతమొఱవెట్టఁగాను నేకాంతమేమి, సుకవిజనగేయ శ్రీబాలసుబ్బరాయ.
...కుపసినాపి నిష్పతుల నిన్ను సేవింపలేదొ
బహుమహామహిమచేఁ బ్రాణి నుంచఁగలేదొ ప్రత్యక్షభవించిన...
...కోటి దోషిత్తిఖండించి విబుధుల ముదము గావింపలేదొ
శిష్టకోటికి నెల్ల నిష్టదైవము గావొ భక్తుల
...స్వామినాథ, కావనుండిన జనులను నేఁటియిఁ డేమి, శూ. ౧౩.
వేళవేళకు మ్లేచ్ఛపాలిప
వసుధలోదుష్కార్యవస్తుల నణఁకఁగఁ జేతఁగాకను జేతహేతిగోల
దుష్టకష్టుల నెల్లఁ దొడరకొ
అవనీసురావళి నాదరి పనివాని కభయప్రదానైకహస్తమేల
ప్రబలనైదాఘసుప్రతాపంబు..., దేవసేనాధిపత్యంబదేల నీకు, శూర. ౧౪
సర్వసర్వంసహాచక్రంబులో దానమూర్త్యనుపేరునుఁ బొందినావు
మహిషశూరాదుల మర్దించి యింద్రాదివిబుధుల ముదము గావించినావు
వేదరాసులచేత విదితంబుగాను సుబ్రహ్మణ్యుఁ డనుపేరు వడసినావు
నిఖిలలోకంబుల నీయాజ్ఞలో నిల్పి దళవాయిపట్టంబు దాల్చినావు
అఖిలజనములు నానందమందునటులు, నొక్కవర్షంబుగురియింపఁగ క్షసంబొ
జీవనదములు నిను సృష్టసేయలేదొ, సుకవిజనగేయ శ్రీబాలసుబ్బరాయ.
పాలించుమంచు నేవేళఁ గొల్చెడివారి లోలతఁ జూడ నాలోచనేమొ
నీవె దిక్కని వచ్చి భావించువారిని నాదరించుటకుఁ బ్రయాసమేమొ
శరణు శరణని నిన్మొఱవెట్టు జనులను గాచి రక్షింప దుర్ఘటన యేమొ
పరితాపమును జెందు భక్తసంతతులను జల్లగాఁ జూడ నసాధ్యమేమొ
యింతమాత్రాన కిట్టుల తామెంచిరేని, తాళఁజాలరు భక్తమందారదేవ, శూ.
భక్తపాలనుఁడైన పరమేశ్వరునికిని బ్రతిబింబితుండవై ప్రబలియుండి
ధరణిలో ధర్మవర్ధనిగర్భమందలి యభ్యుదయుండవై యతిశయిల్లి

భూరిబృందారకాధారుఁడై లోకత్రయావనశీలుఁడై యమరియుండీ
ప్రణవస్వరూపమై బహుపురాణములచే బ్రహ్మణ్యవిఖ్యాతిఁ బడసియుండీ
కదిసి మొఱపెట్టు జనులపైఁ గరుణలేక
పరమలోభంబు నీకేలప్రాప్తమయ్యె, శూర. ౨౦

వేయును నెనిమిది బిరుదుగంటలుగల శక్తి చేఁబూనిన శౌర్యమేది
శూలముద్గరభిందిపాలఖడ్గాదులఁ గేలఁ బూనిన రౌద్రశీలమేది
శూరుఁడై మేటి మయూరవాహన మెక్కి మీసంబు వడివేయు రోసమేది
మనువంతు వాహినిమధ్యంబులో దైత్యభీకరుఁడైన నీధాకయేది
స్వామి యీవేళ నీభక్తజనులకొఱకుఁ, బాలుమాలక దుర్మార్గపటలినెల్ల
ధూళిసేయకయున్న నీమేలిమేల, సుకవిజనగేయ శ్రీ బాలసుబ్బరాయ. ౨౧

నీధాటికేగదా నిల్వనేరక భానుకోపాదివైరులు కూలఁబడిరి
నీధాకచేఁగదా నిర్వహింపఁగలేక తారకాసురుఁడు మయూరమయ్యె
నీఘాతిచేఁగదా నీల్గెను బంచాస్యముఖరాక్షసానేకమూలబలము
నీశక్తిచేఁగదా నిహతిఁ జెందిరి శూరపద్మాదిరాక్షసప్రవరులెల్ల
నాఁటి నీధాటి నీధాక నాఁటిఘాతి, నాఁటిశక్తియు నేమూలనణఁచినావో
నేఁటిపాషండులను గొట్టనేరకిపుడు, సుకవిజనగేయ శ్రీ బాలసుబ్బరాయ.

దానధర్మములేని ధనరాసు లవియేల భోగింపఁగారాని పొలఁతియేల
శరణన్నఁ గావని నరపతిబ్రదుకేల సత్యంబుమాలినసఖ్యమేల
వేదహీనుండైన విప్రజన్మంబేల తనయులఁ బ్రోవనితల్లియేల
ఉపులు గాకున్నయన్నదమ్ములునేల దయతోడఁ బ్రోవనిదైవమేల
బుధులు పరికించి యిన్నియు వృథయటంచు
నిన్నుఁ గొలిచినవారెల్ల ధన్యులంద్రు, శూర. ౨౩

బ్రాహ్మణద్వేషంబు పాటింపఁగారాదు ధర్మంబులకు హాని తలఁపరాదు
ధరఁగృతఘ్నులఁదెచ్చి దాసజేర్పఁగరాదు దాయాదులనుగొట్టితఱుమరాదు
తనసీమ పలుమాఱుకనకయుండఁగరాదు జారమార్గంబులు గోరరాదు
పాషండవర్గంబుఁ బ్రబలఁజేయఁగరాదు క్షుద్రమంత్రంబులఁ జూడరాదు
ఇటులునడిచిన నొకవేళ హీనుఁ డగును
బుణ్యశీలుండు మహితరాజన్యుఁ డరయ, శూర. ౨౪

తనకులాచారంబుఁ దప్పనివాఁడునై తరతరంబుగను బాంధవ్యుఁ డగుచు
బరభీకరస్ఫూర్తిఁ బరఁగినవాఁడునై ధైర్యసారసమగ్రశౌర్యుఁ డగుచు
దానమానానూనధర్మశీలుండునై సామాద్యుపాయైకచతురుఁ డగుచు
సంధివిగ్రహనీతిశాస్త్రకోవిదుఁడునై స్వామికార్యైకవిశ్వాసి యగుచు
నెగడు వానిని జతురంగనికరమునకు, నిలిపెనేనియు నామేదినీశ్వరుండు
శాశ్వతైశ్వర్యకీర్తివిస్తారుఁ డగును, సుకవిజనగేయ శ్రీబాలసుబ్బరాయ.

నిర్మలాచారుఁడై నీతిశాస్త్రజ్ఞుఁడై ద్విజకులశ్రేష్ఠుఁడై ధీరుఁ డగుచు
గంభీరహృదయుఁడై ఘటనాసమర్థుఁడైమితభాషియైబహుశ్రుతుఁడునగుచు
సత్యవాచాలుఁడై జనరంజనుండునై లౌకికమతి జాగరూకుఁడగుచుఁ
బారంపరుండునై పరమర్మభేదియై కాల దేశవిభాగకారి యగుచుఁ
జెలఁగుపురుషుని మంత్రిగాఁ జేయవలయు
మాన్యచరితుండు మహితరాజన్యుఁ డరయ, శూర. ౯౩

నిన్నహోరాత్రముల్ సన్నుతింపఁగలేని నుడువులా జోగులబుడబుడుకలు
నిన్నుఁ జూడఁగలేని కన్నులా మిక్కిలి తరళమౌ జలబుద్బుదములు గాని
నిన్ను విశ్వాత్మకుఁగా నిర్ణయింపఁగలేని బుద్ధి బల్చీమలపుట్టగాని
నిన్నుఁ బూజింపని నిడుపాటిహస్తమా డంబమౌ సమ్మార్జనంబుగాని
సకలలోకేశ నీకుదాస్యంబుగాని, బ్రిమ్మరునికాయమలతోలుబొమ్మగాని, శూ.

కలుగునా నీకటాక్షంబు లేకను మహాసామ్రాజ్యవిభవంబు శాశ్వతముగ
దొరకునా నీదివ్యకరుణారసము లేక పుత్రబంధుజ్ఞాతి భోగచయము
అమరునా నిను బూజనములొండెసేయక భూరిసంపద్యశోదారగరిమ
పుట్టునా నిను మది గట్టిగాఁ బట్టక నిర్మలసుజ్ఞానధర్మగుణము
నీదుదయలేకకల్గునా నిఖిలశాస్త్ర, వినుతకవితాప్రసంగవివేకమహిమ, శూ.

లెక్కకుమిక్కిలౌ చుక్క లెన్నైనను బూర్ణచంద్రోదయస్ఫూర్తియగునె
ధరలోన నిబిడభూధరము లెన్నైనను సరవిహేమాద్రికి సాటియగునె
సదమలాంబునిదానదు లెన్నియైనను బుణ్యభాగీరథిఁ బోలనగునె
ఘనకాంతిసంయుతమణు లెన్నియైనను గరిమఁ జింతామణి సరియునగునె
యితరదేవత లవనిలో నెందఱైన, శ్రీకరుండగు నీకెనసేయనగునె, శూర.

జగదీశ్వరా నిన్ను సన్నుతింపఁగలేక వెడఁగుల నుతియించి వెఱ్ఱినైతిఁ
బ్రణవాత్మకా నిన్ను భజనసేయఁగలేక మూఢులఁబ్రార్థించి మోసపోతి

తారకుమారక నిన్ను శరణుచెందఁగలేక ధరణీశులనునమ్మి కలవరగొంటి
భావించి మది నిన్ను సేవింపఁగాలేక పృథివి లోభులఁ గొల్చి వేదనైతి
శూరసంహార నీదుపాదారవింద, దర్శనము లేని నన్ను నీదాసుఁ జేసి
కరుణఁజూడుము సద్భక్తకలుషహార, సుకవిజనగేయ శ్రీబాలసుబ్బరాయ.

నిండుదాహముతోడ నెండమావులఁ జూచి వెంబడిం చలసిన వెఱ్ఱిరీతిఁ
గాలమేఘమటంచు గంధసింధురమును బ్రార్థించుచాతకపక్షిరీతి
లలితశాల్మలివృక్షఫలము లపేక్షించి చేరి వేసరినట్టి చిలుకపోల్కిఁ
కేతకీమకరందజాతంబు గోరి యుత్సాహ మెడలుషట్పదమ్మమాడ్కిఁ
బరమలోభుల సభలందుఁ బ్రస్తుతించి
వ్యర్థమయ్యెను గరిమ కవిత్వమహిమ, శూ. ౩౦

సంగీతసాహిత్యసరసప్రసంగశృంగారంబు విని యిచ్చువారు లేరు
రసవాదవైద్యంబు పసలేదు కరఁశికమణియంబులను మానమంచు లేదు
కృషిజీవనాదులు కిరుదయ్యె నానాఁట నారీతి నీమది కనుభవంబు
బిచ్చమెత్తుదమన్నఁ బృథివిలోపల దానధర్మంబులెల్లను దరిగిపోయె
నింకగతియేమి మాకు శశాంకమౌళి, తనయనీకటాక్షంబు ... శూర. ౩౧

శరధితుంగాభంగవరతరంగాఘాతఘుమఘుమార్భటులు చేకూర్చినావా
... ... ... ... మేనుమఱచినావో
సురసిద్ధగంధర్వవరనారదాదిసంగీతగోష్ఠిని బరాకెంచినావా
యర్థివర్గమ్మును నధికమయ్యెనటంచు వానివేషస్ఫూర్తి నూనినావా
ఇంతకంటెను దంధన లెంచితేని, నిన్నువిడుతునవేమాటసున్న యింక, శూ.

సతిశిరంబుననుంచి సభలోననటియించు సిగ్గుమాలినయట్టి శివునికొడుక
భద్రకాళితనూనఁ బ్రబలి రుద్రునిచేతఁ గప్పెరనిచ్చు దుర్గాత్మజుండ
చేసెడుపనులెల్లఁ జెఱచివేసెడు పెన్మహోదరునికిఁ గూర్మిసోదరుఁడవు
ధర్మభంగము చేసి ధరఁ బుణ్యజనులను హరియించి నతనిమేనల్లుఁ డనఁగఁ
బ్రజలు పలికెడిదుష్కీర్తిపాయునెట్లు, లోభమునుద్రోచి బహుదానలోలుఁడగుచు
మంచివాఁడనిపేరు గల్పించుకొమ్ము, సుకవిజనగేయ శ్రీబాలసుబ్బరాయ.

కాచమేకంబైన యాచకావళి కీక తంద్రికప్పెర దింపఁ దలఁచినావో
మాడయొక్కటియైన మార్గణావళి కీక గుదుతఁ దల్లికి సొమ్ముగూర్చినావో

విలోకయ న్త్య స్త మథో యువత్యః ప్రాసాదవాతాయనమణ్డలస్థాః
భ్రూభఙ్గ సంశోభిత వక్త్రపద్మై ర్విభూషయాంచక్రు రమూని ముగ్ధాః. ౨౩
పౌరాః పురస్త్ర్యోఽథ నలం సలాజై రవాకిరన్ హర్మ్య గతాః ప్రసూనైః
బిన్దూత్కరై ర్విష్ణు మివోర్మయోఽద్రి మన్థానసంక్షోభిత దుగ్ధసిన్ధోః. ౨౪
ఆరాత్రికార్థం నగరే నలస్య కర్పూరదీపా రమణీగృహీతాః
బభు ర్యథా వన్యబలాగృహీత స్ఫుటోదితోచ్చంపకకోరకాభాః. ౨౫
విలంఘ్య వీథీ స్సనల స్స్వవేశ్మ వివేశ చన్ద్రోపలబద్ధసౌధమ్
ఋతు ర్వసన్తోఽప్యవనీనివేశం నలం త మారాధితుమిచ్ఛ యేవ. ౨౬
ద్విజా ననేకాన్ సమపక్షపాతాన్ స్వతః ఫలేభ్య స్సుమనస్సమగ్రః
ఉప స్వధీతా ప్తగిరో విభు స్సోఽప్యతర్పయ ద్భూరిఫలై స్తదిష్టైః. ౨౭
భృఙ్గాఙ్గనాఙ్గీకృతగానలోలః కుహూవిపఞ్చీకలనాదరక్తః
సంసేవ్యమాన స్సుమనోభి రుర్వ్యాం విభుర్వసన్తో ప్యధికం జజృమ్భే. ౨౮
వస న్తకా న్తేన సమాహితాయాః వనీయువత్యా వదనే చకార
సంస క్తభృఙ్గ స్తిలకోఽభినీల భ్రూమధ్యభాజ స్తిలకస్య శోభామ్. ౨౯
కోశా న్యరాళానిపటూని లగ్న ద్విరేఫ డిమ్భానిచ కింశుకానామ్
రేజు ర్ముఖానీవ చ కింశుకానాం గృహీత జమ్బ్వాన్యరుణప్రభాణి. ౩౦
కున్దాని వర్ణాకృతితస్సమాని సౌరభ్యశూన్యా న్యురుమౌక్తికాని
హారాత్మనోరోజగిరిం శ్రితాని వికాసదమ్భా దదహ న్వధూనామ్. ౩౧
భృఙ్గప్రియా దంశితపల్లవోష్ఠా ధుత వ్రతత్యుచ్ఛభుజా చకాశే
అశోకశాఖారుణపుష్పగుచ్ఛ నఖాంశుపుంజా నివ విక్షిప న్తీ. ౩౨
స్మరానలోద్భూతసుశీతవాతభూత ప్రకీర్ణోజ్జ్వలముర్మురాభమ్
దృష్ట్వా వియుక్తానవచూతరేణుం బిభ్ర ద్భయం యాతి జనోహ్యసంజ్ఞః.
సఖ్యా వస న్తేన సమాహితాని రసాలపుష్పాణి సపల్లవాని
సక ఙ్కపత్త్ర స్స్మరసాయకత్వ ముపేత్య యూనాం ధృతిభఙ్గకాని. ౩౪
మూర్తా వసన్తా వివ తత్ర రేజు ర్వీథిషు తామ్బూలరసారుణోష్ఠాః
విలిప్తగాత్రా హరిచన్దనేన విప్రాః స్వపాణ్యర్పితతాళవృన్తాః. ౩౫
సమ్మోదితా న్తఃకరణా యువాన స్సర్వే సుఖస్పర్శక రేన్దుభాసాః
కాలేన సర్వప్రసవాకరేణ సుశీతవాతేన చ రన్తుమీషుః. ౩౬

విలోక్యలోకా నఖిలా న్రతేమూర్ధ్న్యగ్రోష పూషా పరిపీయ పౌష్పం
రాగీ సరాగాం స్వయమ ప్యథాప్తు మియేష వారీశదిశం స్వయోషామ్.
స్వకాన్తి మాంజిష్ఠ విలేపితాయాః స్పర్శాదివ సై్వ ర్హరితాళపీతైః
కరైః స వారీశదిగఙ్గనాయా ముఖం స్పృశ న్నంతిక మాప భానుః. ౩౯
సాపత్న్యభాజాం నలినీవధూనా మినం పురస్తా త్కృతమాన మేనమ్
వీక్ష్యైభవ త్తామ్రముఖీ ప్రతీచీ తత్పాదయో స్సా వ్యపత త్కృతాగాః.
ఇదం కి మాశామహిలాముఖం స్యాత్ హారిద్రితం కాఞ్చన కన్దుకం కిమ్
కాశ్మీరలిప్తైకతరః కుచః కిం విస్రస్తవస్త్రో వరుణాఙ్గనాయాః. ౪౦
వాసన్తికం చమ్పకచక్ర మబ్జ జాణ్డం ను హైమం జనతాభిరేషః
ఇతీతి తర్కాకరకాన్తి ర్కః క్వవా కయావా కకుభా జగాళ. ౪౧
రవౌ రుషే వా థ గతే విదేశం యోషా ప్రతీచీ చ వియోగి నీవ
విచారశారా విగత ప్రకాశా విలాపమాపేవ విహఙ్గవాగ్భిః. ౪౨
సా దిగ్వధూ స్సాంధ్యపయోదదమ్భా ద్బహిస్స్మృతం స్వాన్తరరాగ మేవ
రవి ప్రియాయత్త మియం హి దృశ్యం ప్రేమ్ణా జనానాం ప్రతరాం చకార.
తమః ప్రియాదర్శనజం దధానాం విలోక్య సర్వా హరిదఙ్గనాస్తామ్
ఆశ్వాసయ న్నణ్డజవాగ్భి ర (ర్థా) సాజాత్యబాన్ధవ్య విచారశారాః. ౪౪
తాభిః ప్రపేదే హరిదఙ్గనాభి స్తమం సమం పశ్చిమదిగ్వధూట్యా
దయార్ద్రచిత్తాహి భవన్తి సన్తః ఖిన్నస్య దృష్టే రల మఙ్గనాసు. ౪౫
నిశా మహానీలమణి ప్రభాభి రిఙ్గాలచూర్ణై ర్ను విలిప్త మేతత్
దృష్ట్వా సమస్తం తత మఞ్జనస్య జగత్కథం నైల్యమిదం త్వముష్య. ౪౬
ప్రగృహ్య తేజఃపతిరేష తేజః కిం ప్రాణినాం నేత్రగతం ప్రయాతః
ప్రపశ్యతా రక్షితు మాత్మకుక్షౌ మిత్రేణ నిక్షిప్త మిదం జగత్త్రిమ్. ౪౭
గ్రస్తం సమస్తం తమ సైవ సర్వ మిన్దోరి వోర్వ్యా వలయం బభూవ
సర్వే తదా దృష్టనికేతనా ద్యా హ్యాత ర్కయ ధ్వాన్త మనేకధైవ. ౪౮
తమీ తమస్తా న్నృలోకపీఠా నమ్రా స్వబృన్దారకసున్దరీణామ్
విలోలనాసామణిమాలికేవ నక్షత్రమాలా భ్యుదియాయ లోలా. ౪౯
వైముఖ్యభాజః కౌముది న్యరాళకేశా స్సహాసా ఇవ కర్తు మేషః
తమోభిభూతా మపి కాశ్యపాశా వధూం విధుః పూర్వ మథాద్రిమాప.

ప్రాచీపురన్ధ్రీముఖ మేష దృష్ట్వా విధు స్తమోనీలపటావకుణ్ఠామ్
స్వకాన్తికాశ్మీరపటీరపిష్ట ముష్టిం విచిక్షేప సహాస మేనామ్. ౫౧
ప్రాచీ హరే ర్నగ్నికయా విముక్తతమో హ్రియా తాం విహరన్త మిన్దుమ్
కుముద్వతీ వీక్ష్య వధూః ప్రగల్భా వికాస దమ్భా న్నితరాం జహాస.
హర్షా ది వాచ్ఛే న్దుకరాభిమృష్టా ప్రాత స్తమో నీలపటీం సపత్నీమ్
వియోగినీవ న్నలినీం ప్రతీచీం దృష్ట్వా చకారేవ హి హాస ముచ్చైః.
దిగ్యామినీ న్కైరవిణీ శ్చ బహ్వ్య స్సాస్వాద నోద్భూతతమో ప్రకాశాః
సకాశనీకాశకరప్రకాశాః కుర్వ న్విధు ర్దక్షిణభూయ మాప. ౫౪
కామం త్రిలోకీవిజయైకకామం కామిన్యురోజస్థ మివాభిషిక్తుమ్
యామి న్యరాళాలక ఏవ సీతో రరాజ రాజా రజతోదకుమ్భః. ౫౫
శుభ్రామ్బరా రమ్యనిశా స్తశోభా నక్షత్రమాలా కృతభూషణా శ్చ
సత్పుష్పవ ద్భూషితమూర్ధభాగా యోషా ఇవాశా విబభు స్సహాసాః. ౫౬
దృగాశుగం భ్రూత్రిణతాక్షిమీన ధ్వజం ...నాయితనాసికం చ
రథాఙ్గయుగ్మాయిత స్తూచం చ జ్యారజ్జుసంవేష్టనితోచ్చకర్ణమ్. ౫౭
చూతాఙ్కురాస్వాదనతోతిమత్తై స్సమగ్రసైన్యైః పికబృన్దకీరైః
జిష్ణు స్త్రిలోక్యామహిళాముఖాబ్జ శతాఙ్గ మారుహ్య యయా వనఙ్గః.
పికాః కుహూంకాహళికాశ్చ కూజ న్రోలమ్బవీరాః పటు కున్దశంఖాన్
దధ్ము ర్మహాకోరకదీపికాభి ర్నీరాజయ న్తీవ హి చమ్పకానామ్. ౫౯
కామం విలోక్యేవ గృహీతచాపం వల్ల్యఙ్గనా శ్లేష మగు ర్మహీశాః
శాఖాభుజైర ప్యపిబ న్నళీనాం ద్వన్ద్వాని పౌష్పం మధు పత్రపాత్రే. ౬౦
ఆవర్తనాభ్యుల్లసదబ్జకర్ణా మహోత్పలాస్యోత్పలపత్రనేత్రాః
శైవాలలోమాళ్యలిజాలనీలాలకాస్సరిద్వ ద్వ్యరుచ న్వధూట్యః. ౬౧
ఇన్దీవరేన్దిన్దిరబృన్దగౌరారవిన్దనేత్రాలకబృన్దవక్త్రాః
ధృతాఙ్గరాగాంజనదివ్యమాల్యవిచిత్రవస్త్రాభరణా శ్శుభాఙ్గ్యః. ౬౨
తత స్సమస్తైః కుసుమై ర్వసన్త స్సర్వాస్త్రపూర్ణో మదన స్తదాసీత్
వాత స్సుశీతో మలయాద్రిజాతో మరన్దపుష్టశ్చ మిళిన్దబృన్దః. ౬౩
చూతాఙ్కురాస్వాదనరక్తకణ్ఠాః పికా శ్శశిశుభ్రరుచిశ్చ హృద్యః
రతిప్రదేశ్మి న్సమయే రతోత్కాః స్త్రీపుంసవారా రమణీయహారాః. ౬౪

జన్యం ప్రవృత్తం తుములం తతోఽభూత్ స్త్రీపుంసయో ర్లోకవిమోహనం ద్రాక్
నఖాంకుశై ర్వేణ్యురగాస్త్రహస్తకుస్తై రపాంగాశుగబాహుపాశైః. ౬౫
ప్రియేణ దష్టాధరపల్లవాల్పం ప్రవిక్షిపన్తీవ నఖాంశుపుంజాన్
విధూయ హస్తౌ కృతసీత్కృతోచ్చై ర్జఘాన కాచి జ్జఘనేన కాన్తమ్. ౬౬
కేళీనికాయే విరచయ్య కాచి త్కాన్తం స్వకాన్తే చిరయత్యజస్రమ్
ముక్తాగ్రముక్తాఫలపఙ్క్తి రాగప్రమోదమాస్తే ధిక మంజ సాక్షీ. ౬౭
కాచిచ్ఛ్వరం వీక్ష్య నిమీలితాక్షీ ప్రియాం సపత్నీరతిలబ్ధచిహ్నామ్
ఇలాం లిఖన్తీ...... నేత్రే కరో త్వే నవమేఘమిత్రే. ౬౮
నిశమ్య దూతీవచనా త్ప్రియాప్తిం కేళీనికాయాం స్వ మలం విభూష్య
కాచి త్సపత్నీభవనం గతేష్వి న్నతాననా భూద్ది నిశాబ్జినీవ. ౬౯
కృతాగసి ప్రేయసి పాదనమ్రే ప్యుదస్య కాచిద్గమనోద్యతేష్వే
చకారసాస్రం పరివృష్టధారం ధారాధరాంతశ్శశిమిత్ర మాస్యమ్. ౭౦
రతాన్త తాన్త్యాసనిమీలితాక్షీ విస్రస్తమాల్యాభరణాంబరైకా
భర్తుః పతత్యోరసి మాలికేవ విభా(త్య)పఘ్నుగ్రమగేవవల్లీ. ౭౧
కాచిత్కపోలం చ కుచం కరేణ చుమ్బన్త మహ్నాయ నిపీడయన్తమ్
నిపాత్య కాన్తం భుజగాభతల్పే సమారురోహోపరి తస్య కాన్తా. ౭౨
శుభ్రాశ్మభిత్తి ప్రతిబిమ్బితాభి ర్బహ్వీభిరాత్తాఞ్జలిదీపికాభిః
వ్యాప్తం నలో హాటకపుత్రికాభి ర్నిరాజయన్తీభి రివాఙ్గనాభిః. ౭౩
తక్కోలకాలాగురు క్లృప్తధూపం గోరోచనాకల్పితగోముఖం చ
వితానితం చిత్రపటై స్సురమ్య మవాప కేళీభవనం నరేంద్రః. ౭౪
శిఞ్జాన మఞ్జీరపదామ్బుజాథ ఘలంఘలత్కాఞ్చనరత్నకాఞ్చీ
సా చిత్రమాల్యాభరణా రమేవ కాన్తస్య కాన్తంగృహ మాస భైమీ. ౭౫
త్రపానతాస్యస్మితశుభ్రపూర్వా ధమ్మిల్లధామ్నా ప్యసితీకృతోర్ధ్వా
భైమ్యుద్యదిన్దు ర్విశదాగ్రభాగా ప్రాచీవ రేజే తమ సోర్ధ్వభాజా. ౭౬
స్మేరానన స్సోమకులావతంసో నలోఽథ జగ్రాహ కరేణ భైమీమ్
ఈష న్నిమీలన్నయనాం ప్రియామేనా మపూర్ణహాసాం నలినీ మివేనః. ౭౭
ఆకేకరాంశూష్కరవక్త్రచన్ద్రజ్యోత్స్నాయమానస్మితశోభితాశాం
ఆశ్లిష్య భైమీ మధిశయ్య మేష నివేశ్య తామ్బూల మదా దముష్యై. ౭౮

సమూర్తిమాన్కామఇవ ద్వితీయాం రతిం యథా భీమసుతా ముపేతామ్
స్మరేషుతప్తో రజనీషురాజా సంరంజయ న్నాస రతై ర్వచిత్రైః. ౨౯
కస్తూరికాచన్దనగన్ధవత్సు చిత్రప్రసూనేషు సుశీతలేషు
వనేషు సౌధేషుచ రాజపుత్ర్యా రేమే నల శ్చిత్రమృగాన్వితేషు. ౩౦
పపు ర్యువానోథ్యుషు రాజతాభ సౌధం మధు స్వాదుతమం ప్రియాభిః
నక్షత్రనారీముఖనేత్రబిమ్బ సౌగంధికాబ్జోత్పలజాతశోభమ్. ౩౧
కర్ణావతంసీకృతపుష్పలోల రోలమ్బపక్షాఞ్చలవాతపోతైః
రతాన్తఘర్మోదకబిన్దుజాల మవాప నక్తేషు శమం వధూనామ్. ౩౨
క్రీడా మవాప్యైవ మవాప్తఘర్మ సీరాం యువానో బహుచిత్రబన్ధైః
రతిం తతశ్చోపరతిం ప్రపన్నా స్స్వేపి నిద్రాలసపక్ష్మమాలాః. ౩౩
సమ్మోహనం నామ సుషుప్తిదమ్భ గాన్ధర్వ మస్త్రం మదనప్రయుక్తమ్
సమేత్యసర్వే విముహు ర్వరాజ్ఞ ప్రహారరుగ్ణాః ప్రహరైకమాత్రమ్. ౩౪
ప్రచోదితాః కుక్కుటదేశికేన కామద్విజాః పశ్చిమరాత్రిపార్శ్వే
చక్రుర్హి వాత్స్యాయనవేదపాఠ మామ్రేడితోక్తం మణితస్వరాఖ్యమ్. ౩౫
దీపావసూనాం నయనప్రశౌక్ల్య మేత్యార్పయన్స్వారుణిమాన మేషు
కాన్తావిలోక్యారుణలోచనాన్తాః భియేవ భాన్త్యప్యజహు న్నిజాభాః. ౩౬
రాజా ద్విజానాం రజనీప్రకాశో రాజ్ఞ శ్చతుర్వర్ణవిభో స్సదాభమ్
వక్త్రం విలోక్య త్రపయా విపాణ్డు రథామ్బరే కుత్రవిధు ర్విలిల్యే. ౩౭
కల్హారగేహాని విహాయ కల్యే భృఙ్గద్విజాః పుష్కరతీర్థవర్యే
యయుః పవిత్రే సమరందనీరే నిర్వాణదే స్నాతు మివాజ్ఞనాఢ్యాః. ౩౮
పతత్రిణో నామసమాన్ సమస్తాన్ ద్విజాన్ప్రసుప్తానివ బోధయన్తః
సేవార్థ మారోగ్యకరస్య భానో శ్చుకూజు రుచ్చైః కలవాక్కలాపాః.
రథాఙ్గయుగ్మస్య వియోగవార్తా మగ్నస్య నక్తం హృది సంప్రవృద్ధః
పరస్పరోపర్యనురాగ ఏవ సాన్ధ్యచ్ఛలాత్ప్రాప దిశం మఘోనః. ౪౦
కపోతకాహుంకృతిమన్తనాని ప్రకుర్వతీ సాన్ధ్యపయోదదమ్భమ్
వాసోవసానా సరజస్సమాశా హరే స్త్రయీమాప మసూతసూనుమ్.
సుత్రామదిక్కల్పలతోదయాద్రి త్రితారుణాభాప్రసూనోచ్ఛగుచ్ఛా
సాన్ధ్యచ్ఛలద్రావిరసారుణం రుక్ప్రకాశితాశం ఫలమాప దివ్యమ్. ౪౨

భాను ర్బభౌ భానుభి రుజ్జ్వలాభ స్తదాతితామ్రై రుడుపుష్పతామ్రః
పూర్వాచల స్యాకరతః ప్రభూతో మణిర్యథా దీధితి దీపితాశః. ౯౩
వికాసమీయు ర్జపతాం ద్విజానాం చలోష్ఠపత్రాణి ముఖామ్బుజాని
సస్వేదవామభ్రుముఖామ్బుజాభైః సహాబ్జషండై ర్జలబిన్దుషండైః. ౯౪
శైవం ను శాక్తం న్వథ వైష్ణవం వా వైనాయకం వా జపతాం ను సారమ్
సా రాజహంసేన నలేన కంచి దేవం మరాళీవ విహృత్య కాలమ్. ౯౫
భైమీ దధౌ గర్భ మథోత్తరే నిధిం......బృహద్భాను మివారణి......౯౬
సా పాణ్డురాస్యా విబభౌ కృశోల్ప కలాల్పజాలా శుచిశుక్లపక్షే
సౌమ్యర్క్షతారార్ధ నిశాకరేవ నిశాశరగ్భిన్నశిఖణ్డినీవ. ౯౭
విరేజతు స్తే చక చూచుకోచ్చౌ కుచౌ సభృఙ్గా విన పద్మకోశౌ
(వృత్తౌ) తదీయౌ పటుశాతకుమ్భ కుమ్భావివాగ్రచ్ఛురితేన్ద్రనీలౌ. ౯౮
గర్భస్థకాలాకరగేన్ద్రనీల ప్రభేవ వాన్తా బహి రాబభాసే
రోమాళిరస్యాః స్ఫుటగర్భభావి ప్రతాపవహ్నే రివధూమరేఖా. ౯౯
ప్రచీయమానావయవా విముక్తశ్రద్ధాలుఖేదా థ రరాజ భైమీ
పురాణపత్రాపగమాదుదూఢ నవప్రవాళప్రసవేవ వల్లీ. ౧౦౦
ప్రాచీవసూర్యం సమయే జయన్తం శచీవ రాశిః పయసా మివేన్దుమ్
చన్ద్రాఙ్గదం నామ సుధాంశువంశ రత్నం సుపుత్రం సుషువే థ భైమీ.
బభూవ పశ్చాత్తనయా నయాఢ్యా నవేన్దురేఖేవ వివర్ధమానా
శుక్తావిశుద్ధేవసుమౌక్తికాళి ర్దివ్యోత్తమా కల్పలతేవ భైమ్యామ్. ౧౦౨
వైదర్భకక్షీరసిన్ధో ర్గుణమణినికరస్యాకరాజ్జన్మభాజా
భైమీ లక్ష్మ్యాసమేత స్సకలవసుమతీజాని రిజ్యాసు సాజ్యైః
అన్యై ర్శిష్టై ర్హవిర్భి ర్విభురయమఖిలాన్ భూమిదేవాంశ్చ దేవాన్
కుర్వన్నిత్యేష్టభాజాన్ వసతి వసుమతీప్రాణిచన్ద్రోనిషన్నః. ౧౦౩
ఇతి (శ్రీ) అగస్త్యకృతౌ నలకీర్తికౌముద్యాఖ్యే లక్ష్మీపదలాఞ్ఛనే మహాకావ్యే చతుర్థః సర్గః.

# నలకీర్తికౌముది.

శ్లో. కర్కోటకస్య నాగస్య దమయన్త్యా నలస్య చ
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనమ్.

కలిదోషనాశకమైన నలుని పవిత్రగాథను సంస్కృతమున రచియించిన కవి శ్రీహర్షుఁడు. ఆతని గ్రంథము సాహిత్యపసులకు సుధాప్రాయమై యుండును గాని యాలంకారికుల కశ్లీలవాఙ్మయవిశిష్టము గాఁ గొన్నియెడలఁ గాన్పించును. అందువలనఁ బ్రాచీనాలంకారికులు గొందఱు గాఢముగా విమర్శించి యుందురు. దీనిం బురస్కరించుకొనియె ప్రసిద్ధాలంకారికుఁడగు నగస్త్య మహాకవి నలకీర్తికౌముది యనునీగ్రంథము రచియించినట్లు కాన్పించును.

అగస్త్యుఁ డెవ్వఁడు? ఎప్పటివాఁడు? అతనిగ్రంథములెవ్వి? అగస్త్యున కింకొక పేరేదైనఁగలదా? యనుసంశయములంగూర్చి విచారింతము. అగస్త్యుని గూర్చి కొంతకాలమునకుఁ బూర్వము రెడ్డిరాణిపత్రికకు నేనొకవ్యాసము వ్రాసియుంటిని. అగస్త్యుఁడు క్రీస్తుతర్వాత 1323 సంవత్సరమున రాజ్యముం గోలుపోయిన రెండవప్రతాపరుద్రచక్రవర్తిదగ్గఱ మంత్రిగనుండిన విద్యానాథుఁ డనువాఁడని పెక్కు నిదర్శనములతో నొకప్పుడు ముక్త్యాల సరస్వతీ పత్రికలోఁ జర్చింపఁబడియెను. అగస్త్యుఁడు విద్యానాథుఁడను బిరుదము గలవాఁడై యుండెనఁట. అందుల కీక్రిందిప్రతాపరుద్రీయశ్లోకముతార్కాణము.

"ఔన్నత్యం యదివర్ణ్యతే శిఖరిణః క్రుధ్యంతి నీచైఃకృతాః
గాంభీర్యం యది కీర్త్యతే జలధయః క్షుభ్యంతిగాధీకృతాః
త త్త్వాం వర్ణయితుం బిభేమి యదివా జాతో౽స్యగస్త్యస్థిత
స్త్వత్పార్శ్వే గుణరత్నరోహణగిరే శ్రీవీరరుద్రప్రభో.
అత్ర యదివా జాతో౽స్యగస్త్యః స్థిత ఇత్యనేన జలనిధిపర్వతేభ్యో నబిభేమీతి వ్యంగ్య మత్రాగూఢమ్". (కావ్యప్రకరణ- ౫౭ శ్లోకము.)

అగస్త్యుఁ డనుపేరుగల యీకవి డెబ్బదిగ్రంథములు సంస్కృతభాషలో రచించె నని వాడుకలో నున్నది. అం దీతనిబాలభారత మను గ్రంథమునకు మంత్రి తిమ్మరుసు వ్యాఖ్యానముం జేసియుండెను. విశేషమేమన నగస్త్యునకు విద్యానాథబిరుదము గలదు. కథలయం దీతఁడు ప్రతాపరుద్రునికడ మంత్రిగా నుండెననికూడఁ జెప్పఁబడుచున్నది. విద్యానాథశబ్దము విద్యాంగ మంత్రిగా నుండెనను ధ్వనికలదై యున్నది. ప్రాచీనకాలమున మహాపండితు

లు భారతీయప్రభువులకడ మంత్రులుగాఁగూడ నుండి రనుటకుఁ బెక్కు నిద ర్శనములు గలవు. శ్రీనాథమహాకవి కొండవీటి ప్రభువుకడ విద్యాంగ మంత్రిగా నుండె నని మఱియొక తార్కాణము. ప్రతాపరుద్రచక్రవర్తికడ నుండిన మంత్రియొక్క గ్రంథమునకు నాంధ్రభోజుఁ డగు శ్రీకృష్ణరాయచక్రవర్తి కడనున్న మంత్రియగు తిమ్మరుసు వ్యాఖ్యానముచేయుట ప్రశంసనీయము. అగస్త్యకృత బాలభారతములోని కొంతభాగమును గొన్నియేండ్లకు ముందు బ్ర॥ కోలాచలము శ్రీనివాసరావుగారు తెనుఁగు చేసియున్నారు. ఇప్పు డీమూ లగ్రంథము ముద్రణస్థితికిఁ దేఁబడుచున్న దని వినుచున్నాము. ఈనలకీర్తి కౌముది వసుచరిత్రము రచియింపఁబడునాఁటికి (క్రీ. శ. ౧౬౦౦) పఠనపాఠ నములయం దుండియుండును. దీనిలోని (౨ సర్గ. ౭౮శ్లో.)—

శ్లో. భృంగానవాప్తిప్రతిపన్నఖేదా కృత్వా వనే గన్ధఫలీ తపోలమ్
తన్నాసికాభూ దనుభూతగన్ధా స్వపార్శ్వనేత్రీకృతభృఙ్గసేవ్యా.
అను శ్లోకమునకే వసుచరిత్రములో (ద్వితీ. ౭౭)

శా. నానాసూనవితానవాసనల నానందించుసారంగ మే
లా న న్నొల్ల దటంచు గంధఫలి బల్కానం దపంబందియో
షానాసాకృతిఁబూని సర్వసుమనస్సౌరభ్యసంవాసియై
పూనెం బ్రేక్షణమాలికామధుకరీపుంజంబు లిర్వంకలన్."

అనుపద్యము సరిగా నాంధ్రీకరింపఁ బడియున్నది. నలకీర్తికౌముదిని వ సుచరిత్రమును బరిశోధించినయెడల మఱికొన్ని విశేషములు కాన్పింపవచ్చును. నంది తిమ్మనార్యుఁడు పైపద్యమును రచించెననియు వసుచరిత్రకారుఁడుదానిని రు. ౩౦౦౦ కుఁ గొనియెననియుఁ గలయొకకథ వాడుకలోనున్నది. కాని, నంది తిమ్మనార్యుఁడైనను పైశ్లోకమునకే యాంధ్రీకరణము చేసియుండునుగాని యిది యతని స్వకపోలకల్పితమై యుండదు.

నలకీర్తికౌముది సంపూర్ణముగా నెచ్చటను గానిపింపదు. ఈ ౨, ౭, శిథిలసర్గలు పీఠికాపురమున నొకపండితకుటుంబముయొక్క ఛిద్రగృహమున దొరకినవి. దీనిప్రతినే నేను లండనులోని ఇండియా ఆఫీసు లైబ్రరీకిఁ బంపి యున్నాఁడను.

నాకు దొరకిన శిథిలమాతృక జయసంవత్సర ఆషాఢ బ ౧౭ ఆదివార మున బొమ్మకంటి లక్ష్మీనరసింహముగారు వ్రాసినది.

పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.

## (59) త్రిమలమాసాదినిర్ణయము-గ్రం. సం. 59౯.

చోళరాజీయ మనునోక్తసిద్ధాంతగ్రంథములో మొదట నొకపత్రము మీఁద నీవిషయము వ్రాయఁబడియున్నది.

శ్రీమద్విజయాభ్యుదయప్రాభవశాలీ సశాలివాహనరాట్
జీయా ద్యస్య శకాబ్దా శ్చతురంబుధిశైలభూమిపరిమితయః. ౧
అద్యతనచిత్రభానౌ మాసత్రితయం మలీమసం భవతి
ద్వౌమాసౌ విగతరవీ ద్విరవి ర్మాస స్త్వధిక ఇత్యేవమ్. ౨
రవిరహితః ప్రా క్చుధ్ధ స్సంసర్పాఖ్య స్తతో ద్విసంక్రాంతః
అంహస్పతి రపి శుద్ధ స్తదుప ర్యరవి ర్మలిమ్లుచ స్త్వశుచిః. ౩
భాద్రపదమాసదర్శే కన్యామాక్రమతి భూయ ఆదర్శః
తదను ప్రతిపది తౌలీ మాసూర్యో మాసి మాసాంతః. ౪
తదుపరి దర్శ మతీత్య త్వష్టా సముపైతి వృశ్చికం భూయః
తౌలీవృశ్చికసంస్థే దర్శసమాప్తి ర్విభావ్యతే యత్ర. ౫
తత్సమసంఖ్యౌ మాసౌ తౌ ద్వౌ భవత స్తథాశ్వికార్తికకౌ
బాహుళదర్శ మతీత్య ప్రతిపది ధనురేతి తదను దర్శేచ. ౬
మకరప్రవేశ ఇతిత న్మాసో భవతి ద్విసంక్రమాక్రాంతః
కుంభస్థేర్కే మాఘ స్సతి మీనస్థేచ భవతి ఫాల్గునికః. ౭
సంక్రాంతిహీనమాసః తత ఏక స్త్రిమలసంభవ స్త్వేవమ్
ఆశ్వినమాసవిధేయ ప్రత్యాబ్దికక ర్మరూప ముభయత్ర. ౮
సాంకల్పికం సపిండం కుర్యా దిత్యేవ శాస్త్రసిద్ధాన్తః
మార్గశిరః పౌషగత శ్రాద్ధా న్యేకత్ర మాసి విదధీత. ౯
పూర్వాపరాహ్ణభేదా దిత్యేషా భవతి శాస్త్రమర్యాదా
దశమాసాః ప్రకృతిస్థాః వైకృతికాస్తు త్రయో భవంత్యేవ. ౧౦
సంసర్పాంహస్పత్యౌ మలిమ్లుచశ్చే త్యేత త్రయోదశేతే
వెల్లాలాన్వయజనుషా హరోబలనరసింహనామధేయజుషా. ౧౧
విదుషా మేతత్త్రిమలీమసమాసవివరణం శరణమ్
వేదాద్రినందవర్షే శాకే పూర్వం గతోథ తిథిరంధ్రైః. ౧౨
పశ్చాదంగశరాక్షిక్షితిభి రథాష్టాద్రిరామ శశిభిశ్చ ౧౩౭౮

అథపర్యాయత్రితయా దేకో ననభో(౧౯)నశశిజలేందు మితైః(౧౪౧)౧౩
సముపాగతా దుపేత స్త్రీమలీమసమాసవర్ష ఉదయాయ
వేదాబ్ధిశైలభూమితి రభిధేయ శ్చిత్రభానుశబ్దేన
ఉపరిష్టాదప్యేవం క్షయమాసః క్వాపి సంభవే దేవ. ౧౪
ఆపంచాబ్ద ముపేయుషి ద్విరధికే మాసేవ నైవ త్యజేత్సంసర్పి
పితృవార్షికం తదుభయోః కుర్యా దపిండం పురా.  ౧౫
తచ్చాంహస్పతిమాస ఏవ విధివ త్కుర్యాద్వయో ర్మాసయో
యః కర్తవ్య మహః పురాపరభిదా మాశ్రిత్య ధర్మస్థితేః. ౧౬

(60) శ్రీరంగమాహాత్మ్యము—గ్రం. సం. 672.

ఇది యొకపద్యకావ్యము-ఐదాశ్వాసములు.

గద్యము—శ్రీమద్రఘురామచంద్ర చరణారవింద నిష్యందమరంద బిందు సందోహాలాలసేందిందిరాయమాన మానస తాండవకేళికాతుకోజ్జృంభమాణ మహాభుజంగపుంగవవిభూషణోత్తమాంగ రంగద్గంగాతరంగాభంగుర చతురకవితారచనాధురీణ శ్రీహరిభక్తామృతసార ప్రబంధ నిర్మాణప్రవీణ చేకూరువంశపయఃపారావార రాకాసుధాకరాయమాన సిద్ధులు నామధేయప్రణీతంబైన శ్రీరంగమాహాత్మ్యం బనుమహాప్రబంధమునందు......అని—దీనివలనఁ గవిపేరు సిద్ధులు (సిద్దయ్య) యని తేలినది. ఈతఁడు శ్రీహరిభక్తామృతసార మనుప్రబంధమునుగూడ రచించియున్నాఁడఁట.

శ్రీనలగొండ్లలక్ష్మీనరసింహకవీంద్రుకృపావలోకనా
సూనసుధారసంబున వినూతనసాహితి లక్షణాదిక
జ్ఞానము గల్గి సత్సుకృతికాండము దండిగ నిచ్చమెచ్చియా
సౌనన రంగనాయకమహత్త్వ మనం గృతి నే నొనర్చెదన్.

అనుపద్యముంబట్టి నల్లగొండ్లలక్ష్మీనరసింహకవిగారిశిష్యుఁ డని తేలినది.

వ......లబ్ధమనోరథు లగుగంధకరబలిజకులంబునం జెలువలరు జలకలగోత్రపవిత్రులనం బరఁగు నాగునువంశం బలఘుతరంబై ప్రవర్తిల్లు.

ఉ. శ్రీమత్తంజదళాక్షు సత్కరుణ నాచేకూరువంశాంబుధిన్
సోముం బోలి జనించెఁ గృష్ణుఁ డనఁగా సువ్యక్తశీలాత్ముఁడై
శ్రీమంతుం డగుకృష్ణదేవపదరాజీవార్చనాసక్తతన్
ధీమంతుం డన బుచ్చమాంబను మహాతేజంబునం బెండ్లియై.

దీనింబట్టి కవి గండవరబలిజకులస్థుఁడు జలకలగోత్రుఁడు నని తెలిసినది, పైపద్యములోని కృష్ణయ్యకు గోపాలుఁడు వెంగళయ్య యను నిద్దఱుసుతులు. ఆ వెంగళయ్యకుఁ జలమయ్య, కృష్ణుఁడు నని యిరువురుతనయులు. చలమయ్య గృహిణి మంగమాంబ.

గీ. .........మంగమాంబాభిధాన, సాధ్విగర్భాబ్ధిసంపూర్ణచంద్రమూర్తిఁ
బరఁగి సిద్ధాఖ్యఁజెలువొందిపద్మనాభు,మదిని భావింతుఁబూర్వజన్మానుసరణి.

ఇట్లీ కవివంశావళి దీనిని బట్టి తెలియవచ్చుచున్నది. ఈతనికవిత్వము సంస్కృతపదజటిల మైనది గానున్నది. కృత్యాదిపద్యములు కొన్ని—

ఉ. శ్రీమిథిలాధినాథనృపశేఖరజాతసనత్నభూషణ
స్తోమలసద్దరస్మితుఁడు సుందరవిగ్రహుఁ డార్తపాలికా
రామవసంతుఁ డర్యమకులాంబుధిపూర్ణసుధాకరుండు శ్రీ
రాముఁడు సత్కృపామతి నిరంతరము న్మముఁ బ్రోచుఁ గావుతన్.

ఉ. ప్రీతి నమోనమో యనుచుఁ బెక్కువిధంబుల మ్రొక్కుదున్ మనో
జాతుని తల్లికిన్ సుకవిసంస్తుతకల్పకవల్లికిన్ ఖనీ
భూతదరిద్రవారిధరపుంజప్రభంజనదృగ్జగత్త్రయీ
పూతకు దుగ్ధసాగరసముద్భవకున్ జగదేకమాతకున్.

మ. సరిదిభ్యావృతగోభృదండజవిభూషాంగార్చ్యరాజన్మహీ
ధరరాట్సంభవ కబ్జిజాబ్జభవకాంతానంత సంతోషశ్రీ
కరమాధుర్యహితానులాపకు సనుగ్రానుగ్రహాలోకనో
త్కరసంరక్షితభక్తజాలకుఁ గవిత్వాకాంక్షినై మ్రొక్కెదన్.

గ్రంథభాగములోనిపద్యములు—

చ. అన విని రామ రామ విను మాఁడది యంచుఁ దలంచెదీవు నీ
వనితఁ గనం గృతాంతయభవాబ్జభ వాదులకైన మృత్యువై
నను భయమున్ ఘటించు మునినాథసుపర్వవినాశకారిణిన్
హనన మొనర్చి సంతతము హర్షమొనర్పుము సాధుకోటికిన్.

ఉ. అచ్చటివానికాంతలు ధరాత్మజఁ గాంచి మహానుభావు లీ
సచ్చరితు లసమున్నతులు శస్త్రధనుర్ధరు లర్కతేజు లి
ట్లచ్చపుమానివేషు లెవరన్న మఱంది నెఱుఁగఁ జెప్పితా
హెచ్చినలజ్జ నుండ నగి రింతి జనంబు గిలాకిలంబుగన్,

ఉ. రాముఁడు రావణాసురు శిరంబులు బాహులు ద్రుంచె మొల్చె నా
స్తోమము ద్రుంచె మొల్చె మఱిద్రుంచెను మొల్చెను ద్రుంచె మొల్చినన్
వేమఱుఁ ద్రుంచుచుండ నవి వేమఱు మొల్చె సవిస్మయంబుగా
నామహి శీర్షముల్ కరము లస్త్రలభంగిఁ దనర్చె భూవరా.

(61) బాలభారతమ్-గ్రం. సం. 855.

ఇదియొక సంస్కృతకావ్యము. అగస్త్యకృతము. దీనినిఁ గొంత బ్ర॥ కోలాచలము శ్రీనివాసరావుగా రాంధ్రీకరించి ముద్రింపించియున్నారు. వారికి మొదటినుండి పండ్రెండుసర్గముల గ్రంథము దొరకినదఁట. అందాఱుసర్గములే వారు తెనిఁగించిరి. ఈపుస్తకములో, తృతీయసర్గము మొదలు షోడశసర్గము వఱకుఁ బదునాలుగు సర్గములుగలవు. "అగస్త్యకృతే బాలభారతే" యనియున్నది. ఒక్కచోట అగస్త్యసంవాదే యనివ్రాసి సంవాదే యనుదానిని గుండలీకరించినారు. పరిషత్పుస్తకభాండాగారములోని గ్రంథము ప్రారంభమునందలి కొన్నిశ్లోకములు:—

జాతు జహ్నుదుహితు ర్జలే చిరం పద్మగంధిని విహృత్య నిర్గతైః
పౌరవైః పటగృహేషు భూషితైః భుక్తవద్భి రుషితం తథే సుఖమ్.
తత్ర వారివిహృతిక్రమాలసం నిద్రయా పరవశం వృకోదరమ్
సింధుసీకరభృత శ్శిషేవిరే మందరాద్రినవిరామవాయవః.
ఆయతాభి రహితం సుయోధన స్తం సుషుప్తి మవబుధ్య వల్లిభిః
భోగిబద్ధ మివమందరం హరిః సింధుగర్భపయసి న్యపాతయత్.
స ప్రబుధ్య సరిత స్సముద్ధితః ఛిన్నబంధనశతః స్వపన్ పునః
విద్విషా కురుసుతేన మోచితై రుద్విషాగ్నిభి రదృశ్యతోరగైః—3 సర్గః.
పవనతనయే నాశ్వత్థామ్నః సనామ్ని హతే ద్విపే
చకితమనసా ద్రోణా దభ్యర్థితో మురవైరిణా
పతతి సమితా వశ్వత్థామా హతః పరవారణః
స్ఫుట మితి గిరం రాజా ధర్మాత్మజః స్వయ మబ్రవీత్-
ససత్యవచసో గురు ర్గిర మజాతశత్రోస్తదా
నిశమ్య సుతవత్సలః సపది హాసుతేతి బ్రువన్
విసృజ్య సశరం ధనుః ప్రబలశోకమూర్ఛాన్వితః
రథోపరిని షేదివానభవ దశ్రుధౌతాననః.

దృష్టద్యుమ్నేన సద్యస్సముపగతవతో వాహినీం తస్య రోషా
దున్ముక్తప్రాణవాయోః కరకలితకచే నాసినా మూర్ధ్ని కృత్తే
సంక్షుబ్ధే సైన్యసింధౌ శ్రుతపితృనిధనః క్ష్మాముపాలా మకృష్ణాం
కర్తుం నిష్పాండవంచ వ్యసృజ దరిబలే ద్రౌణి రాగ్నేయ మస్త్రమ్.
దగ్ధైకాక్షౌహిణీకే జ్వలితదశదిశా పార్థముక్తేనతస్మిన్
బ్రహ్మాస్త్రేణ ప్రశాంతే సపది గురుసుతం రోషసన్న్యస్త శస్త్రమ్
వ్యోమ్నః క్లుప్తావతార స్తరళతరజటావిద్యుదుద్యోతదీప్తా
ద్వ్యాసః కాంతారవాసవ్యవసితముచితై ర్వారయామాస వాక్యైః-౧౯-సర్గ.

పరిషత్పత్త్రిక 19 సం. 1-2 సంచికలలోఁ బ్రకటింపఁబడిన నలకీర్తి కౌముదిని రచించిన యగస్త్యుఁడు నీయగస్త్యుఁడు నొక్కఁడేనఁట. నలకీర్తికౌముది పూర్తిగ నెక్కడనైనఁ గలదా!

(62) శకుంతలనాటకము—గ్రం. సం. 695.

ఇదియొక యక్షగాననాటకము. నరసింహకవికృతము- ప్రారంభము:—

ద్విపద.

శ్రీమంతుఁ డఖిలలక్ష్మీప్రసన్నుండు । భూమి సోమాన్వయాంబుధిసుధాధాముఁ
డరిశైలపవిధారుఁ డసహాయబలుఁడు । వరుసతో నంద్యాలవంశవిస్తారుఁ
డమలసదాచారుఁ డాత్రేయగోత్రుఁ । డమరేంద్రనిభవైభవస్ఫీతుఁ డనఁగ
రమణ నారాయణ రాజశేఖరుఁడు । విమలయశోరూపవిజితతారకుఁడు
ఆమహీపాలున కనుఁగుతనూజుఁ । డైమించు రాఘవావనినాయకుండు
అతులప్రతాపుఁ డూర్జితశక్తియుతుఁడు । నతనికగ్రసుతుండు నయగుణయుతుఁడు
రణకోవిదు ......................... అనృపవర్యునకనుజన్ముఁడగుచు
అమలగాంభీర్యరత్నాకరుం డగుచు । రమణానారాయణ రాజదేవేంద్రుఁ
డొప్పునానృపవర్యుఁ డొకనాఁడు ... ... ...
అరుదార వఝ్ఝులనరసింహసుకవి । వరయంచు రావించి......
అంబరతాంబూలజాంబూనదాది... ... లొసంగి
పరికింప నన్నయభట్టారకుండు । విరచించె దుష్యంతవిభుచరిత్రంబు
నాకథ యక్షగానంబుగా మిగుల । శ్రీకరంబుగఁ గీర్తి చెలువొందఁ జేయు
మనిపల్కి దీవించి.........ఘనుపొందహరిపేరఁ బ్రబలునీకృతియు

కమనీయమగుకథాక్రమ మెట్టిదనిన:—

దీనివలనఁ గవిసంగతియు తత్కవికిఁబ్రోత్సాహ మొసర్చిన నంద్యాల ప్రభువులపేరులును, కథ యెందుండిగ్రహించినదియు, దెలిసికొనుచున్నాము, కథాకల్పనము యక్షగానములకుఁ దగినట్లే యున్నది. భామవేషకథవలె నున్నది.

క. పచ్చలబాకు కరంబున, ముచ్చటగ హుమాయిపిట్ట ముంజేతిపయిన్
మచ్చికలర మంత్రులతో, వచ్చును దుష్యంతనృపతి వైభవమలరన్.

గీ. ఎవరయా మీర లేదేశ మేలుచారలు,ఇపుడుమీకిటువచ్చుటయెందుకొఱకు
తల్లిదండ్రులు యెవ్వరు ధరణినాథ,తెలియ జెప్పుముమీనామధేయ మేమొ.

దుష్యంతవచనము:—

ప్రేమమీరఁగ నాదు పేరేమనెదవు, ఏమిరాప్రియభృత్య యెఱుఁగవా నన్ను.

భటునివచనము- రాజేంద్రా !

గీ. మీరు యిటఁజేరినది మొదల్మేదినీశ, సభికులందఱుఁ జాలఁగా సంతసించి
యెదురుచూచెదరయ్యయింకేలతడవు,తెర వెడలిరమ్మయి చటికిఁదీవ్రముగను.

రాజు- ఆలాగేవచ్చెదమురా భృత్యా !

దరువు. వెడలివచ్చెనూ వేడ్కమీఱ దుష్యంతనృపతి- వెడలివచ్చెను- పైమాటలే సర్వమును వేత్తలకుఁ దెలియఁ జెప్పుచున్నవి.

విళంబినామసంవత్సర భాద్రపద బ ౧౦ లు నాఁటికి సమాప్తముగా శ్రీమన్మహామండలేశ్వర నంద్యాల నారాయణరాజుదేవమహారాజులుంగారు స్వహస్తముగా వ్రాసినది.

(63) లక్షణచంద్రిక—గ్రం. సం. 552.

దీనికి గవి యెవ్వరో తెలియదు- తొమ్మిదిపత్రములు గలవు- ప్రారంభము-

గీ. శ్రీమనోనాథ నుతచర్య శ్రీమహేశ, సర్వనత లసదచలాత్మజాకళత్ర
బాలజనములకెల్ల విస్పష్టముగను, జేతు లక్షణచంద్రిక చిత్తగించు.

గీ. పూర్వకవులకు భక్తితో మ్రొక్కి నూత్న, కవుల వేడ్కనుతించి కాకవుల విడిచి
లఘుతరంబుగ జనులు సులక్షణంబు, దెలియ లక్షణచంద్రికఁ దెలుపు దీశ.

క. సుకవికృతిఘటపదార్థ, ప్రకరము నుచ్చిలుచు నెపుడుఁ బరఁగుచు నుండీ
కుకవిశునకముల కిలమ, త్సుకృతిస్నేహాభిలాష చొప్పడు నెట్లన్.

గీ. మునుపులక్షణంబు గనువా రెఱింగితే, దీనఁ గొన్ని మరలు తేటపడును
మున్నెఱుంగకుండి కన్న సూక్ష్మంబుగా, లక్షణంబు దెలియు లక్షణముగ-
(విషయము క్రొత్తదియును గాదు, చెప్పినంత సుకరముగాఁ దెలియుపద్ధతి యును గాదు.)

క. కంద మిూరీతిగా కొక, యందంబున నైఁ జెల్లు నాపిమపాదం
బందుఁ బదిరెండు మాత్రలు, చెందిరువది రెండవదియు శేషం బటులన్.

ఇందుకులక్ష్యము- జ్ఞానవాసిష్ఠరామాయణము.

క. ఇది తత్త్వరహస్యార్థము, పదసంగతిఁ దెలుఁగుపఱుచు ప్రాజ్ఞులకును బ
ట్టిదము తాత్పర్యవాసన, విదితంబుగఁ గవులుమెచ్చ వివరింతుఁ దగన్.

భారతము- శాంతిపర్వము-

జననీజనకసోదరులు, తనూభవులు.........

తేలుమందా మె బోనము, పాలా మెను మంచినీళ్ళు పండితవర్యా.

ఉ. బ్రహ్మవిరామముల్ భరనభారలగంబుల నుత్పలంబగున్.

మ. పదమూటన్ సరభంబులున్ నమయవల్ వర్తిన్న మత్తేభమా.

చ. నజభజజల్ జరేభల గనంగ దశాయతి చంపకంబగున్.

క. పదుమూఁడుగోటులును న, ల్బది రెండగులక్షలు దగుఁ బదియేడువేల్
పిదపే డునూఱులు న్నిరు, వదియాఱుసమాంఘ్రివృత్త పంక్తులు దేవా.

49 పద్యములైన పిమ్మట- సేనాధిపత్యము శేషాచార్యులు నలనామ సం॥ జ్యేష్ఠ బ ర ఆదివారమునకికి యీలక్షణచంద్రికన్వ్రాసెను. అని- తర్వాత మరల మకారయెతికి యరలవశేషసహమాత్రలకు యీ ఱ అక్షరములకు దాపల సున్నలు వున్న యెడల మకారము మాత్రమే యెతులుచెల్లును- ఇత్యాది గొన్నిపంక్తులు గలవు. పూర్తికాలేదు.

(64) అచ్చతెనుఁగునిఘంటువులు. —

ఒక తాటియాకుల చిన్నపుస్తకము. ఇందు చౌడప్ప సీసములు- ప్రగడపువారికందము లని రెండుభాగములు గలవు. ప్రగడపువారికందము లని యే కాని కవిపేరు లేదు. సుమారు 80 పద్యములు గలవు. చౌడప్పసీసము లు ప్రారంభములో,

క. కప్పామెయితేనిపేరిట, ముప్పదిసీసంబు లాంధ్రముగఁ జెప్పెను జౌ
డప్పయు నీకబ్బంబునఁ, దప్పెంచకుఁ డార్యులార తగనుతిసేతున్.

అనియున్నది. ఈతఁడు కవిచౌడప్పయో మఱియింకొకరో తెలియదు.

అందొక్కపద్యము—

సీ. గోలనా ముగుదారిగోలనాఁ గను ముల్లుఁగోల యొడయుఁబరిగోలయనఁగ
డిందు వనంబు కడిందు తోరంబు ను డిందు నుంటకు ను బేరిందు క్రీడ
తీద్రంబు చికిలి మెట్టంత్రు మట్టాట వా డంత్రు వాడఁటఁ ద్రేగంత్రు బరువు
వెల్లి నిండుట పాలవెల్లి పాల్కడలి రే పెల్లి నాఁగను గొడు గెల్లి నాఁగ
తఱ్ఱియన యెడ్డె పెనుచోరపఱ్ఱె మీఱు, తొఱ్ఱుప ట్టాలదొడ్డి ప్రోఁబఱ్ఱె నాఁగ
మఱ్ఱిచిట్టఁ బరున్న రాకుఱ్ఱమిన్న, కఱ్ఱిచెలివేల్ప ముజ్జగాల్గొబ్బఱ్ఱిదాల్ప.

ప్రగడపువారికందములు ప్రారంభము.

క. శ్రీరమణీకుచలిప్తసు, సౌరభఘనసారగంధసారవనీరా
సారఘనసారసారస, సారరజోవత్స వత్ససారవిదారీ !

క. ప్రహ్మహి నిరసించుట కగు, గిహ్మో నవఘుళించె నేవగించెను బలుమే
లమ్మాడెఁ దెగడె నెకస, క్రైన్మాడె దురంగలించెఁ గేడించెనఁగా.
పేరొప్పును మహభూమికి, మోరపురతనాలమెట్ట మొరకబువి యనా
వారిజము బాడిదము నిం, డాదును గంకేళి పేరు లంబురుహాక్షా.
ఏడ్తెఱయు సాంపరాయము, నేడ్తెఱయు నితాంతమునకు నిలఁబేరొప్పం
దోడ్తోనన సంప్రతి యగుఁ, దోడ్తోననఁ బూర్వమునకుఁ దోడదురమేశా.
సారవయనఁ గేదారము, సారవయన సేతువునకుఁ జనుఁ బేరవనిఁ
బూదగయన శాల్మలియును, బూదగయనఁ గాహళంబు భూసురవినుతా.

వ్రాఁతతప్పులు మెండుగా నున్నవి. దానితోపాటు కవి బుద్ధిపూర్వకముగాఁ జేర్చిన "బుయనాఁగయోని గెబ్బయనా జయింపు మబ్బయనాఁగ మొయిలు గబ్బయనత్రుల్లు" ఇట్టి పొరపాటులును గలవు.

క. వనదేవత కాల్రేఁడనఁ, దనరును గువ్వకరి యేకతమునకుఁ బేరై
చను పంకకఱ్ఱ లాతొ, మనఁ గూఁకటి యనఁగఁ జుట్టు అంబుజనేత్రా.

అను కందపద్యముకూడ సీసములచివర నున్నది. దీనిచివర సంస్కృతము ద్విరూపకోశముకొంతఁ గలదు.

వికృతినామసంవత్సర చైత్ర బ ౧ సోమవారము వఱకు క్రొత్తపల్లి లచ్చయ్య స్వాంతమునకు వ్రాసికొనినపుస్తకము.

---

# విషయసూచిక.

---



---



తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసంగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రిందఁ బొందుపఱుపఁబడు చున్నవి:—

i తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వాంకష మగునిఘంటు వొకటి రచించి ప్రచురించుట;

ii తెలుఁగుభాషకు సజాతీయేతరభాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణము రచించి ప్రచురించుట;

iii ఆధునికశాస్త్రగ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట;

iv ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యములైన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగు దేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్రమొకటి రచించి ప్రచురించుట;

v సర్వవిషయములనుగుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసంగుట;

vi ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట;

vii తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొక పత్రికను బ్రకటించుట;

viii తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గుఱించి చర్చించుటకుఁగాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట;

ix తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలు గావించి పారితోషికములను, సాహిత్యపట్టములను, యోగ్యతాపత్రికలను నొసంగుట;

x ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట— ఇందుఁ బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును; వ్రాఁతప్రతులుగూడ నుండవలయును;

xi తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపకరించు నన్ని కార్యములను జేయుట.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౧౯ { ప్రమోదూతనామసంవత్సరము. శ్రావణభాద్రపదమాసములు. } సంచిక 3

## పాలకురికి సోమనాథకవి; కులగోత్రప్రశంస.

—: బండారు తమ్మయ్యగారు, కాకినాడ. :—

ఉ. తేనియసోనలం జిలుకు తేటగు జాను తెనుంగుఁబల్కులన్
వీనులఁ దన్పు కబ్బముల నిక్కపు దేసి తెనుంగుఁగైతకుం
బ్రాణము వోసినట్టి బుధవంద్యుని శ్రీ బసవేశ చింతనా
సూనృతచిత్తుఁ బాల్కురికి సోమకవీంద్రుని సంస్మరించెదన్.

మహాకవు లేకులమువా రయినను నేకాలమువా రయినను దేశకాల పాత్రవిభేదము లేక సర్వత్ర పూజింపఁబడుచుందురు. విదేశీయులగు షేక్స్పియ రాదులనే, వారి కవితాగౌరవమును బట్టి మనము పూజించునప్పుడు మనదేశీయకవులను గులవిభేదముతో నిమిత్తము లేకుండ మన మారాధించుట కభ్యంతర ముండరాదు. కవితారసజ్ఞులకుఁ గవుల కులము కాలము మొదలగు విషయములఁ గూర్చిన చర్చ లనావశ్యకములు. కొందఱకవి తలకంటగింపుగఁ గూడ నుండును. కాని "చరిత్ర చరిత్రకొఱకే" యను సూత్రము ననుసరించి చరిత్రాభిజ్ఞు లిట్టి చర్చలను గూడ నవసరముగనే పాటింతురు. వానిప్రయోజనము చరిత్రోపయోగమాత్రమే యనుట నిక్కువము.

పాలకురికి సోమనాథుఁడు నన్నయకుఁ దిక్కనకు మధ్యకాలమునఁ బడి రెండవశతాబ్దియందు వెలసిన ప్రఖ్యాతాంధ్రకవి. తెలుంగుకవిత జీవకళ నిక్కమయిన తెలుఁగుఁబలుకుబడులలోనే కల దని తలంచి, నన్నయ మార్గమునకు

వస్నియనెట్టుచు జానుతెనుఁగును దన కబ్బముల జాలువార్చి జాతీయకవితా నిర్మాణమునకయి తిక్కనాదిమహాకవులకు మార్గమును దీర్చినవాఁ డీ మహనీ యుఁడే యనుట సత్యదూరము కాఁజాలదు. కాని యీతని కవితాప్రాశస్త్యము నాంధ్రలోక మిప్పు డిప్పు డించుక గ్రహించుచున్నదే గాని కొన్ని సంవత్సరముల క్రిందటివఱ కీతఁ డించుమించుగ విస్మృతకవిగనే యుండె ననుట యబద్ధము కాదు. శ్రీవీరేశలింగముపంతులుగా రీతనిని గవులచరిత్రమున కెక్కించినను, నీతని కవితాగౌరవము నొకించుకయు నుగ్గడింపరయిరి. శ్రీసీతారామాచార్యులుగా రీతనిని సామాన్యకవులఁ బోలెఁ దమ నిఘంటువులో నయిదవతరగతిలోఁ జేర్చిరి. వేరికి మాత్రము వేఱొన్నను వీరును వీరినింబోలు నితరులును నీతని గ్రంథములను సమగ్రముగ సవిమర్శముగఁ బరికించినట్లు కానరాదు. ఇందులకుఁ గారణములు లేకపోలేదు. ఈతఁడు వీరశైవుఁడు. ఈతని ప్రధాన గ్రంథములగు బసవపురాణ, పండితారాధ్యచరిత్రము లన్ననో, నేఁడాంధ్రదేశమునం దత్యంతదీనదశయందున్న వీరశైవమతమునకు సంబంధించినవి. అందునను నాంధ్రవాఙ్మయమున రానురాను నిరసనమునకు గుఱియైన ద్విపదయందుఁ గూర్పఁబడినవి. అవియైనను సరిగఁ బరిష్కరింపఁబడక యెప్పుడో యొకపరి గ్రంథ మచ్చుపడినఁ జాలు ననెడి యే వీరశైవమతాభిమానులచేతనో తప్పులతడికలుగ దరిద్రంపుఁ గాగితములపయి ముద్రింపఁబడినవి. ఇన్ని యొకచోఁ గూడినపు డీతఁడు నీతని కావ్యములు వెనుకఁ బడుటలో నబ్బురమేమి ?

ఈపరిస్థితుల నాలోచించి యీతని జీవితాదికమును గూర్చి నాకుఁ దెలిసిన విషయములను వివరించుచు, నీతని కవితాపాండిత్యవిశేషాదులను బ్రకటించుచు, నీతని బసవపురాణపండితారాధ్యచరిత్రాదులను జక్కగఁ బరిశోధించి పరిశుభ్రముగఁ బ్రకటించి వ్యాప్తికిం దెచ్చు నావశ్యకతను హెచ్చరించుచు, ఆంధ్రపత్రిక దుంమభిసంవత్సరాది సంచికలో నొక వ్యాసమును బ్రకటించి యుంటిని. దానిపయి నాంధ్రపత్రికాధిపతులు శ్రీదేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగా రభిమానించి, బసవపురాణమును బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచేఁ బరిష్కరింపించి వారి విపులపీఠికతోఁ దమ యాంధ్రగ్రంథమాలలోఁ బరిశుభ్రముగఁ బ్రకటించి యాంధ్రసారస్వతమునకు మహోపకార మొనర్చిరి. శ్రీవారి ప్రయత్నమువలననే పం

డితారాధ్యచరిత్రము గూడ నిట్టి త్వరలో వెలువడు నని తెలియుట కెంతయు సంతసించుచున్నాను.

దుందుభిసంచికయందలి నాపూర్వోక్తవ్యాసములో నేను వ్రాసిన విషయములు చాలవఱకు జనానుమోదమును గాంచినను సోమనాథుని కులగోత్రములఁ గూర్చిన సంగతులు మాత్ర మించుక సంచలనము గలిగించుట శోచనీయము. సోమనాథుఁడు బ్రాహ్మణుఁ డని కొందఱు, ఆరాధ్యబ్రాహ్మణుఁ డని కొందఱు, జంగముఁ డని మఱికొందఱు లోకమునఁ దలంచుచుండిరి. అతఁడు బ్రాహ్మణుఁడు గాని యారాధ్యబ్రాహ్మణుఁడు గాని కాక, సహజవీరశైవుండగు జంగముఁ డయి యుండు నని నాకుఁ దోఁచిన ప్రమాణములతో నేను నిరూపించి యుంటిని. అందుఁ గూర్చి విమర్శించుచు శ్రీనాగేశ్వరరావు పంతులుగారు తాము ప్రకటించిన వృషాధిపశతకపీఠికలో సోమనాథుఁడు మొదట నారాధ్యబ్రాహ్మణుఁడుగఁ బుట్టి తరువాత జ్ఞానము హెచ్చిన కొలఁది బసవేశ్వరుని వలె జంగములలోఁ గలిసి పోయియుండు నను నభిప్రాయమును దెల్పిరి. బసవపురాణపీఠికలో శ్రీప్రభాకరశాస్త్రిగారు నా నిర్ణయమును బూర్తిగ నిరసించుచు సోమనాథుఁ డాజన్మము బ్రాహ్మణుఁడుగనే యుండె నని నిశ్చయించిరి. అయినను నాయభిప్రాయము నామోదించిన పండితులు గూడ లేకపోలేదు. సికిందరాబాదు హైస్కూలుపండితులు బ్రహ్మశ్రీ పెదగాడ గంగాచార్యులుగారు సోమనాథుని బ్రాహ్మణకవిగఁ దలంచువారు, నేఁజూపిన ప్రమాణముల గ్రహించి యిఁకనయిన నట్టి యభిప్రాయమును వదలు కొందురు గాక యని సమదర్శిని పత్రికలో నొకవ్యాసమున లోకమును హెచ్చరించి యున్నారు. "పండితులు చరిత్రాంశముల నిర్ణయమునందు కులాభిమానమును విడిచి సత్యాభిమానమును బూని సోమనాథుని కులగోత్రముల నిర్ణయించుట సమంజసము." అని శ్రీనాగేశ్వరావుపంతులుగారు తమ విమర్శనము చివర నుపదేశవాక్యములఁ బలికి యున్నారు. పంతులుగారి హెచ్చరికనే లోకమునకు నేనుగూడ నొసఁగుచు సత్యనిర్ణయమునకై ప్రయత్నించు పండితులయుపయోగార్థము ప్రతివిమర్శనాంశములకయి నాకుఁ దోఁచిన సమాధానములను మనవి చేయుచున్నాను.

సోమనాథుఁడు జంగముఁ డనుటకు నా వ్యాసములో నే నుదాహరించిన ప్రధానప్రమాణములు:—

(1) వీరశైవమతస్థాపకు లగు పంచాచార్యులకును దచ్ఛిష్యపరంపర కుఁ జెందు జంగములకు లింగాయతులకు గోత్రకర్తలుగా సుప్రబోధాదిశివా గమములలోఁ జెప్పఁబడిన వృష, నంది, భృంగి, వీర, స్కంధులను నయిదు గురిలో మూఁడవవాఁడగు భృంగిని (భృంగిరిటి) దన గోత్రకర్తగా సోమనా థుఁడు తన యనుభవసారములో,

క. భృంగిరిటిగోత్రుఁడను గురు,లింగతనూజుండ శివకులీనుఁడ దుర్వ్యా
సంగవివర్జితచరితుఁడ, జంగమలింగప్రసాద సత్త్రాణుండన్.

అను పద్యమున వర్ణించి తాను శివకులీనుఁడ నని చెప్పకొనుట-మఱియు నీతని ప్రశిష్యకోటిలోఁ జేరిన పిడుపర్తి సోమనాథాదులు "భృంగిరిటిగోత్రసం భవ'' యని యీతనిని దమకృతులలో సంబోధించుట-

(2) జంగముఁడగు బెలిదేవి వేమనారాధ్యుని మనుమని శిష్యుఁడ నని సోమనాథుఁడు పండితారాధ్యచరిత్రమునఁ జెప్పికొనుటయు, జంగమకులజు లగు పిడుపర్తి సోమనాథాదు లీతనిని దమకులగురువుగా వర్ణించు కొనుటయు-

(3) బ్రాహ్మణుల నీతఁడు తనగ్రంథములలో, వ్రాఁటిమాల లని, పచ్చి మాల లని, కర్మచండాలు రని యతినీచముగ నిరసించుటయు, కొందఱు బ్రాహ్మణులుకూడ నీతనిని సమానార్థకముగ నష్టే పతితుఁ డని నిందించినట్లు పిడుపర్తి సోమన తన పద్యబసవపురాణావతారికలో నుగ్గడించుటయు-

శివుని పంచముఖములనుండి యుద్భవించిన పూర్వోదాహృతు లగు వృషనందీశ్వరాదు లయినగురే యనాదినుండియు వీరశైవమతస్థు లగు జంగ ములకు లింగాయతులకు గోత్రాధికారులుగా వ్యవహరింపఁబడుచున్నారు. ఈ గోత్రవ్యవహారము వీరిలోనే గాని మ ఱెవ్వరియందును గానరాదు. బ్రాహ్మ ణులు నారాధ్యబ్రాహ్మణులు నాఁటికి నేఁటికిఁగూడ గౌతమభారద్వాజాది ఋషీ శ్వరులనే తమగోత్రకర్తలఁగా వ్యవహరించుకొనుచున్నారు.

సోమనాథుని కులగోత్రనిర్ణయమున కత్యంతోపయోగకర మగు పయి పద్యవిషయమున (శ్రీ) ప్రభాకరశాస్త్రిగారు చెప్పినసమాధానము పూజ్యము. సోమనాథుఁడు స్వయముగాఁ జెప్పికొన్న కులగోత్రప్రశంసను గూర్చి నేను జూపిన యీముఖ్యప్రమాణమును జల్లఁగా జాఱ విడిచి శాస్త్రిగా రావిష యమున మౌనము భజించిరి. ముఖ్యవిషయములయెడ మౌనభావము పూని తక్కిన స్వల్పసంగతులఁ గూర్చి యీతడు వంటక సోఁకను నుటక నొకితౌ

యిచ్చినచ్చినట్లు వ్రాసి సమాధానసంతృప్తినందుటలో శాస్త్రిగారి నైపుణ్యమగణ్యము. మఱియు ననుభవసారమును బూర్తిగఁ జదివియుండియుఁ దత్పద్యములఁ గొన్నింటిఁ దమపీఠికలో నుదాహరించియు, అందుండి పయి పద్యమును జూపిన నావ్యాసమును లెస్సగఁ జదివియుండియు "సోమనాథుఁడు బ్రాహ్మణుఁ డయినను శివదీక్షితుఁడగుటచేఁ దన కులగోత్రాదికమును జెప్పుకొనఁడయ్యెను" అను వాక్యమును వ్రాయుటకుఁగూడ వెనుదీయ రయిరి. పయిగా నాతఁడు కులగోత్రాదికము చెప్పుకొనని కారణమున నాతని జంగముఁ డని సాధింపనెంచితి నని నన్నాక్షేపించుచు, "సోమనాథుఁడు బ్రాహ్మణుం డయినను దీక్షితులసంప్రదాయముచొప్పున జన్మగోత్ర సూత్రాదికములను జెప్పుకొనక పోయెను; ఇతరవిధముల నాతని బ్రాహ్మణత్వము ప్రవ్యక్త మగుచున్నను నీయసమర్థసాధనమును గొని యాతఁడు బ్రాహ్మణుఁడు కాఁ డనుట యుక్తమా?" అనెడి యసంబద్ధవాక్యములఁగూడ లిఖించిరి. సోమన తనకులగోత్రాదికమును జెప్పుకొనలేదనియు నందుచే నాతఁడు జంగముఁ డని తలంపవలయు ననియు నే నెచ్చటను జెప్పియుండలేదు. శాస్త్రిగారు మెల్లగ జాఱవిడిచి తమపీఠికలో వానిని గప్పిపుచ్చిరి, గాని, సోమనాథుఁడు తనకులగోత్రములఁ జెప్పికొనకేమి? జంగమకులజు లనాదినుండియుఁ జెప్పుకొనురీతినే తానుగూడ శివకులీనుఁడ నని భృంగిగోత్రుఁడ నని చెప్పుకొనియే యున్నాఁడు. ఇఁక నేమి కావలయును? అతని బ్రాహ్మణత్వమును బ్రవ్యక్తమొనర్చు నని శాస్త్రిగారు చెప్పెడి యా యితరవిధముల పటుత్వమునుగూడఁ బాఠకులు ముందు చిత్తగింపఁగలరు.

అనుభవసారమునుండి శాస్త్రిగా రుదాహరించిన,

క. భవిఁగో శివదీక్షితులగు, శివభక్తులపూర్వజాతిఁ జింతించుట రౌ
రవనరకభాజనం బా,శివుఁ బాషాణంబుఁ గాఁగఁ జింతించుక్రియన్.

మున్నగు పద్యములభావము వీరశైవదీక్షను గ్రహించిన యితరమతస్థుల విషయమున, యతీశ్వరులందుఁ బూర్వాశ్రమవిషయములఁబోలె, వారి పూర్వమతవిషయకకులగోత్రములఁ జింతించుట తగ దనుటయే గాని, వేఱొకటి కాదు. అట్లు క్రొత్తగ నీమతమునఁ జేరువారికి వారిదీక్షాగురువులు పంచాచార్యపీఠములలో నేనికిఁ జెందుదురో యాపీఠస్థుల గోత్రాదికమే సంక్రమించును. అనఁగా శిష్యులందఱు గురులింగతనూజులే కావున వారి కాగురుగోత్రమే వ్యవహరింపఁబడును. ఇది యీ మతాచారవ్యవహారము. సహజ

వీరశైవులకన్ననో వారికి వంశపారంపర్యముగ వచ్చు పూర్వోదాహృతగోత్ర వ్యవహారమే కలిగియుండును.

శాస్త్రిగారు వీరశైవము బసవేశ్వరోపజ్ఞమే గాని ప్రాచీనము గాదనియు లింగాయతులు జంగములు నను వారాతని తరువాత వెలసిన వారే కాని తత్పూర్వ మున్నవారు కారనియు నట్టి యపభ్రమలకు లోనయి యీ బసవపురాణపీఠికలో బహుప్రమాదములపాలయి వీరశైవమతవిషయముల నతివిపరీతముగ నిచ్చవచ్చినట్లు లిఖించి వ్రైచిరి. పూర్వవీరశైవమతగ్రంథములు వేనిని జూడకున్నను నెట్టివారయినను వీరశైవోత్కర్షప్రాచీనత్వములను బహు శ్రుతిస్మృత్యాదిప్రమాణములతో నమగ్రముగఁ బ్రతిపాదించు సోమనాథుని గ్రంథములను జదివిన మాత్రముననే వానిని సులభముగ గ్రహింపఁ గల్గుదురు. కాని శాస్త్రిగారి కట్లు గోచరింపక పోవుట శోచనీయము. వీరశైవమునకుఁ బ్రధానాంగము లింగధారణ మని యంగీకరించి, తెలుఁగునాఁటి యారాధ్యులు వీరశైవులు కారని, వారి పూర్వులు లింగధారులు కారని, కృష్ణదేవరాయలకుఁ బూర్వము బ్రాహ్మణులలో లింగధారణ ముండె ననుట కాధారములు మృగ్యమనియు సిద్ధాంతమును నెలకొల్పి, సోమనాథుని బ్రాహ్మణుఁడని చెప్పుచు వీరశైవ దీక్షితుఁ డని యుగ్గడించిరి. కృష్ణరాయలకుఁ బూర్వము బ్రాహ్మణులలో వీరశైవము (లింగధారణము) లేనప్పుడు, సోమనాథుఁడు బ్రాహ్మణుఁడయినచో వీరశైవదీక్షితుఁడగుట యెట్లు పొసంగునో? ఇట్టి స్వవచనవ్యాఘాతములు వీరి పీఠికలో ననేకములు. వీరు వ్రాసిన వీరశైవ మతవిషయక ప్రశంసను విమర్శించుట కిది యదను గాదు, దానిని శైవరహస్యబోధిని (సం 5 సం॥ 1, 2, 3) లోఁ దత్సంపాదకులు శ్రీముదిగొండ నాగలింగశాస్త్రిగారు కొంతవఱకు విమర్శించి వీరశైవమతప్రాచీనత్వమును నిరూపించిరి. వారు విడిచిన యితరవిషయములఁ గూర్చి కూడ విమర్శించుచు నేవ్రాయు మతవిషయక వ్యాసము లితరత్ర చిత్తగింపఁదగును.

బసవేశ్వరుఁడు వీరశైవమతస్థాపకుఁడు కాఁడు. అట్లని యేవీరశైవ గ్రంథములు నుగ్గడించి యుండలేదు. బసవపురాణమునఁ గూడ నందుల కెట్టి యాధారములును లేవు. జంగములు, లింగాయతులు బసవేశ్వరునకుఁ బూర్వమే యుండి యున్నారు. బసవేశ్వరుఁడు బ్రాహ్మణుల యింటఁ బుట్టి, జంగములకు శిష్యుఁడయి వీరశైవమతమునఁ గలిసి, కొన్ని నూత్నసంస్కారముల

వెలయించి మతమును సత్వరముగ విస్తరింపఁజేసిన మతోద్ధారకుఁడగు మహాభక్తుఁడే గాని తన్మతస్థాపకుఁడు మాత్రముకాఁడు. అసలు వీరశైవమతస్థాపకులు పైని జెప్పిన వృషనందీశ్వరాదులే. వారి సంతతివారే పంచాచార్యులు. వారు యుగభేదముల ననుసరించి నామభేదములతో వెలయుచున్నారు. కలియుగమున వారివ్యవహారనామములు (1) రేవణసిద్ధ (రేణుకాచార్య) (2) మరుళసిద్ధ (3) ఏకోరామ (4) పండితారాధ్య (పండితత్రయములోని వాఁడుకాఁడు) (5) విశ్వారాధ్య, అనునవి వీరి పీఠము లిప్పుడు క్రమముగ (1) కొలనుపాక (కొంతకాలమయి భాగ్యనగరమండలము నుండి ... బడినది) (2) ఉజ్జని (బళ్లారి మండలములో నున్నది) (3) కేదారము (4) శ్రీశైలము (5) కాశి యను క్షేత్రములందు నెలకొని యున్నవి. సమస్తవీరశైవప్రపంచమునకు నివియే యాచార్యపీఠములు, అను ముఖ్యవిషయములమాత్ర మిచ్చట స్థూలముగఁ దెలుపుచున్నాను.

ఇఁక నీగోత్రప్రశంసావిషయమున శ్రీనాగేశ్వరరావుపంతులు గారు చెప్పిన సమాధానములు చిత్తగింపుఁడు.

"వీరశైవమతస్థులగు జంగములకును లింగాయతులకును గోత్రాధికారులు-బ్రాహ్మణులకు నారాధ్యబ్రాహ్మణులకు వలె గౌతమభారద్వాజాదిమునీశ్వరులు కాక శివుని ముఖములనుండి యుద్భవించిన వృష నందీశ్వర భృంగి (భృంగిరిటి)వీరస్కందులు అయి యున్నారు." అని వ్యాఖ్యానము చేయుచు సోమనాథుఁడు జంగముఁడని తమ్మయ్యగారు సమర్థించిరి. ఆరాధనసమయము నందు "ఓం ఓం శ్రీ నందిభృంగిరిటి వీరక వీరభద్రచండేశ్వర ప్రమథముఖ్య మహాగణేభ్యః...నమోమహద్భ్యః" అని చెప్పుటవలనను భృంగిరిటి గోత్రము జంగమకులనిర్ణయమును జేయఁజాలదు...సోమనాథుఁ డారాధ్యబ్రాహ్మణ కులజుఁడుగఁ బుట్టినను కాలక్రమమునను అనుభవసారమును వ్రాసిన కాలమునకు బ్రాహ్మణకులగోత్రమోహమును వదలి శివభక్తుఁడై బసవకులమును బసవగోత్రమును స్వీకరించి ప్రమథగణపర మయిన భృంగిరిటిగోత్రమును స్వీకరించినటు లూహింపఁదగియున్నది." జంగములవలెనే యారాధ్య బ్రాహ్మణు లిష్టలింగమును ధరించి శివపూజ యొనర్తురు, కావునఁ దత్పూజాసమయమునఁ బ్రమథగణములను బేర్కొనవలసి యట్లొనర్చినంత మాత్రమునఁ దద్గోత్రజులు కానేరరు గదా. ఈప్రమథు లయినను నందఋ గోత్రకర్తలు కారు. చండేశ్వరా

దుల నరయుఁడు, జంగములును నారాధన సమయముల-

శ్లో. దుర్వాస కశ్యప విరించి మృకండుపుత్ర
దేవేంద్ర బాణ హరిశక్తి దధీచి రామ
శ్రీవామదేవకవికుంభజ గౌతమాదీన్
పుణ్యా నిమాన్ పరమపాశుపతాన్ స్మరామి॥

అని పరమశివభక్తులుగా గౌతమభారద్వాజాదిమునీశ్వరులనుగూడ స్మరింతురు. అంతమాత్రమున వారి నాఋషి గోత్రజులుగా సంభావింపఁదగునా? భారద్వాజగోత్రుఁడ నని చెప్పికొనిన శ్రీనాథుని నిట్టి యుక్తితో జంగముతెవ్వరైనఁ దమకులజుఁడని వాదించిన లోకమంగీకరించునా. శివపూజాదికధర్మములు జంగములకు నారాధ్యబ్రాహ్మణులకు నించుమించుగ సమానము లయినను గోత్రవ్యవహారవిషయమున నిరువురకు విలక్షణత్వ మనుస్యూతముగ వచ్చుచునే యున్నది. కావున బంతులుగారు చెప్పిన యుక్తి నిలువఁ దగినది కా దని వేఱ చెప్పనక్కఱ లేదు. ఇఁక వారి రెండవయుక్తి సోమనాథుఁడు మొదటఁ దన యితరగ్రంథములలో ఋషిగోత్రాదికమును జెప్పికొని యున్నచో గ్రాహ్యమగునే కాని యది లేనప్పుడు నిరుపయుక్తమే. సోమనాథుఁడు తన గోత్రాదికము నొక్క యనుభవసారముననే విస్పష్టముగఁ జెప్పి కొనినాఁడు గాని తక్కిన కృతులలో మఱెచ్చటను జెప్పి యుండలేదు. పండితారాధ్యచరిత్రములో "బసవనిపుత్త్రుండ బసవగోత్రుండ" ఇత్యాదికముగాఁ జెప్పికొన్న వాక్యము లన్నియు బసవేశ్వరునందలి భక్తిపారవశ్యముననే గాని యాతనితో నాయా సంబంధములుండి కాదనియు నాతఁ డసలు బసవనికి సమకాలీనుఁడే కాఁడనియు నా మొదటివ్యాసములోనే నిరూపించియుంటిని. మఱియు బసవ కులగోత్రము లనునవి యసలు వ్యవహారమున లేనే లేవు. వీరశైవు లెవరును బసవేశ్వరునిఁ దమగోత్రకర్తగాఁ జెప్పికొనుట లేదు. అదియు నుం గాక యనుభవసారము సోమనాథుని కడపటి కృతి యయినను శ్రీ పంతులుగారి వాదమునకుఁ గొంత యుపకరించు నేమో కాని యందులకుఁగూడ నవకాశములు గానవచ్చుట లేదు. ఈగ్రంథ మీతని ప్రాథమికకృతులలో నొకటి కాఁ దగు నని నాయాశయము. సోమనాథునకు బసవేశ్వరునందుఁ గల భక్తి మేర యిడరాని దని యాతని బసవపురాణ, పండితారాధ్యచరిత్ర, వృషాధిపశతక, చతుర్వేదసారాదులఁ జదివినవారి కెల్లఁ దెల్లము గాక మానదు. ప్రభాకర

శాస్త్రిగారి యీ క్రింది వాక్యములు గూడ నిందులకు నిదర్శనములు. "పాల్కురికి సోమన తన బసవపురాణకథాసారము నెల్లఁ దెలుఁగున వృషాధిపశతకమునను, సంస్కృతమున బసవోదాహరణాదులయందును వెలయించినాఁడు. అతఁడు రచియించిన గ్రంథములెల్ల బసవస్తుతి రూపములే. బసవేశ్వరు నుపాస్యదైవతముగాఁ గొల్చిన వారిలోఁ దొలుటివాఁ డితఁడే. బసవేశ్వరుని యెడ నాతనికిఁ గల భక్తి యింతింతనరానిది." కాని యీయనుభవసారమున సోమనాథుఁడు మల్లికార్జునపండితుని మూఁడు పద్యములలోఁ జెప్పెనియు బసవేశ్వరుని పేరయిన నెత్తలేదు. బసవశబ్దోచ్చారణమాత్రముననే [illegible] మహాభక్తుఁ డీగ్రంథమున నాతని పేరయిన నెత్తకుండుట యాశ్చర్యము గాక పోదు. ఇందులకుఁ గారణముల నారయుదము. సోమనాథుఁ డాంధ్రదేశమునఁ బాలకురికిలో జన్మించి నివసించిన యాంధ్రుఁడు. బసవేశ్వరుఁడు కర్ణాటకుఁడు. అతఁడు రచించిన కృతులు కన్నడముననేగాని యాంధ్రమున నొకటియుఁ గానరావు. సోమనాథుఁడు తనబాల్యమున నాంధ్రమందు వెలసిన యాంధ్రదేశీయుఁడగు పండితారాధ్యుని శివతత్త్వసారాదుల మాత్రమే చదివి యాతని యందు భక్తి కుదిరియుండును. అప్పటి కాతఁ డష్టభాషాప్రవీణుఁడయి యుండఁడు. సంస్కృతాంధ్రములను, గొంతవఱకు వేదపురాణాదులను, వీరశైవ మతగ్రంథములను మాత్రము చదివి యుండును. తరువాత వయస్సు వచ్చిన పిమ్మటఁ గర్ణాటాదిభాషల నభ్యసించి యష్టభాషాకవితాప్రావీణ్యము నంది యుండును. అప్పుడే బసవేశ్వరుని కర్ణాటకృతులను జదివి యాతని మహిమాదుల విని, యాతనియం దప్రమేయభక్తి ప్రతిపత్తులు గలిగి బసవ స్తోత్రాదిరచనములకుఁ గడఁగి యుండును. అనుభవసారరచనమునాఁటి కీతనికి బసవనిసంగతి యంతగాఁ దెలిసి యుండుటగాని యాతనిపయి భక్తి కుదురుట గాని జరగినట్లు తోఁచదు. కావుననే యాతని నాగ్రంథమునఁ బేర్కొనఁ డయ్యెను. అందుచే దీని నీతనిబాల్యరచనములలో గణింపఁదగునని నాయభిప్రాయము. సోమనాథస్తవము కూడ నిట్టిదే కాఁదగును. (ఈకృతి సోమనాథునిది కాదని ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిరి. అందుఁగూర్చి ప్రత్యేకవ్యాసమునఁ జర్చించెదను.) అట్లగుట నీయనుభవసారమందుఁ జెప్పికొనిన భృంగిగోత్రప్రశంస సోమనాథుఁడు సహజవీరశైవుఁడగు జంగమకులజుఁడని తలంచుట కెక్కువ యవకాశ మిచ్చుచున్నదని నేఁ దలంచుచున్నాను. మఱియు, అన్యవాదకోలాహలశతకకర్త యీతని సంబోధించుటలో "ఈహితానుషంగ !

యేకామ్రగురుచిత్త నలినభృంగ! సోమనాథలింగ !" అని తన శతకమునకు మకుటమును గూర్చికొనినాఁడు. సోమనాథుఁడు తనకృతులలోఁ బెక్కురు గురువుల నుదాహరించినాఁడు. కాని యందెక్కడను నీ యేకామ్రగురునామము గానరాదు. ఈతఁ డెవఁడయి యుండునని యాలోచింప నాకొక యూహ తోఁచినది. భృంగిగోత్రజులకెల్ల మూలాచార్యుఁడు పంచాచార్యులలో మూఁడవవాఁడగు ఏకోరామాచార్యుఁడు. ఈయాచార్యపీఠము హిమాలయ ప్రాంతమందలి కేదారములో నున్నది. ఈ యేకోరామశబ్దమునే గణమునకు సరిపడునట్లు ఏకామ్ర అని శతకకర్త స్వీకరించి యుపయోగించెనేమో ? ఇదికూడ సోమనాథుని జంగమకులజత్వమునకుఁ నుపకరింపనేర్చును.

ఇఁక సోమనాథుని జంగమశిష్యత్వాదికమును గూర్చి ప్రతివిమర్శకుల వాదములను జిత్తగింపుఁడు.

"వేమనారాధ్యుఁడు బ్రాహ్మణుఁ డనుటకుఁ బ్రబలనిదర్శనములు గలవు. బెలిదేవ వేమనారాధ్యుఁడు భూసురుఁడని పండితారాధ్యచరిత్రమున వర్ణింపఁ బడినది." (శ్రీ॥ నా॥ పంతులుగారు) "పలువురు కర్ణాటాంధ్రకవులు సోమనాథుని నారాధ్యనామముతోఁ జేర్చొనిరి. పాల్కురికి సోమనాథపురాణ మాతఁడు బ్రాహ్మణుఁడని వేమనారాధ్యుని వంశమువాఁడని వాకొన్నది. శైవులయిన బ్రాహ్మణులకే యారాధ్యనామ మానాఁడు చెల్లినది. బసవపురాణ పండితారాధ్యచరిత్రాదులు పరిశీలింపఁ దగును. బెలిదేవి వేమనారాధ్యుఁడు జంగముఁడని (జంగముకులమువాఁ డను నర్థమున) వ్రాయుట యవిచారమూలకము. పండితారాధ్యచరిత్రమున బెలిదేవి వేమనారాధ్యచరిత్రము గలదు. వేమనారాధ్యున కొక భూవరుఁడు నమస్కరించెను. ఆతఁ డాశీర్వదింపఁడయ్యెను. ఆభూవరుఁ డన్నవాక్యము లిట్లున్నవి. "దండిమై నృపకుమారుం డంతఁ బోక। కొంత భక్తియుఁ దోఁప సంతతాభ్యుదయ। కరులు మహాభక్తవరులు భూసురులు। హరవేషధరు లఘహరు లుచిత్పరులు। మీరని మ్రొక్కుడు మేలొందు మనక। యూరక యుండుట యుచితమే పెంపె" మీఁది ద్విపదలు వేమనారాధ్యుఁడు బ్రాహ్మణుఁడని చెప్పుచున్నవి గావా? "సోమనాథుని గురువునకుఁ దాతయైన వేమనారాధ్యుఁడు జంగముఁడు" అనియు, కావున జంగములకు శిష్యుఁడు" ...జంగముఁడు గాక మఱొక్కఁ డెట్లగును ?" అనియుఁ గావించు నాక్షేపము నిలువఁగలదా ? వేమనారాధ్యుఁడు జంగముఁడగుట నిజము

కాదు గదా ? ఆకారణముచేఁ దత్పౌత్రశిష్యుఁడు సోమనాథుఁడును జంగముఁడగుననుటయు దబ్బఱయే గదా ! ఇది గజము మిథ్య; పలాయనము మిథ్య యన్నట్లున్నది గాదా ! జంగముఁడైన పిడుపర్తి సోమన పాల్కురికి సోమనకుఁ గృతిగా బసవపురాణమును జెప్పుటయు, ఆతఁడు సోమనాథునిఁ దనకులగురుఁడనుటయుఁ బాల్కురికి సోమనాథుఁడు జంగముఁడగు ననుట కెట్లు సాధకములో నే నెఱుఁగఁజాలకున్నాఁడను." (శ్రీ॥ ప్ర॥ శాస్త్రిగారు)

ఆరాధ్యనామ మారాధ్యబ్రాహ్మణులకే గాని జంగముల కెన్నఁడు చెల్ల లేదని శ్రీనాగలింగశాస్త్రిగారుకూడ బసవపురాణపీఠికా విమర్శనములో వ్రాసినారు. కాని యిది కేవల మవిచారమూలకమని మనవి చేయుచున్నాను. జంగములకు లింగాయతులకు మతాచార్యులగు పంచాచార్యులందఱు నారాధ్యనామసంకలితులే గదా !! ఈయాచార్యపీఠముల కన్నిటికి నిప్పటికిఁ బారంపర్యముగ జంగమస్వాములే యధ్యక్షత్వమును వహించుచున్నారు. ఆరాధ్యబ్రాహ్మణు లెవ్వరు వీనికి గురుత్వము గాని శిష్యత్వము గాని నెరపుట లేదు. పంచాచార్యులసంప్రదాయమువారు జంగము లారాధ్యనామములతో నేఁటికిని గర్ణాటదేశమందున్నారు. కావున జంగముల కారాధ్యశబ్ద మనాదినుండియుఁ జెల్లె ననుట నిస్సంశయము. అందుచే సోమనాథునికిఁ గర్ణాటాంధ్రకవు లారాధ్యవిశేషణమును జేర్చుట కాని, బెలిదేవివేమన యారాధ్యనామసంకలితుఁ డగుట గాని వారి యారాధ్యబ్రాహ్మణకులజత్వమును స్థాపింపఁజాలవు. ఆరాధ్యనామసంకలితులు, పంచాచార్యవంశజులు నగుజంగముల వీరశైవమత ధర్మముల స్వీకరించిన బ్రాహ్మణులు. పూజ్యవాచకమగు నీశబ్దమును దామఁగూడ ధరించి నిష్క్లేశపూర్వకముగ నారాధ్యబ్రాహ్మణనామమున వ్యవహరింపఁ బడుచు వచ్చినట్లు తోఁచుచున్నది. లేనిచో మామూలు బ్రాహ్మణులకు లేని యీవిశేషణము వీరికిమాత్రము కలుగనేల ? జంగమకులజు లెవరికి నాకాలమున నారాధ్యనామము వ్యవహరింపఁబడ లేదనుట వట్టి కల్ల. పిడుపర్తిసోమన జంగముఁడని పయివాక్యములలో శాస్త్రిగారే యంగీకరించిరి కదా ? ఆతఁడు తనబావమఱఁదియగు పాల్కురికిసోమనకు (ఈతఁడు బహుశః మనసోమనాథుని వంశ్యుఁడే కాఁదగును) నారాధ్యవిశేషణమును జేర్చినాఁడు చూడుఁడు.

మ. స్మయమాయాదివికారదూరు, శివపూజామాతులున్, మాతులున్
బ్రియసంభాషణభూషణుల్, షడరిభీభిద్భావుకుల్, భావుకుల్

దయ నన్నక్షరదక్షుఁ జేసిన మహాధన్యాత్ములన్ భక్తితో
నయగారప్పయగారు పాల్కురికిఁ సోమారాధ్యులం గొల్చెదన్.

మఱియు నీసోమన తమ్మునికొడుకగు బసవప్పగూడఁ దాను రచించిన పద్యప్రభులింగలీలకుఁ గృతిపతియు భృంగిరిటిగోత్రుఁడు నగు చల్లపల్లి మల్లనార్యుని మల్లారాధ్యా యని సంబోధించినాఁడు. ఇట్టి వనేకములు గలవు. మఱియు, ఆరాధ్యుల, పరమారాధ్యుల యను గృహనామములే గల జంగములిప్పుడుగూడ నాంధ్రదేశమున నుండియున్నారు. కావున నీవిషయము ప్రతిపక్షులవాదమున కేమియు నుపకరింపనేరదు. ఇఁక వేమనారాధ్యుని భూసుర విశేషణము గూడ నిట్టిదే యని నా యభిప్రాయము. జంగములకు భూసుర, భూరుద్రేత్యాది విశేషణములు యౌగికముగ నుపయోగింపఁబడినతావు లనేకములు గలవు. "ద్విజకులదీపక" "వేదశాస్త్రవిశారద" "వేదఖని'' మొదలగు విశేషణములుగూడ వీరికిఁ బ్రయుక్తము లయిన శాసనము లున్నవి. "వీరశైవమతప్రాచీనత'' అను నా వ్యాసమున నావిషయములు చూడఁ దగును. కాలాముఖశైవులు గూడ నిట్టి విశేషణముల నుపయోగించికొని యుండిరి. నన్నెచోడుఁడు తనగురు వగు జంగమమల్లికార్జునున కుపయోగించిన విశేషణములు చిత్తగించునది. (శ్రీ) వంగూరి సుబ్బారావు గారు శతకకవులచరిత్రలో నీ జంగమ మల్లికార్జునుఁడు, మల్లికార్జునపండితారాధ్యుఁడే కాఁదగునని వ్రాసిరి. 'శివానుభవ' యను కర్ణాటకమాసపత్త్రికలో నావిద్వాంసులు (శ్రీ) చిదిరెమఠము వీరభద్రశర్మగారు "ఆంధ్ర వీరశైవులు" అనువ్యాసమున నన్నెచోడుఁడు నాతని గురువు వీరశైవు లని వ్రాసిరి. కాని, యివి సరి కావు. పండితారాధ్యచరిత్రమును బట్టి మల్లికార్జునపండితుఁడు గృహస్థుఁడుగాఁ గాన్పించును. నన్నెచోడుని గురు వగు మల్లికార్జునయోగి బ్రహ్మచర్యాశ్రమస్థుఁడు. కుమారసంభవమున కాలాముఖసంప్రదాయములగు మండలార్చన, శక్తిపూజాదుల ప్రశంస విపులముగాఁ గలదు. కావున నన్నెచోడుఁడు నాతని గురువు కాలాముఖులే యని నా యభిప్రాయము.) సురాధీశ్వరుండగు శివుని సంతతికిఁ జేరి భూమియం దవతరించి, శివకులీనుల మని చెప్పుకొను శివస్వరూపులగు జంగములకు భూసురశబ్దము యౌగికముగఁ బ్రయుక్త మగుటలో వైరుధ్య మేమియు లేదు. కావున నీ విశేషణ మొక్కటియే వేమనార్యుఁ డారాధ్యబ్రాహ్మణుఁడే యని నిరూపింపఁ జాలదు. సోమనాథుఁ డీతనిని "వీరమాహేశ్వరాచారవిస్తార।

సారగుణోదార చారువర్తనుఁడు। బసవపాదాంభోజ భాజనస్వాంతుఁ। డసమ శౌపాను గ్రహాసమగ్ర బలుఁడు। శరణపదాబ్జభాస్వరమకరంద। పరిశేషసర్వాంగు బసవాంతరంగు" అని బసవేశ్వరపాదసేవకుఁడగు వీరశైవునిగఁ గూడ వర్ణించినాఁడు. బసవేశ్వరు నింట జరగు జంగమారాధనయం దీతఁడు గూడ నుండె ననుట కాధారములు పండితారాధ్యచరిత్రమునఁ గలవు. ఇత్యాది కారణములచే నతనిని జంగమకులజుఁ డని నేఁ దలంచియుంటిని. ఆరాధ్య బ్రాహ్మణుల కానాఁడు బసవేశ్వరాదులతో సహపంక్త్యాదిసాహచర్య ముండె నా? వీ రానాఁడు బ్రాహ్మ్యంబుపైఁ బొత్తును బొత్తిగా విడనాడఁ జాలక పోయి నను భక్తిమీఁదివలపునే యెక్కువగఁ గలిగియుండి రనియు, నేఁటికాలపు ఆరాధ్యులవలె భవులగు బ్రాహ్మణులతో నెట్టి సంపర్కమును జెందక బసవేశ్వరాదివీరశైవులతోడనే యెక్కువ సాహచర్యమును గలిగియుండి రనియుఁ గొందఱు పెద్దలు చెప్పుచున్నారు. పండితారాధ్యచరిత్రమందలి సూరసానన్న మున్నగు వారిచరిత్రములు కూడ నిందులకు సాధకములు కాఁగల వని తలంతును. ఇంతకు వేమనారాధ్యుఁ డారాధ్యబ్రాహ్మణుఁ డయినను జంగమవంశజుఁ డయినను నది సోమనాథుని జంగమకులజత్వమునకు బాధకము కాఁ జాలదు. ఆతని మనుమఁడు సోమనాథునకు విద్యాగురువే కాని దీక్షాగురుఁడు కాఁ డని నా తలంపు. ప్రభాకరశాస్త్రిగారు "సోమనాథుని గురువులు" అను శీర్షిక క్రింద వ్రాసిన యీ దిగువ వాక్యములలోఁ గొన్ని ప్రమాదములకు లోనయిరి.

"ఈతనికి శివదీక్ష నొసఁగిన గురుఁడు గురులింగార్యుఁడు. గురులింగ వరకరోదరజనితుండ, గురులింగతనూజుండ, పేరెన్నఁబడిన శ్రీబెలిదేవి వేమనారాధ్యుఁడను పరమారాధదేవు మనుమని శిష్యుండ, మద్గురులింగఘనకరుణాహస్త గర్భసంభవుఁడ—పయి వాక్యముల వలన బెలిదేవి వేమనారాధ్యుల మనుమఁడయిన గురులింగార్యుఁ డీతని దీక్షాగురుఁ డని తెలియ నగును. సంస్కృతపండితారాధ్యచరిత్రమునఁ గూడ నిట్లే కలదు.

"బెల్లావి వేమనారాధ్య ప్రశిష్యస్య కృపానిధేః
గురులింగార్యస్య దయాహస్తగర్భసముద్భవః."

మనుమఁ డనఁగా నాచార్యవంశమున మనుమఁడని సంస్కృతగ్రంథకర్త గ్రహించెను. కావుననే "ప్రశిష్యస్య" అనెను.

సోమనాథుని ద్విపదపంక్తులను సంస్కృతీకరించుటలో సంస్కృతపండితారాధ్యచరిత్రకర్త గురురాజకవి కూడ ప్రమాదమును జెందినాఁడు. గురులింగమనునది దీక్షాగురువునకు వీరశైవులుసర్వసాధారణముగా నుపయోగించు విశేషణమే గాని యొకమనుజుని పేరు కాదు. గురు, లింగ, జంగమము లొక్కే రూపని వారి కభేద మని వీరశైవమతసిద్ధాంతము. "(శ్రీ)గురులింగజంగమము చెప్పఁ ద్రిమూర్తినిగూఢమైచనుక్, (శ్రీ)గురులింగజంగమవిశేషము లేకముగాఁ దలంచి .." ఇత్యాద్యనుభవసారవాక్యములఁ జిత్తగించునది. సోమనాథుఁడు పలువురువీరశైవులను దన గ్రంథములలో గురులింగకరోదరజనితులుగ వర్ణించినాఁడు. అందుచే నా గురువులందఱపేరు గురులింగమే యని తలంపఁదగునా? 'గురులింగకరోదరజనితుండ' 'గురులింగతనూజుండ' అను శాస్త్రిగారు చూపిన మొదటి రెండు విశేషణములు సోమనాథుఁడు వరుసగ బసవపురాణ అనుభవసారములలోఁ జెప్పికొనినవి. "పేరెన్నఁబడిన ..." ఇత్యాది వాక్యములు పండితారాధ్యచరిత్రములోనివి. అంతియే గాని, యన్నియుఁ గలిపి వరుసగ నొకచోటనే చెప్పినవి కావు. 'వేమనారాధ్యమనుమని శిష్యుండ' నని చెప్పిన తరువాత సోమనాథుఁడు వ్రాసిన "మద్గురులింగ ఘనకరుణాహస్తగర్భసంభవుఁడ" అను వాక్యముచేతనే వేమనారాధ్యుని మనుమని పేరు గురులింగార్యుఁడు కాఁడని స్పష్టము కాఁగలదు. గురురాజకవిమూలమును సరిగాఁ జూడక మనుమనిఁ బ్రశిష్యుఁ డని చెప్పి వేమనారాధ్యుని యా మనుమనిపేరు గురులింగార్యుఁ డను నర్థ మిచ్చునట్లు 'ప్రశిష్యస్య' 'గురులింగార్యస్య' అని రెండు నొక్కే విభక్తిలోఁ గూర్చినాఁడు. సోమనాథుని మూలవాక్యముల నుదాహరించుచుఁ గూడ శాస్త్రిగారు గురురాజకవిపొరపాటును దాముగూడఁ గయికొని యా పాటనే పాడుట శోచనీయము. మన కీప్రమాదములతోఁ బని లేదు. సోమనాథుని స్వంతవాక్యములఁ బట్టి వేమనార్యుని మనుమనిపేరు గురులింగము కా దనియు నాతఁ డాతనికి దీక్షాగురువు కాఁ డనియు విశదమగుచున్నది. ఆతఁడు సోమనాథునకు విద్యాగురు వయినంతమాత్రమున నిరువురు నొక్కేకులము వా రని తలంప నక్కఱలేదు. ఆనాఁడు జంగములు నారాధ్యబ్రాహ్మణులు నిప్పటికంటె నెక్కువగఁ బరస్పరాభిమానగౌరవములతోఁ బ్రవర్తించెడివారు గావున వా రొకరివద్ద నొకరు విద్యలను గ్రహించుటలో నెట్టి యాశ్చర్యమును లేదు.

జంగముఁ డైన పిడుపర్తి సోమన పాల్కురికి సోమనాథునిఁ దమ కులగురువుగాఁ జెప్పికొనుట సోమనాథుఁడు జంగముఁ డనుట కెట్లు సాధకమో యెఱుఁగకున్నాఁడ నని శాస్త్రిగా రాశ్చర్యమును సూచించుట వింతగా నున్నది. జంగమకులజుల కారాధ్యబ్రాహ్మణులు గాని బ్రాహ్మణులు గాని కులగురువు లనఁగా మతగురువులుగా నుండుట శాస్త్రిగా రాంధ్ర దేశమునఁ గాని కర్ణాటదేశమునఁ గాని మఱెచ్చట నయినఁ గాని చూచి యుండిరా? చూపఁ గలరా? ఈ విషయమున బసవపురాణపీఠికావిమర్శకులు నారాధ్యబ్రాహ్మణ కులావతంసులు నగు శ్రీ నాగలింగశాస్త్రిగారి వాక్యము చిత్తగింపుఁడు. "జంగము లెందును నారాధ్యులశిష్యుల మని వ్రాసికొను సంప్రదాయము లేదు." (శైవరహస్యబోధిని సం 5 సం 3 పుట 8) బ్రాహ్మణులు పలువురు జంగములవద్ద దీక్షలం గొని వీరశైవమతములోఁ జేరినట్లు చూపుట కనేకాధారము లున్నవి. బసవేశ్వరుని కాలమున బ్రాహ్మణాద్యష్టాదశవర్ణములు నీ మతమునఁ జేరిన సంగతి శ్రీప్రభాకరశాస్త్రిగారే తమ పీఠికలో వ్రాసి యున్నారు కదా! కాని యారాధ్యబ్రాహ్మణులవద్ద జంగమకులజు లెవరును వీరశైవదీక్ష గొను నాచార మెప్పుడును లేదు. ఇట్టి ప్రత్యక్షప్రమాణములవిషయముననే యాశ్చర్యోక్తులను బలుకు శాస్త్రిగారికి నప్రత్యక్షవిషయములఁ గూర్చి యిచ్చవచ్చినట్టు లసంగతములు వ్రాయుటలో నాశ్చర్య మేమి?

"బసవేశ్వరుని కాలమున వీరశైవమత మాంధ్రదేశమున వేరూనలేదు. బసవేశ్వరునికిఁ దరువాతఁ జాలఁగాలము గడచినతర్వాతనే యల్పాల్పముగా నది యాంధ్రదేశము నంటుకొన్నది. నేఁటి జంగమజాతివారు పాల్కురికి సోమనాథునికాలమునఁ గూడ నాంధ్రదేశమునఁ గల రన్న నమ్మకముకల్గిని గాఁబోలును దమ్మయ్యగారు పయివాదమును దెచ్చిపెట్టిరి. ఆకాలమున జంగమపదము చరలింగ మనునర్థమునఁ గలదే కాని నేఁటి జంగమజాతికి వాచకముగా లేదు. ఈజాతి యప్పటి కింక నేర్పడలేదు." అని మొదటికే మోసము తెచ్చుచు శాస్త్రిగారు వ్రాసిన వాక్యము లాపాతరమణీయములు. జంగమశబ్దము ప్రాచీనవాఙ్మయమునఁ జరలింగ మను నర్థమునఁ బ్రయుక్త మయినట్లు నేనుగూడ నంగీకరింతును. అంతమాత్రమున నేఁటి జంగమకులము బసవనికిఁ బూర్వము లేదనుట నేనే కాదు ప్రమాణబుద్ధిగలవా రెవరు నంగీకరింపఁ జాలరు. నేఁ జెప్పిన జంగములన్న శాస్త్రిగా రెవరిని గ్రహించుచున్నారో

తెలియదు. ఆంధ్రదేశమున నిప్పుడు జంగముల మని చెప్పికొను శాఖ లనేకము లున్నవి. వానిలో స్థలపతిజంగము లనుశాఖ తక్కినవానికంటె నించుక విస్తరించి యున్నది. ఈ శాఖలు వేఱు. వీరందఱు శిష్యకోటిలోఁ జేరువారు. నే నుదాహరించిన జంగములు గురుపదస్థులు. అందులకనే నేను నా పూర్వవ్యాసములో వీరిని మఠస్థు లని, మాహేశ్వరు లని వ్యవహరించుచున్నా రని వ్రాసియుంటిని. లింగాయతులు, స్థలపతిజంగములు మున్నగువారి కెల్ల వారే మతగురువులు. వారు పంచాచార్యులసంప్రదాయమునకుఁ జెందిన సహజవీరశైవులు. పంచాచార్యపీఠము లిప్పటికి నీ శాఖవారి యాధీనముననే యున్నట్లు లిదివఱకే చెప్పియుంటిని. పాలకురికి సోమనాథుఁ డీసహజవీరశైవ శాఖకుఁ జెందినవాఁడ నేనేను వ్రాయునది. ఏనామమున వ్యవహరింపఁబడుచు వచ్చినను నిట్టిశాఖ మొదటినుండియు వెలసియే యున్నది. బసవేశ్వరునకుఁ బూర్వము జంగములు లింగాయతులు నుండి రనుటకు శాసనాదిప్రమాణము లను "వీరశైవమతప్రాచీనత" యను వ్యాసమున నుదాహరింతును. ఏయితర ప్రమాణము లక్కఱలేకయే బసవపురాణమును సవిమర్శముగఁ జదువు బుద్ధిమంతులుగూడ నీవిషయము నంగీకరింపక తీఱదు. అందులకుఁ గారణములు చిత్తగింపుఁడు. బసవేశ్వరుఁడుపనయనము నొల్లక తల్లిదండ్రులను దాను బుట్టిన కులమును విడిచినవాఁ డనుట నిర్వివాదము గదా! కావున నాతఁ డారాధ్యబ్రాహ్మణసంప్రదాయమునకుఁ జెందినవాఁడు కాఁ డనుట విస్పష్టము. (ఇట్టి బ్రాహ్మణశాఖ యా కాలమున లేనేలే దని శాస్త్రిగారి యూహ.) ఇట్టి పరిస్థితులలో సహజవీరశైవశాఖ యొకటి యదివఱకె దేశమున లేకున్నచో నితఁడు తలిదండ్రులను విడిచినవెంటనే మఱెందులోఁ జేరి యుండును? నూతనమతమును దన్మతస్థులను నువ్వెత్తుగ నొక్కనాఁడు సృజించుట యెట్టి యవతారపురుషున కయినను నలవి యగునా? మఱియు నీతఁడు భవి (లింగధారి కానివాఁడు) సంపర్కము నొల్లనివాఁడు గదా! అట్టిచో సహజవీరశైవు లగు జంగములు లింగాయతులు నదివఱకున్ననే వారితోఁ జేరి వారిమతమును స్వీకరించి యటుతరువాతఁ గ్రమముగ నూత్నసంస్కరణములతో దానిని విస్తరించుట కవకాశ మేర్పడును గాని లేనిచో నట్లు పొసఁగనేరదు. ఉపనయనము చేసికొనన నని తండ్రితో వాదించి యాతనితో విడిపోయినప్పు

# పెద్దన — నీతిపరుఁడు.

(న్యాయపతి కృష్ణారావుగారు, బి.ఏ., బి.ఎల్., అడ్వొకేటు, అమలాపురము.)

ప్రాచీనులను నిర్లక్ష్యముసేయుట యభినవాంధ్రలోకమునందనేకులకు సామాన్యముకద. ప్రాఁచెనుఁగు కబ్బములన్న నసూయతోఁ జూచువ్యక్తులు వాని ఘనత నామోదించుటకు వెనుదీయుచు వానికర్తలను పలుతెఱఁగుల గౌరవహీనులని కూడ నిరూపించుటకు సన్నద్ధులయియున్నారు. మఱియు సువచన రచనాఘనత కన్గొన దేశభాషనైలిబిగితోడ గ్రామ్యాదివాదములలోఁ బడుట గ్రామ్యకవులందు నభ్యాసముగా నున్నది. అట్టిచోఁ బూర్వపుకవులు మర్యాద హీనులయి కన్పట్టుట యచ్చెరువుగాదు. పెద్దనామాత్యుఁ డవినీతిపరుఁ డని యూహించుచున్నారు. శృంగారసమస్యలను విరాళముగఁ బూరించెను. ఆత్మానుభవము కాకున్నచో నట్టివి దుర్లభము. మఱియు వేశ్యను కథా నాయికగ వర్ణించెను. కాన నతనికి కావ్యలక్షణలక్ష్యము కొఱఁతవడెను. వరూథిని లేని ప్రకరణములు పసచెడినవి” అని యవినీతిపరుఁ డనెడివాదము. పూర్వపు కవుల నీతిబోధ నెఱుఁగక నవినీతిపరులని వారిని నిందపాలు సేసిరి కొందఱాధునికులు. శృంగార రసవిజృంభణమే యీవాక్యమునకుఁ గారణమై యుండనోపు. కావ్యమునందుఁ గన్పఱిచిన మార్పుల వలన దోషారోపణము సేయుట విమర్శకనీతికి సునీతిరమై యుండవచ్చును. కృతికర్తనె నిందించినచో విమర్శకనీతి కొఱవడును గాదె. మాసముల పూర్వము, ఆంధ్రసాహిత్యపరిష త్పత్రికయందు పెద్దనకావించిన యనుచితపు మార్పు లని యొకవ్యాసమును గంటిని. తదుపరి కావ్యపునఃపరిశీలనకుఁ కడంగితిని. “అల్లసానివానియల్లిక బిగి”చే నాతని నీతిబోధ యాడంబరరహితమై గోప్యముగఁ గన్పట్టెను. అతఁడు మహానీతిబోధకుఁ డని యెంచి కావ్యశరీరమం దున్న నీతిచ్ఛాయలను విశదీక రింప నెంచితిని.

ప్రవరుని పాత్రమందు పెద్దన నీతిపరుఁడుగాక మఱియొకం డని యెట్లు తెలియనగును ? నవీన యువకులకును, నైష్ఠికబ్రహ్మచారులకు నది యొక నీతిబోధక మగు నుపన్యాస మని యెంచెదను. విషయము తరగతులందు ముఖ్యముగ పఠింపవలసినదని యభిప్రాయము. ప్రవరునిసౌశీల్యమునకు నెచ్చట నైన కళంకముండునే. అతని గుణవర్ణనమందే యాతనినీతి వెల్లడియగుచున్నది

"ఉ. ఆపురిఁ బాయకుండు మకరాంకశశాంకమనోజ్ఞమూర్తి భా
షాపరశేషభోగి వివిధాధ్వరనిర్మలధర్మకర్మ దీ
క్షాపరతంత్రుఁ డంబురుహగర్భకులాభరణం బనారతా
ధ్యాపనతత్పరుండు ప్రవరాఖ్యుఁ డలేఖ్యతనూవిలాసుఁడై".

ఉత్తమ పురుషుల లక్షణములేవియో పెద్దన యిందుకనఁబఱిచినాఁడు. పెద్దనామాత్యుని భావము మేటిగుణముల ప్రోదిపై చూచెనుకాని హీనస్వరముల వినిపించుకొనలేదు. తదుపరి, సద్బ్రాహ్మణులు చేయవలసిన విధులన్నియు ప్రవరునిచేఁ జేయించి యుత్తమబ్రాహ్మణప్రకటనయందు నిగ్గుతీసెను.

"మ. అకలంకౌషధసత్త్వముం దెలియ మాయాద్వారకావంతికా
శి కురుక్షేత్ర గయాప్రయాగములు నే సేవింప కుద్దండ గం
డక వేదండ వరాహ నాహరిపుఖడ్గవ్యాఘ్రము మిస్సుంచుఁగొం
డకు రాఁ జెల్లునె బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్."

ఇప్పద్య మమాయకపు బ్రాహ్మణుని మనోనిరూపణము. ఇంచుక సంఘమును సంస్కరింపవలెనను నభిలాష కనుపడెడిని. ఊరక విద్యయే లోకజ్ఞానము చేకూర్ప దని ధ్వని. శ్రోత్రియులు బుద్ధిజాడ్యజనితోన్మాదు లని ప్రశంసించుటకు పెద్దన పన్నిన యుపాయము మనోహరము. నిర్మలబుద్ధిమంతులు ముక్కుకు సూటిగఁ బోదురు గాని వక్రత నెఱుఁగరు. చూడఁదగిన ప్రదేశములన్నిటిలో హిమాలయము మేటి. తూర్పునుండి పడమరవఱకు నావరించిన నగము; మహాత్తుకలిగిన పర్వతము; దేవతలకు నిలయము; ఋషులకు స్థానము; ఓషధులకు నాటపట్టు; పత్త్రసంపదలకు నిధి; మృగజాతులనివాసము; అట్టిచోనింక నమ్మహాద్రిని చూడకున్న జీవితమేటి కని యాతఁడెంచి యచటికిఁ బయనమయ్యెను. పాదలేపము కరఁగిపోయి గృహముచేర నుపాయము కానక చింతించుచుఁ బల్కినమాటలు బ్రాహ్మణుని యమాయకపు శీలమును, పెద్దనయొక్క సానుభూతియు విశదీకరించుచున్నవి. "బుద్ధిజాడ్యజనితోన్మాదులు" పెద్దనయొక్క వేదాంతవిస్మయమును గనుపఱుచుచున్నది.

"కుందనమువంటి మేను మధ్యందినాతపోష్మహతిగందెవడదాఁకెనొప్పులొలుకు
వదనమస్మద్గృహంబు పావనముచేసి, బడలికలువాసి చనుమన్న బ్రాహ్మణుండు."

ప్రవరుని మేనియందము మెచ్చుకొనుచుఁ దనయింట సేదఁదేఱిపొమ్మని వధూథిని నిజాభిలాషను చూపఁగా బ్రాహ్మణుఁ డనంగాంకితుఁడు కాక,

"ఉ. అండజయాన నీవొసఁగునట్టి సపర్యలు నాకువచ్చె నిం
　　దుండఁగరాదు పోవలయు నూరికి నింటికి నిప్పుడేను రా
　　కుండ నొకండు వచ్చినఁ బెఱింగుము నె భక్తియచాలు సత్క్రియా
　　కాండము దీర్పవేగఁజనఁగావలయుం గరుణింపునాపయి౯."

అని బదులుచెప్పెను. పరాంగనల యొక్క నెటులు వర్తింపవలెనో పెద్దనయెఱుంగును. "రాకుండ నొకండువచ్చి మఱియొండునె భక్తియెచాలు" సాధారణముగ గృహస్థులయాతిథ్యసమయములందు వినఁబడు వాక్యము. మధురములగు రిక్తవాక్యములుకాక భక్తియె ముఖ్యము. లోనిగుణము సరిగనున్నపైని వినఁబడు మాట లొక్కచో నపశబ్దములైన నేమి. "కరుణింపు నాపయి౯" అండజయానకు టంకముపొడిచినలె నున్నది. ఆధునికులు "క్షమింపుము" అనెదరు. ఇంతకన్నను మృదునై, యనోన్యమై, సాధునై, యొప్పునట్టిదై "కరుణింపుము" వెలసెను.

"క. అనుటయుఁబ్రవరుండిట్లను, వనజేక్షణ యిట్లువలుక వరుసయె వ్రతులై
　　దినములు గడపెడు విప్రులఁ, జనునే కామింప నది విచారమువలదే."

వ్రతులై దినములుగడపెడు విప్రులఁ గామించిన నసభ్యమని పెద్దనభావము. అటులున్నచో రెండుపక్షములకుఁదృప్తి చేకూరక మన్మథపీడితులగుదురని యాతని యభిప్రాయము. ఆత్మానుభవమో, లేక కాలపరిస్థితుల నిరూపణమో తెలియకున్నది. ఔచిత్యము నెఱిఁగి పురుషులఁ గామింపవలెఁ గాని యందఱ నొక్కరీతినె యెంచరాదు.

స్త్రీయాధర్మములు పాపంబులు, రతిపుణ్యమని వక్కాణించు వరూథినికిచ్చిన ప్రత్యుత్తరము వేనోళ్లఁబొగడఁదగియున్నది. "మోక్షలక్ష్మిపథ్యాగమసూత్రపంక్తి కివె పోమీసన్ముదాయాత్మముల్" అను విమర్శన పెద్దనదియె. "ఇట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపై తేనియ"లని ప్రవరునిచే, మరల వరూథిని నోరెత్తకుండ, పెద్దన పలికించెను. తుదకు వరూథిని యాతనిం గౌఁగిలింపఁబోవ నాపె నాతఁడు పొమ్మంచుఁ ద్రోసివైచెను. ధీరచిత్తములను సతులమాయలు కలంచునాయని విమర్శనపూర్వకమగు వీక్షణ.

"చ. తరుణి ననన్యకాంత నతిదారుణ పుష్పశిలీముఖవ్యథా
　　భర వివశాంగి నంగభవుబారికి నగ్గము సేసి క్రూరుఁడై

యరిగె మహీసురాధముఁ డహంకృతితో నని రోషభీషణ
స్ఫురణ వహించెనో యన నభోమణి దాల్చెఁ గషాయదీధితిన్.”

ఈపద్యముకతన మనుచరిత్ర నీతిబోధకము కా దనియు, వేశ్యనుగూడుట అంకుకా దని పెద్దన యభిప్రాయ మనియుఁ గొందఱి మతము. ఒక్కొక పద్యమువలన వ్యక్తులయభిప్రాయములనునిర్ణయించుట సరికాదు. కావ్యమంతయు పరిశీలించినచోఁ గర్త యభిప్రాయము లెటులున్నవో గ్రహింపనగును. అప్పుడె కవినైజమును విశదమగును. ఇట్టి సందర్భములవలన నీపద్యమును రచింపవలసి వచ్చెను. వరూధిని ప్రవరుని వియోగమువలనఁ బరిభవమొంది వివిధదశల వేగుచున్న సమయంబున సూర్యుఁడు గ్రుంకెను. యౌవనవతి యొకపురుషుని ప్రేమించి యాతనిని బడయలేక చింతాకులచిత్తయై మన్మథావస్థలోఁ దపించుట యెవ్వనికైన జాలి కలిగింపక మానదు. యువతిప్రేమను దిరస్కరించిన పురుషునిపై సహజ మగుకోపము పుట్టును. అస్తమించుచున్న సూర్యునకుఁ జూపఱిపాత్ర నిచ్చి భావము ప్రకటించిన మాత్రముననె కవి నిజోద్దేశమది యని యనఁజెల్లునె. “అంగభవు బారికినగ్గముసేసి”యనువాక్యము లతాంగిపైఁ గల విచారభావము ప్రకటించును. “ప్రాసఁగ్రై యరిగె మహీసురాధముఁ డహంకృతితో” ననునది ప్రవరునిపై కోపమును వెల్లడించినది. ఒకవేళ ‘అవినీతి’ వాదము నంగీకరించినను పెద్దన మహీసురులయెడ నెక్కుడు నీతి లక్షింపుచుండెను. మహీసురులచే నధమకార్యములను పెద్దన చేయింప నొల్లఁడు. బుద్ధిజాడ్యజనితోన్మాదులకు నిట్టి కార్యము లధమములై, క్రౌర్యమును గన్పఱుచుచు, వారిబుద్ధి యహంకారమునకు వెగటుగఁ దోఁచినవి. తదితర వర్ణములయెడ పెద్దన యిన్నివిశేషణము లుపయోగింపక పోవచ్చును; బ్రాహ్మణుఁ డగుటవలన నత్యంత మైన నీతి ప్రబోధించెను. ఇంక వేశ్యనుగూడుట అంకుకా దన్న వార్త యించుకేనియుఁ గనుపడునె. ఎంతటి విశాలదృక్పథముతోఁ జూచినను తరుణిని, ననన్యకాంతను, అతిదారుణపుష్పశిలీముఖవ్యథాభర వివశాంగిని, అంగభవు బారికి నగ్గము సేసిపోవుట క్రూరత్వమును నైచ్యమును అహంకారమును వెలిబుచ్చునెడ నక్షము తప్ప పెద్దన వేఱొకవిధమున యోజించియుండునె! పెద్దన వేశ్యవాటయె చేకొనలేదు. తరుణి, అనన్యకాంత, యీ రెండు నాతని మనసునం జొచ్చెను. అట్టిస్థితిలో నష్టపడుచును విడుచుట కఠినమని యొకవేళ నెంచెనేమొకాని వేశ్యనుగూడుట అంకుకా దని యెందైన

వ్యంగ్యముకలదె. లేనిపోని వింత యర్థములు తెచ్చి కవి సౌశీల్యమునకు భంగముకలిగించుట విమర్శకలక్షణమునకుఁ దగదు. పెద్దన యొకానొకస్థితిని గడుసేర్పుతో వర్ణించెను గాని తనయుద్దేశమే యందిముడ్చలేదు. దీనికిఁ దార్కాణము కావ్యమున నుండు తదితరపద్యములే.

"ఉ. ఎవ్వఁడు మీఁదెఱుంగక యథేచ్ఛసుఖైకరతిం జరింపఁగా
నవ్వల వంశహాని వ్రతహాని యశోధనహాని పుట్టుఁ దా
నవ్విధఁ గష్టమనుష్యపశు వయ్యవివేకి చెడుఁ జగంబునన్
నవ్వఁగఁబాలు రౌరవమునన్ బడఁ బాలును నిందపాలునై."

లోకజీవన మంతయు తిమిరంపువయసుగుబ్బ లనియే యెంచు వ్యక్తులెందఱనుగానము? ధనవంతులంతైనను, సాధారణులంతైనను బెక్కురు రతిలోలురై యశోధనములఁ బోఁగొట్టుకొనుట దినమును వినుచుందుము. పెద్దనకాలమునఁ గూడ నట్టిపరిస్థితు లుండుకతన నిట్టినీతిబోధనలం దాతఁడు వ్రాయవలసి వచ్చె. ఇహపరలోకములం దట్టివానికి నెలవులేదని నొక్కి వక్కాణించెను. మీఁదెఱుంగక సుఖైకరతిని చరించు ద్విపాదపశువు, జగంబున నవ్వఁగబాలు, నిందపాలు నగునని తీవ్రఖండనమునం బలికినకవి నీతిపరుఁ డగునో కాదో గ్రాహ్యము.

"చెలికత్తెలు వనటఁ గుందుచుండఁగా దాను భోగముల ననుభవింపఁజాలనని పెండ్లికొడుకుతోఁ బలుక లేదనియు, తనతండ్రితో ముచ్చటించెననియు నట్లు తండ్రితో సంభాషించుటకు సిగ్గుపడ నవసరము లేదనియు గర్భాధానపు గదిలో నాథుఁడు పాన్పుఁ జేర్చి కౌఁగిలించికొని ముద్దిడి మహోద్రేకము నందికవయఁ దమకించు సమయమున నదియే తన యభీష్టము ప్రియునిచేఁ దీర్పించుకొనుటకుఁ దగు తఱియని భావించి సంభోగము నరికట్టెననుట నవోఢయు, కులసతియు నగు మనోరమకుఁదగదనియు, నయ్యవి వేశ్యాకృత్యములనియు" కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికయందు వ్రాసిరి. పెద్దన కావించిన యనుచితపుమార్పు లను వ్యాసమున నీమార్పు నౌచిత్యమును పాటింప దనియు బ్రహ్మయ్యశాస్త్రిగారు ఖండించిరి. అభిప్రాయభేద మొక్కటియె కాక యీ విమర్శన సరియగు లక్షణములచేఁ గావింపఁబడలేదనియు నెంచి మనోరమవృత్తము నింక విశదీకరింతును.

"కవియుం దమకించి త్రస్తరులఁ గుస్తరింప నింపు గలిగియు మును మున్న మనంబునం బొడమి యుండు నడలప్పుడు తలంపునం బాఱిన...... ........నవోఢగావున మాటలం దేటపడం జెప్ప శంకించి స్త్రీస్వభావంబునం దొరఁగు కన్నీరు కంకణక్రేంకృతులు మీఱ గోరఁ బాఱ మీటుచు నూఱక యున్న" అనిమూలము. మనోరమ కిదివఱకే తన చెలికత్తెలు క్షయ బాధలవలనఁగృశించుచుండిరని విచారముగనుండెను. ఇంతలోఁ దన తండ్రియే రాక్షసుఁడై తన్ను మ్రింగఁ బోవ నాపె స్వరోచి శరణుఁజొచ్చె. తదనంతరము మనోరమా స్వరోచులకు వివాహమయ్యెను. ఈవివాహమునకుఁ బూర్వమే తన చెలికత్తెలఁ గూర్చి తండ్రికినైన భర్తకునైనఁ జెప్పుట కవకాశము చిక్క లేదు. స్థితిగతు లేమియు నామెకు సాయము చేయలేదు. స్వరోచిచేఁ బరాజితుఁడై నిజవేషంబును బడసిన యనంతరంబ తానారాక్షసవేషధారణకారణమంతయు నిందీవరాక్షుఁడు సవిస్తరముగఁ దెల్పి యాయుర్వేదమును, మనోరమను స్వరోచి కిచ్చెను. తన యభీష్టమును నెఱవేర్చినఁ గాని తాను వివాహమాడనని తెల్పుటగాని, తనవివాహమునకు నెచ్చెలులరోగ నివారణము ప్రతిఫలముగ నుంచుటగాని యాసమయమున నిందీవరాక్షునకు మనోరమపై నిరసన భావము కలిగియుండెడిది. కారణము కృతజ్ఞతకు మఱియొకఫలమును గూడఁ గోరుట తన రాక్షసాకారమును బోఁగొట్టిన స్వరోచి నభినందించుచు వాని ఘనకార్యము నామోదించి వందనపూర్వకముగఁ గానుక లర్పించుచోఁ దన కన్యయే వచ్చి కొండొక యభీష్టము వెలివుచ్చుట యౌచిత్యమును బాటింపదు. ఇందీవరాక్షుఁడు కానుకలిచ్చెడి సమయమున మనోరమకుఁ జెలులరోగము జ్ఞప్తికి వచ్చెను కాని తండ్రిచేసిన యేర్పాటునకు మాఱుపలుకరా దని వారి మాటను హృదయములో నణఁచుకొని యుండెను. ఆమెకు సౌఖ్యము హెచ్చుగ నున్నసమయములనెల్లఁ దన చెలుల బాధలు జ్ఞప్తికి వచ్చుచుండెను. ఇయ్యది సహజమే. మహానందతరుణములలో నొక వ్యక్తికి విషాదము గూడఁ గలుగవచ్చును. ఇటులు గర్భాధానము వఱకుదాచుకొనియుండె. ఆ సమయమునఁ జెలులబాధలు తన పునస్సంధానమును మఱపింపఁ జేయునట్టి శక్తి కలిగియుండెను. వెంటనే యామెకు దుఃఖ మతిశయించెను. వారి స్థితి యోర్చుకొనలేక కంటనీరువెట్టెను. ఇదంతయు నైజము. తన మనఃస్థితి విభున కెఱింగించినం గాని యామెకు శాంతి చేకూరలేదు. "తన యభీష్టసిద్ధికై సంభోగము నరికట్టె ననుట

కులసతియగు మనోరమకుఁ దగదనుట" సరియగు విమర్శన కానేరదు. ఈవిమర్శన కతమున నామె వేశ్యవలె వర్తించె నన్న యర్థము స్పష్టము. కులసతి పాత్రౌచిత్యమున కపుడు భంగము కలుగును. రంగము మొత్తమును విచారించి, సందర్భములఁ బరీక్షించి మనోరమ యుద్దేశము గ్రహింపవలెఁ గాని "సమర్థుండగు నతనిచే నది తీర్పించుకొనం గలయదియై" యను వాక్యములందు వేశ్యాపరముగ నర్థముచేయఁ దగునె. వేశ్యాజత్తులను కులసతియైన మనోరమకుఁ బెట్టెను. అందుచేత మనుచరిత్ర నీతిబోధకము గాదని శ్రీకాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారి వాదము. గర్భాధానపుగదిలో గ్రహింపవలసిన ముఖ్యవిషయము నెచ్చెలుల రోగమును నివారించుటయ కాని సంభోగము నరికట్టుట కాదు. అపుడు మనోరమ శీలము పొగడ్తకు పాత్రమఁ బడయును. అపుడు మనోరమను నవోఢయు, కులసతియు స్వార్థపరిత్యాగినియు నని శ్రీబ్రహ్మయ్యశాస్త్రిగారు వచింతురేమొ. అపుడు మనుచరిత్ర నీతిదాయకమై తీరును. పెద్దన గొప్ప నీతిబోధకుఁడగును.

షష్ఠాశ్వాసమున హంసాంగన చక్రవాకాంగన సంభాషణ మెంతయు నీతిదర్శకమై యున్నది. హంసాంగన స్వరోచి చేష్టలఁ బెద్దచేసి పలుకఁగఁ జక్రవాకి "మదివివరించి రోయకభిమానము దక్కిన వీరి కూరుముల్ వదలక పెద్ద సేసెదవు వందిగతిన్ తగవీవిచారముల్" అనెను. స్వరోచి క్రీడావృత్తిని నిరసించుచు నాతనికి నంతమంది భార్యలపైఁ గాని, వారికి నాతని యందుఁగాని యగ్గలమైన ప్రేమ యుండనేరదనియు నాతని విద్యానైపుణ్యముచే నాస్త్రీలు దొరకిరనియు, నందుచే వారిగొప్పలు చెప్పుట యుచితముకాదనెను.

"ఆ.తగులు నెవ్వఁ డొక్క తరుణికి నొకనిని, మొలఁత వలచు నదియ మేలనంగ
వచ్చుఁగాని పెక్కువనితలపైఁ గూర్మి, గలుగుననుట బొంకుగాదె తరుణి."

అని చక్రవాకి సంభాషణముముగించెను. ఈపద్యము వేమనగ్రంథము నుండి చదివితిమో యని తోఁచుచున్నది. పెద్దనయెంత నీతిపరుఁడైనచో నిట్టి పలుకులఁ బ్రయోగించును! స్వరోచి పెక్కండ్ర భార్యలను బెండ్లాడుట పెద్దనకు రుచింపలేదు. అయ్యది నీతి బాహ్యమనితోఁచెను. అట్టివి లోకమునఁ బ్రచురింపకూడ దని యెంచెను. లోకమున నట్టికార్యములు జరుగకూడ దను నాశతో నీ సంభాషణ నిర్మించెను. చక్రవాకి స్పష్టముగ స్వరోచి చేసిన పనులను విమర్శించెను. స్వరోచికి సిగ్గువచ్చెను.

క. "తలవాంచి యుస్సు రని మదిఁ, దలపోయుచు మానరాని తమకంబున"

... ... ... ... ... ...

పెద్దన స్వరోచియొక్క నిజస్థితి గ్రహించెను. చక్రవాకి మాట లాతని హృదయమున నాటెను గాని యువతులం జూచుటతోడనే యాఁపరాని మోహముకలిగెను. మొత్తముమీఁద స్వరోచిచేసిన కార్యము సత్ప్రవర్తనముకాదని స్ఫురించుచున్నది. పెద్దన క్రమముగ నా యభిప్రాయములోనికి దింపెను.

"శా. హుంకారం బొనరించి వే తలఁగుఁడో హా నేను స్వారోచినే
పంకేజాక్షులతోడ నెల్లప్పుడు దర్పస్ఫూర్తిఁ గ్రీడింప ల
జ్జాంకూరం బడఁగించనారు తలపోయన్ నాకు రోఁతయ్యె మీ
రింకం బోయి వరింపుఁ డొక్కరుని భోగేచ్ఛన్ నివారించితిన్.

చ. బరువన కింతులన్ దనకుఁ బల్వురఁ గూర్చుట భోగవాంఛఁగా
కరయఁగ నొండు గాదు ధనమన్న ధ్రువంబుగ నంగనా జనో
త్కరసముపార్జితం బటులు గావున వీనికి లేదిహంబునున్
బరమును నన్న నట్ల పఱుపం బనిలే దిది చెప్పనేటికిన్.

క. వీని విధంబున వనితా, ధీనుఁడనై పెంపుదక్కి తిరుగుచు నుండం
గా నేవెత్తిన తమకము, మాని చనుండన్న నవియు మసలక చనియెన్.

ఆ. అన్యసతులయందు నాసక్తుఁ డగువానిఁ
దమక మొదలి కూడఁ దలఁచుకంటె
మరణమైన మేలు మది వితర్కింపంగ
ననుచుఁ బలుకుటయును నవని విభుఁడు."

నీతిపాఠమునందలి యొక ప్రకరణమనం గన్పడుచున్న వీపద్యములు. మొదటనుండి నీతి మార్గావలంబకుఁడైన పెద్దన కథాంతమున మాత్రము నీతి దూరుఁడయ్యె ననుటకు సందేహము లేకుండగ స్వరోచి బహుళపాణిగ్రహణమును తీవ్రముగ ఖండించెను. పెద్దనకాలమం దట్టి వివాహములు విపరీతముగ జరిగెడి వేమొ. ఈపద్దెములు పెద్దనయొక్క సంఘసంస్కారసూచనము లేమొ. పంకేజాక్షులతో దర్పస్ఫూర్తిఁ గ్రీడించువానిని, అంగనాజనోత్కరసముపార్జితంబైన ధనమున్నవానిని, అన్యసతులందు నాసక్తుఁ డగువానిని పెద్దన మన్నింపలేదు. ప్రాజ్ఞు లట్టివి మెత్తురా? పెద్దన గ్రుక్కత్రిప్పక తనపూర్ణనిరసనము కనుపఱిచెను. అట్టిచో మనుచరిత్ర నీతిబోధకము కాదా? పెద్దనామాత్యుఁడు నీతిగురుఁడు కాఁడా.

ఉత్తమకావ్యములందు వేశ్య కథానాయికగ నుండరాదు. మనుచరిత్ర యందు వరూథిని కథానాయిక యగుటచే నిది నీతిదాయకము కాదని శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారి తీర్పు. వేశ్య కథానాయికగ నుండరాదను లక్షణము అంగీకారమే. కాని మనుచరిత్రయందు కథానాయిక యెవ్వరు? ఒక కావ్యమునందు కథానాయికపాత్ర యాదినుండి యంతమువఱకుఁ బోషింపఁబడవలెను. ఆపాత్రను నాయికా లక్షణములతో నలంకరింపవలెను. అట్టినాయికకుఁ బ్రాధాన్య మీయవలెను. అటులుగాక యొకానొక నాయికకు నొక కావ్యములో రెండుమూఁడు ప్రకరణముల వఱకే ప్రాముఖ్యము నొసఁగి తదుపరి యాపాత్రను మూలఁద్రోయుటవలన నాపాత్రకుఁ గావ్యశేషమునఁ బ్రాధాన్య ముండదు. అపుడాపాత్రను నాయికపాత్ర యందురా? వరూథినిపాత్ర నిక్కముగ నట్టిదియే. తృతీయాశ్వాసానంతరము పెద్దన మఱి వరూథిని పేరెత్త లేదు. ఉత్తరకథకు వరూథిని యక్కఱలేకపోయెను. అందుచే వరూథినిని కథానాయిక యని చెప్ప సాహసింప లేకున్నాను. యోజించి చూడ నీ కావ్యమునకు నిక్కముగ నాయికానాయకులు లేరని తలంచెదను. కావ్యమునందు రెండు కథలుండుటవలన నొకే నాయకుఁ డుండుటకు వీలుకలుగ లేదు. ఉత్తర కథ పూర్వకథయొక్క ఫలితము కానేరదు. అందుచే కథావసరమును బట్టి పెద్దన కావ్యమును మార్పు చేయవలసివచ్చె. నాయికయే లేనిచో నిఁక నవ లక్షణమునకుఁ దావెయ్యది. అందున, పెద్దన "వేశ్యను గథానాయికగ నిర్మించె న"న్న వాక్యము దోషము.

ఇన్ని సాదృశ్యముల కతన పెద్దనామాత్యుఁడు నీతిపరుఁడని చదువరికి గోచరమగును. ఒక వ్యక్తి యొక కావ్యమును విమర్శించుతఱి కావ్యము నంతను విశాలదృక్పథముతోఁ జూచి యందుండు పాత్రల పోషణ, యౌచిత్యమును, పాటించి శీల ప్రకటన సమయముల నవలోకించి, ప్రకరణము గుర్తెఱింగి, పాత్రల యవలోకన విస్తారముల నిశ్చయించి, కవి నైజమును, నీతిని వెల్లడిచేయవలెను. అటులు చేయనిచో విమర్శన లక్షణహీన మగును; ఏకగ్రీవ మగు భావములకు నెల వుండదు. అదియునుగాక ప్రాచీనకావ్య విమర్శనము కట్లు మఱింత జాగరూకత యుండవలెను. కారణము, కవియొక్క కాలపరిస్థితులు తెలియకుండుటయు. చరిత్రాత్మక విమర్శనము లిక్కాలమున నవసరము. కవియొక్క కాలమున విమర్శకుఁడు జీవించియున్నాఁడని యెంచి విమర్శింపవలెను.

ఇట్టి విమర్శనము ఆంగ్లేయ విద్యాధికులకుఁ దెలియునుగాని తెలుఁగువిద్య నభ్యసించిన వారికిఁ దెలియుట దుష్కరము. విమర్శన కొఱకు విమర్శింపరాదు. విమర్శకు వలసిన విషయమున్నంగాని విమర్శన పస చెడును. విమర్శకులకు గౌరవము కలుగదు. సహృదయులు శాంతచిత్తముఁతో నీభావముల నన్వయించుకొనెదర నెడు నభిలాషతో దీనినివ్రాసితిని.

నొకఁడును, గాళిదాససమకాలీనుఁడును, దత్ప్రతిస్పర్ధి యని జనశ్రుతి గలవాఁడు నగు "ఘటకర్పరుఁడు" రచించిన 'యమకకావ్యము' కాళిదాసుని మేఘదూత కుపజీవ్య మని కొందఱయభిప్రాయము. ఒకానొకతరుణీమణి యత్యంతదుస్భర మగుభర్తృవిరహావేదనముచే గోడూయమానమానస యై, వర్షాకాల మారంభ మగుడు, తా ననుభవించు నతివేలవిభువిరహంబును వనప్రియుని కెఱింగించి పుణ్యమునఁబొందని వియన్మార్గవిహార మొనరించు మేఘముల నభ్యర్థించినట్లు, ఘటకర్పరకావ్యమున [౧—13 శ్లో] వర్ణింపఁబడియున్నది. కాని విక్రమాదిత్యుని 'నవరత్న' వృత్తాంతమునకుఁ జారిత్రకప్రమాణము లేకపోవుటచే, 'యమకకావ్య' 'మేఘదూత' లసంబంధమును నిర్ణయించుట దుశ్శకము.

*ఆచార్య 'ఆర్థర్ బెరీడేల్ కీత్' మహాశయుఁడు [Dr. Prof. A B Keith] ఈనడుమను బ్రచురించిన [September, 1928] "సంస్కృతసారస్వతచరిత" మను బృహద్గ్రంథరాజమున నిట్లు వ్రాసియున్నాఁడు.

" That the work of Ghatakarpara is earleir than Kalidasa is deduced by Jacobi [Ramayana? P 126] from the fact of Ghatakarpara's boast, which later was not justified; if however, the poem when first written set a model in this form of composition, then it might be preserved when it had ceased to be pre-eminent on the score of its originality. This conjecture seems wholly implausible, example of a text being preserved as a literary curiosity is unknown, and Ghatakarpara evidently was ranked higher by Indian taste than by modern opinion, for he was made one of the nine jewels of Vikramaditya's court as contemporary of Kalidasa"*

[Prof. Keith's 'History of Sanskrit Literature. P. 201]

కాళిదాస 'మేఘదూత'కుఁ గలజనానుమోదము.

అభిప్రాయభేదము లెట్టులున్నను, 'దూతకావ్యముల'కుఁ గాళిదాసుఁడు పెట్టినది భిక్ష యని దృఢముగా విశ్వసింపనగు. ఈనవ్యకావ్యకల్పనము సంస్కృతకవితాచరితమున నత్యంతగణనీయాంశము. ఈనూతనకావ్యసృష్టి యత్యంతము జనానుమోదముం బడసినది. అఖిలైరోపాఖండసారస్వతములలోఁ గలకరుణరసాత్మకకావ్యములలో [Elegaic Literature] నొకటి యైనను గాళిదాసుని "మేఘదూత"తోఁ దులతూఁగునది లేదని పాశ్చాత్యవిద్వాంసుఁ డొకఁడు(1) [M. Hippotyte Fanche] నొక్కి వక్కాణించి యు

1. ఆచార్య ఖాడాజీ; 'కాళిదాసు'నుగూర్చిన యుపన్యాసము 7 వ పుట.

న్నాఁడు. దూతకావ్యములలోని కెల్లఁ బ్రాచీనతమ మగుసీ "మేఘదూత" ప్రాచీనకాలమునుండి యు సార్వజనీన మై భాసిల్లెను. అర్వాచీనకవు లనేకులు దీని ననుకరించి కావ్యముల రచించుటయే, తత్సార్వలౌకికానుమోదమున కుజ్జ్వలోదాహరణము. రచనాకాల మిదమిత్థ మని నిర్ణయింపఁగూడిన కాళిదాస "మేఘదూతా"నుకృతులలో నెద్దియు, క్రీ. శ. 12 వ శతాబ్దము నకుఁ బూర్వము నిర్మింపఁబడి యుండలేదు. అట్లు లనుటచేఁ దత్పూర్వము "మేఘదూత"కుఁ బ్రచుర ప్రచారము లేదని యెంచఁ జనదు. ఆలంకారికసార్వభౌముఁ డగుభామహుని 'కావ్యాలంకారము'నందలి [1 పరి 42-44 శ్లో] వాక్యములంబట్టి యాతనికాలముననే "మేఘదూత"కుఁ బ్రతిబింబము లున్నట్లు తెలియఁదగును. కేవల వాదాభిలాషతో నీవాక్యమును నిరసించినను, క్రీ. శ. 8 వ శతాబ్దిలోని, జినసేనుని "పార్శ్వాభ్యుదయ"మంత ప్రాచీనకాలముననే "మేఘదూత"కు సార్వజనికామోదము గల దని యుద్ఘోషించుచున్నది. "పార్శ్వాభ్యుదయము" మేఘదూతసమస్యాపూరకకావ్య మని యిదివఱకే వ్రాసి యుంటిమి. [ఇట్టివి-చూ XIII చేతోదూత; XVI నేమిదూత; XXXIII మేఘదూతసమస్యాలేఖ; XXXVI చారిత్రసుస్దరగణికృత "శీలదూత"] ఆకాలముననే "మేఘదూత" ప్రచుర ప్రచారముం బడసి యుండినఁగాని, జినసేనుఁ డట్టులు "మేఘదూత"లోని తురీయపాదముల సమస్యాపద్ధతిం దనకావ్యములోఁ జొప్పించి యుండఁడు. ఈపద్ధతి నర్వాచీనకవులు "మేఘదూత" ననుకరించిన ట్టులు వ్రాసి యుంటిమి. అందువలన నాకావ్యము నెడల సర్వజనులకుఁ గలయనుమోదము కరతలామలకీకృతము. 'సింహాలి, టిబెటాన్' [Simhalese and Tibetan] భాషలలో నుపలబ్ధము లగుప్రాచీనతరము లగుమేఘదూతానువాదములవలనఁగూడ నాకావ్యము సర్వజనమనఃపీఠికల నెట్టు లధివసించియున్నదో తెలిసెడిని.(2) ఈకావ్యమునకుఁ గలవ్యాఖ్యానసంఖ్య యసామాన్యము. ఆఫ్రెట్

2. గుణతిలకునకు (W. Gunatilaka) 'కాండీ' (Kandy) లో సింహాలీభాషలో "మేఘదూత"కు దండాన్వయ (Paraphrase) గ్రంథ మొకటి దొరకినది. సంస్కృతకావ్యముతోఁ జేర్చి దీనిని "పెన్‌బోక్" (The Hon. T. B. Panbokke) కొలంబో లో 1893 సం. ప్రచురించెను. తంజావూరులో "మేఘదూత"కు "టిబెట్" భాషానువాద మొకటి కలదు. దీనిని దీనికి "జర్మన్" భాషాంతరీకృతితోఁ జేర్చి 'బెర్లిన్' నగరమున 'బెక్' (Dr. Beck) అనునాతఁడు 1907 సం॥నఁ బ్రచురించెను.

— "హల్ట్‌ష్" పండితప్రచురిత మగు 'మేఘదూత' యొక్క పీఠిక (VIII పు) నుండి.

పండితుని "ముద్రితాముద్రితసంస్కృతగ్రంథసూచిక" [Prof. T. Aufrechts, 'Catalogus Catalogorum'']లో నీకావ్యమున కేర్పడివ్యాఖ్యానము లున్నట్టులు వ్రాయఁబడియున్నది.

ఈఖండకావ్యమున కింతమందిపండితులు వ్యాఖ్యానములొనర్చుటయే జనులమనంబుల నీకావ్య మెట్టులరికట్టినది చెప్పక చెప్పుచున్నది. ఏకావ్యమునకు నింతటిజనానుమోద మున్నట్టు లశ్రుతదృష్టపూర్వము. సుప్రాచీనకాలముననే యీకావ్యమునకుఁ గలిగిన జనానుమోద మిన్నిశతాబ్దములనుండి నిరంతరముగా నీభారతవర్షముననే కాక యావత్ప్రపంచమున నేఁటిదనుక విలసిల్లియున్నది.

సంస్కృతదూతకావ్యపరిణామచరిత్రము.

సంస్కృతదూతకావ్యవికాసము నారయునప్పుడు కాళిదాసుని "మేఘదూత"కుఁ బ్రతిబింబకల్పము లగుప్రాచీనదూతకావ్యముల మొదటఁ బరిశీలింపవలెను. 'మేఘదూత' లోని యితివృత్తముయొక్క ఛాయ భవభూతి మహాకవికృత "మాలతీమాధవము"నఁ గానవచ్చుచున్నను, నంతకంటె నర్వాచీనమగు ధోయీకవిరాజకృత మగు "పవనదూత"మే 'మేఘదూతా'నుకృతులలోఁ బ్రాచీనతమ మని చెప్పనగు. "మాలతీమాధవము"న నాయకుఁ డగుమాధవుఁడు తా ననుభవించు విరహవేదనను దనప్రాణేశ్వరితోఁ జెప్పవలయు నని మేఘుని బ్రార్థించినట్టులు వర్ణింపఁబడియున్నది.

"మాధవః:—.........ఆకర్ణ్య, అయం ప్రతిరవభరితకన్దరానన్దితో త్కణ్ఠాకలకేకానుబన్ధినా హుఙ్కృతేన, మా మనుమన్యతే, యావ దర్థయే భగవన్! జీమూత!"

> శ్లో. అపైవా త్వశ్యే ర్జగతివిచర న్నిచ్ఛయా మత్ప్రియశ్చే
> దాశ్వాస్యాదా తదనుకథయే ర్మాధవీయా మవస్థామ్
> ఆశాతన్తు ర్నచ కథయతా త్యన్తముచ్ఛేదనీయః
> ప్రాణత్రాణం కథమపి కరో త్యాయతాక్ష్యాః స ఏకః.

[మాలతీమాధవము 9 అఙ్కము 162 పుట. జీవానన్ద విద్యాసాగరప్రకటితప్రతి. 1876]

మేఘదూతానుకృతులలోఁ 'బవనదూత' కంటెఁ బ్రాచీనతరము మృగ్య మనవచ్చును. ఉపలబ్ధదూతకావ్యముల రచనాకాలము చాలవఱకు మనకుఁ దెలియమిచే నాయాకావ్యములు "పవనదూత" కంటెఁ బ్రాచీనము

లని సిద్ధాంతీకరించుట దుశ్శకము. ధోయీ "పవనదూత" కంటెఁ బ్రాచీనము లగు మేఘదూతప్రతిబింబము లనఁదగు కావ్యము లనేకము లుండియుండు ననుటకుఁ బ్రబలప్రమాణములు లేకపోలేదు. ప్రాచీన భారతీయకవుల గ్రంథములవలె నీకోమలకావ్యకన్యలు కాలదండప్రఘాతమువలన నంతరించియుండును. లేక, యాలంబనాభావముచే నేమూలనో యసూర్యంపశ్యము లై యుండి, ప్రత్నతత్త్వాన్వేషణదత్తమనస్కుఁ డగు నేరసికశిరోమణికొఱకో, యుభయతారకముగ నిరీక్షించుచున్నవో!

ప్రాచీనాలంకారికుఁ డగునాచార్యభామహుఁడు [క్రీ. శ. 7 వ శతాబ్దాంతము—8 వ శతాబ్దాది] "కావ్యాలంకారము" లో నయుక్తిమద్దోషమును విచారించుచు నిట్టులు వ్రాసియున్నాఁడు:—

1 "శ్లో. అయుక్తిమ ద్యథా దూతా జలభృన్మారుతేన్దవః
తథా భ్రమర హారీత చక్రవాక శుకాదయః. 42

2 శ్లో. అవాచోఽవ్యక్తవాచశ్చ దూరదేశవిచారిణః
కథం దూత్యం ప్రపద్యేర న్నితి యుక్త్యా నయుజ్యతే. 43

3 శ్లో. యది చోత్కణ్ఠయా యత్తదున్మత్తఇవభాషతే
తథా భవతు భూమ్నేదం సుమేధోభిః ప్రయుజ్యతే! 44

['కావ్యాలంకారము' I పరి. 42—44 శ్లో 15—16 పు;
P V. Naganatha Sastri's Edition 1927]

మేఘము, వాయువు, చంద్రుఁడు, భ్రమరము, హారీతము, చక్రవాకము, శుకము—వీనిని దూత్యకార్యమునకు నియోగించినట్టులు వర్ణించిన నయుక్తిమద్దోషము సంభవించును. ఇందుఁ గొన్ని వాగ్విహీనములు, కొన్ని యవ్యక్తవాగ్యుతములు. ఇవి దూతకార్యము నెట్టులు నిర్వహించునో యోజింప నలవికాకున్నది. విరహోత్కంఠచే నున్మత్తప్రాయు లగువా రట్టిదూత్యకల్పనకుఁ బాల్పడుదురుగాక! దృఢవ్యుత్పన్ను లగుకవికుంజరులు గూడ నచేతనదూత్యకల్పన నవలంబించియున్నారు.

భామహశ్లోకములవలన నప్పటికే మేఘదూత, వాతదూత, ఇన్దుసన్దేశము, భ్రమరదూత, హారీతదూత, రథాఙ్గదూత, శుకసన్దేశము, మొదలగు నామములు గలదూతకావ్యములు విశేషప్రచారముం బడసిన వనియు, నవి కాళిదాస "మేఘదూత" కుఁ బ్రథమానుకృతు లనియు నిస్సందేహముగఁ బ్రతిపాదింపవచ్చును.

ఆచార్య "ఆర్థర్ బెరిడేల్ కీత్" మహాశయుఁడు కాళిదాసుని 'మేఘదూత' ధోయీకృత "పవనదూత"కుఁ బూర్వమే వత్సభట్టిచే ననుకరింపఁబడిన దని వ్రాసియున్నాఁడు.

"The poem (Meghaduta) is already imitated by Vatsabhatti and it produced a crop of feeble attempts, the earliest perhaps the Pavanaduta of Dhoyika (12th century)"

—Prof A B Keith's "Classical Sanskrit Literature" P 36.

ఇది కేవలము భ్రమవిజృంభిత మని చెప్పక తప్పదు. ఏలన, మన కుపలబ్ధ మగు "దశపురశాసన మొక్కటియే వత్సభట్టిప్రణీత మగుగ్రంథ మని సారస్వతలోకమున నెంచఁబడుచున్నది. నేఁటి వఱకు దీనికి భిన్నవాదము లేదు. ఈశాసనమునందలి వస్తువర్ణనమునకుఁ గాళిదాసున కారోపిత మగు "ఋతుసంహారము" నందలి వస్తువర్ణనమునకు సాదృశ్యము కానవచ్చెడిని. కాళిదాసుని "మేఘదూత" లోని భావములు కొన్ని యీశాసనమున ననుకరింపఁబడియున్నవి.

* I "మేఘదూత" II స. 1 శ్లో.

శ్లో. విద్యుత్వంతం లలితవనితాః సేన్ద్రచాపం సచిత్రాః
సంగీతాయ ప్రహతమురజాః స్నిగ్ధగంభీరఘోషమ్
అన్తస్తోయం మణిమయభువస్తుఙ్గ మభ్రంలిహాగ్రాః
ప్రాసాదా స్త్వాం తులయితు మలం యత్ర తైస్తై ర్విశేషైః.

ఈశ్లోకము నకు మెఱుఁగుపెట్టఁదలఁచియే వత్సభట్టి తన శాసనమున నీక్రిందిశ్లోకముల రచించె నని నిర్వివాదముగఁ జెప్పనగు. వత్సభట్టి కాళిదాసునికంటె నర్వాచీనుఁ డని గీర్వాణవిద్వల్లోకము సిద్ధాంతీకరించియే యున్నది.

శ్లో. చలత్పతాకా న్యబలాసనాథా న్యత్యర్థశుక్లా న్యధికోన్నతాని
తడిల్లతాచిత్రసితాభ్రకూట తుల్యోపమానాని గృహాణి యత్ర.

శ్లో. కైలాసతుఙ్గశిఖరప్రతిమాని చాన్యాన్యాభాన్తి దీర్ఘవలభీనిసవేదికాని
గాన్ధర్వశబ్దముఖరాని నివిష్టచిత్రకర్మాణి లోలకదలీవనశోభితాని.

[Fleet: "Corpus Inscriptions in India"—Vol. III Pp 81 ff]

II "హంసశ్రేణీరచితరశనా నిత్యపద్మానలిన్యః" [మేఘదూత]

"యత్రసరాంసి..........................

విలోలవీచీచలితారవిన్దపతద్రజః పిఞ్జరితైశ్చ హంసైః"—వత్సభట్టిశాసనము.

[Fleet: "Corpus Inscriptionum Indicarum"—Vol. III P 81 ff]

III "యత్రోన్మత్తభ్రమరముఖరాపాదపానిత్యపుష్పాః [మే. దూ.]
"స్వపుష్పభారావనతైర్నగేన్ద్రైర్మదభ్రమత్కోకిలకూజితైశ్చ"

—వత్సభట్టి.

[పై నుదాహరించిన కాళిదాసవత్సభట్టికవితాసామ్యమును, యస్. సి. డేపండితుని "కాళిదాసవిక్రమాదిత్య" విచార మను గ్రంథము (40-42 పు) నుండి స్వీకరించితిని. Principal, Prof. S. C. De, M A, I. E. S. (Rtd) "Kalidasa and Vikramaditya."—March 1928.] "మేఘదూత" లోని కొన్ని భావముల వత్సభట్టి పరిగ్రహించి తన "దశపురశాసనము" లో ననుకరించినంతమాత్రమున నాతఁడు "మేఘదూతా"నుకృతికర్త యెట్లు లగును? "మేఘదూత" లోని యితివృత్తము వేఱు, వత్సభట్టిశాసనములోని యితివృత్తము వేఱు. దూతకావ్యమున కుండవలసిన ముఖ్యలక్షణము లీశాసనమునఁ గానరావే! వత్సభట్టి ధోయీ "పవనదూత" వలెఁ గాని, వేదాంతదేశికుల 'హంససందేశము' వలెఁ గాని దూతకావ్యమును వ్రాయలేదే! అపుడు గదా వత్సభట్టిని మేఘదూతానుకృతికారులలోఁ జేర్పఁదగును. కావునఁ బ్రకృత పరిశోధనలవలన మనకుఁ దెలిసినంతవఱకు ధోయీకృత 'పవనదూత'యే సముపలబ్ధదూతకావ్యములలో 'మేఘదూత'కుఁ బ్రాచీనప్రతిబింబము.

శ్లేషయమకచక్రవర్తి యగు వేంకటాధ్వరి మహాకవి నిర్మిత మగు "విశ్వగుణాదర్శము" లోఁ గాళిదాసుని 'మేఘదూతా'నుకరణచ్ఛాయలు గానవచ్చెడి నని హాల్ట్‌ష్ (Dr. Hultzsch) పండితుఁడు వ్రాసియున్నాఁడు. (3) కాని యిది మాకు సమంజసముగాఁ జూపట్టదు.(4) కృశానువిశ్వావసు

3 'హాల్ట్‌ష్' ప. డిత ప్రకటిత 'మేఘదూత'—పీఠిక IX పు.

4. 'హాల్ట్‌ష్' పండితుని యభిప్రాయము నాకు సమంజసముగాఁ జూపట్టుచున్నది. 'విశ్వగుణాదర్శము' దూతకావ్యము కాదు; కాని తద్రచనావసరమున వేంకటాధ్వరి దృష్టిపథమునఁ గాళిదాసమేఘదూత యున్నట్లుతేటతోఁచెడిని. లోకజ్ఞానమున దేశజ్ఞానమునఁ గాళిదాసుఁ డద్వితీయుఁడు. దేశమునందలి దర్శనీయప్రదేశముల యభివర్ణనము కావ్యమున కౌత్సుక్యోత్పాదకము. అందుచేఁ బూర్వమేఘమున "వక్రః పన్థా" (28 శ్లో) అనుశ్లోకమున 'నీవు చుట్టుత్రోవ నైనను లోచనలోభనీయ మగునుజ్జయినీనగరమువీఁదుగా వెడలుము. అయానందాతిరేకము ననుభవింపుము. లేనిచో నీజీవితము నిష్ఫలము సుమీ' యని మేఘునికి దేశదిదృక్షుం గలిగించి, అవన్తి, మహాకాళము, దేవగిరి, దశపురము, బ్రహ్మావర్తము, గంగానది, కనఖలగిరి, క్రౌంచము, కైలాసము, మానససరోవరము, అలకానగరి మొదలగుదేశముల, నగరముల, క్షేత్రముల, పర్వతముల, నదుల

లను నిర్మించి గంధర్వులు విశ్వావసులోకస్పృహచే నొకానొకవిమానముమీఁద నానాసేతుసీతాచలము ప్రయాణముచేయుట విశ్వగుణాదర్శమున వర్ణింపఁబడియున్నది. అన్యోన్యసూయుఁడగుకృశానుఁడు దోషైకదృష్టి యగుటచేఁ బ్రతివిషయమునఁ గలదోషాన్వేషణపరాయణుఁడై యాకావ్యమునఁ బులోభాగిపదము వహించును. విశ్వావసుఁడు విశ్వగుణగ్రహణకౌతుక యగుటచే క్షీరనీరవివేచనముగల హంసక్రమమునే స్వీకరించినట్లులు, ప్రతివిషయమునందలి గుణమునే పరిగ్రహించును. ఈచంపువునందలి విమానయానము కేవలము కవిమనీషామహత్త్వోద్భూతము.

కాళిదాసునకుఁ బిమ్మట రచింపఁబడిన దూతకావ్యము లన్నిటికి నాతని మేఘదూతయే యుపజీవ్యము. ఆకావ్యములలోఁ బ్రతిపదమున ((At every step) ననఁగాఁ బ్రతివిషయమునఁ గాళిదాసానుకరణము సుస్పష్టముగా గోచరించుచుండును. ఈయనుస్మృతి ఛందోవిషయమునఁ గూడఁ గానవయ్యెడిని. కాళిదాసుని మేఘదూతలో మన్దాక్రాన్త ముపయోగింపఁబడుటచే సాధా

---

నభివర్ణించి, ఏనదేశజ్ఞానమును బూర్వమేఘమున విశదీకరించెను. ఈవిషయములకుఁ బ్రతిబింబము విశ్వగుణాదర్శమున గానఁబడుటలేదా! ఏయక్ష్యావిహారి కావున మేఘునకు దేశము చూచుటకు విమానాపేక్షలేదు. కృశానువిశ్వావసులు మానవమాత్రులు గాన దేశమును విహంగమదృష్టి(Birds eye view) నవలోకింపవలె ననిన విమానసాహాయ్య ముండితీరవలెను. ఇందౌచిత్యభంగము కానరాదు. 'మేఘదూత'లో మేఘునకు యక్షుఁడు దేశావలోకనాపేక్షం గలిగించినట్లులు వర్ణింపఁబడెను; 'విశ్వగుణాదర్శము'లో విశ్వావలోకస్పృహచేతనే యాగంధర్వయుగ్మము విమానయానమునకుఁ బూన్నొనినట్లులు "విశ్వావలోకస్పృహయా" అనుశ్లోకమువలనఁ దెలిసెడిని. పూర్వమేఘములో వలె నిందును, నదులు, గిరులు, క్షేత్రములు, నగరములు, దేశములు, దేశాచారములు, మొదలగునవి వర్ణింపఁబడినవి. 'మేఘదూత' దని కుపజీవ్య మైన దనుట యసమంజసము కానేరదు. పూర్వోక్తరీతి నీరెండుకావ్యములకు సామ్యము గానవయ్యెడిని. విశ్వగుణాదర్శము దూతకావ్యము కాదు. అందుచేతనే వేంకటాధ్వరిని, మేఘదూత ననుకరించి దూతకావ్యములు రచించినకవులలోఁ జేర్పలేదు. 'శీలదూత'లో దూతప్రసక్తియే లేదు, అయినను మేఘదూతనామగంధ ముండుటచే, ప్రకృతవిమానయానమునఁ దత్ప్రసంగము చెప్పక తప్పినదిగాదు. రావణసంహారానంతరము శ్రీరామచంద్రుఁడు పుష్పకవిమానారూఢుఁడై యయోధ్యానగరమునకు వచ్చుచు నడుమ ననేక దర్శనీయప్రదేశముల సందర్శించినట్లులు, భవభూతి "మహావీరచరితము"లోను, భట్టమురారి "అనర్ఘరాఘవము"లోను వర్ణించియున్నారు. ఇవికూడ వేంకటాధ్వరి దృక్పథమున నుండె ననవచ్చును. 'ప్రద్యుమ్నానంద'నాటకములో (V అంకము) వేంకటాధ్వరి, ప్రద్యుమ్నాదులు విమానము మీఁద మధురానగరమునకు వచ్చుచు, నడుమ ననేకప్రదేశముల సందర్శించినట్లులు వర్ణించియున్నాఁడు. [E. R.] *

రణముగా నన్నిదూతకావ్యములలో నిదియే యుపయోగింపఁబడెను. ఈసూత్రమున కొండు రెం డపవాదములు (Exceptions) లేకపో లేదు. ఉదా-రూపగోస్వామి "హంసదూత"లో శిఖరిణీవృత్తమును, విష్ణుదాసుని "మనోదూత" యందు వసన్తతిలకము నుపయోగింపఁబడినవి. మేఘదూతలోని యితివృత్తమువలెనే, ప్రియుఁడు ప్రియురాలికిఁ గాని, ప్రియురాలు ప్రియునికిఁ గాని మదనసందేశము నంపుటయే యీకావ్యములన్నిటియందలి యితివృత్తము. వీనిలోఁ జాలవఱకు మేఘదూతపదభావానుకరణములు రెండును జూపట్టెడిని. మేఘదూతలోని భావములో లేక తాదృశభావము లించుకమార్పులతోనో యీప్రతిబింబకావ్యములలో గోచరించెడిని. కొన్నియెడలఁ గాళిదాసుని పదములును బదబంధములు నట్టులే యీకావ్యములలోఁ బరిగ్రహింపఁబడియున్నవి. *క్షేమేంద్రుఁడు "కవికంఠాభరణము"లో [I సంధి; 3-4 శ్లో] వివరించిన ఛాయోపజీవి, పదకోపజీవి, పాదోపజీవి, సకలోపజీవుల కీదూతకావ్యకవులను లక్ష్యీకరింపనగును. ఈకవితానుకరణమునకుఁ గొన్నియుదాహరణములం జూపెద.

1 'కామార్తాహి ప్రకృతికృపణాశ్చేతనాచేతనేషు'

—కాళిదాసుని "మేఘదూత" I స. 5 శ్లో.

(1) 'యుక్తాయుక్తం సమదమదనావేశతోఽవిన్దమానా'

—జైనమేఘదూత I స. 9 శ్లో.

(2) విశ్లేషేణాక్షుభితమనసాం మేఘశైలద్రుమాదా
యాచ్ఞాదైన్యం భవతి కిముతక్వాపిసంవేదనార్తే.

—వేదాంతదేశికులు; "హంససన్దేశము." I ఆ. 5 శ్లో.

(3) "దూతం మోహాత్పవనమహ్నాదంప్రాహిణో దశ్రునేత్రః,
ప్రాయో మోహో భవతి భవినాం బోధశూన్యత్వహేతుః'

—వాదిచంద్రుఁడు: "పవనదూత" I శ్లో.

(4) 'నతస్యాదోషోఽయం యదిచవిహగంప్రార్థితవతీ.
నకస్మిన్విస్రంభం దిశతి హరిభక్తిప్రణయితా ?

—రూపగోస్వామి : 'హంసదూత ? 8 శ్లో.

(5) "క్వాయంప్రాయః పవనసలిలజ్యోతిషాం సన్నికాయః
క్వార్థశ్చాయం ప్రవణకరణైర్యోవిధేయః సమర్థః

హా స్త్రీత్వా దితి స సహసా ఽచిన్తయ న్నూచివాం స్తాం
కామార్తాహి ప్రకృతికృపణా శ్చేతనాచేతనేషు'
—మేఘవిజయుఁడు : 'మేఘదూతసమస్యాలేఖ' 5 శ్లో.

II. "యాచ్ఞా మోఘావరమధిగుణే, నాధమే లబ్ధకామా"
—కాళిదాసుని 'మేఘదూత' 1 స. 6 శ్లో.

"సయాచ్ఞా సత్పక్షే వ్రజతిహి కదాచిద్విఫలతాం"
—రూపగోస్వామి : 'హంసదూత' 9 శ్లో.

III. ["గుర్వపి విరహదుఃఖ మాశాబన్ధః సాహయతి" శాకుంతలము IV అ. 16 శ్లో.

"ఆశాబన్ధః కుసుమసదృశం ప్రాయశో హ్యఙ్గనానాం
సద్యఃపాతి ప్రణయిహృదయం విప్రయోగే రుణద్ధి"
—కాళిదాస 'మేఘదూత' 1 స. 10 శ్లో.

(1) 'ఆశాపాశః కిలచలదృశాం మాత్రి యఃప్రోషితానాం'
—లక్ష్మీదాసుని "శుకసందేశము' 12 శ్లో.

[(2) "ఆశాతన్తు ర్నచకథయతా త్యక్తముచ్ఛేదనీయః
ప్రాణత్రాణం కథమపికరో త్యాయతాక్ష్యాః సపకః'
—భవభూతి : 'మాలతీమాధవనాటకము' IX అ.]

(3) 'ఆశాపాశైః సఘనపవనవ్రైః కుర్వతీప్రాణబన్ధమ్'
—'ఉద్ధవసన్దేశము' (రూపగోస్వామి?) 83 శ్లో.
(As quoted by Prof. Nandargikar.)

IV. 'స్థిత్వాతస్మిన్వనచరవధూభుక్తకుఞ్జేముహూర్తం'
పూర్వమేఘము. 19 శ్లో.

'హిత్వా కాఞ్చీ మవినయవతీ భుక్తరోధ్రోనికుఞ్జాం'
—ధోయీ : 'పవనదూత' 15 శ్లో.

V, 'సంసర్పన్త్యాః స్ఖలితసుభగం దర్శితావర్తనాభేః'
—పూర్వమేఘము. 29 శ్లో.

'సంసర్పన్తీ ప్రకృతికుటిలాం దర్శితావర్తచక్రాం'
—ధోయీ : 'పవనదూత' 34 శ్లో.

VI. 'నిత్యజ్యోత్స్నాః ప్రతిహతతమోవృత్తిరమ్యాః ప్రదోషాః'
—ఉత్తరమేఘము. 3 శ్లో.

"ప్రత్యాసన్నే ... మవిరతం కుర్వతేయ ... యానామ్'
—ధోయీ : "ప. దూ." 42 శ్లో.

VII. "విద్యుద్గర్భ స్తిమితనయనాం"—మేఘదూత II. 37.
"ఆసాద్యాతః కమపిసమయం" ధోయీ. "ప. దూ" 61.

VIII. "శ్రోష్యత్యస్మాత్"—ఉత్తరమేఘము. 36.
త్వత్తశ్శ్రోష్యత్యవహితమనాః" "ప. దూ" 96.

IX. ["ప్రజాగరాత్ ఖలీభూత" శాకుంతలము. IV. 22.]
"కష్టాత్కష్టం" ప. దూ' 84.

X. "గత్యుత్కమ్పాత్? "ఉ. మే' 11.
"భ్రామ స్తినాం' "ప. దూ' 49

XI. "దీర్ఘీకుర్వన్" "పూ. మే" 32.
"కంపాపాఘః కమలవనికా' : వేదాన్తదేశికులు : "హం. స'

XII. "ఆపృచ్ఛస్వ"—"పూ. మే' 12.
"ప్రత్యక్షీణాంత్వద్విరహసమయే' 'హం. స."

XIII. "పాదన్యాసైః' 'పూ. మే." 38.
"స్రస్తాపీడప్రచలదలకం" "హం. స."

XIV. "అన్తశ్శుద్ధస్త్వమపి" పూ. మే. 52.
"వక్ష్యస్తర్బహిరపిపరాం" హం. స.

XV. 'విద్యుత్వన్తం' ఉ. మే. 1.
'లీలాఖేలం' హం. స. II ఆ.

XVI. 'జాతామన్యే' ఉ. మే. 23, 24.
'ఇన్దోర్దైన్యం' ఉ. మే. 23, 24.
'వర్షాకీర్ణా మివకమలినీం' హం. స.

XVII. "భర్తుర్మిత్రం" ఉ. మే. 39.
"పత్యుర్దేవి" హం. స.

ఇంకను గవితానుకరణమునకు లక్ష్యముల బహుళీకరింపవచ్చును.

శార్మణ్య (Germany) దేశీయుఁడును, నుత్తమకావ్యనాటక నిర్మాతయునగు 'షిల్లర్' Schiller—1759—1805 A. D) మహాకవి "మేరీస్టుఆర్ట్" 'Mary Stuart') అనునాటకములో నొకానొకఘట్టమున మేఘదాత్యము నవలంబించె ననియు, నం దాతని యౌచితీసంపద విశద మగుచున్న దనియు

ఏ. బి. కీత్ పండితుఁడు వ్రాయుచున్నాఁడు: "Schiller, who in his '*Maria Stuart*,' makes the captive queen bid the clouds as they fly south, greet the land of her happy youth, uses the motif in more effective guise; the hapless queen is well aware that for her, there is no more chance of seeing again the fair land of France and her position evokes true pathos"

— Prof. A. B Keith: 'Cl Skt. Lit' P. 35

'మేరీస్టుయర్ట్' అను రాజ్ఞి [illegible] మొదట నూహించెను. తన [illegible] విమోచనము జేసియు, నిఁక నెన్నఁటికిఁ దనకుఁ బ్రియమైన తన "ఫ్రాన్సు" (France) దేశమును సందర్శించుభాగ్యము లభింపదనియు నామెస్పష్టముగా విశ్వసించి, వియత్తలమున విహరించు మేఘములం జూచి, తాను శత్రుమధ్యమునఁ బడుకష్టములఁ దన ప్రజలకుఁ దెలుపవలె నని యభ్యర్థించెను. ఈఘట్ట మత్యంతకరుణరసోత్పాదన క్షమమై యున్నది. కుసుమసుకుమార మైనను "మేఘదూత" యందాశాబన్ధము నాయికానాయకప్రాణత్రాణహేతు వగుచున్నది. ("Ef. Hope to enjoy is better than hope enjoyed") "మేరీస్టుఅర్ట్" నకు స్వదేశసందర్శనభాగ్య మెన్నఁటికిని లభింప దని తెలియుటచే నిట నాశాపాశప్రసక్తియే లేదు. కావున "మేఘదూత" కంటె నిందు విశేషముగాఁ గరుణరస మొలుకుచున్న దనుట వాస్తవమే.

ఈఘట్టమున కాంగ్లభాషానువాదముం జూపెద:—

Mary:—"Fast fleeting clouds! Ye meteors that fly;
Could I but with you sail through the sky!
Tenderly greet the dear land of my Youth!
Hear I am capture! Oppresse'd by my foes,
No other than you may carry my woes
Free thro' ether your pathway is seen,
Ye own not the power of this tyrant queen."

—(Schiller's Works). "Mary Stuart.". III Act i sc. (Page 270.

కాళిదాసుని 'మేఘదూత' మనసునం దుంచుకొనియే 'షిల్లర్' ఈ వాక్యముల రచించె నని, ఆచార్య "మెక్డానెల్" పండితుఁడు వ్రాసియున్నాఁడు. 5.

---

5. Dr. Prof. Aurthur A. Macdonell, M. A. Ph.D, "History of Sanskrit Literature" XII Chapter P. 335; 1913 Edition.

గతశతాబ్దిలోని యాంగ్లకవిసార్వభౌముఁ డగు (Poet Laureate) 'అల్ఫ్రెడ్ టెన్నిసన్' (Alfred Tennyson) మహాకవి 'రాజపుత్త్రి' (The Princess) అను తనకావ్యములో నొకచోటఁ జాతక (Swallow) దౌత్యము నవలంబించియున్నాఁడు. ఒకానొకరాజకుమారుఁడు "ఇళ" (Ida) యను రాజకుమారికి నొక్కొక్కఁ జాతకమును మదనదూతగాఁ బంపుట యీ 'చాతకగీతము' (చాతకదూత) లో వర్ణింపఁబడియున్నది. ఇందు 8 "త్రిపదలు" (మూఁడుపాదములపద్యములు) 24 పాదములుఁ గలవు. టెన్నిసన్ మహాకవి కీచాతకసందేశరచనావసరమున సంస్కృతదూతకావ్య ముపజీవ్య మైన దని నిస్సందేహముగఁ జెప్పనగును. ఈగీతము నించుక యుదాహరించెదను.

I "O Swallow, Swallow, flying, flying South,
Fly to her, and fall upon her gilded eaves,
And tell her, tell her what I tell to thee

IV O were I thou that she might take me in,
And lay me on her bosom, and her heart
Would rock the snowy cradle till I died

V Why lingereth she to clothe her heart with love,
Delaying as the tender ash delays
To clothe herself, when all the woods are green?

VII O tell her, brief is life but love is long

* * * *

VIII O Swallow, flying from the golden woods
Fly to her, and pipe and woo her, and make her mine
And tell her, that I follow thee."

—From the "Golden Treasury"- P. 364 Ed. Palgrave]

దూతకావ్యపరిణతి :— ప్రపంచమునందలి నిఖిలవస్తుజాతమును గాల సాహచర్యముచే నేవిధముననో పరివర్తనాదికము నొందుట సామాన్యనియమము. దూతకావ్యవిషయంబునంగూడఁ దద్వ్యతిక్రమము లేశమైనం జూపట్టదు. కాళిదాస 'మేఘదూత' యే యర్వాచీనదూతకావ్యము లన్నిటికి నుపజీవ్యము. ఇతివృత్తమునం దేమి, శయ్యాసంపదయం దేమి 'మేఘదూత' కు నీయర్వాచీనదూతకావ్యములకు నతిమాత్రసామ్యము గానవచ్చెడిని. కాలక్రమమునఁ గాళిదాసానుకృతు లగు నీదూతకావ్యము లన్నిటియందుఁ గూడ బరివర్తనము స్ఫుటముగాఁ గోచరించెడిని. అర్వాచీన దూతకావ్యములలో రసవిష

యాదికమునఁ గొన్నిమార్పులు చూపట్టెడిని, కాని యీమార్పులు కవితౌన్న త్యపోషకము లని ప్రతిపాదింపఁజాలము. ప్రాచీనదూతకావ్యప్రపంచమున నచే తనము లైనప్పటికి గమనశీలము లగు మేఘపవనాదులకు దూత్యము కల్పింపఁ బడుచుండెడిది. ఈకల్పన మనుష్యానుకవితానుసరణీయ మని నిశ్చయనీయముగఁ జెప్పవచ్చును. పిమ్మటఁ జేతనములయ్యును మానవభాషానభిజ్ఞములగు పక్షిప్రా తకాదులు దౌత్యకృత్యనిర్వహణమునకు నియోగింపఁబడినవి. తరువాత దౌత్య కర్తృకుశలు లగు మానవులవలెఁ, గతిపయకావ్యములలోఁ బురుషుఁడు గాని స్త్రీ గాని దయితాదికమునకు దూతగాఁ బంపఁబడినట్లు వర్ణింపఁబడుచుం డెను. [ఉదా: ఉద్ధవదూత ; శుకసందేశము ; విప్రసందేశము.] పిమ్మట నీకల్ప నము పరిణతినందఁ, జలచరహితములు, మానసైకగోచరములు నగు 'భక్తి' "శీలము", "మనస్సు" మొదలగునవి దౌత్యమునకు నియుక్తములు కాఁజొచ్చె ను, [ఉదా: భక్తిదూతి ; శీలదూత ; మనోదూత] దూతకావ్యము లిట్లు కాలక్రమమున వంతరార్థగర్భితకావ్యములు (Allegorical Poems) గాఁ బరి ణామించెను.

ప్రాచీనములు నవీనములు నగు ననేకదూతకావ్యకల్పలతలు శృంగారరస కల్పద్రుమము నుపాశ్రయించియుండఁ గతిపయనవీనకవులు దూతకావ్యమూ లమున 'శివేతరక్షతిం' బడయఁ గోరియు, ధర్మోపదేష్టం జూపఁగోరియు నింత వఱకు విప్రలంభశృంగారసుగ్రంథము నాశ్రయించిన దూతకావ్యకల్పలతల కు శాంతరసకల్పభూరుహము నాలంబనముగా నొనర్చిరి. దీనికిఁ బ్రథమసూచ న మహాదూతకావ్య మైనప్పటికి జినసేనుని "పార్శ్వాభ్యుదయము"న గోచరించు చున్నది.

కొందఱు కవిదార్శనికులు [Poet-philosophers] శాంతరసప్రధానము లగునీదూతకావ్యములద్వారమున మతవిషయములను [Religious tenets] వేదాన్త విషయములను (Philosophical doctrines) సర్వజన సుబోధములు గఁ జేసిరి. (ఉదా: "శీలదూత") ఇట్లు మతధర్మప్రకటనాభిలాష, దూత కావ్యపరిణతి కత్యంతము హేతుభూత మైనది.

జైనమతప్రచారకులు సుదూరస్థు లగు తమతమమతాచార్యులకుఁ దమ మత ప్రచారమునకై తాము చేసినకృషిం దెలిపెడి "విజ్ఞప్తిపత్రము"లనఁబడునుత్త రములు వ్రాయుచుండవలెను. ఇట్టి ప్రచారకులలోఁ గవనసామర్థ్యసంపన్నులగు

ననేకులు దూతకావ్యరూపమున విజ్ఞప్తిపత్త్రిముల రచించిరి. [ఉదా- చేతో దూత; ఇన్దుదూత].

"భక్తిదూతా"దులందు దూతకావ్యవ్యాజమున మానసోత్కర్షవిధాయకములగు గుణవిశేషముల సమాలోచన మొనరింపఁబడియున్నది. ఔర! శృఙ్గారరసాత్మకములును, శృంగారాంగీభూతములును, దూతప్రేషణప్రధానములునగు దూతకావ్యముల పరిణామ మెంతవిచిత్రముగా నున్నది! దూతకావ్యములయందుఁ గలిగిన యీయాకర్షణలే యవి సార్వజనీనాభినందనముం బడసె ననుటకుఁ బ్రబలోదాహరణములు. ఈకావ్యములు సార్వజనీనము లగుటం జేసియే దార్శనికులును, వివిధమతాచార్యులును సామాన్యజనుల కనాస్వాద్యములు ననభిరంజకములు నగు తమతమదార్శనికమతప్రసంగముల నీప నీప దూతకావ్యద్వారమున సర్వజనాభిగమ్యములుగ నొనరించిరి.

దూతకావ్యవైశిష్ట్యము:— గీర్వాణదూతకావ్య పఠనావసరమునఁ బాఠకుల కొకవిశేషము తప్పకస్ఫురించును. దూతకావ్యములు చాలవఱకుఁ బురాణాదిచేతివృత్తాత్మకములు. కవులు హిందువులైనచో హిందూపురాణోపవర్ణితము లగు సీతారాము, రాధాకృష్ణుల చరితము నధికరించియు, జైనులైనచో జినపురాణాదితము లగు నేమినాథ, పార్శ్వనాథ, స్థూలభద్రాదుల చరితముల నధికరించియు, దూతకావ్యములు రచింపఁబడుచుండెడివి. ఈ కావ్యములు సామాన్యముగా విప్రలంభశృంగారరసాత్మకములు. అర్వాచీనము లగు 'నేమిదూత' మొదలగు కొన్నికావ్యములు మాత్రము శాన్తరసప్రధానములు. శృంగారము రసములలో నగ్రగణ్య మని యనేకాలంకారికుల యభిమతము. శృంగారము రసరాజ మని యాలంకారికశిరోమణి యగుభోజదేవుఁడు 'శృంగారప్రకాశ' మను బృహద్గ్రంథమునఁ బ్రతిపాదించి యున్నాఁడు. కావునఁ గృష్ణగోపికాలీలల నధికరించి యనేకకవులు "శృంగార" దూతకావ్యముల రచించుట వింత కాఁజాలదు. హిందూకవులు వియోగావస్థయందున్న రాధాకృష్ణులకు, సీతారాములకుఁ దమదూతకావ్యములలోఁ బ్రాముఖ్య మొసంగియున్నారు. అర్వాచీనకవులలో నొకఁడును జర్విత చర్వణప్రాయ మగు రామకృష్ణులకథనే మఱలమఱలఁ దమదూతకావ్యములకు వస్తువుగాఁ గైకొనుట తప్ప, దూతకావ్యమున కత్యంతోచితమును, సర్వజనవిదితమును, నిఖిలలోకాభిరంజకము నగు నలదమయంతుల స్నేహకథం గాని, తత్సదృశము లగు

పౌరాణికగాథలం గాని తమదూతకావ్యముల కితివృత్తముగా స్వీకరింపరైరి. వంగదేశసంస్కృతకవులందఱు సాధారణముగాఁ దమదూతకావ్యముల రాధాకృష్ణ గాథాసుధాపరిషిక్తములుగాఁ జేసిరి. (శ్రీ)రామచన్ద్ర) యశోఘనసార సురభీకృతము లగుదూతకావ్యములు స్వల్పసంఖ్యాకములు మాత్రమే కలవు. (ఉదా: భ్రమరదూత XXIV చన్ద్రదూత IX.) అర్వాచీనదూతకావ్యముల లో రామకృష్ణచరితామృతమునకే ప్రాముఖ్య మొసంగఁబడుటకు, బహుశః, క్రీ. శ. 14, 15 వ శతాబ్దములలో భారతవర్షమున నందు ముఖ్యముగా వంగదేశమున వైష్ణవమత మత్యంతప్రాబల్యము వహించి యుండుటయే కారణ మని తోఁచెడిని. ధోయీ "పవనదూత" 'విజ్ఞప్తి' పత్త్రాత్మకము లగుదూతకావ్యములం దక్క, పురాణప్రసిద్ధి నొందని యైతిహాసికపురుషుని గాని, కాల్పనిక పురుషుని గాని యధికరించి వ్రాయఁబడినదూతకావ్యములు స్వల్పముగా మాత్రము చూపట్టెడిని.

దూతకావ్యములలో మఱొకవిశేషము. సాధారణముగా దూతకావ్య విరచకు లందఱు ఛందోఽన్తరమును విడచి, మందాక్రాంతమునే యాశ్రయించిరి. విప్రలంభశృంగారాభివర్ణనమునకు మన్దాక్రాన్తావృత్తము పరమోపయోగ మని మొదటఁ గాళిదాసకవీన్ద్రుఁ డుపయోగింప, నించుమించుగా నర్వాచీనకవు లందఱు గతానుగతికముగ, వృత్తాంతరము నవలంబింపక తమతమకావ్యములలో నీవృత్తమునే వినియోగించినట్టులు గానవచ్చెడిని. కాళిదాసాదులు చేతనదౌత్యముం గల్పింపక, యచేతనములనే దూత్యకార్యనిర్వహణమునకు నియోగించియుండిరి. ఈవైశిష్ట్యమే దూతకావ్యములకు రామణీయకాతిరేకము నాపాదించుచున్నయది. పురుషులు చేతనజ్ఞానసంపన్నులైనను, బురుషదౌత్యపరికల్పనవిషయకము లగుకావ్యములు రసికమనముల నరికట్టఁజాలవు. కాళిదాసాదులకావ్యము లందుచేతనే యచేతనదూతప్రేషణ విషయకములు గా నిర్మింపఁబడినట్టులు రసికచూడామణులు నుడువుదురు.

దేశభాషావాఙ్మయములలోని దూతకావ్యములు:— దూతకావ్యమువలె నేత్రశ్రవ్యకావ్యము గాని, దృశ్యకావ్యము గాని, రసికమనంబుల నరికట్టం జాలదయ్యె. సంస్కృతదూతకావ్యబాహుళ్య మొక్కటియే దీనికిఁ బ్రబలలక్ష్యము గాదు; అర్వాచీనకవులు కొందఱు దేశభాషలలోఁ గూడ 'దూతకావ్యముల' రచించియుండిరి. సింహళసారస్వతము (Sinhalese Literature) లో

దూతకావ్యము లసంఖ్యాకములుగానున్నవి.(ఉదా, 'మయూరసన్దేశము.' (6) 'కోకిలసన్దేశము' (7) మొద.) క్రీ. శ. 17 వ శతాబ్దిలో నరసింహదాసుఁ డనుకవి ప్రాచీనవంగభాషలో నొక 'హంసదూత'ను రచించెను. రఘునాథదాసుఁ డనుకవి (8) రచించిన సంస్కృత 'హంసదూత' [L VI సం.] కిది యనువాద మని ప్రతీతి. 'హంసదూత' యను నామముతో మాధవగుణాకరుఁడు, కృష్ణచన్ద్రుఁడు (9) నను నిరువురుకవీంద్రులు వంగభాషలో రెండుకావ్యముల రచించినట్టులు గ్రంథములవలనఁ దెలియుచున్నది.

*కాళిదాసుని 'మేఘసందేశ'మున కాంధ్రీకృతులంగూర్చి యితః పూర్వమే ప్రసంగించియుంటిమి. వేదాంతదేశికుల "హంససందేశము" పూర్వభాగము విద్వాన్ అభినవపండితరాయ మాడభూషి వేంకటాచార్యులవారి చేతను, ఉత్తరభాగము శ్రీమత్తిరుమలశ్రీ వేంకటవరదాచార్యులవారిచేత నాంధ్రీకరింపఁబడియున్నది.(10) తక్కినప్రాచీనసంస్కృతదూతకావ్యము లెవ్వియు నాంధ్రీకరింపఁబడలే దనవచ్చును. (11) *

6. Prof. Geiger in his '*Litteratur und sprache der Singhalessen*' mentions a good many *Duta Kavyas* at Pp. 9, 10, 11, 12, 15, 17.

7. *Ceylone Antiquary* Vol. III pp. 13 ff.

8. "వంగసాహిత్యపరిచయము" 850—60 పుటలు. డి సి. సేన్ పండితప్రణీతము (కలకత్తా విశ్వకళాపరిషత్ప్రకటితము)

9. 'వంగభాషాసారస్వతచరిత్ర' (D. C. Sen's *History of Bengali Language and Literature.* 225 పు.

10. వైజయన్తీముద్రాక్షరశాలయము, చెన్నపురి. 1901.

* 11. ప్రకృతము బరంపురనివాసు లగుశ్రీ నేమాని నరసింహశాస్త్రిగారు రమారమి రెండు పుష్కరములక్రిందట 'భూసురసందేశమ'ను సంస్కృతకావ్యము రచించిరి. దీనిని 19 సం. లక్రిందట భమిడిపల్లి సీతారామయ్యగారు (ఆత్రేయపురము) తెలిఁగించి 'కళావతి'లోఁ బ్రచురించిరి. మూలము నాంధ్రీకరణముగూడ నాకులభింపలేదు. ఆంధ్రీకృతి విమర్శము మాత్రము పిఠాపురములోఁ బ్రచురింపఁబడుచుండెడి 'కవిత'యను మాసపత్త్రికలోఁ జూచితిని.['కవిత' II సంపు. 2. సంచిక; జూలై 1911-2 పు];—ఈనడుమ, శ్రీకాకుళనివాసు లగు శ్రీసోమంచి వాసుదేవరావుగారు "సమీరసందేశ" మనుస్వతంత్రాంధ్రకావ్యమును రచించి ప్రచురించుట్టులు, తత్పీఠికను రచించిన శ్రీమల్లాది వేంకటవిశ్వనాథకవిరాజుగారివలనఁ దెలిసినది. ఇందు రమారమి, 150 పద్యములుగల దిఁట.విశ్వామిత్రతపోభంగము నొనరించుట కేగిన రంభయొద్దకు నలకూబరుఁడు 'సమీరము'ను దూతగాఁ బంపుట యిందలి యితివృత్తమఁట.

*రామకథాసుధామయ మగు ప్రత్యాంధ్ర ప్రబంధమునను హనుమత్సందేశము వర్ణింపఁబడియే యున్నది. నలచరితాత్మకము లగుభట్టహర్షుని 'నైషధీయచరితము' కృష్ణానందుని 'సహృదయానందము' [III సర్గ. హంససందేశము], మొదలగుసంస్కృతమహాకావ్యములయందును, శ్రీనాథుని 'శృంగారనైషధము' మొదలగునాంధ్ర ప్రబంధములయందును హంసదూత్య మభివర్ణింపఁబడి యున్నది. పింగళి సూరనార్యుని 'ప్రభావతీప్రద్యుమ్నము'నఁ గూడ నిట్టి చమత్కృతిం గనఁదగు. (12)

ఎలకూచి బాలసరస్వతిమహోపాధ్యాయుఁడు 'చంద్రికాపరిణయము' లో భృంగసందేశముం గల్పించియున్నాఁడు. (13) *

"ఉ. అక్కమలేక్షణ న్నవినయంబుగఁ గాంచుము నాదుమాఱుగా
మ్రొక్కుము సేమమా భువనమోహిని నీ కని పల్కు మార్చిచేఁ
జిక్కితి వేగఁ బ్రోవు మని చెప్పుము పొమ్మిఁకఁ దేఁటిరాయ నీ
త్రెక్కలమాటున న్నను భరించి లభింపుము కీర్తిపుణ్యముల్."

*పుసులూరి సోమరాజామాత్యుఁడు 'ఇందుదూత' యనునామాంతరము గల 'ఇందుశతకము'(14)ను రచించెను. ఇందు 116 పద్యములు గలవు. ఇతఁడు 200 సంవత్సరములకుఁ బూర్వము విలసిల్లియుండెను. ఇతని యితరకృతులు 'బాలగోపాలశతకము' 'కృష్ణలీలామృతము' 'నందనందనశతకము.' 'ఇందుశతకము' నందలి ప్రథమపద్యతురీయపాదము, శతకమున కంతకు మకుటముగానున్నది.

---

* 12. ఈవిషయము "శ్రీనాథసూరనలు—మరాళీవర్ణనలు" అను మ. వేంకటశాస్త్రిగారి వ్యాసమున వివరింపఁబడినది. [చూ. 14 వ సంవత్సరాదిసంచిక. 160-163 పు; 1923.].

* 13. వీరేశలింగముపంతులుగారి 'ఆంధ్రకవులచరిత్ర' 11 భా. 183 పు; 3 వ కూర్పు 1898.

* 14. 'ఇందుశతకము' శ్రీచెలికాని లచ్చారావుగారు ప్రచురించిన ప్రథమ"శతకసంపుటము"లోఁ బ్రచురింపఁబడినది; దీనినిగూర్చి శ్రీజనమంచి సీతారామస్వామిగారు "కవిత్వము చంద్రదూత" [ఆంధ్రపత్త్రికసారస్వతానుబంధము—దుర్మతి మాఘ శు ౧౮ శనివారము] అనువ్యాసమునను, "శతకప్రశంస" [ఆంధ్రపరిశోధకమహామండల—చిత్రాడ—పంచమవార్షికోత్సవసంచిక 26-33 పు; 1922] యందును, శ్రీవంగూరి సుబ్బారావుగారు "చంద్రదూతి" [సారస్వతానుబంధము, దుందుభి, చైత్ర శు ౧౧] యందును, "శతకకవులచరిత్ర" యందును, శ్రీపొన్నాడ కృష్ణమూర్తిగారు "పుసులూరి సోమరాజామాత్యకవి" [సారస్వతానుబంధము. దుర్మతి, ఫాల్గుణ బ ౧౨] యను వ్యాసమునను వివరముగా వ్రాసియున్నారు.* [E. K.]

ఒకానొకకాంత కృష్ణస్వామియందలి యతివేలమోహముచేఁ బరితపించుచు, నొకపున్నమనాఁటిరాత్రి చంద్రునిఁ జూచి యాతఁడప్పుడ బృందారణ్యమునుండి యరుదెంచినట్లుగ భావించి, తనహృదయాధినాథుఁ డగు శ్రీకృష్ణుం గూర్చియు, నందయశోదాదులం గూర్చియుఁ గుశలప్రశ్న మొనరించి, తన దుర్భరవిరహవేదనం జెప్పికొని చెప్పికొని, శ్రీకృష్ణుం దోడ్కొని రమ్మని పలువితములఁ బ్రార్థించుట యీశతకమున నభివర్ణింపఁబడియున్నది. ఇందలి మొదటి పద్యము నుదాహరింతును:-

"శా. బృందారణ్యము సేమమా? యచటిగోబృందంబులున్ లెస్సలా?
నందుండున్ సతియున్ సుఖాన్వితులె? నానాగోపగోపాలికా
సందోహంబులతో హలాయుధుఁడుఁ గృష్ణస్వామి క్రీడింతురా?
యిందూ! నందుని మందనుండి కద నీ వేతెంచుటల్ రాకలన్."* (E.R)

జైనకవీశ్వరులు - దూతకావ్యవికాసము.

దూతకావ్యవికాసమునకు జైనకవులసాహాయ్యము నొప్పుకొనక తప్పదు. మతదార్శనికసిద్ధాంతముల దూతకావ్యములద్వారమున మొదట లోకమునకు బోధించినవారు జైనకవీంద్రులే. క్రీ. శ. 8 వ శతాబ్దములో జినసేనుఁడు కాళిదాసుని 'మేఘదూత' నావేష్టించి 'పార్శ్వాభ్యుదయము'ను రచించినట్లు విదితపూర్వమే. చారిత్రకసిద్ధాంతములవలనఁ బ్రథమజైనాచార్యుఁ డని ప్రసిద్ధిగనిన పార్శ్వనాథునిపవిత్రచరిత్రము, నాతనిబోధనములును సర్వజనసులభములుగ నిం దభివర్ణింపఁబడియున్నవి. ఈకావ్యమున సమస్యాపూరక పద్ధతిని గాళిదాసీయ 'మేఘదూత'లోని ప్రతిశ్లోకతురీయపాదమును స్వీకరింపఁబడెను. ఆయాపాదములు గాళిదాసప్రయుక్తభావము తోడనే 'పార్శ్వాభ్యుదయము'న నుపయోగింపఁబడక, సందర్భౌచితి ననుసరించి యించుక భిన్నార్థములఁ బ్రయోగింపఁబడి యున్నవి. నేమినాథచరిత్రోపవర్ణనాత్మకమును, జైనకవియగు విక్రమకృతము నగు 'నేమిదూత'యందును బ్రతిశ్లోకాంతిమపాదమును గాళిదాసకృతినుండియే సమస్యాపద్ధతిని బరిగ్రహింపఁబడియె. ఇట్టిచమత్కృతి గలకావ్యములం గూర్చి యిదివఱకే యాయాస్థలములందు ముచ్చటించియుంటిమి. ప్రకృతము మనకు లభించిన (తెలిసిన) 73 దూతకావ్యములలో నధమము 10 కావ్యములైనను జైనకవికృతములు;-

1. ఇందుదూత:—వినయవిజయగణి [I సంఖ్య]
2. చంద్రదూత:—వినయప్రభువు (?) XI
3. చేతోదూత:— XIII
4. జైనమేఘదూత:—మేరుతుఙ్గకవి XIV
5. నేమిదూత: – విక్రమకవి XVI
6. పవనదూత:—వాదిచన్ద్రసూరి XIX
7. మనోదూత:— XXIX
8. మేఘదూత:—మన్త్రివిక్రమకవి XXXVI
9. మేఘదూతసమస్యాలేఖ: మేఘవిజయకవి XXXVII
10. శీలదూత:—చారిత్రసున్దరగణి XLIV

ఇందుఁ గొన్నికృత్రిమకవితావిలసితములే యైనప్పటికి, నాయాకవులకు గీర్వాణభాషయందుఁ గలప్రగాఢపాండిత్యమును విశదీకరించుటయే కాక, దూతకావ్యసారస్వతేతిహాసమున నీకావ్యము లభ్యుదయోన్ముఖ మగునొకదశను సూచించు చున్నవి. ఈక్రిందికావ్యముల నిందులకు లక్ష్యీకరింపఁదగును:.

1. 'చేతోదూత'.
2. 'నేమిదూత'.
3 'మేఘదూతసమస్యాలేఖ'.
4. 'శీలదూత'.

వీనిలోని ప్రతిశ్లోకతురీయపాదము నాసంఖ్యగల మేఘదూతశ్లోక తురీయపాదమే. కవితావైభవదరిద్రము లని వీనిని నిరసింపఁ జనదు. ఇవి కేవలము కాల్పనికము లగుటంజేసియు, సమస్యాపద్ధతిని 'మేఘదూత' ననుసరించుటంజేసియు, అప్రయత్నోద్భూత కమనీయకవితాభూషితములు ను, సరళభాషాభాసురములునుగాక, కఠినములుగను, గంభీరములుగను (Terse) గవిపాండిత్యప్రకర్షప్రకాశక శయ్యాసంపదోపేతములుగ నున్నవి. వీనివలనఁ గాళిదాసుని మేఘదూత కవితారత్నాకరమునందలి రత్నము లీకావ్యకనకమునఁ బొదుగఁబడి యుండుటంజేసి, యాయాకవులకాలమున మేఘదూతమూలమున నెన్ని శ్లోకములు కాళిదాసశేముషీసముద్భూతములుగ నెంచఁబడుచుండెడివో నిర్ణయించుట కవకాశము కలుగుచున్నది. అందుచేఁ గవిసార్వభౌముని సుప్రసిద్ధగ్రంథరాజములలో నొకటి యగు "మేఘదూత" మ్మూలమును, సాధ్యమైనంత

వఱకుఁ బ్రక్షిప్తశ్లోకరహితముగఁ గాళిదాసమేఘోద్భూత మగుశుద్ధపాఠమును సిద్ధాంతీకరించుటయం దీకావ్యము లమితోపకారకము లనుట నిశ్చయము.

మతసిద్ధాంతములు దూతకావ్యమూలమున సార్వజనీనము లగుట, యీకావ్యముల కపూర్వశోభాదాయకము. జైనకవికల్పిత దూతకావ్యములు హిందూకవినిర్మితదూతకావ్యములవలె శృంగారరసాత్మకములు గాక, శాంత భక్తిరసప్రధానములై విరాజిల్లుచున్నవి. ఇట 'విజ్ఞప్తిపత్త్రము'లం గూర్చి ముచ్చటించుట యప్రస్తుతము గాఁ జాలదు. జైనసన్న్యాసులు తమతమ మతాచార్యులకుఁ బర్యుషణపర్వావసరమున వ్రాయు లేఖలు 'విజ్ఞప్తి పత్త్రము'లనఁబడును. దూతకావ్యములవలె నిందును జైనపరివ్రాజకులు చేతోజలదాదుల మూలమునఁ దమమతాచార్యులకు సందేశము నంపుట యభివర్ణింపఁబడియున్నది. ఉదా:—చేతోదూత; ఇన్దుదూత; మేఘదూతసమస్యాలేఖ.]

దూతకావ్యములయందలి భౌగోళికవిషయవిచారము:—అర్వాచీనదూతకావ్యములలో మృగ్యప్రాయమనఁదగు దూతగన్తవ్యమార్గోపవర్ణనము దూతకావ్యములయందు మహావైశిష్ట్య మని యెంచఁదగు. తద్వర్ణనము ప్రాచీనభారతదేశమునందలి యనేకప్రదేశముల, నగరములఁ, బ్రాచీనసంస్థానముల నిరూపించుటకు విశేష మనుకూలించుచున్నది. ఇట్టులు బహుభౌగోళికవిషయద్యోతక మగునీవర్ణనము ప్రత్నతత్త్వగవేషణపరాయణుల దురదృష్టవశమున మనకు లభించిన దూతకావ్యములలోఁ జాలవఱకు గతానుగతికన్యాయమునఁ గవిసమయవిశిష్టమై యున్నది. అందుచే నత్యంతచేతోమోదావహములు నతిమాత్రోపయుక్తములు నగుభౌగోళికవృత్తాంతరత్నము లీకవితాసాగరములో గగనారవిందప్రాయము లైనవి. భౌగోళికవిషయములు భారతసారస్వతములలో మొత్తముమీఁద నత్యంతవిరళముగా నుండుటంజేసి, యీదూతకావ్యములయందు మనకు లభించినస్వల్పభౌగోళికవిషయములతోడనే తృప్తి నందవలసియున్నది. కాళిదాసాభివర్ణితమును, సుదీర్ఘము నగురామగిర్యలకానగరీమధ్యమార్గమునందలి భౌగోళికవిషయముల ననేకవిద్వాంసులు చర్చించి యుండుట సుప్రసిద్ధమే. ధోయీకవికల్పిత 'పవనదూత'లో మలయాచలప్రాంతమునుండి లక్ష్మణసేనుని రాజధాని యగు (వంగదేశమునందలి) విజయనగరమువఱకుఁ గలపథ మభివర్ణింపఁబడియున్నది. ఇందలి భౌగోళికవృత్తాంతము లనేకస్థలము

లం బరిపూర్ణముగం జర్చింపం బడియున్నవి. (15)కవితార్కికసింహు లగువేదాన్తదేశికులవారి 'హంససందేశము' న మాల్యవద్గిరినుండి లంకాద్వీపమువఱకుం గలమార్గము వర్ణింపంబడియున్నది. లక్ష్మీదాసుని 'శుకసందేశము' లో రామేశ్వరగుణపుర (Gunapura, probably to be identified with Trikkanapura near Cranganore) మధ్యస్థమార్గమునందలి కౌతుకోత్తేజకము లగు పట్టణములు, పుణ్యస్థలములు, నగములు, నదులు మొదలగునవన్నియు వర్ణింపంబడియున్నవి. "మేఘదూతసమస్యాలేఖ" లో అవరంగాబాద్ Auranga-vad or Avrangavadi నుండి ఘూర్జర (Gujarat) దేశములోని ద్వీపపురి (Div Bandar) వఱకుం గలమార్గము అతిసూక్ష్మదృష్టితో వివరముగా వర్ణింపం బడియున్నది. వినయవిజయగణి 'ఇందుదూత'లో యోధాపుర (Jodhpur) సూరత్తుపట్టణమధ్యస్థమార్గము వర్ణింపంబడెను. జైనకవినిర్మితము లగుపూర్వోక్త 'మేఘదూతసమస్యాలేఖ' యందును, 'ఇన్దుదూత' యందును దూతగన్తవ్యమార్గస్థము లగుననేకపట్టణములుం, బుణ్యస్థలములు నుల్లేఖింపంబడుటం జేసి, యీకావ్యద్వయముయొక్క ప్రాముఖ్యము ద్విగుణీకృత మగుచున్నది. వంగదేశోత్పన్నము లగుదూతకావ్యములు చాలవఱకు రాధాకృష్ణుల యనురాగాభివర్ణనాత్మకములే; అయినప్పటికి నీకావ్యములలో రాధాకృష్ణచరణచారజుష్టప్రదేశము లగుబృందావనము మథురానగరము (Modern Muthara) గోవర్ధనగిరి, యమునానది మొదలగువానిభౌగోళకవృత్తాంతము లెంతమాత్రము ద్యోతితములు గాకపోవుట యాశ్చర్యజనకముగా నున్నది.

దూతకావ్యరసాస్వాదనవ్యగ్రులును, ప్రబత్నతత్త్వానుశీలనపరాయణులు నగురసికావతంసులును దత్కావ్యపర్యాలోచనావసరమున భౌగోళికవృత్తసంకలనార్థము విశేషాభిముఖ్యము వహింపవలసియున్నది. ఇంతవఱకు నీభౌగోళిక విషయములు బహుపండితులదృష్టి నాకర్షింపకపోవుట విచారణీయము. దూతకావ్యగతము లగుసర్వవృత్తాంతములు సమాలోచింపంబడినచోం బ్రాచీన భారతవర్షీయనగరగ్రామాదుల స్థలనిర్దేశవిషయమై, యజ్ఞాతపూర్వము లగు ననేకోపయుక్తవిషయములు దృష్టిగోచరములు కాంగల వని యాశించుచున్నాము.

---

15. J. A. S. B 1905 (New Series) Vol. I Pp. 43—45; చిన్తాహరణచక్రవర్తి కృతమగు 'పవనదూత పీఠిక' 19—26 పుటలు.

# గణితసూత్రములు.

(చిన్నయసూరిగారి యక్షరగుచ్ఛములోనివి.)

పరుషంబులకు మీఁదఖరక్షరం బగు
సరళంబులకు హాఝుష్మలగు
ఉభయంబులకు నమాంతస్థంబులగు
వర్గసమంబులకు నగు
కతపఖఘనఫసలు సాకగు
తాదిపంచకమునకుశచవర్గములు లేవు
చఛఖమయలు రాకగు
జఝజమయరలవలు జాకగు
టాకు థనలలు లేవు
కగమరవహంబులకు ణకారం బగు
అనునాసికంబులకుస్వస్వవర్గంబులగు
జాకుం దఱచుగా నన్నియు నగు
మాకు నణాంతస్థంబు లగు
ణాకు నమయవలు నగు
నరలకు సర్వంబు నగు
ఛరఫలకు నకారంబు లేదు
ఛధలకు మకారంబగు
ఖరధరలకు రేఫంబు లేదు
ఝాకు యకారం బగు
ఫాకు వకారం బగు
యళలకు యలవలగు
కగపఫమయవలహలు ల్లాకగు

శాకు నమాంతస్థచఛశలగు
కటపఖరఫమయవషలు షాకగు
వాకు నాంతస్థము లగు
హాకు మకారంబు నగు
వికృతిని ఋగ్విసర్గ వర్గసమ జఞశషలు
లేవు
హాల్లు లెల్లం దమకుం దా మగు
హాకు యోగంబు లేదు
నరలలకు సర్వమగు
టతలు వాకు లేవు
సర్వంబునకుం గ్రారయగు
చరణహరలకు లేవు
కగచతపమలపలు డాకగు
టాకు నలలగు
తకారంబు సాకగు
ఉగ్గలి ముత్వ మక్షిప్పు చెయ్వులు, చెయ్యి
ఎద్దుట, చెద్దనము
అవశిష్టంబు గలిగిన శిష్టప్రయోగంబుల
గ్రహించునది
ఇందుఁ గావ్యవ్యవహార గోచర బుత్తే
నిరూపింపఁబడియె.

చపలత కుదాహరణము—

క. నారి హరిఁజూచె మృదుహా, హారాంశతఁ దరలదృగ్విహారము లెసఁగన్
హారములు ముట్టి చూచుచు, సారెకుఁ గర్ణోత్పలంబు చక్కఁగఁ జేయున్.

హర్షమున కుదాహరణము—

చ. సరసులఁ బద్మకుట్మలమిషంబునఁ జేసినతొంటిసీతప
శ్చరణఫలంబ యిప్పుడు కుచద్వయమూ యివె పూను మన్మనో
హరుఁ డగుకృష్ణుఁ డిచ్చిననిరంతరకల్పలతాప్రసూనసుం
దరవనమాలికామృగమదద్విగుణీకృతగంధబంధుతన్.

—। ఆవేగజడతలు ।—

క. క్రమమున నిష్టానిష్టా, గమచేతస్సంభ్రమమ్ముఁ గనుఁగొన నావే
గము; మఱి యిష్టానిష్టా, గమనాప్రతిపత్తినామకము జడత యగున్.

ఆవేగమున కుదాహరణము—

చ. అడరఁగ గోపకృష్ణుని విహారమహోత్సవభేరి మ్రోయఁగాఁ
బడఁతులు చూడ వేడ్కపడి భాసురరత్నవిభూషణాఢ్యము
ల్వెడ వెడ సంతరించుచును వీడ్వడఁ బూనుచు సంభ్రమింపుచు
న్వడిఁ జనుదెంచి యెక్కిరి సువర్ణమయోన్నతసౌధశృంగముల్.

జడత కుదాహరణము—

క. పటుగతిఁ గృష్ణుఁడు తనముం, గిటికిం జనుదేరఁ గని సఖీజనులకు ముం
దట నుపచార మొనర్పదు, నటు గదలదు గదలకుండ దతివ ముదమునన్.

—। గర్వవిషాదములు ।—

క. అవిరళమదమున నన్యుల, కవమానముసేఁతవలన నాత్మోత్కర్ష
వ్యవసాయత గర్వ; ముపా,యవిహీనత్వము విషాద మగుఁ జింతింపన్.

గర్వమున కుదాహరణము—

క. పెరుఁగుచు నఱుగుచు నుండును, హరిణాంకుఁడు కాలి గోర నైనను బోలం
డరయఁగ నావదనమునకు, సరి యెట్లగు నంచు నొకవ్రజస్త్రీ పలుకున్.

విషాదమున కుదాహరణము—

క. ఓరమణి నన్ను విడిచి ము,రారిఁ దగిలె మనసు నేనె యనుపఁగఁ జనియెన్
మారుఁడు నన్ను విడిచిపోఁ, డేరూపున నైన నింక నెయ్యది తెఱఁగే.

—॥ ఔత్సుక్యనిద్రలు ॥—

క. కడువేడుకపడి మనమునఁ, దడ వోర్వమి యుత్సుకత్వదశ; ప్రియుఁ గలలోఁ
బొడగనుచింత నిమీలన, మడరఁగ నిద్ర యనుపేర నభినుతి నొందున్.

ఔత్సుక్యమున కుదాహరణము—

క. ఎలమిఁ గైచేసి గోపిక, లలరన్ హరిఁ జూచువేడ్క లంతంతకు నొ
త్తిల నెట్టకేల కోర్చిరి, నలినాక్షాగమవిలంబనము హృదయములన్.

నిద్ర కుదాహరణము—

క. ఒడికం బగు హరిఁ గలలోఁ,బొడగని యుపగూహనేచ్ఛఁ బొరయుటఁజూడీ
వెడ మొగిచినకన్నులతోఁ,బడఁతిబయల్వొదువఁదొడఁగెఁ*బాణిపుటములన్

—॥ అపస్మారసుప్తులు ॥—

క. భావింప మోహదుఃఖా,ద్యావేశము తాపకారి యగుచు నపస్మా
రావహ మగు; నేమిటనుం, బోవని సుఖనిద్రపేరు భువి సుప్తియగున్.

అపస్మారమున కుదాహరణము—

చ. అలఘుతరోగ్రవక్త్రుఁ డగు నంగభవుం గలలోనఁ గాంచి తొ
య్యలి తనుఁ గావు కావు మను నస్ఫుట వాక్యము లుగ్గడింపుచుం
బిలుచుఁ బికద్విరేఫములఁ బిల్వదు చేరువ నున్న బోటులం
దలరుచు లేచి త్రిమ్మరు గదాధర నైకొనఁ బంత మిత్తఱిన్.

సుప్తి కుదాహరణము—

క. నలినోదరు మృదులాంకము, తలగడగా నిద్రనొంది తరుణి ప్రభాతం
బొలసిన సుఖపరవశతం, దెలియ దతఁడు మేను సఱచి తెలుపుచునుండన్.

—॥ ప్రబోధామర్షములు ॥—

క. తెలిసి కనువిచ్చి గొబ్బున, నలవడఁ జూచుట ప్రబోధ మది; మఱి యపరా
ధుల మెడఁ జూచుచుఁ బైకొను,నలుక యమర్ష మని తెలియుఁ డది భావజ్ఞుల్.

ప్రబోధమున కుదాహరణము—

క. నిద్రాపమయంబున బల,భద్రావరజుండు పాణిపంకజముల ను
ద్యద్రాజవదనకుచములు, ముద్రించినఁ దెఱచె నేత్రములు సంప్రీతిన్.

అమర్షమున కుదాహరణము—

క. భానుఁ డపరగిరి దాఁటిన, మీనాంకుఁడు గోపసతులమీఁద నమర్షా
నూనమతి నిఱుచాపము, తా నందె ముకుందుఁ డచటఁ దడయుట తగునే.

—॥ అవహిత్థోగ్రతలు ॥—

క. పోడిమినహ్లాదులయెడ, నడఁకువ దెచ్చికొని యుండు టవహిత్థ మగున్
వడిఁ బ్రతిపక్షులఁ బోడ గని, యొడఁగూడిన చండభావ ముగ్రతయయ్యెన్.

అవహిత్థ కుదాహరణము—

క. తరుణులు గోష్ఠివశంబున, హరిగుణములు చెప్ప నవనతానన యై తాఁ
జరణాంగుష్ఠంబును గొని, వరవర్ణిని భూతలంబు వ్రాయుచునుండెన్.

ఉగ్రత కుదాహరణము—

క. ఆచెలువకటాక్షోల్కా,గోచరమై మిగులఁ గందెఁ గుసుమాస్త్రుచే
నీచెలువకుఁ దాపప్రశ,మోచితముగఁ గూర్పుమా పయోరుహనాభున్.

—॥ మతివ్యాధులు ॥—

క. దీనికి నిది యర్థం బని, కానుపు దత్పరత చేష్ట గలుగుట మతి; యొం
దేని నొక రోగమున నవ,మానంబునఁ బొడము దర్తనము వ్యాధి యగున్.

మతి కుదాహరణము—

క. నాతీ సంశయ మేల మ,హీతలమునఁ జంద్రుఁ డగు నుపేంద్రుఁడు వినుమా
యాతనికరములు సోఁకిన, వ్రేతలు శశికాంతమణులవిధమై యునికిన్.

వ్యాధి కుదాహరణము—

క. తరుణి హరిఁ బాసి* డెందం, బెరియఁగ శశికాంత సౌధమెక్కిన నచటం
దరుణదళవ్యజనముఁ గ,ప్పురమును బూఁబాన్పుఁ గావిపుట్టము వలసెన్.

—॥ ఉన్మాదచరమములు ॥—

క. ఇది చేతనం బచేతన, మిది యని వివరింపలేని దిల నున్మాదం;
బదయతఁ బరమార్థోచిత, సదుపాయముఁ దలఁచెనేని చరమాఖ్యయగున్.

ఉన్మాదమున కుదాహరణము—

క. బృందావనమున కోకవని,తం దోకొని కృష్ణుఁ డరుగఁ దక్కినవనితల్
కందర్పవిక్కృతి నడుగుదు, రందలి తరువులను లతల నాతనిత్రోవల్.

చరమమున కుదాహరణము—

క. మురరిపుఁ డరుదేరని తన,శరీర మేటికని యొకవ్రజస్త్రీ గోరుం
బరిపూర్ణచంద్రపొడుపును, సురభిసమీరాగమంబుఁ జూతాంకురమున్.

---

* హరిబాళి.

## — ॥ త్రాసవితర్కంబులు ॥ —

క. ఏమఱుపాటునఁ జిత్తము, తా మిగులం జెదరెనేని త్రాసం బయ్యెన్;
వేమఱు బహుసంశయములఁ, దా మదిఁ దలఁపోయునది వితర్కం బయ్యెన్.

త్రాసమున కుదాహరణము—

క. ఒకగోపిక లక్ష్మీనా
యకుతోఁ బొలయలుకనుండ నద నెఱిఁగినయ
ట్లొకయుఱు మప్పుడ యుఱిమినఁ
జకితహృదయ యగుచు నతనిఁ జయ్యనఁ బొదివెన్.

వితర్కమున కుదాహరణము—

ఉ. అక్కటనామనం బతనియందు దృఢంబుగ నిల్పి వెండి యొం
డెక్కడనేనియు న్సొగయ దించుకసేపును నాజనార్దనుం
డెక్కడ నామనోరథము లెక్కడ యెక్కడికెక్కడంచు నే
దిక్కును జేరలేక సుదతీమణి దాఁ దలపోయు నాత్మలోన్.

క. పాటించి యొనర్చితి నీ, పాటిఁ ద్రయస్త్రింశదుదితభావార్థంబుల్
తేటపడఁ ద్రయస్త్రింశ, త్కోటిదివిజసేవ్యమానకోమలపాదా.

క. ప్రకటముగాఁ రత్యాదిః ప్రకరణ మది యింక నవులఁ బ్రణుతింపనగున్
సుకవు లలర శృంగార, ప్రకరణమును నాయకోత్కర ప్రకరణమున్.

క. నవనీతరసవిలోలుఁడు, భవనీరధితరణకరణపరిణతుఁడు సుధా
ర్ణవతల్పుఁ డనంతుఁడు మా, ధవపురిమందిరుఁడు వ్రజవధూవరుఁ డుర్విన్.

గద్యము—ఇది శ్రీవాణీవరప్రసాదలబ్ధవాగ్విభవ తిక్కనామాత్యసంభవ సుకవిజనవిధేయ అనంతనామధేయప్రణీతం బైన రసాభరణంబునందు రతిగుణోత్కర్షంబును సజాతీయవిజాతీయనిర్దేశంబును విభావానుభావసాత్త్వికభావసంచారికభావంబుల లక్షణంబులును రత్యాదిప్రకరణము నన్నది

ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు.

# ర సా భ ర ణ ము.

## తృతీయాశ్వాసము.



క. శ్రీశుఁడు శృంగారరసా,ధీశుఁడు ధువపట్టణేశుఁ డింద్రాదిదిశా
ధీశమనోహరుఁడు హృషీ, కేశుఁడు రక్షించు రుక్మిణీశుఁడు మమ్మున్.

క. మఱి సర్వరసోత్కృష్టత, నరయుచు బహుసంపదలకు నత్యాస్పద మై
మెఱసిన శృంగారరసము, తెఱఁ గంతయు విస్తరింతుఁ దేటపడంగన్.

మ. భువి శృంగారము రెండుచందములు సంభోగంబు నవ్విప్రలం
భవిధంబు న్మఱి విప్రలంభము చతుర్భావంబులై యుండు నె
య్యవి యంటే నభిలాష యీర్ష్య విరహాఖ్యానానువాసంబు లి
ట్లు వివేకింపఁదగు న్విచక్షణులు త్రైలోక్యైకరఝామణీ.

క. ఆలోకనభాషణములు, నాలింగనచుంబనములు నాదిగ నెన్నం
జాలిన బహురతితంత్ర, శ్రీ లవి సంభోగనామశృంగారంబుల్.

అభిలాషాదులు—

ఉ. చూచితి నేత్రపర్వముగ శూరకులాంబుధిచంద్రుని న్ససఖా
వీచులకంటెఁ దియ్యనయి వీనుల సోఁకెఁ దదీయవాక్యముల్
నాచనుదోయి కబ్బె జతనంబుగఁ దత్పరిరంభసౌఖ్యము
ల్వాచవి చేసె నవ్విభునివాతెఱ ధన్యత నొందితిం జెలీ.

చ. కలయకమున్ను రాగ మధికం బగునే నభిలాష యిద్దఱుం
గలసినమీఁదఁ బాయుట తగ న్విరహంబు నిజేశుఁ డొండు తొ
య్యలిఁ గవయంగ నవ్వనిత యగ్గుట యీర్ష్య విదేశవాసుఁడై
నిలుచుట దా ప్రవాసము గణింపఁగ నన్నియు విప్రలంభముల్.

వ. అభిలాషహేతుకం బగు విప్రలంభం బెట్టి దనిన.

ఉ. వీనుల కింపొనర్చు వరవిందదళేక్షణురూపసంపదల్
గానఁగఁ గోరు లోచనయుగం బిదె యిప్పుడు తృప్తిఁబొందె నా
మేనికి ఘ్రాణజిహ్వలకు మేలగుసౌఖ్యము లెప్పు డబ్బునో
మానిని యింతలోన నవమన్మథుఁ డెంత యలంచునో కదే.

వ. ఈర్ష్యాహేతుకం బగు విప్రలంభం బెట్టి దనిన—

ఉ. ఏమని యెన్నవచ్చుఁ గమలేక్షణుచేఁతలు నాకు నిచ్చటం
బ్రేమ నటించి పోయి పరభీరుత భీరును నొయ్యఁ జేరి పో
రామి యొనర్పఁ జొచ్చె నుడురాజముఖి కనుఁగొంటె యింకఁ దా
నామెగ మెల్లు చూచుఁ*దగునా తన కీకపటప్రయోగముల్.

వ. విరహాఖ్యానహేతుకం బగు విప్రలంభం బెట్టి దనిన.

ఉ. తాను నేను గూడి విరిదమ్మికొలంకులపొంతఁ బుష్పితా
నూనరసాలసాలములయొద్ద లతాసదనంబులందు నిం
పూనఁగ సంచరించుగతు లుల్లమునందుఁ దలంపఁ బాడిగా
దే నలినాక్షుఁ డేల చనుదేఁడు సఖీమణి యేమిచేయుదున్.

వ. ప్రవాసహేతుకం బగువిప్రలంభం బెట్టి దనిన-

చ. మధురకు నేగుచుండి మధుమర్దకి నగ్గొనిపోవఁ బాపమే
బు ధనిధి యిప్పు డేల కొనిపోవు నటంచు మది న్వియోగతో
యధిఁ బడి గోపకాంత భయమందు; ముకుందుఁడు నవ్వఘాటియే
విధమునఁ దూలునో వ్రజవీథులనంచుఁ దలంచుఁ గూర్మిన్.

క. ఇట్టుల మఱియును సొగసు, తన్నునఁ గరుణాత్మకాభిధానం బన ర
మ్య స్మయమానాఖ్యవియో, గమ్ము నవం గృతుల రెండుగతు లైయుండున్.

క. వనితపరోక్షంబునఁబతి,యును బ్రియుని పరోక్షమునఁ బయోజాక్షియు రో
దన మొనరించుట వర్ణిం, చినఁ గరుణాత్మకవియోగశృంగార మగున్.

—॥ ఉదాహరణము ॥—

చ. జగమునఁ బుష్పదామకము చంపెడి దయ్యెను నాయురస్థలిం
దగిలి యిదేల చంపదు నితంబిని నేటికిఁ జంపెనో విషం
బగు నమృతంబు నొక్కసమయంబున నావిషము న్సుధారసం
బగు విధిచేత లిట్టివి గదా యని పొక్కు నజుండు నెవ్వఁగన్.

ఉ. ఎక్కడికేగితే మదన యిందుఁడు గంధఁడు శూలిచేత నిం
కెక్కడ నింత పుట్టు నని యేర్పడ నింత యెఱింగి యక్కటా
మక్కువ నుప్పతిల్లుటలు మాని శిలాప్రతిమావిమానతన్
మిక్కిలి వాసి గాదె తరుణీతరుణావలి నీవు లేనిచోన్.

క. మానిని పతియెడ నేమిట, నేని యతని గవియనొల్ల నే నని మిగులం
బూనినయునికికి వర్ణన, మానాఖ్యవియోగ మనఁగ మహిలోఁ జెల్లున్.

---

* దగు నాతని కీ-

ఉ. మానమ యూఁది నే నతని మానితిఁ బొమ్మని పాసియున్నచోఁ
దానును మోసపుచ్చి సతతంబును గృష్ణుని తోడిగోష్ఠికి
న్నానస మేల పోవు తుది నన్నును బాదుగదల్చునో కదా
వానిచలంబె చెల్లు నని వందుఁ దళోదరి సంశయంబునన్.

వ. మఱి ద్వాదశావస్థ లెట్టి వనిన:

క. అరయఁగ శృంగారం బం, కురితము మఱి పల్లవితము కుసుమిత మనఁగాఁ
బరువడి ఫలితంబునునై, పరఁగు నవస్థాంతరములు పంక్తిం దగుచున్.

వ. కొందఱనుతంబున దశావస్థ లనియుం జెప్పు నవి యట్లుండెఁ గామశాస్త్ర నుసారంబు లగుద్వాదశావస్థ లెట్టి వనిన చక్షుఃప్రీతి, మనఃసంగంబు, సంకల్పంబు, ప్రలాపిత, జాగరంబు, కార్శ్యంబు, అరతి, లజ్జాత్యాగంబు, సంజ్వరము, ఉన్మాదంబు, మూర్ఛనంబు, చరమంబు నాఁ బరగు వీనిలక్షణంబున కుదాహరణంబులు.

---

క. ప్రియు నాదరమునఁ జూచుట, నయనప్రీతియగు; మఱిమనఃసంగ మగుం
బ్రియుదెసఁజిత్త మిడుట; ని,శ్చయముగఁ బ్రియువలనికోర్కి సంకల్పమగున్.

చక్షుఃప్రీతి కుదాహరణము—

చ. విమలకపోలభాగముల వెన్నెలనిగ్గులలీల మందహా
సములు నటింపఁ గన్గొనలచాయఁ దటిల్లత లంకురింప దే
హము హరినీలరత్ననివహద్యుతితోఁ దులఁదూఁగ సర్వలో
కము నలరించుశౌరిఁ బొడగంటి సఖీ ధ్రువపట్టణాధిపున్.

మనస్సంగతి కుదాహరణము—

చ. భ్రమరము కమ్మదేనియలు పాయలుగ్రోలుచుఁ దత్ప్రసూనగు
చ్ఛములఁ బ్రసక్తమై వెలయుచాడ్పున నాహృదయంబు చూచితే
కమలదళాక్షి యాదవశిఖామణిభవ్యగుణామృతప్రవా
హముననె యోలలాడుచు నొకప్పుడు నన్నుఁ దలంప దేమియున్.

సంకల్పంబున కుదాహరణము—

ఉ. త్రిప్పులఁ బెట్టి నన్నిటు రతిప్రియుబారికిఁ ద్రోచి నెమ్మదిం
గొప్పునఁ గమ్మక్రొవ్విరులకు న్మధుపంబులు సందడింపఁగా
నొప్పులకుప్పయై ధ్రువపురోజ్జ్వలవీథులఁ గ్రాలుశౌరి నే
నెప్పుడు చూతునో క్రొమెఱుఁగెక్కినచూపులు చొక్కళింపఁగన్.

---

క. వెలయఁగఁ బతిఁ గొనియాడుట, తలఁపఁ బ్రలాపిత; మనోవ్యథంబొరలుచుఁ గో
మలి కనుమూయమి జాగర, మలఁత తనుత్వంబు కార్శ్యమనియెడు పేరన్.

ప్రలాపిత కుదాహరణము—

చ. రసికుఁడు దానశోభి మధురప్రియభాషణశాలి సంతతో
ల్లసితముఖారవిందుఁడు కళానిధి సౌమ్యుఁడు యౌవనద్యుతిం
బసగలవన్నెకాఁడు ధ్రువపట్టణనాయకుఁ డంచు జాణ లిం
పెసఁగఁగఁ బ్రస్తుతింతురు గదే యతఁ డేటికి రాఁడు నెచ్చెలీ.

జాగరమున కుదాహరణము—

చ. గెలిచితి నెట్టకేల కరిగెన్ దిన మంచు మదిం దలంపఁగా
నొలసినయీనిశాసమయ ముత్పలబంధునిఁ దెచ్చె వాఁడు వె
న్నెల వలవైచె మీఁద రమణీ మొరసె స్మరువింటినారి య
న్నలినదళాక్షుఁడుం దడసె నా కిటఁ గంటికి నిద్ర వచ్చునే.

కార్శ్యమున కుదాహరణము—

ఉ. నీదగులీల యద్భుతము నీరజలోచనునంగుళీయకం
బౌదట సందిదండ యగునా మహి నెవ్వరికైనఁ గానుసుం
జేవ యనంగ దేహమును జేదగిఁ జెందుదు దిని కింక నీమనః
ఖేదము మాను మమ్మ యెఱిఁగించెద నింతయుఁ గైటభారికిన్.

---

క. వరునిదెస వేడ్క యుడుగుట, యరతి; నిజాచార మెడల నందినప్రేమ
త్తఱి లజ్జాత్యాగ; మనా, స్మరపరితాపంబు పేరు సంజ్వర మయ్యెన్.

అరతి కుదాహరణము—

ఉ. కైరవబంధుబంధురవికాసవిలాసము లేల మందసం
చారిత నొప్పు నమ్మలయశైలసమీరము లేల యొప్పునీ
కీరముపల్కు లేల పరికింపఁగ నవ్వనలీల లేల శృం
గారము లేల నాకుఁ జెలి కంజదళాక్షుఁడు రాక తక్కినన్.

లజ్జాత్యాగమున కుదాహరణము—

చ. అలికులవేణి యేది సమయంబుగఁ జేసిరి మున్ను భూమిలో
లలనలకెల్ల నీవది యలంఘ్యముగాఁగఁ దలంపుమమ్మ పూ
విలుతునిచేతలంగలఁగి వేఁబొకత్రోవలఁ బోకుమమ్మ నీ
ఖులువడి చూడుమమ్మ కమలేక్షణుఁ దెచ్చెద నింతలోపలన్.

ధర నర్థులకు నన్నదానంబు సేయక యన్నపెండ్లినిమిత్త మాఁచినావా
వరసువర్ణము భక్తవర్గంబు కీయక పట్టంబు కానికల్ గట్టినావా
యేమికారణమోయయ్యయిట్టివేళఁ,గరుణచేయవునీభక్తకలితులందు,శూర.
చకచక మనిపించు సంకొక్క చేతను మొనసి పట్టినశూల మొక్క చేత
సానఁదీఱిన మంచి శక్త్యొక్క చేతను నుక్కైనతోమర మొక్క చేత
దంబైన బల్లుద్గరం బొక్క చేతను నురుభిందిపాలంబు నొక్క చేతఁ
దపనీయరత్నకోదండంబు నొకచేత నొఱపైనబాణంబు లొక్క చేత
నొకటఁబాశంబునంకుశంబొక్క చేత,నభయదరముద్రలగుచేతులమరియుండి
ప్రబలశౌర్యము మదిలోనఁ బట్టలేదొ, సుకవిజనగేయ శ్రీబాలసుబ్బరాయ.
ధరణిలో వర్షంబు గురియక హాలికుల హాహారవంబులే యధికమాయె
గుత్తపల్లియ లెత్తికొని విప్రజనములు కుందాలపోట్లచేఁ గూయుటాయె
సర్వమాన్యము లేక సజ్జనావళులకుఁ బృథివిలోపలఁ గూడు బెల్లమాయెఁ
గవితాప్రసంగముల్ గైకొని యీలేని పటులోభివర్గంబు ప్రబలమాయె
నిట్టులైనను నీభక్తు లేవిధమున, బ్రతుకనేర్తురు పలుకవే బాహులేయ
నీవెగతిగాని యితరుల నేను డాయ, సుకవిజనగేయ శ్రీబాలసుబ్బరాయ.
అనుదినంబును నిన్నుఁ గొనియాడుభక్తుల కిష్టంబు లీయ నీకేమి కఱవొ
పూఁటపూఁటకునిన్ను మొరవెట్టుజనమును బ్రేముడించుటకు నీకేమి కఱవొ
పెనుప్రాపుగను నిన్ను వినుతించుపేదల నిలఁ గటాక్షించుట కేమి కొఱఁత
భద్రాత్మకా నిన్ను భజనచేసెడి కవి స్తోమంబుఁ బ్రోవ నీ కేమి లేమ
సర్వసర్వజ్ఞ సుతుఁడవై సాధుజనుల
జాలిఁబడఁజేయు టది నీకు మేలుగాదు, శూర. ౩౫
ధర గురుద్రోహిని శిరసావహించిన యుగ్రశూలికి నీవు నుదయ మగుట
మర్యాద యని లేక మగనితో నెదురాడి కూతాడు కాళికిఁ గొడుకు గనుక
కువలయంబునఁ బుట్టుగొడ్డుబాఁపనవారి తోడ వే పుట్టినవాఁడు గనుక
దాన మిచ్చినవాని తలమెట్టి నపకారిమేనల్లుఁడైన విన్నాణి గనుక
యెగ్గులేకనునిన్నాశ్రయించుజనుల,జాలిఁబెట్టేవువరములీఁజాలకిపుడు,శూర.
ఈశ్వరా నిను నమ్మి యింతదారిద్ర్యంబుచేత జాలిఁబడంగఁ జేయవలెన
కరుణాకరా నిన్నుఁ గాచియుండియు నింత త్రొక్కటలో నన్నుఁ ద్రోయవలెన

మీసరక్షక నిన్ను వేనోళ్లఁగొనియాడి దుర్దశ లింకను వొడరవలెన
యార్తశరణ్య నిన్ననుదినంబును గొల్చి వరబుణగ్రస్తుఁడై తిరుగవలెన
స్వామి చేసినద్రోహంబు లేమి నీకు,నించుకైనను దయరాద యిట్టివేళ, శూర.

స్వామి యెప్పుడు మంచిసమయంబు ధనముల నిచ్చిప్రోచుటకు నోయీశతనయ
వేలాయుధా మంచివేళ యెప్పు డభీష్టసిద్ధు లిచ్చుటకును శివకుమార
ఘోరపాతకమహాదారిద్ర్యములు గొట్టి సంపద లీవయ్య శాంభవిసుత
వీరాధివీర మాయూరవాహన నవ్యభద్రంబు లీవయ్య బాహులేయ
నామొరాలించునిన్ను నేనమ్మినాఁడ, వరదసుఖపాపదవశిఖివారివాహ, శూర.

నీకు దారిద్ర్యమా నీతల్లి రాజరాజేశ్వరి యై కీర్తి నెసఁగ లేద
నీకేమి త్రొక్కట నీతండ్రి యసమానభర్మచాపము చేతఁ బట్టలేద
నీకుఁ బేదటికమా నిరుపమరజతాద్రి యెల్లను సొంతమై యెసయలేద
నీకేమి లోభమా నిఖిలదేవతలలో నన్న దానయశంబు నొంద లేద
భక్తసందోహపరితాపభంజనైక
బిరుదు గలిగియు న న్నేల సరకుగొనవు, శూర. ౮౧

లోకభీకరుఁడైనకైకేశితనయుని నద్రిక్రిం దణఁచిన హరకుమార
* * * * *
* * * * *
* * * సంసిక్తవసుమతీచక్రముగను
అట్టహాసంబు చేసె బ్రహ్మాండ మదర, వెడలఁగా రావె యిటువంటివేళయందు
సూరకున్నాఁడ యాకాలభైరవుండు, శూర. ౮౨

చటులసింధురఘటాపటలచలత్కర్ణవాతాహతైకజీమూతములుగఁ
గింకిణీయుతధనుష్టంకారనినదంబు రోదసీకుహరంబు భేదిలంగఁ
జెంగావిపావడచుంగుకాంతిచ్ఛటల్ కుటిలారిచిత్తము ల్వ్రీలిపడఁగఁ
గహకహ మని భూతగణమహారభసంబు విన్నంత శాత్రవు ల్తన్నికొనఁగఁ
బుడమి యొరయంగ హరిహరపుత్రుఁడొకఁడు, చాలఁడానీచసంతతిన్ సంహరింపఁ
బాలుపోలేక సెలవిమ్ము బాహులేయ, సుకవిజనగేయ శ్రీబాలసుబ్బరాయ.

సమయంబునకు లేనిజముదాడి యదియేల వేళకుఁ బూననిశూల మేల
తఱిచూడకున్న కోదండబాణములేల జన్యంబు సేయని శక్తియేల
పీఠంబులేసి మయూరవాహన మేల శృంగారమునకు వజ్రాంగి యేల

దండెత్తలేకున్న దళవాయితన మేల గోసంబు లేకున్న మీసమేల
కొట్టి గోడించి మ్లేచ్ఛుల గుట్టగూల్చఁ
మట్టు సేయకయుండినమహిమ యేల, శూర. ౮౯

వేకుల్లకుల్లాయి లేకున్నదానికు నీటుబైనట్టి కిరీట మేల
ధరనల్లకంబుల దారము ల్తగలవా రమణీయరత్నహారంబు లేల
డంబుక న్బైరియు చోటను గట్టెదొరకదా కరమున సునిశితఖడ్గ మేల
... ... ... ... ౯౦

సంగీతరసకావ్యశృంగారములు పల్కు టవి యేవి రసనకుఁ జవుగాదు
మేలుపాగలు గట్టి మొలఁగుతురాళ్ళెక్కి సభఁగూర్చి శిష్టభూషణము గాదు
... ... ... ...
... ... ... ...
నిన్నుఁ బూజించి విని మెచ్చి సన్నుతించి
భక్తి ముక్తుల జన్మసాఫల్య మగును, పన్నగసహాయ* ౯౧

కోటివిద్యలు గల్గి కూటిచింతలె కాని ధీశక్తి నిన్నుఁ బ్రార్థింపలేరు
పరధనపరదారబంధుహింసయె కాని మఱి తాము చెడిపోవు టరయలేరు
ధనరాసు లార్జించి తా భుజింపక పూత్తు రయ్యయో ఘనదాన మియ్యలేరు
తనయౌవనము రిత్తదాసికి త్తురు గాని కులపాలికలఁ గూడి మెలఁగలేరు
పూర్వజన్మంబులో నిన్నుఁ బూజసేయ, లేనిదోషంబుగాక వల్లీహృదీశ, పన్నగ.

సౌందర్యలావణ్యసతు లెందఱుండిన మదిలోని తాపంబు మాన్పలేరు
గజతురంగశతాంగఘనభటు ల్గలిగినఁ జిత్తవిభ్రమముఁ బాసింపలేరు
ధ్వజహర్మ్యరత్నసౌధాదులు గలిగిన హృదయంబునను మోద మొదవనీదు
వెండిబంగారు లెంత కొండలై యుండిన నంతరంగభ్రాంతి సణఁగనీదు
నిన్ను సద్భక్తిఁ బూజించి సన్నుతింప, లేనిమనుజులకిలను వల్లీహృదీశ, పన్నగ.

సరసస ప్తద్వీపసామ్రాజ్యమోదంబు బాలభాషకు నీడు పట్టఁదగదు
యక్షేశసమ స్తునిక్షేపహర్షంబు బాలభాషకు నీడుపట్టరాదు
సుఖదవీణాలాపశుకశారివచనముల్ బాలభాషకు నీడు పడయరాదు

---

* ఇచటినుండి శూరసంహార పదమునకు “పన్నగసహాయ” యనుచున్నాఁడు కారణము స్ఫూర్తి
యొట్లుచేయవలెనో-

మహిమశర్కరసుధామధురసామోదముల్ బాలభాషకు నీడు పోలరాదు
బాలపుత్త్రులమాట లేవేళవినెడి,జనులభాగ్యంబునీకటాక్షంబుగాదె,పన్నగ.

కరుణించు మనుచు నేకాగ్రచిత్తముతోడ వినుతించుటెల్ల నీ వెఱుఁగలేదొ
కావుకావు మటంచు నేవేళ నినుఁబ్రార్థించుదుట లక్ష్యమై చూడలేదొ
పాలించు మనుచు నేవేళ నే మొరపెట్ట దేవసేనాధీశ తెలియలేదొ.
కుక్షింభరంబుకై రక్షించు మనుటెల్ల వీక్షించుటకు నీకు వేళగాదొ
యెంతరాజసమైనను నిట్టివేళ,నింతచూచిన నేభాగ్యవంతుఁడౌదు,పన్నగ.

కాసుకాసుకు వక్షికాంచనం బాశించి కొండపై నెక్కె నీకూర్మిమామ
బిచ్చమెత్తినదూక బేరమాడుటకునై ధనపతిఁ జేరె నీయనుఁగుఁదండ్రి
రాజ్యాభిలాషచే రజతశైలముఁ బాసి పుట్టిని లైడఁబాయఁ బోదు తల్లి
త్రోవచూచుచు నుండు నేవేళఁ బరులచే మోదకాసక్తిచే సోదరుండు
ఇష్టదేవత లీవేస మెట్టి రనిన,నీమతంబేమొ తెలుపుముసోమతనయ,పన్నగ.

తల్లిగర్భమునుండి ధరఁ బుట్టినదె కాని శివవిష్ణుపూజ నేఁ జేయలేదు
విప్రవంశము నుద్భవించి యుండుటె కాని జపతపానుష్ఠానసరణి యెఱుఁగఁ
దనువెత్తి కుక్షిపోషణకుఁ జుట్టుటె కాని దానధర్మైకపద్ధతి యెఱుంగఁ
గాయమందియుఁ బశుప్రాయమైతినిగాని దాసుఁడైనను భక్తిఁ దలఁపలేదు
నిజము పక్షితిఁ బాపి దుర్నీతిపరుని
నన్ను మన్నించు లోకైక సన్నుతముగ, పన్నగ. ౫౦

కలలోననైన శంకరసూన నీపాదకమలంబుఁ జూడని కన్ను లేల
వికటంబునకునైన విశ్వేశసుత నిన్ను భజనసేయఁగలేని ప్రజ్ఞయేల
సరసంబునకునైన షణ్ముఖస్వామి నీపూజసేయనికరపుటము లేల
పరిహాసమునకైన బాహులేయా నీకు దాస్యంబు సేయని తను వదేల
పొట్టపోసుక పరిగెంటు చుట్టురీతి,నుండ రజ్జులు నీభక్తిఁ జెండి వేయు,పన్న.

శరణాగతత్రాణ కిరిగిరిసంస్థాన యసురసంహారణ యమితబాణ
బృందారకస్తోత్ర మందాకినీపుత్ర శతకోటిమిత్ర తేజాభగాత్ర
పాలితగీర్వాణ బర్హీంద్రకంఖాణ ప్రబలశక్తిధురీణ భర్గసూన
విమలముక్తాహార వేదాంతసంచార యద్భుతప్రణవమంత్రార్థసార
శరణు సెందితి నీపాదసరసిజముల, నన్ను రక్షించు దేవసేనామనోజ్ఞ, ప.

చెలఁగు నీశిఖరంబు చెలువుఁ జూచినయంతఁ బాపము ల్తొలఁగి సంపదలుగలిగె
బ్రాకారగోపురప్రాసాదములు చూచి దేహతాపముదీఱి తెలివి గలిగె
నతిశయం బగునీమహామండపాదులు కనినంత మదిలోనికలవు దీఱె
నీసన్నిధానంబు నేఁజూచినంతనే చిరతరైశ్వర్యంబు చేరఁగలిగె
దేవసేనాధిపతి నీదు దివ్యపాద, పద్మములు చూచి జన్మసాఫల్య మయ్యె, ప.
బ్రహ్మ తా నెఱుఁగఁడా బందిఖానకుఁ జిక్కి నీకటాక్షముచేత శోకదనరె
హంసాబ్జముఖులు నీయాజ్ఞచేతనుగదా సురగిరి నిత్యంబుఁ జుట్టఁగలరు
ఇంద్రాగ్నిముఖులు నిన్నెంతయుఁ బూజించి హరిదంతరములకు నధిపులైరి
వసుధాదిభూతముల్ వసురుద్రవిష్ణువుల్ నీరూపమే గాని వేఱులేదు
నీవె సామ్రాడ్విరాట్స్వరూపుండు నీవెసర్వ, సాక్షి సర్వజ్ఞుఁడవు వేదసారమయుఁడు, ప.
ఓమయూరమ నీవు స్వామితో నామాట చేకొను మనరాదె కేకవేసి
కుక్కుటంబా నీవె కూసి పలుకఁగదె స్వామితో నారీతి చనవుమెఱసి
వీరబాహువ నీవు పేరోజమైనను నిప్పింపు మనరాదె హితముతోడఁ
దల్లిరో వల్లి నాదారిద్ర్యములు దీర్చు మనుమమ్మ నాథుతో నెనరుగలిగి
యనుచు నేవేఁడినది నీకు మనవిసేయ, లేదొ సమయంబుచూచివల్లీమనోజ్ఞ-
బ్రహ్మవిద్యయు నేర్చి భాగీరథిని గ్రుంకి కన్యకాదానంబు గరిమఁజేసి
నిత్యనైమిత్తికనియమము ల్తప్పక శివవిష్ణుపూజలు చెలఁగఁజేసి
పంచయజ్ఞాదులుఁ బ్రత్యహంబును జేసి ధర్మశాస్త్రములతగవు దెలిసి
పితృదేవతాతిథిప్రీతి నన్నం బిచ్చి ఘనగుణశమదమఖ్యాతుఁ డగుచు
భువిని వర్తించువాఁడె సద్బ్రాహ్మణుండు
భయముఁ జెందఁడు నీదయాపాత్రుఁ డగుచుఁ, బన్నగ. ౬౮
తల్లిదండ్రులఁబ్రోచు తనయుండె తనయుండు భక్తిగల్గినవాఁడె భాగవతుఁడు
గుణశీలవతి యదె కులమున కిల్లాలు సత్యంబు గలవాఁడె సజ్జనుండు
కామాదులడఁచినఘనుఁడిలజయశాలియన్నమిచ్చినవాఁడెయనుఁగుఁదండ్రి
వర్ణాశ్రమముఁ బ్రోచువాఁడెధాత్రీశుండుహింససేయనివాఁడె యీశ్వరుండు
భక్తియుక్తుల నీపాదపద్మములను, భజనచేసెడివాఁడె సంపాద్యపరుఁడు, ప.
కనులకు శుభమిచ్చి కరుణింపు సద్భక్తపాలనపరతంత్ర బాహులేయ
నేత్రోత్సవం బిచ్చి నిత్యంబు రక్షించు పంచభూతాత్మక బాహులేయ
యీక్షణానందంబు నీక్షణంబున నిమ్ము బ్రహ్మదివందిత బాహులేయ

నయనంబులకు దర్శనం బిచ్చి రక్షించు ప్రణవస్వరూపక బాహులేయ
సకలలోకేశ నీపాదసరసిజముల, నమ్మియున్నాఁడ దేవసేనామనోజ్ఞ, ప.

చతురంగములఁ గూర్చి శాస్త్రావావళిఁ గొట్టి బుద్ధిమంత్రులఁ జేర్చి భూమిఁగాచి
యాజ్ఞెంటనొకపాలు హాలికులచేఁ దీసి ధర్మంబుచే యశోధనము నిలిపి
చంద్రునివలె సర్వజనరంజనత గాంచి దేవాలయంబులఁ దెలిసి నడిపి
యుర్వీసురుల కెల్లసర్వమాన్యము లిచ్చి దాతనై కవులచే ఖ్యాతిఁబడసి
నీదు పదభక్తి మదిలోన నిలిపి సౌఖ్య
మందురాజన్యుఁ డభివృద్ధి నొందు ధరను, బన్నగ. ౬౮

రాజును మంత్రియు రాజ్యంబును నీవె చంద్రసూర్యులు దిశల్ జలధి నీవె
పర్వతంబులు నదు లబ్జాపతి విరించి పరమేశ్వరుఁడును దిక్పతులు నీవె
పంచభూతంబులు పంచాక్షరియుఁ బ్రజల్ నిమిషాదియుగకల్పకములు నీవె
జీవరాసులు శేషజీమూతసస్యము ల్వేదశాస్త్రపురాణవితతి నీవె
నీవె పరమాత్ముఁ డవ్యయనిత్యయశుఁడు
నిన్ను వర్ణింపఁ దరమె ఫణీంద్రునకైన, శూర. ౬౯

పరభామినుల మాతృభావంబుగా నెంచి కొండెగాండ్రను బట్టి కట్టిగూల్చి
బొక్కసంబులనిండ రొక్కంబు లొడఁగూర్చి నానాఁటివర్తమానములు దెలిసి
గడిసీమసుర్గభాగములఁ జుట్టము నిల్పి రస్తు ముస్తీదుల సిస్తుపఱచి
విప్రవిత్తము కాలవిషముగా మది నెంచి దుష్టచిత్తుల సీమఁ దొలఁగఁ ద్రోసి
లోభగుణముల వర్జించి ప్రాభవమున, నిన్నుమఱవనివాఁడెరాజన్యుఁడిలను-

అష్టాంగయోగంబు లవనిలో మేలంద్రు తుదినభ్యసించుట దుర్ఘటంబు
సాంఖ్యయోగము సర్వశాస్త్రసమ్మతమంద్రు సర్వసాధారణసరణి గాదు
సప్తాంగయోగంబు చంచలప్రాయంబు ధరణిలో బహుపాపదంతురంబు
అద్వంద్వఫలభోగ మతిశయంబు నిజంబు నిర్విఘ్న మసరాదు నియతిదెలిసి
ప్రజకు సులభంబు నీపాదభక్తిరసము
కలిగినంజాలు నితరమార్గంబు లేలఁ, బన్నగస. ౭౦

రుద్రాక్షసరు లెన్ని రూఢి దాల్చిన నేమి గంగెద్దుమోయదే గవ్వలన్ని
సరిబార కెంజాయజడలు పెంచిన నేమి మఱ్ఱిమ్రాకుకి నూడ లుండలేద
కాషాయవసనముల్ కప్పుకొంటే నేమి బురుఖాలఁ గప్పదే తురకచయము
తెలివిభూతిని బూసి తిరిగితే నేమాయె నూరిలోజంతువు లుండలేద

నిన్ను మదిలోన సద్భక్తినిలుపలేక, వేషములుదాల్చుటదియెల్ల వెఱ్ఱితనము-

శాత్రవపటలంబు సంహరించినమేటి నేత్రపటలముడ్ప నేర్పలేద
వైద్యనాథేశ్వరవరకుమారుఁడ వయ్యు నేత్రరోగముదీర్ప మాత్ర లేదొ
రోహిణీనాథశిరోమణి వై పీతరోహిణివరుదాక్షిరూపుదీర్ప(?)
మహితజగచ్చక్షుమంజులాక్షుఁడ వయ్యు చక్షుసౌఖ్యంబీయ శక్తి లేదొ
యేల యొంచెద వారోగ్యవీక్షణంబు,నిచ్చిపాలించులోకంబుమెచ్చునటులు-

శత్రువర్గముఁ గొట్టఁ జతురంగబలమేల యంతరంగబలంబె యణఁపఁజాలు
జనవశ్యమునకు నౌషధము వెదుకనేల వాఙ్మృదుత్వము సర్వవశ్యమగును
దీర్ఘాయువును బ్రహ్మదేవు నడుగనేల పరహింసలేకున్నఁ బ్రబల మగును
మోక్షంబునకుఁ దపం బూనిచేయఁగనేల వైరాగ్యమేచాలు వసుధలోన
నింతటికిఁ గారణము భూమి నీశతనయ
నిన్నుఁ బూజించినం గల్గు నిఖిలసుఖము, పన్నగస. ౭౩

హరిహరాదులపూజ లనువుగాఁ జేయక యారగించెడువాఁడె యూరఁబంది
నిత్యసద్భక్తి నాదిత్య నమస్కృతు ల్గోరిచేయనివాఁడె గుడ్లగూబ
దేవోత్సవంబును దీర్ఘయాత్రాదులుఁ గాంక్షసేయనివాఁడె గర్దభంబు
అతిభక్తిఁ గలకొద్ది యతిథి కన్నంబీక మెసఁగియుండెడువాఁడె ధరఁబిశాచి
నీదుపదములు మదిలోన నిలుపలేక
వసుధ వర్తించువాఁడె జీవన్మృతుండు, పన్నగ. ౭౪

దేశాంతరములు ప్రవేశించి సుందరీమణులఁ దేలేద నీమనసుపొంది
పన్నగంబులఁ బట్టి బహువర్తకులచేత ధనము లార్జింపవా దానములకు
దళవాయివై తంత్రి దారిద్ర్యమడఁచి బంగరుకొండ విలుచేసి మెరయలేద
దేవుఁడంచును బలుదిక్కులు వెలిఁగించి నిత్యోత్సవంబుచే నెగడలేద
సొంతకార్యంబునందుఁ గొఱంతలేక, చూచురీతిని భక్తులఁ జూడరాద, ప.

కోటిజన్మములైనఁ గొనకు నీకృపచేత మానవాభ్యుదయంబు మానవలయు
నందులోఁ బురుషుఁడౌటధిక మం దవనీసురాన్వయంబునఁబుట్టుటద్భుతంబు
అటుమీఁద వేదవేదాంతతత్త్వజ్ఞాన సంపన్నుఁ డగుచు విశ్వంబు నీవె
యని కాంచి నీసత్పదాంభోజయుగళనివాస మార్జించెడి వాఁడె యోగి
యితరమగునట్టిజన్మంబు లేల యిలకు, భారమేకాని మఱివేఱుఫలము లేదు.

దేవసేనాధీశ దీపితలోకేశ భావుకగుణకోశ భవవినాశ
యద్భుతచారిత్ర యంబికాసత్పుత్ర వల్లీకళత్ర గీర్వాణమిత్ర
విశ్వంభరాధార వేదాంతసంచార క్రౌంచపర్వతదార కలుషదూర
కోటిభాస్కరతేజ గురువిప్రసురపూజ దళితసింహముఖాదిదైత్యరాజ
మహితసురగణ జేగీయమానవిభవ, నీకు నేవేళ మ్రొక్కి వర్ణింతుఁజెలఁగి-
శక్తిఘంటాఘోషచలితాఖిలాజాండభానుకోపాంతక బాహుదండ
ధృతఖడ్గశూలాదిదీప్తోరుకోదండ మహితౌర్వకీలాసమానకాండ
అతిదేహకాంతిధిక్కృతచండమార్తాండ శూరపద్మాదిసంహారకుండ
వీరరౌద్రరసాదివిస్ఫురితోద్దండ ఘనరత్నకుండలకలితగండ
ఖండపరశుతనూజ లేఖాద్యఖండ, మానసోల్లాస నిన్ను నెమ్మదిని గొలుతు,
కాలంబు దెలిసి బల్లాదంబినీకోటి యిలలోన జీవనం బీయలేద
సమయంబు దప్పక శాఖిలతాదులు బహుఫలంబుల నిచ్చి ప్రబలలేద
జలజాతశుక్తికాజాలంబు తఱియైన ముక్తాఫలము లిచ్చి మొనయలేద
హంసేందుకాంతశిలాదులైనను రూప ప్రతిఫలనం బిచ్చి ప్రోషిఁగనవ
యిల నచేతన మీరీతి నీయఁగాను, లోకనాయక నీకింత లోభమేల, ప.
పునుఁగు జవ్వాజెంత పూసికొన్నం గాని పరిమళింపదు దిగ్విభాగములకుఁ
గొండ గోపురము లుద్దండతఁ గలిగినఁ గనిపింప దాశ్చర్యకరముగాను
భేరీమృదంగభాంకారరవము లెంతడంబమైనను మహత్త్వంబుగాదు
ప్రక్కలఁ జక్కసిభార్యలు చెలఁగిన ధరణిలోపలఁ బ్రసిద్ధంబుగాదు
చల్లఁగాఁ జూచి భక్తుల జాలిదీర్చి, వరము లిచ్చిన నీవైభవంబు లమరు, ప-
విమతభీషణమైన వేషంబుమాత్రమే తగిలించినావు విస్తారముగను
దివిజసన్నుత నామధేయంబుమాత్రమే ధరియించినావు పెద్దఱికముగను
శివిగాఁ గొండపైఁ దావలం బొక్కటి చూచుకొంటివి భవిష్యోత్తరముకు
మరులు పుట్టించి సమ్మతియైన మగువల పొందుగన్నావు సంభోగమునకు
నింతియే కాని నిను భజియించుజనుల
మనికి యిచ్చితి నని వ్రేలు మణఁచి చూపు, పన్న. ౮౧
ప్రోషియించుకలేక పందియై పోట్లాడి నరువింటిదెబ్బఁ దిన్నాఁడు తండ్రి
ఘనతఁజూడక పేఁడి కడనుండుగుఱ్ఱాల మేఁపుచుఁ దిరిగెను మేనమామ
పొట్టసాఁగఁగ లేక నెట్టనఁ దనపళ్లు తొలి విర్చుకొన్నాఁడు తోడఁబుట్టు

లోకవిఖ్యాతమై చేకొన్నయది మహామాతంగి యనుపేరు చేతఁ దల్లి
యనుచు లాంఛనసేయక ఘనసుఖంబు
పొందుదేవర మస్మేమి ప్రోతు విభుఁడు, పన్నగ. ౭౨

నారదమునిగాన సారలోలాహీన భూషణామితదాన భూనిదాన
పాలితసురసేన భక్తాళిసంతాన శరకాననస్థాన శంభుసూన
వేదశాస్త్రక్షీన విదళితాసురసేన ప్రణవాభిధాన శుభాపదాన
పరమతస్త్వజ్ఞాన పంచాక్షరీధ్యాన భావనాతీతవిభాజమాన
మీనమునిమానసాంబుజదీప్యమాన, భానురూపకదివిజవితానవంద్య,పన్నగ.

చిన్మయాకార యాశ్రితభక్తమందార గురురూపజితశతకోటిమార
మునిచిత్తసంచార యనుపమితోదార మహనీయనిలయ కుమారధార
క్రౌంచగోత్రవిదార కాద్రవేయకహార ధరణీసురాధార ధర్మసార
సర్వలోకవిహార చంద్రమౌళికుమార యమితశృంగార విశ్వావతార
భూరికరుణామహోదార వైరివీర
శూరసంహార ననుఁబ్రోవు శుభవిచార, పన్నగ. ౭౩

శతకోటిదివసేశసామ్యగాత్రప్రకాశ పాలితాశాధీశ భవవినాశ
దివ్యసద్గుణకోశ దేవసేనాధీశ విజయశైలనివేశ విమతనాశ
మఘవద్బలేశ సన్ముఖజితతారేశ నుతరాజచోళేశ నతసురేశ
శరణాగతాహీశ కరుణారసావేశయానందరసభరితాశ్రయాశ
వరద లోకేశముఖవంద్యచరణపద్మ
పద్మజోద్భవసంస్తుత్య బాహులేయ, పన్నగ. ౭౪

కుజచంద్రసద్భోగిగురుబుధధ్వజసూర్యకవిశనైశ్చరులను ఘనత నెంచి
ధిషణసౌమ్యధ్వజాదిత్యశుక్రాచార్యశనికుజేందురగుల సమత నిలిపి
రవికవిశనిభౌమకువలయాప్తోరగగురుబుధధ్వజులను గూర్చి మ్రొక్కి
రాహుమంగళచంద్రరథకేతుగురుసౌమ్యశనిభానుశుక్రుల మొనయవ్రాసి
ధరకేతుగురుసౌమ్యవరమందరవిశుక్రసర్వభూజాబ్జుల సరణిఁ దెలిసి
శనిహంసకావ్యాహిఘునకుజేందుధ్వజసురమంత్రిబుధులను జూచి వేఁడి
చంద్రాహికుజసౌమ్యసాంద్రధ్వజాచార్యకావ్యమందాదిత్యకాంక్షఁ జూచి
వరబుధధ్వజమంత్రిసురవైరిగురుమందసూర్యాబ్జరాహుభూసురులఁ బిలిచి
భార్గవరవిసూనుభానుచంద్రాహీంద్రకుజబుధధ్వజగురు ల్పొనఁగఁ బలికి

రాజవీథులఁ దడలేక ప్రౌఢి మెఱసి,మూలమూలలఁదడయక ముదముఁజెంది
వరుస లిఖియించువాఁడె సర్వజ్ఞుఁ డరయఁ,బన్నగసహాయ- ౮౬

వైద్యనాథేశ్వరవరకుమారుం డనుప్రఖ్యాతి యెంతయుఁ బడసినావు
ప్రబలభాగీరథీప్రభవుం డనెడు పేరు లోకంబులోపలఁ జొకఁదనరె
మనువద్బలాధ్యక్షమహిమ చతుర్దశభువనంబులం దెల్లఁ బొగడు గనియె
మహిమఁ జతుర్వేదమయుఁడవై ధాతను ధిక్కరించిన దేవదేవుఁ డనఁగ
నుండువాఁడవు భక్తుల నొగిని బ్రోవ
మాత్ర తీర్థంబు మణి మంత్రమత్తలేదె, పన్నగ. ౮౭

కన్నతండ్రికిఁ జేతఁ గప్పెరయిచ్చి బల్‌జోగివై తిరుగంగఁ జూచినావు
ఒక్కతల్లిని నింటనుండనీయక యేటిత్రోవ సముద్రంబుఁ బోవఁజేసి
యింకొకతల్లిని నిలలోన దయ్యాలఁ ద్రోలి బ్రదుకుమంచుఁ ద్రోసినావు
తోడఁబుట్టినవానిఁ ద్రోవలో నిలిపితి విం తెగాని ప్రతిష్ఠ యింత లేదు
యేటిప్రాభవ మోయయ్య యేమియోగ
మేమి దొరతన మింతైన నెగ్గులేద, పన్నగ. ౮౮

హంసస్వరూపమై యాచక్రవాళాంతరం బెల్ల స్వప్రకాశంబు చేసి
యజ్ఞుఁడై యమరుల కమృతంబు నౌషధిజాలంబు పాలించి సమత మెఱసి
తక్కినగ్రహములై ధరజనసుకృతదుష్కృతమానములను సంగతిగ నడపి
రాశిచక్రంబనై వాసికెక్కి త్రిలోక మంతయు లోఁగొని మహిమఁ దనరి
యుండు జగదీశ్వరా నీవు నొక్క భక్తు
నొనరఁబాలించు టది యెంతఘనము నీకు, పన్నగ. ౮౯

జిష్ణుఁ డిచ్చిన బహు(శ్రీ)ధనంబుల నెల్ల నవనిలో నేమూల నణఁచినావొ
భోగీంద్రుఁ డిచ్చిన నాగరత్నంబులు బొక్కసంబున వెలిఁ బొరయనీవొ
జనసంఘ మిచ్చిన ఘనమైనకానుక లెవ్వరిచే వడ్డి కిచ్చినావొ
దిక్పాలకాదులు తెచ్చిచ్చుకప్పముల్ యేధర్మకృతికినై యిచ్చినావొ
యింతయుండియు భక్తుల కేల యీవు
లోభమైతేని నీదేమిప్రాభవంబు, పన్నగ. ౯౦

భూతనాథుఁ డగుచుఁ బొరుగింటిలోపల నవనిధు ల్పాడిచినాఁడుతండ్రి
సామ్రాజ్య మేలుచు సంపాద్యధనములు తామరకొలనిలో దాఁచెఁ దల్లి
కణవాయికోటలు గట్టి నిక్షేపంబు నణఁచుకొన్నాఁడు నీయనుజవరుఁడు-

దంష్ట్రి శూరసంస్థానము ల్బహు కొళ్ళపెట్టి సంపద హెచ్చు పడసినావు
ఇంతగల్గియు భక్తుల కిచ్చుటకును
సంకటంబేమి దేవతాసార్వభౌమ, పన్నగ. ౯౧

శ్రీమేరుకార్ముకచిత్తహర్షాకర సామగానామోద సత్స్వరూప
భక్తార్తిభంజన బహులోకరంజన కరధృతాద్భుతశూల కనకచేల
నిగమాంతసంచార నిరుపమభుజసార నిస్తులాహవశౌర్య నిహతశూర
దివిజనాయకమిత్ర తేజోహతామిత్ర శ్రీకరామోద వల్లీకళత్ర
నిన్నుఁ గొనియాడుటకు ధాత నేరఁ డనిన
మనుజు లేపాటి గంగాకుమారవర్య, పన్నగ. ౯౨

దేవసేనాధీశ దివ్యసద్గుణకోశ పాలితాశాధీశ భవవినాశ
మానిచిత్తనిశాంత మహితదివ్యస్వాంత దేవసేనాకాంత దితిజహంత
క్రౌంచశైలవిదార కవిదోషసంహార తురగీకృతమయూర యురగహార
నిజశౌర్యచారిత్ర ద్విజరాజసమవక్త్ర దివ్యమంగళగాత్ర దీనమిత్ర
మిత్రశతతేజ సమరజృంభితబిడౌజ
కరుణఁ జూడుము సద్భక్తకలుషహరణ, పన్నగ. ౯౩

వేదంబులు న్నీవె వేదాంగములు నీవె వేద్యుండవు న్నీవె విధియు నీవె
శాస్త్రంబులు న్నీవె సత్త్రితువులు నీవె క్రతుభోక్తయును నీవె కర్తవీవె
విబుధవర్యులు నీవె విప్రజాలము నీవె పర్వతంబులు నీవె ప్రభువు నీవె
సాగరంబులు నీవె భోగీంద్రుఁడు న్నీవె దిక్పాలకులు నీవె దిశలు నీవె
సకలవిద్యావిలాససంజాతనిత్య, శుద్ధవిజ్ఞానమయపరంజ్యోతి వీవె, పన్నగ.

షణ్ముఖస్వామి నీస్మరణగల్గినయంత బహుపాపసంఘము ల్బాసిపోవు
బ్రహ్మణ్యమూర్తి సుబ్రహ్మణ్య యనినంత భవ్యపుత్రకళత్రభాగ్య మమరు
హరకుమారక నిన్ను దరిసించినంతనె ఘనమైన యలచిరజ్ఞాన మబ్బుఁ
బార్వతీపుత్ర నిన్భక్తిఁ గొల్చినయంతఁ జిరతరైశ్వర్యంబుఁ జెందఁగలుగు
నీకు దాసుండనై యున్న నిస్తులైక
ముక్తిసామ్రాజ్యమమరంగ మోస మేమి, పన్నగ. ౯౫

పంచభూతంబులు బ్రహ్మర్షులు న్నీవె యాదికూర్మము నీవె హరియు నీవె
రంజిల్లు సామ్రాడ్విరాట్టులు ను న్నీవె పర్జన్యుఁడు న్నీవె ఫలము నీవె
ప్రణవమంత్రము నీవె ప్రాణికోటియు నీవె శాశ్వతుండవు నీవె చదువు నీవె

పగలు రాత్రియు నీవె యుగములంతము నీవెయాదిపురుషుఁడీవెహరుఁడవీవె
భక్తపాలక నిన్నాత్మఁ బడయలేని
మూఢుజన్మంబు నదియేల మునిశరణ్యా, పన్నగ. ౯౬

సర్వసర్వంసహాచక్రతాపముదీఱ వర్షంబు చల్లఁగా వలయుఁ గురియ
హాలికావళి యెల్ల నానందమందఁగా వర్షంబు చల్లఁగా వలయుఁ గురియఁ
జెఱువుకాల్వలునిండఁబరివాహములు పాఱ వర్షంబుచల్లఁగావలయుఁగురియ
భద్రవర్తై భూమి పంటప్రైరు చెలంగ వర్షంబు చల్లఁగా వలయుఁ గురియ
మెఱుపు లుఱుములతోఁ గూడి మేఘబృంద
మల్లి జడివాన గురిసియు నఖిలదిశల, పన్నగ. ౯౭

వర్షంబు లేకున్న వరుసతో షట్కాలపూజ లేరీతిగాఁ బొందఁగలవు
వర్షంబు లేకున్న వసుధలో వసుధామరులచేత వినుతు లెన్నిటిని గలుగు
వర్షంబు లేకున్న వహి జీవకోట్లను చెలు... ... ...
... ... ... ... ... ...

---

రెండు ప్రతులును శిథిలమై యసంపూర్తిగా నుండుటచే నింతమాత్రమే సంగ్రహించి ప్రకటింపవలసివచ్చినది.

ఒకప్రతిలో "శ్రీహస్తతటాక మనే గ్రామానికి యజమానుడైన రాజమాన్యరాజశ్రీ నాగాశాస్త్రుల్లుగారి కవిత్వం" అని కలదు.

శ్రీరస్తు.

# మీ నా క్షి శ త క ము.

—: తూములూరి వేంకటరంగకవి :—

---

సీ. శ్రీగణాధిప నిన్ను సేవించి యే నిచ్చ ముకుళితహస్తుఁ డై మ్రోల నిల్చి
యనుదినంబును నాత్మయందును బ్రార్థించి కరమొప్పనీయనుగ్రహమువలన
వరకవిత్వంబుగాఁ బరఁగఁ జెప్పెద సీసశతకంబు శ్రీపరాశక్తిపైని
*సఫల మాటకు సదా శుభవాక్కుగా సరస్వతివిలాసము నా కొసంగవయ్య
సులభతర మగు కడకంటఁ జూచి నాదు,కోర్కు లీడేర్పు విఘ్నేశ కొదవలేక
వేంకటేశునిచెల్లెలై వెలయుగౌరి, వరకుమారక గజవక్త్ర శరణు శరణు. ౧

ఖ్యాతిగా సత్యలోకమునఁ దాతకుఁ బెండ్లిసలుపనేర్చినయట్టి శారదాంబ
తలవాకిటను మెచ్చఁ దగినగ్రామణ్యంబు సలుపనేర్చినయట్టి శారదాంబ
యఖిలరాజద్వారమందుఁ బెద్దతనంబు సలుపనేర్చినయట్టి శారదాంబ
కవిజనంబులనోటఁ గాఁపురం బేవేళఁ జలుపనేర్చినయట్టి శారదాంబ
నిన్ను నేవేళ భజయింతు నిక్కముగను, నాదుజిహ్వానువసియింపు నయముమీఱ
వేంకటేశునికోడలై వెలయువాణి, శరణు పుస్తకపాణి నీశరణుశరణు. ౨

శ్రీమీనలోచనా శివమనఃప్రియకాంత వీనుల విను నాదువిన్నపంబు
నీమహత్త్వములు నానేర్చినట్లుగ సీసశతకంబుఁ జేసెద శాశ్వతముగ
శబ్దాదిభేదము ల్చాలఁ దప్పిత మున్ననోర్పుచే రక్షించి యొప్పుకొనుము
బాగుగా నన్ను లీపద్యము ల్పరియించి మది మెచ్చఁ జేయుము మధురవాణి
యజ్ఞుఁడను నాకుఁ బ్రీతితో నభయ మిచ్చి,విశదమైనట్టి సుజ్ఞానవిధము దెల్పు
వేంకటేశునిచెల్లెలై వెలయుగౌరి,కరుణగలయమ్మ మీనమ్మ వరము లిమ్మ. ౩

శివకాంత నీవు నాజిహ్వయందును సరస్వతివిలాసము తోడు సలిపినట్లు
నీకు నర్పితముగా నేను గల్పించిన శృంగారశతకంబు శ్రీకరముగ
వీనులవిందుగా వినికిచేసెద వేడ్క మిగులంగ ముదమంది మెచ్చి యిపుడు
ప్రత్యక్షమై నాదుపాపదారిద్ర్యంబు లెడఁబాపి యెలమితో నెప్పటికిని
చింతితార్థంబు లీడేర్చు చింతదీర్చి, యాదరింపుచుఁ గావవే యాదిశక్తి
వేంకటేశునిచెల్లెలై వెలయుగౌరి, కరుణగలయమ్మ మీనమ్మ వరము లిమ్మ. ౪

---

*ఫభలకుఁ బ్రాసమైత్రి.

పూర్వజన్మాంతరంబునఁ జేయుపుణ్యంబు ఫలియించియుండె నాప్రాప్తి యిపుడు
కౌతూహలముగ మంగళమైనకోరికల్ సఫలమాటకు సారెసారె కిపుడు
అంబికా నీకటాక్షంబుచే నిను సన్నుతులు చేయఁగా నాకు దొరికె నిపుడు
తలిదండ్రి గురువును దైవంబు నాత్మబాంధవసుహృత్తులుప్రాపుదాపు నిపుడు
నీలకంఠుని ప్రియకాంత నీవె యిపుడు
భూషణముగాను సత్కీర్తిఁ బొందియిపుడు, వేంక. ౫

శివకామసుందరి శివయోగినీ జగత్కారణి చంద్రశేఖరునిరాణి
శక్తిస్వరూపిణి సంభవస్థితిలయకారణి చంద్రశేఖరునిరాణి
కైలాసవాసిని కాత్యాయనీ భవ్యకారిణి చంద్రశేఖరునిరాణి
కౌమారి వరశుభాకారిణి దనుజధిక్కారిణి చంద్రశేఖరునిరాణి
శరణు వేఁడితిఁ జంద్రశేఖరునిరాణి
యంబ యీరీతి నినుఁగొనియాడ నేర్తు, వేంక. ౬

ఎల్లలోకములందు నెక్కువై మెలఁగెడు సారంగధరురాణి శరణుశరణు
మాతంగి ననుఁ బ్రోవు మదిని వంచన లేక శాంభవి గీర్వాణి శరణుశరణు
జనని నీకడకంటఁ జల్లఁగా ననుఁ జూడు శాంకరీ శర్వాణి శరణుశరణు
పరమేశ్వరీ నీదుభక్తిమంతుఁడ నైతి శ్యామ పుస్తకపాణి శరణుశరణు
దీనజనతాపహారిణి దేవి శరణ,టనుచు వందనమొనరింతుననుదినంబు, వేంక.

పరదేవి పరమేశుపట్టంపురాణి శ్రీపార్వతీ నీపాదభక్తి సేతు
గట్లరాయనిపట్టి గణనాథుగనతల్లి పార్వతీ నీపాదభక్తి సేతు
మఱపు లేకను సదా మదిలోను గొనియాడి పార్వతీ నీపాదభక్తి సేతుఁ
బ్రతిదినంబును నిన్నుఁ బ్రార్థింతు నుతిచేసి పార్వతీ నీపాదభక్తి సేతు
నెల్లకాలము భజియింతు నివ్విధముగ
నేవిధంబున దయవచ్చు నిపుడు నీకు, వేంక. ౭

పార్వతి రుద్రాణి పరమపావని నిన్ను నానందముగఁ గొల్తు ననుదినంబు
చొక్కనాథునికొమ్మ శూలిని సతి నిన్ను నాత్మయందునఁ గొల్తు ననుదినంబు
మంగళావతి నీదు మహిమల నెన్నుచు హస్తమ్ములను గొల్తు ననుదినంబు
సుగుణాకరీ దేవి సురసేవితాంఘ్రి నిన్నాత్మలోపలఁ గొల్తు ననుదినంబు
ఇన్నివిధములఁ గొల్తు నిన్నెప్పటికిని
సమయ మిది కావవే నన్ను శ్యామలాంబ, వేంక.

రాజరాజేశ్వరీ రాట్పరమేశ్వరి తల్లి నీనామంబుఁ దలఁచి మ్రొక్కి
యఖిలాండకోటిబ్రహ్మాండనాయిక వైన తల్లి నీనామంబుఁ దలఁచి మ్రొక్కి
కైలాసగిరియందు ఘనతతోఁ గొలువున్న తల్లి నీనామంబుఁ దలఁచి మ్రొక్కి
చంద్రశేఖరురాణి చంద్రికాధరహాస తల్లి నీనామంబుఁ దలఁచి మ్రొక్కి
నిశ్చయముగాను ముక్తాఱు నిన్ను నమ్మి
దినదినంబును నేను ప్రార్థించినాఁడ, వేంక. ౧౦

బటువుగానున్న డెబ్బదిరెండుకోట్ల శిల్పలకోటలలోను శ్రీ మెలఁగి యుండ
బ్రాహ్మలయాంబు లుప్పరిగమందిరములంగళులుక్షత్రియ వైశ్య* గృహములుండ
నన్నసత్రమఠంబు లావందు దేవళంబులు పుష్పవనసరోజలము లుండ
వేశంబులును మాళివీథి యాపణి పూలవీథి వైశ్రమునాడి వీథులుండ
మహిమ నున్నట్టి ముక్తి పాండ్యమండలమున
రాజధానిన మధురాపురంబులోను, వేంక. ౧౧

ఘనతరం బైనట్టి కనకధ్వజ స్తంభములు దివ్యరత్నకాంతుల మెలంగ
గగనసముల్లిఖత్కాంచనోత్తుంగగోపురచిత్రమండపంబులు మెలంగఁ
జెలువందముగ హేమశిఖరంబు లరకట్టడలుఁ జుట్టుప్రాకారములు మెలంగ
స్వర్ణహస్తిని సప్తసాగరంబును దుగ్ధ కృతమాలనది వేగవతి మెలంగ
భూతలమునందుఁ బ్రఖ్యాతిఁ బొంది యిట్లు
రమ్యమగుచున్న మధురాపురంబులోను, వేంక. ౧౨

పట్టణంబు లవెన్ని ప్రబలమై యున్న నీమధురాపురముజోడు మహిని లేవు
శివదేవళము లెన్ని క్షితినున్న నీద్వాదశాంతస్థలమునకు సమము లేవు
గుడివిమానము లెన్ని కొమరొప్పుచున్న నీహాలాస్యశిఖరంబుఁ బోల లేవు
ఖ్యాతి స్వయంభులింగము లెన్నియున్న నీ సుందరేశుని సాటి యొండు లేవు
అనుచుఁ గొనియాడుకొనుచు నీయవనిలోని
జనులు సేవింపఁగాఁ బరాశక్తి వగుచు, వేంక. ౧౩

ఆదికాలంబునాఁ డమరేంద్రునిచేత విశ్వకర్మునిచేత విహిత మయ్యె
హాలాస్యపురమధ్యమందు హేమాబ్జినీతటమునం దతివినోదంబుగాను
అష్టదిక్కుల నిల్చి యైరావతంబులు భరియింపఁగా మనోహరమునైన

---

*గృహమునకు గ్రహమనివాడెను. ౧౫ వ పద్యములోఁగూడఁగలదు.

నింద్రవిమానమం దెలమి నుండుక చతుఃషష్టిలీలలు ప్రకాశంబుసేయ
ద్వాదశాంతేశ్వరులతోడ మోదమొప్ప
భువనములతోడ నర్చనఁ బొందుకొనుచు, వేంక. ౧౪

ఇలలోన కైలాసమే యిది యనవచ్చుఁ గర మొప్పు హాలాస్యపురము మహిమ
గాత్రోన్నతములై నగజములెన్నిదిమోయుఁ గంగాధరునిగర్భగ్రహముమహిమ
భయముచే జను మహాపాతకం బభిషేకసలిలసంప్రోక్షణఫలముమహిమ
కైవల్యమును బొందఁగలుగుకల్యాణసుందరమూర్తిపాదార్చనంబుమహిమ
యిష్టకామ్యంబు లన్నియు నిహమునందు
సిద్ధమా శ్యామలా నీదుసేవమహిమ, వేంక. ౧౫

సిరికటాక్షంబుతోఁ జరియించి జయమంగళము సదా ముఖవిలాసము నొసంగు
బహుమానభోగంబుబహుయోగక్షేమవశ్యము ధైర్యదివ్యతేజమునొసంగు
గలుషముల్జ్వరరోగముక్షుద్రభయదుఃఖచిత్తభ్రమలుమాన్పి శ్రేయమొసఁగు
నజ్ఞానతిమిరమోహాబ్ధిసంసారబంధము విడ్చి ముక్తిసాధన మొసంగు
నీదు విభూతి పరిమళనీతిదంబు
పొగడవశె శేషుఁడే నరు ల్పొగడఁదరమె, వేంక. ౧౬

మహిమతో మెలఁగు నీమధురాపురీద్విజుల్ సకలవేదపురాణశాస్త్రములను
జదివి సంపన్నులై సంతానములు గల్గి సక్షేమధర్మముల్ సలుపుకొనుచు
శుభము లందుచును శ్రీసుందరేశ్వరినీదుకమనీయమగుకటాక్షంబుమహిమ
సకలాగమాచారసర్వజ్ఞు లగుచును సంతుష్టి గలిగి శ్రీమంతు లగుచు
భక్తి మిగులంగ మేల్మిగాఁ బ్రబలియుండి
యర్చకులు పూజసేయంగ హర్షమొదవ, వేంక. ౧౭

అజ్ఞానులకు నెల్ల సుజ్ఞానములు గల్గ మీనాక్షి నీనామమే జపంబు
ఆరోగ్యపుత్రాయురైశ్వర్యములు గల్గ మీనాక్షి నీనామమే జపంబు
సర్వకాలము సరస్వతి విలాసము గల్గ మీనాక్షి నీనామమే జపంబు
ధరను జన్మములేక పరలోకగతి గల్గ మీనాక్షి నీనామమే జపంబు
సకలసామ్రాజ్యములు పొంది జయము గల్గి
మెఱయ మీనాక్షి నీనామమే జపంబు, వేంక. ౧౮

కొండె మాడెడువారు గుణవిహీను లసత్యభాషకుల్ పరజనదూషకులును
దత్తాపహారనిర్దయులు పాషండవంచకులు క్రూరులు దురాచారపరులు

# విషయసూచిక.





# పరిషత్ప్రయోజనములు.



తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసంగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రిందఁ బొందుపఱుపఁబడు చున్నవి:—

i తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వాంకష మగునిఘంటు వొకటి రచించి ప్రచురించుట;

ii తెలుఁగుభాషకు సజాతీయేతరభాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణము రచించి ప్రచురించుట;

iii ఆధునికశాస్త్రగ్రంథరచనయందుఁ బ్రయోగించుటకై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట;

iv ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యములైన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగుదేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొకటి రచించి ప్రచురించుట;

v సర్వవిషయములనుగుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసంగుట;

vi ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట;

vii తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొక పత్రికను బ్రకటించుట;

viii తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గుఱించి చర్చించుటకుఁగాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట;

ix తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్యపట్టములను, యోగ్యతాపత్రికలను నొసంగుట;

x ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట– ఇందుఁ బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును; వ్రాఁతప్రతులుగూడ నుండవలయును;

xi తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధిక నుపచరించు నన్ని కార్యములను జేయుట.

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్త్రిక.

## కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

| | | |
|---|---|---|
| సంపుటము ౧౯. | ప్రమోదూతనామసంవత్సరము. ఆశ్వయుజకార్త్తికమాసములు. | సంచిక ४. |


## ఆంధ్రసాహిత్యపరిషద్వార్షికసభ.

ఈసంవత్సరము (1930) సెప్టెంబరు నెల డి 20-21 తేదులలో ఆంధ్రసాహిత్యపరిషద్వార్షికసభ పెద్దాపురము ఆర్యవైశ్యభవనములో మహావైభవముగా జరిగినది. మహారాజశ్రీ చెన్నాప్రెగడ భానుమూర్తిపంతులు బి. ఏ., గారగ్రాసనాధిపత్యము వహించిరి. వారియాధిపత్య మనేకమహాశయుల నాకర్షించినది. వారియనర్గళోపన్యాసధోరణి సభ్యుల నమితానందము నందించినది. ఆసభకు వచ్చిన కొందఱనామములు క్రింద నీయఁబడుచున్నవి:—

మ॥ రా॥ శ్రీ॥ జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.
,, పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు పిఠాపురము.
,, శతావధాని ఓలేటి వేంకటరామశాస్త్రిగారు ,,
,, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు ... ,,
,, నడకుదుటి వీరరాజుపంతులుగారు ,,
,, అమలాపురపు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ,,
,, వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ,,
,, దర్భా సర్వేశ్వరశాస్త్రిగారు ... ,,
,, దివాన్ బహద్దరు సర్. రఘుపతి వేంకటరత్నము నాయుడుగారు ఎం. ఏ. ,,

మ॥ రా॥ శ్రీ॥ కోకా వేంకటసుబ్బారావునాయుడుగారు దివాన్ పిఠాపురము.
,, అల్లమరాజు రంగశాయికవిగారు ,,
,, కవిరాజ శ్రీవత్సవాయ నీలాద్రిరాజుగారు-తుని.
,, బుఱ్ఱా శేషగిరిరావుగారు ఎం. ఏ. విజయనగరము.
,, మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ,,
,, మల్లాది వేంకటవిశ్వనాథశర్మగారు ,,
,, అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారుసంస్కృతకళాశాల-కొవ్వూరు
,, రావుసాహెబ్ డాక్టరు. వేమూరి రామకృష్ణారావుపంతులుగారు ఎం.ఏ., పి. హెచ్. డి. ప్రిన్సిపాలుగారు. } కాకినాడ.
,, గొడవర్తి జగన్నాథస్వామిగారు ఎం. ఏ., హెడ్మాష్టరు ,,
,, దివాన్ బహద్దరు దురిసేటి శేషగిరిరావుపంతులుగారు, బి. ఏ., బి. ఎల్. ,,
,, తాడిమేటి నారాయణమూర్తిగారు, ఎం. ఏ. ,,
,, విద్వాన్. చతుర్వేదుల సత్యనారాయణశాస్త్రిగారు ,,
,, ఉభయభాషాప్రవీణ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు
,, మాంధాత వేంకటరావుగారు, బి. ఏ., బి. ఎల్. ,,
,, సవితాల సుబ్రహ్మణ్యముగారు, ఎం. ఏ., ఎం. ఎల్. ,,
,, కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్. ,,
,, దర్భా వేంకటశివరామరాసుగారు బి. ఏ., బి. ఎల్. ,,
,, గోవిందరాజుల హరిశ్చంద్రరావుగారు ... ,,
,, వెన్నేటి రామచంద్రరావుగారు బి.ఏ., బి. ఎల్.రాజమహేంద్రవరము.
,, రుద్రరాజు నరసింహరాజుగారు, పోడూరు.
,, ఇవటూరి సుందరయ్యగారు, అమలాపురము.
,, ముదిగొండ నాగలింగశాస్త్రిగారు, తెనాలి.
,, విద్వాన్ గరిమెళ్ళ సోమన్నగారు, ఎం. ఏ., డి. ఇ. ఆ. స్కూలు, పెద్దాపురము.

మ॥ రా॥ శ్రీ॥ సెలపాక సూర్యప్రకాశముగారు  పెద్దాపురము.
,, చెళ్లపిళ్ల సీతయ్యగారు ... ,,
,, సెలపాక సత్యనారాయణగారు ప్లీడరు. ,,
,, చేవలి లక్ష్మీనారాయణగారు బి. ఎ. ,, ,,
,, చావలి లక్ష్మీనారాయణశాస్త్రిగారు బి. ఎ., ,, ,,
,, బి. నారాయణమూర్తిగారు ,, ,,
,, ముడుంబి శ్రీనివాసాచార్యులుగారు, బి. ఏ. ,, ,,
,, చిలకమర్తి నరసింహాచార్యులుగారు, బి. ఏ. ,, ,,
,, కుంటముక్కల సుబ్బారావుగారు, బి. ఏ. ,, ,,
,, తోపల్లి కృష్ణబ్రహ్మశాస్త్రిగారు, బి. ఏ. ,, ,,
,, ధూళిపాళ వేంకటరమణయ్యగారు, ,, ,,
,, బొబ్బిళ్లపాటి సూర్యప్రకాశరావుగారు, బి. ఏ.
సబుమేజస్ట్రీటు ,,
,, యం. శ్యాముల్‌గారు, బి. ఏ., ఎల్. టి., హెడ్‌మాష్టరు,
హైస్కూలు, పెద్దాపురము
,, కంభముపాటి చలపతిరావుగారు, ఉపాధ్యాయులు ,,
,, కంభముపాటి సుబ్బారావుగారు ,, ,,
,, తాళ్లూరి బుల్లిసత్యంగారు ... ... ,,
,, దుగ్గా వేంకటరమణగారు ... ... ,,
,, తాళ్లూరి వేంకటరమణగారు ... ... ,,
,, ద్రాక్షి బాపన్నగారు ... ... ,,
,, బత్తుల భగవన్నారాయణగారు ... ,,
,, ఓలేటి భద్రయ్యగారు, గోరస.
,, పుసర్ల శేషయ్యశాస్త్రిగారు, జగ్గమపేట.
,, ఇంద్రకంటి సూర్యనారాయణగారు, ఉపాధ్యాయులు,
వీరవరము.
,, అయ్యలసోమయాజుల చైనులుగారు ,, కిర్లంపూడి.

ఇంక ననేకులు విచ్చేసిరి.

డి 20 వ తేది శనివారము ఉదయము 8 గంటలకు బ్రహ్మశ్రీ వేద మూర్తులు కాలనాథభట్ల కృష్ణావధానులుగారు, పొదురుపర్తి సూరావధాను లుగారు, వడ్లమాని లక్ష్మీనారాయణావధానులుగారును, స్వస్తివాచనమును, కాశీభట్ల అప్పయ్యశాస్త్రిగారు దైవప్రార్థనమును గావించినపిమ్మట, నాహ్వాన సంఘాధ్యక్షులస్వాగతోపన్యాసము గావింపఁబడినది. తర్వాత సభాధ్యక్షులు మహోపన్యాసము నొసంగిరి. అటుపిమ్మట శ్రీమాన్ శ్రీవిక్రమదేవ వర్మబ హద్దరుగారును, ధారకోట రాజాగారును, డాక్టరు. ఎస్. కృష్ణస్వామి అయ్యం గారు ఎం. ఏ., దోమా వేంకటస్వామిగుప్తగారును, మొదలైనవారు సభకు రాఁజాలమైతి మనియు సభనిర్విఘ్నముగ జరుగవలయు ననియు వ్రాసిన యుత్త రముల నాహ్వానసంఘాధ్యక్షులు సభవారికిం జదివి వినిపించిరి.

విద్వాన్ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు రాఁజాలక పంపిన పాఠ పరిశీలన మనువ్యాసము చదువఁబడినది. అప్పటికిఁ బదునొకండు గంట లగు టచే సభచాలించి మధ్యాహ్నము మరల రెండుగంటలకుఁ బ్రారంభించిరి. ఉభ యభాషాప్రవీణ వడలి లింగన్నశాస్త్రిగారు ఆంధ్రవ్యాకరణవిమర్శనము; శేషమల్ల అచ్యుతరావుగారు ఎం. ఏ., ఎల్. టి., మనుమంచి భట్టారకుఁడు; యం. వేంకటరమణగారు ఆంధ్రవ్యాకరణములధోరణి; ముదిగొండ నాగలింగ శాస్త్రిగారు కవికర్తవ్యము; ఉభయభాషాప్రవీణ గాధావఝల రామావ ధానిగారు కవిత్వతత్త్వమును; ఉమర్ ఆలీషాకవిగారు భాషాపరిణామము; అనువ్యాసములం జదివిరి. జనమంచి శేషాద్రిశర్మగారు పంపించిన భాగవత రచన, పోతనమహాకవి భక్తి యనువ్యాసమును, సర్. రఘుపతి వేంకటరత్న మునాయుఁడు, ఎం. ఏ. గారు తాము వచ్చువఱకు నిలిపియుంచు మనివార్త యంపుటచే సాయంకాలమున వారిసమక్షమున నది చదువఁబడినది.

డి 21 వ తేది ఆదివారమున నుదయము 9 గంటలకు మరల సభ ప్రారంభింపఁబడినది. మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు, దజ్ఞాగాచార్యు ని కుందమాల, జయంతి రామయ్యపంతులుగారు, ఉత్తరరామచరిత్ర నాటక ములోని రసవిచారము, కుందూరి ఈశ్వరదత్తు బి. ఏ. గారు ఆంధ్రవాఙ్మయ వికాసతత్త్వము, మల్లాది వేంకటవిశ్వనాథశర్మగారు ఆంధ్ర నాటకరంగమునుం డిసంస్కృతనాటకబహిష్కారము, విద్వాన్ కోపల్లె శివకామేశ్వరరావుగారు, కవితాప్రపంచము ప్రస్తుతాంధ్రము, బండారు తమ్మయ్యగారు క్రీడాభిరామ

కర్తృత్వము, పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు పద్యచూడామణి బుద్ధఘోషాచార్యులు, కవిరాజవత్సవాయ వేంకటనీలాద్రిరాజుగారు, సూక్తి, అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వ్యాకరణబాహుళ్యము, ఈయున్ని వేంకట వీరరాఘవాచార్యులుగారు ద్వర్థిత్వ్యర్థికావ్యములు, మున్నంగి లక్ష్మీనరసింహ శర్మగారు, తాము పరిశోధించి ప్రకటింపఁబోవుచున్న యాంధ్రమహాభారత పాఠభేదాదికముఁ గూర్చి, వింజమూరి లక్ష్మీనరసింహారావుగారు నాట్యకళ, పంత్రంగి సుబ్బారావుగారు శ్రీకృష్ణనిర్యాణము, అనువ్యాసములం జదివిరి.

విద్వాన్ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారును, ప్రయాగ వేంకటరామ శాస్త్రిగారును, కాకర్ల కొండలరావుగారును, కేశవరపు వేంకటశాస్త్రిగారును సభకు రాలేదు. వారివ్యాసములనైనను బంపలేదు. మా రేమండ రామారావు గారు (బి. ఏ. ఆనర్సు) సనాతన దేవాలయనిర్వహణ మనువ్యాసమును బంపినారు. సత్యవోలు రాధామాధవరావుగారు వసుచరిత్రములోని పద్యములను సంగీతముతో మేళవించి రాగతాళయుతముగఁ బాడియు, మర్దళధ్వనిసీస, సప్తస్వరాక్షరయుత విష్ణుస్తవసీసములను జదివియును సభాస్తారుల నానందపరవశులం జేసిరి.

అధ్యక్షు లుపసంహారోపన్యాసముఁ గావించిరి. జయంతి రామయ్యపంతులుగారు పరిషత్పక్షమునను, కేశవరపు కామరాజుగా రాహ్వానపక్షమునను, నధ్యక్షులకు సభ్యులకు నార్యవైశ్యభవనసంఘాధ్యక్షులకును కృతజ్ఞతాభివందనము లర్పించిరి. మహానందముతో సభ ముగిసినది. ఆదివారము మధ్యాహ్నము 1 గంటకు కార్యనిర్వాహకసభ జరిగినది. సభలోఁ జదువఁబడిన యధ్యక్షోపన్యాసాదులు క్రమక్రమముగాఁ బరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడును.

రాఁబోవుప్రమోదూతసంవత్సర వార్షికోత్సవము విశాఖపట్టణములో జరుపవలయు నని శ్రీమాన్ శ్రీవిక్రమదేవ వర్మబహద్దరుగారు వ్రాసిన జాబు ననుసరించి యిరువదియవ పరిషద్వార్షికసభ విశాఖపట్టణములో జరుపుటకు నిశ్చయింపఁబడినది.

# ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసము.

ఆళక్కి- వేంకటరామయ్యగారు, పెద్దాపురము.

---

సోదరప్రతినిధు లగునోమహాజనులారా! పండితప్రకాండులారా, స్వాగతము.

ఆంధసాహిత్యపరిషద్వార్షికోత్సవసభకు మాయాహ్వానము నంగీకరించి, దూరాధ్వగమన వ్యయప్రయాసముల కోర్చి, భాషాసేవైకపరత్వమున విచ్చేసిన మహామహు లందఱకు మాపెద్దాపుర వాస్తవ్యుల పక్షమునఁ గృతజ్ఞతావందనశతంబుల నర్పించుచు సుస్వాగత మొసంగుచున్నాను.

నాకంటె మిన్నలగు భాషాప్రవీణు లెందఱో యుండ మాయాహ్వానసంఘమువారు నన్నొకపెద్దంజేసి యధ్యక్షపదవికి నియోగించుట సాహితీకవితాసామ్రాజ్యపట్టభద్రుల రగు మీ కందఱకు స్వాగత మొసంగు భాగ్య మొనగూర్చు నిర్వ్యాజకృపావిశేషమే గాని వేఱొండుగాదు.

రథనేమినిస్వనముల గజఘంటానినాదముల దురగధారల వీరసైన్యపదఘట్టనల మంగళతూర్యారావములఁ బండితకవిగోష్ఠీవినోదంబులఁ బూర్వ మొకప్పుడు విరాజిల్లిన, పదునైదు పరగణాల కధీశ్వరులగు శ్రీవత్సవాయి సంస్థానమువారి రాజధాని, స్థలదుర్గ మగునీపెద్దాపురము నేఁడు స్వస్థానప్రభుహస్తచ్యుతమై పాడరి నిశ్చతురంగమై కాకఘూక సృగాలారావములతోఁ జెలరేఁగి తరుగుల్మకంటకలతావృతదుర్గాంతరమై నిర్మానుష్యమై స్థలభోగతత్త్వమును వ్యక్తీకరించుచున్నది.

దుర్గభూమి యంతయు 38 యకరముల విస్తీర్ణము గలిగి హనుమదాకారముగా 13 బురుజులు గలిగి శిరమున హనుమంతబురుజు పాదమున తోఁకబురుజు ననునామముల నొప్పారి శత్రువుల కభేద్యమై విరాజిల్లెడిది.

సంస్థానాధిపతు లందఱును బహుదేశలిపుల భాషల నేర్చియు స్వభాషయం దాదరము గలిగి తేజస్వి తోదార ప్రతాప సంపన్నత్వములతోడి పాటు గొప్పవిద్వాంసులుఁగవులునై విద్యలయం దాదరముఁ గలిగి విద్వాంసుల కనేకాగ్రహారముల నిచ్చి ప్రజాహితైకాభిలాషతోఁ జెఱువులు త్రవ్వించి తోఁటలువేయించి దేవాలయమంటపాదులను గట్టించి సత్రములఁ బెట్టించి కవుల బల్వుర నాదరించి చాల సత్కృతుల నంది జగద్విఖ్యాతకీర్తిం గాంచిరి.

ద్రౌపదీపరిణయము, కిరాతార్జునీయము, ధ్రువచరిత్రము, తుల్యామాహాత్మ్యము ననుకృతులనిర్మించిన తాత యేనుఁగులక్ష్మణకవియు, రామవిలాసమును రచించిన మనుమఁడు ఏనుఁగు లక్ష్మణకవియు, శేషధర్మములు హరిభక్తసుధోదయముల విరచించిన వెణుతురుపల్లి విశ్వనాథకవియు, చిత్రచమత్కారమంజరి కర్త యగు యాణిమళ్ళ వేంకటశాస్త్రిగారును, గువలయామోద మను నలంకార గ్రంథమును సంస్కృతమున రచించిన శ్రీ చావలి రామశాస్త్రిగారును జగత్పతిసుభాషిత ప్రభావతీప్రద్యుమ్న నాటకకర్త లగు శ్రీ హోతా వేంకటకృష్ణకవిగారును, శ్రీవత్సవాయి సంస్థానాధీశ్వరులయాస్థానకవీశ్వరులు. చల్లా కామకవి వక్కలంక వీరకవియు నాయాస్థానములోనివారే. వీరలు, అష్టదిగ్గజములలోనివా రని ప్రతీతిగలదుగాని వీరలు రచించిన గ్రంథములు గానరావు.

మకరందమును జెంచెత బలిమిమై గ్రహించినను దేనెపెఱను వదలక జుమ్మని మూఁగుసరఘులవలె నేఁటి పెద్దాపురము నాశ్రయించుకొనిన మాబోంట్లకమృతత్వ మొసంగనెంచి యాంధ్రసాహిత్యపరిషత్సభ స్థాయిసంఘమువారు దయతో మాయాహ్వానము నంగీకరించి మాపురమున నీవార్షికోత్సవసభను జరుపుట కంగీకరించి మీయందఱి దర్శనభాగ్యము లభింపఁజేసి పూర్వపుఁ బండితకవి గోష్ఠివినోదముల చవి యొక్కింత చూపించుచున్నందున మేమెంతయుఁ గృతకృత్యులరము.

దేశౌన్నత్యసమస్యలలో భాషావిషయకము ప్రాముఖ్యము. రసజ్ఞులు స్వభాష నేమఱియుండరు. "స్వస్థాన వేషభాషాభిమతా స్సన్తో రసప్రలుబ్ధధియః" అని సకలభాషావాగనుశాసనుఁ డగు నన్నయభట్టాంధ్రశబ్దచింతామణియందు నుడివియున్నాఁడు. స్వభాష గన్నతల్లి. స్వభాషను విడనాడి పొందు తక్కుంగల వికాసములు మాతృస్తన్యమెఱుఁగని బాలుని యంగములవలె యసహజపుష్టికరములు.

మహాత్ములు దేశభక్తులు భాషాసేవకులు పాశ్చాత్యవిద్యావ్యామోహమును విడనాడి వత్సరదశకమునుండి దేశభాషలకుఁ బ్రాముఖ్య మిచ్చి పాటుపడుచుండుట భావికాలదేశౌన్నత్యసూచక మనకతీరదు. జనసామాన్యమునందుఁగూడ నీభావములు ప్రవర్ధిల్లుచున్నవి.

కాని భాషాకల్పవృక్షమును గూఁకటివేళ్ళతోఁ గూల్చువేరుపురువు బయలుదేఱినది. అది ప్రాచీదిశ నుదయించిన గ్రామ్యవాదపుఁ దోఁకచుక్క. అట్టి

వేరుపురువు బారినుంచి సంరక్షించి కల్పవృక్షము శాఖోపశాఖలతో విజృంభించి తన్నాశ్రయించువారికి నిలువనీడయుఁ జలువయు నిచ్చుచు నఖండఫల ప్రదమగుటకే సమకట్టి యీసభ పనిచేయుచున్నది.

సర్వవిషయములకు బలె భాషకును నియమము సర్వశ్రేయము. నియమరహితమైన బ్రతు కనర్థదాయకము. తన్నియమమే భాషకులక్షణరూపమునఁ బరిణమించును. లక్షణవిరుద్ధ మగుభాష గ్రామ్య మగ్రాహ్యమని పెద్దలు చెప్పుదురు. అట్టిగ్రామ్యభాషను నాకల్పాంతస్థాయిగ నుండు సప్తసంతానములలో నొకటి యగు కృతి గ్రంథరాజములలోఁ జొన్పుట కడుంగడు శోచనీయము. ప్రకృతమున భాషాకల్పకమునకు బదనికగూడ బయలుదేఱుచున్నది. అది భావకవిత్వమను నొకనూతన పరిణామము. అది కల్పకముయొక్క వికాసముననే యనికొంద ఱందురు.

దీన సందర్భశూన్యప్రణయాంబునిధి తరంగడోలికామాలికలును నిర్మల వినీలనీరదాకాశాంతరస్థహాటకమయజ్యోత్స్నాంకితోడుగణపరివృతత్రియామినీవల్లభుండును, హృదయపాత్రాంతరాళసుస్నిగ్ధప్రణయస్నేహపూరంబును, భాషాంతరీకరణదావాగ్నిప్రజ్వలిత నీరసపదార్థశుష్కపత్త్రతరుసంతానారణ్యంబును నిరంకుశమదగజకరపదరదాఘాతచ్ఛందోవ్యాకరణాదికదళికారామంబును దఱచు గనుపట్టుఁ.

భావకవిత్వ మనునది మనకవులకుఁ గ్రొత్తది కాదు. భావము లేనిదే కవిత్వమే లేదు. జగన్నాథ పండితరాయలువారీభావకవిత్వమును బెంపొందించిరి.

"మాం గర్వ ముద్వహ బిడాల మహీపతీనా। మంతఃపురం మణిమయం నిలయం మమేతి । పట్టాభిషేకసమయే పృథివీపతీనాం । బాహ్యస్థితస్యకలభస్యచ మండనశ్రీః॥"

భావకవిత్వ మన నిప్పటివారి యభిప్రాయము ఘృతకోశాతకీన్యాయమే మో యని సందేహము వొడముచున్నది.

భాష వెఱ్ఱితలలు వేయక సక్రమాభివృద్ధి గాంచుటకుఁ దగుసూచనలఁ జేయుటయే యీసభవారి యాశయము. అట్టి సక్రమాభివృద్ధిభాషకు వలయు ముఖ్యసాధన మగు నిఘంటువును విద్వత్ప్రభువు లగు శ్రీపీఠికాపురము మహారాజావారు పండితవరుల రప్పించి వ్రాయించుచున్నందుల కెంతయుఁ గృతజ్ఞ

తను జూపుచు నట్టి నిఘంటు వనతికాలములో వెలువడి యాంధ్రలోకమునకు మహోపకార మొనర్పుఁగాత యని పరమేశ్వరుని బ్రార్థించుచున్నాను.

మ. మహి మున్ వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు ద
న్మహనీయస్థితిమూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపువాటించు నీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁ దద్ప్రాగల్భ్య మూహించెదన్".

అని రామరాజభూషణుఁ డాంధ్రభాషాప్రపంచమును గొని యాడెను.

సీ. శబ్దసంస్కార మెచ్చటను జాఱఁగనీక పదమైత్రి యర్థసంపదలఁబొదలఁ
దల వెల్ల నక్లిష్టతను బ్రదీపితముగాఁ బునరుక్తిదోషంబు పొంతఁ బోక
యాకాంక్షితస్ఫూర్తి యాచరించుచును శాఖాచంక్రమక్రియఁ గడవఁజనక
ప్రకృతార్థభావంబు పాదుకో నదుకుచు నుపపత్తి యెందు నత్యూర్జితముగ
నొకటఁ బూర్వోత్తరవిరోధ మొదవకుండఁ
దత్తదవయవవాక్యతాత్పర్యభేద
ములు మహాకావ్యతాత్పర్యమునకు నొనరఁ
బలుక నేర్చుట బహుతపఃఫలము గాదె.

అని పింగళి సూరనార్యుఁడు సహస్రాక్షుని నోట శుచిముఖీవచనరచనా విచక్షణత్వంబుం గూర్చి పలికించి "వాగ్దేవతవో కాకయాకె దిద్దినకవివో" యని కవిత్వలక్షణ ముపలక్షింపఁ జేసె.

భాషావధూటి కలంకారప్రాయమై వికాస మొనగూర్చు కవనమే యమృతము. అట్టియమృతరసాస్వాదనచే నమరత్వము లభించు మీరమృతాంధసులు. అట్టి మీకు మే మొసంగంబోవు-

"నాస్తి శాకబహుతా నాస్త్యుష్ణతా నాస్త్యపూపో నాస్త్యోదన సౌష్ఠవం చకృపయాభోక్తవ్య"

మ్మను నాతిథ్య మకాంక్షితమే యైనను మాహృదయగత భావమునె ప్రధానముగ నారసి మన్నింపఁ బ్రార్థించుచున్నాము.

ప్రతినిధుల బసలకు భోజనాదికమునకు బహిరంగసభకు ననువగు నీయార్యవైశ్యసత్రపుభవనముల నొసంగిన యేతద్ధర్మకర్తలకు మనకృతజ్ఞతను దెలుపుచు మనయగ్రాసనాధిపతిగారి యమూల్యోపన్యాసమును వినఁ గుతూహలులై యున్న మీకందఱికి నెక్కువ యాతనాయమును గల్పింపక నే నింతటితో విరమించుచు మరలఁ దమయందఱి కీఁక నొకపరి స్వాగత మొసంగుచున్నాను.

(గతమాస శేషము)

డచ్చటి కితని వడుగున కని వచ్చిన మేనమామ బలదేవుఁ డీతని యపారశివభ క్తికి మెచ్చి తానుగూడ నీతని మతము నవలంబించి తన కూఁతు నిచ్చి పెండ్లిచేసినట్లు బసవపురాణమున నున్నది. ఆ పెండ్లిసందర్భమున సోమనాథుఁడు వ్రాసిన యీ క్రింది పంక్తులు చూడుఁడు.

"రండు భక్తులఁ బిలువుండుమీ రెదురు,వొండు వేగమతోడి తెండు తెండనుచు
నిట వచ్చు నయ్యల కెదురు వచ్చుచును, నటువచ్చునయ్యల కర్థి మ్రొక్కుచును
సింహాసనస్థులఁ జేసి యా కర్మ, సంహారమూర్తుల చరణము ల్గడిగి
యవిరళనవ్యపుష్పాంజలు లిచ్చి, ప్రవిమలధూపదీపంబు లొనర్చి
యమ్మహాత్ములకు సాష్టాంగుఁడై యాక్షు, ణమ్ము విభూతి వీడ్యమ్ము లర్పించి
నిఖిలమాహేశ్వరనికరంబు నిట్లు, సుఖలీలఁ గొలువున్న-చో బసవయ్య''

ఈ సమయమున బసవేశ్వరునిచేఁ బూజింపఁబడిన కర్మసంహారమూర్తు లగు నా యయ్యలు, మాహేశ్వరులు, భక్తులు నెవరు? అదివఱకే దేశమున నున్న జంగమయ్యలు, లింగాయతులు కారా? కాదను బుద్ధిమంతులు వా రెవరో, వారి మత మెట్టిదో, బసవనికి వారితోఁ బొత్తెట్లు కుదిరెనో సయుక్తికముగ నిరూపింపవలెను. కావున బసవనికిఁ బూర్వము జంగములు లేరను శాస్త్రిగారి వాదము మిథ్యావాద మని చెప్పక తీఱదు. బసవేశ్వరుని పెండ్లి జరిగినది కళ్యాణప్రాంతమందలి కర్ణాటదేశమునఁ గాన నిట్టి వీరశైవులు పూర్వ మాదేశమున నుండి రేమో గాని యాంధ్రదేశమున మాత్రము లేరను వింతవాదమునకు శాస్త్రిగారు మరల దొరకొనెద రేమో! ఇదికూడఁ గేవల మసంగతమే. సోమనాథుఁడు వెలసిన నిజామురాష్ట్రాంధ్రదేశము పయిని జెప్పిన కర్ణాటదేశము నంటియే యున్నది, కాని, విశేషదూరమున లేదు. వీరశైవమతస్థాపకు లగు పంచాచార్యులలో మొదటివాఁ డగు రేణుకుఁ డుద్భవించిన కొలనుపాక (కదళీపురి) కూడ నీ దేశమందలిదే. ఆతఁడు స్థాపించిన మఠము లిప్పటికి నాంధ్రదేశమున నున్నవి. తెలుఁగుదేశములోని యుత్తరసర్కారులనెడి గోదావరీ, కృష్ణ మున్నగు జిల్లాలలో నీ మతము తరువాతఁ దరువాత వ్యాపించినట్లు తలంపవచ్చు నేమో గాని నిజామురాష్ట్రాంధ్రదేశమున మాత్ర మనాదినుండియు వెలసియున్న దనుట కనేకాధారము లున్నవి. తెలుఁగుశబ్దము త్రిలింగ, త్రినగ, త్రికళింగ శబ్దములనుండి పుట్టిన దని పలువురు పలు విధముల నిర్వచించుచున్నారు. శ్రీ బ్రౌనుదొరగారు 'Karnatic Chronology

అను గ్రంథములోఁ ద్రిలింగశబ్దమునుండియే తెలుఁగుపుట్టిన దని వ్రాయుచు, వీరశైవులలోఁ ద్రిలింగ (ఇష్ట, ప్రాణ, భావలింగములు) విచార మెక్కువగ నున్నది గనుక వీరశైవుల జన్మస్థల మాంధ్రదేశమే యనియు, బసవేశ్వరుఁడు వీరశైవ మతమును స్థాపించె ననుట శుద్ధమౌర్ఖ్య మనియు, నతనికి మున్ను చాలఁ బూర్వమునుండియే యీమత మీదేశమున నుండియున్న దనియు లిఖించినట్లు నా మిత్రులు (శ్రీ) చిదిరెమఠము వీరభద్రశర్మగారు నాకుఁ దెలిపియుండిరి. కావున వీరశైవమతప్రాచీనత కిది కూడ నొక నిదర్శనము.

నా వాదమునకుఁ బ్రమాణముగ నేఁ జేర్చినిన మూఁడవవిషయమునకు శాస్త్రిగారి సమాధానముల నిఁక విలోకింపుఁడు.

"ఇఁక బసవపురాణమున బ్రాహ్మణులను బ్రాటిమాల లని, పచ్చిమాల లని గర్హించుట చే సోమనాథుఁడు బ్రాహ్మణుఁడుగానేరఁ డనుటయు నసంగతమే యగును. పయితిట్లు సోమనాథునివి గావు. వీరశైవవివాదములందు బసవేశ్వ రాదుల వాక్యములను సోమనాథుఁ డనుకరించి చెప్పెను. కాని యవి సోమనా థుఁడు స్వయముగా నోరారఁ దిట్టినవి కావు. గ్రంథమునఁ బ్రసక్తు లగు కథా పురుషుల పనులను బలుకులను ననువదించిన మాత్రమున వానిని గ్రంథకర్త కతకరింపరాదు గదా! బసవపురాణమునఁ బ్రాహ్మణగర్హ యుండఁగా బండితా రాధ్యచరిత్రమున బ్రాహ్మణప్రశంస గలదు. పండితారాధ్యుఁడు బ్రాహ్మణధర్మ ముల నాదరించినవాఁడు గావున నందు సోమనాథున కట్లు వ్రాయవలసెను. బసవేశ్వరుఁడు బ్రాహ్మణధర్మములు గర్హించినవాఁడు గావున బసవపురాణమున నిట్లు వ్రాయవలసెను."

ఈ సమాధాన మెంత సమంజసముగ నున్నదో నిష్పక్షపాతబుద్ధి గల వారు గ్రహింపక పోరు. బసవేశ్వరాదులు బ్రాహ్మణులను దామే యే మాట లతో నిందించిరో సోమనాథుఁడు తాను స్వయముగఁ జూచియుండెనా? లేదు. లేనప్పుడు తాను బ్రాహ్మణుఁడే యయి బ్రాహ్మణులందు గౌరవప్రపత్తులు కలవాఁడే యైనచో నిట్టి నీచవాక్యములనే తన గ్రంథమున నేల చొనుపవ లెను? నిందావాక్యముల నసలే విడిచి గాని లేదా యే సామాన్యపుగర్హతోఁ గాని కథను సాగింప నయితి గాదా? మఱియుఁ దనబ్రాహ్మణుల నంత నీచముగ నిందించిన యీ బసవనియందుఁ దన కంత భక్తిపారవశ్య మేల? ఆతని యిలు పుట్టు బానిసకొడుక ననియు, తొత్తు ననియు, లెంక ననియుఁ బలు తెఱఁగులఁ

దన్ను వర్ణించుకొన నేల ? కావున సోమనాథుఁడు తాను గూడ బసవేశ్వర మతానుసరుఁడే కావున నీ నిందలు తన యుద్దేశానుగుణముగఁ గూడ నుప యోగించె ననుటయే యుక్తము. పండితారాధ్యచరిత్రమున బ్రాహ్మణప్రశంస యున్నదనియు నిట్టి గర్హ యందు లేదనియు వ్రాయుట వట్టి బూకరింపు. మచ్చున కీక్రింది వాక్యములు చిత్తగింపుఁడు.

"వారు వైదికులో యవైదికులో వి, చారింప లింగప్రసాదవిదూరు
లగువేదభారభరాక్రాంతు లని న, గఁగ సనై బ్రాహ్మణగార్దభం బన నె
గడి శ్రుతుల్ మోపరిగాండ్లె మోవంగఁ, బడిన బ్రాహ్మణగార్దభంబులకంటెఁ
గర్మచండాలుర కంటెనామ్నాయ, నిర్మాణ మెటుగంగ నేరరో యు...
దీక్షా ప్రకరణము పుట 29.

పంటింపకుండ నాబ్రాహ్మణు లెటేఁగి ............
కుక్క మొంగిష్టు గైకొను భక్తిగలదె, వ్యాఘ్ర విన మని యేచి నిందింపఁ
గుక్కయే యిది దీని కుక్కగుణ త్రాటి, కుక్కలు భువిఁ జెడు కుక్కలు గాక—
(మహిమ ప్రకరణము పుట 283.)

ఇత్యాదు లనేకములు. ఇందు మొదటివి పండితారాధ్యుఁడు తన్ను బ్రాహ్మణులు వైదికుల కట్టి లింగధారణ లింగప్రసాదస్వీకారాదివీరశైవధర్మ ములు తగునా యని తర్కించినప్పుడు స్వయముగాఁ జెప్పినట్లు సోమనాథుఁడు వ్రాసినవి. ఇట్టి గర్హ యనునది సోమనాథుని యేకృతులం దున్నను భవు లగు బ్రాహ్మణులఁ గూర్చియే గాని వీరశైవదీక్షితు లగు నారాధ్యబ్రాహ్మణులఁ గూర్చి కాదు. వీరశైవదీక్షితు లయి యుండియు బ్రాహ్మ్యంబుపయి పొత్తను విడనాడి తమలోఁ బూర్తిగఁ జేరకున్నను మల్లికార్జునపండితారాధ్యబ్రాహ్మ ణులను బసవేశ్వరాదులు గర్హింపలేదు. వారికి ముఖ్యమయినవి వీరశైవమత ప్రధానాంగములగు భస్మరుద్రాక్షలింగధారణాద్యష్టావరణములు అవి యున్న వారి నెల్ల వీరశైవులుగనే వారు సంభావించి యుండిరి. కావున నేఁ జెప్పిన బ్రాహ్మణగర్హ బసవేశ్వర పండితారాధ్య సోమనాథాదులందఱు సమానముగ నొనర్చినదే. సోమనాథుఁడు బ్రాహ్మణుఁడయినచో ధూర్తవిపు లతనిఁ బతితుఁ డని నిందించినట్లు పిడుపర్తి సోమన తన గ్రంథములలో వ్రాయుటలో సారస్య మేమి ? ఈ విషయము నెందుచేతనో శాస్త్రి గారు జాఱవిడిచిరి. కాని శ్రీ నాగేశ్వరరావుపంతులుగారీవిషయమును దమ వాదమున కనుకూలముగా

గ్రహించి "పాలకురికి సోమపతితుఁడు" అను ధూర్తవిప్రుని నిందయే బ్రాహ్మణ కులజననము తెలుపుచున్నది." అని వ్రాసిరి. పతితశబ్దము శబ్దార్థానుగుణముగ Fallen person (కులభ్రష్టుఁడు) అను నర్థమునఁ బ్రయోగింపంబడెనని యెంచవీలులే దని నా తలంపు. సోమనాథుఁడు జన్మమున బ్రాహ్మణుఁడయి యుండి జంగములలోఁ గలిసి పోవుటచేతనే బ్రాహ్మణు లిట్లు తిట్టి రన్నచో బసవేశ్వరాదులందఱు బ్రాహ్మ్యముకంటె నన్నవిధముల సర్వోన్నతం బని ఘంటాపథముగాఁ జాటి చెప్పిన యీ యుత్తమవీరశైవమతమును స్వీకరించినప్పుడిట్లు నిందించుట యెట్లు పొసంగును? ఇంతకు నీపదమును పిడుపర్తి సోమనాథుఁడు సంస్కృతీకరించి "సోమపతితుఁడు" అని సంస్కృతసమాసములోదా నుపయోగించినది. అస లాకాలపు బ్రాహ్మణు లొనర్చిన నింద సోమనాథుఁడు తమ్ముఁ ద్రాటిమాల లని పచ్చి మాల లని నిందించినందుకుఁ గాను నీసుగొని వాదమున నాతని నోర్వ లేక "నీ వంతకంటెఁ బచ్చిమాలవు" అని చేసిన మాఱుతిట్టే యయి యుండును. నిమ్నజాతులు (Depressed classes) ఇప్పుడుగూడఁ బతితు లనియే వ్యవహరింపఁబడుచున్నారు. చతుర్వేదపారమున నొనర్చిన నిందలలో వీరశైవమతవిద్వేషు లగు బ్రాహ్మణులకుఁ గులభ్రష్టు లను నర్థమునఁ గాక వట్టి నీచార్థముననే సోమనాథుఁడు పతితశబ్దము నుపయోగించినాఁడు.

సీ. గిరిజేశునకు నతఃపర మున్నదే నాస్తి లింగాత్పరం బని లీల ప్రాయు

...　...　...　...　...　...　...

గీ. శ్రుతిశిరస్సమూహ "పతి రేక యాస్తి"నుచు వచింపనుగ్గణు లుమదించి
　యితరసురలఁ బట్టి పతితులు సన్నుక్తి, బాహ్యులగు టదేమి బసవలింగ.

కావున ధూర్తవిప్రనిందాప్రయుక్త మయిన పతితశబ్దము పంతులుగారి వాదమునకు సాధకము కానేర దని మనవిచేయుచున్నాను.

సోమనాథుఁడు జంగమకులజుఁ డనుటకు నేఁ జూపిన ప్రధానకారణములపయి ప్రతివిమర్శకు లొనర్చిన వాద మందలి సారమును పాఠకులు చిత్తగించితిరి కదా! ఇఁక నాతఁడు బ్రాహ్మణకులజుఁడే యనుటకు వారు తమ పక్షమునఁ జెప్పు ముఖ్యవిషయముల నరయుఁడు. అవి (1) ఇతరుల వ్రాతలు- (2) సోమనాథుని చతుర్వేదపారగత్వము, అద్వితీయపాండిత్యము- (3)

పండితారాధ్యచరిత్ర శ్రోత యగు పాల్కురికి సూరనార్యునిమెడ సోమనాథుఁడు చెప్పికొన్న బాంధవ్యము- వీనిని క్రమముగఁ బరామర్శింతము.

"సోమనాథుఁడు లింగధారిబ్రాహ్మణుఁ డని వీరేశలింగము పంతులుగారు కవులచరిత్రమునందు వ్రాసియుండిరి" అని నాగేశ్వరరావుపంతులుగారు లిఖించిరి. కాని యిది నిజముకా దని చెప్పుటకు విచారించుచున్నాను. ఏ వాదమునకు నవకాశము లేకుండ (శ్రీ) వీరేశలింగము గారు సోమనాథుఁడు వీరశైవుఁ డని మాత్రమే వ్రాసియుండిరి గాని లింగధారి బ్రాహ్మణుఁ డని గాని జంగముఁ డని గాని యేమియు నిర్దేశింపలేదు. కవులచరిత్ర నూత్నముద్రణము పుట 221 చూడుఁడు. కర్ణాటకభాషలో విరక్తతోంటదార్యుఁ డను కవి రచించిన "పాల్కుర్కి సోమనాథపురాణ" మను గ్రంథములో సోమనాథుఁడు బ్రాహ్మణుఁ డని వేమనారాధ్యుని వంశమువాఁ డని గురులింగార్య మంగళాంబలకుఁ బుత్రుఁ డని వ్రాయఁబడియున్నట్లు (శ్రీ) శాస్త్రి గారు వ్రాసినారు. ఈ గ్రంథము నాకు లభింపలేదు, గాన, నందలి సంగతులను నేను బరికింప నవకాశము లేకపోయినది. ఈ తోంటదార్యుఁడు క్రీ॥ శ॥ 1560 ప్రాంతమువాఁ డని శాస్త్రిగారే వ్రాసినారు. అనఁగా నితనికి సోమనాథునకు నడుమ రమారమి 400 సంవత్సరములయంతర మున్నది. ఈతఁడు సోమనాథుని యాంధ్రగ్రంథములను జూచియుండక గురురాజకవికృత మయిన సంస్కృత పండితారాధ్యచరిత్రమును జదివి యందలి ప్రమాదములమూలమున నిట్లు వ్రాసి యుండు నని తోఁచుచున్నది. చెలిదేవి వేమనారాధ్యునకు సోమనాథునకు నెట్టి సంబంధమో మనము సోమనాథుని స్వంతవాక్యములవలననే తెలిసికొని యున్నాము. ఆతని మనుమఁ డీతనికి విద్యాగురుఁ డగుట దప్ప మఱి యితరసంబంధ మేమియు సోమనాథుఁడు చెప్పికొనలేదు. గురులింగశబ్దవిచార మొనర్చి యది వేమనారాధ్యుని మనుమని పేరు కా దని నిరూపించి, గురురాజకవి ప్రమాదముల నిదివఱకే వ్యక్త మొనర్చియున్నాఁడను. కావున సోమనాథుని వేమనారాధ్యుని వంశమువాఁ డనుటయు నతని మనుమఁ డని గురురాజకవి తలఁచిన గురులింగార్యుని తనయుఁ డనుటయుఁ దోంటదార్యునకు సంస్కృతపండితారాధ్యచరిత్రపఠనమునఁ గలిగిన ప్రమాదములే యని స్పష్ట మగుచున్నది. ఇంత యేల ? సోమనాథుని కులగోత్రములను దలిదండ్రులను దెలియుట కాతఁడు రచించిన గ్రంథములే యుండ నాతని తరువాతఁ

గొన్నివందలయేండ్ల కితరదేశీయులు భ్రమప్రమాదములఁ జొనిపి వ్రాసిన గ్రంథములా మనకుఁ బ్రమాణములు! ఇంతకు వేమనారాధ్యుని వంశజుఁ డనుటయే గాని సోమనాథుని బ్రాహ్మణుఁ డని తొంటెదార్యుఁడు తన కృతిలో న్స్పష్టి వక్కాణించెనో లేదో? వేమనారాధ్యుని వంశ్యుఁ డనుటనుబట్టియే బ్రాహ్మణుఁ డని వ్రాసె నని శాస్త్రి గారే తలంచిరో? పండితారాధ్యచరిత్రమందలి వేమనారాధ్యచరిత్రమును బట్టి యావేమనారాధ్యుఁడు బ్రాహ్మణుఁడో జంగముఁడో నిరూపింప వీలు లే దని ముందే తెలిపి యుంటిని గదా! కావునఁ గర్ణాటకృతి యగు సోమనాథపురాణమందలి వ్రాఁతలు మనకు సత్యనిర్ణయమున కెంతవఱకుఁ దోడ్పడునో చదువరులు గ్రహింతురు గాక!

ఇఁకఁ బ్రతిపక్షులు సోమనాథుని జంగమునిగా నంగీకరింపకుండుటకు వారికిఁ బెద్దకంటక మయినది పాండిత్యవిషయము. ఈ సందర్భమున శాస్త్రి గారి వాక్యములఁ బరికింపుఁడు.

"పండితారాధ్యచరిత్రము, చతుర్వేదసారము, బసవరాజీయము (సోమనాథభాష్యము) మొదలగు సోమనాథుని గ్రంథములను బరిశీలించినచో సోమనాథుని బ్రాహ్మణత్వము సందేహింపరానిదిగా గోచరించును. మంచి శిష్టాచారసంపత్తి గల బ్రాహ్మణునకే యెఱుకపడఁ దగిన విషయము లెన్నియో పయి గ్రంథములందుఁ గలవు. వానిలో వేదమంత్రము లుదాహృతము లయినవి. వేదభాష్యము లుద్ధృతము లయినవి. వైశ్వదేవాదిశ్రౌతకర్మలరహస్యము లెన్నో విమర్శింపఁబడినవి. ఆనాఁ డిట్టి విషయము లబ్రాహ్మణుల కందరానివిగా నుండెడివి. పండితారాధ్యచరిత్రమున "నలిఁ బాల్కురికి సోమనాథుఁ డనంగ వెలయువాఁడను జతుర్వేదపారగుఁడ" అనుట యాతని బ్రాహ్మణత్వమును ఘోషించుచున్నది. బ్రాహ్మణేతరుఁడు వేదమును జదువ రా దనుటకుఁ బ్రమాణములను సోమనాథభాష్యమున సోమనాథుఁడే యుదాహరించియున్నాఁడు. (అశుద్ధాత్మా ఽ శుచి ర్లోభా న్మద్యుక్తం పావనం పరమ్ భక్షయ న్నాశ మాప్నోతి శూద్రో హ్యధ్యయనా దివ; శూద్రస్య వేదాధ్యయన మగ్రజాగ్రహణం తథా") నేఁటి బ్రాహ్మణాబ్రాహ్మణసమస్యకు మూలకంద మయి దేశదౌర్భాగ్యైకకారణమైన యిట్టి యభాగ్యవిషయమును వీరు తమ వాదమున కాధారముగాఁ గొనుట కడుంగడు శోచనీయము. బ్రాహ్మణులే గాని బ్రాహ్మణేతరులు పాండిత్యము నొందరా దని వా రజ్ఞానాంధకారమున మ్రగ్గవలసినదే యని భగడి

చ్ఛాసన మేమయిన నున్నదా ? సోమనాథుఁడు వేదాధ్యయనము కూడ దని వ్రాసినది శూద్రునకుఁ గాని శాస్త్రిగా రుదాహరించినట్లు బ్రాహ్మణేతరు లందఱకుఁ గాదు. ఇంతకు నీ గొడవ వీరశైవులవిషయమున శాస్త్రిగారి కెట్లు సహాయక మగును ? బసవపురాణ పరిష్కర్త లగుశాస్త్రిగా రిట్లు వ్రాయుట మఱియు నాశ్చర్యము. బ్రాహ్మణులకు గర్వభంగ మగునట్లు తమ యింటి కుక్కలచేతఁగూడ వేదమును జదివించిన కల్లి దేవయ్య మున్నగు వీరశైవుల చరిత్రలను శాస్త్రిగారు బసవపురాణమునఁ జదివి యుండియు నిట్లు వ్రాయుట విపరీతముగాదా ? ఉపనయనమును నిరాకరించినంతనే వీరశైవుల బ్రాహ్మణులు గాని శూద్రులు గాని కాఁజాలరు. సంపూర్ణషడధ్వశుద్ధితోఁ గూడిన శివ లింగదీక్షావిధాన మందలి క్రియాదీక్షచే ద్విజత్వము లభించి, లింగార్చనా రూప మగు కర్మాధికారమును, మనుదీక్షచే విప్రత్వము సిద్ధించి పంచాక్షరీ పంచబ్రహ్మమంత్రపారాయణ రుద్రాధ్యయనాది రూపక మగు వేదాధికారమును వేధాదిదీక్షచే బ్రహ్మత్వము ప్రాప్తించి లింగాంగసమరసజ్ఞానరూప మగుబ్రహ్మ జ్ఞానోపదేశాధికారమును గలిగి లింగధారణముననే సమస్తాధికారములు తమకుఁ బ్రాపించుననియు, బ్రహ్మసూత్రము, పరబ్రహ్మచిహ్నము నగు శివలింగమును ధరించునపుడు వేఱొక యజ్ఞోపవీతముచే నవసరము లేదనియు, లింగమే యజ్ఞోపవీతమనియు వీరశైవుల మతము. విస్తరభయమున నీ విషయ మిటఁ బ్రపంచింపఁజాలను. మఱియు వీరిలో స్త్రీపురుషు లిరువురకుఁ గూడ దీక్ష విహితము. బాలురకుఁ గూడఁ బుట్టిన వెంటనే దీక్ష నొసంగెదరు. బ్రాహ్మణులందన్ననో స్త్రీల కెట్టిసంస్కారమును లేదు. బాలురకు గర్భాష్టకమునఁ గాని యుపనయనము జరగదు. అది జరగినఁగాని కర్మాధికారము గలుగదు. అప్పటివఱకు శూద్రత్వమే. కావుననే వీరశైవాగమములలోఁ నిట్లు చెప్పఁబడినది.

శ్లో. జన్మనా జాయతే శూద్రః, ఆదౌ మాతాచశూద్రిణీ
సతీచ శూద్రిణీచైవ, సర్వశూద్రో భవే ద్ద్విజః॥

ఇందుచే శూద్రత్వము కొంతవఱకయిన బ్రాహ్మణులందే గానవచ్చును గాని యీగర్భపరిశుద్ధు లగు వీరశైవులయెడ నొకింతయుఁ గానరాదు. బ్రాహ్మణులను ద్రాటిమాల లని నిరసించి బసవేశ్వరుఁ డన్నఁ దన్నయుఁ డగు సోమ నాథుఁడు వీరశైవులగు జంగములను గలలోనయిన శూద్రులుగఁ దలంపఁ

# కాళిందీకన్యాపరిణయము.

## ద్వితీయభాగపీఠిక.

———

ఈమహాప్రబంధమునకుఁ గర్త యగునహోబలపతి జన్మదేశాదు లగు సామాన్యవిషయములం గూర్చి ప్రథమభాగపీఠికలో ముచ్చటించితిని. ఇంక నిపు డిందుఁ గలవిశేషములను వివరించెదను. ఈభాగమున ౪-౫-౬ ఆశ్వాసములు గలవు. అందు నాల్గవయాశ్వాసమున నాముక్తమాల్యదాది కాంధ్రప్రబంధరత్నములందు వలెను గిరాతార్జునీయాది సంస్కృతకావ్యములందు వలెను ఋతువర్ణనము మంచిమంచి కల్పనలతోను గొప్పగొప్ప భావములతోను జేయంబడినది. చూడుఁడు :—

—। వసంతవర్ణనము ।—

సీ. నిఖిలాగమాంతనిర్నిద్రశోభ నొసంగు నిరుపమమహిమచే నెసఁగువాఁడు
శుకముఖద్విజరాజిచూపుల కింపైనఫలములు చేకూర్పఁగలుగువాఁడు
బలుజడిచే నైనయలజడి సహియించుమానుల మధురోక్తి మనుచువాఁడు
తెలిపువ్వునీటిచే దేవయాత్ర ఘటించు మాధుకరశ్రేణి మంచువాఁడు
సాధుసుమనోనిరంతరసౌఖ్యవైక, మూలకారణ మైనట్టిమేలువాఁడు
మాధవుఁడువచ్చెనవ్వేళమధురలీల,వనరమాంగనయామోదమున మెలంగ.

సీ. పంజరగుహాలలోపల నున్కి గైకొని శర్కర మెక్కెడు జంతువితతి
నతివృష్టి కోరిచి యశనంబుగానక గాసిల్లు మానిసంఘాతములను
సరసులలో నుండి జలవాసవృత్తిచే వర్గిల్లు వరహంసవారములను
నలరునీ రక్కడ నక్కడఁ ద్రావుచు వసియించుచేతనవ్రాతములను
సత్పరిగ్రహాలాభంబు సంభవిల్ల, నురుతరామోద మందెడు యోగితతుల
మన్ననయొనర్చెఁ దావచ్చిమాధవుండు,కామితార్థఁబులవ్వారిగాఁగనిచ్చి.

ఇందలిశ్లేషవిశేష మెంతచక్కనిదో!

—। గ్రీష్మర్తువర్ణనము ।—

గీ. కూటిపేదతికంబు గైకొనిరి మిగుల,నాతిరముచేత బ్రతికెడునట్టివారు
ఖనన మొనరించితనుయాత్రగడపువారు,కూలిగలుగుటనవ్వేళగూఁటఁబడిరి.

క. కూటిరుచి పాన మొందెను, బొటిల్లెను నీళ్ల సుళ్లు పవనంబునకున్
మేటి సురతములకూరిమి, గాటపుటుపగూహనములఁ గదలక నిలిచెన్. ౩౭

ఈ రెంటియందును స్వభావోక్తి చక్కఁగ వర్ణింపఁబడినది.

క. పడమటిసెక నుదుకఁగఁబడి, పిడికిటివస్త్రంబు లెల్ల బెట్టాఁడంగాఁ
గుడికరమునందు నిలిపిరి, కడుఁబూతం బనుచు వానిఁ గర్మారంభుల్. ౮౮

ఇం దాచారసంప్రదాయము కలదు.

—॥ వర్షర్తువర్ణనము ॥—

సీ. ఆహితాగ్నుల కెల్ల నాత్మవైశ్వానర రక్షయే కార్యసర్వస్వ మయ్యె
భోగికైనను రాత్రిభోజనం బెచ్చట నన్నమాత్రము కాని యబ్బదయ్యె
సారమంత్రోపాస్తిచతురుల కశనంబు వార్తగల్గుట గానివావి యయ్యెఁ
బ్రతిగృహంబున కేగి ప్రార్థింపఁ (బ్రార్థింప) శిఖియొకింతొసఁగినఁ జిత్రమయ్యె
జంబుగూడలకలుములు డంబుమిగిలెఁ, గతకసంపాదనంబులు ఘనతఁగాంచె
నన్నదాతకు నేనియు నతిథి కొకని, కైన నన్నంబు గలదను టరిదియయ్యె.

ఇది యాముక్తమాల్యదఛాయ—

"ఇల్లిల్లుఁ దిరుగ నొక్కింతబ్బు శిఖ; యబ్బెనే నింటిలోఁ బూరి యిడివిసరక
రాఁజదు; రాఁజిన రవులుకో ల్వాసాలఁ గాని కల్గదు; మఱి దానఁ గలిగె
నేని కూ డగుట మందైనఁ బెన్బోఁగ సుఖభుక్తి సేకూర; దాభుక్తి కిడినఁ
బ్రాగ్భోక్తల కెతీఁబు బహుజనాన్నము; దీఁబ నారులకొదవుఁ బునఃప్రయత్న
మాజ్యపటముఖ్యులయ మెన్న; రాలయాంగ
దారులయ మెన్న రంతిక; కారజనిక
పచన నాంధ్రోగృహిణి రామిఁ బడుక మరుఁడు
వెడవెడనె యార్పు నొగిలి రజ్జడిని గృహులు."

ఉ. కాలువలెల్ల బల్నదులకైవడిఁ గాంచె నదీలలామముల్
గేలియొనర్పఁగాఁ గడఁగెఁ గేవల మబ్ధి నతండు నీరమూ
త్రాలయుఁడైనఁ దావిక్రుతినందక యుండు వికారహేతువుల్
చాల మెలంగినన్ వికృతిసంగతిఁ గాంచునె ధీరచిత్తముల్. ౯౭

ఇందలి యర్థాంతరన్యాసము మహాకవికాళిదాసుని కుమారసంభవములోని
"వికారహేతౌ సతి విక్రియన్తే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః" అను
శ్లోకమునుండి గ్రహింపఁబడినది.

కవు లిట్టి మనోహరము లగుకల్పనలను భావములను బద్యభాగాదులను దత్తద్భావతత్పరులై యనుకరించుచుందురు. దానిని వసమర్థతచేఁ జేసిన గ్రంథచౌర్య మనరాదు.

—। శరదృతువర్ణనము ।—

క. జీవన మాతయు లోకో, జ్జీవనమున కిడుచుఁ గార్యసిద్ధి వడపి మై
కేవలఫలితంబుగఁ దాఁ, బోవదె ఘనపాళి యక్షపుంగవు దిశకున్. ౧౧౭

ఇందుఁ భారతీయులకుఁ బరమపురుషార్థసాధన మగు మహాప్రస్థానము సూచితము-

—। హేమంతర్తువర్ణనము ।—

ఉ. తమ్ములదాయ మేర్పనఁగఁ దాళక తమ్ములనేఁచ మంచుదె
చ్చు మ్మరియాద మీఱ వడిఁజొన్పఁగఁ దమ్ములతోడ నాత్మస
ఖ్యమ్ము భరించు కల్వలును గాఱియఁజెందెను మిత్రవర్గమా
తమ్ము నెఱుంగఁ డయ్యె నుచితస్థితిఁ గాంచ జనుండు నేర్చునే. ౧౧౮

ఇందలి యర్థాంతరన్యాసము సర్వకాలములందును సర్వజనులకు ననుభవసిద్ధమైనది.

—। శిశిరర్తువర్ణనము ।—

ఉ. శీతముచేత బాధపడు చిత్రజగంబు భరింపఁగా జగ
త్త్రాత దినేశుఁ డీశ్వరతఁ దాల్చుచు నంబరమధ్యసీమఁ దాఁ
జాతురినేగుచు న్నిటలచంచదచంచలదృష్టి కించిదు
న్నీతము చేసెఁ గావలయు నెమ్మిఘటిల్ల హరించుశీతమున్. ౧౧౯

ఇందలిస్వభావ మెంతబాగుగనున్నదో! మఱియు నీభావము, "బ్రహ్మస్వరూప ముదయే, మధ్యాహ్నేతు మహేశ్వరమ్, సాయంకాలే సదా విష్ణుః త్రిమూర్తిశ్చ దివాకరః" అను శ్లోకభావమూలకము.

క. అప్పప్ప యేరికైనను, జెప్పంగాశక్యమానె శీతముమహిమల్
నిప్పుల కప్పులకుం దాఁ, దప్పక యన్యోన్యసదృశతను ఘటియించున్. ౧౨౦

చూచితిరా యతిశయోక్తి మహిమ!

(2) పంచమాశ్వాసమున- శ్రీకృష్ణుఁడు ధర్మరాజును జూడఁబోయి యర్జునునితోఁ గలిసి యమునానదీతీరమునకు వేఁట కేగి యటఁ దనకై తపము చేయుచున్న కాళిందిం జూచి యామెను దనపురమునకుఁ దీసికొనిపోయి వివా

హము చేసికొనియె ననుకథ సహృదయ హృదయాహ్లాదకములైన రసగంభీరకల్పనావిశేషముగల నూటయిరువది గద్యపద్యములతోఁ జక్కఁగ వర్ణింపఁబడినది. చిత్తగింపుఁడు.

ఇంద్రప్రస్థవర్ణనాసందర్భమున నీవిద్వత్కవి తనకుఁ బరిపూర్ణప్రజ్ఞగల యష్టభాషావిశేషము నెట్లుచూపెనో :

సీ. సర్వభాషావచస్సంపన్నిధానంబు సాధ్యసిద్ధవచోవిచారితంబు
శౌరసేనాధారతారుచిమంతంబు వ్యత్యయకార్యోపపత్త్యనుగత
మనుస్మృతభవికలాపాయోగసిద్ధంబు శేషోపహతద్వ్యర్థోల్లేఖితంబు
అన్యథాభావప్రవాహణనిరూఢంబు సప్తాంగరూపప్రశస్తమహిమ
మైవిరాజిల్లు నష్టభాషావిశేష, సముదయస్ఫూర్తి హాసియింపఁ జాలునట్టి
పురవరంబు హరిప్రస్థపుణ్యనామ,మచ్యుతానందముగఁగాంచెనచ్యుతుండు.

ధర్మజునిభక్తిగౌరవము లెట్లు చిత్రించెనో చూడుఁడు-

గీ. జలజనయన యిహాముత్రఫలవితాన, మూలకారణ మని మదిఁ జాల నమ్మి
నీపదభక్తి చేకొని నిలిచినాఁడ, నితరము నెఱుఁగఁగద యిట నీవెసాక్షి.

గీ. తమము హరియించి వస్తుతత్త్వంబుఁ దెలుప,నీవకా కన్యదేవత నేర్పుగనదు
దురితసంహారజగతి ఖద్యోతుమహిమ,మొనరు నేరీతిఁదలఁపఖద్యోతమునకు.

ఈవిద్వత్కవి తన శాస్త్రీయజ్ఞానమును 17 వ పద్యమునఁ గాళిందీతీరకాంతారమును మీమాంసా తర్క వ్యాకరణ చ్ఛందో లంకార భరతశాస్త్రములతోను ప్రాకృత త్రిలింగభాషలతోను నుత్తమకావ్యంబుతోను శ్లేషించి పోల్చి చూపెను. శ్రీకృష్ణుని వివాహసందర్భమును 73వ పద్యములో నాదబ్రహ్మమును నిరూపించెను.

"మంచిభోజనము" అను 140 పద్యమున హాస్యరసలవము.

"పగలుగాచించు"నను 155 పద్యములో నప్పగింతలలోఁ బిల్లలు పెద్దలందున్నగుణము గ్రహియింపవలయును గాని పెద్దలందు దోష మున్నను గ్రహింపరా దనునీతి చక్కఁగా బోధింపఁబడినది.

(3) ఇఁక షష్ఠాశ్వాసము.

ఇందుఁ గాళిందీకృష్ణుల సరససల్లాపములు వర్ణింపఁబడినవి. కాని నాగరకులకు వెగటుగల్గించు మోటువర్ణనము లెందును లేవు. ఇంతియే కాదు, కేవలశృంగారప్రధానమ్ములగుపట్టులందుఁ గూడ నీవిద్వత్కవి యావిషయమును

దనశ్లేషమహిమచేఁ గావ్యముతోను శాస్త్రములతోను నాగమములతోను సంస్కృతప్రాకృతాంధ్రభాషలతోను మూలప్రకృతి (అవిద్య)తోను బరబ్రహ్మముతోను బోల్చి చదువరుల డెందములం దనాదిపరమసిద్ధాంతముల నాటును. వీనికిఁ బూర్వభాగమునందుఁగూడఁ జాల నుదాహరణములు గలవు.

41 వ "కామితమేసియుర్కు" అనుపద్యములో "సర్వత్ర జయ మన్విచ్ఛేత్పుత్రా దిచ్ఛే త్పరాజయ" మ్మనుదానిభావము గలదు.

"హృదయగ్రంథి" యను 42 వ పద్యములో "భిద్యతే హృదయగ్రన్థిః ఛిద్యన్తేసర్వసంశయాః, తస్మిన్దృష్టే పరావరే" అను నుపనిషత్సారము నిమిడించెను.

"నేరుపుమీఱ" అను 49వ పద్యములో శృంగారరసము నలు పను సంప్రదాయము తెలియఁజేయఁబడినది.

56 క్రొమ్ముడి యుత్తమనిబంధము (కావ్యము)

60 కబరి యుత్తమకావ్యముం బోలును.

గీ. ద్విత్వరహితంపుటాకృతిఁ దేజరిల్లి, ప్రాకృతాఖ్యాకభాషనాభాషితద్వి
రేఫవైఖరిగలిగిత్రిలింగ దేశ, సూక్తియనఁనొప్పుఁగస్తూరిచుక్కబొట్టు. 67

ఇందుఁ గస్తురి చుక్కబొట్టు ప్రాకృతత్రిలింగభాషలవలె నున్నది.

70 చవుతిచందురుఁజూచిన నీలాపనిందవచ్చును.

86 కార్యసాధనవిధానము మంచి దను నీతి బోధింపఁబడినది.

90 "వనిత యరగన్ను" అనుదానిలోఁ దపము (నిరంతరదీక్ష) బలిమిని గార్యసిద్ధిని గలిగించు ననునుత్తమసిద్ధాంతము.

97 "వాగ్భూషణంభూషణం" అనుదాని యభిప్రాయము.

113 లజ్జ నవిద్యతోఁ బోల్చి గురూపదేశమున నవిద్య నశించు నను మహాభావము స్ఫురింపఁజేసెను.

124 "సాంజనాతి"—ఇందుశబ్దచిత్ర మయిన యమకము.

138 "బ్రహ్మ మననొప్పు"—అద్వైతసిద్ధాంతము. చూచితిరా శ్లేషమహిమ! అతిశృంగారములోనుండి మహావేదాంతమునకుఁ గొనిపోయినది.

145 "కరితబింబోష్ఠి"—ఇందుఁ గల్పనావిశేషము.

151 "మృదుపదమై"—282 "సుప్రసాదత"- ఇందు రసావహ మైనచో దోషము గూడ గుణమగు ననుకవిభావము తోఁచుచున్నది.

163, 236 గగనకుసుమము-అప్రసిద్ధ మని తార్కికుల సంప్రదాయము.

174 "పయోధరమండలము" అను శ్లేషరూపక మహిమచే వర్షాకాలము ప్రత్యక్ష మగుచున్నది.

176 త్రివేణీస్నానమున ననంతసౌఖ్యముకలుగు నను పౌరాణిక భావము.

188 తపముచే నణిమాదిసిద్ధులు గలుగును.

191 ఆత్మస్వరూపమును బైలుపఱుచువిధాన మతినిపుణముగా నిరూపింపఁబడెను.

197 గురుశుశ్రూష పరమసుఖంబు.

202 రూపకమహిమ మిందుఁ గలదు.

223 ఈపద్యమునందు (అహిభయము) స్వపక్షభయము గలరాజురాజ్యము క్షీణించు నని చూపఁబడినది.

229 బ్రహ్మతత్త్వము.

230 భగవంతుఁడు సర్వద్రష్ట.

241 భగవంతునిదర్శనమైనపుడు సర్వహృదయగ్రంథులు వీడిపోవును.

270 ఈగద్యము ప్రథమాశ్వాసములోని "వెండియుజగజ్జన్మాది" అను పెద్దగద్యమువంటిది. ఒకవిశేషము—అం దర్థాలంకారములే గలవు. ఇందుఁ గొన్ని శబ్దాలంకారములును గలవు, కుండలిబంధము, నాగపద్మబంధము, మాలికా బంధము నిట్లు "నానాలంకారలీలామూలాస్పదంబై తనరు."

మొత్తముమీఁద నీమహాప్రబంధమున శృంగారరసము ప్రధానము. మిగిలినవి యంగములుగా నక్కడక్కడ నౌచిత్యానుసారముగా నిరూపింపఁబడినవి. కదళీపాకము ప్రాయికము. అక్కడక్కడ నారికేళపాకము గూడఁ గలదు. శైలి లక్షణలక్షితము. గుణాలంకారము లత్యంతమనోహరములు. రీతివృత్తులు రసానుగుణంబులు. భావంబు లతిగంభీరంబులు. అనర్గళ మగుకవితాధార. దానికిం బదిరెట్లు వేదవేదాంతసంస్కృతప్రాకృతాంధ్ర వ్యాకరణతర్కమీమాంసాలంకారాది సకలశాస్త్రసర్వతోముఖపాండిత్యమహిమ. దానికి నూఱురెట్లు శ్లేషచమత్కారము. విద్వత్కవి రచించిన యీమహాకావ్యమునందలి భావములు సుబోధము లగుటకు విపుల మగువ్యాఖ్యాన మపేక్షణీయము. మనయాంధ్రసాహిత్యపరిషత్తువారు తగినయత్న మొనరించి వ్యాఖ్యానము చేయించి ప్రకటింపఁ గడంగుదురు గాక! మూలమూలల నున్నయిట్టి

మహా గ్రంథములను సంపాదించి ప్రకటించి కవులకీర్తులను జిరస్థాయులుగాఁ జేయుచున్న యీపరిషత్తువారికి జగత్కారణం బైన శివకేశవాది నామములచే భావింపఁబడు పరబ్రహ్మము దీర్ఘాయురారోగ్యైశ్వర్యజ్ఞానసంపదభివృద్ధులను జగదుపకారకకృత్యనిరంతరదీక్షాదక్షతల నిచ్చుఁగాక !

గీ. చిలుకపలుకులు చెవులకుఁ జెలువుగొలుపు
నట్లు దక్షిణవాక్యము లాత్మతృప్తి
నందఁజేసెడు నీకు నారాయణాత్మ
ముదముగన లోకబుధులు ప్రమోదమూప !

ప్రమోదదక్షిణాయనము, పిఠాపురము, } శ్రీపాద పాపయ్యశాస్త్రి, శ్రీసూర్యరాయాంధ్రనిఘంటుకార్యస్థాన పండితుఁడు.

# కాళిందీకన్యాపరిణయము.

## ద్వితీయభాగము.

---

— విషయసూచిక — పుటలు.

సంజ్వరమున కుదాహరణము—

చ. చెలులు ప్రయత్నపూర్వముగఁ జేయుచునున్న హిమోపచారముల్
తలఁపఁగ వమ్ముగా నొకఁ బరితాపభరంబు ముహుర్ముహుఁ జాలు నీ
యలఘుచికిత్స యొండెఱుఁగ మచ్యుత నీకరుణామృతంబు పైఁ
జిలికి లతాంగికిం దనువుసేయఁగదే యిదె నీకు మ్రొక్కెదన్.

క. చేతనము నచేతనము, న్నాతతముగ నేరదేని యది యున్మాదం;
బౌ తెలివియు లేనిది మూ, ర్ఛాతిశయము; చరమయత్న మది చరమముగున్.

ఉన్మాదమున కుదాహరణము—

చ. చెలులకు నేటికిం బ్రియము సెప్పఁగ నే నుదకంబు వోసి కో
మలముగఁ బెంచినట్టియెలమావికిఁ జెప్పినఁ బోయి రాదె పెం
దలకడ నొంటిఁ బో వెఱతుఁ దా నని పల్కెఁ దోడువంపనే
లలితలతావితానము నిలాధరుపాలికి దూతవృత్తికిన్.

మూర్ఛ కుదాహరణము—

చ. అతులతపఃప్రభావమహితాత్ములకైనను గానరాని యౘ్యుతుఁడు లతాంగి నెమ్మనము సొచ్చి సుఖస్థితి నున్నవాఁడు నేఁ
డతని భజింత మంచు శ్రవణాదులు దద్గతవృత్తి నుంట నా
యతివ సఖీజనంబు భయమందఁగ నున్నది నిశ్చలాకృతిన్.

చరమ కుదాహరణము—

చ. పడుచనొ పైదనో యలరుఁబ్రాయము నొంది యశోదనెయ్యపుం
గొడుకు భజింపలేని బ్రదుకున్ బ్రదుకా యది యేల నాకు మా
మిడిచిగు రేమిబ్రాఁతి యటమీఁదట వెన్నెల యెంత నవ్వన
న్నెడపు మనోజుఁ డేపఁగ సహింతునె బోటి యనాథచామ్పనన్.

క. చరమదెసకు లక్షణ మిట్టరసి యెఱుఁగవలయుఁ గాని యచ్చో సతికిం
బురుషునితోడిసమాగము, పరితోషము చెప్పవలయు భవ్యార్థముగన్.

ధన్యత కుదాహరణము—

చ. కువకుమమీఁదఁ గస్తురి యిభస్ఫుటకుంభములందు నంకుశ
ప్రవిహితరేఖ లాయెగువ భావజనూత్నసితక్షతంబు లీ
యువతికి భూషణస్ఫురణ నొప్పుచునున్నవి చూడరమ్మ మా
ధ్రువపురినాథుమన్ననఁ బ్రరూఢతఁ బొందిన చిహ్న లన్నియున్.

వ. మఱి సంభోగవిశేషం బగు పంచవిధశృంగారం బెట్టిదనిన:—

క. శృంగారభంగు లైదు తె, అంగులు వాగ్విలసనంబు రహి నైపథ్యం
బంగక్రియ*సంకీర్ణము, సంగతముగ మిశ్రమనఁగఁ జనుఁ గంసారీ.

గీ. తలఁప వాగ్వృత్తి సంకీర్ణములును క్రియలుఁ
బరఁగు నొక్కొక్కవిధము నైపథ్య మైదు
తెఱఁగులై యుండు మిశ్రంబు త్రివిధ మి
ట్లుద్భూతశృంగార మేకాదశాంచితముగ.

క. తనమదిఁ గలసంతోషము, వనజానన తాన చెప్ప వాగ్వృత్తి యగుం
దనచెయ్వులు నెచ్చెలులకు, ననయము గానంగనైన నది క్రియయయ్యెన్.

వాగ్వృత్తి కుదాహరణము—

క. కన్నులపండుగ సుమ్మీ, వెన్నుఁడు; తద్గుణచయంబు వీనుల కమృతం;
బెన్నఁగఁ దత్పరిరంభణ, మన్నిసుఖంబులకు నెక్కు డతివా నాకున్.

అంగక్రియ కుదాహరణము—

క. తొయ్యలిహరికౌఁగిలిఁగని, పయ్యెదచనుఁగవకుమాటుపఱుచుట తగుఁబో
అయ్యధరముపై నంగుళి, మొయ్యనఁ గదియించెఁ జూపకుండుట తగునే.

క. ఎందును నైపథ్యమునకుఁ, జందనభూషాంబర ప్రసవములు వేర్వే
ఱొందుఁ జతుర్విధ మొక్కటి, యందంబుగఁ బంచవిధములై యటుజరుగున్.

అనులేపనశృంగారమున కుదాహరణము—

క. వనితకు హరియొనరించిన, నునుబూఁతలు మకరికామనోహరలిపులం
బునఁగలియుబాహువుయుగళము, దనుగను వలిపెంపుఱవిశెఁ దాల్చిన భంగిన్.

ఆభరణశృంగారమున కుదాహరణము—

క. యువతీ రత్నాభరణము, లవయవములఁ గీలుకొల్పి హరికరరంభో
త్సవవాంఛ నిడదు నిజేచను, గవనెపమున హారవల్లికలు కంఠమునన్.

వస్త్రశృంగారమున కుదాహరణము—

క. అలఘుకుచకలశయుగళము, లలితోరుద్వయము నుజ్జ్వలస్థితిఁ దనక
న్నులకింపౌనఁగవలయుననిf, హాలఁతికిఁ గృష్ణుండుజిలుగుఁబుట్టముఁగట్టెన్.

*వాగ్విలసనంబు నైపథ్యంబున్ అంగక్రియ— మూలము.

† కన్నులకింపౌసంగవలయునని తన— మూ.

మాల్యశృంగారమున కుదాహరణము—

క. హరికృతకుసుమసముచిత, కరపదకటకంబు లమరెఁ గాంతకు నిందిం
దిరబృందనినదఝంఝం, కరణము లవి యప్రయత్నకలితము లయ్యెన్.

చతుర్విధశృంగారమున కుదాహరణము—

క. హరివేషము దనయంతః, కరణంబున కెంత ప్రియమొ కాని సువర్ణాం
బరమును మకరకటకముఁ గస్తురియును వనమాలికయును సుదతిధరించెన్.

క. నైపథ్యము వాగ్వృత్తియు, నేపారఁగఁ గ్రియయుఁ గూడెనే సంకీర్ణం
బై పరఁగు రెండురెండు న, మీపంబుల నిలిచెనేని మిశ్రము గృతులన్.

సంకీర్ణశృంగారమున కుదాహరణము—

క. దర్పణముఁ జూచి తిలకము, దీర్పఁగ నగవులకు వెనుకచెన నిల్చినఁ దా
నేర్పడఁ గని సరసోక్తు లొలర్ప నతివ లేచి కుచములం బొడిచె హరిన్.

నైపథ్య క్రియాత్మకమిశ్రమమున కుదాహరణము—

క. అభినవశృంగారము లోఁ, బ్రభగల జంబీరఫలము బాలకి చేతన్
రభసమున నందికొనియెద, విభగమనా మనునిశం క్రి కెనురేగెదవే.

వాగ్వృత్తిక్రియాత్మకమిశ్రమున కుదాహరణము—

క. హరిమురళీనాదమునకుఁ, గరతాళధ్వనులు చెలఁగఁగాఁ గలకంఠ
స్వరములఁ బాడుచు నాడిరి, గురుతరమోదమున దివ్యగోపిక లెల్లన్.

---

వ. మఱి భావోదయాది చతుష్టయం బెట్టి దనిన—

క. తనరఁగ భావోదయమును, జను భావశమంబు భావసంధియు బుధరం
జన మగుభావశబలతయు, మునుకొని సంచారిభావములు దీపించున్.

ఉ. ఏ దఁట యొక్క భావ ముదయించు మనంబున నివ్విధంబు భా
వోదయ, ముద్భవించునది యొప్ప శమించుట భావశాంతి, స
మ్మోద మొగిన్ రసద్వయము ముట్టి జనించుట భావసంధి, ప్ర
హ్లాదవిధేయభావశబలత్వముగు న్బహుభావసూచనన్.

భావోదయమున కుదాహరణము—

క. తెలివాలికకన్నులకొ్ం, మ్మెలుఁగులుఁ గుచకఠినతయును మెచ్చులె హరికి
న్నెలమీనై తాఁ బేర్మై, వలలె నతం డనిన నింతి వదనము వంచెన్.

భావశాంతి కుదాహరణము—

క. పొలయలుకఁ జేసి భామయుడి, నొలసినకోపంబు చరణయుగళముపైఁ జూ
ష్టులు నిలుపు ప్రియునిమదనా, కులత్వమున శాంతిఁబొందె గోపాంగనకున్.

భావసంధి కుదాహరణము—

క. అసురలపై దండెత్తిన, యసిశార్ఙ్గాయుధుని నిశ్చలాంగములను బెం
పెసఁగనుదయించెఁబులకము, లసమపటహనినదములఁ బ్రియావచనములన్

భావశబలత కుదాహరణము—

క. నానోముఫలముసుమ్మీ, శ్రీనిధి ననుఁ జూచి సన్నసేసెఁ గులస్త్రీ
లీనీతి మెచ్చనేర్తురె, మానితిఁబో బ్రదుకఁ గలదె మదనునిచేతన్.

---

వ. మఱి రససంకరంబులు (ఎట్టివనిన)—

క. రసములు రెం డొకచోట బె, రసి వచ్చిన నివ్విధంబు రససంకర మై
యెసఁగును శృంగారముతోఁ, బొసఁగ రసములిందుఁ*దెల్లముగ రచియింతున్.

శృంగారహాస్యసంకరము —

క. కదలక తమాలపోతము, తుదిఁ గేగి వసించియుండఁ దొయ్యాలి కృష్ణా
బెదిరింపకు మెఱుఁగుసు మని, కదలక హరిపిఱుఁదయుండి కలకల నవ్వెన్.

శృంగారరౌద్రసంకరము—

క. విహగారూఢుఁడు భామా, సహితముగ గృహీతపారిజాతోజ్జ్వలుఁడై
మహికి నరుదేర వెనుకొను, సహస్రనయనుఁగని కవిసె సక్రోధుండై.

శృంగారకరుణాసంకరము—

క. ఇఱిచనుగవలభరంబుల, నఱగౌనులు వడఁకఁ గాళియహ్రదముసతుల్
మొఱలిడుచు వచ్చి కృష్ణుని, యఱకాళ్లం దలలు మోపి రస్రులుదొరఁగన్.

శృంగారవీరసంకరము—

క. నెఱికయు గనయముఁ బయ్యెద, చెఱఁగున బిగియించి విల్లు చేకొని సురలం
దఱుఁ బొగడ నసురవీరునిఁ, బఱపుదు నని సత్యభామ బాణముఁదొడిగెన్.

శృంగారభయానకసంకరము—

క. పడగలసర్పముపై నీ, కొడుకు కాడెడు నన్న నందగోపిక కడుఁద
ల్లడమునఁ బెదవులు దడుపుచు, వడఁకె బవనచలితకల్పవల్లియ పోలెన్.

---

*రసము రెండు- మూ.

శృంగారాద్భుతసంకరము—

క. నున్నని తమాలలతపై, నున్నది గిరియుగము మీఁద నుడుపతి యటమీఁ
ద న్నిబిడతిమిర మనఁగాఁ, జెన్నగు వ్రజవనిత శౌరిఁ జేరి భజించెన్.

శృంగారశాంతసంకరము—

క. ధ్రువునకు దివిజయువతు లా, త్మవిలాసముఁ జూపవచ్చి తద్విమలతపః
ప్రభవణంబున నందఱు వీ,తవికృతులై చనిరి పేదతరుణులపోలెన్.

రౌద్రబీభత్ససంకరము—

క. భ్రూలత ముడివడఁ జక్ర,జ్వాలలు నిగుడంగ నందజధ్వజుఁ డార్చెన్
గీలాలమాంసఖండక, పాలమయము చేసె నసురభటసైన్యములన్.

క. అరయంగ మఱియు రససం, కరము లిటులు విస్తరింపఁ గలుగును మహిస
ర్వరసాంతరములయందును, విరోధిరసమొకఁడు దక్క విస్తృతకృతులన్.

క. అప్రతిమం బగుశృంగా,రప్రకరణ మిట్లు భాసురం బయ్యె నితాం
తప్రౌఢి నొనర్చెద లో, కప్రీతిగ నింకనాయకప్రకరణమున్.

క. ధ్రువపురినాథుఁడు దివిజ, ప్రవరకిరీటతటరత్నరంజితనిజపా
దవిమలపీఠుఁడు భూగో,లవిభుఁడు రక్షించు మమ్ము లాలితకరుణన్.

గద్యము:-ఇది శ్రీవాణీవరప్రసాదలబ్ధ వాగ్వైభవ తిక్కనామాత్యసంభవ సుక విజనవిధేయ అనంతనామధేయప్రణీతంబైన రసాభరణంబునందు శృంగారవిశేషంబులగు నవస్థాంతరముల విధంబులును ద్వాదశావస్థల విధంబును బంచవిధశృంగారంబును భావోదయాదిచతుష్టయంబును రససంకరంబుల తెఱంగును శృంగారప్రకరణంబునన్నది తృతీయాశ్వాసము.

శ్రీరస్తు.

# రసాభరణము.

## చతుర్థాశ్వాసము.

---

క. శ్రీనాయకుఁ డఖిలధరి,త్రీనాయకుఁ డగ్గణాదితేయమునిశ్రే
ణీనాయకుఁ డీస్రవనగ,రీనాయకుఁ డెలమి నాదరించును మమ్మున్.

వ. నాయకప్రకరణం బెట్టిదనిన, నాయకత్వంబు ప్రధాననాయకులు, సర్వరససాధారణనాయకులు, కేవలశృంగారనాయకులు ననంగాఁ ద్రివిధం బై పరఁగె నందుఁ బ్రధాననాయకుండు కావ్యాలంకారవ్యక్తుండు గావున నల్లిండె నున్న యిరుదెఱంగుల వివరించెద.

—। సాధారణనాయకులు ।—

క. ఎలమి నుదాత్తోద్ధతులన, లలితుఁడు శాంతుండు నాఁ గలరు నాయకు లి
మ్ముల ధీరపూర్వ్వ లనువా,రలు నలువురు వారు సర్వరససామాన్యుల్.

అందు ధీరోదాత్తుఁడు—

క. భూరికృపామృతరసవి,స్తారుఁడు ధీరుఁ డతిసత్త్వధనుఁడు మహాగం
భీరుఁ డధికథనుఁ డనఁగా, ధీరోదాత్తుండు సంస్తుతికిఁ బాత్రుఁ డిలన్.

ఉదాహరణము—

క. తనుఁ బొగడ సహింపఁడు శ,త్రుని నైనం దెగి వధింపఁ దొడఁగఁడు ముదము
గినుకయుఁ దోఁపఁగనీఁ డా,ననమునఁ గీర్తిసుభగుం డౌనర రఘుపతిదాన్.

ధీరోద్ధతుండు—

క. సులభక్రోధుఁడు మాయా, జలనిధినావికుఁడు దర్పసామర్థ్యయుతుం
డిలఁ జపలవృత్తుఁ డనఁగా, వెలయును ధీరోద్ధతుండు విపులస్ఫూర్తిన్.

ఉదాహరణము—

క. రక్కసులు మీరు మీకుచు, రక్కసుతై నిలిచి రిపుఁడు రామునిబంటుల్
చిక్కితిరి పొండనుచుఁ గపు,లక్కజముగఁ గెడపుదురు దశాస్యునిబంట్లన్.

ధీరలలితుఁడు—

క. వివిధకళానిపుణుఁడు సుఖ,నివహంబులతోనకంబు నిశ్చింతుఁడు నా
నవనిఁ బచరించునాతఁ డ,లవునం బొగడొందు ధీరలలితుం డనఁగన్.

ఉదాహరణము—

చ. అనఘుఁడు ధర్మసూనుఁ డఖిలావనికిం బతియయ్యె మత్సుతుల్
సునిశితశస్త్రిలాజిముఖశూరులు భారము లేదు నాకు నీ
యనిమిషభూరుహం బభిమతావహ మంచు వధూసమేతుఁడై
మనమునఁ జింత వంత యణుమాత్రము లేక సుఖించు శౌరిదాన్.

ధీరశాంతుఁడు—

క. ధీరుఁడు ప్రసన్నచిత్తుఁ డ,పారకృపాన్వితుఁడు నాఁగఁ బ్రస్తుతుఁ డగుపం
కేరుహభవకులజనితుం, డారయఁగా ధీరశాంతుఁ డన విలసిల్లున్.

ఉదాహరణము—

క. హరిచేతఁ గుచేలత్వం, బరుదుగ వీక్షించియు సంపదాఢ్యుండై సు
స్థిరతఁ గని శాంతభావముఁ, బూరసి సుశీలుఁ డన విప్రపుంగవుఁ డొప్పెన్.

—॥ నాయకనాయికాప్రకరణము ॥—

క. ఒసరఁగ శృంగారరసం,బున కాశ్రయణంబు గాన బుధులెల్లను మే
లనునట్లుగ నొనరించెద, ఘననాయకనాయికాప్రకరణం బెల్లన్.

క. అనుకూలుఁ డనఁగ దక్షిణుఁ, డనధృష్టుం డనఁగ శఠసమాహ్వయుఁ డనఁగా
మును చతురత గలశృంగా,రనాయకులు వీరి నల్వురం దెలియనగున్.

అనుకూలనాయకుని కుదాహరణము—

ఉ. లేరె పదాఱువే లనఁగ లెక్కకు నెక్కినరాణివాసముల్
శౌరికి వారితోఁ బ్రియము చాలఁగఁ గల్గుట సత్యభామకున్
భూరివిశేష మవ్వనితపుణ్యమొ చక్రికృపాసమృద్ధియో
యారయఁ బారిజాత మిల నన్యులకు న్ననుకూడనేర్చునే.

దక్షిణనాయకుని కుదాహరణము—

ఉ. హారము లిచ్చె నాకుఁ జెలి యారతిరాజగురుండు నాకుఁ గ
స్తూరిక యిచ్చె నాకు మధుసూదనుఁ డుంగర మిచ్చె నాకుఁ గే
యూరము లిచ్చె నాకు జలజోదరుఁ డీవుపుదండ నాకు శృం
గారరసేశుఁ డిచ్చె నని కౌతుకమందుదు రెల్లవ్రేతలున్.

ధృష్టనాయకుని కుదాహరణము—

చ. చను నెడపిన్నదాన ననుఁ జాయలు పల్కకు వేఁటనన్నమా
వనతరువల్లికాకుసుమవాసనగంధము కంటకాగ్రసం

జనితము లీవ్రణంబులు ప్రచండపుటెండ చెమర్చుటల్ సతీ
ఘనముగ మోవి గందుట తగ న్విను శంఖరవం బొనర్పఁగాన్.

శఠనాయకుని కుదాహరణము——

చ. చెలియ యిదేలొకో చెవియఁ జెక్కు నెఱుంగకయుండ నిన్ననోఁ
బలికెన శౌరి యిట్లులుగఁ బాడిమె నొచ్చిన నోరఁబల్కుఁ డ
న్విలసితమూర్తి నిన్ననొకవేళ హితంబుగ నొయ్యఁబల్కుటల్
గలిగెనె యేని వెల్లవిరిగాఁ గలహించిన నాఁడ కే యొరుల్.

క. వరనాయకులకు నుచిత, స్మరలీల విటుండు పీఠమర్దనుఁడును నా
గరకుఁడు విదూషకుండును, నరయఁగ విశ్వాసు లగుసహాయులు ధరణిన్.

ఉ. మంచితనంబున న్విభుఁడు మానుగ నాయకునంతవాఁడై యొ
క్కించుక వెల్తి నాయకునహీనగుణంబులఁ బీఠమర్ది దా
మించుగఁ దీర్ప నేర్పఁగలమిత్త్రుఁడు నాగరకుండు లీల న
వ్వించు విదూషకుండు గడు వేడుక నాయకనాయికాదులన్.

క. నాయకులసలలితాభి,ప్రాయంబునఁ దత్సహాయభంగులు దెల్లం
బైయలవు నాయికలను స,హాయుల నటఁ దెలియవలయు నది యెట్లనినన్.

—। నాయికాలక్షణము ।—

క. ధరణి స్వకీయ యనంగాఁ, బరకీయ యనంగ వెండి పణ్య యనంగాఁ
బరఁగుదురు మూఁడు తెఱఁగుల, వరసతియుఁ బరాంగనయును వారస్త్రీయున్.

చ. పెనిమిటి కిష్టమైనపనిఁ బ్రీతి నొనర్చు నొకప్పుడేని తాఁ
బెనిమిటిమీఁది మాటలును బెస్నిటియిష్టముగాని యాత్రలో
నునుపదు సాధ్వి, వెండి ప్రియమొందును జారిణి జారుఁడబ్బినన్,
మును ధనమెల్ల మ్రింగి పెడమోమిడుఁ బణ్య విటుండు వచ్చినన్.

స్వకీయ కుదాహరణము——

ఉ. ఏ నడపాడుచుండఁగ నుపేంద్రుఁడ సీమటుఁదల్ సుమీ నినుం
గాని వరింప నొల్ల దని గారవమొప్ప మదంబ పల్కులే
లా నిజమానె యంచు నను లాలనచేసిన భావమూర్తిలో
నే నతఁ డున్నపానుపున కేగెడువేళఁ దలంతునే సఖీ.

## చతుర్థాశ్వాసము.

పరకీయ కుదాహరణము—

ఉ. అత్తయు నూరలేదు మగఁడా మఱిమందకుఁబోయి రాఁడు నే
నిత్తఱి నొంటి నుండు దనియేఁ జనుదెంచితిఁ గృష్ణరాయ నీ
చిత్తమెఱింగి మూలదెసఁ జీఁకటి దాఁచినదాన వెన్న గో
డొత్తునుండి యేల నను నూరకె చూచెదు తొంగిచూపులన్.

పణ్య కుదాహరణము—

ఉ. వేసరఁ డింక రాఁదొడఁగె వెన్నుఁడు నీవును నమ్మురారికై
జేసితికూర్మి మాను మని చెప్పితిఁ జిల్లరకుంబోలె నెప్పుడున్
గాసి యొనర్చితే కుడువఁ గావిగొనం బడపెల్ల మాని నీ
వాసరసీరుహాక్షునకు నాలవుగా దొరకొంటె కూఁతురా.

క. మున్నొకని యధీనముగా,నున్న రమణి నొరులెఱుంగకుండ రమించున్
మిన్నక యెవ్వఁ డతని కా,కన్నియ పరకీయయట్లుకా నెన్నఁబడున్.

ఉదాహరణము—

ఉ. కన్నియ నేను నన్నుఁ దమకంబున నేటికిఁ గొంగుపట్టె దా
సన్నఘనక్షమాజముల చక్కిఁ జరించెద రల్లవారె మా
యన్నలు మానుమాను మని యల్లనఁ బల్లఁగ బుజ్జగించుచు
న్వెన్నుఁడు గోపకామిని నవీనసుఖాంబుధిఁ దేల్చె నేర్పునన్.

క. తొలితొలి ముగ్ధయనంగా, నలరిన మధ్యమయనంగ నటఁ బ్రౌఢయనం
జెలువగు యౌవనవయసునఁ, గలిగిన సంకేతనాయికలు మువ్వురొగిన్.

ముగ్ధ కుదాహరణము—

మ. హరిఁ జూచెం దరుణీలలామ నతవక్త్రాంభోజ మొప్ప న్సుధా
కరరేఖం బురణించుఫాలమున రంగద్భృంగసంకాశాకృతిం
గురులాడం గ్రముకంబుల న్నిగుల వక్షోజాతముల్ వ్రీడయెం
దెరలోనిల్చు సువర్ణపుం బ్రతిమభాతి న్మగ్నభావంబునన్.

మధ్య కుదాహరణము—

మ. నడపొప్ప న్మురిపంబుతో నయనకోణంబు న్మెఱుంగెక్కఁగా
నొడువు ల్తేనెల నీనఁగా నులియఁ గౌనుండీఁగె చన్దోయి పై
రెడుపండ్లం దెగడంగ నంగన మురారిం జూచెఁ బ్రేమంబు గ
ప్పెడు సిగ్గు న్మఱి సిగ్గుఁ గప్పెడు మనఃప్రేమంబు సందిల్లఁగాన్.

ప్రగల్భ కుదాహరణము—

చ. పొదుపై వృత్తనితంబ మొప్పఁగఁ గుచంబుల్ క్రొవ్వి యొండొంటితోఁ
గదియం గుంకుమపంకరేఖ నొసలం గన్పట్టఁ బ్రద్యుమ్ను న
న్నదభద్రేభముభంగి బింకమునఁ దన్మందస్మితాలోకనం
బొదవం గృష్ణునిఁజూచె నిందుముఖి ప్రేమోత్సాహ ముప్పొంగఁగన్.

ప్రౌఢ కుదాహరణము—

మ. ధరనస్త్రస్తనభారము న్విమలవక్త్రస్ఫూర్తియున్ రంజితా
ధరబింబంబును భ్రూలతానటన సౌందర్యంబు నుత్సంగగా
ఢరతాసక్తియు నూర్ధ్వసంగమనిరూఢత్వంబునుం గల్గు నం
బురుహామోదిని చూచెఁ గృష్ణు నసితాంభోభృత్సమశ్యామునిన్.

లోల కుదాహరణము—

మ. అలఘుశ్రోణియు లంబమానపృథుఘోరాకారము న్నాభిదే
శలుఠద్దీర్ఘకుచంబులున్ ఘటసదృక్షస్థూలతుందంబు నై
పలుమాఱు న్నిదుఁదీఁగెనవ్వ నగుచుం బాహాగ్రములాఁచి చి
ట్టలు వెట్టు న్విటుమోముపై జరఠ కష్టం బిట్టిది వేశ్యయే.

గీ. బాల్యమునుయౌవనంబునుప్రౌఢతయును, లోలభావంబుగలపద్మలోచనలకు
డెందమునయందు నింపు పుట్టింపఁజాలు, నట్టివశ్యావిధానంబులెట్టివనిన.

క. బాలకి మరగించుట తాం, బూలంబుల సురభిగంధపుష్పంబులఁ జి
త్రాలోకనభాషణముల, శాలీమృదులాన్నపాన సన్మానములన్.

ఉదాహరణము—

చ. కలపముగూర్చి మైనలఁదుఁ గమ్మనిపూవుల దోఁపుఁ గొప్పునన్
ఫలరసభక్ష్యభోజ్యములఁ బానములం బరితృప్తిచేయుఁ ద
మ్ములమిడుఁ జిత్రపట్టముల మోపు ముఖాబ్జము కామతంత్రముల్
తెలుపుఁ గఁజూపుఁ బాయవశమే హరి నాయబలాలలామకున్.

క. హారంబుల నానాలం, కారంబుల వివిధసురతకౌశలముల ర
మ్యారామక్రీడల నిం, డారిన జవ్వనపుటింతి యలరుం బతికిన్.

ఉదాహరణము—

ఉ. హారము లున్నతస్తనములం దొడఁగూర్చు రచించుఁ బెక్కులం
కారము లంగకంబులఁ దగ న్వసలీలల నిం పొనర్చు వీ

గారుచిఁ జూపు సూక్ష్మరతినైపుణభేదములం బెనంగు నీ
శౌరి లతాంగి యౌవనము సర్వము నీవిభుచేతఁ జిక్కదే.

క. మక్కువ లోనవెడిపలుకులఁ, దక్కరియలుకలను బహువిధంబులఁ బెం
పెక్కినసురతప్రచురతఁ, జిక్కుఁజుమీ ప్రౌఢయైన చెలువయుఁ బతికిన్.

ఉదాహరణము—

ఉ. మక్కువలూనఁ దేనెలగు మాటలు పల్కు నహర్నిశంబు నొ
క్కొక్కనెపంబుమై నలిగి యుల్లలికిం దమకంబు తక్కయు
న్నిక్కిలిసేయు నొండొరుల మెచ్చని గాఢరతప్రవీణత
న్దక్కకచూపు శౌరి మిగులంగలదే మహినెట్టి ప్రౌఢయున్.

క. ప్రియములు పలికినఁ జాలును, నయమున నొక్కింత చూచినం జాలును స
న్నయచాలుఁ గరాంబుజముల, నయమున మిన్నందు లోలరతిసౌఖ్యమునన్.

ఉదాహరణము—

చ. కనుఁగొనినవ్వు నాదరము గగ్గినయట్టుల యంతికస్థలం
బున వసియింప వామకరపుష్కరసంజ్ఞయొనర్చు బిన్నకై
నను దలపెట్టు హాస్యవచనంబులు యాదవరాజుపాలి కే
మని చను లోల ప్రీతియగు నా కడిపోయినపుష్ప మెయ్యెడన్.

---

సీ. ఇంక శృంగారనాయికలు నా నెనమండ్రు తెఱవలుగలరు స్వాధీనపతిక
వాసకసజ్జికాహ్వయ విరహోత్కంఠితాఖ్యాన విప్రలబ్ధాభిధాన
ఖండితోచితనామ కలహాంతరిత ప్రోషితప్రియ యభిసారికాప్రసిద్ధ
వీరు మన్మథుని దిగ్విజయలక్ష్ములు వీరలకు నాయకానుకూలంబునందు
వాసి దూతి బోటి దాదికూఁతురు పొరుగింటివనిత యెద్దియేని యొక్క
ముద్ర దాల్చియున్నముద్దియ శిల్పిని, స్వవశ తత్సహాయ లవనియందు.

క. పతిచే నెప్పుడు నుపలాలితయగు స్వాధీనపతిక; లెస్సగ సదన
స్వతనువు లలంకరించును, క్షితి వాసకసజ్జికాఖ్య చెలువు నిరాకన్.

స్వాధీనపతిక—

క. మురహరుని యురఃస్థలి సుస్థిరమై యవ్విభుసముల్లసితదరహసిత
స్ఫురితవచనామృతాదులఁ, బొరయుచు సుఖియించు లక్ష్మిఁ బోల్తురె వనితల్.

వాసకసజ్జిక——

క. హారిరాకకు నిచ్చలు మం,దిర మొప్ప నలంకరించు దేహమునం గ
స్తురి సురతరుకుసుమంబులు, సిరసునఁ దగ సత్యభామ చెలువగుచుండున్.

క. విరహోత్కంఠిత యనునది, వరునితడవు సైఁపలేక వగనొందు; నధీ
శ్వరుఁ డిక్కకు రాకుండిన, భరపడునది విప్రలంభ భావజుచేతన్.

విరహోత్కంఠిత——

క. మంద కడుదూర మాగో,విందుఁడు రాఁడేల యనుచు విరహాతురతం
బొంది యొకగోపకామిని, చందురుఁ బ్రార్థించుఁ బ్రాణసఖులం దలఁచున్.

విప్రలబ్ధ——

క. సంకేతస్థలమునకుం, బంకజదృశుఁ డేలరాఁడు భయభీతుల నే
వంకఁ గరుఁశింపఁబోయెనో, యింకేమన నన్నుఁదలఁపఁడే మదనార్తన్.

క. ఇతర దెస రాత్రి రతిచి,హ్నితుఁడగుపతి జేపుగని సహింపనియది ఖం
డితయగుఁ; గలహాంతరి తన,పతి నవమానించి పిదపఁ బరితప్త యగున్.

ఖండిత——

క. మనసిజశరహతమగు నా,మనసది నీకెఱుఁగరాదు మాధవ యీ రే
నను సోఁకిన మదనాయుధ,తనువ్రణముల నిపుడె చూపెఁ దాపముచాలన్.

కలహాంతరిత——

క. కోపించి జనార్దను నే,లాపక్లితి నపుడు పీనులకు నహితముగా
నోపడఁతి యిపుడు మదనుని, కోపము సైరింప నాకు గోచర మగునే.

క. ఒకదేశమునకుఁ దననా,యకుఁ డేగినఁ జిన్నవోవునది ప్రోషితభ
ర్తృక; నిలుపోపక ప్రియునో,ద్దకుఁ జను నభిసారికాభిధాన తలంపన్.

ప్రోషితభర్తృక——

క. మధురకు నేగెం జెలియా, మధుమర్దనుఁ డింక నేఁడు మగుడుటయెప్డో
మధుమాసకీరకోకిల, మధుకరతతు లేపురేఁగి మదనుని గూడెన్.

అభిసారిక——

క. అందెలు దొడిగితి నీవు ము,కుందునియున్నెడకు నరుగఁగోరి లతాంగీ
పొం దెఱుఁగవేకదా నీ,కుం దెరువున నివియ తోడికొండీలుసుమీ.

స్వాధీనపతిక కుదాహరణము—

చ. అలయక తీర్చుఁ గుంతలము లందముగాఁ దిలకంబు దీర్చుఁ బు
వ్వులు తుఱుమొప్పఁబెట్టుఁ దొడవు ల్దొడుగు న్సకలాంగకంబుల
న్వలు వమరంగఁగట్టు శుకవాణికి వేణుధరుండు కూర్మి ని
చ్చలుఁ జెలియా యిటేని దొలిజన్మమునం దిది యేమి నోఁచెనో.

వాసకసజ్జిక కుదాహరణము—

చ. సుదతి నిజాస్యదీధితులు సోఁకి కరంగువిహారగేహముల్
పొదలుశరీరవాసనలఁ బొంపిరివోవఁగఁజేసె పానుపు
న్మృదువుగఁజేసి క్రొవ్విరుల మేను నవీనవికాసలక్ష్మికా
స్పదముగఁజేసె నీడగుప్రసన్నసమాగతిఁ గోరి యచ్యుతా.

విరహోత్కంఠిత కుదాహరణము—

ఉ. కోమలి కృష్ణుఁ డేమిటి కొకో తడవుండె నతండు సత్కళా
ధాముఁడు కావ్యగీతరసతత్పరుఁడై యట నిల్వఁబోలు నేఁ
డే మియు లేదు ని న్నచటి కే మని పంపుదు వేఁడికొందు నా
కాముని గన్నవాఁ డతఁడు గాన రయంబున వచ్చు వానిచేన్.

విప్రలబ్ధ కుదాహరణము—

ఉ. వ్రేతలఁ జిక్కులంబఱుపు వెడ్డరికాఁ డిదె ప్రొద్దువోయె సం
కేతనివాస మస్రుల నొగిం దమపంబడియున్ దురాశ తే
లే తనలాగు గంటిమిగదే పద క్రమ్మఱఁ బోద మంచు న
బ్జాతదళాక్షి యీరెలుఁగుపాటునఁ దూలుచుఁ జెప్పెఁ బోటితోన్.

ఖండిత కుదాహరణము—

చ. కొమరుఁడ రాత్రి యెక్కడనొకో విహరించితి నీకు నాకుఁ బ్రా
ణము లరయంగ నేకమని నన్నుఁ బ్రియంబున నీవు పల్కువా
క్యము నిజమయ్యె నీమొడలి యంగభవక్షతము న్మదీయచి
త్తము నొగిలించె నంచు వనితామణి పల్కు నిశాటభంజనున్.

కలహాంతరిత కుదాహరణము—

ఉ. ఇచ్చు సురద్రుమంబు క్రియ నేమని చెప్పినఁ ద్రోపుసేయఁ డే
యొచ్చెము లేదు శౌరిదెస నూరక నీ విట నెగ్గులాడి యీ

యచ్చునఁ గాముబారిఁ బడి తాహృదయంబు సహింప నేమిటం
న్స్వేచ్ఛాచరించు వానికని మిన్నక చింతిలు నింతి నెవ్వగన్.

ప్రోషితభర్తృక కుదాహరణము—

ఉ. మన్ననపాత్రుఁడైన యభిమన్యుని పెండ్లికి నేఁగి యేలొకో
వెన్నుఁడు తడ్దయుం దడసె వేఁడు నవ్విభురాక గోరి నా
కన్నులు నెమ్మనంబుఁ దమకంబున నాదెసయంద యుండు నిం
కెన్నఁడు వచ్చునో యని మృగేక్షణ బెగ్గిలుఁ గాముచేఁతలన్.

అభిసారిక కుదాహరణము—

ఉ. ఈలలితేందుకోచులకు నీడుగఁ బూనితి మల్లెదండలు
న్మేలుగ వెల్లపట్టమును నిర్మలమౌక్తికభూషణంబులుం
జాలవె నీరజోదరుని సన్నిధికిం జన నందె లేల కొం
డీలు పదస్థులైనఁ దరుణీమణి కార్యము దప్పకుండునే.

వ. తత్సఖిజనంబులగుణవిశేషంబు లెట్టి వనిన—

క. సారోక్తులు పలుకును సం,చారిక హితవృత్తిఁ బలుకుఁ జతురిక మధుర
స్మేరోక్తులు దగఁ బలుకును, సారిక మఱి దూతి పల్కు సంధానోక్తుల్.

వ. మఱి ధీరాధీరనాయికల తెఱం గెట్టి దనిన—

క. తలఁపన్ ధైర్యము మనమునఁ, గలిగినయది ధీరనాయికానామయగున్
వెలయను ధైర్యముచాలని, నలినవిలోచన యధీరనామక యయ్యోన్.

ధీరకుదాహరణము—

క. అలిగినఁ దీర్పక నే మా, ఱలిగి మునుం బరయ ముకుళితాక్షుఁడ నైన
న్నెలఁతుక తమకము వారియు, నెలయఁగ నిద్రించు భావ మే మని చెప్పన్.

అధీర కుదాహరణము—

క. అలిగిన కోమలిఁ దీర్పక, తలఁపరయం గపటనిద్ర దాల్చిన మదిలో
నిలుపోపక చోటిస్తని, వలిపిఁబుఁదున నొత్తి చనుఁగవం బ్రియునదిమెన్.

గీ. ప్రియుని నోటలేక పెద్ద భర్జించును, నంతఁ బోక కలఁచు నాగ్రహమునఁ
బరుష యనఁగఁ బరఁగు పంకజదళనేత్రి, యవ్విధంబు దగ నుదాహరింతు

పరుష కుదాహరణము—

ఉ. మాపటివేళ బోటులసమక్షమునం బ్రియు బాహువల్లికల్
కోపమెలర్పఁ బట్టి ప్రియ కూటగృహంబున కీడ్చి బాష్పముల్

పైపయిఁ గ్రమ్మఁ దొట్రుపడుపల్కులఁ దప్పులు దెల్పి చెప్పి తి
న్నేపని కైన నోరి నిను నింక సహింపను నొవ్వ వ్రేయుమా.

---

వ. మఱి యుత్తమమధ్యమాధమనాయికల తెఱం గెట్టి దనిన—

—॥ ఉత్తమనాయిక ॥—

క. సముచితభాషణములఁ గో,పమురీతులఁ దత్ప్రసన్నభావంబుల ను
త్తమమధ్యమాధమాఖ్యము,లమరఁగఁ దెలియునది నాయికాంతర మెల్లన్.

క. తీపెసఁగఁ బ్రియము లాడును,గోపము వెలి దోఁపనీదు గొనకొని దయితుం
డేపాటి ప్రియముఁ జెప్ప మ,హాకోపప్రశమంబుఁ బొందు నుత్తమసతి దాన్.

ఉత్తమనాయిక వచనము—

ఉ. వేయునునేల నాకు నరవిందవిలోచన నీదరస్మిత
శ్రీయును నీసుభాషితవిశేషము నీవిలసత్కటాక్షముల్
నీయసమానరూపమును నీమహనీయగుణంబు మన్మనో
నాయక యస్మదీయజననంబు ఫలంబులు గావె యిన్నియున్.

ఆనాయిక కోపము—

చ. పలుకులఁ జెయ్వులం గమనభంగులఁ జూపుల నేవికారముం
దలఁకొననీక పూర్వగతి దప్పక యున్నవధూటి నిమ్ములం
బిలిచి నిజాంకపీఠమునఁ బెట్టి ముఖాబ్జముచూడ బాష్పధా
రలు దెలిపె న్మనోగతనిరంతరకోపము పేర్మి శౌరికిన్.

ఆనాయిక ప్రసన్నత—

శా. ఏతప్పు న్మను సేయ నిందువదనా యింతేల కోపంబు న
న్నేతన్మాత్రునిగాఁ దలంచితె టవే యేమున్నదైద న్నీపదా
బ్జాతం బాచు నొకింత నమ్ముఁ డయినం బ్రాణేశ్వరు న్నేత్రసం
జాతాంభఃకుచకుంభసంఘటితభాస్వద్వక్షుఁ జేసె న్వెసన్.

—॥ మధ్యమనాయిక ॥—

క. మునుకొని ప్రియమును నప్రియ
మును బెరయఁగఁ బల్కుఁ దెల్లముగఁ గోపము చూ
పును విభుని మ్రొక్కు గైకొని
యనుఁగై మఱి తేఱు మధ్యమాంగన ప్రీతిన్.

మధ్యమనాయిక వచనము—

ఉ. అక్కట నీకుఁ గూర్తు నని యందఱుఁ బల్కఁగ నంతవట్టు నే
నిక్కము చేయఁబూని యొకనిం గనువిచ్చియుఁ జూడ నిట్లు నా
మక్కువ నీవెఱింగియును మానవు నీవెడత్రోవ లింక నే
చక్కటినైన నోరి నిను సైఁపఁజుమీ కడు నొవ్వఁ జేయుదున్.

ఆనాయిక కోపము—

గీ. మోవి యదర బొమలు ముడివడ నెఱ్ఱని
కన్నులెసఁగ నొడలు గంప మొదవ
నంగములు చెమర్ప ననుచితోక్తులు వల్కుఁ
జెలువఁ దేర్ప నెట్లు సేయుఁ బ్రియుఁడు.

ఆనాయిక ప్రసన్నత—

క. మ్రొక్కఁగవచ్చినఁ గాళ్లు, జక్కఁగ జాఁచికొని ప్రియునొసలుఁ మీఁగాళ్లం
దక్కక కదిపిన మదిలో, మిక్కుట మగుకోపశిఖ శమించెం బ్రియకున్.

—॥ అధమనాయిక ॥—

క. పతిఁ గడవఁబలుకు నతఁ డవ, మతిచేసిన నలుక దక్కు మతి నూరక యా
నతుఁడైనఁ దేఱ దతఁడు, ధృతుఁ డగుటయుఁ గ్రిందుపడు నధమకాంతధరన్.

అధమనాయిక వచనము—

క. ఏను బ్రియముఁ జెప్పినఁ గై, కోసేరవు కూళవిద్య కుదురై ప్రేవుల్
వ్రానముగఁ బల్కి సచ్చెను, సూనాస్త్రునిచేత ననుచు సుదతి యదల్చెన్.

ఆనాయిక కోపము—

క. పోనని పోమం గనుఁగొన, నే నని కనుఁగొందుఁ గోప మెత్తినఁ దగునిం
కేనతని నొల్లఁబొమ్మని, పూనియ పైఁబడుదుఁ గూర్మి బఁగ్గిఁకఁ జెలియా.

ఆనాయిక ప్రసన్నత—

గీ. కాంతుఁ డలుక దీర్పఁ గాళ్లపై వ్రాలిన
గానివాని యనుచుఁ గాంత ద్రొబ్బఁ
వాఁడు గినిసి పోవ వడిఁ బాఱి పట్టు రా
కున్నఁ గాళ్లమీఁద నొరగు వనిత.

గురుతల్పగులునుగోఘ్నులువిప్రఘాతుకు ల్మద్యపాయులునుదన్మనుజహితులు
దుష్ప్రతిగ్రహరతుల్ దుష్కర్మకులు ధర్మవర్జితు ల్దుర్మానవంతు లైన
స్వర్ణప ర్ణినిస్నానముల్ సలిపినంత,దురితములుపాఱఁదోలంగ బిరుదుగట్టి, వేం.
కనకకుంభముల వేగవతిగంగయును బూరించి యాందలపైని నుంచుకొనియు
సంగీతవాద్యఘోషములతో నర్చకుల్ తెచ్చి గోక్షీరంబు తేనె పండ్లు
పంచామృతంబు సంపంగితైలము పచ్చకపురంబు కస్తూరి గంధజలము
నీలకంఠునకును నీకు రుద్రాభిషేకమున నోంకారార్చనములు చేసి
వస్త్రవగలాన్నమర్పించి వస్త్రధూప,దీపనీరాజనము లెత్తరే పురాణి, వేం.
వరుసగా నరకట్లవారు నైవేద్యమంగళహారతుల్ ప్రీతికరముసేయ
రమణీయసితచామరములు వీవఁగ వేదఘులంచెప్పి కటికంబు మ్రోలఁబాగడ
శంఖనాదము నాగసరము పూరింప మర్దలవాద్యములు ధణంధణ యనంగ
దాసీలు నటియింప దంతపుశిబికలో వేంచేసి శృంగారవిభవముగను
శయనమందిరమున నర్ధజాము వేళ
వచ్చియుండెదు సుందరేశ్వరుని జేరి, వేంక. ౨౧
పుష్పాభరణశాలి భువనేశ్వరీ నీవు సుందరేశ్వరునితో నందముగను
హంసతూలికపైని నతివినోదంబుగాఁగలిసియుండియు నుషఃకాలమునను
నిదుర మేల్కొనఁగానె మధురామృతంబైనధారోష్ణయునుబంచదారయపుడు
ఆరగించినయంత హాలాస్యపతితోడఁ బడుకిల్లు వెడలి వైభవముఁజెంద
నందలములోన వేంచేసి యనుదినంబు
దేవళముఁజేరి మెలఁగవె దీనజనని, వేంక. ౨౨
పదివన్నెకును మించు బంగారుకవచంబు నెనయంగ ధరియించి యెక్కువైన
శతపత్రములవంటి చాయకోకయుఁ గట్టి రంగుమీఱిన యొడ్డాణిక దొడిగి
తీరైన కస్తూరితిలకంబు నుదురాకుపైని నందముగాను బరఁగ దిద్ది
క్రముకకంఠమున శృంగారవైభవకాంతిపొందియుండఁగఁగంటెబొట్టుదాల్చి
సర్వజగములు రక్షింప శక్తి గలిగి
శుక్రవారపుఁగొలువుండి శుభములొసఁగ, వేంక. ౨౩
ముత్తియమ్ములకొప్పు ముక్కుతళ్కు ధరించి ముద్దులొల్కుచు నవ్వుమోముతోను
మణులచే నలరు కమ్మలు వెలుంగ ధరించికూర్మిగల్గిన శాంతగుణముతోను
కంకణంబులు హస్తకడియముల్ధరియించి రాజసంబుననొడ్డాణంబుతోను

అందపు టొడ్డాణ మందియల్ ధరియించి సంతతంబును భక్తజనులతోను
దివ్యమంగళరూపవై దిశలు వెలుఁగ
శుక్రవారపుఁగొలువుండి శుభములొసఁగు, వేంక. ౨౪

చంద్రసూర్యులును వజ్రములపాపటబొట్టు పతకముల్బహుకాంతిపరఁగఁ దాల్చి
యష్టగ ల్పుతిగంటు నపరంజి చిల్వహారములు ఆకట్టుంగరములు దాల్చి
కనకమోహనమాలికలు చౌలపూలు హంసలబావిలీల్ లంత్రసరులు దాల్చి
పైసరంబులు గొప్ప చౌకట్లు తాయితుల్ మొలనూళ్లుపాడగమ్ములును దాల్చి
గిలుకుమెట్టెలు పిల్లాండ్లు చెలఁగఁ దాల్చి
శుక్రవారపుఁగొలువుండి శుభము లొసఁగు, వేంక. ౨౫

చంద్రోదయంబైన చందంబు శిరసుపైఁ గొమరొప్పు ముత్యాలకొప్పు మెఱయ
తళతళంబని చౌలఁ దాటంకయుగళఁ బు చెక్కుటద్దములందుఁ జేరి మెఱయ
ముద్దులొలికెడునవ్వుముఖపద్మమందుఁ గుందనపు బేసరిముక్కు తళుకు మెఱయఁ
బరిఢవిల్లుచు దివ్యపంచవర్ణపుఁజిల్క ముంజేత శృంగారముగను మెఱయ
మేనఁ గనకాంబరద్యుతుల్ మించి మెఱయ
శుక్రవారపుఁ గొలువుండి శుభములొసఁగు, వేంక. ౨౬

సొగసుగాఁ గస్తూరిచుక్క ఫాలమున వాసనగ్రమ్ముచును బ్రకాశమ్ము మిగుల
శ్రవణాగ్రములయందు రత్నాలబొగడలు చంద్రవంకలు ప్రకాశమ్ముమిగుల
ముంజేత మాణిక్యములకంకణంబుల జంట చేరియుఁ బ్రకాశమ్ము మిగుల
మధ్యమంబునవజ్రమణులయొడ్డాణంబు చంద మందుచుఁ బ్రకాశమ్ము మిగులఁ
జరణకటకంబులును బ్రకాశంబు మిగుల
శుక్రవారపుఁగొలువుండి శుభము లొసఁగు, వేంక. ౨౭

అరుదైనముత్యాలహారము ల్పగడాలదండ లన్నియు దివ్యతరము మిగులఁ
జిలుకలతాళి హంసలతాళి పదకముల్ తాళిబొట్టును దివ్యతరము మిగులఁ
బుష్యరాగముల కెంపులతాళి పదకముల్ దగదగ యని దివ్యతరము మిగుల
వెలలేని మాణిక్యములతాళి పదకముల్ తళతళం బని దివ్యతరము మిగులఁ
డాయితులుఁ గంటసరి దివ్యతరము మిగుల
శుక్రవారపుఁగొలువుండి శుభములొసఁగ, వేంక. ౨౮

జగతిలోఁ బదివేలజన్మంబు లాహారనిద్రలు వర్జించి నియమముగను
బుణ్యాత్ములై తపంబులు చేసి ఫలమందుకొనియుండ నవరాత్రి కొలువులోన
శ్రీకాళి మహానీయ సేవింపు సిద్ధించు మిగతవారికి నేల మేలుగాను
అరుదైననీసేవయబ్బునాయనిసురర్గ్గొనియాడహాయలుగాఁగొమరుమిగుల
దివ్యతర హేమపద్మినీతీరమందుఁ
జొక్కనాథునితోఁ గూడి యొక్కనగను, వేంక. ౨౯

నీలంబులను గెల్చు నీకుంతలంబులుఁ జందమామను గెల్చు శాంతముఖముఁ
గలువరేకుల గెల్చు కనులవిస్తారంబు మరునివిల్లును గెల్చు మెఱుఁగుబొమలు
నువ్వుఁబువ్వను గెల్చు నునునాసికంబును గిసలయంబును గెల్చు కెంపుమోవి
కుందంబులను గెల్చు కొమరుదంతములు శ్రీకారంబులను గెల్చు కర్ణములును
ముకురతలమును గెల్చు కపోలములును
క్రముకమును గెల్చు రుచిరకంఠమును గలిగి, వేంక. ౩౦

పంకజంబును గెల్చు పాణిద్వయంబును గుట్మలమ్ముల గెల్చు కుచయుగంబు
చీమబారును గెల్చు రోమరాజియు మృగనాథుని గెల్చు నెన్నడుము సారు
సైకతంబుల గెల్చు జఘనస్థలంబును నురురంభలను గెల్చు నూరువులును
మనసిజుతూణంబు లను గెల్చు జంఘలు పల్లవంబుల గెల్చు పాదములును
గలిగి సౌందర్యశోభిత గాత్రియగుచుఁ
జిన్మయానంద రూపిణై చెన్నుమిగులు, వేంక. ౩౧

చుక్కలు పదివేలు శోభితంబుగ నున్న నెలవెలుంగుకు సాటి చెలఁగ దెందు
బకములు పదివేలు పంక్తిగాఁ గూర్చున్న రాజహంసకు సాటి రావు నెందుఁ
గుసుమము ల్పదివేలు ఘుమఘుమ మనియున్న జాజిపువ్వుకు సాటిచాల వెందు
నవమణు ల్పదివేలు నయముఁ జెందుచునున్న నురగరత్నముసాటినొప్ప వెందు
ఇలను బదివేలదేవతల్ వెలుఁగుచున్నఁ
బాండ్యవరపుత్త్రి నీసాటిఁ బ్రబల రెందు, వేంక. ౩౨

అవనిలో నదులెన్ని ప్రవహించుచున్నను భాగీరథికి సాటి పరఁగ వెందు
నితరవిద్య లవెన్ని హితవుగా నేర్చిన వేదంబులకు సాటి గాద యెందు
ధనకోటులను భూరి ధర్మముల్ చేసిన నన్నదానముసాటి నంద వెందుఁ
బర్వతంబు లవెన్ని ప్రభవించుచున్నను గాంచనాద్రికిసాటి గాన మెందు
వగకుఁ బదివేలు శక్తిదైవంబులున్న, శ్యామలానీసరిసాటిచాల వెందు, వేంక.

పసిబాలయగు ముద్దుబంగారుబొమ్మకైవడిఁ గోటిసూర్యలావణ్యముగను
నానందమందంగ నగ్నికుండమునందు నాదికాలమునందు నవతరించి
పాండ్యకన్యకగాను బ్రబలిరాజ్యాధిపత్యముఁ జేయుటకు సంప్రదాయవయ్యె
గద్దెపైనుండి సంగతిగఁ బట్టాభిషేకముఁబొంద *సెంగోలు కరతలమునఁ
బూని శాశ్వతప్రభుతనంబును వహించి
మధురలోపల నెలకొన్న మరకతాంగి, వేంక. ౩౮

ప్రణవస్వరూపిణి పాండ్యరాజకుమారి హెచ్చైన మీనాంబ హెచ్చరీక
హాలాస్యపురవాసి పమరేంద్రవందిత హెచ్చైన మీనాంబ హెచ్చరీక
యార్యామహాదేవి యరవిందదళనేత్ర హెచ్చైన మీనాంబ హెచ్చరీక
యవతారశక్తి యీ యవనిలోఖ్యాతిగా హెచ్చైన మీనాంబ హెచ్చరీక
యనుచుఁ గటికంబు గోర సింహాసనమున
రాజసమునొప్పి శ్రీమహారాజ్ఞివగుచు, వేంక. ౩౯

దయఁ గటాక్షించి పేదలకెల్ల సౌభాగ్య ఫలమిచ్చు శివశక్తి బహుపరాకు
నుతియించుజనులఁ గన్నులఁజూచి సామ్రాజ్య ఫలమిచ్చుశివశక్తిబహుపరాకు
భక్తరాజికి మోక్షపదహేతు సుజ్ఞాన ఫలమిచ్చు శివశక్తి బహుపరాకు
ప్రజలపాపముఁ దోలి పరిపూర్ణతరపుణ్య ఫలమిచ్చు శివశక్తి బహుపరాకు
బట్టులీరీతిఁగటికంబుపాడిపొగడ, నెన్నటికిఁ బాండ్యదేశంబునేలుకొనుచు, వేం.

ధనువు బాణములు చేతను బూని రథమెక్కి చతురంగబలముతో జగమెఱుంగ
ధిక్కరించియు నష్టదిక్పాలకులగెల్చి కైలాసమున నందిగర్వ మణంచి
పాండ్యనందిని నీవు బలవంతముగను యుద్ధముసేయ మ్రోలఁ బ్రత్యక్షమైన
సాంబమూర్తిని జూచి స్వామి నన్నిపుడు పెండ్లాడు రమ్మని పల్కి వేఁడుకొనుచు
నిశ్చయపు వీడెములు పంచి నిబ్బరముగ
మధురకును రావె సీతల్లి మదిని మెచ్చ, వేంక. ౩౭

పురము శృంగారించి పొడవుగాఁ గల్యాణమండపంబును స్వర్ణమయము చెందఁ
గనకవేదికలు ముంగల గొప్ప కొట్టంబు దేదీప్యమానమై తేజరిలఁగ
నవరసాలంకారనయమెుప్పుచును దర్పణములపందిళ్లు నున్నతముగాను
గల్పించి మూఁడులోకము లెఱింగించి వ్రాయించి పత్రికలు పంపించి వేగ

*సెంగోలు=రాజదండము.

హరియు బ్రహ్మ పురందరాద్యమరమునులఁ
బెండ్లివైభవమునకు రప్పించుకొనియు, వేంక. ౩౮

నారికేళరసాలనారంగజంబీరరంభాక్రముకముఖ్యరసఫలములు
మకరతోరణమ్ములు మౌక్తికంబులమేలుకట్లు పుష్పము లనేకముల చెండ్లు
చెంగావి సురటీలు రంగైనగొడుగులు బెండపువ్వులు కాకిబెగడలివియు
శృంగారములు మించఁ జేసి కల్యాణమండపము శోభించి యుండఁగనుదెలిసి
మెచ్చి కైలాసమునుండి వచ్చినట్టి
హరుని బొడగాంచి యానందమందుకొనుచు, వేంక. ౩౯

పెండ్లియందముచేసి భేరీమృదంగమర్దళసుసంగీతవాద్యములు మ్రోయఁ
గలకంఠులును గౌరికళ్యాణములుపాడ మునిజనంబులు వేదములు పఠింపఁ
గుండోదరుని బిల్చుకొని వచ్చియున్న(శ్రీ) కైలాసపతితోడఁ గడుముదమున
సమముగా నెదురుసేసలు చల్లి సరియుల్లభంబునీడల మంటపంబునందు
భవునితోఁ గూడ వేంచేసి పరఁగియుండ
మగువలును హారతులనెత్త మహిమ మీఱఁ, వేంక. ౪౦

ప్రజలెల్ల వినఁగ శోభనము శోభనమని సువ్విపాటలు పాడి సురరమణులు
ముత్యాలసుంకులు ముత్తైదునించి నూతనమైన సంపంగి తైలమంటి
పన్నీరు తెప్పించి బాగుగా జలకంబు లాడింపఁగానె హాలాస్యపురికిఁ
బతియైన శివునితోఁ బసిఁడిపీతాంబరంబులు ధరించినయంత మ్రోలఁ జెలులు
నిలువుటద్దముఁ జూపంగ నిటలమందు
దివ్యకస్తూరితిలకంబు దిద్దుకొనియు, వేంక. ౪౧

బంగారువర్ణమై పరిమళింపుచునున్న కర్పూరగంధపంకంబు దాల్చి
విదియచంద్రునిమాడ్కిఁ బొదలుఫాలమునందుఁ జికిలికస్తురిచుక్క చెలువుగాంచి
కమ్మవిల్తునిమామ కాంతిచందమునొప్పు బటువైన ముత్యాలపాపఁ దాల్చి
దిశలందురంజిల్లు దివ్యరత్నములచేఁ గల్పితమగుబాసికములుదాల్చి
నవమణివిరాజితాభరణములుదాల్చి,కరముశోభిల్లసుందరేశ్వరునిగూడి, వేం.

చెవులనల్లాడంగఁ జవుకట్లవజ్రాల వెలలేనికుండలంబులను దాల్చి
భుజయుగంబున హేమభుజకీర్తులమరంగ నతులమాసందితాయతులు దాల్చి
పాణియుగ్మమునందు బంగారుకటకముల్ వ్రేలివ్రేలికి నుంగరాలు దాల్చి

మొలయందునపరంజి మొలదారములువక్షమునఁ దాళిపతకముల్ దనరఁ దాలి
పెండ్లిపీఁటను వేంచేసి ప్రియ మెలర్పఁ, గరము శోభిల్లు సుందరేశ్వరుని తోడ, వేం.

నిగనిగల్వారంగ నెరివెండ్రుకలు దువ్వి జడబిళ్ళలను గొండెజడలు ముడిచి
కస్తూరిబొట్టు చక్కఁగా నుదుటఁ బెట్టి కలువకన్నులఁ గాటుకయును దీర్చి
తేట చెక్కిటఁ జిన్నిదృష్టిచుక్కయునుంచి మృగమదగంధంబు మెడను బూసి
స్వర్ణకంచుకిఁ దాల్చి చరణాంబుజముల నున్నని హీరనలుగు తిన్నఁగ నలంది
మేలిమిగ కీవి మెఱయంగ మేన వెలుఁగ, ప్రాక్తనమునున్న భూషణంబులు ధరించి.
సొగసు పాపటబొట్టు సూర్యచంద్రుల బాసికము పొంత ఫాలభాగమునఁ దాల్చి
ముద్దుగా వజ్రంపు ముక్కుతట్టును గర్ణముల రత్నతాటంకములను దాల్చి
బటువైన బుగడలు బావిలీల్ చెవులపువ్వులు కాంతిరావిరేకలును దాల్చి
కంఠస్థలమునందుఁ గంటెబొట్టును గోళ్ల సరిపెణంబులు గంటసరులు దాల్చి
యఱుత ముత్యాలహారంబు లమరఁ దాల్చి
తాళిపతకంబు మొదలుగాఁ దాల్చి వెలుఁగ, వేంక. ౮౪

కరయుగంబున హస్తకడియాలు జేకట్లు కంకణాంబులు జంటగాను మెఱయ
సన్నంపు నడుమున స్వర్ణమయంబైన మొలనూలు నొడ్డాణమును వెలుంగఁ
జరణంబులను బాదసరము లందియలు గజ్జలపాడగములు ముచ్చటగఁ దాల్చి
గలుగల్లుమని శబ్దములు మ్రోయ దేవలోకము హంసనడలతోఁ గదలి వచ్చి
పసిఁడిమయమైన పెండ్లిగద్దెపైని నుండి, కాంచనపు బొమ్మకైనడిఁ గళలు పొంది, వేం.
మెండుగాఁ జతురశ్రమండలాకారమై నిగ్గుగా ముత్యాలముగ్గు లిడిన
తనరు పెండ్లరుగు మధ్యమున నుస్వర్ణకుంభము లుంచి యందుపైఁ బరిఢవిలఁగ
నవచూతపత్రముల్ నారికేళంబు గంధము సేసలిడి యేకదంతుఁ జేర్చి
బాలు పొందఁ బరమేష్ఠి పుణ్యాహవాచనంబును జేయనగ్గపైఁ బునుకదారి
పూర్ణకళతోడ ... ... చుండ, ముజ్జగంబులుఁ బొగడంగ ముద్దులొలుక, వేంక.

తల్లి కాంచనమాల తనలోన మెచ్చ సంగతిగ నాందియు జాతకర్మములను
గర్ణవేధయు నామకరణ మన్నప్రాశనము పందిటను విధిక్రమముగాను
గొమరొప్పఁ జేయించుకొనఁగా నెనవధాన్యములతోను బాలికల్ మొలవఁ బెట్టి
చొక్కనాథుని పెండ్లిచక్కనాడుటకునై యెక్కువైన ముదంబు పిక్కటిలఁగ
మరువములు మొల్లలును జాజిమాలికలును
గంఠమునఁ దాల్చి కళ్యాణమంటపమున, వేంక. ౮౫

దశవేషములసామితనయుండు పౌరోహితమునొప్పకొని శాస్త్రధాటిగాను
శ్రీకరంబుగఁబెండ్లిఁజేయింప స్నాతకవ్రితము*సల్పియుగట్టువిలుతుఁడపుడు
కాశియాత్రకు వేడ్కఁగదలశ్రీవిష్ణుసుందరరాజమూర్తి ముందటను వచ్చి
కనిపించుకొనికన్యకనునిత్తుమనినాళికేరంబుఁబ్రియముగాఁ గేలనొసఁగ
మగిడివేంచేసి కళ్యాణమండపమున,శంభుదేవుండుఃకొలువుముచ్చటగనుండ.
భక్తితోవచ్చి ముప్పదియుముక్కోటిదేవతలు కన్నులపండువగను జూడఁ
జంద్రజూటుండు రక్షాబంధనంబును యజ్ఞోపవీతద్వయంబు దాల్చి
తేజరిల్లఁగ బ్రహ్మదేవుండు సురమునివరులెల్లఁ గన్యకావరణములను
వరుసగాముమ్మాఱు పఠియించినంతఁ బంకజహస్తమున హేమకంకణంబు
దిట్టముగఁగట్టిమెట్టుపాల్పుట్టిలోను,జిగురుపాదంబులునిచివేంచేసియుండి, వేం.
దివ్యాభరణమాల్యాదిపరిమళములెదువలు రూపలావణ్యములు వెలుంగ
నియమంబుగాఁజెంత నిలిచి కర్ణామృతంబుగ మున్నపాట నింపుగఁ బఠింప
ముమ్మాఱు మధుపర్కములు చొక్కనాథుండు ప్రాశనం బొనరించి పరఁగినంత
మొలకనవ్వులచిన్నిముద్దులపెండ్లికూఁతురిచక్కఁదనము పొందుచునువచ్చి
పసిఁడియరుగందువేంచేసిప్రబలుచుండి, మోదమందుచుగారాబమునగనువేడ్క
వేంకటేశుని చెల్లెలైవెఁయుగారి,కరుణగలయమ్మ మీనమ్మవరములిమ్మ, వేం.
జేగఁటశంఖముల్ చెలఁగి వాదిత్రసంఘోషము లిమ్మందుకొనుచుమిగుల
నిరుపార్శ్వములయందు నితరజనంబులు పొరిమంగళాష్టకంబులు పఠింప
విష్ణుసుందరరాజు వేల్పుసంగీతంబు... ... ... ...గిండిగంగోదకంబులు...
...శాంభికద్వాదశాంతమూర్తికి నిన్ను... ... ...ధారవోయ ... యాది
యూడిగముసేయలోకంబులున్నతింప,వసుధయుప్పొంగనేత్రోత్సవంబుగాఁగ.
దేవేంద్రముఖ్యులౌ దిక్పాలకులుగొల్వ సుకవిపుంగవులుసంస్తుతులుసేయఁ
దుంబురునారదాదులు వీణెమీటఁ గిన్నరయక్షముఖులుగానములుసేయ
రంభోర్వశీముఖుల్ రమణులునటియింప భక్తజనంబులు భజనసేయ
రాజాధిరాజులు రహిమీఱ సేవింప సద్విజుల్ వేదఘోషంబుసేయఁ
గుసుమవర్షంబు ఖేచరు లురియఁగాను
శంకరుని బెండ్లియాడెడు సమయమునను, వేంక. ౫౩

* వ్రతమునకు వ్రితమని దాక్షిణాత్యోచ్చారణము.

రవతుతొ(?) సుమంగళీరత్నముల్ మహితలావణ్య సంపదలు గలి
పూర్ణేందు బింబంబుఁబోలియున్నటువంటి మొలకనవ్వులుగల్గుమోము లమర
...ముంగురుల్ చిందులాడంగ గుబ్బలమీఁది హారముల్ ... మెరయ
... మెరుఁగు బంగారు దీపాలపళ్లెంబులు పరఁగ నునిచి
... యరుదొందవచ్చి నిలిచి, శోభనంబులు పాడంగ సొబగుమించి, వేంక.
పూర్వమండనదినంబున దివ్యపంకేరుహములు గోవిందుని హస్తములను
అర్చన ల్గొని మెచ్చి యతఁడు గోరిన చక్ర మిచ్చిన శ్రీసుందరేశ్వరుండు
కొమరొప్పగాఁ బెండ్లికొడుకుచందముఁ జెందితనరంగ శుభముహూర్తంబునందు
మధురేశ్వరీనిన్ను మాంగల్య మొనరంగ ధరియించె శృంగార తరుణులపుడు
తోడిరాగాది మంగళాదులు పఠింప
నమృత గళభూషణంబుల నమరనొప్పి, వేంకటేశ- ౫౫
పలుమాఱుఁ దాటంకములు ధగద్ధగ యని చెక్కులందునఁ జేరి జీరుకాడ
ముఖపంకజమునందు ముంగురుల్ మధుపసంతానంబు కైవడిఁ దాండవింప
నంసంబుకడఁ హారహారము ల్దనరంగఁ గంకణంబులు గల్లుగల్లుమనఁగఁ
బైఁడి పళ్లెరమున బాగైన ముత్తియంబులు నించికొని కరంబుల గ్రహించి
శంభుశిరమునఁ దలఁబ్రాలు సరసముగను
మూఁడుదోయిళ్లు నించిన మోదముగను, వేంక. ౫౬
కుండల మణిరుచుల్గండస్థలములందు విలసిల్ల నేప్రొద్దు తళుకుమంచు
నిగనిగ మన నింద్రనీలాబ్జరాగాది యుతముతొ పతకంబు లురమునందు
మెఱయంగ వ్రేళ్ల నుంగరములందముగాను వెలయంగ మొలకనవ్వులు చెలంగ
ముత్యాలుదోయిళ్లముమ్మాఱుగ్రహియించి హాలాస్యనాథుండుహర్షముగను
అంబికా నీదుశిరముపై నందుకొనియు
నింపరాణింపఁ దలఁబ్రాలు నింపెనపుడు, వేంక. ౫౭
ద్వాదశాంతేశాన్వితముగ శ్రీలోకపావని నీవు నత్యంతవైభవమున
నుత్సాహమొనరంగ నొకరికొంగొక్కరి కొంగుముళ్లను వైచికొనెడువేళ
నిబిడీకృతంబుగా నిండియున్నట్టి దేవతలెల్ల నేత్రోత్సవంబుగాఁగఁ
బరఁగెడునినుఁజూడఁ బదివేలకనులు గావలెనంచుఁ బొగడరే యెలమితోడ
గండు మీనులవంటి వీక్షణములందు
ఘనకృపారస ముప్పొంగి తనరుచుండ, వేంక. ౫౮

శివశక్తి నీమహోత్సవమైన కళ్యాణ వైభవంబులు చూడవచ్చియున్న
హరి బ్రహ్మ యింద్రుండు నవని యాకాశంబు నాదిత్యచంద్రాదు లమరమునులు
భూసురుల్ క్షత్రియుల్ భువనత్రయము లగ్నిదేవుండు సాక్షిగా దేవి నిన్నుఁ
గాలకంఠుఁడు కరగ్రహణంబు చేసిన యవసరంబునఁ బెండ్లియరుఁగునందు
ముదముఁ జెందవె పూర్వాభిముఖము సలిపి
ధరణీతలమందు సప్తపదంబులుంచి, వేంక. ౫౯

స్వాతంత్ర్యముగను నీశ్వరి నిన్నుఁ బెండ్లాడి వాసిఁ గాంచియుఁ బాండ్యవంశమునకు
నల్లుఁడై వర్ధిల్లి యనుగ రేశుని బావమఱఁదియై సుందరేశ్వరుఁడు వేడ్కఁ
బసిఁడి గుండమునందుఁ బ్రాచీముఖంబుగా నుండి ముంగల నగ్ని నుంచుకొనియు
నరవిందములవంటి హస్తంబులందును నాజ్యహోమంబును బూజ్యముగను
జేయుసమయంబునను సదాశివునియొద్ద
దక్షిణపుఁ బార్శ్వమున నీవు దనరనుండి, వేంక. ౬౦

గరిమతో నీమపంకజపాణియుగములో లాజహోమము చేసి లలిత నిన్నుఁ
జెట్టవట్టుక చంద్రశేఖరుండును బ్రదక్షిణముగా వెంచేయఁ జెలఁగిమిగుల
వెలహెచ్చునందియల్ మొలగజ్జెలును గల్లుమెట్టియల్ పిల్లాండ్లు మీనుకువగల
ఘల్లుఘల్లున మ్రోయ మెల్లమెల్లన హంసనడచినయట్టుల నడచివచ్చి
వేడుకలరంగ ముమ్మారు విహితముగను
అశ్మమండలి నిలువవే యందముగను, వేంక. ౬౧

నిలువుటద్దముల నీడలు పార దివ్యమౌ మించు కాంతులను శోభించియున్న
పెండ్లిపందిటిలోనఁ బెండ్లిపెద్దను సభామధ్యంబునను... సుతుఁడు
అన్నిటి వర్ణించి యాశిషంబులు సేర నపుడేకవాక్యమై యఖిలజనులు
పరఁగ విశ్వంభరాసురులెల్లను దథాస్తటంచు ఘోషింపఁగ నతిముదమున
సకల జీవులయెడ దయాసహితుఁడైన
గరళకంఠుని సవ్యభాగమున యుందు, వేంక. ౬౨

నాసికాగ్రమునందు నవమౌక్తికంబు ముక్కుపుడు పీనులపరంజి కమ్మలమరఁ
గరకంకణమ్ములు గంఠహారములు మధ్యమున నొడ్డాణంబు నమరఁగాను
నందియల్ మెఱయంగ నతిపార తంత్రత శ్రీభారతులు జంటచేరి వచ్చి
శోభనంబులు పాడుచును గన్యపెహాముపై ముంగురుల్గునిసియాడంగ నిలిచి
యొంచి పళ్లెల హారతు లెత్తినపుడు, శంకరుండైన సుందరేశ్వరునియొద్ద, వేం.

అరవిందముఖి చిన్మయానందరూపిణి యంబికా నీవివాహమున కిందు
వచ్చియున్నట్టి దేవతల కాభరణముల్ బహుమానములు చేసి బ్రాహ్మణులకుఁ
బునుఁగుగందము మేనఁబూయించిసిగనిండఁబూలుఁజుట్టించిసంపూర్ణముగను
ధేను లశ్వములును దేజొప్పఁగా భూమి ధనధాన్య కన్యాన్నదానములును
భూరి దక్షిణతాంబూలములు నొసంగి
రాజరాజేశ్వరీ నీవు తేజరిల్ల, వేంక. ౬౪
వ్యంజనంబులు వగవగల దివ్యాన్నపాయసభక్ష్యములు పప్పు నప్పడములు
పక్వంబు బొనరంగఁ బాకమై యున్నట్టి శాల్యన్నమును నన్నశాలలోను
బ్రాణనాయకుఁడ మీబంధువర్గమ్ము భోజనవేళఁగావచ్చె జాగ్రతగను
రావలె నని పల్కఁ బ్రమదంబుతోడను విని మందహాసంబు దనర భవుఁడు
నెమ్మిఁ గుండోదరుని పొట్ట నిండియుండ
వంటకం బిడుమన్న నావార్త వినియుఁ, వేంక. ౬౫
ఐదుమోములసామి యాడినవాక్యంబు లంగీకరించి యుప్పొంగి యపుడు
పరిచారకులఁ బిల్వఁబనుప నందఱువచ్చి వరుసగా నిలుచున్న వారితోడఁ
గుండోదరునిదోడుకొనిపోయియచటభోజనశాల నునిచి యీక్షణమునందు
బహుపక్వశాకముల్ పప్పు దివ్యాన్న
మాజ్యము భక్ష్యములు చాలుచాలుననుచుఁ
బలుకవడ్డించి బలుపొట్టపట్టినంత
తృప్తిచేయించు మనియానతీయఁగాను, వేంక. ౬౬
ఆదిశక్తివి నీవు నానతిచ్చిన రీతిఁ బరిచారకులు గొప్పపళ్లె మునిచి
కాయగూరలు నేయి కందిపప్పన్నంబుఁ బాయసంబును జాలభక్ష్యములును
వడ్డింపవడ్డింప నడ్డిచెప్పక తిన్న కుండోదరుని దాహగుణ మెఱింగి
గ్రక్కు నావేళ వేగవతి యుత్పత్తిగాఁ దెచ్చివానికిఁ దప్పిదీర్చి మధుర
కీర్తి వహియించినటువంటిమూర్తికిపుడు, ప్రాణపదమైనపట్టంపురాణివిగద, వేంక.
అష్టమూర్తియుఁ బ్రవేశాజ్యాహుతిక్రియల్ పాటించి రేయి వైభవముగాను
పార్వతి నిను జెట్టవట్టి పెండ్లరుఁగునీశాన్యదిక్కున నిల్చి శాస్త్రవిధిని
సంతసంబొనరంగ నంతరిక్షము జూచి పతిభక్తియగు నరుంధతిని నిదిగో
గంటివా యనఁగానె కనుగొంటి నని పల్కవే దేవి సురలు సేవించిపొగడఁ
బందిటను స్థాలిపాక మహాపాసనంబు, చంద్రశేఖరదేవ్రతోఁ జలిపితపుడు, వేంక.

తసరంగబహువినోదము నలంకృతమైన పందిళ్ళదీపము ల్పగలువలెను
వెలుఁగఁ బెండ్లరుఁగుపైవిలసిల్లుచును సోమసుందరేశ్వరునితో సొబగుమండి
పదివన్నె యపరంజి పళ్ళెంబులను బప్పు షడ్రసంబుల పక్వశాకములును
గలవంటకములుఁబొంగలిపాయసము నెయ్యియతిరసంబులుఁబండ్లనానవాలు
పంచధారామృతములు సంభవముఁబొంద
నమరసహితంబుగా బువ్వమారగించి, వేంక. ౧౯

యుగదినంబందు సూర్యోదయంబగువేళ వన్నె చిన్నెల రంగవల్లిస్రుగ్గు
దిద్దియున్నట్టి వేదికమధ్యభాగమం దగ్నిదేవుని దెచ్చి యతివలుంప
హాలాస్యపురనాథుఁ డౌపాసనముసల్పి పరదేవి నినుఁ జెట్టవట్టికొనియు
నంతఃపురంబేగి యందున్న కులదేవతకుఁ బాలికల కర్పితంబు గాను
బూజగావించి త్రైలోక్యపూజితుండు
తిరుగ వేంచేయఁడే పెండ్లియరుఁగునకును, వేంక. ౨౦

పద్మరాగములచేఁ బరఁగుపాపటబొట్టు ఫాలభాగమునందు భాసురముగఁ
దాంతవింపఁగఁదమ్మిదలవంటిమంగళసుముఖపంకజమునందమొనసియాడఁ
దళతళయచుచుఁ బుత్తడికమ్మలును దేటచ్చెక్కినొరయంగ నెక్కనైన
మౌక్తికహారముల్ మణికంటసరులూఁగఁ బచ్చలకడియాలు పరిఢవిల్లఁ
గంకణంబులు మ్రోయంగ శంకరునకు
నెలమితోఁ బాటపాడుచు నలుఁగులిడియు, వేంక. ౨౧

భ్రమరంబులనుబోలి బాగైనకురులు నున్నగదువ్వి కొప్పుతిన్నగను ముడిచి
పట్టుకోకలుగట్టి బటువుపాలిండ్లపై రాణించుచెంగావి రవికలమరఁ
బొందించికుంకుమబొట్టుఫాలమునందుఁబొలుపుమీఱఁగనుంచిపువ్వులుదుఱిమి
కనులకాటుకదీర్చి కమనీయభూషణంబుల నుంచుకొని యొప్ప ముదితలెల్లఁ
గదిసిపాటలు చదువ శంకరునిచేత
నలుఁగువెట్టించుకొనుచు నానందమంది, వేంక. ౨౨

జాఱుకుచ్చెళ్లుంచి (జంగలో)ప్పుగఁగట్టి రంగుమీఱిన పట్టురవికలమరఁ
దొడిగి కస్తురిబొట్టు నిడువాలుఁగనుల కాటుకదిద్ది కొప్పునిండుగనువిరులు
ముడిచి బంగారుసొమ్ములు పెట్టి నాగరకము చెలంగఁగ వేడ్కకత్తెలెదుట
సరససంగీతముల్ జరుపుచు ముసిముసి నగవునవ్వుచునిల్చి నాట్యమాడ

నందమగు డోలికాతల్పమునందు రేయి
గుజ్జువేలుపు తండ్రితోఁ గొలువునుండి, వేంక. ౭౩

మూఁడవదినమందు మొదటిజామున వేడ్క నగ్నిదేవుని పెండ్లి యరఁగునందు
మధ్యంబుగానుంచి మంత్రయుక్తంబుగాఁ దంత్రాగమము లెల్లఁ దప్పలేక
యాజ్యంబు సమిధ లన్నాహుతుల్ సాఖ్యని గ్గించి బ్రహ్మలు వ్రేళ్ల నెంచియెంచి
జ్ఞాపకంబుగ గ్రహజ్ఞము సేయఁగా నె యుల్లాసంబు మీఱఁ గైలాసపతియుఁ
బరమపావని నినుఁ జెట్టవట్టి యపుడు
క్షేమముగ వేదికను బ్రదక్షిణము రాఁడె, వేంక. ౭౪

పందిళ్ల నేతిదీపములుంచి వెలుఁగంగఁ గోటిభూసురమునుల్ గుమిసియుండి
యొక్కరొక్కరుగాను జక్కఁగాఁ బ్రణవంబు నున్నతధ్వనితోడ నుచ్చరించి
గణుతికెక్కినపదక్రమజటాదులు నెల్ల సామగానంబులు చదివిచదివి
యక్షతలర్పింప నప్పుడు పెండ్లిపెద్దైనట్టి వారిజాతాసనుండు
రేయి పాకెన్న సేయింప హాయిమీఱ
నంద మొనరంగ నందివాహనుని యొద్ద, వేంక. ౭౫

కమనీయమణు లనేకములు శృంగారించి మహిమతోఁ గళ్యాణమండపంబు
జ్యోతిర్మయముపొందఁ శోభిల్లఁ బెండ్లివేదికపైని నాల్గవదినము రేయి
నిత్యపావనదేవి నిన్ను నొద్దననుంచుకొని చొక్కనాథుండు కొమరుమిగుల
నాపాసనముసల్పి యపుడెవ్వరెఱుఁగక దొంగవేలిమి చాలు దొంగిలించి
తెచ్చి తనయున్నచోటికి వచ్చి హరుఁడు
దక్కెనని సంతసిల్లఁడే తగవుమీఱ, వేంక. ౭౬

కౌతూహలముగ శృంగారించుకొని వేడ్క గొమరుఁ బ్రాయపుస్త్రీలు కొందఱపుడు
సరికక్షిగాఁ జేరి శారీరమొనరంగ నేర్పుచే వార్వారు నెనరుగలిగి
పరిహాసపాటలు పాడంగఁ జినచిన్న ప్రతిమలదీపముల్ ప్రబలి వెలుఁగ
నిరువంకబంతులై సురలనుంచుక రేయి భవునితోడఁ బసిండి పళ్లెములను
వరుసతో నాగవల్లి బువ్వములుఁ జాల
గారెబూరెలు హితవుగా నారగించి, వేంక. ౭౭

సుదతులెల్లఁ దలంటు శోభనపాటలు పాడంగ నపుడు ప్రభాతమందు
మనసు రంజిల్లంగ మంగళస్నానముల్ చల్లఁగాఁ బన్నీటఁ జలిపి వేడ్క

రంగైనపీతాంబరములు రత్నకిరీటవలయాదిభూషణంబులు ధరించి
శంకరుండును బరాశక్తి నీవును గోటిబాలసూర్యులవంటిప్రభలతోడఁ
గనకపీఠంబుపైనుండఁ గమలభవుఁడు
శేషహోమంబుసేయించె శ్రేయమంద, వేంక. ౭౮
పంచరత్నములచేఁ బంచవన్నెల ముగ్గులుంచి వేదికపైని మించిమెఱయు
నవమణులొప్పసిగి స్వర్ణపునాగవల్లికుండలు ప్రతిష్ఠించి యుండఁగను జెలులు
కదిసిపాడంగనాగవ్వసానులు ముందు నటించుచుకొని వెంటనమవహరుఁడు
శ్రీమహేశ్వరి నిన్నుఁ జెట్టవట్టుక నీను సుందరాకారంబుఁ జూచి చూచి
యాత్మనుప్పొంగుచును బెండ్లియరఁగునోక
సురలు చూడంగ ముమ్మారుచుట్టిరాఁడె, వేంక. ౭౯
అవని రథంబు చంద్రాదిత్యులురు గంబ్లు చతురాగమంబు లశ్వములు గాను
బ్రహ్మసారథి మేరుపర్వతంబు శరాసనంబు నాగేంద్రుండు నారిగాను
నబ్ధితూణీరంబు హరియుబాణముగాను గల్పించుకొని భయంకరములైన
త్రిపురంబులనుగెల్చి త్రిజగంబులేలుధూర్జటి నాగవల్లిదుప్పటి ధరించి
గట్లరాయనిపుత్రికగళమునందు, నీలమణిధారణము చేసినింతసభను, వేం.
అరవింద పాదంబు లందియల్ గలుగల్లు మనుచు మ్రోయఁగ రాజహంసనడల
లలితరో నీవుకళ్యాణవేదికఁజుట్టి యపుడు దక్షిణభాగమందు వచ్చి
నిలిచిముచ్చటమీఱ నెనరుగాఁబునవ్వుగొనుచుముగ్ధులపెండ్లికొడుకనాడు
నుప్పుతేనుఁగునిత్తుఁబప్పుతేనుఁ గుమారునీయుఁడీయనఁగా నెమీశ్వరుండు
సురలుపొఁపులువినఁగమాసూపగజము, కోటివరహాలటనిష్కామేటిగాను, వేం.
ప్రతిదినంబును బిల్వపత్రంబు లర్పించి భక్తిచేసినముఖ్యభక్తులకును
నభయంబులొసఁగెడు హరుఁడువేదికఁజుట్టివచ్చి యుత్తరదిక్కున వంకనిలిచి
గుణభూషణీపెండ్లికూఁతురా వినునాదుపప్పేనుఁగునుదీసి యుప్పుకరిని
నిత్తువా యనఁగా నె చిత్తాబ్జ ములరి యాసందర్భమున సభాసమ్మతిగను
నవనియెఱుఁగంగ నిపుడు నాలవణగజము
అయిదుకోటులవరహాల టనుచుఁ బలికి, వేంక. ౮౨
గుఱుతైనముత్యాల కొప్పులందపుఁగిరీటములు పొందుగ భూషణములొసంగి
బంగరు కుసుమము ల్పారిజాతములు పాదముల నర్పించి వందనము చేసి
దేవాది దేవతల్ దేశాధినాథు లందఱులెక్కలేని పీతాంబరములు

కట్టువస్త్రంబులు పట్టుకోకలు గట్టి వరహాలు అవికె లీవంతు నపుడు
తెచ్చి చదివింపరా పెండ్లి తిన్నెమీఁద
శ్రీమహేశునియొద్ద వేంచేసి యుండు, వేంక. ౪౩

విప్రవర్యులను రావించి పీఁటల నుంచి గంధంబు మైనిండఁగా నలంది
జుట్టు నిండుగఁ బూలు చుట్టించి మెడను హారములు వేయించి వారలకు నెల్ల
ద్రవ్యంబు దెప్పించి దక్షిణ లిప్పించి ధారాళముగ శూలధారి యపుడు
పద్మహస్తములచే ఫలదానములు సేయఁగాను జాంబూనదకంకణములు
రవలి చెలఁగంగ మృదుల కరంబు సాఁచి
చామకలశోదకముతోను ధారవోసి, వేంక. ౪౪

సర్వభద్రకుఁడైన శంభుతోఁగూడఁ బచ్చలచప్రకోళ్లమంచమున నుండి
సేర్పగాఁ గూరాడు సీరాడు నిలిపి యుప్పొంగి తాంబూలము ల్సాంగతిగను
ఆరగించెడివేళ నీరజనాభుఁడు బ్రహ్మాదిసురలు దంపతులుగాను
వచ్చి ముంగల నిల్చి మెచ్చి దీవించి సేసలు శిరంబున నుంచి సరసముగను
వరుసగా నుండఁగను వారివారి కపుడు
పాన్పువీడ్యంబు లిప్పించి ప్రమదమార, వేంక. ౪౫

మోద ముందుచు నేఁటి మొదలుగా మున్నూట యఱువదివ్రతములు నాచరింప
నాకానతీయుమీ నాప్రాణనాయకా యనుచు సుందరమూర్తి నడుగుకొనఁగ
వ్యోమకేశుఁడు విని నోముకొమ్మని పల్కెఁ దాతతల్లికి శారదాంబ కపుడు
బ్రాహ్మణస్త్రీలకుఁ బసుపువస్త్రిడి భూషణము లలంకారించి నయము వొంద
నొసటఁ గుంకుమతిలకంబు పొసఁగదిద్ది
యంబ కరముల మూసివాయనము లొసఁగి, వేంక. ౪౬

కోటిధేనువులును గోటి కుంజరహయంబులుఁ గోకలును దివ్యభూషణములు
ధనరాశి పసిఁడిబిందెలు వస్త్రములు దీపకంబము ల్పన్నీరుకలశములును
నవరంజి పల్లకీల్ లాందోళికలు శయ్య మేల్కట్టు తలగడల్ మెత్తదిండ్లు
అద్దాలు నెత్తెచ్చుకాయలు చాఁపచిప్ప చిక్కోలను వ్వానయుఁ గుంకుమపుబరణి
వలసినంతకు నుంగరల్ అసుగ కేశుఁ
డొసఁగి భవుచేత దేవి నిన్నొప్పగించె, వేంక. ౪౭

జలకము ల్పన్నీటఁ జలిపి హెచ్చైనకోకలుగట్టి భూషణంబులు ధరించి
పుణ్యాహవాచనంబును వసంతము పంచపాలికల్ యరఁగుకంబములపూజ

పాటించి హాలాస్యపతియు నీశ్వరి నీవుఁ గంకణంబులు వీడ్చి పొంకముగను
నుభయపార్శ్వములబంధులనుంచుకొనివగల్వగపాయసాన్నఁబువ్యంజనములు
సహితముగ నారగిం పైన సమయ మెఱిఁగి
కాంత లడపంబు పట్టరే ఘనతమీఱ, వేంక. ౮౮

భవనమేతముగశాంభవి నీవువేడ్కగా నుత్సాహములు మించి యొకరికొకరు
సరససల్లాపము ల్చలుపుకొంచును వసంతము లాడఁగానె సుందరులు వచ్చి
యిరువంకఁజెయిలాగు లీయ దంతాందోళికములవేసి శ్రీకరముచెలఁగ
వెడలి సాయంత్రంబు నడనాటకములతో వాద్యఘోషము లొప్పవైఘు కరిగి
పాలికల నోలలాడింపవే లతాంగి
మణులతోడను గంకణక్వణనమెసఁగ, వేంక. ౮౯

శంఖకాహళవేణు ఝర్ఝరపటహ మర్దళభేరికాదివాద్యములు మ్రోయ
దిశలందు వెయివేలదీవట్లు పగలువత్తులు పట్టపగలుగ వెలుఁగ నెదుట
వింతవింతలు బాణవిద్యలుసేయంగ వెంట విప్రోత్తముల్ వేదములను
బఠియింప హాలాస్యపతి యుతంబుగ వరమదగజంబును నెక్కి మధుర యేగ
మాశి వీథుల నూరేగ మగువ లపుడు
నింటియింటికి హారతు లెత్తఁగాను, వేంక. ౯౦

పసిఁడిగిన్నెలఁ బోలు పాలిండ్లు కాంతులు రవికమూఁతలు దూసి రాణమెఱయ
మోముఁదమ్ములనవ్వు మొలవంగ నెరనీటుచెందఁబయ్యెటకొంగుచెక్కుకొనుచు
విటకాంద్రఁ గడకంట వీక్షించి సన్నసంజ్ఞల నేలుకొనుదాసిజనముమ్రోలఁ
గాంభోజి సావేరి కల్యాణి సురటి భైరవి తోడి నవరోజురాగములును
బాడుచును నాటకములాడ భవునితోను
దివ్యకరి డిగ్గి నగరి కే తేరినపుడు, వేంక. ౯౧

జలజాక్షులిద్దఱు జంటపట్టుకవచ్చి పల్లవంబులవంటి పాదములను
బన్నీటఁ గడిగి పుష్పంబు లర్చనచేసి ముత్తెలహారతు లెత్తఁగానె
చెలికత్తె లిరువంకఁ జెయిలాగులీయఁ జామరము వేయంగఁ దెమ్మెరలు వీవ
వచ్చి పీఁటలనుండి వరఫలదానంబు లతులభూదేవదేవతల కిచ్చి
పడుకటింటను వేంచేసి పల్లెమునను
హరునితోఁ గూడఁ బాలన్నమారగింప, వేంక. ౯౨

దంతంపు ద్వారబంధము కెంపుగందపట్త్యలు*కాంచనపుఁగవాటంబు లలర
మేలైనముత్యాలమేల్కట్టు కమనీయతరహంసతూలికాతల్పమునను
నలువంక దర్పణంబులు చిత్రరవుబంతిగలకుడ్యముల గవాక్షంబులలరఁ
గరదీపములతోడఁ గనకప్రతిమలొప్ప విద్రుమస్తంభము ల్వింతలలరఁ
గల్పితము నైన కేళికాగ్రహమునందు
విరులుమెండుగఁ జోడించి వేడ్క నెలఁగ, వేంక. ౯౩

నిలువుటద్దంబులు నలువంక వెలుఁగంగఁ బూవుఁగాఁ జుక్కగుంపులనుబోలి
మెఱసెడుముత్యాలమేల్కట్టు పఱుపుపాల్కడలి వంకకును సాటి
కంపింప రజతపంకజము రాజిల్లగఁ బసిఁడికుడ్యముల వలెను
బంకజరాగము ల్భాసిల్లఁగను గవాక్షుల మందమారుతంబులు జనింప
నగరుధూపంబువాసితం బగుచు మెలఁగు
మహితశృంగార కేళికామందిరమున, వేంక, ౯౪

మెఱుఁగు సూరెపుటంపు మెత్తలో విలసిల్లు మల్లెపువ్వులు వింత లెల్లఁగలిగి
వెలమదింపని పట్టుతలగడల్ శోభిల్లఁ జారుతరం బైన శయ్య మీఁద
సకలలోకములందు సరిలేని సౌందర్యశాలివై తగు పరాశక్తి నీవు
శితికంఠు నెడనుండ శిరమునందలిసేస లిడి దేవ దంపతు లెల్ల నిలిచి
యతిశయంబుగ నినుఁ జూచి యధికభక్తి
నెదుటపానుపుపీడెంబు లెత్తుకొనరె, వేంక. ౯౫

భక్ష్యంబులును బాలుఁ బం డ్లారగించి కప్పురపు వీడ్యంబు లింపుగను జేసి
వలపు మీఱఁ గదంబవననాయకుని సమేతముగఁ దానటవినోదమునఁ జెంది
నిదిరించి మేల్కొనియుదయకాలమునందుఁ బడుకయింటను లేచిబయలు వెడలి
జలకంబులాడి చందనవస్త్రభూషణంబులు దాల్చి గద్దెపైఁ గొలువునుండి
సురలుగొల్వంగ మధురలో సుస్థిరముగ
నఖిలసామ్రాజ్యములు గల్గి హరునితోడ, వేంక. ౯౬

పట్టణంబును మండపము లెల్ల దేవాలయంబు శృంగారించి యువని యెఱుఁగ
సాటించి చైత్రమాసమ్మునందలి శుక్లపక్షకృత్తికనాఁడు ప్రజలు చూడ
నుత్సాహముగనంబు లుత్సవంబుఁ బొడంగి ధవళవర్ణుని గల్పతరువు క్రింద

*పట్టెలకు పట్యలు, వేఱొకచో, ఓఁటెలకు బిందెలు, గృహమునకు గ్రహము కవి వాడెను.

ఇన్ని, ఎన్ని, కొన్ని, పెక్కు, పలు, ఆ, ఈ, ఏ, నీ, నా, మన, తా, ఒక్క, రెండు, మూఁడు, నాలుగు, ఐదు, ఆఱు, ఏడు, ఎనిమిది, తొమ్మిది, పది.)

తదన్తాః-(పదునొక, ఇరువది, ముప్పది, నలువది, ఏఁబది-ఇరువదిర్వింశతిః-పందొమ్మిదిరేకోనవింశతిః- పండ్రెండుద్వాదశ-అనుహాతిపన్నిరుః, "పండ్రెండేఁడులునిగతింజనఁగ"-ఉ.హరివంశ.)

పొరుగోః పొన్నుః

మినుజిప్రథమాః క్త్వాపిధాతునా బహుళం సమస్యన్తే-(మిట్టిపాటు, అదిరిపాటు, అదరవ్రేఁత, తిరుగఁబోఁత, సిగ్గుపాటు, నగుఁబాటు.)

నాఽపి వికృతా వవ్యయీభావః

బహువ్రీహౌ నన్నోః టేష్టిణ్

చూలోరిః

విలోస్తుక్

జికస్తచ్ఛబ్దోఽనుత్తరపదే క్త్వార్థేవా

త్రికాద్బహుళమ్

స్త్రీసమేభ్యో బహుళమ్

సమానాధికరణే వంటిర్నిత్యమ్

మోర్నిక్

పూర్వవత్తత్కర్మధారయే

టిర్వా నసంయోగలోష్మణామ్- "కలికిజక్కవచంటి యీ కలువకంటి"-ఘటికాచల. అత్రచన్నుశబ్దస్యాపి సమాసప్తి ర్దృశ్యతే-

కుఱుచ, చిఱుత, నడుమ, టి నిడుపానాంటేర్వాలోపః- కుఱుమాపు, కుఱుచమాపు, చిట్టుములు, కుట్టారికలు.

త్రికాదసంయుక్తస్య బహుళ మరోష్మణః

అచ్చోటి నిత్యత్ర నలోపః

ఓత ఇతి తపరకరణాత్

హ్రస్వతః స్థానార్థా చ్చోటః హ్రస్వస్యాత్ వా త్రిసంఖ్యార్థతః

రేవగల్వాది రేకవచనమ్

సేపు వడిభ్యాం నిత్యం సమాసః

నమిత్రస్య

తోఁబుట్వాదయః

నిక్కలాదయో యథోపదిష్టమ్

* * *

---

## —। అథతద్ధితాః ।—

త్వార్థేతనజ్

ఱికం చిన్నాదిభ్యో బహుళమ్

పేర్వాదే రిమిః

నల్లాదయో గుణవచనాని

అతో గుణాన్నః

మోఽర్ణః

మగాదిభ్యష్టిమిటాదయః

అగ్గలాదిభ్య ఇకః

అః మరాఠిభ్యః స్వార్థే

చిఱుతాదిభ్య ఉకః

ముందోరజః

ఉతోఽర్భికే- (సూత్ర మిదం స్థానాన్తరే యోజ్యమ్)

అరిక్తత్వార్థే జాలాదిభ్యః- (జాలరి. చోరవ, చదువు, చొప్పు, జూదము, టక్కు, టెక్కు, తగవు, తలగు, తీర్పు, తెంపు, తెరువు, తెగువ, దోఁపు, నేరుపు,పాటము, మతకము, పూజ, లావు,సిగ్గు, సూన, సుంకము,వేఁట

ఓయారాదిభ్యః ఇః

వేడుకాదిభ్యః కాఘ్వంసి

స్త్రియాం కత్తియః

బహువచనా దాఁడిః

ఆఘ్వంసి

ఈఘ్వమ్మతాదిభ్యః

చెంచెత మాలెత ఇత్యనయోః కేవలత్వమ్

సర్వత్ర తాచ్ఛీల్యే మంటాదిభ్యో మారిః

పార్వాదిభ్యః పోతుః

పగాత్తు ఘ్వంసి

స్త్రియాం కులా త్తః

మిండత గుబ్బెత ముట్టెత విటీ యువతి రజస్వలాః

ఎత్వం తవర్ణకే క్వాపి దృశ్యతే

మతుపో వ్యతిరేకే కుత్రచి దిఁడిః

కాఘ్వత్రాపి తిర్యక్సంజ్ఞాయాం దృశ్యతే

అందాదిభ్యః క్వాష్టత్తి యోర్గః

తౌస్వార్థేపి దృశ్యతే

అన్యే మతుబర్థాదయః ప్రయోగతో వేద్యాః

త్రేః ప్రకారే టుచ్

తద్వతి టిచ్

పుడు చ్చాత్

తకోః వడిః- (కొంతవడి, ఒకవడి, కొంతసే పని యర్థము)

తజాదిభ్యో వడిః-

కోత్రికాభ్యాం సంఖ్యాపరిమాణయోర్గిచ్యణౌ

ఎఁడు పరిమితా వేకత్వే

ఎఁడా లేర్లోపః

ఇయస్య (గిన్నెఁడు, దొన్నెఁడు)

ఒప్పిదము, క్రొవ్విదము, బెట్టిదము, పెల్లిదము, ఎల్లిదము, మగంటిమి. ఒజ్జస్యనజ్, ఒజ్జనము. కోటరము, కోడలికము, కోడంట్రము, కోమలికము, చెలికారము, పేదఱిమి, మగతనము, వెలుక, వెలరు, వేంద్రము, వెల్లిదము. వడ్లంగేరమ్, వడ్లంగము. పేర్వాదేరిమిః, పేరిమి, చెలిమి, కడిమి, పోఁడిమి, వాఁడిమి, వేఁడిమి, మేలిమి, పసిమి, మ్రుచ్చిమి, మిసిమి. వ్యతిరేకే కుత్రశ్చిదిఁడిః, ముక్కిఁడి, వాలిఁడి, వెరవిఁడి, సిగ్గిఁడి. చప్పిఁడిస్వార్థే. సందోరడిః. వ్యతిరేకే ఇతివర్తతే- సందడి. మందాన్మందురాయాం, మందడి, పెల్లడిప్రభృతయః. పోతుః, తిండిపోతు, వదరుఁబోతు, ఓడుఁబోతు, పాలుఁబోతు, దొరపోతు, నేరపోతు,

మూలుఁగుఁబోతు, కల్లుఁబోతు, కువ్వాడపోతు, తూఁగుఁబోతు, త్రుళ్లుఁబోతు, త్రాగుఁబోతు, కడిపోతు. చిఱుతాదిభ్యఉకఃస్వార్థే, చిఱుతుక. నాతి, నెలఁతి, పడఁతి, మడఁతి, పొలఁతి, మెలఁత, నిప్పు, వెలఁది.

పెండేరము పెండెరము

ఉబ్బాదేరరజ్-ఉబ్బరము, ఇంటరము, దాపురము, దాపరము, ఉల్లరము, పోతరము, ముక్కరము, ఒంటరము, పులసరము, టెక్కరము, మల్లరము, సోమరము, కట్టరము, పులకరము, పోసరము.

మూఁపోరంసకూటేఽరజ్వా

కాఁపోర్గార్హస్థ్యే

ఇయస్యాపి తద్ధితే లోపః, కొండీఁడు, మన్నీఁడు, సాలీఁడు.

అచోరిః- ఓర్పరి, ఓర్పు

సంస్కృతవ దనదంతస్య స్త్రీ ప్రత్యయః

అదన్తస్య సంస్కృతసమస్య భేదకస్యాలుర్వా నుప్రయుజ్య తేమహాత్మ్యామ్

నిత్య మగన్తస్య

ద్విగౌ తూమాప్రాప్తః- ఇద్దుము, ముత్తుము.

ఎనమతొమ్మయోస్తుత్తూమా- ఎనుముందుము, తొమ్మందుము

నాత్రఖండః

పదేష్టేర్లోపశ్చ-పందుము

తృతీయా పంచమీ సప్తమీనా మకర్తరి ద్వితీయా

ఉత ఏకార్థాత్తస్యాస్థానేవః- సమానాధికరణే ఉత్తరపదే

ఉతః స్త్రీసమస్య పుంపుణో ర్లుక్ కభేష్వద్వంద్వే నిత్యమ్

భేః పతౌ

స్వాఁతా దేర్లుప్తాంగస్య పరుషేషు

ఉత స్సప్తమ్యా అలిక్

అత శ్చేత తోడ వలనానా మిః (అకారాన్తానాం చేతతోడ వలనానామిత్వంస్యాత్సమాసే)

ఁతఃకిమ్, చేతో ఇత్యనయో ర్మాభూత్.

పదే రనుత్తరపదస్య సంఖ్యాయామునుక్

హల్యుక్

గత్యర్థాకర్మక శ్లిషశీఙ్స్థాసవసజనరుహా పాతీర్వతిభ్యశ్చ- ఏభ్యఃకర్తరి క్తస్యాత్ భావకర్మణోశ్చ

క్తోధికరణేచ ధ్రౌవ్యగతి ప్రత్యవసానార్థేభ్యః- ఏభ్యో అధికరణే క్తస్యాత్- చాద్యథాప్రాప్తమ్

"ముకున్దస్యాసిత మిద మిదం వ్యాసం రమాపతేః। భుక్త మేత దనన్తస్యే త్యూచు ర్గోప్యో దిదృక్షవః"

ధ్రౌవ్యజ్ స్థైర్య మిత్యర్థః (స్థితిః)

ఇతోతః క్తః (ఇతో ధాతో ర్వర్తమానే క్తస్యాత్)

మతిబుద్ధిపూజార్థేభ్యశ్చ- (మతిరిహేచ్ఛా) ఏభ్యో వర్తమానే క్తస్యాత్- రాజ్ఞాంమతః ఇష్టస్తై రిష్యమాణఇత్యర్థః చకారోఽనుక్త సముచ్చయార్థః)

నపుంసకే భావేక్తః-(క్లీబత్వే విశిష్టే భావేకాలసామాన్యే క్తస్యాత్ -జల్పితం- శయితం, హసితమ్)

క్తస్య చ వర్తమానే- వర్తమానార్థ
కస్య క్తస్య యోగే షష్ఠీస్యాత్
నలోకేతి నిషేధ స్యాపవాదః- రా
జ్ఞాం మతో బుద్ధః పూజితోవా)

అకర్తరి తృతీయాపంచమ్యోర్లః

నానర్థాత్సప్తమ్యాద్వితీయా

అలఘు స్సమాసపదే ద్విరుక్తిః

అనన్యాభిధానే పూర్వాకృత్యభిహితవ
త్కర్తా

తృన్నర్థే డిము

తయోర్లుక్

వ్యతిరేకే నిః

క్త్వవదర్థేనః

శత్రర్థే ధాతుసంబంధే చును

ఉన్నోన్యత్ర

భావిని కలజిః

జేరట్టిర్వాను ప్రయుజ్యతే

నిత్యం తచ్ఛబ్దస్సుపి

ఉత్తరపదే తస్యలోపః

తృక్త్వత్తచ్ఛీలాదిషు

జిః కర్తృవ దన్యస్య ప్రాధాన్యే విశేష
ణమ్

లఘ్వేకాక్షర పూర్వాదీనా మారజ్
బహుళమ్

సమాసః-(అత్సంస్కృతసమాలునాస్త్రీ
యాంసమానాధికరణే)ఇలుటాలు=
గృహిణి; ఏరాలు=యాత.

అన్యవ దపి దృశ్యతే

జికో విశేష్యేణ

త్రికముకౌ విభాషా

స్త్రీసమః

మీఁగడాది షష్ఠీబిందులోపః- మీఁగ
డ, మీఁదిరొయొక్క గడ; లేఁగడ

మీస్థపతి- (నాఁడేని, నాస్లు, లేడి,
లేస్లు)

వేసవి, వేసంగి, పొదుగు, పొదువు

పతతేః పడః ప్రాకృతికః

తథాహ్యస్మి న్నితి ప్రయోగతో వేద్య
ఇతి సూత్ర మపనీయ తస్యస్థానే-

వంజెఋ గ్వాదయ ఇతి వక్తవ్యమ్.
(వంజెఱఁగు, సంగోరు, పందొమ్మిది,
తొంబది, పెందొడ, వేఁబోక)

సర్వత్ర సిద్ధస్య సంయోగే నిత్యమ్-
(సార్వత్రికస్య సిద్ధస్య ఖండస్య సం
యోగే పరే నిత్యం పూర్ణబిందు
స్స్యాత్- (లాఁడి,లాంఢ్లు; పనఁటి ప
నంట్లు; ఏఁడు ఏంఢ్లు; తేఁటి తేంట్లు.
సర్వత్రేతికిమ్. నదీర్ఘాత్సాధ్య ఇత్య
నేనబాధో మాభూదితి. సిద్ధస్యేతికిమ్.
వచ్చెఁ గ్రమ్మఱ, రాఁగాఁ గ్రమ్మఱ
ఇత్యత్రాపి స్యాదితి. చెనఁటి, పనఁటి
అరఁటి, అనఁటి, పరఁటి, లాఁడి,
కొనఁటి, ఏఁడు, తోఁడి, తేఁటి,
బోఁటి, బోఁడి, వాఁడి, వేఁడి,
పోఁడి, కాఁడి, దోఁటి, గోఁటి,
దాఁటు-)

రుగత స్త్రీస్థానేయే

ఉరః సంస్కృతసమస్య

నెఱస్య వగాది వ్యంగలోపః

పరస్య ద్వేచ హాలః

నిండోర్వ్యాఱాదిషు-(నివ్వెఱ, నివ్వెఱఁ
గు, నిప్పస్తు, నిప్పచ్చరము)

కృతో ల్లోప స్తనాదిభ్యః కపానాంతు గబామతాః- చన్గవ, కన్గవ, చన్గొండలు. అస్య ద్రుతత్వాభావా న్నానుస్వారః

కువర్ణరోయుతో యినా కయిత్యుదీరితో బుధైః- అఖ్ఖండవత్సన్సుశః, తథానహీంష్యతే వశా.

కర్త-

చేయుచున్నవాఁడు- కుర్వన్
చేయఁగలవాఁడు- కరిష్యన్
చేసినవాఁడు- కృతవాన్
చేసెడువాఁడు } కర్తా
చేసెడివాఁడు }
చేయువాఁడు }

కర్మ-

చేయఁబడుచున్నవాఁడు- క్రియమాణః.
చేయఁబడఁగలవాఁడు- కరిష్యమాణః
చేయఁబడినవాఁడు- కృతః
చేయఁబడెడువాఁడు } ఆశ్రయః
చేయఁబడెడివాఁడు }
చేయఁబడువాఁడు }

కాలుజాఱి పడినాఁడు- (తద్భావే తత్సమవేతస్య భావః)

తత్క్రియాయాం తత్సమవేతస్య- క్రియావిశేషణం భవతి. కాలుజాఱి పడినవాఁడు- అత్ర తత్క్రియా పతనం, తత్సమవేతః పాదః, తత్క్రియాతు స్ఖలనం- స్ఖలనస్య పతనం ప్రతి విశేషణత్వ మనేనాతిదిశ్యతే-ఏతేన ద్వయోః క్రియయోః సమానకర్తృకత్వ మాయాతమ్. పతనం ప్రతి స్ఖలనస్య హేతుత్వేన పూర్వకాలికత్వం సమానకర్తృకతా చేతి. తద్వ్యాకారాణా మప్రయోగ ఇతి బోధ్యమ్.

తదీయస్య క్రియాయాం తస్య తథావృత్తిర్యస్య క్రియాయాం వర్తమానోచిః తస్యప్రాధాన్యే కర్తురివ విశేషణం భవతి.

అసౌ తత్తథా- తత్సంబంధినః క్రియాయా మసౌ తత్కర్తృభవతి- హరి కగుణానిలయుండు. వాఁడు ధనము లేఁడు.

అత్ర కర్తృగతో భావో ధాతునా సముదీర్యతే। యోసౌ కర్మగతో భావః పత్యన్తే నాభిధీయతే.

ధాతుత్వ వివక్షాయాం క్వాపి సుప ఇంచుక్

భయాదేః పతిః

పతౌ పూర్ణబిందులోపో బహుళమ్

సుఖాదేర్వా

చిగుర్వాదేశ్చుక్

నిద్రాదేః పోవ్వః- నిద్రపోవు, నిద్రించు, మోసపోవు.

సర్వం లక్షణం చిన్నయసూరీయాణి సూత్రాణి స్వయథాదృష్టమ్.

# ఆంధ్రశబ్దానుశాసనము.

## సంజ్ఞాపరిచ్ఛేదము.

---

సిద్ధి ర్లోకంబువలన గ్రాహ్యంబు
శాసనం బీయది దిక్ప్రదర్శనంబు
సంస్కృతప్రాకృతఁబులు ప్రకృతులు
ఈయది వికృతి
ఆద్యప్రకృతికి వర్ణంబు లేఁబది
ద్వితీయంబునకు ఋగ్వక్రతమజఝశష
లు ద్రిక్షనగు
ఇట ముప్పది యాఱు
ఋగ్విసర్గవర్గయు జ్ఞఝ శషలు సమయో
గంబునం గలియు
హ్రస్వవక్ర ఖండబిందు దంత్యచజ లనా
ద్యఁబులు
అచ్చులు ప్రాణఁబులు
ఎఏఒఓలు వక్రంబులు
ఐఔలు వక్రతమంబులు
హల్లులు ప్రాణులు
కచటతపలు పరుషములు
గజడదబలు సరళంబులు
లాఁతిహల్లులు స్థిరఁబులు
నకారంబు ద్రుతంబు
ఋౠవర్ణంబులు రలతుల్యఁబులు
ప్రాసంబున బహుళంబు
వళిం బదాదితుల్యంబులు
పాదంబునం దాద్యక్షరంబు వళి
రెండవయది ప్రాసంబు
లగగలంబులు వహాంబులు

పదాదిహల్లునకుం గ్రార ద్వక్ష హాల్యోగం
బు లేదు
నహలు సూర్యలు
నలనగసలభరత లింద్రులు
వాదులు గణంబులు
ప్రత్యయంబు వర్ణకంబు
అగ్వాదులును ధాతువులు
ఇఈఎఏలం గూడిన జచలు తాలవ్యం
బులు
పెఱలు దంత్యంబులు
పదాదిస్వరయోగంబునం దొంటియ
ట్లొండె నగు
ఇవి యొండొంటికి సవర్ణంబు లగు
వికృతిని హల్లుక్రింద లాఁతిహల్లు గలు
గదు
డాకు లకారం బగు
కగచతపమవలు
నకారఁబునకు
రబలకు జకారంబును
నరలకుం దుదివానికి సర్వంబునగు
హల్లులకెల్లం గ్రారయగు
చణరలలకు లేదు
టాకు నల లగు
తకారంబు సాకగు
హాకు సర్వంబు లేదు
ఉగ్గలి ముత్య మప్డి ప్డె ప్పు కాయ్యు
చెయ్యు చెద్దు చెద్ములు చెద్దము

ఓష్ఠ్యస్వరాంతవకారంబును ణయళలు
ను బదాదిని లేవు
క్రియలంద్రిక్త యాకేత్వంబు లేదు
తాయెత్తు పయ్యెద పయ్యెద
ఊయేల యేత్వంబునకు హ్రస్వం బత్వం
బాత్వం బొండె నగు
ఉయేల యుయాల
అంతస్థములు లఘువు లలఘువు లని
ద్వివిధంబు
యవలలు ప్రకృతులయందు సైతము.
(పణ్యార మిత్యన్యదేశ్యత్వా న్న పరి
గణనా)
ఇందు రేఫంబును
అచ్చుమీఁదియచ్చు యశ్రుతియగు,నది
యార్యులు లఘువండ్రు
లఘ్వలఘువులకు విరోధంబు లేదు
రేఫంబులకు నిత్యంబు
బిందువు సిద్ధంబు సాధ్యంబును బూర్ణ
ఖండ భేదంబువలన ద్వివిధంబు
హ్రస్వంబునకు మీఁద ఖండంబునకుఁ
బూర్ణం బొండె నగు
ఇఁకాదులందు
ప్రథమంబునందు నిత్యంబు
ద్రుతంబునకు లోపఖండంబులుగలుగవు
చాఁపునకు సాధ్యంబు ఖండంబగు
జిత్తు బిందుపూర్వం బగు
స్థిరంబు గాదు
డుట్టు పూర్ణపూర్వంబగు
వర్ణశబ్దంబుచేసస్వరంబునకు గ్రహణంబు
పరంబగుచో నా రా నాఁబడు
పదంబు నాంతఁబు ద్రుతప్రకృతికము
అన్యంబుకళ
అవ్యయ సుప్తిఙ్లిం దనుకరణంబు ద్రి
క్తం బ్రయోగింపఁ జనదు
తే నమః పదంబులు దండకావసానం
బునం జూపట్టెడు
భవదాదులకును బుద్రేఫాంతపదంబుల
కిందుఁ జొరంగలుగదు
ఈయవి తత్సమంబు తద్భవంబు దేశ్యం
బు గ్రామ్యంబు నని చతుర్విధంబు
విభక్తివికృతంబు ప్రకృతిద్వయంబు
తత్సమంబు వికృతంబు తద్భవంబు
ప్రవాహసిద్ధంబు దేశ్యంబు
విరుద్ధంబు గ్రామ్యంబు
పదంబు వ్యవహారప్రసిద్ధంబ యిందుఁ
బ్రవ్యాహార్యంబు
దోషరహితంబునకప్రయుక్తత్వదోషం
బు లేదని యథర్వణాచార్యులండ్రు.

ఇది పరవస్తు చిన్నయసూరివిరచితంబైన యాంధ్రశబ్దానుశాసనంబునందు

సంజ్ఞా పరిచ్ఛేదము.

## సంధిపరిచ్ఛేదము.

---

ఉత్వంబున కచ్చురా సంధియగు
అనాదివిభక్తివర్తమానచువర్ణంబుల బహుళంబు
కిమాదులయం దిత్వంబునకు
క్రియాపదతదాదికి షష్ఠులందు
మధ్యమపురుషంబునందు నిత్యంబు
అత్వంబునకు బహుళంబు
ఇతోర్థంబులందు
తదర్థవలోపంబుననిత్యంబు
అచ్చునకామ్రేడితంబునం బ్రాయికంబు
ఆకు రా
మానార్థకంబునం దెడురా నిత్యంబు
లిలోపంబగు
అనుకరణంబున హల్లునకు ద్విత్వంబగు
చాఁపుమీఁద బహుళంబు
అహమాదులయు
విసర్గంబునకు లోపంబగు
నమోత్వంబున కోత్వంబొండెనగు
కుఱు చిఱు కడు నిడులయుపధకు ద్విటకారాదినిత్యంబు
నిడునకు రాడులు రానగు
హల్మధ్యగంబున కన్యతరసవర్ణంబునకు హల్లునకు లుక్కగు
ద్విమలయుపధకు బహుళంబు
అలఘులకారంబుమీఁదిలువర్ణంబునకు
నీలుఁగు ప్రభృతులం దొలిహల్లునకు
పుక్కిలించు ప్రభృతుల సంయుక్తంబునం దన్యతరంబునకు
అక్కటాదులకు
పతత్యర్థపకారంబునకు ముడుజ్జులు రా.
పదమధ్యంబునలడరలయుత్వంబునకు
అబ్బురాదులందు
చిదురుపాదులదకారంబు పైదానికగు, యుక్తపూర్వంబు గురువుగాదు
టవర్ణంబునకు కొఱకుకంటెలురా
లాఁతులు లాఁతికి నొకానొకచోఁ జూడనయ్యెడు
అదంతధాతుజభేదక లాగమంబులపయి వుట్టునకు
అదియవులయుత్వంబునకు వృత్తియందు
అంతాదుల తవర్ణంబున కవధివాచిరా నొండె
ఏనియిత్వంబునకు
మధ్యమంబుమువర్ణంబునకు
అచ్చురాఁగలుగదు
అంతట నామ్రేడితంబురా నొండె
డుజ్జునకు
ఇంచుకాదుల తుదియక్షరంబునకు
ఔపవిభక్తికంబులసుప్పునకు
లాఁతులకుఁ గొండొకచోఁ గానంబడియెడు (వగలాఁడు)
రాపు ప్రభృతులం దొలియక్షరంబు పైయంశంబునకు నిత్యంబు
కడాదుల ద్విటకారాదియం దంతంబు భృశార్థంబునందగు
అందదుకు ప్రభృతులు యథోక్తంబుగ గ్రాహ్యంబులు
తద్ధర్మభేదకంబునకు మీఁదం గలుగదు

—(7) మదమంజరికథ—

క. మను జేశ్వర శుద్ధపటుం, డనురజకుం డొకఁడు మోహనాకార మహీ
జనవినుతను మదమంజరి, యనియెడివరపుత్రిఁ గనియె నంబవరమునన్. ౮౯

వ. అన్నారీమణిమోహనాకారంబు గనుంగొని ధవళుం డనురజకుండు మనో
భవాధీనమానసుం డైన వానిజనకుం డెఱింగి దాని జననీజనకుల నొడం
బఱిచి యక్కన్యం దనతనూజునకు వివాహంబు గావించుకొని పురంబునకుం
దోకొని పోయిన. ౯౦

క. ధవళుండును వేడుక నా,ధవళాంశుముఖి న్వినూత్నధవళాంబుజచా
రువిలోచనఁ బొంది మనో, భవసౌఖ్యము నొందుచుండెఁ బాయని వేడ్కన్.

ఉ. అంతట నొక్కనాఁడు దనయల్లుని గూఁతును దోడితేర న
త్యంతముదం బెలర్పఁగ నిజాత్మజు శుద్ధపటుండు వంపఁగా
నెంతయుఁ బ్రీతి వాఁ డరిగి యిద్దఱిఁ దోడ్కొని యేగుదెంచుచో
సంతతశోభితం బయిన చండికగేహము పొంత నక్కడన్. ౯౯

క. ధవళుండు దనమఱందిని, ధవళేక్షణ నచట డించి తానొకఁడుఁ బ్రభా
ధవళ మగు భద్రకాళీ, భవనంబున కరిగి యధికభక్తియుతుండై. ౫౦

క. తను విధి కడుఁ బ్రేరేపఁగ, మును మ్రొక్కితి నని కఠారమునఁ దనగళముం
దునుముకొని తల యుమాపద,వనజంబులమీఁద నిలిపి వ్రాలె ధరిత్రిన్.

వ. అత్తెఱం గెఱుంగక యెంతయుం దడ వెదురుచూచి వానిమఱంది దేవిమంది
రంబున కరిగి యాచందం బైనయతనిం గనుంగొని డెందంబునం దల్లడిల్లి
నాకు వీనితోడిద లోకంబుగాక యని శిరంబు ద్రెంచుకొని తానునుం
గూలిన. ౫౨

క. పడఁతుక యవ్విధ్వము వటఁ,దమయుభయము మనిభయంబు దనుకఁగ వెసన
గ్గుడిలోని కరిగి యిరువురుఁ, బడినవిధముఁ జూచి శోకభయ విహ్వల యై.

క. ఆవరుఁడు సహోదరుఁడును, జీవంబులఁ బాసి యుండ జీవముతో నే
నీవార్త తల్లిదండ్రుల, కేవిధమునఁ జెప్పఁబోదు నింకిట ననుచున్. ౫౪

క. జీవంబు విడుచుతలఁపున, దేవీభవనంబుపొంత దీర్ఘతరువునం
దీవ యురిపెట్టి తత్సతి, యావిశ్వసవిత్రి నిట్లు లని నుతియించెన్. ౫౫

శా. శ్రీరామాధిపవాగ్వధూవరులు నీశ్రీపాదసేవారతుల్
శ్రీరమ్యంబులు నీమహత్త్వములు నీశృంగారసాహిత్యరే

ఖారూపంబు మహేశుదేహము జగత్కళ్యాణి నీసత్త్వమె
వ్వారుం బ్రస్తుతిసేయనేర్తురె కృపావారాశి కాత్యాయనీ. ౫౬

వ. అని వినుతించినం బ్రసన్న యై యాజగన్మాత సోదరునిం బతిని బ్రతికించెద
నయ్యిరువురశిరంబులు దేహంబులఁ గదియింపు మనిన సంతసిల్లి యంధ
కారంబున నెఱుంగక. ౫౭

గీ. మగనిబొంది నన్నమస్తకం బానగూర్చి, యన్నశిరము మగని నంటఁగూర్పఁ
దలలు వీడువడినతనువులతో వారు, జీవకలితు లైరి దేవికరుణ. ౫౮

వ. అని కథఁ జెప్పి వేతాళుండు నరేంద్రా వీరిలోన నింతికిం బతి యెవ్వఁ డగు
నని యడిగిన నవ్విభుఁడు సకలేంద్రియంబులందును శిరంబు ప్రధానం బగుటఁ
బతిశిరంబువాఁడు పతి యగు ననిన వేతాళుం డెప్పటియట్ల తరువున కరిగిన
మగుడం బట్టి తెచ్చునప్పుడు బేతాళుం డతని యాతాయాతంబుల డస్సితివి
యే నడుగు ప్రశ్నంబుల కుత్తరంబులు సెప్ప నీవకాని యెవ్వరు నేర రింక
నొక్కకథ విను మని యి ట్లనియె. ౫౯

## —(8) దేవసేనచరిత్రము—

క. మును వీరబాహుఁ డనియెడు, మనుజేశ్వరువీట రూపమహిమోన్నతుఁ డై
పెనుపొందెను ధనదత్తుం*, డనువైశ్యకుమారుఁ డుజ్జ్వలాకారమునన్.

గీ. అతఁడు దేవసేన యనియెడుకన్యక, యౌవనాభిరామ ననుమధామఁ
జూచి మన్మథాస్త్రశోషితహృదయుఁ డై, యాత్మలోనఁ దాప మగ్గలింప.

క. పరమేశుఫాలశిఖి యుద్ధురతం దనుఁ గాల్ప మంటతోడను మదనుం
డురవడి డెందము సొచ్చిన, కరణిం గామాగ్ని లోనఁ గాల్పఁదొడఁగినన్.

వ. ఆవాలుఁగంటి యొంటి విహరించు నెడకుం జని తలం పెఱింగించిన నది లజ్జా
వనతవదన యగుచు ని ట్లనియె. ౬౩

గీ. నను సముద్రదత్తుఁ డనుగుణాఢ్యునకు, నిచ్చినాఁడు తండ్రి యెల్లి పెండ్లి
యనఘ నేఁడు బరునియంగన నైయుండఁ, దగునె యిట్టితలఁపుఁ దలఁప నీకు.

క. అనుటయు సాధనదత్తుఁడు, మనసిజదందహ్యమానమానసుఁ డై ప్రా
ర్థన మొనరింపంగా ని, ట్లనియెం గమలాయతాక్షి యతిమధురముగన్.

గీ. పెండ్లి యాడి యేను బ్రియుని బొందకమున్న, నిన్నుఁ జెందుదాన నిక్కువంబు
నమ్ము రాకయున్న నాసుకృతము నీద, యనినఁ బ్రియముతోడ నరిగె నతఁడు.

*ధనదత్తుఁడు, ధర్మదత్తుఁడు- అని యీకథలో నేకలము.

సీ. అపరదినంబునయందు శోభనలగ్న మాసన్న మగుటయు నసమమహిమఁ
దల్లియుఁ దండ్రియుఁ దగుకులోచితమంగళోపచారములు పెంపొందఁజేసి
చెలువారఁ గన్యకు శృంగార మొనరించి భద్రంబు మీఱ సముద్రదత్తు
నకుఁ బెండ్లి యొనరించి నాఁటి నిశావేళ నాతనిశయ్యకు ననుచుటయును
దనమనంబున నెంతయుఁ దమక మడరఁ
గవియ వేడుకపడిన నాకాంతుతోడ
భయము లజ్జయు మదిలోనఁ బాయఁబెట్టి
యెంతయును ధైర్యమున నింతి యిట్టు లనియె. ౬౭

గీ. అధిప యేను సత్యహానికి నోర్వక, యొకటి నీకుఁ జెప్ప నుత్సహించి
వెఱచి యున్నదాన విపులధైర్యముతోడ, నవధరింపవలయు నత్తెఱంగు.

వ. నిన్న ధనదత్తుఁ డనువాఁడు నన్నుఁ గామించి యేకతంబునం బట్ట నమకట్టిన
వానిఁ గారించుటకు నోర్వక యేను వివాహానంతరంబున వచ్చెదనని వానికి
సత్యంబు చేసితి నాసత్యంబుఁ బాలింపు మనిన నొడంబడి సముద్రదత్తుండు
తన్నుం బంచిన. ౬౮

క. ఆరమణి రత్నభూషణ, హారావళి వెలుఁగ నొంటి యరుగఁ దొడంగెం
దారావళివృతమూర్తి, స్ఫారాకృతి యొప్పు రాత్రిసతియుం బోలెన్. ౭౦

వ. ఇట్లు విజనం బగుపౌరమార్గంబున నిరర్గళగతి నరుగుసమయంబున. ౭౧

సీ. మిడిగ్రుడ్లును గోరమీసంబులు మహాభుజములు విస్తీర్ణవక్షఃస్థలంబు
నతికఠినంబుఁ గాలాంజనాభము నైన విగ్రహంబును గుఱ్ఱువెండ్రుకలును
నీలాంబరంబును నిర్దయభావంబు నత్యంతభయదంబు నగుచుఁ దనరు
ఘనతరనిబిడాంధకారభయంకరశబరసేనాపురస్సరుఁడు వోలె
నసమనక్షత్రరత్నచౌర్యమున కంబరంబుఁ బ్రాఁక నమర్చిన రజ్జు వనఁగ
మెఱసి యసిదీప్తిపుంజంబు మిన్నుముట్టఁ
జోరుఁడొక్కండు వచ్చి యాసుదతిఁ జేరి. ౭౨

క. ఎక్కడిదానవు నడురే, యెక్కడికిం బోయె దొంటి యిప్పుడు నాచేఁ
జిక్కితి రమ్మని యక్కరి, యక్కటికము దొలఁగి తమక మడరెడుమదితోన్.

గీ. రాజవదన యేఁ జోరులరాజ నాకు, నీవుఁ దొడవులుఁజిక్కితి నిలువుమనుచు
మగువకరపంకజముపట్టి తిగిచె రాజ, కదళిఁ గబళించు నున్మదగజమనంగ.

వ. ఇట్లు కరంబు వట్టి తిగిచినం గరంబు భయంబునొంది యట్లైన నీతోడవులు
గైకొని నన్నరుగంగనిమ్ము క్రమ్మఱ మగిడి వచ్చెద ననిన నవ్వుచు నవ్వనితం
గనుంగొని- ౭౫

చ. మనసిజరాజ్యలక్ష్మి యగుమానవతీమణి నేకతంబునం
గనుఁగొని యిచ్చనీప్సితసుఖంబుఁ బొందక నీవు వోయిర
మ్మనియెడు కూళుఁడుంగలఁడె యంగన యిట్టులు వత్తె దేటికి
న్వనితలు నేఱులున్మగుడి వచ్చుట గల్గునె పాసిపోయినన్. ౭౬

క. అనవుడు నావనజానన, తనవృత్తాంతంబుఁజెప్పి తడయక వస్త్రం
జననిమ్ము బొంక నావుడు,విని చోరుం డాత్మలోన విస్మితుఁడగుచున్. ౭౭

సీ. వామాక్షి క్రమ్మఱ వచ్చుట నిజమేని మును నీవు ధర్మదత్తునకుఁజేసి
నట్టి సత్యముసేయు మనుటయుఁ బ్రియమంది యాపద్మలోచన యట్లచేసెఁ
దస్కరుకడఁబాసి ధర్మదత్తునిపాలి కరుగుటయును జోద్యమంది యతఁడు
సత్యంబు దప్పక చనుదెంచినప్పుడ వరదేవతవునీవు పద్మగంధి
కన్యవైననాఁడు కడువేడ్కఁగోరితి, గాని యిప్పు డన్యకాంత వైతి
కాన నిన్నుఁ జేరఁ గాంతునిపాలికిఁ, జనుము నెమ్మి ననుచుఁ బనుచుటయును.

క. ఇంతి యసత్యభయంబున, నెంతయు వెసఁ జోరుకడకు నేగి తనదువృ
త్తాంతముఁ జెప్పిన మది న,త్యంతాశ్చర్యంబు నొంది యాతఁడు కరుణన్.

క. నీసత్యమునకు మెచ్చితి, నీసత్యముఁ దగవుఁగలదె యింతులకెందున్
నీసొమ్ము నిన్నుఁగైకొను, నాస యుడిగె నాథుకడకు నరుగు మనుటయున్.

క. తనపతికడకుం దాఁ జని, వనితామణి తాను బోయి వచ్చిన విధ మె
ల్లను జెప్పిన విని పతి మెచ్చొనరఁగఁ గైకొని సుఖాబ్ధి నోలలనార్చెన్.

వ. అని కథచెప్పి వేతాళుండు- ౮౨

క. ఆముగ్వురలో సాత్త్విక, తామహితుం డారయ ధనదత్తుఁడొ చోరుం
డొ మగువమగఁడొ యనుటయు, నామనుజాధీశుఁ డిట్లను నాతనితోన్.

సీ. పరపురుషునికడ కరిగెద నన్నప్పుడ విడువంగఁదగు నింతి విడువఁడయ్యెఁ
దలపోయఁగ సముద్రదత్తుచిత్తంబున సత్త్వగుణంబు లేశంబులేదు
పరకాంత నృపదండభయమునఁ గవియని ధనదత్తునందు సత్త్వంబులేదు
ముచ్చు ప్రాణములపైవచ్చినం జేరిన యర్థంబు విడువని యట్టివాఁడుఁ

దలఁపనిట్లయ్యెలోభమింతయును లేక, మణివిభూషలు మానినీమణియుఁదనకు
నబ్బియుండఁగఁ బొమ్మనియట్లువనిచె, జగములోపలఁజోరుండెసాత్త్వికుండు.

వ. అనిన బేతాళుండు జనపతికి నదృశ్యుండగుచు వృక్షంబునకరిగిన వెనువెం
టంజని తన్ను మనుజవిభుండు పట్టితెచ్చునప్పుడు మఱియు నిట్లనియె. ౮౪

క. అడిగిన నెవ్వారికి నేర్పడఁ జెప్పఁగరానియట్టి ప్రశ్నంబులు చొ
ప్పడఁజెప్పితి నీమదికిం, గడ గలదే యింక నొక్కకథ విను మనియెన్. ౮౫

— (9) వైశ్యకన్యకథ —

గీ. (పూర్వకాలంబునను) భానుపురమునందు
ఘనుఁడు సూర్యప్రభుండను మనుజనాథుఁ
డలఘుకీర్తిచందనమలయాద్రియనఁగ
నెప్మి రాజ్యంబుసేయు కాలమ్మునందు. ౮౬

క. ధరలోనఁ దామ్రలిప్తాపురి ధనదత్తుఁడను వైశ్యపుంగవుఁడు మనో
హర కాంతిరూపగుణములఁ, గరమరునుగఁ దనరునట్టి కన్నియఁగనియెన్.

క. కప్పారు తుఱుమునున్నతి, యొప్పారెడు చన్నుఁగవయు నునుతరగరిమ
న్విప్పారునితంబంబును, నప్పొలఁతికి జవ్వనమున నందము చేసెన్. ౮౮

క. అంతట విధికృతి జనకుం, డంతము నొందుటయుఁ దాను నమ్మయు దుఃఖా
క్రాంతయయి రాజవసులకు, నెంతయు భయమంది యర్థమెల్లనుగొనుచున్.

వ. పుత్రియుందానును నర్ధరాత్రసమయంబునఁ బురంబు నిర్గమించి. ౯౦

క. తమభీతిశోకతమములఁ, దమమధికంబైనఁ దెరువుదప్పి యరిగి శూ
లమున నిడినచోరుని న, గ్రమునం గని యులికిపడుచుఁ గంపించుతఱిన్. ౯౧

క. వడిఁ గొట్టు కంఠమున వెలు, వడి యునికిం జేసి నొప్పివఱపఁగ వాఁడుం
గడుపుబ్బములుగఁ దొడఁగిన*, నెడగలుగుచు వైశ్యకాంత యెవ్వఁడవనినన్.

మ. తెఱవా చోరుఁడ శూలసంగతుఁడ నైతిం గ్రూరకర్మంబుచేఁ
గొఱఁతం బొందితిఁ జావురా దకట నాకుం దొల్లి పాపంబులే
గుఱిలేకుండఁగఁ జేయఁబోలుదుఁ గడున్ గుప్పించె బల్వేదన
ల్దఱచై యొందును బాపకర్ములకు నేలా మంచిచావబ్బెడున్. ౯౩

వ. అని పలికి మీ రెవ్వ రెవ్వలనికిం బోయెద రనిన నవ్వనిత యిట్లనియె.

---

*కడుపుర్గములుగ్గం దొడంగిన- నెడఁగలయుచు-

క. పతిచచ్చినఁ దల్లడిలుచు, సుతఁ దోకొని దిక్కుమాలి చుట్టలకడకుఁ
గతి చెడి పోయెద నని తా, నతిదుఃఖిత యగుచునుండె నాసమయమునన్.

క. కేరాజు వాడిచి యెక్కినఁ, జోరుం డా వైశ్యకాంతసుత నతిసుభగా
కారం గనుఁగొని కడుఁబ్రియ, మారఁగ నిట్లనియె దాని యంబికతోడన్.

సీ. అమితధనంబు శుల్కముగ నిచ్చెద నీకుఁ దనయ నాకొసఁగి చేదారవోయఁ
బుత్రార్థముగ నన్యపురుషుని బొందంగ ననుమతి యిచ్చెద నవ్విధమునఁ
బుత్రునిఁ గనిన నాపుత్రుఁడై వాఁడు దుష్కర్ముని నను సూర్ధ్వగతికిఁ బుచ్చు
నాత్మసంభోగసౌఖ్యానందకందళితాభిలాషుండనై యడుగ నిపుడు
వీఁడు గాఱు లాడెడు నని విడిచిపోక, యింతినిచ్చెదననుమన్ననియ్యకొనుడు
దనసమీపంబునందున్నధనముసూపఁ, బుచ్చుకొనితనసుతదారవోసె;నతడు.

వ. ఇట్లు ధారవోయించుకొని ప్రముదితాంతరంగుండై సంతానార్థంబుగా నక్కన్య యన్యపురుషుం బొంద ననుమతి యిచ్చి యాక్షణంబ ప్రాణంబులం బాసిన నచ్చోటు వాసి ఘనం బగుధనం బాబరించుకొని పుత్రికాసమన్వితయై సూర్యప్రభుని పురంబునకుం జని ధనంబిచ్చి తగువారిచేత నచ్చోరునికి నగ్నిసంస్కారాదులు చేయించి తనపినతండ్రియగు ధనపాలుని మందిరంబునకుం జని సుస్థితినుండి యొకనాఁడు. ౯౮

క. సౌధముననుండి వేడుక, నాధనవతి యొకమహీసురాత్మజు రూప
శ్రీధాముని వరకాంతి సుధాధామునిఁ జూచి రాగతరళిత యగుచున్.

క మానసభవబాణాహతి, మానము గోల్పోయి తనదుమాతకు మదిలో
నూనినవిప్రకుమారుని, పై నెయ్యముఁదనదుతాపభరముం దెలిపెన్. ౧౦౦

వ. ఇట్లు దెలిపినం జోరవాక్యంబు మనంబునం దలంచి యఘంబు లేమికి నిశ్చయించి యెవ్వరు నెఱుంగకుండ వానిం దోతేర నొక్కదూతికం బుచ్చిన నాసాబగుం డిట్లనియె. ౧౦౧

గీ.పంచశతరూప్యకంబులు వాయకేను, నిచ్చలువ్యయంబుసేయుదు నేఁడుమాత్ర
మిప్పుడేనూఱురూకల నిచ్చితేని, నరుగుదెంతు లేకున్నరా ననుచుఁ బలికె.

ఉ. అప్పుడ యేగి దూతి యతఁ డాడినమాటలు వైశ్యకాంతకుం
జెప్పిన దానిచేతికిని శీఘ్రము యర్థము నిచ్చి యేరికిం
జెప్పక రాత్రిరమ్మనినఁ జేకొని తానడురేయి వచ్చి య
య్యొప్పులకన్య నింపుమెయి నోలలనార్చె సుఖాంబురాశిలోన్. ౧౦౩

వ. ఇత్తెఱంగున నత్తెఱవతోడి యభీష్టలీలలం దగిలి యారాత్రి గడపి ప్రభాతంబున నిజనివాసంబున కరిగి హారలతానామవారవనితాలోలుం డై యుండెఁ, దత్సమాగమంబున వైశ్యపుత్రి సౌహృదలక్షణంబున నుల్లసిల్లి.

క. గాంతివిధంబున గర్భం,బెంతయు గూఢముగఁ దాల్చి యినసమతేజుం గాంతినిధి రాజలక్షణ,వంతు శుభాకారు నొక్క వరసుతుఁ గాంచెన్.

వ. ఆపుత్త్రుఁ గాంచిననాఁటిరాత్రి గౌరీరమణుండు రమణికిఁ గల సన్నిధిసేసి యిట్లని యానతిచ్చె. ౧౦౬

మ. తరుణీ నీసుతుఁ బెట్టిలోనిడి నృపద్వారంబునం బెట్టు మె
వ్వరునుం గానకయుండ నీవు చని లేవం గాంచి సూర్యప్రభుం
డురుతేజంబున వానిఁ జూచి మదిలో నుప్పొంగుచుం బుత్త్రుఁగా
నిరవద్యోత్సవలీలమైఁ బెనుచు వీని న్నాదుదివ్యాజ్ఞ మై. ౧౦౭

వ. అనుటయు. ౧౦౮

క. పతిలేనిసుతుఁడు గలుగుట, యతినింద్యం బగుట మున్న యాత్మవగచున య్యతివ పరమేశునానతి, నతిసంతోషంబు నొందె నాక్షణమాత్రన్.

చ. తనకపు డీశ్వరుండు విదితంబుగ నత్తెఱఁ గెల్లఁ జెప్పిన
న్వని ప్రియమంది సజ్జనిడి నిర్మలచేలము గప్పి తత్సుతుం
బెనుచు ఋణంబులేమికయి పెంపున మాడలు వేయి కొంగునం
దొనరఁగఁగట్టి కొంచుఁ జని యుంచెను రాజగృహంబు వాకిటన్. ౧౧౦

వ. అ ట్లవ్వరు నెఱుంగకుండ నప్పట్టిం బెట్టి వచ్చి యక్కోమటిలేమ తనతల్లి గృహంబున నిశ్చింతంబున నుండె నంతకమున్న మేదినీకాంతుండు సంతానార్థియై పరమేశ్వరప్రార్థనంబు చేయుట నద్దేవుండు కరుణించి నాఁటిరాత్రి కలలోనం బొడసూపి యఖర్వసార్వభౌమపాత్రంబగు పుత్త్రుండు ప్రభాతంబున నగరివాకిట నుండెడుఁ గైకొని పెనుపు మని యానతిచ్చిన నానతుఁడై యానందంబునుం బొంది వేకువ నగరిమొగసాలకుం జని యబ్బాలునిం గాంచి మహోత్సవంబు లొనరించి చంద్రప్రభుం డను పేరిడి పెనుప నక్కుమారుండు క్రమవర్ధితుండును, సకలవిద్యావిశారదుండును నై సంపూర్ణయౌవనంబు నొందినసమయంబున. ౧౧౧

క. ప్రభువరుఁ జంద్రప్రభు నిల, కభిషిక్తుం జేసి (యడవి) కరిగి నగసుతావిభుఁ గొలుచుచు సూర్యప్రభుఁ,డభినుతయోగాభినిష్ఠనసువులుదొఱఁగెన్.

క. జనకుండు మేను వోఁగుట, విని చంద్రప్రభుఁడు నాత్మ వివశుండై యో
లిన పారలౌకిక క్రియ, లనూనముగఁ జేసి తా గయకుఁ జని యచటన్.

వ. వేదచోదితానుష్ఠానంబు నొనరించి పిండప్రదానంబు సేయంగరం బెత్తు
టయు నక్కజంబుగా నాసమయంబున. ౧౧౪

గీ. అంచిత పవిత్రభూషణం బైనకరము, కంకణసముజ్జ్వలం బైన కరముగాఁగ
నలఘుశంఖశస్త్రాంకితమైనకరము, మూఁడుకరములాభూపాలుమ్రోలనిలిచె.

క. ఆకరములఁ గని (ఘన)చిం,తాకులమతి యగుచుఁ బిండ మాకరములలో
నేకరమున నిడనేరక, వే కరముం దిగిచికొనుచు విన్నఁదనముతోన్. ౧౧౬

వ. వేదశాస్త్రపారగు లగు నచ్చటిపెద్దలకు నాహస్తములు సూపి యి ట్లగుట
కుం గారణం బేమి యన వారు విచారించి యి ట్లనిరి. ౧౧౭

చ. పరమపవిత్రహస్తమిది బ్రాహ్మణహస్తము శంఖశస్త్రభా
సుర మయియున్నహస్త మిది చోరునిహస్తము రత్నకంకణ
స్ఫురణ దలిర్చు హస్త మిది భూపతిహస్తము వీనిలోన నే
కరమును బాత్రమో నిజముగాఁ గనరా దని పల్కి రందఱున్. ౧౧౮

వ. అని కథ చెప్పి బేతాళుండు భూపాలా యాకరంబులు మూఁటియందు నేక
రంబు పిండప్రదానంబున కర్హం బని యడిగినం బుడమిఱేఁ డి ట్లనియె.

ఉ. కొంగున మూడ లూడ్చికొని కొడ్కని పెంచినరాజు తండ్రిగాఁ
డంగజకేళికార్థము తదంబిక వేఁడిన విప్రుఁడుం దలం
పంగ గురుండు గాఁడు కులభామిని గాఁగ వరించె వాని మా
తం గమియంగ నర్థ మిడి తండ్రగుఁ జోరుఁడు వాని కారయన్. ౧౨౦

వ. పిండప్రదానంబునకుం జోరుకరం బరయ నర్హం బనుటయు నదృశ్యుండై
యెప్పటిభూజాతంబున కరుగ వెనుకన చని తన్నుం బట్టి తెచ్చునెడ బేతా
ళుండు నమ్మహీపాలున కి ట్లనియె. ౧౨౧

క. ఎన్నేనియుఁ బ్రశ్నములకు, నెన్నఁగఁ దగునుత్తరంబు లిచ్చితి నాకున్
నన్నిట్లలజడి వెట్టుచు, నున్నాఁ డని తలఁప కింక నొకకథ వినుమా. ౧౨౨

## — (10) ధర్మరాజుకథ —

క. మనుజేశ ధర్ముఁ డనియెడు, మనుజాధీశ్వరుఁడు, తొల్లి మార్తుర చేతన్
ధనమును రాజ్యముఁ గోల్పడి, తననగరము విడిచితరళితస్వాంతుండై౧౨3

శ్రీ ర స్తు.

# ఆంధ్రసాహిత్య పరిషత్తు—కాకినాడ.

---

## (TELUGU ACADEMY.)

## 1928-29; 1929-30.

విభవశుక్లసంవత్సరముల కార్యనివేదనము.

1911 సంవత్సరమున శ్రీపిఠాపురముమహారాజావారును కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారును నీపరిషత్తును చెన్నపురిలో స్థాపించిరి. దానికిఁ దరువాత శ్రీఉయ్యూరుజమీందారుగారు మొదలగువా రుద్ధారకులుగను, నడింతిరువూరు, మునగాల, భద్రాచలము, ముక్త్యాలజమీందారులు పోషకులు గను జేరిరి. యావజ్జీవసభ్యులు పందొమ్మండుగురిలోను విభవశుక్లసంవత్సరము లలో దొడ్డప్పనాయకనూరు జమీందారులగు దివాన్ బహద్దరు వి. రామభద్ర నాయుఁడుగారును, చల్లపల్లిజమీందారు లగుశ్రీరాజా ఏర్లగడ్డ అంకినీఁడు ప్రసాదబహద్దరు బి. ఏ. గారును స్వర్గస్థులైరి. శుక్లసంవత్సరాంతమున సాధార ణసభ్యులసంఖ్య 57, గౌరవార్థసభ్యులు- 34, చందాదారులు- 106 గురు.

—: పత్రికాప్రశంస :—

విభవశుక్లసంవత్సరములలోఁ బరిషత్పత్రిక సకాలమునఁ బ్రకటింపఁబడె నని తెలుపుట కెంతయు సంతసిల్లుచున్నారము. కాళిందీకన్యాపరిణయమును ధాతుమాలయు సంపూర్ణముగఁ బ్రకటింపఁబడినవి. శుకసప్తతికృత్యాదిపద్య ములును, భైరవకవికృత కవిగజాంకుశమును, విన్నకోట గడ కామరాజు కవి చె రీజుపద్యములును, చిన్నయసూరి రచించిన పద్యాంధ్రవ్యాకరణమును బ్రక టించియుంటిమి. చిన్నయసూరికృత సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణము, ఆంధ్ర శబ్దానుశాసనము, చిల్లరపద్యములు నపూర్వములు దొరకినవి. వానిని ముందు ప్రకటింతుము. అముద్రితము లగుపెక్కుశతకములను బరిషత్పత్రికయందు ముద్రించుచున్నారము. పరిషత్పుస్తకభాండాగార మనుపేర గ్రంథాలయము నందలి యపూర్వగ్రంథములం గూర్చి పెక్కువిషయములు వ్రాయఁబడుచున్నవి. పత్రికయందుఁ బ్రకటింపఁబడిన వ్యాసములు 1 వ యనుబంధమునఁ జూడ వలయును.

## —: పుస్తకభాండాగారము :—

పరిషత్పుస్తకభాండాగారము దినదినాభివృద్ధి నొందుచున్నది. ప్రభవ సంవత్సరాంతమున, తాళపత్రగ్రంథములసంఖ్య 4476. ముద్రితగ్రంథములు-1607. శుక్లసంవత్సరాంతమున, తాళపత్రగ్రంథములు 4527. ముద్రితగ్రంథములు-2631. తాళపత్రగ్రంథములలోఁ జాలభాగము శ్రీ శ్రీ పిఠాపురము మహారాజావారు పంపించినవి. కొన్నిటిని పెండ్యాలవేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారును, ద్వివేదుల సూర్యనారాయణశర్మగారునిచ్చియున్నారు. వానిలో ముఖ్యమైనవి, 1 నేమాని భైరవకవిరచించిన హరివంశభాగము;(ఎఱ్ఱాప్రెగడ రచియింపక విడిచిన పారిజాతాపహరణ ప్రభావతీప్రద్యుమ్నములగాథ లిందుఁ గలవు- మూఁడాశ్వాసములు) 2. సుగ్రీవవిజయము, గరుడాచలము మున్నగుయక్షగానములు; 3. ఓరుగంటి రామకవివిరచితము లగుసుభద్రాపరిణయము, శాకుంతలాభ్యుదయములు (ద్విపదలు) 4. రామకవి, భారవి యచ్చతెనుఁగు పద్యకావ్యము 5. నాదెండ్లగోపయ రచించిన కృష్ణార్జునసంవాద మనుద్విపద, యముద్రితము లగుశతకములుఁ జాలఁ గలవు.

మనకార్యనిర్వాహకసభాధ్యక్షు లగు శ్రీజయంతి రామయ్యపంతులుగారు పెక్కుముద్రితగ్రంథముల నొసంగియున్నారు. మఱియు, తిరువాన్కూరు, బరోడా, మైసూరు దొరతనములవా రొసంగిన గ్రంథము లమూల్యము లని తెల్పనవసరము లేదు. నేఁటివఱకు తిరువాన్కూరు, మైసూరు, బరోడా ప్రభుత్వములవారు మనపరిషత్తున కొసంగినగ్రంథములు 2 వ యనుబంధమునఁ జూడవలయును.

## —: పఠనమందిరము :—

వినిమయముగా వచ్చుపత్రికలను 3 వ యనుబంధమునఁ జూడనగును. పౌరులు పత్రికలను గ్రంథములనుఁ జదువుకొనుటకై పఠనమందిర మేర్పాటు చేయఁబడినది. దానిలోనికి, ఆంధ్రమున నాంధ్రపత్రికయు, భారతియు, త్రిలింగ, సమదర్శిని మున్నగుపత్రికలును, సంస్కృతమున సంస్కృతసాహిత్యపరిషత్పత్రిక(కలకత్తా),మహారాజావారికళాశాలాపత్రిక(మైసూరు)ఉద్యాన(తిరువాడి) మంజుభాషిణీ (కంచి) పత్రికలును ముఖ్యమైనవి. హిందూ, మాడరనురివ్యూ, జర్నలు ఆఫ్ ఓరియంటలు రిసెర్చి పత్రికలు, చందాయిచ్చి తెప్పింపఁబడుచున్నవి. యెపిగ్రాఫికా యిండికానుగూడఁ దెప్పించుటకుఁ బ్రయత్నించుచున్నాము. గతవర్షమున కాకినాడపురపాలకసంఘమువారు పరిషత్పఠనమందిరమునకై రు. 200 విరాళ మొసంగియున్నారు.

## —: గ్రంథప్రకటనము :—

ఈసంవత్సరములలో జైమినిభారతవచనము, తృతీయచతుర్థముద్రణముల నందినది. శివరాత్రిమాహాత్మ్యమును, నారసింహపురాణమును ద్వితీయముద్రణము గావింపవలసియున్నది. ప్రమోదూతసంవత్సరమున వెన్నెలకంటి అన్నయకవి రచియించిన షోడశకుమార(నందన)చరిత్రమును, అనంతకవికృతమగురసాభరణమును, చిన్నయసూరిరచిత మగుసంస్కృతాంధ్రవ్యాకరణమును ప్రకటించెదము.

మఱియుఁ బరిషత్పత్రికకుఁ బోషకు లగు శ్రీ రావుబహాదరు పైండా వేంకటచలపతిగారొసంగినధనముతో రామరాజురంగప్పరాజకవి రచియించిన సాంబోపాఖ్యాన మను నైదాశ్వాసముల గ్రంథమును ముద్రించుచున్నాము. దాని మూలము తంజావూరులైబ్రరీలోని ప్రతితో సంప్రతింపఁబడినది. పరిషత్ప్రకటిత గ్రంథములను 4 యనుబంధమునఁ జూడనగును.

## —: నిఘంటునిర్మాణము :—

శ్రీసూర్యరాయాంధ్రనిఘంటునిర్మాణమునుగూర్చి తత్సంపాదకులిచ్చిన కార్యనివేదనము 5 వ యనుబంధముగఁ జేర్పఁబడినది.

## —: ఆయవ్యయములు :—

విభవశుక్లసంవత్సరముల ఆయవ్యయపట్టిక లిందుఁ జేర్పఁబడినవి. శ్రీ శ్రీతునిరాణిగా రుద్ధారకులుగ నీయవలసినధనమును త్వరలోఁ బంపుదు మని సెలవిచ్చియున్నారు. పరిషత్ప్రకటితగ్రంథవిక్రయమువలనను, చందాలవలనను కార్యక్రమము యథావిధిగ నడచుచున్నది. అయినను బరిషత్తుయొక్క యుద్దేశములను బ్రచురపఱిచి నూతనసభ్యులను జందాదారులను జేర్పించి పరిషత్తునకు సహాయ మొనర్చుటకై పరిషత్సభ్యులను గోరుచున్నాము.

పరిషత్కార్యాలయము చెన్నపురియం దున్నపుడు పరిషత్కార్యదర్శిగ నున్న రావుసాహేబు శ్రీగుమ్మిడూరి వేంకటరంగారావుపంతులు ఎం. ఏ. గారును, పెక్కుగ్రంథములరచించి యాంధ్రభాషకు మహోపకార మొనర్చిన మహోపాధ్యాయ కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారును, దంతుర్తి సుబ్బరాయశాస్త్రిగారును స్వర్గస్థులై రని తెల్పుట కెంతయుం జింతిల్లుచున్నాము.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు, కాకినాడ. విభవనామసంవత్స

| అప్పు. | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| పరిషత్తుఫండు— | | | | | | |
| గతసంవత్సరాంతమున నిలువ | 82,972 | 10 | 6 | | | |
| ఈసంవత్సరాంతమున హెచ్చుఆదాయము | 1,434 | 8 | 9 | | | |
| | | | | 84,407 | 3 | 3 |
| ముందుసంవత్సరమునకు అడ్వాన్సుచందాలు | | | | 3 | 0 | 0 |
| తంజావూరు లైబ్రరీచందా | | | | 33 | 0 | 0 |
| చేబదుళ్ళు | | | | 1,200 | 0 | 0 |
| నిఘంటుఫండు | | | | 15,000 | 0 | 0 |
| సైడామ్యాన్యుస్క్రిప్టు ప్రింటుఫండు | | | | 1,000 | 0 | 0 |
| | | మొత్తం | | 101,643 | 3 | 3 |

పైని తెలుపబడిన జమాఖర్చు నిలువలెక్కను ఆంధ్రసాహిత్యపరిషత్తువారి విభవనామ సంవత్సరపు లెక్కలతో తనిఖీచేసి సరియయినట్లు తెలుపుచున్నాను.

కాకినాడ,
7-2-30.

యనమండ్ర గణపతిరావు, ఎఫ్. సి. ఆర్. ఏ., (గ్లాసుగో)
కార్పొరేట్ అక్కౌంటెంటు అండ్ గవర్నమెంటు
డిప్లమేట్ ఇన్ కామర్సు.
(ఆడిటరు.)

రము (9 ఏప్రిల్ 1929) న జమాఖర్చు నిలువ లెక్క.

| ఆస్తి. | | | | ర. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|---|---|
| పరమస్తుఫండు—— | | | | | | | | | |
| మదరాసు ఇంపీరియల్ బ్యాంకి ఆఫ్ ఇండియా వారి జాగ్రత్తలో నుంచబడినవి | | | | | | | | | |
| 3½%1900-01 గవర్నమెంటు పత్రము | | | | 10,000 | 0 | 0 | | | |
| గతసంవత్సరము లెక్కదాఖలా తరుగు | | | | 4,450 | 0 | 0 | | | |
| 5%1929-47 గవర్నమెంటు పత్రము | | | | 10,000 | 0 | 0 | 5,550 | 0 | 0 |
| గతసంవత్సరము లెక్కదాఖలా తరుగు | | | | 2,000 | 0 | 0 | | | |
| నగదువగైరా నిలువ :—కార్యదర్శిగారి వశమున: | | | | 62 | 8 | 5 | 8,000 | 0 | 0 |
| ఇంపీరియల్ బ్యాంకి ఆఫ్ ఇండియా కరెంటుఅకౌంటులో నిలువ. | | | | 327 | 14 | 11 | 390 | 7 | 4 |
| డిటో డిటో ఫిక్స్‌డ్ డిపాజిట్టు డిటో | | | | | | | 2,000 | 0 | 0 |
| సభ్యులవలన రావలసిన చందాలు | | | | | | | 8,926 | 11 | 0 |
| కుర్చీలు, సామానులు (అసలు) | | | | 574 | 15 | 0 | | | |
| గతసంవత్సరము మినహా | 328 | 2 | 0 | | | | | | |
| ఈసంవత్సరము మినహా | 26 | 13 | 0 | 354 | 15 | 0 | | | |
| | | | | 220 | 0 | 0 | | | |
| ఈసంవత్సరములో కొనినవి | | | | 50 | 0 | 0 | 270 | 0 | 0 |
| ప్రచురింపబడిన పుస్తకముల నిలువ | | | | 3,789 | 4 | 0 | | | |
| పత్రికల నిలువ | | | | 4,195 | 0 | 0 | | | |
| కాగితముల నిలువ | | | | 157 | 12 | 9 | 8,142 | 0 | 9 |
| పుస్తకభాండాగారము ముద్రితప్రతులు గతసంవత్సరాంతమున నిలువ | | | | 2,409 | 0 | 6 | | | |
| ఈసంవత్సరమున కొనినవి | | | | 88 | 15 | 6 | | | |
| ఉచితముగా వచ్చినవి | | | | 590 | 8 | 6 | | | |
| | | | | 3,088 | 8 | 6 | | | |
| గతసంవత్సరాంతమున మినహా | 956 | 12 | 0 | | | | | | |
| ఈసంవత్సరమున మినహా | 81 | 12 | 6 | 1,038 | 8 | 6 | [illegible] | 0 | 0 |
| పుస్తకభాండాగారము వ్రాతప్రతులు | | | | | | | 51,427 | 8 | 6 |
| నిఘంటు వ్యయము | | | | | | | 14,850 | 6 | 8 |
| పైడా మ్యాన్యుస్క్రిప్టు ప్రింటుఫండు అడ్వాన్సులు (తిరిగి రాబట్టుకోతగినవి) | | | | | | | 27 | 8 | 0 |
| రావలసిన బాకీలు :—విడిసంచికల విక్రయముబాపతు | | | | | | | 8 | 9 | 0 |
| | | | | | | | 101,643 | 3 | 3 |

దర్భా వేంకటశివరామరాసు, కిళాంబి రాఘవాచార్యులు,

కార్యదర్శులు.

ఆంధ్రసాహిత్యపరిషత్తు- కాకినాడ. విభవనామ సంవత్సరము (ది 22 మార్చి

| ఆయము. | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| సంవత్సరాదిని కార్యస్థానమున నిలువ | | | | 97 | 9 | 5 |
| బ్యాంకి కరెంటు అక్కౌంటుజమ | | | | 2596 | 1 | 0 |
| విడిసంచికల విక్రయము | | | | 96 | 9 | 0 |
| చందాలు:- సాధారణసభ్యులు | 210 | 0 | 0 | | | |
| పత్రికచందాలు | 126 | 0 | 0 | 336 | 0 | 0 |
| బ్యాంకినుండి వచ్చినవడ్డీ | | | | 887 | 8 | 0 |
| వి. పి. పోస్టేజి. | | | | 67 | 6 | 0 |
| రిజష్టరుపోస్టేజి | | | | 1 | 14 | 0 |
| చిల్లరజమలు | | | | 0 | 13 | 6 |
| విరాళములు | | | | 500 | 0 | 0 |
| బ్యాంకిచిల్లరజమ | | | | 1 | 1 | 0 |
| పైడామ్యాన్యాస్క్రిప్టుప్రింటుఫండు | | | | 1000 | 0 | 0 |
| పుస్తకవిక్రయము:— | | | | | | |
| మన్నారుదాస విలాసనాటకము | 2 | 5 | 0 | | | |
| డిఫెన్సు ఆఫ్ లిటరరీ తెలుగు | 2 | 0 | 0 | | | |
| అకారాద్యముద్రితగ్రంథసూచిక | 2 | 10 | 0 | | | |
| ద్రవిడియన్ లెక్సికోగ్రాఫీ | 0 | 12 | 0 | | | |
| శివతత్త్వసారము | 23 | 7 | 6 | | | |
| సంపూరామాయణము | 13 | 2 | 0 | | | |
| ప్రాకృతభాషోత్పత్తి | 2 | 12 | 0 | | | |
| శివరాత్రి మాహాత్మ్యము | 117 | 9 | 6 | | | |
| నారసింహపురాణము | 250 | 4 | 0 | | | |
| విప్రనారాయణచరిత్రము | 7 | 15 | 6 | | | |
| యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము | 2 | 14 | 0 | | | |
| నీతిసీసపద్యశతకము | 0 | 15 | 6 | | | |
| కావ్యాలంకారచూడామణి | 25 | 5 | 0 | | | |
| చంద్రభానుచరిత్రము | 24 | 14 | 0 | | | |
| జ్ఞానప్రసూనాంబికాశతకము | 0 | 11 | 6 | | | |
| కవిజనాశ్రయము | 47 | 1 | 0 | | | |
| సర్వేశ్వరశతకము | 0 | 14 | 6 | | | |
| ఆర్యభాషావిభాగము | 1 | 13 | 0 | | | |
| హ్రిస్వరంగములు | 1 | 0 | 0 | | | |
| జ్యోతిశ్శాస్త్రసారము | 2 | 6 | 0 | | | |
| అఱవదేశమునందలి తెనుగువాఙ్మయము | 0 | 4 | 0 | | | |
| జైమినిభావతము | 303 | 7 | 6 | | | |
| కాళిందీకన్యాపరిణయము | 1 | 0 | 0 | 835 | 7 | 6 |
| | | | | 6420 | 5 | 5 |

1928 సం॥ మొదలు ది 9 ఏప్రిల్ 1929 సం॥రం॥ వఱకు) ఆయవ్యయముల లెక్క.

| వ్యయము. | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| బ్యాంకికిపంపినవి:—కరెంటుఅక్కౌంటుకు | 2330 | 4 | 0 | | | |
| ఫిక్సిడ్ డిపాజిట్టు అక్కౌంటుకు | 1000 | 0 | 0 | 3330 | 4 | 0 |
| బ్యాంకిచిల్లరవ్యయము | | | | 52 | 15 | 0 |
| వి. పి. పోస్టేజి | | | | 53 | 15 | 0 |
| ప్రయాణవ్యయము:— | | | | | | |
| పండితులు | 36 | 0 | 0 | | | |
| ఉద్యోగులు | 30 | 2 | 0 | 66 | 2 | 0 |
| పత్రికావ్యయము:—ముద్రణము, బైండింగు | 418 | 8 | 0 | | | |
| పత్రికకు కాగితము | 196 | 2 | 0 | | | |
| చిల్లరవ్యయము | 3 | 2 | 9 | | | |
| పోస్టేజి | 115 | 1 | 0 | 732 | 13 | 9 |
| ఇతరముద్రణము—బైండింగు | | | | 43 | 1 | 0 |
| పుస్తకభాండాగారము:— | | | | | | |
| చిల్లరవ్యయము | 19 | 3 | 0 | | | |
| ప్రతులువ్రాయించుటకు | 102 | 6 | 0 | | | |
| కొనినపుస్తకములు | 88 | 15 | 6 | 210 | 8 | 6 |
| కొనినసామానులు | | | | 50 | 0 | 0 |
| చిల్లరపోస్టేజి | | | | 35 | 11 | 0 |
| కలములు కాగితములువగైరా | | | | 10 | 13 | 9 |
| కార్యస్థానమున చిల్లరవ్యయము | | | | 20 | 9 | 6 |
| ఉద్యోగుల జీతములు | | | | 1123 | 10 | 3 |
| రిజిష్టరుపోస్టేజి | | | | 21 | 1 | 0 |
| గ్రంథప్రకటనము | | | | 514 | 11 | 0 |
| ఆడిటరు ఫీజు | | | | 25 | 0 | 0 |
| కార్యస్థానము మార్పు | | | | 30 | 15 | 3 |
| పత్రికలలో ప్రకటనలు | | | | 8 | 2 | 0 |
| పైడామ్యాన్యుస్క్రిప్టుప్రింటుఫండుబాపతుప్రతులు వ్రాయించుటకు యిచ్చిన అడ్వాన్సులు | | | | 27 | 8 | 0 |
| కార్యస్థానమునకునిలువ | | | | 62 | 8 | 5 |
| | | | | 6420 | 5 | 5 |

యనమండ్ర గణపతిరావు,
(ఆడిటరు)

దర్భా వేంకటశివరామరాను,
కిళాంబి రాఘవాచార్యులు,
కార్యదర్శులు.

ఆంధ్రసాహిత్యపరిషత్తు, కాకినాడ. విభవనామసంవత్సరము (ది 22 మార్చి

| వ్యయము. | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| ఉద్యోగుల జీతములు | | | | 1123 | 10 | 3 |
| ఇతరముద్రణము బైండింగు | | | | 43 | 1 | 0 |
| గ్రంథప్రకటనము | | | | 514 | 11 | 0 |
| చిల్లరపోస్టేజి | | | | 35 | 11 | 0 |
| ప్రయాణవ్యయము : | | | | | | |
| పండితులు | 36 | 0 | 0 | | | |
| ఉద్యోగులు | 30 | 2 | 0 | 66 | 2 | 0 |
| కార్యస్థానము చిల్లరవ్యయము | | | | 20 | 9 | 6 |
| వి. ప. పోస్టేజి | | | | 53 | 15 | 0 |
| రిజిస్టరు పోస్టేజి | | | | 21 | 1 | 0 |
| కలములు కాగితములు వగైరా | | | | 10 | 13 | 9 |
| పుస్తకభాండాగారము విషయము. | | | | | | |
| చిల్లరవ్యయము | 19 | 3 | 0 | | | |
| ప్రతులు వ్రాయించుటకు | 102 | 6 | 0 | 121 | 9 | 0 |
| బ్యాంకి చిల్లరవ్యయము | | | | 52 | 15 | 0 |
| పత్రికముద్రణము వగైరా :— | 418 | 8 | 0 | | | |
| కాగితము | 196 | 2 | 0 | | | |
| పోస్టేజి | 115 | 1 | 0 | | | |
| చిల్లరవ్యయము | 3 | 2 | 9 | | | |
| పత్రికలనిలువ | 3590 | 0 | 0 | 732 | 13 | 9 |
| పుస్తకముల నిలువ | 3511 | 14 | 0 | | | |
| కాగితముల నిలువ | 158 | 2 | 9 | | | |
| | | | | 7,260 | 0 | 9 |
| మినహాయింపులు | | | | 108 | 9 | 6 |
| ఆడిటరు ఫీజు | | | | 25 | 0 | 0 |
| పత్రికలలో ప్రకటనలు | | | | 8 | 2 | 0 |
| హెచ్చు ఆదాయము | | | | 1434 | 8 | 9 |
| | | | | 11,633 | 5 | 3 |

కాకినాడ,
7-2-1930.

యనమండ్ర గణపతిరావు, ఎఫ్. సి. ఆర్. ఏ. (గ్లాసుగో)
కార్పొరేట్ అక్కౌంటెంటు అందు గవర్నమెంటు డిప్లమేటు,
యిన్ కామర్సు. (ఆడిటరు)

1928 సం॥ మొదలు ది 9 ఏప్రిల్ 1929 సం॥రం వఱకు) ఆయవ్యయముల లెక్క.

| ఆయము. | రు. | అ. | పై. | రు | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| చందాలు :— | | | | | | |
| సాధారణసభ్యులు | 273 | 0 | 0 | | | |
| పత్రికచందాలు | 228 | 8 | 0 | | | |
| విడిసంచికల విక్రయము | 105 | 2 | 0 | 501 | 8 | 0 |
| పుస్తకవిక్రయము | 835 | 7 | 6 | | | |
| వి. పి. పోస్టేజి వసూలు | 67 | 6 | 0 | 1,007 | 15 | 6 |
| బ్యాంకివడ్డీ | | | | 887 | 8 | 0 |
| పత్రికలునిలువ | 4195 | 0 | 0 | | | |
| పుస్తకముల నిలువ | 3789 | 4 | 0 | | | |
| కాగితములనిలువ | 157 | 12 | 9 | 8,142 | 0 | 9 |
| చిల్లరజమలు | | | | 0 | 13 | 6 |
| ఉచితముగా వచ్చిన పుస్తకములు | 590 | 8 | 6 | | | |
| విరాళములు | 500 | 0 | 0 | 1,090 | 8 | 6 |
| బ్యాంకి చిల్లరజమ | | | | 1 | 1 | 0 |
| రిజిష్టరు పోస్టేజి వసూలు | | | | 1 | 14 | 0 |
| | | | | 11,633 | 5 | 3 |

దర్భా వేంకటశివరామదాసు,
కిళాంబి రాఘవాచార్యులు,
కార్యదర్శులు.

ఆంధ్రసాహిత్యపరిషత్తు, కాకినాడ. శుక్లనామసంవత్స

| అప్పు. | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| పరిషత్తుఫండు— | | | | | | |
| గతసంవత్సరాంతమున నిలువ | 84,407 | 3 | 3 | | | |
| ఈసంవత్సరాంతమున హెచ్చుఆదాయము | 722 | 15 | 9 | | | |
| | | | | 85,130 | 3 | 0 |
| తంజావూరు లైబ్రరీచందా | | | | 33 | 0 | 0 |
| చేబదుళ్ళు | | | | 1,400 | 0 | 0 |
| నిఘంటుఫండు | | | | 15,000 | 0 | 0 |
| పైడామ్యాన్యుస్క్రిప్టు ప్రింటుఫండు | | | | 1,000 | 0 | 0 |
| | | | మొత్తం | 102,563 | 3 | 0 |

పైని దెలుపబడిన జమాఖర్చు నిలువలెక్కను ఆంధ్రసాహిత్యపరిషత్తువారి శుక్లనామ సంవత్సరపు లెక్కలతో తనిఖీచేసి సరియయినట్లు తెలుపుచున్నాను.

కాకినాడ,
6-9-30.

యనమండ్ర గణపతిరావు, ఎఫ్. సి. ఆర్. ఏ., (గ్లాసుగో)
కార్పొరేట్ అక్కౌంటెంటు అండ్ గవర్నమెంటు
డిప్లమేట్ ఇన్ కామర్సు.

రము (31 మార్చి 1930) న జమాఖర్చు నిలువలెక్క.

| ఆస్తి. | | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|
| పరమత్తుఫండు— | | | | | | | |
| ఇంపీరియల్ బ్యాంకి ఆఫ్ ఇండియా వారి జాగ్రత్తలో నుంచబడినవి | | | | | | | |
| 3½%1900-01 గవర్నమెంటు పత్రము | | 10,000 | 0 | 0 | | | |
| గతసంవత్సరము లెక్కదాఖలా తరుగు | | 4,450 | 0 | 0 | 5,550 | 0 | 0 |
| 5%1929-47 గవర్నమెంటు పత్రము | | 10,000 | 0 | 0 | | | |
| గతసంవత్సరము లెక్కదాఖలా తరుగు | | 2,000 | 0 | 0 | 8,000 | 0 | 0 |
| నగదువగైరా నిలువ:—కార్యదర్శిగారివశమున: | | 33 | 6 | 8 | | | |
| ఇంపీరియల్ బ్యాంకి ఆఫ్ ఇండియా కరెంటుఅక్కౌంటులో నిలువ. | | 9 | 15 | 11 | 43 | 6 | 7 |
| డిటో డిటో ఫిక్సెడ్ డిపాజిట్టు డిటో | | | | | 2,000 | 0 | 0 |
| సభ్యులవలన రావలసిన చందాలు | | | | | 9,130 | 13 | 0 |
| కుర్చీలు, సామానులు (అసలు) | | 624 | 15 | 0 | | | |
| గతసంవత్సరము మినహా | 354 15 0 | | | | | | |
| ఈసంవత్సరము మినహా | 30 0 0 | 384 | 15 | 0 | | | |
| | | 240 | 0 | 0 | | | |
| ఈసంవత్సరములో కొనినవి | | 28 | 6 | 0 | 268 | 6 | 0 |
| ప్రచురింపబడిన పుస్తకముల నిలువ | | 4,144 | 4 | 0 | | | |
| పత్రికల నిలువ | | 4,601 | 12 | 0 | | | |
| కాగితముల నిలువ | | 117 | 12 | 6 | 8,863 | 12 | 6 |
| పుస్తకభాండాగారము ముద్రితప్రతులు:- | | | | | | | |
| గతసంవత్సరాంతమున నిలువ | | 3,088 | 8 | 6 | | | |
| ఈసంవత్సరమున కొనినవి | | 163 | 4 | 6 | | | |
| ఉచితముగా వచ్చినవి | | 207 | 6 | 8 | | | |
| | | 3,459 | 3 | 8 | | | |
| గతసంవత్సరాంతమున మినహా | 1038 8 6 | | | | | | |
| ఈసంవత్సరమున మినహా | 91 12 6 | 1,130 | 5 | 0 | 2,328 | 14 | 8 |
| పుస్తకభాండాగారము వ్రాతప్రతులు | | 51,427 | 8 | 6 | | | |
| ఈసంవత్సరమున ఉచితముగా వచ్చినవి | | 72 | 7 | 6 | 51500 | 0 | 0 |
| నిఘంటు వ్యయము | | | | | 14,850 | 6 | 8 |
| పైడా మ్యాన్యుస్క్రిప్టు ప్రింటుఫండు బాపతు అడ్వాన్సులు (తిరిగి రాబట్టుకోతగినది) | | | | | 27 | 8 | 0 |
| | | | | | 102,563 | 3 | 0 |

దర్భా వేంకటశివరామరాను, కిళాంబి రాఘవాచార్యులు,

కార్యదర్శులు.

ఆంధ్రసాహిత్యపరిషత్తు - కాకినాడ. శుక్లనామ సంవత్సరము (డి 10 ఏప్రియల్

| ఆయము. | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| సంవత్సరాదిని కార్యస్థానమున నిలువ | | | | 62 | 8 | 5 |
| బ్యాంకి కరెంటు అక్కౌంటుజమ | | | | 1165 | 0 | 0 |
| విడిసంచికల విక్రియము | | | | 6 | 0 | 0 |
| చందాలు:- సాధారణసభ్యుల | 129 | 8 | 0 | | | |
| పత్రికచందాలు | 148 | 14 | 0 | 278 | 6 | 0 |
| బ్యాంకినుండి వచ్చినవడ్డీ | | | | 901 | 0 | 0 |
| వి. పి. పోస్టేజి. | | | | 43 | 12 | 0 |
| రిజష్టరుపోస్టేజి | | | | 2 | 2 | 0 |
| చిల్లరజమలు | | | | 0 | 2 | 0 |
| విరాళములు | | | | 200 | 0 | 0 |
| రావలసినబాకీలు (విడిసంచిక విక్రియముబాపతు) | | | | 8 | 9 | 0 |
| చేబదుళ్లు (తీసుకున్నవి) | | | | 200 | 0 | 0 |
| పుస్తకవిక్రియము:— | | | | | | |
| విప్రనారాయణచరిత్రము | 3 | 4 | 0 | | | |
| కవిజనాశ్రయము | 66 | 11 | 6 | | | |
| జ్యోతిశ్శాస్త్రసారము | 0 | 15 | 0 | | | |
| యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము | 6 | 11 | 0 | | | |
| నీతిసీసపద్యశతకము | 0 | 5 | 9 | | | |
| జ్ఞానప్రసూనాంబికాశతకము | 0 | 9 | 9 | | | |
| చంపూరామాయణము | 23 | 10 | 0 | | | |
| సర్వేశ్వరశతకము | 0 | 8 | 6 | | | |
| అకారాద్యముద్రితగ్రంథసూచిక | 1 | 6 | 0 | | | |
| కావ్యాలంకారచూడామణి | 51 | 11 | 0 | | | |
| ప్రాకృతభాషోత్పత్తి | 2 | 2 | 6 | | | |
| డిఫెన్సు ఆఫ్ లిటరరీ తెలుగు | 0 | 14 | 0 | | | |
| ద్రవిడియన్ లెక్సికోగ్రాఫీ | 0 | 7 | 0 | | | |
| చంద్రభానుచరిత్రము | 22 | 0 | 0 | | | |
| రెడ్లనాటి రెండుశాసనములు | 3 | 9 | 0 | | | |
| శివతత్త్వసారము | 41 | 15 | 0 | | | |
| శివరాత్రి మాహాత్మ్యము | 99 | 4 | 0 | | | |
| ఆర్యభాషావిభాగము | 0 | 14 | 0 | | | |
| హరిస్వరంగములు | 1 | 6 | 0 | | | |
| నారసింహపురాణము | 23 | 9 | 6 | | | |
| జైమినిభారతము | 269 | 1 | 0 | | | |
| మన్నారుదాస విలాసనాటకము | 1 | 13 | 0 | | | |
| కాళిందీకన్యాపరిణయము | 5 | 10 | 0 | 62[illegible] | | |
| | | | | 3,49[illegible] | | |

## 1929 సం॥ మొదలు 31 మార్చి 1930 సం॥రం॥వఱకు) ఆయవ్యయముల లెక్క.

| వ్యయము. | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| బ్యాంకికిపంపిన వి:—కరెంటుఅక్కౌంటుకు | | | | 847 | 1 | 0 |
| బ్యాంకిచిల్లరవ్యయము | | | | 0 | 10 | 0 |
| వి. పి. పోస్టేజి | | | | 45 | 2 | 6 |
| ఉద్యోగుల ప్రయాణవ్యయము:— | | | | 78 | 13 | 6 |
| పత్రికావిషయము:—ముద్రణము, బైండింగు | 315 | 4 | 0 | | | |
| పత్రికకు కాగితము | 172 | 11 | 0 | | | |
| పత్రికకు పోస్టేజి | 111 | 8 | 0 | | | |
| బ్లాకులు, బొమ్మలు | 22 | 12 | 0 | 622 | 3 | 0 |
| ఇతరముద్రణము—బైండింగు | | | | 61 | 9 | 0 |
| పుస్తకభాండాగారవిషయము:— | | | | | | |
| చిల్లరవ్యయము | 14 | 11 | 3 | | | |
| ప్రతులువ్రాయించుటకు | 40 | 0 | 0 | | | |
| కొనినపుస్తకములు | 163 | 4 | 6 | 217 | 15 | 9 |
| కొనినసామానులు | | | | 28 | 6 | 0 |
| చిల్లరపోస్టేజి | | | | 19 | 1 | 3 |
| రిజిష్టరుపోస్టేజి | | | | 8 | 3 | 0 |
| కార్యస్థానమున చిల్లరవ్యయము | | | | 13 | 5 | 9 |
| ఉద్యోగుల జీతములు | | | | 951 | 15 | 0 |
| గ్రంథప్రకటనము | | | | 520 | 4 | 0 |
| ఆడిటరు ఫీజు | | | | 25 | 0 | 0 |
| పత్రికలలో ప్రకటనలు చందాలు | | | | 44 | 11 | 0 |
| కలములు కాగితములు | | | | 8 | 1 | 6 |
| కార్యస్థానమునసిలువ | | | | 33 | 6 | 8 |
| | | | | 3,495 | 12 | 11 |

యనమండ్రి గణపతిరావు,
(ఆడిటరు)

దర్భా వేంకటశివరామరావు,
కిళాంబి రాఘవాచార్యులు,
కార్యదర్శులు.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు, కాకినాడ. శుక్లనామసంవత్సరము (ది 10 ఏప్రియల్

| వ్యయము. | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| ఉద్యోగులజీతములు | 951 | 15 | 0 | | | |
| ఇతరముద్రణము బైండింగు | 31 | 9 | 0 | | | |
| గ్రంథప్రకటనము | 520 | 4 | 0 | | | |
| చిల్లరపోస్టేజి | 19 | 1 | 3 | | | |
| ఉద్యోగుల ప్రయాణవ్యయములు | 78 | 13 | 6 | | | |
| కార్యస్థానమున చిల్లరవ్యయము | 13 | 5 | 9 | | | |
| వి. పి. పోస్టేజి | 45 | 2 | 6 | | | |
| కలములు, కాగితములు, వగైరా | 8 | 1 | 6 | | | |
| పుస్తకభాండాగారమున చిల్లరవ్యయము | 14 | 11 | 3 | | | |
| ,, ప్రతులు వ్రాయించుటకు | 40 | 0 | 0 | | | |
| బ్యాంకి చిల్లరవ్యయము | 0 | 10 | 0 | | | |
| | | | | 1723 | 9 | 9 |
| పత్రిక ముద్రణము వగైరా | 315 | 4 | 0 | | | |
| ,, కాగితము | 172 | 11 | 0 | | | |
| ,, పోస్టేజి | 111 | 8 | 0 | | | |
| ,, బ్లాకులు, బొమ్మలు | 22 | 12 | 0 | | | |
| | | | | 622 | 3 | 0 |
| పత్రికలలో ప్రకటనలు - చందాలు | 44 | 11 | 0 | | | |
| రిజిష్టరుపోస్టేజి | 8 | 3 | 0 | | | |
| మినహాయింపులు | 121 | 12 | 6 | | | |
| ఆడిటరు ఫీజు | 25 | 0 | 0 | | | |
| | | | | 199 | 10 | 6 |
| పత్రికల నిలువ | 4195 | 0 | 0 | | | |
| పుస్తకముల నిలువ | 3789 | 4 | 0 | | | |
| కాగితముల నిలువ | 157 | 12 | 9 | | | |
| | | | | 8,142 | 0 | 9 |
| హెచ్చుఆదాయము | | | | 722 | 15 | 9 |
| | | | | 11,410 | 7 | 9 |

కాకినాడ,
6-9-1930.

యనమండ్ర గణపతిరావు, ఎఫ్. సి. ఆర్. ఏ. (గ్లాస్గో)
కార్పొరేట్ అక్కౌంటెంటు అండు గవర్నమెంటు
డిప్లమేట్ యిన్ కామర్సు (మెడాలిస్టు ఆడిటరు)

# విషయసూచిక.

---



---

# పరిషత్ప్రయోజనములు.



తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసఁగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈపని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రిందఁ బొందుపఱుపఁబడు చున్నవి:—

i తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వంకష మగునిఘంటు వొకటి రచించి ప్రచురించుట;

ii తెలుఁగుభాషకు సజాతీయేతరభాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణము రచించి ప్రచురించుట;

iii ఆధునికశాస్త్రగ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట;

iv ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యములైన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగు దేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొకటి రచించి ప్రచురించుట;

v సర్వవిషయములనుగుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసంగుట;

vi ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట;

vii తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొక పత్రికను బ్రకటించుట;

viii తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గుఱించి చర్చించుటకుఁగాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట;

ix తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్య పట్టములను, యోగ్యతాపత్రికలను నొసంగుట;

x ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట- ఇందుఁ బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును; వ్రాఁతప్రతులుగూడ నుండవలయును;

xi తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపచరించు నన్ని

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

కాకినాడ

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

| సంపుటము ౧౯. | ప్రమోదూతనామసంవత్సరము.<br>మార్గశీర్ష పుష్యమాసములు. | సంచిక ౫. |
| --- | --- | --- |


## పరిషద్వార్షికసభ — అధ్యక్షోపన్యాసము.


— చెన్నాప్రెగడ భానుమూర్తిగారు బి. ఏ. —


---

శా. శ్రీదాక్షాయణులున్ సరస్వతియు హ్మాత్మీమూర్ధదేహానన
ప్రాదుర్భూతవిలాసకారణములై భాసిల్ల భక్తాళి కా
హ్లాదం బిమ్ముగఁ గూర్పఁగా సగుణమై యాత్మజ్ఞు లోవారికిం
దాదాత్మ్యస్థితి నచ్ఛమై యెసఁగు నాతత్త్వంబు ధ్యానించెదన్.

చ. తను నిరవద్యశుద్ధపరతత్త్వముగా నెఱుఁగంగ లేని యీ
మనుజుల వేషభాషల క్రమంబున నందఱ కన్నిరూపులై
చనుచు ననేకనామముల సర్వజనార్చల నందుచుండు నా
యనుపమదివ్యతేజము నహర్నిశము న్మదిలోఁ దలంచెదన్.

ఉ. భూతములందు నేకగతిఁ బూసలలోపల దారమట్లను
స్యూతత నేకతత్త్వమయి శుద్ధసువర్ణ మనేకభూషలౌ
భాతి నుపాధిభిన్నమయి భాసిలుచుండి వివేకదృష్టికిం
జేతనసారభూత మగు చిన్మయతత్త్వము నాశ్రయించెదన్.

శా. ఏ తేజంబునఁ జేసి కన్ను గనునో యెద్దాన సర్వేంద్రియ
వ్రాతంబు న్నిరతంబు స్వస్వనియతవ్యాపారము ల్సేయునో
యే తేజం బెడఁబాయ వేకవియునో హేరాళపుంజీకటుల్
ఆ తేజంబున కాకరం బగునఖండాత్మ న్మది న్నిల్పెదన్.

చ. ఎవఁడు గణింపఁగా నలవియీని యజాండము లెల్లఁ ద్రిప్పువాఁ
డెవఁడు తదాశ్రితంబు లగు నెల్లచరాచర మోలి మన్పువాఁ
డెవనియలంఘ్యశాసనము లించుకయేనియు మీఱ నేర వీ
భువనములు న్సమస్తమగుభూతచయంబును వాని నెంచెదన్.

మహాజనులారా! మహాశయులారా!

శా. నానాస్థావరజంగమాత్మక మహానాళీకగర్భాంత ని
ర్మాణత్రాణవినాశహేతుమహిమారాధ్య ప్రభావాఢ్యుఁ డా
శ్రీనారాయణు రక్షచేఁ దనరు నీచిత్రప్రపంచంబున
న్నానాకార్యములు న్సకారణములై న్యాయంబులై వర్తిలున్.

చ. జగతిని బుట్టుకార్యములు సర్వమునుం బరమేశ్వరేచ్ఛచే
నగుటయు నీశ్వరేచ్ఛయును న్యాయవిరుద్ధముగామియు న్నిజం
బుగఁ బరికించు సర్వజనము ల్దెలియందగు సంశయమ్ము బా
గుగ నరయంగలేని వెడగు ల్గననేరరు దీనితథ్యమున్.

చ. జడమతు లీజగంబున నిజంబుగ నాంతరకారణంబులం
దొడరి యెఱుంగఁజాలుటకు దూరవిచారము లేమిఁ బైపయిం
బొడమెడు బాహ్యకారణవిమోహమునం బడి కార్యతత్త్వమే
ర్పడఁ దెలియంగనేరక కరంబు భ్రమింపడుచుందు రాత్మలన్.

చ. పలుకులు వేయునేటికిఁ బ్రపంచమునం గల సర్వకార్యము
ల్తెలివి నెఱుంగువారలకుఁ దెల్లముగాఁ గనుపట్టు న్యాయ్యమై
తెలియనియట్టివారు జగతి న్దురితంబు జయించుఁ బాడికిం
దలఁపగఁ జూడ లే దకట దైవము నిర్దయుఁ డందు రంధులై.

ఉ. కావున సర్వకర్తయు జగత్ప్రభుఁ డవ్యయుఁ డీశ్వరుండు నా
నావిధకార్యజాతముల న్యాయవిరుద్ధముగాకయుండఁగా
నేవిధి నెప్పు డెవ్వరికి నెయ్యదిగావలె దాని నట్లగా
వావిరిఁ గూర్చుచు న్జగము పాలనసేసెడుఁ బాడియేర్పడన్.

ఇట్టిజగత్తు వెఱ్ఱివానిచేతిరాయి కాదు. సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్త్వాద్యుదాత్తగుణవిశిష్టుఁ డగుసర్వేశ్వరుని యద్భుతశిల్పము. దీనికి సర్వలోకకల్యాణసంధాయక మగుగమ్యము గలదు. తత్ప్రాప్తికై వలయుకార్యసంఘటనము సర్వేశ్వరాధీనమై జరుగుచున్నయది. పైనిజెప్పినసర్వలోకకల్యాణసంధాయక మగుగమ్యము సర్వజీవముక్తి- సర్వమానవముక్తి- అందులకు సన్నిహితసాపానము. గంగాయమునాదిపుణ్యనదీసలిలపావనమై వసిష్ఠభరద్వాజాదిమహర్షివరచరణరేణుపరిపూతమై శ్రీరామకృష్ణగౌతమబుద్ధాద్యవతారములకుఁ దావలమై శ్రీశంకరరామానుజపూర్ణప్రజ్ఞాద్యావిర్భావములకు నెలవై నిత్యానిత్యవస్తువివేకనిలయమై సర్వసన్మతసమానక్షమమై, సర్వధర్మసమన్వయానుకూలక్షేత్రమైన యీపుణ్యభూమి సర్వమానవముక్తిసాధనసంపత్తి కీశ్వరోద్దిష్టమైన క్షేత్రము.

2. ఇది యెట్లందు రేని, సర్వమానవముక్తి చేకూరవలెనన్న సర్వసౌభ్రాత్రమలవఱచికొని సర్వమానవవ్యక్తులును, ఒక్కత్రాటను జేరి ఐకమత్యము గల్గి భగీరథప్రయత్నము చేయవలసియున్నది. జాతిమతాదివైషమ్యములం బుట్టి మానవకోటిని భిన్నభిన్నములుగాఁ జీల్చివైచి హింసాకార్యములకుఁ బురికొల్పి మానవుల నేఁడు పీడించుచున్న స్పర్థలు వైరములు యుద్ధములు వధలు లోనగునవి యీమహాకార్యసిద్ధికి బలవత్ప్రతిబంధకములు. ఇట్టివైషమ్యముల మూలముట్టుగఁ దొలఁగింపవలసియున్నది. భేదముల డిందుపఱచికొని వైషమ్యముల సమీకరించికొన్నంతమాత్రాన మనకొదవలు దీఱవు. మనకార్యము సిద్ధింపదు. వివిధరాష్ట్రములకు సమష్టిజీవితము గల్పించి భిన్నభిన్నమతధర్మములకు సమన్వయమును సామరస్యమును గుదిర్చి, భిన్నభిన్నజాతుల కైకమత్యమును సౌభ్రాత్రమును జేకూర్చి, మానవుల నెల్ల మహారాష్ట్రప్రజలుగను, విశ్వజనీనమతావలంబకులుగను, విశ్వమానవకుటుంబవ్యక్తులుగను, జేయవలసియున్నది.

ప్రపంచచరిత్ర నించుక వివేకముతోఁ బరిశీలించినచో, సర్వజ్ఞుఁ డగు సర్వేశ్వరుఁ డీపుణ్యభూమియందు, సర్వరాష్ట్రసమష్టి (Federation of states) సిద్ధికిని, సర్వధర్మసమన్వయ (Reconciliation and harmonisation of ideals of duty) సంపాదనమునకును, విశ్వజనీన మతావిష్కరణము(Universalisation of all creeds)నకును, సర్వమానవ సౌభ్రాత్రలబ్ధికిని (Establishment of universal brotherhood) ఇంకను విశ్వమానవ కుటుంబసంసిద్ధికిఁ

గావలసిన సర్వదుష్కరసమస్యాపరిష్కారమునకును వలయు సాధనసంపత్తిని సమకూర్చియున్నాఁడని స్పష్టముగా గోచరింపఁగలదు. ఇట్టిసమస్యాపరిష్కారము సర్వమానవముక్తి కవ్యవహితసోపానమేకద.

3. ఇది యెట్లున్నను, సర్వజ్ఞుఁడగుసర్వేశ్వరుఁ డాదిని భిన్నభిన్నప్రకృతులు గలజాతులను భిన్నభిన్నదేశవాసులుగ నొనర్చి వారిమతిభేదముల కనుకూలించు ధర్మోపదేశ మొనర్చుపనికిఁ గాను స్వాంశసంభూతు లగుప్రవక్తల సృజించెను. వారిబోధలే వివిధమతములై వెలసి తత్తన్మతావలంబకుల చిత్తశుద్ధికిని, పర మార్థసిద్ధికిని, సాధనము లగుచు వచ్చినవి.

చ. మతిభేదంబుల కానుకూల్యత ఘటింపంబూని మేధానిధు
    ల్మతసిద్ధాంతము లెన్నియేని రచియింపం దోఁచెఁ బ్రస్థానము
    ల్వితతంబై బహుసంఖ్యమై వివిధమై వీని న్విచారించిన
    న్గతిసామాన్యము గమ్యమేకమును నై కన్పట్టు నెప్పట్టునన్.
శా. ఆకాశంబున నుండి ధాత్రిఁ బడుతోయంబు ల్వెసంగూడి నా
    నాకల్లోలవతీముఖంబున నదీనాథుం బ్రవేశించు నా
    వీఁక న్భక్తి యనేకచిత్తముల నుద్వేలంబుగాఁ బుట్టి య
    స్తోకానేకమతప్రచారసరణిం దోతెంచు నీపాలికిన్.
చ. మది పదిలంబుగాఁగఁ దగుమార్గము లారయ నన్నతంబులం
    దొదవుటఁ జేసి యన్నియుఁ బ్రయోజనవంతము లంతరంగశు
    ద్ధిదములు శ్రద్ధధానులకు దీని నెఱుంగక చాపలంబునం
    గుదు రొకయింతలే కెపుడు క్రొత్తవె కోరుదు రెందుఁ బామరుల్.

"ఏకో దేవః కేశవో వా శివో వా"

శ్లో. మహేశ్వరే వా జగతా మధీశ్వరే, జనార్దనే వా జగదంతరాత్మని
    న వస్తుభేదప్రతిపత్తి రస్తి మే తథాపి భక్తి స్తరుణేందుశేఖరే.

కావున,

చ. ఏమతమైన నేమి మతియేపథమైనను నేమి యింద్రియ
    గ్రామము నిర్జయించి తగు శ్రద్ధయు భక్తియు సేకరించినన్
    ఏమతమైన నేల మతియేపథమైనను నేల యింద్రియ
    గ్రామవశంబునం దగిలి శ్రద్ధయు భక్తియు నుజ్జగించినన్.

అట్లు గావున నానామతములవారు "యేనాస్యపితరో యాతాః యేన యాతాః పితామహాః" అను న్యాయానుసారముగా నానాప్రదేశములఁ దమ తమ మతధర్మములఁ బ్రత్యేకవికాసము నందించికొని యానామతములం దభినివేశము గల్గి జీవయాత్ర గడుపుచుండిరి. ఇట్లు కొంతకాల మరిగెను. కాని త్రిగుణాత్మకమై ద్వంద్వభూయిష్ఠమైన యీప్రపంచమునఁ దేజమునం దిమిర మాశ్రయించుభంగిని ప్రతిగుణమును గొండొకదోష మాశ్రయించెను. ఆయాజాతులలోని స్వమతాభినివేశము కాలక్రమమున మతావేశముగాఁ బెచ్చుపెరుఁగునప్పటికి దానిని బరమతాసహిష్ణుత యాశ్రయింపఁజొచ్చెను. అది పెరిఁగినకొలఁదిని వారు సర్వమత సమానధర్మ మగునహింసకు జలాంజలి యొసంగి ద్వేషపూరితులై యొండొరుల కాఫర్లు హెదెనులు లోనుగాఁగల కుత్సార్థకనామములతో గర్హించికొనుచు మతముపేరిట ఘోరయుద్ధములకును దారుణవధలకును జొచ్చుచుండిరి. ఇట్టియుద్రేకమున కుత్తమపరిహారము సర్వసౌభ్రాత్రసిద్ధియే యనియును, అది భిన్నభిన్నము లగు వారిమతములకు సమన్వయమును సామరస్యమును గుదిరినఁ గాని సాధ్యము కాదనియును సూచించియే యుంటిని. ఆయామతములవారు వారివారి ప్రత్యేకస్థానముల నుండి నంతవఱకును, అట్టి సమన్వయ సామరస్యసంపాదనమునకును సౌభ్రాత్రసిద్ధికిని అనుకూలపరిస్థితు లొదవకుండెను. అట్టియనుకూలపరిస్థితు లొదవుటకుఁ గాను వివిధమతముల వారికి ఏకదేశమున సహవసతి యావశ్యకమై యుండును. కావుననే సర్వజ్ఞుఁడగు సర్వేశ్వరుఁడు నేను పైనిజెప్పియున్నట్లు, గంగాయమునాది పుణ్యనదీసలిలపావనమై, వసిష్ఠభరద్వాజాది మహర్షి వరచరణ రేణుపరిపూతమై, శ్రీరామకృష్ణ గౌతమబుద్ధాద్యవతారములకుఁ దావలమై, శ్రీశంకర రామానుజాద్యావిర్భావములకు నెలవై, నిత్యానిత్య వస్తువివేకనిలయమై, సర్వసమ్మతసహనక్షమమై, సర్వధర్మ సమన్వయానుకూలక్షేత్రమైన యీపుణ్యభూమి నట్టిసహవసతి సమకూర్చినాఁడు. ఇది వివేకదృష్టితోఁ బరికించువారి కీశ్వరనిర్మితవ్యూహముగాని కాకతాళీయము గాదని స్పష్టముగా గోచరింపఁగలదు.

చ. పుడమిని భిన్నజాతులకుఁ బోలినభంగిని బాహ్యభేదము
లొప్పడ మనేకరూపములఁ బొల్చెడు ధర్మము లీశ్వరేచ్ఛ ని
య్యెడ నివు డెల్లఁజేరి వసియించుచు నందెడు సామరస్య మీ
క్షడువున సర్వధర్మములు లవశ్యము గాంచు సమన్వయంబిటన్,

చ. కరము విచిత్ర మీభరతఖండ చరిత్రము పోల్చిచూచిన
న్ధరఁ గలసర్వజాతులును దత్ప్రజమై యిటఁ జేరియుం బర
స్పరమతసంప్రదాయములఁ బాయక సోదరబుద్ధి పూని యొం
డొరుల యుదాత్తధర్మముల యోజనఁ బెంతురు స్వీయధర్మముల్
చ. పరిణతి యీగతి న్జగతి వావిరిఁ జొప్పడ సర్వధర్మము
ల్వరలెడు సామరస్యమున వ్యక్తివినాశమునందక కాపయి
న్ధర యొకపీఁ డనంబరఁగు తత్ప్రజ యేకకుటుంబ కల్పమై
నిరవధికాభివృద్ధి మెయి నెమ్మిఁ జరించు నపాస్తదోషమై.
ఉ. ఇట్టిది వో ప్రపంచమున నీక్షితిమూలమున న్లభింప ను
న్నట్టి మహోపకార మటులౌటను భారతవర్షజాతు లీ
పట్టున జాగరూకులయి వారిసనాతన సంప్రదాయము
ల్నెట్టన నిర్విరోధముగ నిల్పఁగ దీక్షవహింపఁగావలెన్.
గీ. ప్రాచ్యధర్మములను బారమార్థికదృష్టి, స్వార్థదృష్టి ప్రబలు పశ్చిమాశ
నుభయధర్మములకు నొదవె సంఘర్షణ, మరసి చేయవలె సమన్వయంబు.
శా. నిత్యానిత్యవివేకభూమి యిది యో నిక్కంబు క్షేత్రంబు పా
శ్చాత్యప్రాచ్యసమస్త ధర్మచయ సంస్కారాప్తికిం దత్తము
ల్సత్యాసత్య విచారకార్య నిరతు ల్సత్సంప్రదాయాఖిలా
చిత్యగ్రాహులు పుణ్యశీలురు మహర్షిప్రత్నగోత్రోద్భవుల్.
అను కవివాక్యములు వివేకముతోఁ బరిశీలించిన నీశ్వరప్రేరితములు.

4. ఇందలి యాథార్థ్యము చరిత్రాంశములు తరిచినకొలఁదిని దేటతెల్లమగును.

హిందూదేశముదక్కఁ దక్కిన దేశములం దప్పటప్పటఁ జేరిన ప్రజాసంఘములు తుల్యసభ్యతగలవై యుండుటఁజేసి యందు ముందు చేరినవారితో వెనుకఁ జేరినవారు భోజనప్రతిభోజనములే కాక సంబంధబాంధవములుగూడఁ గలవారై కాలక్రమమునఁ గలిసి మెలసి యేకజాతివారైరి. ఇంగ్లాండుదేశమున నాదిమవాసులగు, ఆంగ్లులు సాక్సనులు లోనగువారును, తర్వాతఁజేరిన నార్మనులు మొదలగువారును, తుల్యమతధర్మములును, తుల్యాచారవ్యవహారములును గలవారై యుండినకారణమునఁ గాలక్రమమున నేకజాతివారుగఁ బరిణమించిరి. ఇతరయూరోపీయజాతుల స్థితులును నిట్టివే. యూరోపుఖండ

మున నొక్కొక్కదేశము నధివసించువారే కాక భిన్నభిన్న దేశముల నధివసించు వారుం గూడ సమానమతధర్మవ్యవస్థలును సమానాచారవ్యవహారములును గలవారగుటచే భోజనప్రతిభోజనములును సంబంధబాంధవములును గలవారై యున్నారు. హిందూదేశవాసుల చరిత్ర ప్రపంచచరిత్రమున కొకనూతనాధ్యాయము చేర్పనున్నది. నేం డీదేశమున, ఆదిమవాసు లగుద్రావిడులకును, తర్వాత చేరిన బ్రహ్మక్షత్రాద్యనేకవర్ణసంకలిత మగుహైందవసంఘమునకును, ఇటీవలం జేరిన మహమ్మదీయ క్రైస్తవాదిసర్వసంఘములకును సహవసతి యేర్పడినది. ఈసంఘములు ప్రత్యేకసభ్యతలును ప్రత్యేకమతధర్మవ్యవస్థలును, ప్రత్యేకాచారవ్యవహారములును గల్గియున్నకారణమున నొండొంటితో భోజనప్రతిభోజనములును సంబంధబాంధవములు లేకున్నయవి. ప్రధానసంఘములలో నొండొంటికే కాక హిందూసంఘమువంటి యొకమహాసంఘములోని బ్రహ్మక్షత్రాద్యవాంతరసంఘములకుం గూడ భోజనప్రతిభోజనములును సంబంధబాంధవములును లేకున్నయవి. కాని, నేం డీదేశమును జొచ్చియున్న వివిధజాతిమతములవారికి సహవసతియే కాక యేకచ్ఛత్రాధీనత గూడం జేకూరి యుండుటచే వారు కాలక్రమమున వైషమ్యముల సమీకరించికొని వైరముల డిందుపఱిచికొని సోదరబుద్ధి పూని వర్తింపవలసిన పరిస్థితులలో నున్నారు. సహవసతి గల్గియుంటచే శుభాశుభసందర్భములలో వారు పరస్పరసహాయ్యసానుభూతుల నపేక్షింపవలసినవారై సౌభ్రాత్రము నలవరించికొని, ఏకకుటుంబము వారు గావలసియున్నారు. ఏకచ్ఛత్రాధీనులై సమానకష్టనిష్ఠురములకును సమానబాధ్యతలకును లోనైయుండుటచే నేకప్రజ కావలసియున్నారు. మఱియును వారు వారిలోని ధర్మజ్ఞులబోధచే నన్యోన్యమతధర్మసమన్వయమును నన్యోన్యోదాత్తధర్మవినిమయముచే నన్యోన్యమతసామరస్యమును, అలవఱిచికొనవలసినవారై యున్నారు. ఇట్టీశ్వరోద్దిష్టకాలమున నీపుణ్యక్షేత్రమునం జొచ్చియున్న యఖిలజాతిమతములవారును బరస్పరసౌభ్రాత్రమును, ఐకమత్యమును గలవారై క్షీరనీరన్యాయమున నుండంగలవారు. మఱియు నీపుణ్యభూమి నిట్టియైకమత్యసౌభ్రాత్రములు చోప్పడునప్పటి కిందు సర్వధర్మసమన్వయలబ్ధికిని విశ్వజనీనమతావిష్కరణమునకును, సర్వమానవసౌభ్రాత్రసిద్ధికిని మఱియును సర్వరాష్ట్రసమష్టిసిద్ధికిని విశ్వమానవకుటుంబనిష్పత్తికిని సమగ్రలోకకల్యాణప్రాప్తికిని గావలసిన యితరదుష్కరసమస్యాపరిష్కారమునకును సోపాన మేర్పడం

గలదు. ఎట్లన్న నేఁడు మనహిందూదేశము ప్రపంచములోని ప్రత్యేకసభ్యతలు గల సమస్తజాతులకును దావల మైన యొకఖండమై యున్నది. ఖండమన నేల? అఖిలసభ్యజాతులకు నేకాశ్రయమైన యొకపరిచ్ఛిన్న మానవప్రపంచమే యైయున్నది. ఇందుకుఁ దగిన కారణమును గలదు. పైని జెప్పిన లోకకల్యాణ సంధాయక మగు దుష్కర సమస్యాపరిష్కారమునకును, ఈశ్వరోద్దిష్ట మహాప్రయోజన సిద్ధికిని విశాలమానవ ప్రపంచములోని పరిస్థితు లెంతయుఁ బ్రతికూలములు. ఈపరిచ్ఛిన్న మానవప్రపంచమునందో, మిగుల ననుకూలములు. మన ప్రతిదినానుభవములోని యొకయంశ మిందులకు సరియైన దృష్టాంతము. ప్రతిమహాజనసభకును కార్యనిర్వహణ సౌకర్యార్థ మొకకార్యనిర్వాహకసంఘ మేర్పాటు చేసికొనుచున్నాము. కర్తవ్యాంశ నిర్ణయము ముందు, కార్యనిర్వాహక సంఘములోఁ జర్చించి తేల్చినపిమ్మటఁగదా మహాజనసభలోఁ బ్రతిపాదించి యాసభవారి యంగీకారమును సుకరముగఁ బడయుచున్నాము. ఇట్లె యీసమస్యాపరిష్కార మీపరిచ్ఛిన్న మానవప్రపంచమున నలవడిన పిమ్మట విశాల మానవప్రపంచమునకుఁ బ్రాఁకుట సుకరము. కావుననే సర్వజ్ఞుఁడగు సర్వేశ్వరుఁడు పైఁబివివరింపఁబడ్డ పరిస్థితుల సంఘటన మొనర్చినాఁడు.

5. పైనివివరించిన పరిస్థితుల సంఘటనమునకు సంబంధించిన మఱియొక విశేషమును గూర్చి పర్యాలోచించినను లోకకల్యాణ సంధాయకుఁడును జగన్నాటక సూత్రధారుఁడును నగు భగవంతుని యపారప్రజ్ఞయే యందుఁ బ్రతిఫలించుచున్నది. అది యెట్లందు రేని, వివిధదేశజాతులు పైనిజెప్పినరీతిని ప్రత్యేకవ్యక్తిత్వ మంది ప్రత్యేకమతధర్మ వ్యవస్థల నిర్మించికొని స్వమతావేశవశులై పరమతాసహిష్ణుతనుబొంచి, హింసాక్రౌర్యములకు లోనైనకాలమునకు హిందూదేశమున సర్వంకషమగు జ్ఞానవిజ్ఞానసంపత్తి కాకరము లగువిశ్వజనీనమతధర్మవ్యవస్థ లేర్పడి యీదేశమునఁ బ్రపంచములోని సర్వజాతిమతములవారికిని సహవసతి గల్గుట కనుకూలించు పరిస్థితులు కూడ నేర్పడినవి. అప్పటికి హిందూదేశము కురుక్షేత్రసంగ్రామమున నపక్షత్రమై రక్షారహితమై యుండుట తటస్థించెను. హస్తినాపురమువంటి రాజధానిలోఁ బ్రతిష్ఠగాంచి సామంతరాజుల నెల్ల నాజ్ఞానువర్తులఁ గావించికొని యేకచ్ఛత్రాధీనముగా రాజ్యపరిపాలనము సాగింపఁజాలు సార్వభౌముఁడు లేమింజేసి, సామంతరాజు లెల్ల స్వతంత్రులై పరస్పర స్పర్ధలలోఁ జిక్కికొని నిరంతరము [illegible]

నర్చుచుండిరి. మతసాంఘికాదివ్యవస్థల రక్షింప దక్షుఁడగు ప్రభువు లేమింజేసి యొందలి కట్టడి చెడి యవాంతర వైషమ్యములు పెచ్చుపెరిఁగి యుండినకారణమున, దేశజనులు దేశాభిమానము వీడి యైకమత్యముచెడి యుండిరి. భీష్మాదిమహావీరుల భుజపరాక్రమముచే సురక్షితమై పరరాజులకుఁ దేఱిచూడనైన నలవికాని భరతఖండము తదీయాపారసంపత్సమృద్ధిచే నాకర్షింపఁబడి వచ్చుమహమ్మదీయాది పరనృపాలుర యాక్రమణమున కనుకూలపాత్రమై యుండెను. పార్సీలుమొదలగు కొంద ఱదివఱకే పరమతసహనక్షమ మగుభరతఖండమునందు యమునఁ జొచ్చిరి. మహమ్మదీయులు మొదలగు మఱికొందఱు పై నిజెప్పిన యనుకూలసమయమునఁ బరాక్రమముచే హిందూదేశమునఁ జొచ్చిరి. తర్వాత క్రైస్తవులు చేరిరి. నేఁ డిట్లీదేశము ప్రపంచములోని యఖిలజాతిమతములకును జొచ్చిని ల్లయినది. ఈమహావ్యూహసంఘటనమే కాక యుండినచో మానవునియభ్యుదయనిఃశ్రేయఃప్రాప్తికి సముగ్రసాధన మైనయార్యుల జ్ఞానవిజ్ఞానసంపత్తి సర్వమానవలభ్యము గాకుండెడిది. మఱియు నితరమానవ సంఘముల విశేషసంస్కారము హిందూదేశవాసుల కలవడకుండెడిది. మానవజ్ఞానవిజ్ఞానసంపత్తి కొఱవడి యుండెడిది. ఇట్టి మహావ్యూహనిర్మాణ మీశ్వరసంఘటనముగాక కాకతాళీయ మగునా? ఇంతవఱకుఁ బూర్వోక్తసిద్ధాంతసమర్థనమున కుపపత్తివివరణ మైనది. ఇఁక నాక్షేపములకు సమాధానము చెప్పవలసి యున్నది.

6. కాని యీవిషయవిచార మిప్పటికే చాలకాల మాక్రమించినది. కావునఁ దక్కినదాని నిప్పటి కటుంతము. లక్ష్యమును గుఱి నుంపని శరసంధానమువలెను, రుగ్వినిశ్చయము లేని చికిత్సవలెను, గమ్యమును లక్షింపని యుద్యమము ఫలప్రదము గానేరదు. కావుననే మనశాస్త్రకర్తలు ననుబంధచతుష్టయవిచారము చేయకయే శాస్త్రోపక్రమమునకును బూనినవారు కారు. పరమపురుషార్థ మగుమోక్షమును బ్రయోజనముగా గుఱి నుంచికొనియే కామశాస్త్రముసహా సమస్తశాస్త్రములును బ్రవర్తించినవి. అట్లే మనదేశమున సాగు నేయుద్యమ మైనను పైని వివరించిన యీశ్వరోద్దిష్టమైన మహాకార్యభారమును గుఱి నుంచికొననిచో ఫలప్రదము కానేరదు. ముఖ్యముగా విద్యాభివృద్ధివిషయమునను వాఙ్మయవికాసము విషయమునను మనము చేయు సర్వప్రయత్నములు నీగమ్యమును గుఱి నుంచికొనియే సాగింపఁబడవలెను.

కావుననే యీవిషయమును గుఱించి యింత విపులముగా విస్తరింపవలసివచ్చి నది. ఇఁక నాంధ్రవాఙ్మయవికాసమునకుఁ గాను కావలసినసాధనసంపత్తిని గూర్చి విచారింతము.

7. నేఁడు హిందూదేశమున సర్వమతధర్మములకును సమన్వయమును సామరస్యమును గుదురవలసియున్న దని సిద్ధాంతీకరింపఁబడినదిగదా? ఆప న్నికై ప్రపంచదేశభాషలలోని జ్ఞానవిజ్ఞానసంపత్తి సర్వమును హిందూదేశభాషలలో సంగ్రహముగా ననువదింపఁబడవలసియున్నది. ఇంగ్లాండు మొదలగు నభ్యున్నతిగన్న పాశ్చాత్యదేశస్థులభాషలయందు గ్రీసు, రోము, పారసికము, అరాబియా, భరతఖండము లోనుగాఁ గలదేశములలో హోమరు, డాంటి, వాల్మీకి, వ్యాసుఁడు, కాళిదాసు, సాది లోనగుమహాకవులును, సోక్రెటీసు, ప్లేటో, అరిస్టాటిలు, హెగెలు, కాంటు, కోంటు, షోపెన్హారు, మహమ్మదు, బుద్ధుఁడు, శంకరుఁడు, రామానుజుఁడు లోనగు తత్త్వవేత్తలును, ఘూసిడైడిస్, ప్లూటార్కు, హాఫిజు లోనగు చరిత్రకర్తలును తదితరగ్రంథకర్తలును వారివారి భాషలలో రచించిన గ్రంథములు ననువాదరూపమున సంగ్రహింపఁబడి యుండుటయే కాక యాంగ్లసారస్వతసర్వస్వము (Encyclopeadia Britannica) వంటి యుద్గ్రంథముల రూపమునఁ బ్రపంచమందలి జ్ఞానవిజ్ఞాన మంతయు సారభూతముగా సేకరింపఁబడియున్నది. ఏఁడులు పూఁడులుఁ బట్టు నిట్టిపని హిందూదేశభాషలలోఁ గూడ సాగింపఁబడవలసియున్నది. తత్త్వచరిత్రాత్మకగ్రంథములు కూడ సాహిత్యాంతర్భాగములేనా యని సంశయింపవలదు. ఆంగ్లభాషలో గిజో, మోట్లీ, గిబ్బను, ప్రెస్కట్టు, కారలైలు, మకాలే, హాల్లము, హ్యూము మొదలగు చరిత్రకారులు వ్రాసినగ్రంథములు సాహిత్యవాఙ్మయభాగమునఁగూడ నుత్తమవచనకావ్యములై యుద్గ్రంథములై విలసిల్లుచున్నవి. అట్లే లాకు, గ్రీను, హక్స్లీ, స్పెన్సరు మొదలగు వారి తత్త్వగ్రంథములును.

8. ప్రపంచసారస్వత మిట్లనువాదరూపమున సేకరించికొను భాగ్యము మనసంస్కృతముననే లేకపోయినది. అది సంస్కృతభాషలోపము గాదు. సంస్కృతభాషావికాసకాలమున నితరదేశవాసులు పల్వురు జ్ఞానవిజ్ఞానగంధమే లేకుండిరి. నేఁడు సంస్కృతభాష వికాసరహిత మైనది. కాని సంస్కృతభాషావికాసకాలమున కార్యులు జ్ఞానవిజ్ఞానసంపత్తి విషయమున సర్వతోముఖమును సర్వాంకషమును నైన యభివృద్ధి గాంచినకారణమున సంస్కృ

తసారస్వత మార్యసంతతి కమూల్యమైన నిక్షేపముగా నున్నది. వేదవేదాం
గముల నటుంచినను, వ్యాసగ్రథిత పురాణములును ప్రాచేతస కాళీదాసాదిరచి
తమహాకావ్యములును దర్శనంగల శాస్త్రసాహిత్యగ్రంథసంచయమునొక వాఙ్మ
యమహాసాగరముగా నున్నయది. ఒక్కవరాహమిహిరుఁడు డెబ్బదికెక్కుడుగ శా
స్త్రగ్రంథముల రచించెనఁట. శ్రీదేశికాచార్యవిరచితగ్రంథములు "పరశ్శతం
చాపిపరస్సహస్రం" అని లోకోక్తి. ఒకభగవద్గీతకు భాష్యము లనేకములు. చ
తుర్దశవిద్యలును, చతుష్షష్టికలలును లోనగునార్యవిద్యలఁ బ్రతిపాదించు గ్రంథ
ము లసంఖ్యములును సాగరోపమములును. ఇఁక విద్యాపారంగతుల విషయ
మాలోచింత మన్న 'వాణీం కాణభుజీ మజీగణ దవాసాసీచ్చ వైయాసికీమ్'
అని యుపక్రమించి మల్లినాథసూరి స్వవిషయమునఁ జెప్పికొన్న పాండిత్య
వైదగ్ధ్యము లాతనివ్యాఖ్యానములు ప్రఖ్యాతము సేయుచున్నవి. పైని జెప్పి
న సంస్కృతసారస్వతమునందలి శ్రీమద్రామాయణాదీతిహాసపురాణములును,
తక్కిన యిహపరసాధకము లగుననేకగ్రంథములును ననువాదరూపమున దేశ
భాషలలో సంగ్రహింపఁబడియున్నవి, కాని, ఆర్యజ్ఞానవిజ్ఞానోపలబ్ధి సాకల్య
ముగాఁ గల్గవలె నన్న సంస్కృతభాషాపరిచితి యవశ్యసంపాదనీయము. కా
వున సంస్కృతభాషాజ్ఞానసంపాదన మార్యసంతతి కందఱకును జన్మసాఫల్య
కర మగునుత్కృష్టధర్మము.

9. అందఱకును గాకపోయినను ధర్మజ్ఞులకును ధర్మోపదేష్టలకు నవశ్యా
నుష్ఠేయ మగుధర్మము. మొన్న మొన్నటివఱకును నీదేశమున సంస్కృత భాషా
నభిజ్ఞుని ధర్మోపదేశపీఠ మెక్కుట కధికారిగ నెంచరైరి. కావుననే శ్రీశంక
రాది మతప్రవర్తకు లెల్లరు సంస్కృతభాషావిశారదులై వేదశాస్త్రవిద్యాపా
రంగతులై ప్రస్థానత్రయమునకు స్వస్వమత నిర్వాహకము లగుభాష్యముల
రచించిరి కాని ప్రచారమునకు బయలుదేఱినవారు కారు. శ్రీశంకరులవారు
పదునాఱుసంవత్సరముల స్వల్పవయసుననే సర్వశాస్త్రములను సాకల్యముగఁ
బరిశీలించి భాష్యముల రచించి, అందు ఖండనార్హ మగుదాని ఖండించి యు
మండనార్హ మగుదానిఁ బోషించి యు, హేయోపాదేయముల నిరూపించి
తమమతప్రచారమున కుపక్రమించిరి. వారికాలమువఱకును భరతఖండము,
ఐహికాముష్మికసౌఖ్యసాధక మగుతన యపారసహజసంపత్తి కనుగుణముగా-

క. శ్రీలలనకు నిలయము వి, ద్యాలతికకు నాలవాల మఖిలకలార
త్నాలయము శౌర్యసదనము, శీలనిధానంబు నగుచుఁ జెన్నెసలారెన్.

మఱియును-

చ. దయకిరవుం బరాయణ ముదారత కంచిత ధర్మనిర్మలా
శ్రయము నయంబు దారి యలసత్యము శౌచము పుట్టినిల్లనో
దయము వివేకకౌముదికిఁ దత్త్వవిచారపు రచ్చ ముక్తిక
న్నియకు విహారభూమి యయి నిర్మలకీర్తి వహించె నెంతయున్.

కాని నేఁడు-

ఉ. కాలవశంబున న్భరతఖండ మఖండతదీయవైభవ
శ్రీల విభూతులం దొరగి చేష్టడియుండిన కారణంబున
న్శీలము విద్యయు న్మఱచి చింతల వంతలఁ జిక్కి తత్ప్రజ
ల్గాలిరి దైన్యవారినిధిఁ దోఁటిసమున్నతి వాసి దీనులై.

ఉ. ధీసకలత్వసంపద నతీంద్రియదృష్టిని జేసి జైమిని
వ్యాసకణాద గౌతమపతంజలులుం గపిలుండు మున్నుప
న్యాస మొనర్చినట్టి విపులాగమ తంత్రములుం బురాణముల్
భాసుర వేదకల్పకగశాస్త్రకరండమనంగఁ దత్త్వవి
జ్ఞానఁ జరించుభక్తులను గావ స్వయంభగవన్ముఖస్థమై
భాసిలు గీతయు న్నిగమవర్గము దుర్గమమయ్యె శాస్త్రము
ల్మానెను ధర్మనిష్ఠ యఖిలంబు ఖిలంబయిపోయె నియ్యెడన్.

మ. మతివైశద్యము పాపభీతియును ధర్మస్ఫూర్తియు న్వే చెడె
న్మతవైషమ్యము లెచ్చె భక్తి కడుసన్నం బయ్యె దుస్తర్కము
ల్వితతం బయ్యె దయాశమాదిగుణము ల్వైరాగ్యంబు లయ్యెం గటా
సతతధ్వాంతము గ్రమ్మె దేశజనధీసద్మోహానంబై కడున్.

10. ఇట్లగుటకుఁ గారణమును లేకపోలేదు. భాషలలో నెల్ల సంస్కృతభాష దుర్గ్రాహ్యము. వేదభాష వేఱు, లోకభాష వేఱు. నామవాచక పదములు దెలిసినను లింగజ్ఞానము లేక నిష్ప్రయోజనములు. 'భార్య'కుఁ గలపర్యాయపదములలో 'దారాః' పుంలింగము నిత్యబహువచనాంతము. 'పత్నీ' స్త్రీలింగము 'కళత్రమ్' నపుంసకలింగము. క్రియాపదములలో ఆత్మ

నేపదులు కొన్ని, 'పరస్మైపదులు' కొన్ని. పదిలకారముల (Tenses and moods) లో నాల్గింటివిషయమునఁ బడి భేదములు గలవు. తక్కినయాఱింటి విషయమునఁ గూడ రూపనిష్పత్తి కష్టసాధ్యము. నామలింగానుశాసనము, ధాతుపాఠము, అష్టాధ్యాయి లోనగునవి కంఠస్థము గానివాని సంస్కృతభాషాజ్ఞాన మసమగ్రము. భాషాగ్రహణము విషయమునఁ బడవలసిన క్లేశ మింతటిది. నేఁటిహిందూదేశవాసులు భుక్తికై శక్తియుక్తుల ధారవోయవలసియున్నారు, కావున, వారికి సంస్కృతభాషాజ్ఞాన మందనిద్రాని పండు ; అభేద్యశిలాతలనిక్షిప్తనిధానము. నేఁటికాలమున సంస్కృతభాషాజ్ఞాన మార్యలోకమునఁ బ్రాచుర్యము గాంచఁగల్గు ననునాశ కవకాశము లేదు. కావుననే సంస్కృతము నుపజీవించి వర్తిల్లుహిందీభాషను దేశసామాన్యభాషగఁ దజ్ఞులు నిర్ణయించియున్నారు. బంగాళీ మరాటీ లోనగు నుత్తరహిందూదేశభాషలు సంస్కృతభాషాభవములు వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయములు గల్గియుండునవి. హిందీభాషయందు సంస్కృతపదములు మూర్తివికారము నధికమునం దకయే చేరి భాషాగాంభీర్యమును పోషించుచు సంస్కృతభాషాజ్ఞానమునకు దారివెట్టును ; మఱియొకవంక, ఉద్దాభ షాగ్రహణమునకు సౌకర్యము లొదవించును. హిందీభాషలో నిట్టిగుణములు గలవు. తక్కిన దేశభాషలలో నాంధ్రభాషయందును నీగుణములు గలవు. డుము వు ప్రత్యయములతో సంస్కృతములోని నామవాచకపదములను, ఇంచుగాది ప్రత్యయసాహాయ్యమునఁ గ్రియాపదములను, ఇట్టి సౌకర్యములచే నామవాచకములను, క్రియాపదములను, సమాసములనే కాక సన్నంతములను యఙ్గంతములను, సంస్కృతవాక్యములనే గూడ, మూర్తివికారము లేకయే తనయందుఁ బొందుపఱచికొను వెర వాంధ్రభాషామతల్లి కున్నరీతిని మఱియొకదేశభాషకు లేదు. ఈక్రింది దృష్టాంతములవలన నీవిషయము తేటపడఁగలదు.

1. గోమేధికప్రభాంకూరమిథ్యామసృద్రవలిలిహామిళద్భల్లుకంబు
2. సుత్రామసఖయామయజూకసామాజికంబు
3. సింహనఖాంకురచ్ఛిన్నవారణకుంభజనితముక్తాఫలశర్కరిలము
4. అర్థావాగ్విభవ మ్మహోవచనకవ్యాహారము
5. ఇతఊర్ధ్వ మేతాదృగీహితాన్యపి నృణాం సిధ్యేయు రితి వదత్సిద్ధచ్ఛయము,

6. దేవ రంగేశ తే నమస్తే నమోస్తు
దేవ మాం పాహి పాహి త్వమేవ శరణ
మన్య దైవం వినా త్వా మహం నవేద్మి
సర్వసాక్షీ భవాన్నను స్తమపి వేత్సి.

మఱియును, శృంగారాదిరసములకును కైశిక్యాదివృత్తులకును వైదర్భ్యాదిరీతులకు నొదుఁగుచు, దేశభాషలందుఁ దెలుఁగులెస్స' 'ఆంధ్ర మతిర మణీయమ్' Telugu is the Italian of the East' అను ప్రశస్తి నాంధ్రభాషకు సంపాదించిన లలితమృదుమధురపదసామగ్రి యాభాషకుం బ్రకృతిసిద్ధము. ఈ క్రింది దృష్టాంతములం దిలకింపుఁడు.

1. ఎలదీఁగ గప్పిన లలితపరాగంబు క్రియ మేన మేదినీరేణు వొప్ప
2. కిసలయంబులతోడఁ గెంగేలుదడవెట్టి విరులపై నఖకాంతి విజ్జిరాల్చి
3. నలువనెమ్మోముదమ్ములు కేళిగృహములుశ్రోత్రకుట్టద్వంబుస్తోత్రవులమనము
4. చేర్చుక్కగా నిద్దచిన్నిజాబిల్లిచే సిందూరతిలకంబు చెమ్మగిలఁగ
5. చిన్నివెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ బొడమినచెలువ తోఁబుట్టుమాకు
6. బెళుకుకాటుకకంటి సొలపుచూపెదలోనఁ బట్టియుండెడు ప్రేమఁ బట్టి యియ్య.

రమ్యం బగునుడికారమునను లలితంబు లగుభావంబులను మనోహరంబు లగు నచ్చతెలుఁగుపదములు తత్సమతద్భవపదంబులతో సరిపాలుగఁ గలిసి మెలసినచో శిరీషకుసుమపేశలంబులై వినువారికి రత్నంబు పొందున జిగిమించు నాభరణముగాఁ బరిణమించిన కాంచనంబుం దలంపునకుఁ దెచ్చుచు, 'పీనులవిందై యమృతపు సోనలు గురియుంచు'చుండును. అట్టి తెలుఁగు భాష గానకలకు కలలువెంచును; సంస్కృతమును సంస్కరించును. తత్సమసమాసములు దెలుఁగుపదములతో మైత్రి వాటింపవలె నన్నచోఁ గమ్మచ్చునఁ దీసిన మేల్మిబంగారుతీఁగెలవలె మెత్తగను మృదువుగను సాఁగి మిగులఁ బేశలములై యుండవలెను. కావుననే నన్నయభట్టారకుని భారతపర్వత్రయమునను దక్కుంగల తెలుంగుకవుల కబ్బంబులను గలతత్సమసమాసంబులును బదములును మృదుమధురంబులై వాల్మీకి కాళిదాసుల కావ్యములలోని పదసందర్భములకు లాలిత్యమునఁ దీసిపోక వాని కొంకవాసివన్నె వెట్టినట్లుండును. ఈ క్రింది దృష్టాంతములవలన నీవిషయము తేటపడఁగలదు.

1. మ. మదమాతంగతురంగకాంచనసన్మాణిక్యగాణిక్యసంపదలోలిం
2. చ. జలధివిలోలవీచివిలసత్కలకాంచిసమంచితావనీతలవహనక్షమంబయి
3. ఉ. శాతనఖాగ్రఖండితలసన్మద కుంజరకుంభముక్తము
క్తాతతశైలకందరగుహాంతరసుప్తమృగేంద్రకేసరవ్రాతము
4. ఉ. ... ... వికసన్నవ కైరవగంధబంధురో
దారసమీరసౌరభము ... ...
5. సీ. గగనకల్లోలినీకల్లోలమాలికాహల్లీసకములతో నవఘళించి
6. సీ. ... ... ... ... ...
కాత్యాయనీదత్త కర్ణావతంసకర్పూరఖండామోదపూరితంబు
7. శా. ... ... ... ... ...
... ... కాంతారంబునం దైందవ
గ్రావాకల్పితకాయమానజటిలద్రాక్షాగుళుచ్ఛంబులన్
8. చ. బహురత్నద్యుతిమేదురోదరదరీభాగంబులంబొల్చు.

ఇట్టి మహావకాశము లొదవియుండుటచే నాంధ్రభాషలో రసభావసమృద్ధికిఁ గావలసిన శబ్దార్థసామగ్రికిం దడవుకొనం బనిలేదు. ఏరసము పుట్టింపవలె నన్న నారసమున కాంధ్రభాషలో సామగ్రి సమగ్రముగాఁ గలదు. కావుననే తిక్కనవంటి కవిబ్రహ్మచేతులం బడినప్పు డాంధ్రవాఙ్మయసృష్టి యానంత్యమునను వైచిత్ర్యమునను బ్రహ్మసృష్టిని మఱపింపఁజాలి యున్నది. ఈకారణమున దక్షులగువారి ప్రాపున నాంధ్రభాష పైనిజెప్పినప్రపంచవాఙ్మయసర్వస్వసంగ్రహణసమర్థమై భావికాలమున దేశభాషల నెల్ల నతిక్రమించి మించనై యున్నది.

11. నేఁడు హిందూదేశవాసుల మూఁపున నిల్చియున్న మహాకార్యనిర్వహణమునకుగాను ప్రపంచజ్ఞానవిజ్ఞానసంచయ మంతయు హిందూదేశభాషలలో ననువాదరూపమున సంగ్రహింపఁబడవలసి యున్న దని యిదివఱలోఁ జెప్పఁబడినది. అంతయుఁ గాకపోయినను నీతిమతతత్త్వభక్తివిషయికమైన దైనను సేకరింపఁబడవలసి యున్నది. భావప్రకటనమునకును, రసపోషణమునకును, ఆంధ్రభాషలో సామగ్రికిఁ గొదవ లేదని చెప్పియుంటిని. ఈయంశము పైని జెప్పిన యనువాదకార్యమున కెంతయు సౌకర్యము గల్గించును. అయినను మూలపరివర్తన(భాషాంతరీకరణము) విషయమునఁ గొంతస్వాతంత్ర్య మవలం

బించినం గాని యనువాదము తృప్తికరముగ నుండఁజాలదు. ఏలయన:- భావసమృద్ధియు, శబ్దార్థసౌష్ఠవమును వృత్తవైచిత్ర్యమును సమగ్రముగాఁ గలసంస్కృతమువంటి భాషలో వాల్మీకివ్యాసులవంటి మహాకవులు పొందుపఱిచిన యుదారాశయములు ప్రతిపదార్థరూపమునఁ గాని ప్రతిపద్యార్థరూపమునఁ గాని సహృదయహృదయంగమముగ భాషాంతరీకరించుట యెట్టి ప్రతిభాశాలికైనను దుష్కరము. తెనుఁగున నుండుయతిప్రాసనియమములతో నొనరించుట యంతకంటెను దుష్కరము. ఇది యాలోచించియే యుభయభాషాప్రవీణు లగు నన్నయతిక్కనాదులు సంస్కృతకావ్యముల నాంధ్రీకరించునెడ నొక్కొకసందర్భమును మొత్తముగ నొకసారి మనమున నిల్పి యందలితాత్పర్యమును స్వతంత్రముగాఁ జెప్పినట్లు కాన్పించుచున్నది గాని పదమునకుఁ బదము గాని పద్యమునకుఁ బద్యముగాని రచించి చెప్పినట్లు కనంబడదు. ఆగ్రంథకర్త లిట్టి స్వాతంత్ర్యము నంగీకరించిన కారణము భారతాదులయందుఁ బలుచోట్ల సంక్షిప్తీకరణము, భాగవతాదులయందు విపులీకరణమును గాన్పించుచున్నది. సుసాధ్యము లగునయ్యెడల మూలమునకు సరియైన భాషాంతరీకరణమును గానఁబడుచున్నది గాని మొత్తముమీఁద విచారించినఁ బ్రసాదాదిగుణసంసిద్ధి కొఱకును రసపుష్టికొఱకును స్వాతంత్ర్యమే యంగీకరింపఁబడినది. ప్రతిపద్యరసాస్పద మగు శ్రీహర్షుని నైషధకావ్యమును, తెనిఁగింపఁబూని మూలమును సరిగా ననుసరింపవలసి వచ్చినందున శ్రీనాథునంతటి యుభయభాషాభిజ్ఞుఁడును బ్రతిభావంతుఁడును, ఆంధ్రనైషధగ్రంథరచనయందుఁ బలుపాటులం బడి యొక్కొకచో మూలమునే పొందుపఱుపవలసినవాఁ డాయెను. కాని వాల్మీకిరామాయణమును దెనిఁగించునెడ భాస్కరాదులు మూలము నందలి యంశమును మిక్కిలిగ సంకోచింపఁజేసి పైని చెప్పిన స్వాతంత్ర్యము నత్యధికముగాఁ గైకొనిరి. కావుననే పోతనాదులు భాస్కరరామాయణమును మెచ్చరైరి. "ఘనఁకిచెఱచినాఁడు భాస్కరుఁడు, కాకుండిన రామాయణమును బండ్లకెక్కింపనా" అని శ్రీరామోపాసకుఁడును భాగవతోత్తముఁడు నైన పోతనమహాకవి యన్నట్లు వదంతి లోకవిస్రుతమై యున్నది. కాని భాస్కరాదులకవిత్వమును మఱపించునట్లు వ్రాయుట దుష్కర మని యెంచియో మఱి యేకారణముననో పోతనామాత్యుఁడు భాస్కరరామాయణమును నిరాకరించి గ్రంథాంతర రచనకుఁ గడంగినవాఁడు కాఁడు. ఇట్లగుటచే నట్టిపనికిఁ గడంగుట కేవల

సాహస మని నాయభిప్రాయము కాదు. అట్టిపని సమర్థింపఁ బూనువారు ఆంధ్రీకరణవిషయమున మార్గదర్శకు లగునన్నయతిక్కనాదులు చూపినత్రోవ లే పట్టి కొంతస్వాతంత్ర్య మంగీకరించినచో గ్రంథరచన యనర్గళముగను ధారాళముగను సాఁగి యనువాదము సుగమముగను హృదయంగమముగ నుండు నని నామతము. ఇందుల కుపపత్తి కొంత వివరముగాఁ దెలుపవలసియున్నది. (1) సంస్కృతమున ననుష్టుభము, ఇంద్రవజ్ర మొదలగువానికి సమానమైన పద్యము చెప్పవలె నన్నచోఁదెనుఁగున గద్యమునో కందమునో గీతమునో యాశ్రయింపవలయును. సంస్కృతమున పైనిజెప్పిన యొకజాతివృత్తముతో నొక సర్గ యంతయు రమ్యముగఁ జెప్పవచ్చును. తెనుఁగున నది సాధ్యము కాదు. వివిధము లగువృత్తములును బద్యములును జేరవలసియుండును. అందుచే విషయమును గొంచెము పెంచియో కొంచెము కుదించియో చెప్పవలసివచ్చును. (2) పద్యమునకుఁ బద్యము చెప్పవలయు ననునియమ మ్మక్కఱలేని సందర్భమునందుఁ గూడ సంస్కృతమున నుండునిమిడిక, శ్లేష, యమకము, భాషావైచిత్రిచేఁ గలిసివచ్చు ననుప్రాసాదిశబ్దాలంకారములును దెనుఁగున సుసాధ్యములు గావు. తెనుఁగు భాషావైఖరియె కాక యతిప్రాసల నియమముగూడ నిందుకుఁ బ్రతిబంధక మగుచున్నది. మూలములోని పైనిజెప్పిన గుణములకై ప్రయాసపడునెడల నవి యలవడకుండుటయె కాక శైలి నిమ్నోన్నతగతుల నందుచు ధారాళముగాఁ బ్రవహింపక కుంటు చుండుటయు, మూలములోని ప్రత్యంశమును బోనీక రాఁబట్టు ప్రయత్నముచే సుప్రసిద్ధము లైనపదము లలవడమింజేసి ప్రసాదాదిగుణహానియు రసభంగమును గల్గి కవిత్వము వక్తకును శ్రోతకును క్లేశకర మగును. (3) ఎవనిహృదయమందలి భావమును వాఁడు ధారాళముగాఁ జెప్పఁగల్గి కొద్దియో గొప్పయో రసమును బుట్టింపఁజాలును గాని యొకనియాశయ మెంత యుదారమైన దైనను దాని నొరుఁడు స్వీయభావనాపరిపాకపరిణామముచేఁ దనదానింగాఁ జేసికొనక యున్నది యున్నట్లుగాఁ దనమాటలతోఁ జెప్పి రసము పుట్టింపనేరఁడు. అట్టిసందర్భములలోఁ దనహృదయ మంత యుదారభావమును బూర్ణముగా గ్రహింపఁజాల కున్నపుడు గ్రహింపఁజాలినంతయే స్వీకరించి తాను స్వతంత్రముగాఁ జెప్పినట్లు చెప్పినచో రస మొకవీసమువాసి పోయినను ద్రక్షినది చమచమలను స్ఫుటముగా గోచరించును. ఇందుచేతనే యేతద్విషయాభిజ్ఞు లగుప్రాచీనకవివరు లొక్కొక

ఘట్టమునో సందర్భమునో చదివి దానిచేఁ దమహృదయములకుఁ గల్గినసంస్కారము నవలంబించి సంస్కృతేతిహాసపురాణములను స్వతంత్రముగాఁ దెనుఁగున రచించిరి. ఇప్పటి భాషాంతరీకర్త లీపద్ధతుల నిరాకరించుటంజేసి యొకరు చేసిన భాషాంతరీకరణమున మూలములోని యొకయంశము చేరలే దని మఱియొకభాషాంతరీకరణమును సందున మఱియునొకయంశము చేరలే దని మఱియునొకటి యు నీరీతిగ నొకనాటకమునకుఁ దెనుఁగునఁ బదివే లగుట యు, నన్నిటను బ్రత్యేకాంశములఁ బాటించుటంజేసి యొకదానియందును మూలము సాహాయ్యములేక కవిహృదయము గోచరింపకుండుటయుఁ దటస్థించుచున్నది. (4) గ్రీకుభాషలోఁ బురాణేతిహాసరచనాధౌరేయుఁ డగుహోమరు మహాకవి కవితారసమును దెలియఁగోరువారు ఆంగ్లేయేతిహాసకర్త యగుమిల్టనుమహాకవి విషయాంతరము నవలంబించి వ్రాసిన'స్వర్గపదభ్రంశము' Paradise Lost) అనునితిహాసమును జదివినం గొంతవఱకుఁ దెలియఁగల్గును, గాని హోమరు మహాకవి గ్రంథమూలమునకు సరిగ 'పోపు' అను సామాన్యకవి చేసిన యాంగ్లభాషాంతరీకరణమును జదివినచోఁ దెలియనేర దని యొకయాంగ్లేయవిమర్శకుఁడు వ్రాసియున్నాఁడు. కవిత్వము ద్రాక్షారససారమువంటి దనియు ద్రాక్షాసార మొకపాత్రనుండి పాత్రాంతరమునకు మార్చినపుడు సారవిహీన మగునట్లే కావ్యమును భాషాంతరప్రాప్తిచే క్షీణరస మగు ననియు మఱియొకవిమర్శకుఁడు వ్రాసియున్నాఁడు. కావున నొకభాషాంతరీకరణమునఁ బ్రత్యేకాంశము లందు లక్ష్య ముంచినచోఁ గావ్యమునకు జీవకళ నాఁబరఁగు కావ్యసారము మఱుగువడి తేటగామింజేసి యట్టిభాషాంతరీకరణము మూలమునకు జీవకళలేని ప్రతిమగా నేర్పడును. చిత్రరచనయందువలెనే కావ్యరచనయందును (భాషాంతరీకరణమునఁ గూడ) సారాంశమును సేకరించి తత్సంగల యంశములను రసపోషణార్థము యథాసంభవముగ గ్రహించి రచించినం గాని యది సజీవముగ నుండదు. కొంచెము హెచ్చగుట యుఁ గొంచెము తగ్గుట యు నొకయంశము చేరుటయు నొకయంశము లుప్త మగుటయు దోషము కానేరదు. ప్రతిమకు జీవకళ ప్రధానము. ఒకయలంకారముయొక్క చేరిక గాని లోపము గాని దోషము కానేరదు. అట్లే కావ్యమునకు రసము ప్రధానము. రసపుష్టికై కొంత స్వాతంత్ర్య మవలంబించుట దోషము కాకపోవుటే కాక కొన్నియెడల నలంకరణకారణ మగును. అట్లు రచింపఁబడినగ్రంథ

ము, ఇంపునింపుచు వక్తకును శ్రోతకు నానందసంధాయకముగ నుండును. విపులమగు గ్రంథములను మూలమునకు సరిగ భాషాంతరీకరింపవలె నన్నచో నట్టియనువాదము ప్రణేతమాట యటుండఁ జదువరుల కెంత యుఁ గ్లేశకరముగ నుండును. కాఁబట్టి యనువాదములు ప్రసాదాదిగుణసిద్ధికిని రసపుష్టికినిగాను కొంతస్వాతంత్ర్య మవలంబించియే చేయఁబడవలెను. ఇంతవఱకు ననువాదరూపకమగు కావ్యసృష్టివిషయమున విస్తరించి చెప్పఁబడినది. ఇంక నూతనకావ్యసృష్టివిషయమున నొకయంశము నుపన్యసించి విరమించెదను.

**12.** ప్రాజ్ఞుల కుపకరించు కావ్యప్రబంధసామగ్రివిషయమున నాంధ్రవాఙ్మయ మేదేశభాషావాఙ్మయమునకుం దీసిపోవునది కాదు. అల్పజ్ఞులకును జనసామాన్యమునకును నుపకరించుచు నాంధ్రమునఁ గలశతకములు, కృతులు, పాటలు లోనగునవి యొకభాషకు నించుమించుగాఁ బర్యాప్తమగువాఙ్మయము గాఁ జాలియున్నది. వచనరచనవిషయమునఁ దిక్కనాదుల గద్యభాగముల ననుసరించి చిన్నయసూరియు, నాయనరచనను కొంతవికాస మందించి వీరేశలింగప్రభృతులును గొంతయుపక్రమము చేసియున్నారు, కాని, అడిసను, గోల్డుస్మిత్తు, స్కాటు, మకాలె, కారలైలు, రస్కిను లోనగు మహావచనకావ్యకర్తలు, ఆంగ్లభాషలోఁ బలురుచులతోఁ గావించిన వచనరచన కెనవచ్చు వచన మాంధ్రభాషలో వెలయించుట కేఁడులు పట్టుపని గలదు. అదియునుంగాక జనసామాన్యములో జ్ఞానవిజ్ఞానప్రబోధము విరివిగ సాగుచున్న యీకాలమున వారికెల్లరకు నుపకరించు వాఙ్మయసృష్టి గావింపవలసియున్నది. ఈవిషయమున నాధునికవాఙ్మయస్రష్టలలో నుత్సాహ ముదయించి కొంతపని సాగుచున్నది. ఇది కేవలము నూతనోద్యమము కాదు. పల్నాటివీరచరిత్రము, త్యాగరాజకృతులు, అధ్యాత్మరామాయణకీర్తనలు, లంకాయాగము, కుశలవకథ, లోనగుప్రాచీనరచన లీసృష్టి కిదివఱకే యస్థిభారమును దీర్చియున్నవి. ఇంకను నీవిషయమునఁ బని విపులముగను ననర్గళముగను సాగవలసియున్నది. ఈవిషయమున ననసేల? కావ్యసృష్టి యీకాలమున సర్వతోముఖముగ సాగవలసి యున్నది. ఇట్లు సాగుసృష్టిని గొంతకాలము విశృంఖలముగా సాగనిచ్చినపిమ్మట సాహిత్యపరిషన్మండలు లట్టికావ్యసృష్టికిఁ దగునియమనిబంధనల నేర్పాటుచేసి, "వాక్యంరసాత్మకంకావ్యమ్" అనులక్షణమును బట్టి విమర్శకు నిల్చుదానిని బ్రసిద్ధసాహిత్యాంతర్భాగముగ నంగీకరింపవలెను. వాఙ్మ

యసృష్టి చాలినంత సాగిన వెనుకను గదా వ్యాకరణలక్షణరూపమున నియమనిబంధన లేర్పఱుచుటయుఁ దదనుసారముగా విమర్శకార్యము బయలుదేఱుటయును. అటుపిమ్మట సృష్టికార్యమును విమర్శకార్యమును నన్యోన్యోత్తరోత్తరాభివృద్ధి సంధాయకములై యవినాభావసంబంధము గలవై సాగవలసి యున్నవి. ఆంధ్రలోకములోనివారెల్లరును నీమహాకార్యనిర్వహణమునకుఁ బూనియప్రమత్తులై నిరంతరపరిశ్రమ మొనర్తురుగాక. సర్వసదుద్యమాధారుఁడగు సర్వేశ్వరుఁడు వారియుద్యమము సఫలమొనర్చుఁగాత.

శా. శ్రీకళ్యాణనిధాన మభ్యుదయనిశ్శ్రేయఃపరంధామ మ
స్తోకానేకసుభాషయాకరము సంస్తుత్యోద్యమాధార మీ
క్షస్తాఖిలలోకజాలము దయాజ్ఞానాలవాలంబు వి
ద్యాకల్పద్రుమ మాంధ్రసంతతి కఖండైశ్వర్యము ల్గూర్చుతన్.

చ. నవనవకల్పన ల్దనర నందితపండితపామరంబు లీ
యవని నెసంగుఁగాత హృదయంగమభంగుల నవ్యకావ్యము
ల్కవిజనకోటి కెంతయును గద్దరసాయనము ల్బుధాళికా
రవిశశితారకంబును దురంతభవార్ణవతారకంబులున్.

(గతసంచిక శేషము.)

గలఁడా ? ఈ పీఠికలోనే వీరశైవుల యాచారాదులఁ గూర్చి "వారికి లింగధారణము కలదే కాని యజ్ఞోపవీతాదులు లేవు. వారు బ్రాహ్మణులవలె విశుద్ధమయిన సదాచారము గలవారే కాని, బ్రాహ్మణులతోఁ గాని తదితరులతోఁ గాని సమభోజనము నొల్లరు" అని వ్రాసియు శాస్త్రిగారు నిచట వీరశైవులకు శూద్రత్వ మారోపింప నెంచుట శోచనీయము. ఉపనయనము నొల్లని మాత్రముననే శూద్రత్వము పొరయు నన్నచో బసవేశ్వరుఁడు కూడ శూద్రుఁడే యగును. అతని పాదసేవకుఁ డగు సోమనాథుఁ డంతకంటె శూద్రుఁ డగును. కావున శాస్త్రిగారు చూపిన సోమనాథభాష్యోక్తి వారివాదమున కేమియు నుపకరింపఁ జాలదు, "వేదఖని," "వేదవిద్యావిశారద" మున్నగు విశేషణములు జంగముల కుపయుక్తము లయిన శాసనములు బసవేశ్వరుని కంటె ముందు వెలసినవి "వీరశైవమతప్రాచీనత" యను వ్యాసమున నుదాహరించితి నని యిదివఱకే వ్రాసియుంటిని గదా. లింగాయతశ్రేష్ఠుఁడును శివతత్వరత్నాకరకర్తయు నగు కెలది బసవప్పనాయకుని యద్వితీయపాండిత్యము శాస్త్రిగా రెఱుంగకపో రని తలంచెద. ఈ కాలమునఁ గూడ వేదవిద్యావిశారదు లగు పండితులు జంగమకులజులలో లేక పోలేదు. కర్ణాటదేశమున వీరశైవులు స్థాపించి నిర్వహించుచున్న వేదపాఠశాలలే కొన్ని కలవు. కొలఁది సంవత్సరముల క్రిందటివఱ కాంధ్రదేశమునఁ గూడ నెల్లూరు జిల్లా కందుకూరులో వేదవిద్యాసంపన్ను లగు జంగము లుండెడివారు. ఇప్పుడు గూడ నల్లగొండ వాస్తవ్యులు నా మిత్రులు శ్రీయుత చిదిరెమఠం వీరభద్రశర్మగారు మున్నగువారు కాశిలో వేదతీర్థ పరీక్షకుఁ జదువుచున్నవిద్యార్థు లున్నారు. వే యేల ! నిజామురాష్ట్రములోని పరళీక్షేత్రమందలి వైద్యనాథ జ్యోతిర్లింగమున కభిషేకాదు లొనర్చు సందర్భమున వీరశైవులకు వేదాధికారము లేదని, యందుచే వారా శివలింగమున కభిషేక మొనర్పరా దని బ్రాహ్మణు లెదిరించిన మీఁదట(ఁ) గలిగిన తగవులలోఁ బ్రభుత్వమువా రేర్పఱిచిన పండితసభలో వీరశైవులపక్షమున వాదించిన వేదతీర్థ బిరుదాంచితులు శ్రీ విరూపాక్ష యొడయరు స్వాములవారి వేదవిద్యావైదుష్య మద్వితీయ మనియు, వారితో వాదింపనేరక బ్రాహ్మణులతరపున వచ్చిన వేదపండితుఁడు చల్లఁగఁ బలాయన మొనర్చె ననియు, శ్రీ యొడయర్లు గారు బ్రాహ్మణు

లను వెనుకవేసికొని సభ కేతెంచిన కీ॥ శే॥ శివపురపు వీరభద్రపాకయాజి గారిని (ఈయన యారాధ్యబ్రాహ్మణవంశజుఁ డయినను మతవిరుద్ధసంస్కారణ ముల వాంఛించి తద్వంశ్యుల వైరస్యమునకుఁ గూడ గుఱియైన మహనీయులు) వారి సాక్ష్యములోఁ దుదకుఁ దన కేమియు వేదము రా దని పించినా రని యు వినియున్నాను. ఈ పండితసభావాదముల విచారించి, వీరశైవులు పరమవైది కు లనియు, వారి మతము వైదిక మనియు, వారికి వేదాధికారము కల దని యు నిజాము ప్రభుత్వమువా రీమధ్య నొసంగిన తీర్పును శాస్త్రిగారు కూడ వినియుండవచ్చును. ఇప్పటికి జంగములలో నిట్టి జగదేకపండితు లుండఁగా శాస్త్రిగారు తమకుఁ బరిచిత మయిన తెలుఁగు జిల్లాలలో నత్యల్పసంఖ్యాకు లయి సంఘబలము నశించి విద్యాశూన్యు లయి యతిదీను లయి యున్న నేఁటి యాంధ్రవీరశైవులదుస్థితి నూఁతగాఁ గొని యిట్లు వ్రాయుట సమంజస ముగాదు. కావున సోమనాథుని చతుర్వేదపారగత్వము, అద్వితీయపాండిత్య వైభవము నాతని జంగమకులజత్వమున కెంతమాత్రము బాధకము గాక సాధ కమే యగు నని విన్నవించుచున్నాఁడను. శివుని నిశ్వాసజనితము లని చెప్పఁ బడు నిగమములకుఁ దద్వదనసంజనితుల మని చెప్పికొను వీరశైవులకు సాజా త్యము స్వతస్సిద్ధమే కావున నిందులో వైపరీత్య మేమియు లేదు.

సూరనార్యునియెడ సోమనాథుఁడు చెప్పికొన్న బాంధవ్యవిషయము నేను నా పూర్వవ్యాసములోఁ బూర్తిగ విమర్శించినదే. అందుకుఁ బంతులు గా రేమియు సమాధానములు చెప్పి యుండలేదు. కాని శాస్త్రిగా రొసం గినవి చిత్తగింపుఁడు.

"పండితారాధ్యచరిత్ర కృతిశ్రోత యగు పాల్కురికి సూరనామాత్యుని సోమనాథుఁ డిట్లు సంబోధించుచున్నాఁడు. "పరమపవిత్ర! యాపస్తంబ సూత్ర! హారీతసగోత్ర విద్యాపుణ్యగాత్ర! మచ్చిక నా ముద్దుమఱఁది వీ వని యు, నెచ్చెలికాఁడవు నీవె కా కనియు" అఱలేని సఖుఁడ సూరార్య నా ముద్దు, మఱఁది విన్మిది మహిమప్రకరణము." సోమనాథునివలె వీరశైవదీక్షి తుఁడు గాకుండుటచేఁ గాఁబోలును దనమఱఁది యగు సూరార్యుని నాపస్తంబసూత్ర భారద్వాజ (ఇది హారీతసగోత్ర మనుటకుఁ బొరపాటు కాఁబోలును) గోత్రము లిట్లు పేర్కొనఁబడియెను. భారద్వాజగోత్రుఁ డగు సూరార్యునకు భావమఱఁది యగు సోమనాథుఁడును సూరార్యునివలె

బ్రాహ్మణుఁడే యగును. గట్టిగాఁ జుట్టఱికము కానవచ్చుచున్నను నది వట్టి వరుస కన్నమాటయే యని కొట్టి వేయుట సరి కాదు. అట్లు కొట్టివేయుటకుఁ జుట్టఱికమునఁ బ్రబలబాధకములు గానరావలెను గదా! ఏవి? ఇంటిపేరొక్కటి యగుటచే నిచ్చి పుచ్చుకొను సంబంధ మసంబద్ధ మగు ననుట యసంబద్ధము. ఏకగ్రామవాస్తవ్యు లగుటచే భిన్నగోత్రులకుఁ గూడ నొక యింటిపేరేర్పడవచ్చును. భిన్నగోత్రు లొకే యింటిపేరు, ఒకే కులము గలవా రసంఖ్యాకులుగా నగపడుచున్నారు. సోమనాథునియు, సూరనార్యునియు నింటిపేరొక్కటగుటచే వారిద్వురు నొక్క వంశమువారే యని నిరూపింపరాదు. ఒక్క వంశమువా రగుటలేని బావమఱఁదివరుసయు దూషితమే యగును.''

శాస్త్రిగారి వింతత్వ మసంగతము. సోమనాథసూరనామాత్యుల బాంధవ్యమునఁ బ్రబలబాధక మని నేఁ జెప్పిన దొక్క యేకగృహనామత్వమే కాదు. అంతకంటె ముఖ్య మయినది భిన్నమతగోత్రత్వము కూడను. ఇరువురు నిజముగ బావమఱఁదులయి యొకే కులమువా రయినచో సోమనాథుఁడు తనకు జంగమకులజుల భృంగిరిటిగోత్రమును జెప్పికొని సూరనార్యునకు బ్రాహ్మణులలో నుండు ఋషిగోత్రసూత్రములఁ జెప్ప నేల? వాస్తవముగ మఱఁదియే యైనచో మరల "నెచ్చెలికాఁడ" అఱలేని సఖుఁడ" అని కేవలమిత్రత్వద్యోతకము లగు పలుకులఁ బలుక నేల? ఈ పరిస్థితుల నెల్ల నాలోచించియే వీ రిరువుర నఱలేని మచ్చిక కలిమి బావమఱఁదుల వరుసను బిల్చికొనెడి మిత్రులయి యుండు రనియు, ఆ మఱఁది చుట్టఱికము తిక్కన మనుమసిద్ధుల మామయల్లురసంబంధము వంటిదే యనియు నేను వ్రాసియున్నాను. పుట్టింటిపేరు నత్తవారింటిపేరు నొక్కటి యగువా రెవరు నా యెఱిఁగినంతలో నే శాఖలోను నాంధ్రదేశమందుఁ గానరాలేదు. సూరనార్యుని ఋషిగోత్రసూత్రములం బేర్కొనుట యాతఁడు సోమనాథునివలె వీరశైవదీక్షితుఁడు కాకుండుటచేఁ గాఁబోలు నఁట! ఎంతచక్కని సమాధానము- కృష్ణరాయలకుఁ బూర్వము బ్రాహ్మణులలో వీరశైవమే లే దని చెప్పు శాస్త్రిగారు, శివలెంక మంచన, శ్రీపతిపండిత, మల్లికార్జునపండితు లెవరును లింగధారులు కారనెడి శాస్త్రిగారు, ఇట్టి కారణములచేతనే కాఁబోలు సూరనార్యుఁడుకూడ వీరశైవదీక్షితుఁడు కాఁడని చెప్పెడి శాస్త్రిగారు, బ్రాహ్మణుఁడే యని తా మింత గట్టిగా వాదించు సోమనాథు నొక్కని మాత్ర మిట్లు

విలక్షణముగ వీరశైవదీక్షితుఁ డని వ్రాయుట విధిలేకనో ప్రమాదముచేతనో నే నూహింపఁజాలకున్నాను. సోమనాథు నొక్కనియెడ మాత్రము వీరి కీయను గ్రహ మేల? సరే! ఆ గొడవలతో మన కేల? సోమనాథుఁడు వీరశైవదీక్షితుఁడే గాక భవిసంస్కర్త మెంతమాత్రము నొల్లని చతుష్షష్టిశీలసంపన్నుఁ డని కూడ శాస్త్రిగారే యంగీకరించినారు. (బసవపురాణపీఠిక 26 వ పేజీ చూడుఁడు.) ఇట్టి మహాఘోరవీరశైవాచారధౌరేయునకు, సూరనార్యుఁడు వీరశైవదీక్షితుఁడు గానిచోఁ గథాశ్రోతగా నెట్లు పనికివచ్చును? ఆతఁడు వీరశైవదీక్షితుఁడు గాక పోలేదు. కాకున్నచో నాతని సంబంధము సోమనాథునకుఁ గలలో నయినఁ బనికిరాదు. కథాశ్రోతగా నాతనిని గైకొనుటకు సోమనాథుఁడు చెప్పికొన్న కారణముల నారయుఁడు.

"వీరపోచేశ్వరవిశ్రుతాచార్య, కారుణ్యహస్తాబ్జగర్భసంభవుఁడ!
చరలింగగురులింగసాహిత్యలింగ, చిరసమనిష్ఠైకశీలవర్ధనుఁడ!
కడుమించి శివునకుఁ గన్ను లర్పించి, పడసిన దృఢవీర భక్తివర్ధనుఁడ!
నీ దృగర్పితపున రాదానరతికి, నీ దానధర్మవినీతికి మెచ్చి
బసవేశు దక్కిన భక్తుఁడ వనియు, ససదృశలీల మా కనుగలంబనియు
మచ్చిక నా ముద్దు మఱఁది వీ వనియు, నెచ్చెలికాఁడవు...నీ వనియు
చాతుర్యసాహిత్యశాలివీవనియు, శ్రోతృత్వమునకుఁ బాత్రుండవీవనియు"

ఇందు వీరపోచేశ్వరునివలన సూరనార్యుఁడు వీరశైవదీక్ష నొందినట్లు చెప్పఁబడినది. గురుకరోదరజనితత్వము పాశుపతకాలాముఖాదులుకూడఁ జెప్పికొన్నారు గనుక నిది వీరశైవదీక్ష కా దని శాస్త్రిగారు చెప్ప వత్తురేమో? చరలింగ,గురులింగ, సాహిత్యలింగ నిష్ఠాపరత్వము గతి యేమి? సాహిత్యలింగమనఁగా శరీరమున ధరించు నిష్టలింగము (సహితానాం భావమ్ సాహిత్యమ్)కావున సోమనాథుఁడు ముఖ్యముగా వలచినది సూరనార్యునితోడి కేవలమైత్రి కాదు. ఆతఁడు శివునకుఁ గన్నులర్పించి మరలఁ బడసిన దృఢవీరశైవాచారనిష్ఠయు బసవేశ్వరునం దుఁగూడ నఖండభక్తి కలిగి యుండుటయు బ్రాహ్మ్యంబుపైఁ బొత్తు కేవలము పాయ లేక నామమాత్రము దాని యాలంబనము గైకొనినను బసవేశ్వరునందు మాత్రము భక్తి లేనిచో నారాధ్యబ్రాహ్మణు లయినను, వారి పొడ మనసోమనాథునకుఁ గిట్టదు. బసవనితోఁ బూర్తిగఁ గలియక పోయినను నాతనియెడ భక్తిచూపని యారాధ్యబ్రాహ్మణు

లాకాలమున నొక్కరయిన నుండియుండరు. బసవేశ్వరుని దర్శింప నేఁగుచు నడిదారిలో నాతనిలింగైక్యవార్త విని మల్లికార్జునపండితుఁ డొనర్చిన ప్రలాపమెట్టి ఱాతిగుండెలనయినఁ గరంగించి తీఱును. కావునఁ బయిసంగతులవలన సోమనాథసూరనార్యు లిరువురుంగూడ వీరశైవులే యనియు నయినను నందొకఁడు జంగమకులజుఁడు మఱొకఁ డారాధ్యబ్రాహ్మణవంశజుఁడు నని సహృదయులకుఁ దోఁపక పోదని నమ్మెద.

సోమనాథుఁ డంత్యదశలోనయిన గాయత్రి యజ్ఞోపవీతాదులను గులమును విడిచె నేమో యని శాస్త్రిగారొకింత సంశయించితి రఁట కాని యందులకుఁ గూడ నవకాశము లేకపోయినదఁట. చూడుఁడు-

"సోమనాథుఁడు బ్రాహ్మణుఁ డగుట నిస్సంశయమే. అయినను, మన కాలము వారయిన వీరేశలింగము పంతులు గారు, రామమోహనరా యోపజ్ఞముగాఁ బేర్వెలసిన బ్రహ్మసమాజసిద్ధాంతములమీఁది యభిమానముచేతను, తన్మతతత్త్వజ్ఞానాతిరేకముచేతను వయస్సు చాలఁగాఁ గడచిన పిదప యజ్ఞోపవీతాదికమును త్యజించినట్లుగా సోమనాథుఁడును బసవేశ్వరోపజ్ఞముగా వెలసిన వీరశైవసిద్ధాంతముమీఁది యభిమానముచే శివభక్తిపారవశ్యముచే గాయత్రీయజ్ఞోపవీతాదికములను, గులమును జాలవయస్సు కడచిన పిదప విడనాడినాఁడేమో యని యాతఁ డాంధ్రదేశమును విడిచి కర్ణాటదేశమునకుఁ జేరుటను బట్టి నే నించుక సంశయించితిని. కాని, సోమనాథభాష్యమును జూడఁగా నా సంశయమునకు స్థానము లేదని యేర్పడెను. గాయత్రీమంత్రము శివపరమనియు ననుష్ఠేయ మనియు సోమనాథుఁ డందు వ్రాసెను."

మహాశయులారా! బసవపురాణపఠనమాత్రముననే సోమనాథుఁడు సహజవీరశైవుఁ డయి యుండు నని మనబోంట్లకు సామాన్యముగా స్ఫురించుచుండును. అట్టియెడ సోమనాథుఁడు బ్రాహ్మణుఁడే యని దృఢవినిశ్చయచిత్తులయి యుండు శాస్త్రిగారికిఁ, బరిష్కరణావసరమునకయి యీ కావ్యమును బలుమాఱు పరిశోధనపూర్వకముగఁ జదివిన విద్వచ్ఛిఖామణులకు, వారి దృఢనిశ్చయ మించుకయిన సడలి సోమనాథుఁడు చివరదశలో నయిన జంగములలోఁ గలిసి పోయి యుండునేమో యను సంశయలేశ మైనఁ గలుగుటలో నాశ్చర్య మేమియు నుండదు. కాని, యీ సంశయమును గూడఁ బాఱఁదోలి శాస్త్రిగారి కథయె మొసంగిన యీ గాయత్రీమంత్రమును

గూడ నించుక పరామర్శింతము- శ్రీ నాగేశ్వరరావుపంతులుగారు కూడ నీ గాయత్రీప్రశంసను దమవాదమున కుపబలముగాఁ గయికొని యున్నారు. కాని, యిదికూడ వీరి కుపకరింపనేర దని మనవి చేయుటకుఁ జింతిలుచున్నాను. వీరుదాహరించిన యీ గాయత్రీప్రశంస సోమనాథభాష్యములో "భర్గశబ్దనిర్వచన" మను పేరితో రచింపఁబడిన త్రయోవింశతిప్రకరణములోనిది. గాయత్రిశబ్దమునకు "గాయంతం త్రాయత ఇతి'' యను వ్యుత్పత్తిచే జపించువానిని రక్షించునది యని యర్థము. ఇట్టి లక్షణము గలిగి యసలు గాయత్రీశబ్దమునకు వాచ్య మగునది బ్రాహ్మణాదులు జపించు నిరువదినాలుగక్షరములతోఁ గూడిన మంత్రము గా దనియు వీరశైవులు జపించు పంచాక్షరీమంత్రమే నిజ మయిన గాయత్రి యనియు సోమనాథుని యాశయము. ''గాయత్రీహృదయ మకరో త్తత్పదం చింతయామి" అని సోమనాథుఁ డీప్రకరణము నుపక్రమించి "ఓ న్నమ శ్శివాయే తి శతరుద్రీయ మధ్యగా నమశ్శివాయేతి గాయత్రీ మంత్రః ప్రతిపాదయతి'' యని గాయత్రి యనునది పంచాక్షరీమంత్రమే యని ప్రతిపాదించి, సర్వశ్రుతిశిరోగత మయినమంత్రరాజ మిదియే యనియు, సప్తకోటి మహామంత్రములు నుపమంత్రములు ననేకములుగ నిందే విలీన మయి మరల నిందుండియే వినిర్గతము లవుచున్నవని ప్రమాణములను విస్తరించి, "అముష్య మంత్రస్య చ వైదికత్వాత్ పరస్య తత్వస్య చ వాచకత్వా న్నమ శ్శివా యేతి సదా జపధ్వం'' అని పరతత్వవాచక మయిన యీమంత్రమే యెల్లవారికి సదా జపింపఁదగినఁ దనియు దానిని జపించువారే వైదికు లనియు సిద్ధాంత మొనరించినాఁడు. అటు తరువాత "అథ గాయత్రీప్రకరణం కథయామః" అని యెత్తికొని బ్రాహ్మణులు మున్నగువారు జపించు "తత్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి..." అను మంత్రమును దానికిఁ బాఠాంతరముగా మఱికొందఱు జపించు "యో దేవ స్సవితాస్మాకం... ........." అను మంత్రమును నుదాహరించి వాని తాత్పర్యమును గూర్చి చర్చించి భర్గశబ్దవాచ్యుఁడు శంభుఁడే కావున, నీ మంత్రములకుఁ గూడ నధిపతి పరమేశ్వరుఁడే కాని, కొందఱు తలంచునట్లు లాదిత్యాదిదేవతలు కా రని నిరూపించినాఁడు. ఇట్లు నిరూపించుటలో నాతని భావము, అసలు గాయత్రి యగు పంచాక్షరిని విడిచి వీరశైవమును ద్వేషించుచు బ్రాహ్మణాదులు జపించెడి యీ మంత్రమునకుఁ గూడ విచారింపఁగా

నధిదైవతము శివుఁడే కాని వా రుపాసించు సూర్యాద్యన్యదైవతములు గా రనియు నట్టియెడ బ్రాహ్మణులు వీరశైవధర్మము లగు భస్మరుద్రాక్షలింగధారణాదులయెడ విముఖత్వమును బూని భ్రష్టు లగుట వెఱ్ఱితన మని చెప్పఁదలంచుటయే గాని పంచాక్షరి కన్న నిది మిన్న యని గాని దానికి బదులుగఁ గాని దానితోఁ బాటు గాని దీనిని దప్పక యనుష్ఠింపఁదగు నని సిద్ధాంత మొనర్చుట కాదు. ఈప్రకరణ మాద్యంతము సవిమర్శముగఁ జదువువారి కీయర్థము గోచరింపక మానదు. మంత్రరాజ మగు పంచాక్షరిని జపించు వీరశైవుల కీ గాయత్రి మున్నగు నితరమంత్రములతో నెంతమాత్రము నవసరము లే దను మతము వాఁడే సోమనాథుఁడు గూడను. చతుర్వేదసారమున నీతఁడును, అన్యవాదకోలాహలమున నీతని ప్రశిష్యుఁ డొకఁడు ను వ్రాసిన పద్యములు గూడ నేను మీఁద నుగ్గడించిన భావమునే ఘోషించుచుండును. బసవపురాణమున నీతఁడు వ్రాసిన యుపనయననిరాకరణఘట్టమును దీనిని సమన్వయము చేసి చదువువారి కిందలి యాథార్థ్యము తెలియకపోదు. గ్రంథ మిదివఱకే పెరిఁగి పోవుటచే నీ ప్రకరణమును గూర్చి యింతకంటె విస్తరింప లేదు. వలయువారు సోమనాథభాష్యమున దానిని సవిమర్శముగఁ బరికింతురుగాక ! నేఁజెప్పినభావమునే సువ్యక్త మొనర్చు చతుర్వేదసారపద్య మొకటి మచ్చునకయి చిత్తగింపుఁడు.

సీ. తప్పక నిత్యంబు తత్సవితు ర్వరేణ్య మని ప్రాణాయామ మాచరించి
    ...    ...    ...    ముమ్మాఱు దా నర్ఘ్యమెత్తి
    ...    ...    ...    గాయత్రి దినంబుఁ జెప్పి
    ...    ...    ...    తా హవ్యకవ్యములు పెట్టి
గీ. ప్రణవమూర్తి భర్గుఁ బరితృప్తుఁ జేసి తత్ఫలము నీశుచేతఁ బడసి యితర
    సురలఁ గొల్వ, భక్తి సుస్థిరంబై క్రియాఫలము సఫల మగునె బసవలింగ.

ఈ వాదము లిట్లుండ వీనికంటెఁ జాలఁ బూర్వము నేను దుందుభిసంచికలోని వ్యాసమును వ్రాయకమునుపే శ్రీ శేషాద్రిరమణకవు లాంధ్రపత్రికా సారస్వతానుబంధములో సోమనాథునిఁ గూర్చి యొక చిన్నవ్యాసము వ్రాయుచు దానిలో ననుభవసారమందలి "భృంగిరిటిగోత్రుఁడ" నను పద్యమును బట్టి యాతఁడు వీరశైవుఁడే యని తలంచిరి గాని వరంగల్లుప్రాంతమందలి వేల్పుకొండలోని యుత్తమరాజువా రను గృహనామము గల నియోగి బ్రాహ్మణులు

కౌండిన్యసగోత్రులు సోమనాథుఁడు తమ పూర్వుఁడనియు శిఖాయజ్ఞోపవీతాదులను త్యజించి వీరశైవులలోఁ గలిసిపోయె ననియుఁ జెప్పినట్లు వ్రాసి, సోమనాథుఁడు పూర్వాశ్రమమున రచించిన గ్రంథములు దొరకియుం దాతఁడు చెప్పికొన్న కులగోత్రములు బయల్పడువఱకు యథార్థనిర్ణయ మొనర్ప వీలు లేదను నభిప్రాయమును బ్రకటించిరి. వీరి యీ వ్యాసమును నేను సంవత్సరాదిసంచికలోని నా పూర్వవ్యాసమును రచించునప్పటికిఁ జూచి యుండలేదు. చూచియున్నచో నందే యిందును గూర్చి చర్చించియుందును. వావిళ్ళవారు ప్రకటించిన యాంధ్రభాగవతమునకు వీరు వ్రాసిన పీఠికలోఁ గూడ నీ యుత్తమరాజువారి యైతిహ్యము నుదాహరించి యున్నారు. గుంటూరుజిల్లాలోని గోపాలునిరామకవి యను నియోగికవి నన్నయభట్టు తమవంశమువాఁడని చెప్పికొనిన దానికంటె నిది యసంగతముగా నున్నది. వెదకి ప్రోగు చేసెడివా రున్నచో నిట్టి కథలకుఁ బుక్కిటి పురాణములకుఁ గొదవ యుండదు. వరంగల్లు జిల్లా ఖమ్మంమెట్టు తాలూ॥ పిండిప్రోలు ప్రాంతపు మాహేశ్వరుఁ డొకఁడు (జంగముఁడు) తమకు రఘునాథపాలెమను గ్రామములోఁ గాన్పించి పాల్కురికి సోమనాథుఁడు తమ వంశమువాఁ డనియుఁ దమ యింటిపేరు కూడఁ బాల్కురికి వారే యనియు నిందుకు సంబంధించిన రాగిపలకలు లింగముద్రలు తమ యింటనున్న వనియు బెజవాడవయిపున నున్న పిడుపర్తివారు తమ బంధువు లనియుఁ దమతోఁ జెప్పినట్లును నప్పటి తొందరలచే వా రింటికేఁగి యా శాసనములఁ బరిశోధింప వీలు కలుగలే దనియు నిజాంరాష్ట్రీయులు నా మిత్రులు నగు (శ్రీ) చిదిరెమఠము వీరభద్రశర్మగారు నా పేర వ్రాసి యున్నారు. ఉపలబ్ధప్రమాణముల కనుగుణముగ నున్న యీ యైతిహ్య ముత్తమరాజువారికథకంటె నెక్కువ విశ్వాస్య మగును గదా! సోమనాథుని యసలింటిపేరు ఉత్తమరాజువారె యైనచో వీరశైవమును స్వీకరించినంతనే యింటిపేరుకూడ నేల మాఱవలెనో తెలియకున్నది. ఇతనికి బ్రాహ్మణకులజమాపక మగు పూర్వాశ్రమ ముండియే యున్నచో వీరశైవుఁడుగా రచించిన చిన్న చిన్న కృతులు కూడ లభించుచుండఁగా నప్పుడు రచించిన గ్రంథ మొక్కటియైన లభింపక పోవుటకుఁ గారణ మేమి? తమ మతము విడిచి పోయినాడన్న కోపమున నప్పటి బ్రాహ్మణు లాతని వాఙ్మయమును దగ్ధ మొనరించి యుండరు గదా! ఎందుల కీ గొడవలు? అస లట్టి గ్రంథము లుండి యొకటి

మైన దొరకినప్పుడు వానినిబట్టి యప్పటికిఁ దోఁచిన సత్యమును బొల్చికొందము గాక! సోమనాథుని బాల్యకృతులుగాఁ గానవచ్చు సోమనాథస్తవము, అనుభవసారము ననువానివలననే యాతఁడు పాలకురికి నివాసియని యింటిపేరు పాలకురికి వారని శివకులీనుఁడు భృంగిరిటి గోత్రుఁడు నని తెలియుచున్నది గదా! బలవత్తరము లగు వ్యతిరేక ప్రమాణములు దొరకువఱకు నాతని సహజవీరశైవుఁ డగు జంగమునిగా నిర్ణయించుట కాటంకము లుండ రాదని నా యభిప్రాయము.

మహాశయులారా! సోమనాథుఁ డారాధ్యబ్రాహ్మణుఁడుగఁ బుట్టి తరువాత యజ్ఞోపవీతాదులఁ ద్యజించి పూర్తిగ వీరశైవులలోఁ గలిసిపోయె ననెడి వారియభిప్రాయమును వాదమునకయినఁ గొంతవఱ కంగీకరింపవచ్చునేమో గాని యాతఁ డాజన్మము బ్రాహ్మణుఁడుగనే యుండెననెడి శ్రీ ప్రభాకర శాస్త్రిగారివాదము సర్వదా నిరాకరణీయముగ నున్నది. శాస్త్రిగారు తమ పీఠికలో "సోమనాథుని కులగోత్రములు" అను శీర్షిక చివర "ఈఁదిచర్చ వలన సోమనాథుని బ్రాహ్మణత్వము నిర్వికల్పముగా నిలువఁగల దని నేను నమ్ముచున్నాఁడను'' అని లిఖించిరి. సోమనాథుఁడు బ్రాహ్మణుఁ డయిననే గాని వారికి గౌరవార్హుఁడు కానేరఁడు కాఁబోలును. ఇచ్చవచ్చినట్లు వ్రాసిన తమ ప్రతివిమర్శనమువలన సోమనాథుని బ్రాహ్మణత్వమును నిర్వికల్పముగా నిలుపఁ గలిగితిమని వారు సంతృప్తులగుచున్నారు. కాని యీ నిర్వికల్పనిర్వాహణములో వారెంతవఱకుఁ గృతకృత్యులయిరో నిష్పక్షపాతముగ నిర్ణయించుభారము మీపయినున్నది. సోమనాథుఁ డేకులమువాఁ డయినను నాతని కవిత్వతత్త్వమును బట్టి మనకు గౌరవనీయుఁడు. మనకు నన్నయభట్టారకాదులు, షేక్స్పియరాదులు నెంతో యాతఁడు నంతే. భేదభావములతో మనకుఁ బనిలేదు. చరిత్ర చరిత్రకొఱకే యని మొదటనే మనవి చేసి యుంటిని. కావునఁ దత్సూత్రము ననుసరించి చారిత్రకదృష్టితో సత్యనిర్ణయమునకయి ప్రయత్నింప మిమ్ములఁ బ్రార్థించుచున్నాను.

# విజయాదిత్యునినాఁటి బెళగాం తామ్రశాసనము.

శ. స. ౬౪౧.

ఈశాసనము, శ్రీకాశీ, శైవభారతీభవనవ్యవస్థాపకులగు "సాహిత్యవిశారద, వేదతీర్థ" పండిత చిదిరేమఠము వీరభద్రశర్మగారిచేఁ బరిషత్కార్యాలయమునకుఁ బంపఁబడినది. శాసనమును బంపుచు వీరభద్రశర్మగారు-

"ఇయ్యది కర్ణాటకప్రాంతమందలి సుప్రసిద్ధమండల మగు బెళగాం లోని చంద్రశేఖర మఠాధ్యక్షులును నాపూజ్యమిత్రులు నగు శ్రీగురులింగ దేవస్వాములవారినుండి లభించినది. వారిమఠమున నిదిపారంపర్యముగా వచ్చుచున్నది. నేఁటికి ముప్పదివత్సరములకుఁబూర్వ మీశాసనము మూఁడు రేకులతో నుండెడిదఁట. ఇటీవల "ముసలమ్మల''కృపవలన కంసాలివారి పాత్రలక్రింద రెండు రేకులుమాత్రము వినిమయమైనట్లు తెలియవచ్చుచున్నది." అనివ్రాసిరి.

రెండు రేకులు పోవుటచేత శాసనమునందలి యాద్యంతభాగములు నశించి మధ్యభాగము మాత్రము లభ్యమైనది. ఈమధ్యభాగమువలన రాజు పేరును నాతనివంశక్రమమును శాసనముపుట్టిన సంవత్సరమును మఱికొన్ని చారిత్రికాంశములును దెలియుచున్నవి. శాసనపు రేకు $9\frac{1}{4}$ అంగుళములుపొడవును $4\frac{3}{4}$ అంగుళములు వెడల్పును గలదు. పుటకుఁ దొమ్మిదేసి పంక్తు లున్నవి. అక్షరములు స్పష్టముగానున్నవి. లిపి యానాఁటి యాంధ్రకర్ణాటలిపి, రసికః పరాఙ్ముఖీక (II-2) పరైః పలాయమానైః (II-4) ఇత్యాదిస్థలములం దుపధ్మానీయముగుఱుతు శకటరేఫమును బోలియున్నది. ప్రాఁతతప్పులచ్చటచ్చటఁ గొన్నిగలవు.

శాసనము "మతల''బించుక భేదముతో రెండవకీర్తివర్మ వక్కలేరు తామ్రశాసములోని "మతలబును" బోలి యున్నది. *

వంశవర్ణనము:—

దానకర్త యగు విజయాదిత్యుఁడు పశ్చిమచాలుక్య వినయాదిత్యుని పుత్త్రుఁడు. ప్రథమవిక్రమాదిత్యుని పౌత్త్రుఁడు. ఈవిక్రమాదిత్యుఁడు పూర్వచాలుక్యవంశకర్త యగు కుబ్జవిష్ణువర్ధనుని యన్న యగు రెండవ పులకేశికిఁ దమ్ముఁడు. ఈతనినే సత్యాశ్రయుఁ డందురు. వక్కలేరుశాసనకర్త యగు రెండవకీర్తివర్మ యీవిజయాదిత్యుని పౌత్త్రుఁడు. విజయాదిత్యుఁడు క్రీ. 696 మొ

* Vakkaleru plates of Kirthivarma II. Epigraphia Indica Vol 5.

దలు 734 సంవత్సరమువఱకు రాజ్యము చేసినట్లు శాసనాంతరములవలనఁ గనుపట్టుచున్నది. పశ్చిమచాలుక్యులు దక్షిణాపథము నుత్తరాపథము నేలుచుండిన రాజులతో సంతతము యుద్ధము చేయుచున్న ట్లీశాసనమువలనను, ఇతరశాసనములవలనను గానవచ్చుచున్నది. ఇం దుదాహరింపఁబడిన కాంచీపురాధీశ్వరులు పల్లవులు. ఈకాలమందు, చోళులకుఁ గావేరీతీరమందలి యొరయూరు రాజధానియై యున్నట్లు తోఁచుచున్నది.

పేరిరాజచిహ్నములలో గంగాయమునాచిహ్నములును పాళిధ్వజమును ముఖ్యములుగా నుదాహరింపఁబడినవి. గంగా యమునా చిహ్నము లనఁగా గంగాయమునానదులచిహ్నము లని తోఁచుచున్నది. పాళిధ్వజ మనునది జైన సంప్రదాయప్రకారము పరమేశ్వరత్వచిహ్నము. ఇది జినసేనాచార్యకృతాది పురాణము ౨౨ వ సర్గములో నిట్లు వర్ణింపఁబడినది.

"స్రగ్వస్త్రసహంసానాబ్జహంసవీనమృగేశినామ్
వృషభేభేంద్రచక్రాణాం ధ్వజాః స్యు ర్దశభేదకాః ౧
అష్టోత్తరశతం జ్ఞేయాః ప్రత్యేకం పాలికేతనాః
ఏకైకస్యాం దిశిప్రోచ్చా స్తరంగా స్తోయ ధేరివ ౨
పవనాందోలిత స్తేషాం కేతూనా మంశుకోత్కరః
వ్యాజుహూషురివాభాసి జినేజ్యా యై నరామరాన్॥ 3
* * * *
ఇత్యమీ కేతవో మోహనిర్జయోపార్జితా బభుః
విభోస్త్రిభువనేశత్వం శంసతో నన్యగోచరమ్.
దిశ్యేకస్యాం ధ్వజా స్సర్వే సహస్రం స్యాదశీతియుత్
చతస్సృష్వథ తేదిక్షు శూన్యద్విత్రికసాగరాః" ౫

పూలదండ, బట్ట, నెమిలి, పద్మము, హంస, గరుత్మంతుఁడు, సింహము, ఎద్దు, ఏనుఁగ, చక్రము అనుచిహ్నములు గలకేతనములు పదివిధములు. ఒక్కొక్కవిధమునకు నూటయెనిమిదిచొప్పున నొకదానివెనుక నొకటిగాఁ బదివరుసలు నిలువఁబెట్టినచో వేయిపై నెనుబదికేతనము లగును. ఈగుంపునకు, పాలిధ్వజ మనిపేరు. ప్రతిదిక్కున నొకపాలిధ్వజము పెట్టినచోఁ గేతనముల సంఖ్య నాలుగువేలు మూఁడువందలు యిరువది యగును. దీనికిని పాలిధ్వజ మనియే పేరు. తొలుత జినుఁడు మోహమును నిర్జించి త్రిభువనేశత్వము సాధించి నప్పుడు పాలిధ్వజమును ప్రభుత్వచిహ్నముగ గ్రహించెనఁట. నాఁటినుండియు నీధ్వజము సామ్రాజ్యచిహ్నముగా గ్రహింపఁబడుచున్నది. అని పైశ్లోకముల భావము.

జ. రామయ్య.

# మూలము.

మొదటివైపు.

1. ధాన(1)ప్రవరతురఙ్గమే నైకే నై వోత్సారితాశేషవిజిగీషో రవనిపతి తృత యాన్తరితా(2)స్వగురో
2. శ్రియ(3)మాత్మసాక్రిత్య(4) ప్రభావకులిశదలితపాణ్డ్యచోళకేరళకళభ్ర ప్ర భృతిభూభృదదభ్రవిభ్రమ
3. స్యానన్యావనత కాఞ్చీపతిమకుటచుంబితపాదాంబుజస్యవిక్రమాదిత్యసత్యా శ్రయ(శ్రీ)పృథు
4. వీ(5)వల్లభమహారాజాధిరాజపరమేశ్వరభట్టారకస్య ప్రియసూనో(6) పితు రాజ్ఞయా బాలేందుశేక
5. రస్య(7) తారకారాతిరివ దైత్యబల మతిసముద్ధత(8) త్రైరాజ్యకాఞ్చీపతి బల మవష్టభ్య కరదీ
6. క్ర త(9)కవేరపారసీక సింహళాదిద్వీపాధిపస్య సకలోత్తరాపథనాథమథనో పార్జి
7. తోర్జితపాళిధ్వజాది సమస్త పారమైశ్వర్య చిహ్నస్య వినయాదిత్య సత్యాశ్రయ(శ్రీ)పృథి
8. వీవల్లభమహారాజాధిరాజపరమేశ్వరభట్టారకస్య ప్రియాత్మజశ్శైశవఏవాధి
9. గతాశేషాస్త్రశాస్త్ర(10) దక్షిణాశావిజయిని పితామహే సముత్సాలిత నిఖిలకణ్టకసంహతి రత్త

(1) శాసనాంతరములవలన నీతురంగముపేరు చిత్రకంఠమైనట్లు కనబడుచున్నది. కావున "చిత్రకంఠాభిధాన" యని పాఠమైయుండును

(2) త్రితయాన్తరితం- అని చదువునది.

| | | | |
|---|---|---|---|
| ( ) శ్రియం- | ,, | (7) శేఖరస్య | అని చదువునది. |
| (4) సాత్కృత్య- | ,, | (8) సముద్ధతం | ,, |
| (5) పృథ్వీ- | ,, | (9) కృత | ,, |
| (6) సూనోః | ,, | (10). శాస్త్రః | ,, |

రెండవవైపు.

1. రాపథవిజిగీషో గుర్జరో రగ్రత ఏవాహవవ్యాపార మాచర న్నరాతిగజఘ
టాపాటనపటీ

2. య్యర్జమాన క్రపాణ(11)ధారస్సముగ్రవిగ్రహాగ్రేసర ససాహసరసికః పరా
ముఖీ క్రత(12) శ

3. త్రుమణ్డల(13)గంగాయమునాపాళిధ్వజపటక్కా మహాశబ్దచిహ్నాక మాణి
క్యమతంగజాదీ న్పిత్ర (సా)

4. త్పూర్వర్జ (న)ప వైరైః పలాయమానై రాసాద్య కథమపి విధివశా దపనీతో౽పి
ప్రతాపాదేవ విషయప్రకోప

5. మరాజక ముత్సారయ న్వత్సరాజ ఇవానపక్షిత(14) పరసహాయక తద
వగ్రహానిగ్గత్య(15)స్వభుజాక ష్టంభ

6. ప్రసాధితాశేష విశ్వమ్భర(16) ప్రభురక్షిత(17) శక్తిత్రయత్వఛత్రు (18)
మదభఞ్జనత్వా దుదారత్వాన్నిర

7. వద్యత్వా ద్యస్సమస్త భువనాశ్రయ స్సకలపారమైశ్వర్య్య వ్యక్తిహేతు
పాళిధ్వజాత్యుజ్వలప్రాజ్య

8. రాజ్యవిజయాదిత్యసత్యాశ్రయ(శ్రీ)పృథివీవల్లభమహారాజాధిరాజపరమేశ్వ
రభట్టారక స్సర్వా

9. నేవ మాజ్ఞాపయతి విదితమస్తు వో స్మాభిచత్వారి(19)శత్యుత్తరషట్ఛతేషు
శకవర్షే ష్వతీతేషు

---

11. కృపాణ- అని చదువుఁడు.
12. పరాఙ్ముఖీకృత-,,
13. మండలో- ,,
14. ఇవానపేక్షిత-,,
15. తదవగ్రహాన్నిర్గత్య- ,,
16. విశ్వంభరో- అని చదువుఁడు.
17. రక్షిత- ,,
18. శక్తిత్రయత్వాచ్ఛత్రు-,,
19. చత్వారిం- ,,

# మందలింపు.

— శ్రీ తి. ప. నారాయణస్వామిగారు, రుసింగిఅగ్రహారము. —

---

శా. పెల్లుందొయ్యలిఁ బోని సీతసొబగుల్ వేలాగులన్ వించు లో
నిల్వంజాలనిబాళి కగ్గమయి యన్నెం బెన్నుటల్ మాని యా
చాల్వుంగుత్తుకనల్లఁ ద్రావు డెదొ యోజం దెచ్చి యాపైదలి
న్నిల్వంగోరెను బూవుటూరియములో నింపైనమేల్మచ్చునన్. 1

క. వలవంతఁ జేసి మేనునఁ, జెలు వెంతయుఁ దూలఁ దాల్మి చెడి బ్రతుకాపై
దలిచెంత లేమిఁ బెనుకా,నల పింతగురేయి వెల్గునా విత యనుచున్. 2

క. తలపోసి రేసి మారుం,డెలనవ్వనఁ బూవ్రటమ్ము లేయఁ దలఁకి యా
యెలనాఁగ మ్రుచ్చిలింపం,గలజతన మెసంగ నచటు గదలె వడివడిన్. 3

క. చని యొకకోనను మారీ,చునిపేర నెసంగుముసుకసోఁకుడుఁ గని యా
చెనఁటియుఁదనమతిలోఁ బెనఁ,గొనియున్నవిరాళితనదుకోర్కియుఁ దెలిపెన్.

చ. తెలిపినయంత మ్రానుపడి దిగ్గన రక్కసుఁ డుక్కుఁదక్కి యా
రెలుఁగువడంకఁ బల్కు; నర రే! నుడిజేనికొలంపునిండురి
క్కలదొర; పాడియే యొరులకన్నెలఁ గన్నులవింటివానితూ
పులవడి కగ్గమై గిలుబఁబోవుట లేలిక యంతవానికిన్. 5

క. ఒడయఁడవై పొలదిండుల,కెక రెఱుఁగని యాణియముల కేలికవై యీ
గొడవలకు లోఁగు టది సీ,పుడమికిఁ గీరితికిఁ దొసఁగు వాసఁగుటకెకదా.

చ. మగఁటిమి గల్గినన్ బిరుదుమానిసులై చలమొప్ప గుప్పున
స్సగఱ నదల్చి వారిరవణంబులఁ గొమ్మల నిమ్ములైన మా
ళిగలను నాఁచు టింపగు బళీ యనఁ బోటరు లట్లుగాక యీ
తెగువను బూని లాఁతిచెలిఁ దెచ్చిన మ్రుచ్చనుదూఱకాక ల
గ్గగునొకొ ? నిన్నువంటిదొరకా కొఱమాలినయిట్టికర్జముల్. 7

ఉ. గ్రక్కలతేనిచెల్వు సవరించెడిసంచున మించునట్టి మా
జక్కులచానయో చిలుకజవ్వనియో తొలివేల్పుటింతియో
జక్కిమొగంపుగుబ్బెతయొ చాగురె! మానిసిలోఁడిచెల్మి పెం
పెక్కునె ? హాయి నందఁగలవే !! నగరే నిను సాటిబందుగుల్ !!! 8

చ. పలువగలైన నేమములపాలయి గాలియు నీరు నెంచఁటా
కులఁ దిని తూఱరానిపెచుగోనలఁ జేసిన నీతబమ్ము లీ

చెలువల నుర్రుచ్చిలించుటలచేఁ గడు వెచ్చ మొనర్తువేని నీ
యల విధి యంతయుం గరకయం దిడునత్తరుసా విరా యగున్. 9

ఉ. తొల్లరిమించుమించుజిగితో సరితూఁగెడుమేను లొప్ప రా
చిల్లలపల్లులం దెగడుచెన్నగు మాటలనాడు వేలుపుం
జిల్లలకొల్లిపిండు నినుఁజేరియుఁ బచ్చు లొనర్చుచుండఁగాఁ
జుల్లనగాదె మానిసులజోటికి మాటికి నారటంపడన్. 10

ఉ. గిబ్బపటాణిరాతుమలఁ గేలఁ గదల్చుటొ వేల్పులెల్లఁ ద
బ్బిబ్బువడంగ వెల్లపసి వేకొనివచ్చుటొ లేటిమూఁకపై
బెబ్బులిశేవ మాస్తురకు బీతు నొసంగుటొ నల్పునీకు నీ
గుబ్బెతనాఁగి తెచ్చికొనఁగోరుటకన్నను లొచ్చు గల్గునే. 11

మ. అసలుంబుట్టువుచూలిగుఱ్ఱగమిమాయం జేయుటో మిత్రితో
నసమొప్పారఁగఁ బోరి కేరుటయొ నెయ్యం బొప్ప జన్నంబుల
న్వెసనాశ్వేర మొనర్పఁబోవుటయొ వన్నెంగూర్చు నీకట్లుగా
కసమంగజము లొనర్చు టిది తేఁడా! కీరితిం గూర్చునే. 12

క. నెట్టన రాముని ననిలో,నిట్టలముగఁ దాఁకి యతని యింతి నొడిచెదన్
జెట్టి ననుచుఁ దలఁచెదు సూ,కట్టుపకా సతఁడు నిన్నె గలఁచు దురమునన్.

క. దచ్చికడలఁ గ్రొంజిప్పురుం,బచ్చికచెలువంబు మేన వఱలునతనితోఁ
గచ్చెఁ గొననడరులావరి, మచ్చునకే గ్గనుట తోడెమా మేటిదొరా. 14

క. నీటఁబడి నేలఁద్రవ్వియు, మేటిపగఱనడఁచి పుడమి మిగిలిన నెంతేఁ
బోటరియైనను నాతో, సాటి యగునె రాముఁ డెట్టి జగడములందున్. 15

క. అనితలఁచెదు సున్నా మది,నెనసిన కావరముమిగుల నేఁజేసినయ
ప్పనియుఁ బహుబన్నము న్వినుమని తెల్పఁగడంగెచెనఁటి యసుర దనకతల్.

ఉ. మున్నొకయ ప్లదాటునను ముక్కొని యెమ్యోడనేని బాసవాల్
జన్న మొనర్చుచోఁ గవిసిచాగఱలాడుటొ పోటుమానిసిన్
గన్న నెదిర్చి చివ్వకుడు గ్రచ్చఱఁ బిల్చుటొ చేయుచుండి యా
తెన్నున నొక్కపెద్దబిసిదీమముఁ గన్గొని పొంచి యచ్చటన్. 17

క. జన్నపుటేల్బడిక్రై నెల,కొన్నబిరుదుమగని రాముఁ గుఱ్ఱఁ డనుచు లో
నెన్నికొనుచు రుసివేలిమి,బన్నముపాల్సేయ నడచి పడి యగ్గలికన్. 18

క. బుడుతఁ డితం డని మదిలో,నడచిపడుచు నల్లపనఁటి నఱకడనిడి యా
జడదారియాకుటింటికి, నెడగాఁగ న్నిలువ నాతఁ డేచినకినుకన్, 19

క. జెట్టి విడువ మబ్బులవిరి, తిట్టం బడి కొంతవడికిఁ దెల్విపడసి యా
జెట్టి కడిమికిని జేజేల్, వెట్టుదు నేఁటికిని దొంటివేల్పుదునీఁడా. 20

క. నాఁడతఁడు పాలబుడుతఁడు, నేఁడో నెఱజవ్వనంపు నెఱసరి పగఱన్
వాఁడిమిగులఁ గలనులలో, గోడుగుడువఁజేసి కొల్లగొను వారిసిరుల్. 21

చ. చలమరియైన రాముఁడు వెసన్నను జిక్కిననాఁటనుండి నెం
జలిగొని గట్టులం దొనలఁ జెట్టుల గుట్టలఁ గానలందు న
బ్బలియుఁడె తారుచట్లు కనుపట్ట నలందురి వాసిఁగాంచక
న్నిలిచితి నిందు రక్కసి దునీఁడ! తొలంగక యొండుచోటికిన్. 22

సీ. రాక, రాణి, రాణ, రాణువ, మున్నగు, 'రా'లు దొత్తనెసఁగు రవలివినిన
రాముఁ డంచు మున్నరకచెడి యెక్కియో, తెలియుడనుకఁ దలఁకితీవరింతు.

ఉ. తుక్కుడుమాని యాకలనఁ ద్రోచెడు మక్కుని రేసి డాసి యా
క్కొక్కి కలంపఁబోవునెడ నొక్కటియై బలుసింగ మేర్తెఱన్
ఱక్కలపిండు తేవఁ బదునాలుగువేవురు సోఁకుకొట్టటీం
ద్రొక్కఱ నేసె రాము నని నొర్వఁ గొలందియె యెట్టిజెట్టికిన్. 24

చ. సుకియశిదంపుతేవొరల నోములపం టగువెన్నుఁ డాదటన్
బుకమిపడంతిప్రేఁ గుడుపఁబూనఁగ వేల్పులు వేఁడఁ జాల్పు తే
రొడయనియుంట వేల్పుగమినోమగ మానిసి బాలకంబున
న్బొడమెనో గాక లేవయసఁ బూప కలంచునె సోఁకుమూఁకలన్. 25

సీ. తఱఁటిగాసపుహులుమా మేటినుండియుఁ గడు వాటమై తనరునీవంగడంబు
లక్ష్మికినిరవౌచుఁ జిచ్చుఱకంటియు మెచ్చఁగాఁదగునీదు మేల్మితావు
గుండెసంగఁగ వెండిగుం డలవోకమై చెండాడినట్టి నీచేతిలావు
అక్కఱుందమ్ముల పజ్జఁజేరిన వేల్పు టొజ్జలన్ ద్రోచునీయొప్పిదంబు
గీ. తలఁచిములుచఁదనమ్మునుదొలఁచి చెలుల, వలనవలపునవొలయకకలితనమ్ము
నెలయునలరుటనినుబోలువలఁతులకును, నలుసగుడుగాకయొండైన వెలయలరునె

మ. జగమున్ గంటికొలంపుఁ బొల్పడలికిం జాబిల్లియై తోఁచి పెన్
వగపున్వల్లువఁ ద్రెక్కుమానిసులఁ బ్రో వందేవ యై యొప్పున
జ్జగజెట్టీఁడగు రాముబారివడి వే చాఁబోక నీవారితో
నొగి సేమమ్ముగ నేల నేలుటయె నీ కొప్పారు నోద్మేలికా. 27

# మురారి; అనర్ఘరాఘవము.

—పిలకా గణపతిగారు, విజయనగరము.—

---

సంస్కృతవాఙ్మయమందలి ప్రసిద్ధనాటకములలో ననర్ఘరాఘవ మొకటి. కర్త భట్టమురారి. ఈతనికాల మింకను నిశ్చయింపఁబడలేదు. క్రీ. శ. 8 వ శతాబ్దిలోనివాఁ డయియుండు నని యనుమానింపఁబడుచున్నది. భట్ట శ్రీవర్ధమానుఁ డీతని జనకుఁడు. తల్లి తంతుమతి. ఈతఁ డీయనర్ఘరాఘవము నొకదానినే రచించెను. కవి జన్మస్థల మెయ్యదియో స్పష్టముగా నిర్ణయించుటకుఁ దగినయాధారములు కన్పింపవు. కవులలో స్వవిషయావిష్కరణమే సామాన్యముగఁ గానఁబడుచున్నది. కాని, యీతఁడు స్వగర్వావిష్కరణ మొనరించెను—

"మార్గల్యస్య కవే ర్గభీరమధురోద్గారా గిరాంసూక్తయః"

"మహాకవే ర్భట్టశ్రీవర్ధమానతనూజన్మనో తంతుమతీనందనస్య మురారేః కృతిః"

పై వాక్యము లాతనిగర్వమును వెల్లడించును.

అనర్ఘరాఘవనాటకపర్యాలోచనమున, నీమహాకవి కేవలము కవిమాత్రమె కాఁడనియు మహాపండితుఁ డనియుఁగూడ మనకు సుస్పష్టమగును. కొన్నికొన్నిశ్లోకములయందు, పాణినీయసూత్రముల నన్వార్థమునఁ బ్రయోగించెను. "జయతి జనికర్తుః ప్రకృతితా" "జనికర్తుః ప్రకృతిః" అనుపాణినీయసూత్రము నిందుఁ జొన్పించెను. "ప్రకృష్టకర్త్రభిప్రాయక్రియాఫలవతో విధేః" ఈశ్లోకమున "స్వరితఞితః కర్త్రభిప్రాయే క్రియాఫలే" అనుసూత్రచ్ఛాయ లున్న వని పాఠకులకు విదితము కాకపోదు. పై యుదాహరణములచే నాతఁడు దనవైయాకరణిత్వమును బ్రకటించుచున్నాఁ డని సులభముగ నూహింపవచ్చును. తద్ధితయఙ్లుగంతాదిప్రయోగముల నసంఖ్యాకములుగఁ దమకృతులఁ జొప్పించుట యనిన వైయాకరణుల కత్యంతప్రియము. అట్లీమురారికూడఁ దనగ్రంథమున ననేకతద్ధితాదిప్రయోగముల నుపయోగించినాఁడు. ఉదాహరణము:—"అధ్యమి త్రైణస్య తత్రభవత స్సునాసీరస్య" "పృథ్వీమవాతీతరన్"

శ్లో. వారాం స్త్రీ నభిషుణ్వతే విదధతే వన్యా శ్శరీరస్థితీ
రైణేయ్యాం త్వచి సంవిశంతి వసతే చాపిత్వచం తారవీం
తత్పశ్యన్నిత థామ నా భిపతతో యచ్చారణ్యేచక్షుషీ
ధన్యా వీతరజస్తమా భగవతీ చర్యేయమామోదతే॥

ఇంకను గొన్నియుదాహరణముల నిట విస్తరభీతిచే విడిచితిని.

మఱియు నొకచో వైయాకరణుల స్థానివద్భావమును బ్రయోగించినాఁడు—

"స్థానివద్భావేన క్షుత్రకార్యం న జహాతి"

ఈతఁడు కేవలము వ్యాకరణపారిభాషికపదములనే గాక న్యాయాది శాస్త్రపారిభాషికపదములను గూడఁ బ్రయోగించెను. దీనివలన నాతనికా యాశాస్త్రములయం దసమానపాండిత్యమున్న దని యూహించుటకు వలను పడకపోయినను బరిచయమాత్ర మున్నదని మనము నిస్సంశయముగఁ జెప్పవచ్చును.

అనర్ఘరాఘవమందలి కథ రామాయణకథ. ఈనాటకమునందలి యితివృత్తము భవభూతి మహాకవిరచించిన మహావీరచరితేతివృత్తమును జాలవఱకుఁ బోలుచున్నది. ఉత్తరరామచరితనాటకచ్ఛాయలు గూడ నచ్చటచ్చటఁ గానఁబడుచున్నవి. ఈకవి చాలవఱకు భవభూతి "ననుసరించె" నని చెప్పిన సాహసము కాఁజాలదు:—

ఉత్తరరామచరితమున వసిష్ఠుఁడు శ్రీరామున కొకసందేశము నంపును. సీతాపరిత్యాగసమయమున శ్రీరాముఁడు గురుసందేశమును సంస్మరించి సీతాపరిత్యాగ మొనర్చును. అట్లే యనర్ఘరాఘవనాటకమునఁ గూడ దశరథునకు వసిష్ఠసందేశము వామదేవముఖమున విన్పింపఁబడినది. విశ్వామిత్రుఁడు రామలక్ష్మణుల నర్థించినప్పుడు దశరథుఁడు గురుసందేశానుసారముగ రామలక్ష్మణుల విశ్వామిత్రుని కర్పించును.

మహావీరచరితమున రావణుఁడు శౌష్కలముఖమున సీత నర్థించును. కాని జనకుఁడు రావణయాచనమును ద్రోసి పుచ్చును. అట్లే యనర్ఘరాఘవనాటకమున శౌష్కలప్రవేశము, సీతాయాచనము, జనకతిరస్కారమును గూడఁ గానఁబడుచున్నవి. గురుధనుర్భంగకుపితుఁ డగు పరశురాముని ప్రవేశము

భయనాటకములందును గానఁబడుచున్నది. కాని, భవభూతిపరశురాముఁడు మాల్యవంతునిచేఁ బంపఁబడినవాఁడు. మురారిపరశురాముఁడు గురుధనుర్భంగజనితక్రోధమున యుద్ధమునకు వచ్చును. మహావీరచరితమున మాల్యవత్ప్రేషిత యగుశూర్పణఖ దశరథునకు మాయావాచికమును వినిపించును. అట్లే మురారినాటకమునఁ గూడ శూర్పణఖ మాయావాచికమును దశరథునకు వినిపించును, కాని, యొకింతభేదము గలదు. మురారినాటకమున జాంబవత్ప్రేరిత యగు శ్రమణ శూర్పణఖావేషమును ధరించి స్వకార్యమును నెఱవేర్చును. భవభూతి మహావీరచరితమున నాయకున కుదాత్తత్వభంగము గలుగు నను భయముచేఁ బ్రత్యక్షవాలివధము నభివర్ణించెను. అట్లే మురారికూడఁ దననాటకమునఁ బ్రత్యక్షవాలివధమును గల్పించెను. కాని, భవభూతినాటకమందలి వాలి మాల్యవదుత్తేజితుఁడై యుద్ధసన్నద్ధుఁ డగును. మురారినాటకమందలి వాలి లక్ష్మణుఁడు కంకాళవిక్షేప మొనర్చుటచే గుపితుఁడై యుద్ధోన్ముఖుఁ డగును. భేద మింతియే. రావణవధానంతరము శ్రీరాముఁడు రమణీయదృశ్యముల సందర్శింపుచు నిజపురికే తెంచుట రెండింటియందును గూడఁ గానఁబడుచున్నది. మురారి భవభూతి కర్వాచీనుఁ డగుట నిశ్చితము. కావునఁ గథాసంవిధానమున మురారి భవభూతి ననుసరించె ననుట యుక్తము.

కేవలము కథాసంవిధానముననే గాక మురారిశ్లోకములయందు భవభూతిశ్లోకచ్ఛాయ లగపడుచున్నవి. మచ్చున కొకటిరెండు :—

"శ్లో. జ్యోతిర్జ్వాలావలయజటిలస్సన్నిధత్తేకుఠార
స్తూణీరోంసే వపుషి చ జటా చాపచీరాజినాని
పాణౌ బాణః స్ఫురతి వలయీ భూతలోలాక్షసూత్రే
వేషః శోభాం వ్యతికరవతీ ముగ్రశాన్తస్తనోతి"

(మహావీరచరితము)

శ్లో. "జటాం ధత్తే మూర్ధా పరశు ధనుషీ బాహుశిఖరం
ప్రకోష్ఠో రౌద్రాక్షం వలయ మిషుదండానపి కరః
ప్రరూఢప్రాఘాత్రవ్రణవికట రౌద్రాద్భుతమిదం
ప్రశాన్తో మైణేయీం త్వచమపి చ వక్షః కలయతి"

(అనర్ఘరాఘవము.)

"యేన పరావతితేనైవ కపిలాకల్యాణీ బలాత్కృత్య మడమడాయితా"
(ఉత్తరరామచరితము)

"మేధ్యా వత్సతరీ విహస్య నటుభి స్సోల్లుంఠ మాలభ్యతే"
(మురారి.)

నాటకశైలి నారికేళపాకము. వస్తువర్ణనావసరమున "కించ" "అప రంచ" "తథాహి" మొదలగు పదములచే విసువు పుట్టునట్లు వర్ణనలు చేయఁబడినవి. కాని, యాతనివర్ణనమున నొకసుగుణము కలదు. ఈతఁడు కల్పించిన కల్పన లన్నియు వినూత్నములు. వర్ణనావిషయమున పరానుకరణ మాతని నాటకమున లేనేలే దని చెప్పవచ్చును. శైలియొత్తముమీఁదఁ గఠినమయినను ద్రాక్షాపాకయుక్తములును స్వభావోక్తియుక్తములు నగుశ్లోకములు లేకపో లేదు. రెండుమూఁడుశ్లోకముల నుదాహరించియింతటితో విరమించెదను:—

శ్లో. "కష్టా వేధవ్యథా నిత్యం కష్టశ్చ వహనక్లమః
శ్రవణానా మలంకారః కపోలస్యతు కుణ్డలమ్"

శ్లో. "బాలేయతండులవిలోపకదర్థితాభి
రేతాభి రగ్నిశరణేషు సధర్మిణీభిః
ఉత్త్రాసహేతు మపి దణ్డ ముదస్యమాన
మాఘ్రాతు మిచ్ఛతి మృగే మునయో హసంతి."

శ్లో. ఏకద్విత్రిచతుః క్రమేణ గణనా మేషామివాస్తంయతాం
కుర్వాణా స్సమకోచయ ద్దశశతాన్యంభోజసంవర్తికాః
భూయోపి క్రమశః ప్రసారయతి తాః స్సంప్రత్యమూనుద్యత
స్సంఖ్యాతుం సకుతూహలేవ నళినీ భానో స్సహస్రంకరాన్.

శ్రీరస్తు.

# ఉత్తరరామచరితనాటకరసవిచారము.

(జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.)

---

మహాకవి భవభూతి రచితోత్తరరామచరితనాటకములోని ప్రధాన రసము కరుణమా విప్రలంభమా యనువిచారము కొంతకాలముక్రిందట బయలుదేఱినది. పూర్వలాక్షణికు లేమి వ్యాఖ్యాత లేమి కరుణరసమే నాటకమందుఁ బ్రధానరస మని గ్రహించినట్లు కనఁబడుచున్నది. ఇటీవల నాటకములోని ప్రధానరసము చతుర్విధవిప్రలంభశృంగారములలో నొకటి యగుకరుణవిప్రలంభము గాని కరుణము గా దనువాదమును బైలుదేఱినది. ఈవాదము చేయువారిలో నుత్తరరామచరితమునకు "కల" యను వ్యాఖ్యానమును రచించిన శ్రీమదద్దంకి తిరుమలకుమారతాతాచార్యులుగారు ప్రథములు. వీ రీవాదమును "ఏకో రసః కరుణ ఏవ"ఇత్యాది శ్లోకవ్యాఖ్యానమునఁ బ్రపంచించిరి. కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిలుగా రీమతమునే తాము రచించిన యాంధ్రోత్తరరామచరితనాటకపీఠికలో విపులముగాఁ జర్చించి సిద్ధాంతీకరించిరి. ఈయర్థమునే సాధించుచు, కొంపెల్ల సుబ్బరాయశాస్త్రిలుగారు శుక్ల సంవత్సరాషాఢశ్రావణమాసములలో వెలువడిన భారతిపత్రికలో నొకపెద్ద వ్యాసముం బ్రకటించినారు. నాకుఁ దెలిసినంతవఱకు నీమతమును బ్రతిపాదించువా రీముగ్గురే.

ఈనవీనమతముయొక్కయుఁ బూర్వమతముయొక్కయు బలాబలముల విమర్శించి యేది నిలువఁదగినదో నిర్ణయింపవలసియున్నది.

శ్రీరాముఁడు రావణుని సంహరించి యగ్నిశుద్ధ యైనసీతను దీసికొని యయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుఁడై రాజ్యముచేయుచుండ నొకనాఁడు పరగృహవాసదూషిత యైనభార్యను జేపట్టుట రామునకుఁ దగ దని జనులు కొంద ఱనుకొనుచున్నట్లు విని, రాజునకు లోకారాధనమే పరమధర్మ మని యెంచి నిర్దోష యని యెఱిఁగియుండియు నిర్భరగర్భఖిన్న యగుసీత నడవిలో విడిచి రమ్మని రాముఁ డాజ్ఞాపింప లక్ష్మణుఁ డట్లు చేసె ననియు, సీత కుశలవులను నిద్దఱు శిశువులం గని రసాతలమునకుఁ బోయె నని యుఁ, బ్రాణముకంటెను బ్రియురా లగుసీతను బాసి రాముఁ డత్యంతదుఃఖభాజనమై కాలమెట్లో

కడపుచు సీతా ప్రతికృతిగా న్వర్ణబంగారుబొమ్మను జేయించి యదియే సహ ధర్మచారిణిగా నశ్వమేధయాగము చేయ సంకల్పించి మేధ్యాశ్వమును విడిచి దానిని సంరక్షించుటకై సేనతో లక్ష్మణునికొడుకగు చంద్రకేతువును బంపె ననియు, నాగుఱ్ఱము వాల్మీకితపోవనమునొద్దకు రాఁగా లవుఁడు దానిని గట్టి పెట్టించుట కారణముగా నాతనికిఁ జంద్రకేతుసేనతోఁ గొంతయుద్ధమును జంద్రకేతువుతో వీరసల్లాపమును జరిగె ననియు, నాకాలమున రాముఁడును, కౌసల్యయు, అరుంధతియు, నచ్చటికి వచ్చి రనియు, వాల్మీకి యంతకుఁబూర్వ మే నాటకరూపముగా రచించియుండిన యుత్తరరామకథ నప్సరఃస్త్రీలచేఁ బ్రయోగముచేయింపఁ దలఁచి యాప్రదర్శనము చూచుటకై మర్త్యామర్త్య భూతగ్రామము నంతను నటకు రప్పించె ననియు, నాటకానంతరము గంగా విశ్వంభరాదేవులతోఁ గూడి సీత రసాతలమునుండి గంగాద్వారమున రంగస్థల మునకు వచ్చె ననియు, నప్పుడు గంగాపృథ్వులును అరుంధతియును సీత నెం తయుఁ గొనియాడి రాముఁడామెను దిరుగఁ బరిగ్రహింపఁ దగు నని పలుక భూతకోటి యంతయు నందున కామోదించె ననియు, రాముఁ డప్పుడు సీతను దిరుగఁ బరిగ్రహించె ననియు నీనాటకమందలి యితివృత్తము.

రాముఁ డశ్వమేధయాగ మొనరించుచుండఁ గుశలవులు వచ్చి రామా యణకథను గానముచేసినట్లును; వారు తనకొడుకు లని తెలిసికొని సీత తాను నిర్దోష నని జనులకందఱకు నమ్మకము కలుగునట్లు శపథము చేసినఁగాని యా బాలురఁ దాను గొడుకులుగా భావించి యొద్ద నుంచుకొనుట కనువు కా దని సీతను దోడ్కొని ర మ్మని వాల్మీకికి వార్త పంపఁగా నామహర్షి యామెను దోడ్కొ ని వచ్చినట్లును, సీత శపథముచేసి వెంటనే రసాతలమునకుఁ బోయినట్లును వాల్మీకిరామాయణోత్తరకాండమునం దున్నది. అంతర్నాటికయు సీతారా ముల పునస్సమాగమమును భవభూతి కల్పించినవి.

ఈయితివృత్తమువలన సీతారాములకుఁ బునస్సమాగమము కలిగినది కావున నీనాటకమునందలి ప్రధానరసము విప్రలంభశృంగార మని విప్రలంభ శృంగారవాదులమతము. కరుణమే ప్రధానరస మని యితరులమతము. ఈ మతముల బలాబలములను నిర్ణయించుటకుఁ బూర్వము తత్తద్రసనిరూపణము చేయవలసియున్నది. కరుణరసమునకు స్థాయిభావము శోకము, ఆలంకారికు లీశోకము నిట్లు నిర్వచించియున్నారు.

"ఇష్టజనవియోగాదులచే మనమునఁ బుట్టినదుఃఖాతిశయము శోక" మని ప్రతాపరుద్రీయము.[1]

"ఇష్టవిశ్లేషమువలనఁ బుట్టినట్టియురతితోఁగూడకుండినట్టియుఁ బరిమితమైనట్టియు మనోవికారము శోక"మని రసతరంగిణి.[2]

"ఇష్టనాశమువలనను, అనిష్టప్రాప్తివలనను గరుణ మనురసము కలుగు" నని సాహిత్యదర్పణము.[3]

"ఇష్టవియోగాదులవలనఁ బుట్టినయపరిపూర్ణవికారము శోక" మనిరసచంద్రిక.[4]

ఇష్టవస్తువిశ్లేషమువలనఁ గలిగెడుమనోవికారము శోక మని వీనిభావము. అనిష్టప్రాప్తి ప్రస్తుతము కాదు కావున నది యిప్పుడు విచారింపఁబనిలేదు. ఈ విశ్లేషము నిత్యమైనచో నారసము కేవలకరుణమే యగును. విశ్లేషమునకు విచ్ఛిత్తి కలిగి యిష్టవస్తుపునఃప్రాప్తి కలిగినచో శోకము పోయి రతి యావిర్భవించును గావున నప్పుడు శృంగారరస ముద్భవించును. ఈశృంగారమునకు విప్రలంభశృంగార మని పేరు. పూర్వానుభూతకరుణము దీని కంగ మగును—

ఇది విప్రలంభశృంగారరససామాన్యలక్షణము. పూర్వానురాగవిప్రలంభము, మానవిప్రలంభము, ప్రవాసవిప్రలంభము, కరుణవిప్రలంభము నని విప్రలంభము నాలుగువిధము లని కొందఱులాక్షణికు లంగీకరించియున్నారు.

"ఆవిప్రలంభము పూర్వానురాగమానప్రవాసకరుణాత్మకము లని నాలుగువిధములు."- అని సాహిత్యదర్పణము.[5]

కరుణవిప్రలంభమే యిప్పుడు విచారణీయము. నాయికానాయకులలో నొకరు లోకాంతరగతులై పునర్లభ్యు లగుచుండ రెండవవారు గతించినవారికై దుఃఖించునపుడు కరుణవిప్రలంభ మగు" నని యాగ్రంథమందే యీరసమునకు లక్షణము చెప్పఁబడినది.[6]

---

1. ఇష్టజనవియోగాదినా ఆత్మని దుఃఖాతిభూమి శ్శోకః.
2. ఇష్టజనవిశ్లేషజనితో రత్యానాలింగితః పరిమితో మనోవికార శ్శోకః.
3. ఇష్టనాశా దనిష్టాప్తేః కరుణాఖ్యో రసో భవేత్.
4. ఇష్టవియోగాదిజన్యో మనోవికారోఽపరిపూర్ణ శ్శోకః.
5. స చ పూర్వరాగమానప్రవాసకరుణాత్మక శ్చతుర్ధా స్యాత్.
6. యూనో రేకతరస్మి న్గతవతి లోకాంతరం పున ర్లభ్యే।
విమనాయతే యదైక స్తదాభవే త్కరుణవిప్రలంభాఖ్యః॥

ఇదియు స్థూలలక్షణమే. చచ్చినవానిని గూర్చి యేడ్చుట కరుణమే యగును. చచ్చినవాఁడు మరల నెప్పుడో వచ్చి కూడినంతమాత్రముచేతఁ బూర్వానుభూతకరుణము శృంగారముఁగా మాఱఁ జాలదు. శోకానుభవకాలమునందే పునస్సమాగమాశ కలిగిననే విప్రలంభశృంగార మగును. అప్రత్యక్ష్యముగాఁ గలిగిన పునస్సమాగమముచేఁ గలిగినది సంభోగశృంగారమే యగును. పూర్వానుభూత మైనది కేవలకరుణమే యగును. ఇదియే లాక్షణికుల పరమసిద్ధాంతము.

దీనికిఁ బ్రమాణములు—

(1) "ఇష్టవియోగమువలనఁ బుట్టినదియు, రతితోఁగూడుకొననిదియుఁ, బరిమితము నగుమనోవికారము శోకము. అట్లయిన నిష్టవియోగమువలనఁ గలిగిన విప్రలంభము కూడఁ గరుణము కావలసి వచ్చునే యన్న విప్రలంభమందు శోకము రతితోఁ గూడి యుండును, గావున నది శోకము కాదు. రతి యనఁ బ్రీతిమాత్రము కాదు. ప్రీతి లేక శోకమును బుట్టదు గదా! ఈపట్టున రతి యనఁగా నిష్టసమాగమాభిలాషయే గాని కేవలప్రీతి కాదు. కుమారసంభవమందు రతియొక్కయు, కాదంబరియందు మహాశ్వేతయొక్కయు రఘువంశమునం దజునియొక్కయుఁ బ్రలాపముఁదు బాధనిశ్చయముగాలమున నిష్టసమాగమాభిలాష జనింపలేదు గావున నాస్థలములందలి రసము కరుణమే. మృతునివిషయములోఁ గూడ జీవితాశ యెచ్చటం గలుగునో యచ్చట నిష్టసమాగమాభిలాష కలుగును గావున రసము విప్రలంభశృంగారమే. ఇచ్చట బాధసందేహము గ్రాహ్యసందేహమునందుఁ బర్యవసిత మగుచున్నది గాన సమీహకుఁ బ్రతిబంధము లేదు."-అని రసతరంగిణి.[1]

---

1. ఇష్టవిశ్లేషజనితో రత్యనాలింగితః పరిమితో మనోవికారః శోకః సచేష్టవిశ్లేషజనితవిప్రలంభశృంగారస్య కరుణరసత్వాపత్తి స్తస్య రత్యాలింగితత్వాత్- నచ రతిః ప్రీతి స్తయా వినా శోకోపి నోత్పద్యతే తథా చాసంభవ ఇతి వాచ్యమ్। ఇష్టసమీహాజనితమనోవికృతే రతే రుక్తత్వాత్ । కుమారసంభవే రత్యాః కాదంబర్యాం మహాశ్వేతాయాః రఘువంశే అజస్య ప్రలాపే కరుణ ఏవ రసః తత్ర తత్ర బాధనిశ్చయే నేష్టజనవస్తుసమీహాయా అభావాత్ । యత్రచ మృత ఏవ జీవితాశా తత్ర శృంగార ఏవ రసః। బాధసందేహస్య గ్రాహ్యసందేహపర్యవసితతయా సమీహాయా అప్రతిబంధకత్వాత్.

మఱియు నా గ్రంథమునందే—

"శోకముయొక్క పరిపోషము కరుణ మగును. ఆశావిచ్ఛేద మైనచో సర్వేంద్రియములు క్లాంతము లగును. విప్రలంభమం దిష్టాశ యుండును గాన నీకరుణలక్షణమునకు విప్రలంభమం దతివ్యాప్తి కలిగిన దని చెప్పఁగూడదు. ఆశావిచ్ఛేద మైనప్పుడు కరుణమే గాని విప్రలంభము కాదు." అని యున్నది[1]

(2) రసార్ణవసుధాకరకారుఁడు—

"నాయికానాయకులలో నొకరు మరణింపఁగా వారు తిరిగి వచ్చువ ఱకు రెండవవారు పొందుదుఃఖము కరుణ మనఁజెల్లదు. ఏలన:—పునస్సంగ మాశ దుఃఖముతోఁ గూడి యున్నది గావున" అని చెప్పి—

"అథమదనవధూరుపప్లవాంతం వ్యసనకృశాపరిపాలయాం బభూవ
శశిన ఇవ దివాతనస్య రేఖా కిరణపరిక్షయధూసరా ప్రదోషమ్."

అనుకుమారసంభవశ్లోకము నుదాహరించి దానికి—

"ఇచ్చట నాకాశవాణి పలుకునందలి నమ్మకముచేత రతికిఁ గృశత్వా దులచే ననుమితము లైన గ్లాన్యాదివ్యభిచారిభావములచేత వృద్ధి నొంది సమయపరిపాలనాదిరూపము లైనయనుభావములచేత విప్రలంభము వ్యక్తమగుచు న్నది." అని వ్యాఖ్యానము చేసెను.[2]

హరకోపానలముచే భస్మమైన మన్మథునిగూర్చి రతి విలపించుచుండఁ బ్రియునితోఁ దనకుఁ బునస్సమాగమ మగు నని యాకాశవాణి పలికినపలు కును నమ్మి యాసమాగమము ప్రతీక్షించి యున్నకాలములో రతి పొందినశో కము విప్రలంభ మని దీనితాత్పర్యము. దీనినిబట్టి కూడఁ బ్రత్యాశతోఁ గూడి నప్పుడే శోకము విప్రలంభ మగు నని సిద్ధించుచున్నది.

(3) రసగంగాధరకారుఁడు—

కరుణవిప్రలంభముల స్వరూపములును వానికిఁ గలభేదమును జర్చించి- "నాయికానాయకులలో నొకరు మృతినొంది రనుజ్ఞానము కలిగినప్పుడు రతిపో

---

1. శోకస్య పరిపోషః కరుణః । ఆశావిచ్ఛేదే సతి సర్వేంద్రియక్లమోవా । నచ విప్ర లంభేఽతివ్యాప్తిః । తత్రేష్టాశాయాః సత్వాత్ తద్విచ్ఛేదేతు నవిప్రలంభః కరుణఏవ॥

2. ద్వయో రేకస్యమరణే పునస్సంజీవనావధౌ । విరహః కరుణో౽స్యా త్సంగమాశాను వర్తనాత్॥ అత్రాకాశసరస్వతీప్రత్యయేన రతే ర్విప్రలంభః కృశత్వా ద్యనుమితైః గ్లాన్యాదిభిర్వ్యభి చారిభావైః పోషిత స్సమయపరిపాలనాదిరూపై రనుభావై ర్వ్యజ్యతే॥

షిత మైనశోకము కరుణమే యగును. మరణజ్ఞాన మున్నను దేవతాప్రసాదాదులవలనఁ బునరుజ్జీవనము కలుగు నను జ్ఞానము కలిగినచో నాలంబనమున కత్యంతనిరాసము లేదు గానఁ జిరప్రవాసమందువలె రసము విప్రలంభమే కాని కరుణము కాదని చెప్పెను.[1]

ఇదియు విప్రలంభమందు శోకానుభవకాలమునఁ బ్రత్యాశ యుండవలయు ననువాదమును బలపఱుచుచున్నది.

(4) సాహిత్యదర్పణమునందు—

"నాయికానాయకులలో నొకరు లోకాంతరగతులై తిరిగి లభింపఁదగినవా రగుచుండ వారికై రెండవవారు దుఃఖించినచో నది కరుణవిప్రలంభ మనిపించుకొనును. కాదంబరిలోఁ బుండరీకమహాశ్వేతావృత్తాంత మిందునకు దృష్టాంతము. మృతినొందినవాఁడు తిరిగి లభ్యుఁడు కాకపోయినను శరీరాంతరముచేత లభ్యుఁడైనను గరుణరసమే." అని గ్రంథకర్త స్వమతమును దెలిపి-[2]

"ఆకాశవాణి పలికినపిదప సంగమప్రత్యాశచేత రతి పుట్టినందున నాయాకాశవాణీభాషానంతరరసము శృంగార మనియుఁ దత్పూర్వానుభూతరసము కరుణ మనియుఁ గోవిదులు తలంతురు" అని మతాంతరమును సూచించెను.[3]

(5) రసచంద్రికాకారుఁడు—

"సప్రత్యాశో విప్రలంభో నిష్ప్రత్యాశః కరుణః" అనుకారిక నుదాహరించి జీవననిశ్చయము కలిగినప్పుడు దానివలన భావిసంభోగరూప మైనయిష్టసాధనతాజ్ఞానమును దదధీన మైన యిష్టసంగమసమీహాయుఁ గలుగును గావున

---

1. మృతత్వజ్ఞాన దశాయాంతు రతిపోషితస్య వైక్లబ్యస్యేతి కరుణ ఏవ। యదాతు సత్యపి మృతత్వజ్ఞానే దేవతాప్రసాదాదినా పునరుజ్జీవనజ్ఞానం కథంచిత్స్యాత్। తదాలంబనస్యాత్యంతికనిరాసాభావా చ్చిరప్రవాస ఇవ విప్రలంభ ఏవ న స కరుణః॥

2. యూనో రేకతరస్మి న్గతవతి లోకాంతరం పునర్లభ్యే।
విమనాయతే యదేక స్తదా భవే త్కరుణవిప్రలంభాఖ్యః।
యదా కాదంబర్యాం పుండరీకమహాశ్వేతావృత్తాంతే। పున రలభ్యే శరీరాంతరేణ వా లభ్యేతు కరుణాఖ్య ఏవ రసః.

3. కిం చాత్రాకాశసరస్వతీభాషణానంతరమేవ శృంగారః। సంగమప్రత్యాశయా రతే రుద్భవాత్। ప్రథమంతు కరుణ ఏవ ఇత్యభియుక్తా మన్యన్తే॥

నది విప్రలంభ మగు ననియు, జీవనాభావనిశ్చయము కలిగినప్పు డట్టిసమీహ కలుగుట కవకాశ ముండదు, కావున, నది కరుణరస మగు ననియు, వివరించి నిశ్చయజ్ఞానము లేక జీవితసందేహమున్నచో రతిశోకములు రెండింటికిఁ బ్రాధాన్య ముండును గావున నారసము కరుణముకంటెను, విప్రలంభముకంటెను విలక్షణమైన కరుణవిప్రలంభ మగు" నని నిర్ణయించెను.[1]

ఈకరుణవిప్రలంభలక్షణమునకును బూర్వోదాహృత తద్రసలక్షణములకును గొంతభేద మగపడుచున్నది. ఈలక్షణముచేత నైనను బ్రత్యాశారూపకమైన రతి లేనిదే కరుణవిప్రలంభము పుట్టనేరదు. ఈ ప్రమాణములంబట్టి చూడఁ బ్రత్యాశాసహితమైనశోకము విప్రలంభ మనియుఁ బ్రత్యాశారహితమైనశోకము కేవలకరుణ మనియుఁ దేలుచున్నది. ప్రియుఁడు లోకాంతరగతుఁడగుటచేఁ గలిగిన విప్రలంభమందుఁ బ్రవాసాది జన్యవిప్రలంభముకంటె శోక మధికముగా నుండును గావున దానికిఁ గరుణవిప్రలంభ మని పేరు పెట్టిరి. దీనియందును రతియే స్థాయి యని పూర్వలాక్షణికమతము. రసచంద్రికనుబట్టి మాత్రము కరుణమునను రతియు రెండును స్థాయులే. ఎట్లయినను రతి యుండక తప్పదు.

ఇచ్చట రతి యనఁగాఁ బునస్సమాగమాభిలాషారూపకము. విశ్లిష్టవస్తుప్రీతి కేవల కరుణమందును గలదు గావున నాప్రీతియే విప్రలంభమందు స్థాయియైన రతి యనఁగూడదు. ఒక్క శోకమే యనుభూతమైనచోఁ గరుణ మగును. ఒక్క రతియే యనుభూతమైనచో సంభోగశృంగార మగును. ఉభయస్థాయిసమ్మేళనముచే నీరసములు రెండింటికంటెను విలక్షణమైన వేఱొక రసము పుట్టును.

బెల్లముపెట్టి వండిన చేఁదుపొట్లకాయకూర కేవలము చేఁదును గాక కేవలము తీపియుఁగాక యీరెండురుచులకంటె విలక్షణమైన యింకొక రుచి కలిగియుండును. బెల్లము పెట్టక వండిన చేఁదుపొట్లకాయకూర తిని పిదప

1. విప్రలంభే జీవననిశ్చయేన భావిసంభోగరూపేష్టసాధనతాజ్ఞానసత్త్వా దధీనా తత్సమీహానువర్తతే। కరుణేతు జీవనాభావనిశ్చయేన భావిసంభోగరూపేష్టసాధనతాజ్ఞానభావా త్తదధీనా తత్సమీహా నివర్తతే............యత్ర తయోరన్యతరస్మిక్ జీవతి మృతేవా జీవితసందేహస్తత్ర వినిగమనావిరహాణరతిశోకయో రుభయో రపి ప్రాధాన్యా దుభయస్థాయికః కరుణవిప్రలంభాఖ్యోఽతిరిక్తఏవ రసః॥

బెల్లముతిన్నచోఁ గూర కేవలము చేఁదును, బెల్లము కేవలము మధురము నగును. దేనిరుచి దానిదే, రెండును ప్రధానములే, కాని, యొకదాని కొకటి యంగము కానేరదు.

స్వప్నములో నేదో గొప్పవిపత్తు తటస్థించినట్లు తోఁచి యుత్కటమైన దుఃఖము కలుగును. మేల్కాంచినపిదప నది యంతయు మిథ్యయని తెలిసి సంతోషము కలుగును. అయినను స్వప్నకాలమం దనుభవించినది కేవలము శోకమే. తరువాతఁ గలిగినసంతోషమువలన దానికి మాఱ్పేమియుఁ గలుగదు.

అట్లే దూరదేశమున కేగినప్రియుఁడు మృతినొందినట్లు మిథ్యావృత్తాంతము తెలిసి ప్రేయసి విలపించుచుండఁగా నాప్రియుఁడు వచ్చి ప్రేయసిని గూడినను బూర్వానుభూతమైనశోకము శోకమే యగును గదా. శోకానుభవకాలమందుఁ బ్రత్యాశ యున్నచో శోకతీవ్రత తగ్గును. ప్రత్యాశ లేనిచో శోక మతితీవ్ర మగును. ఇదియే కరుణవిప్రలంభశృంగారములకుఁ గల భేదము.

విరహకాలమందుఁ బ్రత్యాశ యుండినం గాని విప్రలంభము కా దని యీచర్చవలనఁ దేలినసిద్ధాంతము. ఈసిద్ధాంతమునుబట్టి యుత్తరరామచరిత నాటకములోని ప్రధానరసము కరుణమా లేక కరుణవిప్రలంభమా యనువిషయము నిర్ణయింపవలసియున్నది. సౌలభ్యమునకై యీవిషయమును—

I పునస్సమాగమమువఱకు సీత భూలోకమం దుండెనా లేక లోకాంతరమును బొందెనా—

II. సీత జీవించియున్న దని కాని మృతి నొందిన దని కాని నిశ్చయజ్ఞానము గాని దృఢప్రత్యయము గాని రాముని కుండెనా లేదా—

III. రామునకు సీతాపునస్సమాగమప్రత్యాశ యుండెనా లేదా—

అను మూఁడంశములుగా విభజించి విమర్శింతము.

I తృతీయాంకారంభమున మురలాతమసాసంవాదములో—

"లక్ష్మణుఁడు వాల్మీకితపోవనసమీపమందు విడిచి వెళ్లినపిదప సీతాదేవికిఁ బ్రసవకాల మాసన్నము కాఁగా నామె యాప్రసవవేదన సహింపంజాలక గంగాప్రవాహములోఁ బడి యం దిద్దఱుశిశువులఁ గనియెను. అప్పుడే పృథ్వీభాగీరథు లామెను శిశుసహితముగ రసాతలమునకుం గొంపోయిరి. స్తన్యత్యా

గానంతరము పిల్లలను భాగీరథి స్వయముగాఁ దెచ్చి వాల్మీకిమహర్షి కొప్పగించెను” అని తమస చెప్పెను.[1]

దీని కనుగుణముగా సప్తమాంకమునం దంతర్నాటికాంతమున—

“కలఁగఁబాఱె మథించినకరణి గంగ, కప్పె దేవర్షిగణము లాకాశ మెల్ల
వసుధ గంగయు వెంటరావచ్చె నార్య, జలము వెల్వడిమిగులనాశ్చర్యగతిని.[2]

అని లక్ష్మణుఁడు పలికెను.

అప్పుడే వాల్మీకి కుశలవుల సీత కర్పింపఁగా నాదేవి “రమ్ము నాయనా కుశ ! రమ్ము నాయనా లవ ! లోకాంతరమునుండి వచ్చిన మీతల్లి నైనన న్నుఁ జాలసేపు కౌఁగిలించుకొనుఁడు” అని పలికెను.[3]

దీనినిబట్టి ప్రసవ మైనవెంటనే సీత రసాతలమునకుఁ బోయి నాటకాంతమందుఁ బునస్సమాగమావసరమునందు గంగాద్వారమునఁ దిరిగి భూలోకమునకు వచ్చినట్లు తేలుచున్నది.

II. సీత జీవించియున్నదా లేదా యనువిషయమున రామునకు నిశ్చయబుద్ధి గాని దృఢప్రత్యయము గాని యున్నదా లేదా యనునంశమును విమర్శింతము.

౧. ప్రథమాంకమున సీత నడవికిఁ బంపుసంకల్ప ముదయించినప్పుడే-

“పిన్ననాఁటినుండియుఁ బెంచి ప్రియను నన్నె
తద్దయును నమ్మియున్నయీముద్దరాలి
మృత్యువున కిచ్చుచున్నాఁడ మిషను బన్ని
యింటిచిలుకను బోయకు నిచ్చునట్లు-[4].

1. అస్తిఖలు వాల్మీకి తపోవనోపకంఠా త్పరిత్యజ్య నివృత్తేసతి లక్ష్మణే సీతాదేవీ ప్రాప్తప్రసవవేదన మతిదుఃఖసంవేగా దాత్మానం గంగాప్రవాహే నిక్షిప్తవతీ తదైవ తత్ర దారకద్వయంచ ప్రసూతా భగవతీభ్యాం పృథ్వీభాగీరథీభ్యా మభ్యుపపన్నా రసాతలం నీతా। స్తన్యత్యాగాత్పరేణ దారకద్వయంచ తస్య ప్రాచేతసస్య మహర్షేర్గంగాదేవ్యా సమర్పితం స్వయమ్.

2. మంథాదివ క్షుభ్యతి గాంగ మంభో వ్యాప్తం చ దేవర్షిభి రంతరిక్షమ్
ఆశ్చర్య మార్యా సహదేవతాభ్యాం గంగామహీభ్యాం సలిలాదుపైతి॥

3. ఏహి జాత కుశ- ఏహి జాత లవ- చిరస్య మాం పరిష్వజేథాం లోకాంతరా దాగతాం జననీమ్.

4. శైశవాత్ప్రభృతి పోషితాం ప్రియాం సౌహృదా దపృథగాశ్రయా మిమామ్
ఛద్మనా పరిదదామి మృత్యవే సౌనికే గృహశకుంతికా మివ.

అనియు—

"బొమ్మపైఁ బడి యెంతయు నమ్మి నిద్ర
పోవుగృహలక్ష్మిఁ బ్రియసతిఁ బూర్ణగర్భ
నిర్దికటికనై త్రోయఁగా నెంచినాఁడ
గ్రద్దలకు బలివైచెడు కరణి నకట-[1]

అనియు రాముఁడు విలపించెను.

దీనినిబట్టి సీత యడవిలో మృతినొందు ననుభయము రామునకుఁ దొలుతనుండియు నుండె నని తేటపడుచున్నది.

౨. ద్వితీయాంకమందు శంబూకవధానంతరము రాముఁడు పంచవటి సమీపించి-

"ఇంటనుబోలె నే నెచట నింతిని గూడి దినంబు లెన్నియే
నుంటి సుఖాన దేనికథ లుల్లముపొంగ సతంబుఁ జెప్పుకోఁ
గంటిమి యట్టి పంచవటిఁ గాంతను గోల్పడి పాపి రాఘవుం
డొంటిగఁ జూడఁగల్గెడినొ యొప్పరికించి చనంగ నోపునో-[2]

అని వితర్కించెను. "నాశితప్రియతమః" అనుటచేత సీత మృతినొంది యుండు ననియే రాముఁడు తలంచినట్లు స్పష్టపడుచున్నది. నాశితశబ్దమునకు అదృశ్య మనునర్థము చెప్పినను నలభ్యత్వమే సిద్ధించుచున్నది.

3. తృతీయాంకమందు వాసంతి యనువనదేవత—

"క్రూరుఁడా !
"యశము నీకెంతయును బ్రియ యనుగాదె
యింతకంటెను దుర్యశం బెద్ది చెపుమ

---

1. విస్రంభా దురసి నిపత్య జాతనిద్రా మున్ముచ్య ప్రియగృహిణీం గృహస్య లక్ష్మీమ్
ఆతంకస్ఫురితకఠోరగర్భగుర్వీం క్రవ్యాద్భ్యో బలిమివ దారుణః క్షిపామి.

2. యస్యాం తే దివసా స్తయా సహ మయా నీతా యథా స్వే గృహే
యత్సంబంధకథాభిరేవ సతతం దీర్ఘాభి రాస్థీయత
ఏకః సంప్రతి నాశితప్రియతమ స్తామేవ రామః కథం
పాపః పంచవటీం విలోకయతు వా గచ్ఛ త్వసంభావ్య వా.

భీతహరిణాక్షి యేమయ్యె విపినమందు
నెఱుఁగఁ జెప్పుము నా కది యెఱుఁగుదేని.[1]

అని యడుగఁగా—

"త్రస్తహరిణాక్షి పూర్ణగర్భ యయినసతి
మృదులబిసకాండకౌముదీమిత్రకోమ
లాంగలతికను క్రవ్యాదు లాక్రమించి
మాయ మొనరించియుండును మర్మమిదియ."[2]

అని రాముఁ డుత్తర మిచ్చెను. దీనివలన సీతాజీవితాశ రామునకు లేనట్లు కనఁబడుచున్నది.

౨. ఆయంకమందే గతించినదానికి వగవఁ బనిలేదు ధైర్య మవలంబింపు మని వాసంతిక పలుక—

"దేవి లేనట్టిజగతికిఁ దీఱెఁబమునో,కండువర్షముల్ పేరెనఁ గలదో లేదో
వసుధ రాముండు లేఁడన్న వార్త లేద,యింతకంటె ధైర్యమనఁగ నెందుఁ గలదు."[3]

అని ప్రతివచన మిచ్చెను. దీనినిబట్టి సీత జగత్తులో లేదనియే రాముఁ డూహించినట్లు స్పష్టపడుచున్నది.

౩. ఆయంకమందే రాముఁడు పూర్వవిరహముకంటెఁ బ్రస్తుతవిరహః దారుణమైన దని చెప్పఁ దలఁచి-

"ఇంతిని ద్రోల్లి పాసినది యెంతయుఁ గష్టము మైన నైరినా
యంతకు చెంతకుం బనుపుయత్నభరంబున నోర్వఁగంటి నా

---

1. అయి కఠోర యశః కిల తే ప్రియం కి మయశో నను ఘోర మతః పరమ్
కి మభవ ద్విపినే హరిణీదృశః కథయ నాథ కథం బత మన్యసే.

2. త్రస్తైకహాయనకురంగ విలోలదృష్టేః తస్యాః పరిస్ఫురితగర్భభరాలసాయాః
జ్యోత్స్నామయీవ మృదుబాలమృణాలకల్పా క్రవ్యాద్భి రంగలతికా నియతం విలుప్తా.

3. కిముచ్యతే ధైర్య మితి ?
దేవ్యా శూన్యస్య జగతో ద్వాదశః పరివత్సరః
ప్రణష్టమివ నామాపి న చ రామో న జీవతి,

వంతయు దీనికి నాఖలునిప్రాణములతోడుత నిప్పు డన్ననో
యంతములేని యీ ప్రవిలయంబు సహింప నశక్య మయ్యెడిన్. 1

అని ప్రస్తుతవిరహమున కంతము లేదని చెప్పి వెంటనే

''వానరాధిపుమైత్త్రి వమ్మయ్యె నెచ్చోట వానరశౌర్యంబు వ్యర్థమె చట
భల్లూకపతిప్రజ్ఞ పనికిరా దెచ్చోట ననిలజుం డెచ్చోటఁ గరుగనేరఁ
డలవిశ్వకర్మజుం డై నట్టినలుఁడును బాట యెచ్చోటికిఁ బన్నలేఁడు
సౌమిత్త్రిపటుబాణజాలంబులును గూడ సూటిగా నెచ్చోటఁ జొరఁగఁజాల
వట్టిగహనాతిగహనమై యమరునట్టి, బుద్ధికినిగూడఁ బోల్పఁగాఁ బోసఁగనట్టి
మాఱుమూలను నెచ్చోటమడఁగియుంటి, వఖిలగుణజాల యో ప్రియురాలబాల.[2]

అనుటచేత సీత నష్టమైన దనియే రామునినిశ్చయ మని నిస్సందేహ
ముగాఁ జెప్పవచ్చును.

౬. ఆఱవయంకమందు రాముఁడు సీతను దలఁచుకొని విలపించి విలపించి

చిట్టచివరకు -

"ఎడవడి దూరమందుఁ గలయిష్టుల ధ్యానము చేసిచేసి క
న్బడినవిధంబున న్సొగయవచ్చు నెలంత నశింప భావనన్
గడకనునైనఁ జేయ నవకాశము లేమిని విశ్వమెల్లఁ బే
రడవి యగు న్మనం బుముకయందు దహించినచంద మయ్యెడున్.[3]

అని యుపరమించెను. సీతామరణమందు రామునకు దృఢప్రత్యయ
మున్న ట్లిది స్పష్టపడుచున్నది.

1. ఉపాయానాం భావా దవిరళవినోదవ్యతికరై
ర్విమర్దై ర్వీరాణాం జనితజగదద్భుతరసః
వియోగో ముగ్ధాక్ష్యాః సఖలు రిపుఘాతావధి రభూ
త్కటు స్తూష్ణీం సహ్యో నిరవధి రయంతు ప్రవిలయః.

2. వ్యర్థం యత్ర కపీంద్రసఖ్య మపి మే వీర్యం హరీణాం వృథా
ప్రజ్ఞా జాంబవతో నయత్రనగతిః పుత్రస్య వాయోరపి
మార్గం యత్ర నవిశ్వకర్మతనయో కర్తుం నలోఽపిక్షమః
సౌమిత్రేరపి పత్రిణా మవిషయే తత్ర ప్రియే క్వాసి మే.

3. చిరం ధ్యాత్వా ధ్యాత్వా నిహిత ఇవ నిర్మాయ పురతః
ప్రవాసే చాశ్వాసం నఖలు నకరోతి ప్రియజనః
జగజ్జీర్ణారణ్యం భవతి హి కళత్రే వ్యుపరతే
కుకూలానాం రాశౌ తదను హృదయం పచ్యత ఇవ.

రామునకే కాక నాటకపాత్రములం దితరులకుఁగూడ నీనిశ్చయమే కలిగినది. ఇదిగోఁ జూడుఁడు.

(1) చతుర్థాంకమందు సౌధాతకిదాండాయనసంవాదములో దాండాయనుఁడు జనకుఁడు మాంసభోజనము మానె నని చెప్పి యందుకుఁ గారణ మేమని సౌధాతకి యడుగ "సీతాదేవి కట్టిదైవదుర్విపాకము సంభవించిన దని విని యాయన వైఖానసవ్రతము పూనె" నని చెప్పెను.[1]

ఇచ్చట "నట్టిదైవదుర్విపాక"మన నిందతోఁ గూడిన మరణ మని యూహింపవలయును.

(2) ఆయంకమునందే జనకుఁడు శోకోద్రేకముచే-

"తనయకుఁ గల్గినట్టి యతిదారుణమౌ దురితంబుచేత నా
మనమునఁ బాముకొన్న ఘనమన్యువు డెందముఁ గూడఁ జేయుచుం
దునియలుగాఁగ మర్మములఁ ద్రుంచుచుఁ దెం పొకయింత లేక తా
ననయముఁ బేర్చుచున్న దిది యాఱుట గల్గ దిఁకేమి చేయుదున్.[2]

అని విలపించి యాత్మఘాత చేసికొనుపక్షము నూహించి యట్లు చేసినచో మహానరకప్రాప్తి యగు ననుభయముచేత మాని యంతలో భూదేవి నుద్దేశించి-

"పూజ్యురాలవైన యోవసుంధరా ! నిజముగా నీవు గట్టిగుండెదానవే-

"ఇనుఁడును వహ్నియు న్మునులు నీవును గంగ వసిష్ఠుపత్నియుం
దనదుమహత్త్వముం దెలియు తద్జ్ఞులు వాక్కన విద్యపోలెఁ దా
జననమునందె నీవలన సంపరిశుద్ధయు నయ్యె నట్టినీ
తనయకుఁ గల్గినట్టి యతిదారుణహింసన మెట్లు లోర్చితో.[3]

---

1. యద్దేవ్యాః సీతాయాః తాదృశం దైవదుర్విపాక ముపశ్రుత్య వైఖానసః సంవృత్తః.

2. అపత్యే య త్తాదృ గ్దురిత మభవ త్తేన మహతా
విషక్త స్తీవ్రేణ వ్రణితహృదయేన వ్యథయతా
పటు ర్ధారావాహీ నవ ఇవ చిరేణాపి హి న మే
నికృంత న్మర్మాణి క్రకచ ఇవ మన్యు ర్విరమతి.

3. భగవతి వసుంధరే ! సత్య మతిదృఢాసి—
"త్వం వహ్ని ర్మునయో వసిష్ఠగృహిణీ గంగా చ యస్యా విదు
ర్మాహాత్మ్యం యది వా రఘోః కులగురు ర్దేవస్స్వయం భాస్కరః
విద్యాం వాగివ యా మసూత భవతీ శుద్ధిం గతాయాః పున
స్తస్యా స్త్వద్దుహితు స్తథా విశసనం కిం దారుణం మృష్యథాః.

అని యుపాలంభించి, దశరథునకును జనకును గలప్రేమానుబంధముఁ దలంచి-

“అల్లునాప్తులఁ బూజింతు రత్తవారు, అద్ది మనపట్ల విపరీత మయ్యె నరిగి
తీవు సంబంధబీజంబు నేగ నకట, బ్రతికియున్నాఁడ నేదుఃఖభాజనముగ.” [1]

అని విలపించెను.

(3) ఆయంకమందే వసిష్ఠుఁడు కళ్యాణోదర్క మగు నని చెప్పినట్లు, అరుంధతి కౌసల్యతోఁ జెప్పఁగా “మనోరథములే నశించిన నాకది సిద్ధించుటె”ట్లని[2] యుత్తర మిచ్చెను.

(4) మఱియు నాయంకమందే కౌసల్యయు జనకుఁడును లవునిజూచి యాతనిరూపమును బోల్చి సంభాషించుకొన్న కొంతసేపటికి జనకుఁడు-

“బాలునియందుఁ గాననగు బాలికపోఁడిమి రామునాకృతియుం
జాల స్వరూప మయ్యెడియ చక్కని కాంతియు నద్ది వాణియుం
శీలము నవ్వియే వినయసిద్ధియు నయ్యది-దేవి చిత్త మి
ట్లేలకొ కానిమార్గమున నేడ్తెఱతోడుతఁ బర్వు లెత్తెడిన్! [3]

అని పరితపించెను.

(5) ఆయంక మందె లవుఁడు సీతాపరిత్యాగమువఱకు రామాయణకథ నే నెఱుఁగుదు నని చెప్పిన జనకుఁడును గౌసల్యయు నిట్లు విలపించిరి.

కౌసల్య—హా వత్స! ముగ్ధలగుమ్మా! ఏకాకిని వైననీశరీరకుసుమమున కిప్పు డెట్టిదైవదుర్విలాసము ఘటిల్లెను ?[4]

---

1. కన్యాయాః కిల పూజయన్తి పితరో జామాతు రాప్తం జనం
సంబంధే విపరీత మేవ తదభూ దారాధనం తే మయి
త్వం కాలేన తథావిధో ప్యపహృతః సంబంధబీజం చ త
ద్ఘోరే స్మి న్మనుజీవలోకనరకే పాపస్య ధి గ్జీవితమ్.

2. కుతో౽తిక్రాంతమనోరథాయా మ మేతత్.

3. వత్సాయా శ్చ రఘూద్వహస్య చ శిశా వస్మి న్నభివ్యజ్యతే
సంవృత్తిః ప్రతిబింబితేవ నిఖిలా సైవాకృతిః సాద్యుతిః
సా వాణీ వినయ స్స ఏవ సహజః పుణ్యానుభావో ప్యసౌ
హాహా దేవి కిము త్పథై ర్మమ మనః పారిప్లవం ధావతి.

4. కౌసల్యా- హా వత్సే! ముగ్ధముఖి. క ఇదానీం తే శరీరకుసుమస్య ఝటితి దైవదుర్విలాసపరిణామ ఏకాకిన్యా నిపతితః.

జనకుఁడు — హావత్సే.

"ఓరువరాని యాపరిభవోగ్రతచే మతి సంతపింపఁగా
ఘోరవనంబు మధ్యమునఁ గ్రూరమృగంబులు చుట్టి భీకరా
కారత నార్వఁగాఁ బ్రసవకాలపువేదనఁ బొక్కుచు న్నిరా
ధారను గావుమయ్య నను దండ్రి యటంచును నెంత యేడ్చితో."[1]

సీత మరణము నొందిన దన్నబుద్ధి లేనిదే వీరికింతదుఃఖము కలుగనేరదు.

(6) పంచమాంకమందు సుమంత్రుఁడు లవునిరూపము పరికించి రాముని పుత్త్రుఁ డనునూహాపొడమ—

"హృదయమా! వేఱుదారిని బరువెత్తెద వేల?
విధివశంబునఁ జెడె దాని బీజ మపుడ
యిఁక మనోరథ మీడేఱు టెట్లు లకట
మున్ను తీవయె తెగిపోయి యున్నచోటఁ
బూవు లాతీవ వెండియుఁ బూచు టెట్లు."[2]

అని యాయూహను మరలించుకొనియెను. సీత నష్టమైన దని కాక వేఱొక యర్థమున కిచ్చట నవకాశము లేదు.

ఈయుదాహరణము లన్నిటంబట్టి రామునకు నితరులకుఁ గూడ సీత మరణము నొందిన దనుదృఢవిశ్వాస ముండె నని నిరాఘాటముగా సిద్ధించుచున్నది.

ఏవిధమునను జూచినను రామునకు సీతామరణమునందు దృఢ ప్రత్యయ మున్న దని సహృదయులకుఁ దోఁపక మానదు. దుఃఖాతిరేకముచే నట్లు విలపించెను గాని సీత మృతినొందె నని చెప్పుట రామునితాత్పర్యము గా దని విప్రలంభవాదు లందురు. దుఃఖాతిరేకముచేత నైనను సీత మృతినొందిన దను

1. జనకః— హావత్సే!
నూనం త్వయా పరిభవంచ వనంచ ఘోరం
తాం చ వ్యథాం ప్రసవకాలకృతా మవాప్య
క్రవ్యాద్గణేషు పరితః పరివారయత్సు
సంత్రస్తయా శరణ మి త్యసకృత్ స్మృతో౽స్మి.

2. హృదయ కిమన్యథాపరిప్లవసే.
మనోరథస్య య ద్బీజం త ద్దైవే నాదితో హృతమ్
లతాయాం పూర్వలూనాయాం ప్రసవ స్యోద్భవః కుతః.

కాని రాముఁ డట్లు విలపించెనా లేక జీవించియున్నదని నమ్మియు విలపించెనా! జీవించియున్న దనునమ్మకము రామున కున్న దని చెప్పుట కాధారములు లేవు. అట్టినమ్మక మున్నచో నాతని కంతదుఃఖము కలుగనేరదు. రామునిశోకానుభవము మనమునఁ బట్టించికొన్నవారికి సీతాజీవితాశ యాతని కున్న దను నూహ కలుగదు. ఆశోకానుభవ మెట్టిదో యించుకచూతము.

(1) సీతను బరిత్యజింప నిశ్చయించుకొని యామెను విడిచి లేచివచ్చి—

"అయ్యో యిప్పుడు జీవలోకము తాఱుమాఱైనది. రాముఁడు జీవించి యుండుటకుఁ బ్రయోజనము నేఁటితోఁ దీఱినది. జగత్తు శూన్యారణ్యమైనది. సంసార మసారము. శరీరము కాష్ఠప్రాయము. దిక్కు లేనివాఁడ నైతిని. ఏమి చేయుదును! నాకు గతి యేది! ఔను.

శోకానుభూతికొఱకే, నాకీ చైతన్య మిచ్చె నాళీకభవుం
డీకఠినాసులు వజ్రము, లై కీళులఁ బ్రిదులఁగొట్టు ననయం బకటా![1]

అని విలపించెను.

(2) శంబూకవధానంతరము రాముఁడు పంచవటి సమీపించుచుఁ బూర్వపరిచితస్థలములఁ జూచుటచే శోక మతిశయింప—

"ఊరక యుండి యుండి కడు నుగ్రతఁ దాఁకు విషంబుపోలికిన్
సారయుతంబుగా వదలఁ జయ్యనవచ్చు నలుంగులాగునన్
దారుణహృద్వ్రణంబు పయిఁ దద్దయు నొవ్వఁగఁ గొట్టినట్టులం
గ్రూరత నాఁటి శోక మిదె క్రొత్తది వోలె నలంచు నక్కటా![2]

అని విలపించెను.

---

1. హంత సంప్రతి విపర్యస్తో జీవలోకః అద్యావసితం జీవితప్రయోజనం రామస్య. శూన్య మధునా జీర్ణారణ్యం జగత్. అసారః సంసారః. కాష్ఠప్రాయం శరీరం. అశరణోస్మి. కిం కరోమి, కాగతిః. అథవా—

దుఃఖసంవేదనాయైవ రామే చైతన్యమాహితమ్
మర్మోపఘాతిభిః ప్రాణై ర్వజ్రకీలాయితం హృది.

2. చిరాద్వేగారంభీ ప్రసృతఇవ తీవ్రోవిషరసః
కుతశ్చిత్సంవేగాత్ప్రచలఇవ శల్యస్య శకలః
వ్రణోరూఢగ్రంథిః స్ఫుటితఇవ హృన్మర్మణిపునః
పురాభూతః శోకో వికలయతి మాం నూతన ఇవ.

(3) ఆసమయమందే మురల రాముని శోక మిట్లు వర్ణించెను.

"అతిగభీర మగుట నగపడదు పయికిఁ, గాని లోన మిగులఁ గనలుచుండుఁ గుతకుత మనుచు నుడుకు పుటపాకముగతి, గురుతరమగు రాముకరుణరసము.

అట్టియిష్టజనకష్టవినిపాతమువలనఁ గలిగినదీర్ఘశోకముచేత రాముఁ డిప్పు డెంతయు క్షీణించియున్నాఁడు. ఆతనిని జూడఁ గుసుమసమబంధన మగు నాహృదయము వడఁకుచున్నది"[1] అని.

(4) పంచవటిని దర్శించినప్పుడు రాముఁడు—

"ఈపంచవటీదర్శనముచేత—

అకటమోహంబు నన్నిప్పు డలమికొనియె
నంతరంగంబులోపల నింతవట్టు
నడఁగి యుండి యుండి యిపుడుకడఁకరవిలి
మిగులవ్యాపించుదుఃఖాగ్నిపొగయనంగ.

హా ప్రియురాల ! జానకి ![2]

అని విలపించెను.

(5) ఆసందర్భమందే రాముఁడు—

అయ్యో,

"బలువగ బీఁటవాఱు నెద బ్రయ్యదు రెండగునట్లు మోహ మ
గ్గలమయి చాలఁ జేష్టచెడుఁ గాయము తెల్విఁ నశింపఁ బోదు లో
పలియుడు కట్టె కాల్చు మఱి భస్మము చేయదు మేను నంగసం
ధులు శిథిలంగ మోదు మఱి త్రుంపదు ప్రాణము దైవ మక్కటా.

ఓహో,

"జనపదవాసులార ! పురసజ్జనులార ! వినుండి యింటిలో
జనకజ యుంట మీ కది యసమ్మత మయ్యెను శూన్యకాననం

---

1. అనిర్భిన్నో గభీరత్వా దంతర్గూఢఘనవ్యథః
పుటపాకప్రతీకాశో రామస్య కరుణోరసః—
తేనచ తథావిధేష్టజనకష్టవినిపాతజన్మనా ప్రకృష్టగద్గదేన దీర్ఘశోకసంతానేన సంప్రతి పరిక్షీణో రామభద్రః । తమవలోక్య కంపిత మివ కుసుమబంధనం మేహృదయమ్.

2. అనేన పంచవటీదర్శనేన-
అంతర్లీనస్య దుఃఖాగ్నే రద్యోద్దామం జ్వలిష్యతః
ఉత్పీడ ఇవ ధూమస్య మోహః ప్రాగావృణోతి మామ్.
హా ప్రియేజానకి !

బునఁ దృణమట్లు వీడినను బుట్టద జాలి తలంపు లెంతయు
న్మనమును నీఱుసేయ గతిమాలుట నేర్చెద నల్గఁబోకుఁడీ.[1]

అని యేడ్చెను.

(6) మఱియు నాసందర్భమందే రాముఁడు —

"వాసంతీ, నేను—

కొఱవిని ద్రిప్పినట్లు విషగుంభితదంతము నాటినట్టులున్
గురుతరతీవ్రతన్ హృదయకోశమునందలి కీల్లు గోయుచున్
బిరబిర శోకశంకువిదె వేగముతోడుతఁ జీల్చుచుండఁగా
స్థిరమతితో సహించితిని దీనికి నంతము గల్గు టెన్నఁడో.[2]

అని దుఃఖించెను.

(7) పంచవటియందే సీత తన కగపడినట్లు భ్రమించి రాముఁడు—

"కఠినురాలా! జానకీ! ఇక్కడ నక్కడ నగపడుచునే యున్నదానవు. నామీఁద మాత్రము దయలేదు, నీకు, హా! దేవి!

హృదయము వ్రక్కలయ్యెడు దహించెడు లోపలితాప మెప్పుడుం
బ్రిదిలెడు దేహబంధములు విశ్వము శూన్యము గాఁగఁ దోఁచెడున్
ముదిరిన చిమ్మచీఁకటిని మున్గెడుఁ జిత్తము జ్ఞానశూన్యమై

1. కష్టం భోః కష్టమ్.

దలతి హృదయం శోకోద్వేగా ద్విధాతు న భిద్యతే వహతి వికలః కాయో మోహం న ముంచతి చేతనాం। జ్వలయతి తనూ మంతర్దాహః కరోతి న భస్మసా త్ప్రహరతి విధి ర్మర్మచ్ఛేదీ నకృంతతి జీవితమ్.

హే భగవంతః పౌరజానపదాః—

నకిల భవతాం దేవ్యాః స్థానం గృహే భిమతం। తత స్తృణమివ వనే శూన్యే త్యక్తా నచాప్యనుశోచితా। చిరపరిచితా స్తేతే భావా స్తథా ద్రవయంతి మా। మిద మశరణై రద్యాస్మాభిః ప్రసీదత రుద్యతే.

2. అయి వాసంతి మయాఖలు-

యథా తిరశ్చీన మలాతశల్యం ప్రత్యుప్త మంతః సవిషశ్చదంతః
తథైవ తీవ్రో హృది శోకశంకు ర్మర్మాణి కృంత న్నపి కిన్న సోఢః॥

గదురుచు మోహ మెల్లెడలఁ గప్పెడు నక్కట యేమిసేయుదున్.[1]

అని మూర్ఛిల్లెను.

ఇట్టి పట్టు లింకనుం గలవు. ఇట్లీయుత్కటశోకము ప్రత్యాశ యే మాత్రమున్నను గలుగనేరదు. కావున రామునకుఁ బ్రత్యాశయే లేదని చెప్ప కతప్పదు.

మఱియు సప్తమాంకమునం దంతర్నాటికానంతరము సీత గంగలో నుండి వెడలి వచ్చి సాక్షాత్కరించినపు డామెను జూచి రాముఁడు మూర్ఛ నొంది యరుంధతియాజ్ఞానుసారముగా సీత యాతనిస్పృశింపఁగాఁ దెలివివచ్చి "అహో యిదేమిటి" అని సహర్షాద్భుతముగఁ బరికించి "ఏమి! దేవియైనజాన కియా"[2] అని పలికెను. ప్రేమపాత్రురాలైనసీత తిరిగి కనఁబడినందుకు హర్ష మును దలఁపనితలంపుగా వచ్చినందు కద్భుతముం గలిగిన దని తాత్పర్యము. ఇది యాతయుఁ దలఁపనితలంపుగాఁగలిగినది, కావుననే, రామునకు మూర్ఛ వచ్చినది. చిట్టచివరకు అరుంధతి రామునితో—

"అధ్వరమునాఁటి జాంబూనదాకృతికిని,మూలమైనట్టిప్రియురాలి ముద్దరాలి
ధర్మ మెప్పుడుఁ దప్పని ధన్యురాలి, ధర్మపద్ధతి నేలుమో ధరణినాథ."[3]

అన్నప్పుడు సీత తనలోఁదాను-

"ఆర్యపుత్త్రుఁడు సీతదుఃఖమునుబోఁగొట్టెడునా?—[4]అని సందేహించి రాముఁ డరుంధతికి "మీసెలవుప్రకారమే"[5] యని ప్రత్యుత్తరమీయ "తి రిగి బ్రతికితిని"[6] అని పలికెను. అరుంధతిమాటను బట్టి తన్ను రాముఁడు తిరుగఁ బరిగ్రహింపఁడేమో యను సందేహము సీతకుఁ గల్గినది.

---

1. అయి చండి జానకి ! ఇతస్తతో దృశ్యసే నా నుకంపసే-
హాహాదేవి స్ఫుటతిహృదయం ధ్వంసతే దేహబంధః । శూన్యం మన్యే జగ దవిరలజ్వాల మంతర్జ్వలామి। సీద న్నంధేతమసి విధురో మజ్జతీ వాంతరాత్మా । విష్వఙ్మోహః స్థగ యతి కథం మందభాగ్యః కరోమి॥
2. (సమాశ్వస్యసానందం) భోః కిమేతత్ (దృష్ట్వా సహర్షాద్భుతం) కథం దేవీ! జానకీ.
3. నియోజయ యథాధర్మం ప్రియాం త్వం ధర్మచారిణీమ్ ।
హిరణ్మయ్యాః ప్రతికృతేః పుణ్యాం ప్రకృతి మధ్వరే॥
4. అపిజానా త్యార్యపుత్రః సీతాయా దుఃఖం పరిమార్ష్టుం?
5. యథా భగవత్యాదిశతి.
6. ప్రత్యుజ్జీవితాస్మి.

మఱియు సీతాసమాగమ మైనవెంటనే లవణాసురుని జయించి శత్రుఘ్నుఁడు వచ్చినాఁ డనువార్త విని రాముఁడు "ఇది యంతయు ననుభవించు చున్నను నమ్మఁజాలకున్నాఁడను. అభ్యుదయములరీతి యిట్టిదేకాఁబోలు"1 నని పలికెను. "ఇది యంత యు" నన్నప్పుడు సీతాపునర్లాభము ను శత్రుఘ్నవిజయము నేకకాలమందుఁ గలుగుట. ఇందు రాముఁడు నమ్మఁజాలనిది సీతాపునర్లాభమే గాని శత్రుఘ్నవిజయము కాదు. ఇది కూడఁ బ్రత్యాశా భావమునే తెలుపుచున్నది.

**III.** సీత జీవించియున్న దనునిశ్చయజ్ఞానము గాని సందేహము గాని యొకవేళ రామునకున్నదనుకొన్నను దానిమూలమునఁ బ్రత్యాశ యున్నదని చెప్ప నవకాశము లేదు. ఏలన:—సీత పవిత్రచరిత్ర యని యెఱిఁగియుండియు లోకు లామెపై నారోపించిన దోషమునుబట్టి లోకానురంజనమే పరమధర్మ మని యెంచి ప్రాణసమానురా లైనయామెను విడిచిపెట్టిన రాముఁడు తిరిగి యాభార్యం దీసికొని వచ్చి యామెతో సంసారముచేయఁదలఁచు నని యూహించుట కవకాశము లేదు. అట్టి తలంపేమాత్ర మున్నను రాముఁడు ధీరోదాత్తుఁడు కాకపోవలసివచ్చును. అట్టితలంపే రామునకున్నచో నశ్వమేధయాగసంకల్పకాలమం దామెను దెచ్చుటకు యత్నము చేసియుండును. అట్లు చేయక సీతాప్రతికృతితోఁ గూడి యాగ మొనర్చెను.

ఎన్నివిధములఁ జూచినను సీతాపునస్సమాగమాశ రామునకు లే దని చెప్పకతప్పదు. ప్రత్యాశ లేక రాముఁ డనుభవించినశోకము కేవల కరుణమే యగును. అప్రతర్క్యముగాఁ జిట్టచివరకుఁ గల్గిన పునస్సమాగమమువలనఁ గలిగినహర్షముచేఁ బుట్టినరసము కేవల శృంగారమే యగును. ఈ రెండింటికి నంగాంగీభావము లేదు. ఇది సిద్ధాంతము.

ఈ సిద్ధాంతమునకు విప్రలంభవాదులు చెప్పునాక్షేపములఁ బరిశీలింతము.

వేంకటరాయశాస్త్రులుగారు ప్రత్యాశ లేకయే విప్రలంభశృంగారము కావచ్చు నని చెప్పుటకు రెండుపపత్తులు కనఁబఱిచినారు. "శాకుంతలమందు శాపక్షణము మొదలు, అంగుళీయకదర్శనక్షణపర్యంతమును దుష్యంతునికి

---

1. సర్వమిదమనుభవన్నపి నప్రత్యేమి, యద్వాప్రకృతిరియమభ్యుదయానాం!

శకుంతలయందు ఎట్టిరతిగాని ఎట్టియాశగాని లేదు. మఱి ప్రత్యాశ లేదని చెప్పవలయునా ?" అని మొదటియుపపత్తి- ఈప్రశ్నమున కుత్తరము శాస్త్రులుగారే యిట్లు చెప్పినారు. "అంగుళీయకదర్శనానంతరము ఆశగలదేగాని ప్రత్యాశ ఏమో?" అని. "ప్రత్యాశ ఏమో?" అనుటలో శాస్త్రులుగారిభావ మేమో తెలియకున్నది. అంగుళీయకదర్శనానంతరము ప్రత్యాశ యున్నదనియే చెప్పవలసియున్నది. విప్రలంభమున కది చాలును. అంగుళీయకదర్శనమునకుఁ బూర్వము శాపప్రభావముచేత దుష్యంతునకు మఱపు పుట్టినది. ఈయవస్థ మూర్ఛవంటిది. అం దేరసమును లేదు.

"మాలతియందు ప్రత్యాశాసందేహము కలదు:—

"స యత్ర ప్రత్యాశా మనుపతతి నో వా రహయతి ।

ప్రవిక్షిప్తం చేతః ప్రవిశతిచ మోహాంధతమసమ్" ఇత్యాది-

పూర్వోదాహృతలక్షణవాక్యములవలన ప్రాయికముగా అనురక్తస్త్రీపురుషులలో ఒకరు మృతిఁజెందిన ఆద్వితీయులు ప్రలపించుట పునస్సంగము లేకున్న కరుణ మగును. పునస్సంగ మున్న కరుణవిప్రలంభ మగును అని యేర్పడుచున్నది.'' అని శాస్త్రులుగారి రెండవయుపపత్తి. ప్రత్యాశ లేకయే పునస్సంగ మున్నమాత్రాన విప్రలంభశృంగార మగు నను మాట పూర్వోదాహృతలక్షణవాక్యములకు విరుద్ధముగా వనఁ జెల్లఁదగినది కాదు. మాలతీమాధవశ్లోకమునకు ప్రత్యాశ లేదని యర్థము కాదు. మనస్సు ప్రత్యాశ నవలంబించుటయు లేదు విడుచుటయు లేదు అని శ్లోకార్థము. ప్రత్యాశయున్నదనియే దీనిభావము. ఈవాక్యము కథానాయకుఁ డైనమాధవునిది కాదు. మకరందునిది. కథానాయిక యగుమాలతి జీవించియున్నదా లేదా యనుసంశయము కలుగుటచేత మాధవునిచిత్త మత్యంతము కలఁతఁ జెందినది. సీత జీవించియున్న దనునమ్మకము రామున కున్నను పునస్సంప్రత్యాశ యుండఁగూడదు కదా !

ఇట్లు వాదించి యుఁ జిట్టచివరకుఁ బ్రత్యాశ యుండవలయునను వాదము నంగీకరించి శాస్త్రులుగారు "ఈనాటకమున రతి నాశమొందక ఉత్కటముగా నున్నందునను ప్రత్యాశయుఁ గలిగినందునను అంగి విప్రలంభమయినది. అని సిద్ధాంతము" అని సిద్ధాంతీకరించిరి. ఈసిద్ధాంతము నిలువఁదగినది కాదు. రతి యుత్కటముగా నున్న దనుటకు శాస్త్రులుగా రుదాహరించిన

వాక్యము లన్నియు, సీతను దలఁచికొని రాముఁడు విలపించినపట్లు. ఇచ్చట రతి శోకమును బోషించుటకే పనికివచ్చును గాని విప్రలంభమును సూచింపదు. ప్రీతిరూపక మగురతి లేక శోకము పుట్టదు. ఇష్టవస్తువియోగమువలననే గదా శోకము పుట్టును. విప్రలంభశృంగారమునందలి రతి సంగసమీహారూపకము. అట్టిరతి యీనాటకమందు లేదు.

ప్రత్యాశ కలదనుటకు శాస్త్రులుగారు-

"వస్తుస్థితి యిట్లున్నను ప్రత్యాశ లేనిదే విప్రలంభ మెట్లగును" అనఁగూడదు. ఏలన, ఋశ్యశృంగాదుల వాక్యములయందు రామునికి విశ్వాసము ఎప్పుడును అవ్యాహతము" అని చెప్పి యందునకుఁ బ్రమాణములుగాఁ బ్రథమాంకమందలి "లౌకికానాం హి సాధూనా" మిత్యాదిశ్లోకమును, "తత్పాత్ర పూర్ణోత్సంగా మాయుష్మతీం ద్రక్ష్యామః" అను ఋశ్యశృంగవాక్యమును, చతుర్థాంకమందలి "ఆవిర్భూతజ్యోతిషాం బ్రాహ్మణానా" మిత్యాది యరుంధతి వాక్యమునుదాహరించిరి.ఇందు మొదటిశ్లోకము"కేవలం వీరప్రసవాభూయాః-" "వీరమాతవు కమ్ము"-అని సీతకువసిష్ఠుఁడు చేసినయాశీర్వాదము నష్టావక్రునివలన విని రాముఁ డన్నమాట. ఇదియు ఋశ్యశృంగుని యాశీర్వాదమును సీతకుఁ గుశలవులఁ గనుటచేతనే చరితార్థము లయినవి. ఆమాటలు పుట్టినప్పటికి రామునకు సీతావియోగము కలుగలేదు. వారిరువురకుఁ బునస్సమాగమ మగునని యాశీర్వదించుటకు నిమిత్తమే లేదుగదా !

"ఆవిర్భూతజ్యోతిషా" మిత్యాదిశ్లోకము కౌసల్యతో నరుంధతియన్నమాట- అందులోనుదాహృతమయిన "కల్యాణోదర్కం భవిష్యతి'' యనువసిష్ఠవాక్యము ఋశ్యశృంగాశ్రమమం దన్నది. అది రామునకుఁ దెలియదు. దాని నాధారము చేసికొని రాముఁడు ప్రత్యాశనొందు టెట్లు ?

నాటకమునకు శృంగారవీరరసములు రెంటిలో నేదో యొకటి యంగిగా నుండవలయు నని నాటకలక్షణము కావున నీనాటకమందుఁ గరుణ మంగియగుట పొసఁగ దని యిం కొకవాదము. "శృంగారము గాని వీరము గాని యొకటే అంగిగా నుండవలయును. తక్కినరసము లన్నియు నంగములుగా నుండవచ్చును. నిర్వహణమం దద్భుతముండవలయు"నని సాహిత్యదర్పణము [1]

1. ఏకఏవ భవే దంగి శృంగారో వీరఏవవా ।
అంగ మన్యేరసాః సర్వే కార్యోనిర్వహణే ద్భుతః॥

దీనికి టీక యిట్లున్నది:—

ఉత్కర్షాధానమునిమిత్త మొక్కరసమునే యంగిని చేయవలయు నని (దీని)యర్థము. శృంగారముగాని వీరముగాని యని యారసములఁ జేర్చొనుట సముచితరససూచకము. దీనివలన నుత్తరరామచరితమందు కరుణమునకును, ప్రబోధచంద్రోదయమందు శాంతమునకు నంగిత్వ మవ్యాహతము. కావుననే ధ్వనికారుఁడు—

ప్రబంధమున కుత్కర్షము కలిగించుటకై ప్రసిద్ధ మగునానారసనిబంధనములలో నేదో యొకరసము నంగిగాఁ జేయవలయు'' నని చెప్పెను.[1]

ఈటీకావాక్యముచేత నీయాక్షేపము ప్రతిహత మయినది. భవభూతి వీరరసప్రధానముగా మహావీరచరిత్రయు, శృంగారరసప్రధానముగా మాలతీమాధవమును రచించి కరుణరసప్రధానముగా నీయుత్తరరామచరితనాటకము చించిన ట్లగపడుచున్నది. నాటకము సుఖాంతముగా నుండవలయు నను నూహతోఁ జివర సీతారాముల పునస్సమాగమ మతికెను. ఆయతు కతుకుగానె యున్నది గాని యేకాన్వయ మగునట్లు పూర్వకథతోఁ గలిసిపోలేదు.

మృతినొందిన భార్యకుఁ బ్రతికృతిచేయించి యాదియే సహధర్మచారిణిగా యజ్ఞ మొనరించుట ధర్మశాస్త్రవిరుద్ధము కావున సువర్ణవికార మగుసీతాప్రతికృతితో నశ్వమేధము చేయఁబూనినరామునకు సీతాజీవితత్వనిశ్చయ మున్నద నక తప్ప దని వేఱొకవాదము. దీనికిఁ బ్రమాణముగా-

''యస్యభార్యా విదూరస్థా, పతితా దూషితాపివా
అనిచ్ఛుః ప్రతికూలావా, తస్య ప్రతికృతౌ క్రియా.

అనుశ్లోక ముదాహరింపఁబడినది. సీత జీవించియున్న దనుకొన్నను, ఈధర్మశాస్త్రవాక్యమున కిచ్చటఁ బ్రవృత్తి యెట్లో విప్రలంభవాదులు చెప్పవలసియున్నది. "విదూరస్థా" యనుపద్దులోఁ బడవలయును గాని సీత

---

1. "ఉత్కర్షాధానాయ ఏకఏవ రసోంగిత్వేన నివేశయితవ్య ఇత్యర్థః। శృంగారో వీరో వేతి కథనంతు సముచితరససూచకం। తేనోత్తరరామచరితే కరుణస్య ప్రబోధచంద్రోదయే శాంతస్య చాంగిత్వ మవ్యాహతం॥

అతఏవోక్తం ధ్వనికృతా—

ప్రసిద్ధేపి ప్రబంధానాం నానారసనిబంధనే। ఏకోరసోంగీకర్తవ్య స్తేషా ముత్కర్షమిచ్ఛతా ఇతి—

మఱియొకపద్దులోఁ జేరుట కవకాశము లేదు గదా। ఈపట్టున విదూరస్థ యనఁగా యజ్ఞకాలమునకు వచ్చుటకు సాధ్యముకానంత దూరమందున్న దని చెప్పవలయును. సీత యంతదూరములో నున్నదా ? లేదు. వాల్మీకితపోవన సమీపమందుఁ గదా లక్ష్మణుఁ డామెను విడిచినది. అది యయోధ్య కత్యంత దూరము కాదు. ఏమాత్రము ప్రయత్నముచేసినను యజ్ఞమున కామెను రప్పించుట కవకాశ మున్నది. అట్టి యత్నమే జరుగలేదు. ఇదియుఁ గాక, నాటకమునుబట్టి యజ్ఞసంకల్పకాలమందు సీత రసాతలమం దున్నది. రసాతల మం దున్నను విదూరస్థే యందురా? అట్లయిన మృతినొందిన దానిని గూడ విదూరస్థగా నేల యెంచరాదు? సీతాజీవితత్వమందు రామునకు నిశ్చయజ్ఞాన మారోపించుట కాధారము లేమియు లేవు. బంగారుసీతతో నశ్వమేధము చేయుట వాల్మీకిరామాయణమందే యున్నది. రామాయణమం దున్న దానినే గ్రహించి భవభూతి దానికి మెఱుఁగుపెట్టెను. సీత నష్టమయినదని యెంచియు నామె బొమ్మనే పెట్టుకొని యశ్వమేధము చేయఁబూనుట రామునకు సీత యందుఁ గలప్రీతి కుత్కర్షము కలిగించుచున్నది. దీనిని పెద్దగుణముగా గ్రహిం పవలసియుండఁగా ధర్మశాస్త్రదృష్టిచే దోష మని వాదించువాదము సరస మయినవాదము కాదు.

ఏవిధమునఁ జూచినను సీతాపునస్సమాగమవిషయములో రామునకు సమీహ గాని ప్రత్యాశ గాని యున్నదనుట కాధార మేమియు లేదు. కావున నీనాటకమందు ప్రధానరసము కరుణమె యని సిద్ధాంతము.

# గ్రంథస్వీకారము.

ఆర్యులజన్మస్థానము:—(The Home of the Aryas, by Pandit Lakshmidhar Kalli, M. A. M. O. L. Delhi University Publication No. 2.) ఈ గ్రంథము ఢిల్లీవిశ్వవిద్యాలయమునందు సంస్కృతపండితులగు లక్ష్మీధరపండితునిచే నాంగ్లమున రచియింపఁబడినది. గ్రంథకర్త రచియించిన కాళిదాసునిజన్మస్థాన మనుగ్రంథ మీపత్రికయం దిదివఱలో విమర్శింపఁబడినది—ప్రాచీనార్యులు ప్రథమమున యూరపుఖండమునఁ గాని మధ్యాసియాయందుఁ గాని నివసించి రనియు నచ్చటనుండి కాలక్రమమున నితరదేశములకు వలసపోయి రనియు ప్రాచ్యపాశ్చాత్యపండితులు చర్చించియున్నారు. కీ. శే. బాలగంగాధరతిలకుపండితులు తమగ్రంథమున (Arctic Home of the Vedas) వేదములందలి విశేషాంశములను సంగ్రహించి ఆర్యులు వేదములు రచియించినపు డుత్తరధ్రువమునకు సమీపమున నివసించి రని సిద్ధాంతీకరించిరి. పామీరుపీఠభూమియే వారిప్రథమనివాసస్థాన మని మానియరువిల్లియముగారును, యూరపుఖండమే యని లాతము, బెన్ఫీ, గీగరు, పోష్ మొదలగువారును తమతమసిద్ధాంతముల కనుగుణముగఁ జర్చించిరి. లక్ష్మీధరపండితులు వారిసిద్ధాంతముల నిరాకరించి, హిమాలయపర్వతములందలి సప్తసింధూప్రాంతమే వారిజన్మస్థానమై యుండు నని విపులముగఁ జర్చించి నిర్ణయ మొనర్చియున్నారు. వీరియాశయములు భాషాపరిణామశాస్త్రవేత్తల యభిప్రాయములతో నేకీభవింపకపోయినను, వీరిగ్రంథ మందఱకు నాదరణీయ మని చెప్పనగును. గ్రంథకర్తగారి నూతనదృక్పథము ననుసరించి, పండితు లార్యుల జన్మస్థాననిర్ణయమునకై యత్నింపవలసియున్నది.

---

శ్రీసనాతనధర్మము—ఇది రాజమహేంద్రవరము హిందూసమాజము వారిచేఁ బ్రచురింపఁబడినది. దీనిని బరిషత్కార్యాలయమునకు మ॥ రా॥ న్యాపతి సుబ్బారావుపంతులు బి. ఏ., బి. యెల్., గారు దయతోఁ బంపించిరి. ఇందు ధర్మాధ్యాయము, ప్రమాణాధ్యాయము, సాధనాధ్యాయము, తత్త్వాధ్యాయము నని నాల్గుభాగములు. ప్రతిభాగమునను ధర్మప్రకరణము, శ్రుతి ప్రకరణము, ననియిట్లు 3, 5, 10, 6 ప్రకరణములు గలవు. 285 పుటలు

డ. క్రై. సనాతనధర్మముల ముఖ్యోద్దేశము బాగుగాఁ దెలిసికొనఁజాలక పాశ్చాత్యనాగరకతాసంపర్కమున నిరసనభావముం జూపుచున్నవారికిని విద్యార్థులకును గృహస్థులకును సాధారణజ్ఞానవంతులకును సులభముగాఁ దెలియునట్లు నడుమనడుమ శ్లోకములతోఁ జక్కనివచనమునఁ దాత్పర్యముతో బహువిధములగు ధర్మబోధ లిందుఁ జేయఁబడినవి. రాజమహేంద్రవరపు హిందూసమాజమువారీగ్రంథమునందుఁ బరీక్షలుగావించి బహుమతులంగూడ నిచ్చుచుందురు. ఇహపరసాధనమైన ప్రోత్సాహముం గలిగించు నీసమాజమువా రెంతయు వందనీయులు. ఈ గ్రంథమందలి వాక్యశైలిం జిత్తగింపుఁడు-

"ధరించునది కావున ధర్మ మనియు విశ్వమంతయు దీనిచే ధరింపఁబడుచున్నది గావున ధర్మ మనియు పండితులు ధర్మశబ్దమునకు వ్యుత్పత్తిని జెప్పుచున్నారు. లోకములోని ప్రతివస్తువునకు నేదో యొకముఖ్యమైన నైసర్గికధర్మమున్నది. అది యాధర్మమును విడిచిపెట్టినయెడల నాశముఁ జెందును. అగ్నికి వేఁడి, జలమునకు ద్రవత్వము, సూదంటుఱాతికి లోహమునాకర్షించుశక్తి, ఇట్టివి ధర్మములు. ఇట్లే మనుష్యునకు మనుష్యత్వము ధర్మము. పశువునకుఁ బశుత్వము ధర్మము. అనఁగా నేశక్తి లేకపోయిన మనుష్యుఁడు మనుష్యుఁడుకాఁడో పశువు పశువుకాదో ఆశక్తియే ధర్మ మగును."

ఇంతస్పష్టముగాఁ జెప్పినను గ్రహింపఁజాలనివా రుందురా ? ఇంతకంటె ధర్మవిషయము తేలికగాఁ దెల్పుమాటలు గలవా ? ఆంధ్రలోక మీసమాజమువారి గ్రంథములం జదివి యానందించుంగాక. మతాభిమానము దృఢపడుంగాక. దీని వెల రు 1—0—0. రాజమహేంద్రవరములోఁ బైసమాజమువారియొద్దనే దొరకును.

---

భారతీయచిత్రకళ—

గ్రంథకర్త శ్రీయుత తలిసెట్టి రామారావు, బి.ఏ., బి. ఎల్., గారు. ప్రకాశకులు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు. ఆంధ్రగ్రంథమాలలో నిది ౧౩ వ కుసుమము. ఇందుఁ బండ్రెండధ్యాయములలో హైందవచిత్రలేఖనోదయము, బౌద్ధులకాలము, అజంతగుహలు, బాఘ్‌సింహళము, చిత్రలేఖనము క్షీణించుట, మొగలుచిత్రలేఖనము, రాజపుత్రచిత్రలేఖనము. ఇప్పటికాలము, నను భాగములలో నానావిషయము చర్చించియు

న్నారు. "మనయాంధ్ర దేశమున జాతీయచిత్రకళ ప్రాముఖ్యము వహించుచుండుటవలన రవివర్మచిత్రములవలనను, పాశ్చాత్యవిద్యలవలనను వ్యాపించిన ఐరోపాచిత్రరచనావ్యామోహము తగ్గఁజొచ్చినది. ఇట్టియదనున ప్రాచీనకాలమునుండి భారతదేశమున చిత్రకళ పొందిన మార్పులను, దానియాధిక్యమును తెలుపుచరిత్ర ప్రజల కంద జేసినయెడల నీప్రబోధమునకు లాభము చేకూరుననునాశతో నే నీచిన్నగ్రంథమును వ్రాసితిని." అని గ్రంథకర్త లొక్కమాట వ్రాసియున్నారు. ఈమాటయే "జాతీయచిత్రరచనయందు విముఖులై యున్న యాంధ్రులను గొందఱనైనను సుముఖులను జేయఁగలుగు" నని మాయాశయమును నైయున్నది. రామారావుగారు చిత్రలేఖనకళయందుఁ బ్రసిద్ధిని వహించి యున్నవారు. తనయనుభవముననను నితరసహాయముసను జాతీయ చిత్రకళయందలి యౌన్నత్యమును మనయెదుటఁ బెట్టుచున్నారు. ఈపుస్తకమునం దున్నయనేకవిషయములను గ్రహించి చిత్రకళాభిజ్ఞులుఁ, గుతూహలులును, జిజ్ఞాసువులును భారతీయచిత్రకళాచరిత్ర యందు వెల్లడియైన యీ గ్రంథమునం దెక్కనివిషయములను జేర్చిన పూర్ణగ్రంథమును రామారావుగారిచేత వ్రాయించి దేశోపకారమును గళాభివృద్ధియుం గావింతురుగాక- వెల రు 1-0-0. చెన్నపురి ఆంధ్రపత్రికాకార్యస్థానమున దొరకును.

---

రఘువంశకథనము—

ఇది కాళిదాసమహాకవి సంస్కృతరఘువంశమునకుఁ దెనుఁగువచనము. ప్రస్తుతము కాకినాడ కలెక్టరుకచ్చేరీలో నుద్యోగిగానున్న శ్రీయుత బండారు తమ్మయ్యగా రనువాదకులు. పందొమ్మిదిసర్గములుం బందొమ్మిది ప్రకరణములుగఁ దెనిఁగించిరి. భాషాంతరీకరణము స్వచ్ఛపదఘటితమై యొప్పుచున్నది. ఒకొక్కచో వ్యాఖ్యానములోని వాక్యములు మూలములోఁ జేర్చిరి.

శ్లో. అథ సమావవృతే కుసుమై ర్నవై స్తమివ సేవితు మేకనరాధిపమ్
యమకుబేరజలేశ్వరవజ్రిణాం సమధురం మధు రఞ్చితవిక్రమమ్　౬-౨౫

"సముచితపరాక్రమంబున యమవరుణకుబేర మహేంద్రాదిదిక్పాలురతో సమంబుగ లోకభారమును వహించు నాసార్వభౌముని సేవించువాఁడై వసంతుఁ డంత "రిక్తహస్తేననో పేయా ద్రాజానం దైవతంగురు" మ్మను ధర్మమును దలంచికొంబోలు నవకుసుమసంభృతుఁడయి చనుదెంచెను-"

సేవించువాఁడై యనుటకంటె (సేవితుమివ) "సేవించుటకువలె ననుట యే లెస్స యని తలంచెదము-ఒకొక్కచోఁ దెనిఁగింపు ధారాళముగానుండును, ఒకొక్కచో మూలములో నున్నట్లేయుండును.

నీవారపాకాదికడంగరీయై రామ్యైర్వ్యతే జానపదై ర్నకిఞ్చిత్" ౫-౬

"వన్యనీవారపాకాదులను జనపదములనుండి కడంగరీయములు వచ్చి భక్షింపవుగదా"

శ్లో. కృతాఞ్జలి స్తత్ర యదమ్బ సత్యా న్న భశ్యత స్వర్గఫలాద్గురో ర్నః

తచ్చిన్త్యమానం సుకృతం తవేతి జహార లజ్జాం భరతస్యమాతుః౧౪-౧౬

"అతఁ డచ్చట భరతునితల్లిని గాంచి యంజలియొనర్చి "అమ్మా ! స్వర్గ ఫలదాయక మగుసత్య వ్రతమునుండి భ్రష్టత నొందకుండ మాజనకుని గాపాడి నది తలంచిచూడ నీసుకృతమేగదా"యని ప్రియవచనములు వలికి యామె లజ్జను బోనడంచెను''

ఈ గ్రంథమును జదివిన సంస్కృతరఘువంశము జదువలేదను కించ యుండదు. భాషాపాటవమును బట్టి యిది కళాశాలవిద్యార్థులకుఁ బఠనీయ గ్రంథముగా నేర్పఱుపవచ్చును. అక్కడక్కడఁ బుటలయడుగున దేశనామా దులు భూగోళాదివిషయములు సూచింపఁబడియున్నవి. వెల విద్యార్థులకు రు 1-4-0. ఇతరులకు 1-8-0 భాగములుకూడఁ దొరకును.

---

తిరుప్పావు:—ఆంధ్రప్రతిపదార్థతాత్పర్య స్వాపదేశార్థసహితము. శ్రీ ఆండాళమ్మగారి ద్రవిడమూలమును దానికి శ్రీనారాయణవనము వకుళా భరణముగారిచే విరచింపఁబడిన యాంధ్ర ప్రతిపదార్థ తాత్పర్యాదులును గలవు. ద్రావిడమూలమును దెనుఁగక్షరములలోనే యున్నది. ముప్పదిపాటలు క్రౌనుసైజు 102 పుటలు. వెల రు 0-6-0. కావలసినవారికి, 22 పచ్చయ్యప్ప మొదలివీథి కోమలేశ్వరంపేఁట, చెన్నపట్టణములో పై శ్రీవకుళాభరణముగా రియొద్దనే దొరకును.

---

భారతకథలు—ప్రొద్దుటూరు జల్లాసునసబుకోర్టు గుమాస్తా మ॥ రా॥ శ్రీ వెల్లాల మైసూరయ్యగారిచే రచియింపఁబడినవచనగ్రంథము. "విద్యార్థిబృందమున కుపయోగించు నన్నుకొని భారతములో కొన్నినీతియుక్త

ములగు కథల నేరి యిందు వ్రాసికొంటిని దానిలోని పద్యములే కొన్ని యిందు పొందుపఱచితిని" అని కవిగారు మొదట వ్రాసియున్నారు. ఇందు 1. మంత్రరాజము 2. ఊర్వశీశాపము 3. పతివ్రతా శాపము 4. పతివ్రతామాహాత్మ్యము 5. అష్టావక్ర చరిత్రమనునట్టి కథలుగలవు. వచనము చక్కనిది. నిర్దుష్టమైనది గాని యక్కడక్కడ "నాబక్క పతిని నేను వశీకృతుని జేసికొనలేకున్నాను (1 పుట) నా అత్తగారికి (4 పుట) ఇట్లనవసరముగ విసంధులును "తల్లీయని జీరుటంబాడియే" (11 పుట) కన్నులెఱ్ఱజేసి (23 పుట) ఇట్టియక్షరముల ప్రమాదములును గలవు. వానికేమి మంచిశైలిలో వ్రాయఁబడియున్నది. నీతులు బోధించును, పెద్దతరగతి విద్యార్థులకుఁ దగియున్నది. 50 పుటల గ్రంథమునకు రు 1-0-0 వెల వేయఁబడినది. వెల యధికముగా నున్నదని తలంతుము. శైలికై కొన్ని పంక్తులు:—

"ఊర్వశి యర్జునసంగమా కాంక్షం జేసి యరుదెంచెను. చంద్రికాధవళ దుకూలంబుగట్టి యున్నది మృగమదకర్పూర కుంకుమోన్మిశ్రిత సుగంధం బలందియున్నది. వివిధసురభికుసుమనికరంబులు ముడిచియున్నది. మణిమయ భూషణాలంకృతయై యున్నది. నిలుకడ వడసిన క్రొమ్మెఱుంగుఁ దీఁగయుంబోలె యున్నది"—(పేజీ 9.)

---

నూజివీటిప్రభువులగు అప్పారాయులవంశచరిత్ర. సంకుచితము:— శ్రీరాజారంగయ్య అప్పారావుబహద్దరు వారి ఉన్నతపాఠశాల ఉపాధ్యాయులు ధన్యంరాజు అప్పారావుగారిచే భాషాంతరీకరణము. మాతృక దీనికి పైయున్న తపాఠశాలలోని యుపాధ్యాయులు వి. సుందరమయ్యరుగారి యాంగ్లేయగ్రంథము. ఇందు బసవనదండనాథుఁడు కళింగరాజ్యసామంతృత్వము, విద్యానగర సామంతృత్వము, విజయప్పారావుగారు గోలకొండ సామంతృత్వము, నైజాము సామంతృత్వము, రాజానృసింహ అప్పారావువారు, రాజా వెంకయ్యప్పారావు బహద్దరువారు, ఆంగ్లేయసామంతృత్వము, రాజానారయ్యప్పారావు బహద్దరు వారు. ఇత్యాదిగా నూజివీటిశాఖ, శనివారప్పేటశాఖ వారివారివంశావళులు వ్రాయఁబడినవి. అందందు పటములు గూడఁ జేర్పఁబడినవి, కాకతిరాజ్యము మొదలు (12 క్రి. శ.) నేఁటివఱకుఁ గలతత్సంస్థానములలోని ప్రభువులు వారివంశములుం దెలుపఁబడినవి. ఇప్పటినూజవీడుభూస్థితియుఁ దెల్పఁబడినది. దీనివెల రు 0-4-0.

---

తిరుగుడుపెండ్లి:—ఆంధ్రప్రచారిణీగ్రంథమాల 65 పుష్పము. శ్రీవేంకట పార్వతీశ్వరకవులు రచించినది. వేంకటపార్వతీశ్వరకవుల కిరువురకు నొక్కనాఁటిరాత్రి యొక్కరీతిగనే వచ్చినస్వప్నములోని వృత్తాంతమఁట- వెల రు 1-8-0. పిఠాపురములో నాంధ్రప్రచారిణీ గ్రంథనిలయములో దొరకును.

---

రాసిలస్:—ఇది సుఖజీవనాన్వేషకుఁ డగు అబీసినియారాజపుత్త్రునికథ. ఇంగ్లీషులో జాన్సన్ కవి రచించిన దానికిఁ బ్ర॥ శ్రీ కూచి నరసింహము బి. ఏ. గారు కావించినయాంధ్రీకరణము. 272 డ- క్రౌ- పుటలు. 48 ప్రకరణములు. మూలగ్రంథస్థము లగునగరనామములుఁ బురుషనామములు నట్లేయుంచుటచే నభ్యాసము లేనిమన చెవికిఁ గ్రొత్తగానుండి చదువుచున్నపుడు నడుమనడుమ నడ్డువచ్చుట తప్ప శైలిలో నిమ్నోన్నతములు లేవు. మృదుమధురపదప్రయోగము నరసింహకవిగారి కభిమానము. సంస్కృతాంధ్రపదములు సరళములుగాఁ బ్రయోగింపఁబడును. వెల రు 0-14-0. పిఠాపురములోఁ గవిగారియొద్దను, విశాఖపట్టణమండలము ఎలమంచిలి తాలూకా మెళుపాకగ్రామమున యం. యస్. శాస్త్రి అండు సన్సువారియొద్దను దొరకును.

---

లీలావతి:—ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల ౬౭వ పుష్పము. గ్రంథకర్త బ్ర॥ నందివాడ కామేశ్వరరావు బి. ఎ. గారు. "ఈనవల దేనికి ననువాదము గాని దొంగతనము గాని కాదు. ఒక్కవాక్యము ఒకయక్షర మెటనుండియు దీసికొనలేదు. ఈనవలలో వచ్చుపేళ్లు మాత్రము బంగాళాపే ళ్లుంచవలసివచ్చినది" ఇత్యాదిగాఁ గవిగారు తెల్పుచున్నారు. తమ తమ్ముఁడుగారి యుత్సాహమునకై యీనవలను గవిగారు వ్రాసినారఁట. స్వతంత్రనవలలను వ్రాయుటయే భాషకుఁజాలఁ దోడ్పాటుచేయుట యని మాయభిప్రాయము. వెల 1-8 0.

---

అష్టావక్రగీత:—అష్టావక్రమునీంద్రునిచే జనకచక్రవర్తి కుపదేశింపఁబడిన సర్వోపనిషత్సారసంగ్రహము. ముముక్షుజనోపయోగమైనది. దీనికి బండార్లంక వాస్తవ్యులగు బ్ర. వేరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే రచియింపఁబడిన యాంధ్రతాత్పర్యముం జేర్చి కాకినాడపురవాస్తవ్యులు ప॥ వ॥ డి॥ పెన్షనరు మ॥ కామర్షి వేంకటసుబ్బయ్యగారు ప్రకటించిరి. ఈపుస్తకమును శ్రీపరమ

హంసపరివ్రాజకాచార్య శ్రీపరమశివేంద్రస్వామివారు చక్కఁగాఁ బరిష్కరించిరి. గ్రంథాదిని 16 పుటలు కథాసంగ్రహము కూడఁ జేర్పఁబడినది. వెల 0-12-0 కాకినాడలో నున్న గ్రంథప్రకాశకు లగువేంకటసుబ్బయ్యగారియొద్ద దొరకును.

---

హరిహరగుహభజనోత్సవచంద్రిక:—ప్రథమభాగము. (1. నిత్యోత్సవపద్ధతి. 2. పక్షోత్సవపద్ధతి) బ్రా॥ కొడుమూరి రంగనాథఅయ్యగారిచే రచియింపఁబడినది. ప్రకాశకులు పై కాపుల్లె వేంకటసుబ్బయ్యగారే. 34 పుటల విశేషపీఠికగలదు. కీర్తనలు ప్రార్థనశ్లోకములు దండకములుం గలవు. కీర్తనలకు విషయసూచి కలదు. నడుమనడుమ చెప్పవలసిన పుండరీకములు గలవు. పక్షోత్సవప్రకరణము-ఏకాదశి, శ్రీరామనవమి, గోకులాష్టమి, ఏకాహం, సప్తాహం, మొదలగుసందర్భములలోఁ గీర్తనచేయుటకుఁ జాలతోడ్పడును. ఇందు భజనపద్ధతు లనేకములు గలవు. దీపము చుట్టును దిరుగుచు చేయుభజన, స్త్రీలు బాలికలు వంగుకొని చేతులతోతాళము వేయుచు దీపముచుట్టు తిరుగుచుఁ బాడుపాటలు, నొకరిబుజములమీఁద నొకరు చేతులుంచి దీప ప్రదక్షిణముచేయుపాటలు మొదలగునవి పెక్కులుగలవు. తెనుఁగు, సంస్కృతము, మరాటీ మున్నగుభాషలలోఁ గలవు. వెల రు 1-4-0.

---

వీరశైవవివాహవిధి:—లింగబ్రాహ్మణులగు వీరశైవులవివాహవిధానము, సటీకము. చిదిరెమఠము వీరభద్రశర్మగారిచే వ్రాయఁబడిన యాంధ్రటిప్పణితో రావికోట వీరయ్యగారిచేఁ బ్రకటింపఁబడినది. వీరభద్రశర్మగారు వ్రాసిన పీఠిక కలదు. గ్రంథప్రకాశకులసంక్షిప్తవంశసంచయము పద్యములు వీరభద్రశర్మగారు రచించినవి ముందుఁగలవు. పురోహితులు తప్పక గమనింపవలసిన ప్రధానవిషయములు మొదటను దెల్పఁబడినవి. దీనివలనఁ బురోహితుఁడుపంచామృతములు పంచపల్లవములు పంచగవ్యములుసంగ్రహించుటకు వానివివరము దర్భకూర్చము దర్భపవిత్రము చుట్టువిధానము ఆవాహినీముద్ర స్థాపినీముద్ర మొదలగుముద్రలక్షణము తెలిసికొనుట కత్యంతసహాయకారిగా నుండును. ఏసమయమున నేవస్తువు కావలయునో తెలిసికొనుటకు వీలగును. వివాహవిషయమై మంత్రాదులను మనము వివరింపఁబనిలేదు. ఇందు వివాహపూర్వదినకర్తవ్యము గణపతిపూజమొదలు నాకబలి గృహప్రవేశము శివసంకల్పము ఆశీర్వాదమం

త్రములవఱకు సంపూర్ణముగాఁ గలదు. ఈగ్రంథము నపేక్షించువారు రావి కోటవీరయ్యగారు చందుపట్ల, భువనగిరితాలూకా నైజాం అని వ్రాసి తెప్పించుకొనవలయును. వెల రు ౧.

---

కవిత్వచింతామణి:—గ్రంథకర్త శ్రీయుతులు చదలువాడ కోటినరసింహముగారు. వీరు తా మాంధ్రభాషాపరిజ్ఞానము నార్జించుచు విద్యార్థిదశలోఁ బఠించిన గ్రంథముల సారాంశమునే కవిత్వచింతామణి యనునీగ్రంథముగా రచించిరి. ౧౦ ప్రకరణములు. కవిత్వము చెప్పుటకుఁ గావలసిన వ్యాకరణము ఛందస్సు, కావ్యలక్షణములు నిందు సంగ్రహముగ సుగమముగఁ దెల్పఁబడినవి. చక్రబంధాదిలక్షణములు, గర్భకవిత్వలక్షణములుం గలవు. ఈకూర్పు నభినందించు పలువురు పండితుల యభిప్రాయములు మొదటఁ జేర్పఁబడినవి. బ్ర॥ జనమంచి శేషాద్రిశర్మగారు, కవిభూషణ కవిరాజు శ్రీవత్సవాయ వేంకటనీలాద్రిరాజుగారు మున్నగువారు మంచియభిప్రాయముల నిచ్చియున్నారు. వెల 0-12-0 గ్రంథములు, పై కోటినరసింహముగారికడ గుంటూరు జిల్లా సత్తెనపల్లితాలూకా ఊటుకూరులో దొరకును.

---

హరశతకము:—ఇది భక్తి, నీతి, తత్వబోధకమగునటులు గవర్న మెంటు మేడపాడు గ్రామవాసియు, బోర్డుబాలికాపాఠశాల ప్రధానోపాధ్యాయులు నగు బ్ర॥శ్రీ పెండ్యాల నారాయణశర్మగారిచే రచియింపఁబడినయది. ఈశతకమును దల్లిగారి కంకితముచేసిరి. ఉప్పెర్లగోత్రజులు మాశిన వేంకటరాజుగారీశతకము నచ్చు వేయించిరి. కొన్నిపద్యములు మచ్చునకుఁ జూపఁబడుచున్నవి.

క. శ్రీకంఠ వినుము మనవిని, నాకంటెను భక్తులుంద్రు నయముగ వారిన్
సాకుట కరిగెడితటి నను, గ్రీకంటిని నైనఁ జూడు కృపయుంచి హరా. ౫౦

క. ఒకదానినుండి చిత్తం, బొకదానికిఁ జెందు మధ్యనుండెడి రూపే
వికలత్వ ముండ నేరని, సకలాత్ముని రూపమంద్రు సర్వాత్మహరా. ౮౬

భూషణాలంకృతంబుగఁ జేసి వేంచేయ శోభితంబుగఁ బరంజ్యోతి యగుచుఁ
గామధేనువు పైనుండి కదలిరాఁగ
మూషికము నెక్కి గణపతి ముందునడువ, వేంక. ౯౭
శితవాహునకుఁ బాశుపత మొసఁగిన యట్టి యాదిదేవుండు రెండవదినమున
నఖిలవైభవముతో హాయిగా భూతవాహనముపై వేంచేయునపుడు వెంట
స్వస్తివాచన మగ్రజన్ములు పఠియింప సద్భక్తజను లెల్ల సన్నుతింపఁ
బాలునీరును వేఱు పఱచు వారువమందు సర్వాంగభూషణశాలియగుచుఁ
గనులపండువ నూరేగి కదలిరాఁగ
మూషికము నెక్కి గణపతి ముందు నడువ, వేంక. ౯౮
దివ్యరత్నమయూఖ దేదీప్యమానంబు లైనట్టి ఘనకిరీటాంగదములుఁ
గర్ణావతంసము ల్గరభూషణంబు లుంగరములుఁ బతకము ల్గంటసరులు
భుజకీర్తులును గరంబుగనొప్పుపూలదండలు దాల్చిభవుఁడుమూఁడవదినమున
లావణ్యముగను గైలాసవాహనమందు వీథిలో వేంచేయ వెంబడిగను
సింహమున నుండి యూరేగి చెలఁగి రాఁగ
మూషికము నెక్కి గణపతి ముందు నడువ, వేంక. ౯౯
నాల్గవదినమందు నాగభూషణుఁడు కుంజరముపై నిరవొంద సరసముగను
గలువ పువ్వులచాయ వలువగట్టుక పంచరంగివర్ణపుఁ బట్టు రవికఁదొడిగి
నిండు పున్నమ రేయి గండుచంద్రుని సాటి కొమరొప్పు ముత్యాలకొప్పువెట్టి
వన్నె మించినసొమ్ము వలసినంతకుఁ దాల్చి యైరావతంబుపై నందముగను
రాజసంబున నూరేగి రావె నీవు
మూషికము నెక్కి గణపతి ముందు నడువ, వేంక. ౧౦౦
చెలువు బంగరుపాగ శిరముపైనుంచి చెంగావి నిల్వంగి చక్కనగఁ దొడిగి
గట్టిగ మొలదట్టి గట్టి పైచికటారి పూని మాణిక్యరత్నభూషణములు
జవ్వాజి బొట్టు పచ్చలతాళి దాల్చి నేజమునల్లఁబట్టి పంచమదినమున
సారంగధరుఁడు గజ్జలగుఱ్ఱమున స్వారి వెడలంగ రయముగా వెంటనేయ
రబ్బిహాయ మందునూరేగిరావె యపుడు
మూషికము నెక్కి గణపతి ముందునడువ, వేంక. ౧౦౧
ఆఱవదినమందు హాలాస్యపతియైన కాలకంఠునితోను గళలు మించి
యూరేయి వృషభవాహనములం దతిమాళి వీథిమధ్యములందు వేడుకలర

జంటగా వేంచేయజనసమూహము మ్రొక్కఁ గోటిసేవయుఁ జాలఁ గొల్లలాడఁ
బగలువత్తులును దీవట్లు వెలుంగ భూసురులు వేదము చెప్ప సురలు పొగడ
మ్రోల నరగజవాద్యముల్ మ్రోయ నపుడు
మూషికము నెక్కి గణపతి ముందునడువ, వేంక. ౧౦౨

మ్రోల మర్దళములు మ్రోయంగఁ దకట త ద్ధిమియంచు నట్టువదిద్ది తెలుప
సరళి శారీరముల్ సమముగా నొనగూర్చి దరువు వర్ణములుఁ గీర్తనలు పాడి
భరతశాస్త్రమురీతి భావాభినయ మొప్ప దాసీజనములు నర్తనము సేయఁ
దరుణేందుమౌళి సప్తమదినంబందుఁ జంద్రప్రభఁ వేంచేసి తనరఁగాను
రమ్యశుకమున నూరేఁగి రాఁగ నపుడు
మూషికము నెక్కి గణపతి ముందు నడువ, వేంక. ౧౦౩

ఎనిమిదావదినమందు నెనయంగ బహువిధమ్ములసొమ్ములను నించి ముద్దులొలుకఁ
జెలువుగాఁ బట్టాభిషేకోత్సవముఁ జెందిగుఱుతైనసెంగోలుబిరుదు మెలఁగఁ
గరతలంబునఁబూని కల్పవృక్షము క్రింద నుండి శృంగారంబు లొనరనపుడు
నవరత్నసింహాసనస్థుఁడౌ సుందరేశ్వరునితో వేంచేయ జనము లెదుటఁ
గప్పురపుటారతుల్ ప్రీతికరము నెత్త
మూషికము నెక్కి గణపతి ముందునడువ, వేంక. ౧౦౪

తొమ్మిదావదినమందు నిమ్ముగా సింగాణి బాణముల్ పూని పుష్పకమునందు
వెడలి దిగ్విజయంబు వీరత్వముగఁ జల్పి యీశాన్యమున కేగ నీశ్వరుండు
మ్రోల నింద్రవిమానమున ప్ర... బూని ... వివాహమును పొన్న
అంతలో సంతోష మంది యావేళను నిశ్చయతాంబూల మచ్చెరువుగఁ
జేసి హరునితోఁగూడి వేంచేసిరావె
మూషికము నెక్కి గణపతి ముందునడువ, వేంక. ౧౦౫

దశమదినంబందు ధరణిలోఁగలజనుల్ వచ్చిచూడఁగఁ గడువైభవముగ
మంగళవాద్యము ల్మ్రోంగలగాను వారాంగనామణులు నాట్యములుసలుప
వెలకోటిసేయుసొమ్ములుతోడుతను స్వర్ణమయమైనకళ్యాణమండపమున
దివమందు వేంచేసి దివ్యగేహమునందు లలితాంగి నీవు హాలాస్యపతిని
గోమరుమిగులంగఁ బెండ్లాడఁ గొలువునందు
మేలు మేలని దేవత లెచ్చుకొనరె, వేంక. ౧౦౬

పదివేలదీవట్లు పగలువత్తులునిండి వెలుఁగంగగల బాణవిద్య లలర
ధవళశంఖాదివాద్యంబులెల్లను మ్రోయసురటీలునుభయచామరము లమర
గంగాధరుండునుగజముపై వేంచేయ నెమిలివాహనమందుఁగొమరుఁడేగ
దంత…పుడమి జనులెల్ల మ్రొక్కియు… ౧౦౭

సీమ సీమ నుల్ పురుషులు బాంధవ్యములతోడ వారు వారు
నొకరికొక్కరు స్నేహ నుత్సాహ మొదవంగ గుశలంబులను దెల్పికొనుచు నిలిచి
చూచి ముచ్చటలాడుచునుగొల్వఁబదియొక్క దినమందు శ్రీమహాదేవుఁడైన
సుందరేశ్వరునితో సొలపొందు రథమునం దలి……… మాన వెడలి
ఉదయకాలము నూరేగి ముదమునొంద
మూషికము నెక్కి గణపతి ముందునడువ, వేంక. ౧౦౮

చిలుకఁజేతనుబూని చినచిన్నపట్టకెంపులమయం బైనసొమ్ములుధరించి
జాజిమల్లెలు విరజాజిపూవులహారములు వైచి యేకాంతముగను రేయి
చొక్కనాథునితోను సొబగుమీఱఁగ నేకసింహాసనమున వేంచేసిరాఁగ
సప్తాభరణసేవ సర్వత్రజనులెల్ల గుమిగూడి నుతియించి కొలిచిచూడ
రాజవీథుల దీపహారతులు సేయ, మూషికము నెక్కిగణపతిముందు నడువ, వేం.

చంద్రశేఖరునితోఁ జలువచప్పరమందుఁ బదిరెండవదినంబు నుదయమందుఁ
వెడలివేగమ……… మిఱఁగితీర్థమునిచ్చి యచట నందము చెలంగఁ
బగటిప్రొద్దున మండపమునందుఁ గొలువుండి సకలవైభవముతోసగమురాత్రి
నందివాహనముపై నాగరకము గాను గనకాభరణదివ్యకాంతి వెలుఁగఁ
బురములోఁ జొచ్చి వేంచేసి పూర్వమైన
దేవళము చేరి నిత్యంబుఁ దేజరిలుచు, వేంక. ౧౧౦

గంగోదకముల పట్టాలపూజలవిధానముగాను నిత్యోత్సవములు చేయ
సార్వకాలము భక్తజనులు గొల్వఁగ శ్రీకరముగానుబక్షోత్సవములు చేయ
వారాంగనలుమ్రోల వరుసగానటియింప రమణీయమాసోత్సవములు చేయ
సకలలోకు లెఱుంగఁ జాటించి నేత్రోత్సవముగాను జైత్రోత్సవములు చేయ
నతులవైభవములతోను నతిశయముగ
నెక్కువగఁ బాండ్యదేశంబు నేలుకొనుచు, వేంక. ౧౧౧

క్షితిని బాదులకుడి చెలఁగఁ బుణ్యాలయంబుగను గాణాచికాఁపురము గలిగి
వెలనాఁటిలో యజుర్వేదుండు హారితసగోత్రుఁ డాపస్తంబ సూత్రుఁ డలరుఁ

దూములూరికులాబ్ధిసోముండు వేంకటరంగయ్యపౌత్త్రుండు ప్రబలుఁడైన
వేంకట........ ..తనూజుఁడు వేంకటరంగయ్య విమలుఁడేను
శ్రీకరంబుగ నీపైని సీసపద్య,శతక మొనరించితిని గొమ్ము శాశ్వతముగ, వేంక.
హృదయమందలిభక్తి హితవుగాఁ బాటించి చక్కగా నీసీసశతకమునను
సంపూర్ణముగ వ్రాసి సంతోషము చెలంగఁ జదువనేర్చిన విన్నజనులకెల్ల
దుష్కృతంబులుపాఱఁదోలఁగించియాయురారోగ్యముల్ధనధాన్యభాగ్యములును
బుణ్యంబులును శుభంబులు నందఁజేయించు మధురాపురీశ్వరీ మరకతాంగి
యిప్పటికి నప్పటికి నన్ను నెప్పటికిని, నిరతముగఁ బ్రోవవేదేవి నిత్యముగను
వేంకటేశుని చెల్లెలై వెలయుగౌరి, కరుణగలయమ్మ మీనమ్మ వరములిమ్మ.

సకలలోకేశ్వరి జయమంగళము నిత్యశుభమంగళమునీకు శోభనాంగి
సద్గుణాలంకార జయమంగళము నిత్యశుభమంగళము నీకు శోభనాంగి
సద్భక్తసేవితే జయమంగళము నిత్యశుభమంగళము నీకు శోభనాంగి
సాయుజ్యఫలదాయి జయమంగళము నిత్యశుభమంగళము నీకు శోభనాంగి
మంగళముమంగళమునీకుమరకతాంగి,మంగళముమంగళమునీకుమధురవాణి
వేంకటేశుని చెల్లెలై వెలయుగౌరి, కరుణగలయమ్మ మీనమ్మ వరము లిమ్మ.

శతకసముచ్చయము ప్రథమభాగము.

సంపూర్ణము.

# విషయసూచిక.

# పరిషత్ప్రయోజనములు.



తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసంగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రిందఁ బొందుపఱుపఁబడు చున్నవి:—

i తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వాంకషమగునిఘంటు వొకటి రచించి ప్రచురించుట;

ii తెలుఁగుభాషకు సజాతీయేతరభాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణము రచించి ప్రచురించుట;

iii ఆధునికశాస్త్రగ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట;

iv ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసఁగుటయు, లభ్యములైన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగు దేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొకటి రచించి ప్రచురించుట;

v సర్వవిషయములనుగుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసంగుట;

vi ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట;

vii తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొక పత్రికను బ్రకటించుట;

viii తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గుఱించి చర్చించుటకుఁగాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట;

ix తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్యపట్టములను, యోగ్యతాపత్రికలను నొసంగుట;

x ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట– ఇందుఁ బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును; వ్రాఁతప్రతులుగూడ నుండవలయును;

xi తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపకరించు నన్ని కార్యములను జేయుట.

ఆంధ్రసాహిత్య
పరిషత్పత్రిక.

కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

| | | |
|---|---|---|
| సంపుటము ౧౯. | ప్రమోదూతనామసంవత్సరము.<br>మాఘఫాల్గున మాసములు. | సంచిక ౬. |

# దిఙ్నాగాచార్యుని కుందమాల

—శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు, విజయనగరము—

లోకములో నున్న ప్రతిజాతివారి గొప్పతనము వారివారివాఙ్మయముల వలననే వెల్లడియగుచున్నది. మన భారతీయుల వాఙ్మయమువంటి వాఙ్మయము మఱి యేజాతివారికిని లే దని పాశ్చాత్యపండితులు గూడ నిర్వివాదముగా నొప్పుకొనుచున్నారు. ఇది నానావిధజ్ఞానశాఖల సంపూర్ణమై యున్నయది. ప్రాచీను లైనమనఋషులు, శాస్త్రకర్తలు, ఆచార్యులు, మహాకవులు, ఆలంకారికులు, నిప్పుడు మనమెఱిఁగిన పరిమితసంఖ్యగల గ్రంథములమట్టుకేనా వ్రాసియున్నారు! మనపూర్వులు ప్రతిజ్ఞానశాఖలోను వ్రాసినగ్రంథము లసంఖ్యేయము లని నమ్మఁడు. అవి యన్నియు నిపు డేమయ్యె ననఁగాఁ బరదేశీయరాజులదండయాత్రోపద్రవములచేఁ గొంతమట్టుకు, శీతోష్ణస్థితి పరిణామముచేఁ గొంతమట్టుకు, ఆయాయిగ్రంథకర్తల కుటుంబజనుల ప్రమాదముచే మఱికొంతమట్టుకు నశించినవి. అట్లు నశించినవానిలో శాస్త్రగ్రంథము లటుండఁగాఁ గావ్యములు, నాటకములు, అలంకారగ్రంథములు మితిమీఱి యున్నవి. వానిలోఁ గొన్ని అనంగహర్ష మయూరరాజ ప్రణీత మైన ఉదాత్తరాఘవము, తాపసవత్సరాజచరిత్ర, ప్రతిభాచాణక్యము, ముద్రాసువేదము, దేవచంద్రగుప్త, విక్రాంతశూద్రక, దేవీపరిణయము, గంగాతరంగిక, తరంగదత్త, పద్మావతీపరిణయము, మొదలగునవి. ఈగ్రంథములలోని శ్లోకములు కొన్ని శార్ఙ్గ

ధరపద్ధతి, వల్లభదేవుని సుభాషితావళి, దశరూపకము, ధ్వన్యాలోకము, హేమచంద్రుని కావ్యానుశాసనము, వామనాలంకారసూత్రము, క్షేమేంద్రుని ఔచిత్యవిచారచర్చ మొదలగు నలంకారగ్రంథములలో నుదాహరింపఁబడి యుండుటచే నాగ్రంథముల పేరులైనను మనకుఁ దెలిసినవి. అట్లు మనప్రాచీన గ్రంథము లంతరించుటఁ జూచి వాని నెట్లైన నుద్ధరింపవలె నను సత్సంకల్పముతోఁ బరమకారుణికు లైనమనదొరతనమువారు పండితనివాసస్థానము లైన పట్టణములకుఁ బల్లెటూళ్లకు వేతనముల నిచ్చి పండితులను బంపి ప్రాచీనగ్రంథములను సంపాదించి ప్రతిరాజధానియందుఁ బ్రాచీన గ్రంథాలయములను (Oriental Libraries) స్థాపించి దానికొఱకమితధనమును వ్యయపఱచుచున్నారు. లేఖనవేతనమిచ్చినయెడల మన మపేక్షించిన ప్రాచీనగ్రంథములను లేఖకులచే వ్రాయించి పంపుచున్నారు. మనగ్రంథసమితి ఐరోపా, అమెరికా మొదలగువిదేశములలోఁ గూడ వ్యాపించియున్నది. నలువది యేఁబదిసంవత్సరములనుండి పాశ్చాత్యపండితు లనేకులు రూపుమాసి యెచ్చటనో మూలఁ బడియున్న మనపురాతనగ్రంథములను గష్టపడి పైకిఁ దీసి సంప్రతించి శోధించి ముద్రింపించి యాయాయిగ్రంథములను రచించిన గ్రంథకర్తల చరిత్రములను గూడ వ్రాసిప్రకటించుచున్నారు. సంస్కృతాంగ్లేయభాషాకోవిదు లగువంగదేశీయులు మహారాష్ట్రులు శోధనమం దాంగ్లేయపండితుల నతిశయించుచున్నారు. కొలఁదికాలముక్రిందట, తిరువాన్కూరు మహారాజావారి పుస్తకాలయాధ్యక్షు లగు మహామహోపాధ్యాయ గణపతిశాస్త్రిగారు భాసనాటకసమూహమును వ్యక్తివివేకము మొదలగు మఱికొన్ని ప్రాచీనగ్రంథములను గనిపెట్టి ప్రకటించిరి. కొన్నాళ్లక్రిందటివఱకు "భాససౌమిల్లకవిపుత్త్రాదీనాం" అని మాళవికాగ్నిమిత్త్రములోఁ జదువుట తప్ప, భాసకవి యిన్నినాటకములను వ్రాసె నని కాని యతనివృత్తాంత మిట్టి దని కాని మన మెఱుఁగము. వరరుచి, ఈశ్వరదత్తుఁడు, శ్యామిలకుఁడు, శూద్రకుఁడు వ్రాసిన భాణములు, శూద్రకుని వత్సరాజచరిత్ర, వజ్జిక వ్రాసిన కౌముదీమహోత్సవము, దిఙ్నాగాచార్యుని యీకుందమాల మొదలగుగ్రంథములను తంజావూరు మొదలగు విద్యాస్థానములలోఁ బుస్తకభాండాగారములయందుఁ గీటదష్టములై శైథిల్యము నొందుచుండఁ బైకిఁ దీసి యచ్చొత్తించి యుపోద్ఘాతములను, టిప్పణములనువ్రాసి ప్రకటించినవారు బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవి ఎం. ఏ. గారు. వీరిగ్రంథ

ములనే కాక నన్నెచోడుని కుమారసంభవము మొదలగు పురాతనాంధ్రప్ర బంధములను గూడఁ బ్రకటించి విద్వజ్జనశ్లాఘాపాత్రు లైరి.

అట్టులే మన యీయాంధ్రసాహిత్యపరిషద్ర్పమణీజనిస్రదు లైన మ॥రా॥ జయంతి రామయ్యపంతులుగా రాంధ్రలోకంబున కొనర్చిన మహోపకారము వాగతీతము. ఎట్లన; నానాదిగ్దేశములనుండి యముద్రితాపూర్వప్రాచీనాంధ్ర ప్రబంధములను సంపాదించి యచ్చొత్తించి యాంగ్లేయకళాశాలలలోఁ బట్టపరీ క్షలకుఁ బఠనీయగ్రంథములుగాఁ జేయించిరి. వీరు ప్రకటించిన ప్రబంధరత్న ములు; వచనజైమినీయభారతము, చంద్రభానుచరిత్ర, చంపూరామాయణము, శివరాత్రిమాహాత్మ్యము, కాళిందీకన్యాపరిణయము, నరసింహపురాణము, మొ దలగునవిప్రధానములు.

దిఙ్నాగాచార్యుఁడు—పూర్వోక్తగ్రంథములలో, కుందమాల యను నీనాటకమును రచించినమహాకవి. తత్త్వసంగ్రహభూమికయం దీతనిగుఱించి యిట్లు చెప్పఁబడినది. ఇతఁడు బ్రాహ్మణకులోత్పన్నుఁడు. కాంచీ మండల సమీపమం దున్నసింహవక్త్రనగర మీతనిజన్మభూమి. సూక్తిముక్తావళీ కారుఁ డీతని భదంతధీరనాగుఁ డని వ్యవహరించెను. మొదట నీతఁడు నాగ దత్తుఁడనుగురువు నాశ్రయించి హీనయానమతమందుఁ బ్రవేశించి కొసకు వసు బంధుఁ డనువానికి శిష్యుఁడై మహాయానగ్రంథముల నన్నింటిని గూలంకష ముగాఁ బరిశీలించెను. ఇతఁడు మహాతార్కికుఁడు. ఈకవి బౌద్ధమతస్థుఁడు గదా రామకథ నెట్లు వ్రాసె నని మీ శంక గలుగవచ్చును, గాని, జానకీ హరణ మహాకావ్యమును రచించిన సింహళద్వీపనివాసియగు కుమారదాసుఁ డు మీసంశయమును బోఁగొట్టును. ఈకవిపుంగవుఁడు తనకాలమందు మహా ప్రసిద్ధినిగాంచిన నలాందా విశ్వవిద్యాలయమం దున్న తైర్థికుల నందఱను వా దమందు జయించి ప్రచురకీర్తిని సంపాదించి వాదిపుంగవుఁ డనుబిరుదమును వహించెను. యాయావరవృత్తిచే దేశాటన మొనర్చుచు నచ్చటచ్చట నున్న పండితులను వాదమందుఁ బరిభవించి స్వమతమందుఁగలిపె నని బౌద్ధగ్రంథముల వలనఁ దెలియవచ్చుచున్నది. ఇతఁడు రచించిన గ్రంథములు 1. న్యాయప్రవేశ ము, 2. ప్రమాణసముచ్చయము, 3. హేతుచక్రడమరుకము, 4. ప్రమాణ శాస్త్రన్యాయప్రవేశము, 5. ఆలంబనపరీక్ష, 6. త్రికాలపరీక్ష. అక్షపాదుఁడు, కణాదుఁడు, వాత్స్యాయనుఁడు మొదలగు ప్రాచీననైయాయికు లవలంబించిన

పంచావయవవాక్యమును మూఁడవయవములతోఁ గుదిర్చెను. ఉపమానము నకు శబ్దమునకుఁ బ్రామాణ్యమును నిరసించెను. ప్రత్యక్షానుమానములకు నూతనలక్షణములను గల్పించెను.

కవికాలనిర్ణయము:—పూర్వమేఘము పదునాలుగవశ్లోకము, "స్థానా దస్మా త్సరసనిచుళా దుత్పతోదఙ్ముఖః ఖం దిఙ్నాగానాం పథి పరిహరన్ స్థూల హస్తావలేపాన్" అను శ్లోకమునకు వ్యాఖ్యానము వ్రాయుచు మల్లినాథుఁడు "అత్రేదం అర్థాంతరం ధ్వనయతి. రసికో నిచుళో నామ మహాకవిః కాళిదాస స్య సహాధ్యాయీ పరాపాదితానాం కాళిదాసప్రబంధ దూషణానాం పరిహ ర్తా యస్మిన్ స్థానే తస్మాత్ స్థానాత్ ఉదఙ్ముఖో నిర్దోషత్వాత్ ఉన్నతముఖ స్సన్ । పథి సారస్వతమార్గే దిఙ్నాగానాం పూజాయాం బహువచనం । దిఙ్నా గాచార్యస్య కాళిదాస ప్రతిపక్షస్య హస్తావలేపాన్ హస్తవిన్యాసపూర్వకాణి దూషణాని పరిహరన్ । అవలేపస్తు గర్వేస్యా ల్లేపనే దూషణేపిచ । అద్రే శ్శృంగం హరతి పవనః కిం స్విదిత్యున్ముఖీభిః, అద్రేః అద్రికల్పస్య దిఙ్నా గాచార్యస్య శృంగం ప్రాధాన్యం । శృంగం ప్రాధాన్య సాంత్వోశ్చ । హరతి కిం స్విదితి హేతునా సిద్ధైః సారస్వతసిద్ధై ర్మహాకవిభి రంగనాభి శ్చ దృష్టోత్సాహ స్సన్ ఖముత్పతితో భవేతి స్వప్రబంధ మాత్మానం వా ప్రతి కవేరుక్తి రితి" ॥

పదునొకండవ శతాబ్దమందున్న వాఁడు మల్లినాథునికంటెఁ బ్రాచీనత రుఁడు నగు దక్షిణావర్తనాథుఁ డనునొక మేఘసందేశవ్యాఖ్యాత "సరసనిచు ళా దిత్యత్ర నిచుళపదేన నిచుళాభిధానః కశ్చి త్కవి ర్వివక్షితః । యస్యసూ క్తిస్సుభాషితే శ్రూయతే ॥

"సంసర్గజా దోషగుణా భవం తీత్యేత న్మృషా యేన జలాశ్రయోపి। స్థి త్వానుకూలం నిచుళ శ్చలంత మాత్మాన మారక్షతి సింధువేగాత్" అనయా నిచుళోపవర్ణనయా తస్యైకవే ర్నిచుళాభిధాయిత్వ మాసీ దిత్యనుసంధేయం సతు నిచుళకవి రాస్థానగతః కాళిదాసస్య సూక్తి స్సంభావయతి, తస్మా త్సర సపదేన తం కవింస్తౌతి, దిఙ్నాగానాం—అనేనదిఙ్నాగాచార్యో వివక్షితః, సచ కాళిదాసప్రతిపక్షీ "స్థూలహస్తావలేపాన్" ఇత్యనేన ప్రబంధదూషణసమయే స్థూలహస్తాభినయా శ్చ వివక్షితాః, అయ మస్యాభిప్రాయః దిఙ్నాగ ఇతి కో ప్యాచార్యః కాళిదాసప్రబంధాన్ స్థూలహస్తాభినయై ర్దూషయతి, తమాచా

ర్యాం స్వప్రబంధ స్యాపూర్వాభిధాయిత్వ మాత్రేత్య మేఘోపదేశవ్యాజేన దూషయతి.

పైని వ్రాయఁబడిన మేఘసందేశశ్లోకము దానివ్యాఖ్యానమును బట్టి విచారింపఁగా, కాళిదాసునికి సమకాలికుఁడగుదిఙ్నాగాచార్యుఁడొకఁడు కాళిదాసప్రబంధములను దూషించె ననియు నాకాలమందే నిచులుఁడనునొక మహాకవి కాళిదాసుని మిత్రుఁడీతని గ్రంథములను సంభావించె ననియు స్పష్టమగుచున్నది.

ఇందువలన దిఙ్నాగాచార్యుఁడు నిచులుఁడు కాళిదాసు సమకాలికులని నిశ్చయముగాఁ జెప్పఁగలము. ఈముగ్గురిని విక్రమాదిత్య ప్రవరసేనకుంతలేశ్వరులతోఁ గలపవచ్చును. ఒకకాలమందు విక్రమాదిత్యుఁడు కాళిదాసుని కుంతలేశ్వరునిసభకు రాయబారిని గాఁ బంపె నఁట. అటనుండి మరలి వచ్చిన కాళిదాసునిఁ జూచి విక్రమాదిత్యుఁడు కుంతలేశ్వరుఁ డేమిచేయుచున్నాఁ డని యడుగఁగా "అసకలహసితత్వాత్ క్షాళితానీవ కాంత్యా ముకుళితనయనత్వా ద్వ్యక్తకర్ణోత్పలాని, పిబతి మధుసుగంధీ న్యాననాని ప్రియాణాం త్వయి వినిహితభారః కుంతలానా మధీశః॥ అని చెప్పెనఁట. క్షేమేంద్రుఁడు తన ఔచిత్యవిచారచర్చలో కుంతలేశ్వరదౌత్యమునుండి యుదాహరించిన యీశ్లోకమువలనఁ బూర్వోక్తవిషయము నిర్ణయింపఁబడుచున్నది. కాని యీకుంతలేశ్వరుఁ డెవఁడో మనకుఁ దెలియదు. సేతుబంధవ్యాఖ్యాత వ్యాఖ్యానారంభమందు "నిరాశానాం కావ్యచర్యాచతురిమవిధయే విక్రమాదిత్యవాచా యం చక్రే కాళిదాసః కవికుముదవిధుః సేతునామ ప్రబంధః'' అని వ్రాసెను. భోజచరిత్ర వ్రాసిన గ్రంథకర్త సేతుబంధమును రచించిన వికుంతలేశ్వరుఁ డని స్పష్టముగా నీక్రిందివ్రాసిన శ్లోకమునఁ జెప్పెను. ''జడాశయస్యాం తరగాధమార్గ మలబ్ధరంధ్రం గిరిచౌర్యవృత్త్యా, లోకే ష్వలం కాంత మపూర్వసేతుం బబంధ కీర్త్యాసహకుంతలేశః" ఇందువలన సేతుబంధకావ్యమును రచించిన ప్రవరసేనుఁడే కుంతలేశ్వరుఁ డనియు నితఁడు రచించిన యాకావ్యమును, కాళిదాసు చూచి యచ్చటచ్చటం దగినసవరణలను జేసి యుండుటచే నిది కాళిదాసప్రణీత మని యొకవాడుక పుట్టె నని మనమూహింపు కొనవలెను. వాకాటకాధిపతి యగునీప్రవరసేనుఁడు, మధ్యపరగణాలలో నున్న నైలిచిపురమునుండి గోదావరీప్రాంతదేశమునకు వచ్చి యాకాల

మం దాదేశము నేలుచున్న కదంబులను జయించి వోరంగలుకు ముప్పదిమై ళ్ళదూరమం దున్న రామగిరిని రాజధానిగాఁ జేసికొని రాజ్యమేలెను.

కుందమాలనుగుఱించి లక్ష్మణుఁడు గర్భవతి యైనసీతను రామాజ్ఞచే వాల్మీకి మహర్షియాశ్రమమందు విడిచిపెట్టి వచ్చినపుడు సీత గంగను జూచి "భగవతి భాగీరథి? య ద్యహం సుఖేనగర్భ మభివర్తయామి తదా తవ దినే దినే సుస్థుగ్రథితయా కుందమాల యోపహారం కరిష్యామి-" అనుటచేఁ గవి యీనాటకమునకు, కుందమాల యని పే రిడెను. శారదాతనయుఁడు తాను వ్రాసిన భావప్రకాశికలో నీనాటకము నిట్లు ప్రశంసించెను. "కుందమాలాత్ర సుశ్లిష్టా సంధిపంచక సంయుతా."

"ద్యూతే పణః ప్రణయకేళిషు కంఠపాశః క్రీడాపరిశ్రమహరం వ్యజనం రతాంతే, శయ్యా నిశీథకలహే హరిణేక్షణాయాః ప్రాప్తం మయా విధివశా దిద ముత్తరీయం" అను నీశ్లోకమును విశ్వనాథకవిరాజు సాహిత్యదర్పణమందును భోజదేవుఁడు శృంగారప్రకాశికయందు నుదహరించియున్నారు. 1150 సంవత్సరమం దున్నశారదాతనయునికంటెఁ బ్రాచీనతర మైనమహానాటకమందుఁ గూడ నీశ్లోకమే యుదాహరింపఁబడెను. బహురూపమిశ్రుఁడు కావ్యకామధేనుకారుఁడు నీ నాటకమును తమగ్రంథములయందుఁ జెప్పియున్నారు. ఇందలి ప్రాకృతభాష చతుర్థపంచమాబ్ద శతకములయం దున్నప్రాకృతభాషవలెఁ గానవచ్చుచున్నది.

ఇది యాఱంకములనాటకము. ఈనాటకమునకు భవభూతి ఉత్తరరామచరిత్రమునకు సీతావివాసనమే ప్రధానప్రతిపాద్య మైనకథ. కాని యీనాటకద్వయమునకు సంవిధానము కొంచెము భిన్నముగా నున్నది. ఆభేద మీదిగువఁ జూపింపఁబడును. ఈరెండునాటకములకు విప్రలంభకరుణారసమే ప్రధానము. అంగముగా నితరరసములు గూడ ననుప్రవిష్టములై యున్నవి.

ఈనాటకద్వయమందలి కథావైషమ్యము.

ప్రథమాంకము.

కుంద—రాముఁడు లోకాపవాదభీతిచే సీత నరణ్యమునకుఁ బంపెను.

ఉత్తర—భద్రుఁ డనుగూఢచారుఁడు సీతకు సంభవిల్లిన కౌలీనమును రహస్యముగాఁ జెప్పఁగా దానిని మనస్సులో నిడికొని పైకిఁ గురువులయాజ్ఞచే గర్భదోహదనిర్వర్తనవ్యాజముచే సీత నరణ్యమునకుఁ బంపెను.

### ద్వితీయాంకము.

కుం ద—కుశలవోత్పత్తి- రామాయణాధ్యయన సంగీతాదులయం దాకుమారు లిరువురు ప్రవీణు లగుట.

ఉత్తర—కుశలవోత్పత్తి- రామాయణోత్పత్తి కథ. శంబూకుని వధించుటకు రాముఁడు పంచవటికిఁ బోవుట.

### తృతీయాంకము.

కుంద—గోమతీతీరాశ్రమమునకు వచ్చిన వాల్మీకిని జూచుటకు రాముఁడు వెళ్ళఁగా నచట నానదీతరంగములయందుఁ దేలుచున్న కుందమాలను గని యిది సీతాగ్రథిత మని సీతను తలంచుకొని దుఃఖించుట. విరహాకృశుఁడైన భర్తను గాంచి సీతయు దుఃఖించుట.

ఉత్తర—శంబూకవధ ప్రసంగమున పంచవటికి వచ్చి పూర్వపరిచితస్థలములను గాంచి రాముఁడు శతగుణితజానకీవిరహశోకుఁడై పలుమాఱు మూర్ఛిల్ల సీత వనదేవతాప్రభావముచే నిగూఢయై యుండి తనకరస్పర్శచే రాముని లబ్ధసంజ్ఞునిగాఁ జేయుట.

### చతుర్థాంకము.

కుంద—రామునికి సీతయం దెంతప్రేమ గలదో కనుగొనుటకుఁ దిలోత్తమ సీతారూపమును ధరించి రామునికడకు రాఁగా వేదవతి యనుమునికన్యక దానిని నివారించుట.

ఉత్తర—వాల్మీక్యాశ్రమమందు జనకుఁడు కౌసల్యమొదలగు వృద్ధులు కలిసి సంభాషించుచుండఁ నచటికి వచ్చిన లవుని జూచి వాని వృత్తాంతము నరయుట.

### పంచమాంకము.

కుంద—రామాయణగానమును వినిపించుటకుఁ, గుశలవులు రామునియొద్దకుఁ బోవుట-రాముఁడు వారిబాలభావమును సౌందర్యమును జూచి హర్షపరవశుఁ డగుట. తల్లిదండ్రు లెవ్వ రని యడుగఁగాఁ, దల్లిపేరు దేవి, వధువు ననియు, తండ్రిపేరు నిర్ఘృణుఁ డనియుఁ జెప్పిరి.

ఉత్తర—లవచంద్రకేతులయుద్ధము-ఆఱవయంకము.

కుందమాల—రామలక్ష్మణభరతశత్రుఘ్నులు కుశలవుల రామాయణగానము ను వినిరి. తలిదండ్రులను మే మెఱుఁగమనిరి. ఇంతలో భూదేవిని సీతను

వెంటఁబెట్టుకొని వాల్మీకి వచ్చి సీత పరిశుద్ధురాలని చెప్పి పుత్త్రులతో సీతను రామునికొప్పఁజెప్పి కుశునికిఁ బట్టాభిషేకము చేయించి లవుని యువరాజుగాఁ జేసెను. కుందమాల ముగిసెను.

ఉత్తర—లవచంద్రకేతుల యుద్ధవర్ణన- రాముఁడు, కుశలవులు, చంద్రకేతువు కలిసికొనుట.

## సప్తమాంకము.

ఉత్తర—సీతారాముల సమ్మేళము.

జయదేవుని ప్రసన్నరాఘవము, భాసుని ప్రతిమానాటకము, అభిషేకనాటకము, భవభూతి మహావీరచత్ర, ఉత్తరచరిత్ర, అనర్ఘరాఘవము, రాజశేఖరుని బాలరామాయణమును రామభద్రకవి జానకీపరిణయమును మొదలగు రామనాటకములయందు దాయాయి నాటకకర్త లెవ్వరును విదూషకుని బెట్టలేదు. కుందమాల కూడ రామనాటకమైనను, గవి దీనిలో విదూషకునిం బెట్టెను. కుందమాలాకారుఁడు కాళిదాసునివలె నెంతమట్టుకర్థావబోధన ప్రయోజనము సిద్ధించునో యంతమట్టుకే శబ్దములను స్వీకరించును గాని శబ్దాడంబరమును జూపఁడు. ఆకవి శైలిని జూపుటకీదిగువను రెండు మూఁడు శ్లోకములను వ్రాసితిని. చిత్తగింపుఁడు.

మందం యాతి సమీరణో నపరుషా భాసో నిదాఘార్చిషో
నత్రస్యంతి చరం త్యశంక మధునా మృగ్యోపి సింహైస్సహ
మధ్యాహ్నేపి నయాతి గుల్మనికటం ఛాయా తదధ్యాసితా
వ్యక్తం సోయ ముపాగతో వనమిదం రామాభిధానోహరిః.

లంకేశ్వరస్య భవనే సుచిరం స్థితేతి
రామేణ లోకపరివాదభయాకులేన
నిర్వాసితాం జనపదా దపి గర్భగుర్వీం
సీతాం వనాయ పరికర్షతి లక్ష్మణోయమ్.

మరకతహరితానా మంభసా మేకయోనిః
మదకలకలకంఠీ గీతరమ్యోపకంఠా
నళినవనవికాసై ర్వాసయంతీ దిగంతాన్
నరవరపురతస్తే దృశ్యతే గోమతీయమ్.

భవభూతి శైలి సమానభూయిష్ఠము.

శ్లో. కండూలద్విపగండపిండకషణోత్కంపేన సంపాతిభి
ర్ఘర్మస్రంసితబంధనైస్స్వకుసుమై రర్చంతి గోదావరీమ్
ఛాయావస్కిరమాణ విష్కిరముఖ వ్యాకృష్ట కీటత్వచః
కూజత్క్లాంతకపోతకుక్కుటకులాః కూలే కులాయద్రుమాః.

శ్లో. గుంజత్కుంజకుటీరకౌశికఘటాఘుత్కారవత్కీచక
స్తంబాడంబర మూకమౌకులికులః క్రౌంచావతోఽయంగిరిః
ఏతస్మిన్ప్రచలాకినాం ప్రచలతా ముద్వేజితాః కూజితై
రుద్వేల్లంతి పురాణరోహిణతరుస్కంధేషు కుంభీనసాః. 2

కుందమాలాకారుఁ డతికఠినచిత్తుల మనస్సులు కూడ కరఁగునట్లు సీతావివాసనమును వర్ణించెను గాని భవభూతి ఉత్తరరామచరిత్రలో లోకపూజ్యనామ యగుసీతపావనత్వానఘత్వనిర్దోషత్వాది గుణములచే సంపూర్ణురా లని లోకమునకుఁ దెలియునట్లు హర్షోన్మాదావహమైన భాషలో వర్ణించెను.



# కవితాప్రపంచము.

—విద్వాన్-కోపల్లి శివకామేశ్వరరావుగారు. కాకినాడ.—

---

ప్రకృతిప్రత్యయజ్ఞు లగు శాబ్దికులయుఁ, బరిణామవాదులయుఁ దదితరులయు ననుమానములచేఁ గల్పాదిని మనమును బాశ్చాత్త్యులును సర్వవిధముల నొక్కటియే యైనను గాలక్రమమున నేఁటికి సంప్రదాయాదులచేతను విజ్ఞానాదులచేతను, బ్రవృత్తినివృత్తిధర్మప్రమాణములచేతను నత్యంతభిన్నుల మనువిషయమును గుర్తెఱుంగని పలువురు మనవారు పరభాషాచారసంప్రదాయమోహితులు ప్రతివిషయమును బాశ్చాత్త్యసులోచనములతోఁ గాంచుచు, వారి పద్ధతుల సర్వము నెఱింగినవారుంబోలె మాటాడుచుండుటయుఁ దమ చెప్పిన దాని కన్య మగునదెల్ల గర్హ్య మని తలంచి తమలో సంతసిల్లుటయు, రాజభాషాజ్ఞతవలని సంఘగౌరవనీయపదస్థులై భోగభాగ్యానుభవములందును వేషాదులందును గలయున్నతి క్షణిక మని ధర్మమునూఁది వ్యవహరించు పండితులను ఛాందసు లనియు నజ్ఞాను లనియు ధిక్కరించుటయు మనము కన్నులారఁ జూచెడిదే కదా. ప్రస్తుతము మనవిద్యాపీఠముల నాచారవ్యవహారములయందు విజ్ఞానసంపదయందుఁ బాశ్చాత్త్యభావభావితాంతఃకరణులును దదనుయాయులును, దత్పదసంపాదనేచ్ఛాసముద్యన్ముఖస్తుతిపరాయణులును నలంకరించిరి. అనలున కనిలుఁడు తోడయ్యెను. దహనసంస్కారమునకు నిం కడ్డెక్కడిది. సర్వసంప్రదాయములను బాశ్చాత్త్యదృష్టియే. కవితయందును బాశ్చాత్త్యులు చెప్పుమాట లని పరీక్షకై చదివిన ప్రాసుడులే పరమ ప్రమాణములు.

కాని, కవితకు నాచారవ్యవహారములకు సంబంధ మేమందురో వినుఁడు. ముసిఁడి రసాలఫలముల నిచ్చునా ; రసాలము ముసిఁడినిచ్చునా ? తనయాచారాదులను దనసంప్రదాయములను విడనాడియన్యవిషయములనే కవిచిత్రించును ? తనయనుభవమును విడిచి యేమి యెవ్వఁడు నుడువును ? నేలను విడిచి యెవ్వఁడు సాము సేయఁగలఁడు ? ఎన్నియుగములనాఁడో పుట్టి పెరిఁగిన రాముని నేఁడును గవులు కీర్తించుటలేదా ; వారి కారాముని యనుభవ మెట్లు కలుగును ? అనినచో నొక్కమనవి, ఆలకింపుఁడు. రామవ్యక్తి వైదికధర్మము నాశ్రయించినదే కదా ; మనము నాధర్మమునే యనుసరించుచున్నాము

గదా. ఈధర్మ మనుపాశములచే నాఁటి రాముఁడును నేఁటిమనమును సన్నిహితుల మగుచున్నాము. మనయాచారవ్యవహారము లెల్ల ధర్మానురోధములు కావున రాముఁడు మనలోనివాఁ డగుచున్నాఁడు. వానియనుభవము మనదియే. పోనీ, ఇం కొకటి నాలోచింపుఁడు. Hamlet అను నాటకమును పాశ్చాత్యలోక ప్రథిత మగుదానిని మనవిద్యావంతు లందఱును బరీక్షార్థమై పఠించినారు గదా. నేఁటికి నది పాఠప్రవచనములం దున్నది గదా. ఆగ్రంథమున వర్ణితమైన యామాసంఘమర్యాదలను నాచారవ్యవహారములను జదివి తన్మయుఁడైన హైందవుఁ డున్నాఁడా మీరే తెలుపుఁడు. అవి మన కర్థము లగునా; వ్యాఖ్యానములను పఠించినను ననుభవమునకు వచ్చునా? Lily చాల సొగసైన పూ వని వేనోళ్ల మహాకవి నిర్వర్ణించినను దద్వర్ణనాకర్ణనమునఁ బాశ్చాత్యునకువలె మనకు భావోదయమై రసానుభవము కలుగునా? కమలమును వర్ణించినకావ్యమును వినునప్పుడు మనకువలె నొకపాశ్చాత్యున కానందము కలుగునా? అందుకనియే నామనవి యేమంటిరేని యేజాతిధర్మ మాజాతిది; ఏజాతి సంప్రదాయము లాజాతివి. వారిసంప్రదాయములను నాచారములను మనము గ్రహించుట దుర్ఘటము; వాని ననుసరించి వ్రాయఁబడిన కవితను గాని యాకవితను గూర్చి వారు నుడువు లక్షణాదికమును గాని మన మనుభవమునకుఁ దెచ్చికొనుట కలలోనిమాట. ఇం కొకమాట- వారికిఁ గుక్క, పిల్లి, పంది మున్నగుజంతువులు శృంగారాది బహురసముల నాలంబనములు కాకపోయినను నుద్దీపనవిభావములు. మన కాజంతువులే యస్పృశ్యములని విధి. ఇట్టియెడ వారిపలుకుల తియ్యములు మన కనుభవమునకు వచ్చునని యెన్నఁగలమా.

ఇచ్చటఁ బ్రత్యర్థి యొకమాట ననవచ్చును. ఏజాతివాఁ డైనను మానవుఁ డొక్కటియే కదా. భావము లున్నతము లగునవి యొకతీరుననే యుండునుగదా, యని. మానవత్వము సామాన్యమే యైనను భావములు సంస్కారజన్యము లనియు, నాసంస్కారములు జన్మజన్మాంతర దేశకాలపాత్రాచార వ్యవహారాదు లగుపెక్కుల ననుసరించి కలుగు ననియు, నందుచేతనే దేశధర్మాదిభిన్నుల మగుమనకు వారికిఁ బొత్తు కవితాదులయందు సమకూడ దనియు నావిన్నపము.

ఇఁక నొక్కవిశేషము. కవితయేగాక మనబ్రతుకు సమస్తము వైదిక ధర్మము నాశ్రయించి యున్నది. వారికో యట్టిధర్మము, సర్వకాలములయందలి పురుషులను నేకకాలవాసులను వలెఁ జేయుధర్మ మొండొకటి లేదు. వారు సమస్తమునుండి ధర్మమును నిర్మించుకొనుచున్నారు. మనమో దివ్యమగు ధర్మమును బాలించుచున్నాము. అందుకనియే Browning మొదలగు కవులవచనములును వారికి ధర్మమును వేదాంతమును బోధసేయు శాస్త్రములయందును బ్రమాణము. మనకుఁ గవులవాక్కులను బ్రమాణీకరించు వేదాన్త్యాదిశాస్త్ర గ్రంథములు గలవా? ఇదియే వారికి మనకుఁ గలభేదము. ఈభేదమును మనసునం దిడికొని కవితాప్రపంచ మెట్టిదో విచారింతము:—

ధర్మబద్ధుల మగుటచే ననాదినుండియు మనము నివసించెడువారమే యగుచున్నా మనియు, శ్రీరాముఁడు మనతో నివసించు రాకొమరుఁడే యనియు వారివ్యవహారములు మనవ్యవహారములే యనియు నాకారణముననే వారిసుఖదుఃఖములయందు మనమును బాల్గొనఁగలుగుచున్నా మనియు నిదివఱకే తెలిపితిని. అదియునుగాక ననాదిసిద్ధ మగుధర్మము ననుసరించుటయే మనబ్రదుకు. ఈధర్మము వేదమూలము. కావున వేదానుబోధి యగునది మన కాదరణీయము; తదితరము మనకుఁ గాదు. కవులును ధర్మేతరులు కారు. వారియనుభవము ధర్మమూలము. ఉగ్గుఁబాలతో వారును వైదికధర్మముల నలవరించుకొందురు. వారియనుభవమును వారు వెల్లడించునది కవిత. కనుక మనకబ్బములు ధర్మానురోధములు. ఈ మాటలవలనఁ బాశ్చాత్యులను డులలో నేవియు నగ్రాహ్యము లని నాతలఁపు గాదు. మనసాధనము లుండగా నవియేల యనియు, వలసినవాని గ్రహించుటయు తగు ననియు నాబుద్ధి.

ఈ కవియెవఁడు? కవి బ్రహ్మ. కవి క్రాంతదర్శియని నైఘంటికు లందురు. బ్రహ్మస్వరూపమే కవిస్వరూపము. బ్రహ్మ యొనర్చునదే కవి యొనర్చు నని యర్థసామ్యమును బట్టి మన మూహింపవచ్చును. క్రాంతదర్శి తానై యతని వలెఁ గవియు నుండు ననియు నాచరించు ననియు నూహింపనగును. బ్రహ్మస్వరూపమును బ్రహ్మకార్యమును దెలిసికొనినఁ గవిస్వరూపమును గవికృత్యమును దెల్ల మగును. ఈ కన్పించు జగమును ధాత సృష్టించినాఁడు. ఎట్లు? యథాపూర్వముగా. ఈసృష్టి యేమి? కల్పనము. కనుకనే ప్రపంచసృష్టిని గుఱించి మనవా రాబాలగోపాలమును జెప్పుమాటయే గదా "ధాతా యథా

పూర్వ మకల్పయ" త్తనునది. ఇందు యథాపూర్వ మనుశబ్దమును గల్పన మనుదానిని వివరించినచోఁ బ్రపంచముయొక్కయుఁ గవితాప్రపంచముయొక్కయు సృష్టి తెలియఁగలదు. ఈ యథాపూర్వమునఁ బూర్వము నూత్నకల్పమునకుఁ బూర్వమునఁ గలకల్పమే. దానికో యందు లేని మఱల దానికో యని యిట్లు ననియత మగు ప్రశ్నపరంపర పుట్టును. దీనికి సమాధానము మహాకాల మనుటయే- పూర్వమువలె సృజించె ననిగదా యర్థము. అయినం బూర్వప్రపంచమునకుఁ బ్రతిబింబమా యిది యనుసంశయము వొడమరాదు. ఒకదానివలె నింకొకటి యున్న దన్నప్పుడు దానికిని దీనికిని భిన్నత్వము కలదనియు సామ్యమును నున్న దనియు నభిప్రాయము. అదియును గాక ధాత కల్పించె ననియుఁ గలదు కదా! కల్పనము జ్ఞానాధీన మైన దగుటచే నీజ్ఞానము స్వాప్యయమునందుండి మొలకునను గనినవిధాతకుఁ గలిగినదని పూర్వులు తెలుపుదురు. స్వాప్యయస్వరూపమును "యత్రైతత్పురుషః స్వపితి నామ సతా సోమ్య తదా సంపన్నో భవతి స్వమపీతో భవతి తస్మా దేనం స్వపితీత్యాచక్షతే స్వంహ్యపీతో భవతి" యని ఛాందోగ్యులు చెప్పుచున్నారు. మఱియు నిద్రాసక్తుఁడైన బ్రహ్మ స్వభావమును "సుషుప్తస్థాన ఏకీభూతః ప్రజ్ఞానఘన ఏవానందమయో హ్యానందభుక్ చేతోముఖః ప్రాజ్ఞ స్తృతీయః పాదః ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోऽన్తర్యామ్యేష యోనిః సర్వస్య ప్రభవాప్యయౌ హి భూతానా" మనియు శ్రుతి చాటుచున్నది. అంతఃప్రజ్ఞుఁడై స్వప్న మనుభవించువానివలె బ్రహ్మయుఁ దనయనుభవమును జ్ఞప్తికిఁ దెచ్చికొనుటకే మేల్కాంచి తనజన్మకారణమును గ్రహించుటకై తపం బొనర్చుట. ఈ తపమున నే యతఁడు నేను సృష్టికర్త నని గ్రహించుట పొసఁగినది. అంతట సృజనమున కాతఁడు బహిఃప్రజ్ఞుఁడై పూనెను. ఎందుల కీసృష్టి నతఁ డొనర్పవలయును? లీలకై. ఈ లీల యెట్టిది? తనను దాను బ్రేమించుటయే; తనకల్పనమునఁ దాను రమించుటయే. ఈ యభిప్రాయమునే "నవా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవ త్యాత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి" యను వాక్యమునుండి 'ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్య' యను వఱకుఁ గల యుపనిషద్వాక్యములు చాటుచున్నవి. ఆత్మతృప్తి కొఱకై యీసృజనకర్మ. అదియే లీల. ఇది బ్రహ్మప్రపంచమును విధానించు తెఱఁగు. ఇఁకఁ గవియుఁ బూర్వానుభూతవిషయమును స్మృతికిఁ నంతఃప్రజ్ఞుఁ

డై తెచ్చికొని యందుఁ బ్రతిభాసించిన దానిని బహిఃప్రజ్ఞుఁడై యాత్మకామ నఁ గలవాఁ డగుటచేఁ గవితాదిశిల్పప్రపంచమును నిర్మించును. దీనినే యుభయకావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునఁ బారగుఁడగు కవిబ్రహ్మ సాత్యవతేయు సంస్కృతి (శ్రీ)విభవాస్పదం.........టొప్పగునని సూత్రప్రాయముగ నుడివెను. కల్పాప్యయమున బ్రహ్మ నిద్రించెను. ఈప్రలయము జరుగుట యెవనియందు? తనయందే. అనఁగా బాహ్యప్రపంచ మంతయుఁ దనయందే యిమిడి యేకాకృతి యైనది. అప్పుడు ప్రజ్ఞానఘనుఁడును నానందియు రసరూపుఁడు ననఁబరగుచున్నాఁడు బ్రహ్మ. కవియు బాహ్యమై తనకంటెభిన్నమై ప్రత్యక్షముగా నున్న ప్రపంచమును దనయందే లయమును జేసికొనినాఁడు. అప్పుడు ప్రపంచాప్యయ మతనికిఁ గలిగినది. పిమ్మట యవస్థ ప్రజ్ఞానఘనమును, నానందమును, రసమును దానై నిద్రాముద్రితుఁ డగుటయే కవికిని మిగిలినది. ఈనిద్ర యంతఃప్రజ్ఞయు బహిఃప్రజ్ఞయును గాదు. దీనినుండి మనఃప్రచారోపాధివిశేషసంబంధమును గలిగి స్మృతిరూప మగుస్వప్నమున లేక తపశ్చరణమున నంతఃప్రజ్ఞను గలవాఁడై కవి యాత్మసాక్షాత్కారము నొందెను; వెంటనే యాత్మకామన యుదయించెను; లీల ప్రారంభమయ్యెను; కవితాప్రపంచము బహిఃప్రజ్ఞతచే సృష్టమయ్యెను.

ఈవిషయమే రామాయణమున గ్రథిత మైనది. నదీనైర్మల్యము తన మనమున లీనముకాఁగా యాప్రశాంతజలముల మైమఱచి క్రుంకు లిడి బహిరంతఃప్రజ్ఞతలు లేని నిద్రాముద్రితుఁ డగునానంది యైనవాల్మీకికి నంతఃప్రజ్ఞనుదిత మొనర్చు క్రౌంచమిథునాది స్వప్నప్రపంచదర్శనాత్మజ్ఞానసంధాయకతపశ్చరణములు కలిగి యాత్మకామనచే లీలమై రామనామమును నుద్ఘోషించెను. అది యాదికావ్యము. అతఁ డాదికవి. కవితోత్పత్తివిధానమిది. దానిప్రయోజనము స్వరూపజ్ఞానము. అనన్యమైన యద్వితీయమైన తనప్రజ్ఞానఘనము నానందము రసము నగుస్వరూపమును బ్రపంచిత మైనదానిని దిరిగి యద్వితీయమునుగా గ్రహించుటయే కవితాఫలము. ఇది కవితాప్రపంచము పుట్టిన తెఱఁగు.

ఈ ప్రపంచమున నివాసులు భిన్నత్వమునం దేకత్వమును గ్రహించి తరించు సహృదయులు. ఈజగత్తును బ్రహ్మనిర్మించినాఁడు. నిజమే కాని దేనినిగా నిర్మించినాఁడు? “నామరూపేవ్యాకరవాణి” యన్నాఁ డని యుపనిషత్తు.

నామము శబ్దము. రూపము రంగును, నామమున కర్థమును. అర్థము వస్తువు. దీనివలన మన కేర్పడువిషయములు కవితామలందలి వేవి యందురా? వస్తు వనుటచే విగ్రహనిర్మాణము. రంగనుటచేఁ జిత్రలేఖనము. ఇవి రెండును వ్యవహారమునకై శబ్దాధారమును గలవియే యగును. నామ మనుటచే నవ్యక్తమును వ్యక్తమునైన యర్థమును గలగాంధర్వమే. ఈ మూఁటియందును నామరూపముల సామ్యావస్థ లేదు. అందుచే నవి పరిపూర్ణసృష్టినొందనివే యగుచున్నవి. కవిత యట్టిదిగాదు. నామరూపములు దీన సామ్యావస్థ నొందియున్నవి. అది యెట్లన శబ్దార్థములే నామరూపములు గదా? శబ్దార్థప్రధాన మైనదే కావ్యము. ఇవి లేనిది కావ్యమునకు స్వరూపము లేదనుట. స్వరూపమున లాలిత్యము సౌందర్యము లేని దాదరణీయము కాదు కనుక యీ కావ్యకన్యాశరీరము రీతిని దెలుపుచుఁ బెద్దలు "శ్విత్రే కైకేన దుర్భగ" మ్మన్నారు. చూచితిరా నిర్దుష్టములును సౌష్ఠవములు నగుశబ్దార్థము లిందులకుఁ గావలయు నని చెప్పి యంతతోఁ దనివిసనక శబ్దార్థాలంకారములును గావేందిర కుండవలయు నని కావ్యపిపాసు లగువా రన్నారు. ఎవ్వరేమన్న నాకేమి కొదవ నాకావ్యకన్యక శ్విత్రాదిదోషభాజని యైనను సరియే, యనలంకృత యైనను సరియే బాహ్యచిహ్నము లగుశరీరాదులతోఁ బనేమి నన్నుఁ దన్మయునిఁ జేయు రసమును వెల్లడించుచున్నది కనుక నాకు నచ్చినదను నేఁటి యనాంధ్రు లగునాంధ్రకవులు తా మట్లనుట భాషయందు విజ్ఞానము తమకు లేమిచే నని యెఱుఁగకకాదు; డాంబికమునకై భోకరించుటకు. మఱియుఁ దమకుఁ దన్మయతను గూర్చురసమును వెల్లడించునది యాశ్విత్రదూషిత యగు కన్యయే గదా. ఏహ్యమగు నాయమరూపమునుండి తోలుతిత్తినుండి గోవు పాలను గ్రహించువానివలె రసము నట్టిఁడు సహృదయుఁడో కవియో గ్రహించునుగాక. ఈమాట మన మన్నచో జీవద్భాషకు నియమ మే మందురు. ఆంగ్లము జీవద్భాషగదా! సంభాషించునట్లు లుపన్యసించుటగాని యుపన్యసించునట్లు వ్రాయుటగాని యా యాంగ్లేయు లొనర్చుచున్నారా! వారొకవేళ నస్వతంత్రు లనవచ్చును. మనలో M. A. యందు త్తీర్ణులైనవారు కలరుగదా. వా రాబాసను స్వతంత్రులేకదా. ప్రతిపదమునం దనుచ్చారిత వర్ణముల ననేకముల ననవసరముగా వల్లించి వ్రాయవలసిన వానిని ద్రోసివేసి పాశ్చాత్యుల నుడికారమును (Idiom) బాటింపక స్వతంత్రులై తాము వ్రా

యుచున్నారా. అట్లు వ్రాసినవారిబాసను ఖండింపక విడుచుచున్నారా. తాము చిన్ననాటినాఁటనుండి స్వభావనువలె నభ్యసించిన భాషపై స్వాతంత్ర్యము తమకు లేదుగాని రాజపోషణము లేమిచే గుంజుచున్న యాంధ్రముపైననో తమకు స్వాతంత్ర్యము! పోనిండు. ప్రస్తుతము విచారింతము.

కావ్య మను ప్రపంచమునకు నామరూపములు సిద్ధించినవి. నామరూపములచే నది దేనిని వ్యక్తముచేయును. సహృదయునకు నేకత్వము నాపాదించును. ఈ యేకత్వము రసమయము ప్రజ్ఞానఘనము నని చెప్పితిమి గదా. ఒకఁడు వ్యక్తముచేయున దతనియంతఃస్వరూపము. బాహ్యాకృతిని జూచి తృప్తు లగుట యరుదు. అంతఃస్వరూపము నెఱిఁగినయప్పుడే యా యెఱుకవలని యానందము ననుభవింతురు. మీఁదుమిక్కిలి యా యెఱుకయే మనస్వరూపము నైనపు డంతకంటె వేఱానంద మేమి గలదు. కావ్యాత్మ యగుగసమే మనయాత్మయు నయినపు డొండొరుల కభేదము వెల్లడి యగును. అదియే ముక్తి. అందుచేఁ గావ్యాత్మయు మనయాత్మయు రసస్వరూపము లనవచ్చును. ఇదియే యఖండ మగు బ్రహ్మానందసబ్రహ్మచారియు నగు రసము. దీనిని గ్రోలుటయే జీవితావధి. ఈ చెప్పిన దంతయు వేదాంతముల రీతి. దీనినే మనకుఁ దెలియునట్లుఁ జెప్పికొనుటకు నఖండ మగురసమును భిన్నభిన్నఖండరూపములఁ జవిచూచి పిదప సమస్తమునందును నదియే యని నిరూపించు మార్గమున నడువవలయును.

ఈమార్గభేదములను బుద్ధికుశలు లగు నాలంకారికు లనేకవిధములఁ జెప్పిరి. వారిలో ముఖ్యము లగువాని నొకకొన్నిమతముల నిపుడు వివరింతును. రసస్వరూపాదికము వివరింపఁబడిన గ్రంథములలో నాట్యశాస్త్ర మగ్రగణ్యము. ఇందు రూపకాది దృశ్యకావ్యములయం దభినేయము లగురసములు వివరింపఁబడినవి. ఈతఁడు నాట్యరసముల నెనిమిదిటినిగా నొడివెను గాని యుద్భటుఁడు "నవనాట్యేరసాః స్మృతాః" యనినాఁడు. రుద్రటుఁడు శాస్త్రమువలె రసములు లేనికావ్య ముద్వేజక మగును గనుక కావ్యమును రసవంతముగాఁ జేయవలయు నని చెప్పి ప్రేయ మనునది పదియవరస మనెను. దానికి స్థాయి స్నేహ మని "స్నేహప్రవృత్తిః ప్రేయాన్ సంగతశీలార్యనాయకో భవతి" యనునది మొదలుగా వివరించెను. గంగానందకవి

యదాహ ధాత్ర్యా ప్రథమోదితంవచో యయౌతదీయామవలంబ్యచాంగులిమ్
అభూచ్చ నమ్రః ప్రణిపాతశిక్షయా పితు ర్ముదం తేన తతాన సోఽర్భకః॥

ఇత్యత్ర దశమం వత్సలాఖ్యం రస ముదాహరన్తి. తచ్చిన్త్యమ్. పుత్రాదివిషయ రతిభావే తస్యాన్తర్భావాత్. నచ స్థాయిభావభేదేన రసో భిద్యతే, తస్మాత్ అస్య స్థాయీభావః స్నేహ స్తద్భేదా ద్భేదోఽస్యేతి వాచ్యమ్. స్నేహస్యాపి రత్యాత్మకత్వాదితి దిక్. అని చెప్పుమాటలవలన వాత్సల్య మను నింకొకరసము నంగీకరించినవారును నున్నటులు స్పష్టముగదా. ఈగంగానందకవిరాజు సాహిత్యదర్పణకారుఁడు మునీంద్రమత మనియుఁ దద్వ్యాఖ్యాత కేషాంచిన్మత మనియుఁ దెలుపు వత్సలతాస్నేహము స్థాయిగాఁగల వత్సలరసమును నిందించెను. ప్రేమసహిత స్నేహము వత్సలతాస్నేహ మని వ్యాఖ్యాత యచటనుడివెను. అప్రస్తుత మైనను నిట నింకొకవిశేషము నుడివెదను. కోపింపకుఁడు, మనయాంధ్రవిశ్వవిద్యాలయము భక్తిరసము నొకదానిని సృష్టించినది. ౧౯౩౦ మార్చిపరీక్షకు నింటరుమిడియటు చదివిన విద్యార్థుల పఠనీయగ్రంథములఁ జేర్పఁబడిన కొండొకనాటకము నుద్ధరించుటకు నీసంస్థ యీపద్ధతి నవలంబించినదేమో. ఇఁక నొక్కమాట, మనుచరిత్రమున రెండవ యాశ్వాసమున నభివర్ణితమైన శృంగారాభాసము గుర్తింపనివారై కాఁబోలు నాపరీక్షకుఁ బ్రశ్నపత్రము నొసఁగినవా రాయాశ్వాసమునఁ గలరసమును దానిని గవి పెంపొందించినవిధమును వ్రాయు మని ప్రశ్నించిరి. ఇది మనవిద్యాసంస్థ విలాసము.

నాట్యాచార్యుఁడు నాట్యరసముల నెనిమిదనెను. ఆయనుట శ్రవ్యకావ్యములను గూర్చి కాదని మమ్మటాచార్యుఁడు "అష్టౌ నాట్యే రసాః స్మృతా" యని ప్రారంభించి "శాన్తోపి నవమోరస" యని నుడువుటచే సూచించినాఁడు. ఈవిషయములను మనసునం దిడికొని శాంతము నాట్యానుకూల మని వివరించువారి మతములను జేర్కొని యావివాదమును బరిసమాప్తి నొందించుచు రసగంగాధరకారుఁడు "యై రపి నాట్యే శాన్తో రసో నాస్తీ త్యభ్యుపగమ్యతే తైరపి బాధకాభావాత్ మహాభారతాది ప్రబంధానాం శాంతరసప్రధానతాయా అఖిలలోకానుభవసిద్ధత్వాచ్చ కావ్యే సోఽవశ్యం స్వీకార్య" యని పరిష్కరించినాఁడు. దీనినిబట్టి దృశ్యశ్రవ్యకావ్యములందు రససంప్రదాయమున భేదము స్పష్టము కాఁగలదు. ఇట్లు రసములు తొమ్మిదా యెనిమిదేనా యను

ననుమానము లటుండఁగా రుద్రటుఁడు ప్రేయ మనునొకదానిని గల్పించినాఁడు దానినే మైయుండనోపు నశ్నల మని సాహిత్యదర్పణకారుఁ డన్నాఁడు. ఇది మనయాలంకారికుల రససంఖ్యావివరణము.

అఖండ మగురసము నిట్లు విభజించుట కేల మనవారు పూనిరి? ఇ న్నింతలెక్క విభజింపనగును. అను ప్రశ్న మిట నుదయించును. శృంగారమే రసము; తక్కినవి తజ్జన్యము లని యొకఁడు "ఏకోరసః కరుణఏవ" యని యొకఁడు నద్భుతరసమే రసమని యొకఁడును శృంగార, కరుణ, వీర, రౌద్రములు ముఖ్యము లని యింకొకఁడును జెప్పిరి. వారిమాటల నొకకొంత సత్యము కలదు. కాని, యఖండ మగురస మాయాయిభావములను వెల్లడించునప్పు డాయాయవతారముల నొప్పెడు శివకేశవాదులవలె శృంగారాదిరూపముల నొప్పు నని మాయభిప్రాయము. గ్రామదేవతల వంటివి వ్యభిచారిభావములు. వీనివలని యానందము క్షణికము. అందువలననే యివి స్థాయిభావములు గాక వ్యభిచారి సంచారిభావము లని వ్యవహృతము లగుచున్నవి. ఈసంచారిభావములలో నొకటియే స్థిరముగాఁ గావ్యమునం దంతట నతిరస్కృతమూర్తిని గల దైనచో స్థాయిభావ మగును. ఈవిషయమునే పూర్వులయభిప్రాయముతోడి మెలపున పండితరాయలు, "అప్రబంధం స్థిరత్వ దమీషాం భావానాం స్థాయిత్వమ్, నచ చిత్తవృత్తిరూపాణా మేషా మాశుకినాశిత్వేన స్థిరత్వం దుర్లభమ్. వాసనారూపతయా స్థిరత్వం తు వ్యభిచారి ష్వతిప్రసక్తమితి వాచ్యమ్. వాసనారూపాణా మమీషాం ముహూరభివ్యక్తే రేవ స్థిరపదార్థత్వాత్. వ్యభిచారిణాం తు నైవ, తదభివ్యక్తే ర్విద్యుదుద్యోతప్రాయత్వాత్" అని గంభీరముగాఁ బలికినాఁడు. ఇది రసములనామకరణమునకును సందలి మతభేదములకుఁ గారణమయ్యెను. ఈమతమునఁ గవికి నపరిమితస్వాతంత్ర్యము 33 రసములను గల్పించువఱకుఁగలదు; కాని పేనునకుఁ బెత్తనమిచ్చిన మార్గమును గావ్యకర్తయవలంబించినఁ బ్రమాద మగు నని నామనవి. మఱియు నిట నొక్కవిషయము మీకు జ్ఞప్తికిఁ దెత్తును. సర్వరసములు నాట్యమునఁ బ్రయోగించుటకు వీలు గావని మాత్రము శాంతమునుగూర్చి యాలంకారికు లన్నదానిని బట్టి మనము గ్రహింపవలయును.

ఈశృంగారాదులగు రసము లన్నియు సుఖోపపాదకములే యని పలువు రాలంకారికుల మతము. కాని ప్రత్యాలంకారికుఁడును గరుణమువలన సుఖము

గలుగునా యని శంకించి తనకుఁదోఁచిన విప్రతిపత్తులకును సమాధానమును జెప్పుచు వచ్చినాఁడు. ఈవిషయమును విపులముగా రసగంగాధరకారుఁడే చర్చించినాఁడు. విశ్వనాథపంచాననుఁడును యథాబుద్ధిని నీవిషయమును విమర్శించినాఁడు. దీనినిఁ బట్టి చూడఁ గరుణాదులవలన సుఖము కలుగనేరదను వారును గలరేమో యని తోఁచును. ఈబుద్ధితో గ్రంథములం జదివినచో జైనుఁడగుగుణచంద్రుఁడు "సుఖదుఃఖాత్మకో రసః" యని చెప్పినమాటలు విన్పించును. మఱియు నతఁడు "విభావైర్లలనోద్యానాదిభి రాలంబనోద్దీపనరూపై ర్బాహ్యైర్హేతుభిః స్వతప వావిర్భావాద్వ్యభిచారిభి ర్గ్లాన్యాదిభీ రసికమనః శరీరవర్తిభిః పరిపోషణాచ్చ శ్రితోత్కర్షః స్వీకృత సాక్షాత్కారిత్వానుభూయమానావస్థో యథాసంభవం సుఖదుఃఖస్వభావో రస్యతే ఆస్వాద్యతే ఇతి రసః తత్ర ఇష్టవిభావాది ప్రథితస్వరూపసంపత్తయః శృంగారవీరహాస్యాద్భుతశాన్తాః పంచ సుఖాత్మానః అపరే పున రనిష్టవిభావాద్యుపనీతాత్మానః కరుణరౌద్రబీభత్స భయానకాః చత్వారో దుఃఖాత్మానః" యనియు నుడివినాఁడు. ఈవిషయమును బూర్తిగాను రూపకోత్కర్షమును రంగమునందు నటాదుల స్థానమును సామాజికనిర్వచనాదులును దెలిపినఁగాని కవితాప్రపంచము నందలివిషయముల నెల్ల నెఱుకపఱుచుట కాదని యెఱింగియు నొక్కవ్యాసమున వానిని సూచించుటయు దుస్తరమను నభిప్రాయమున యథావకాశమున నాయాయివిషయముల నాంధ్రలోకమున కర్పించి కృతార్థుఁడనుగాఁగల నను తలఁపున నింతతో నీవ్యాసమును ముగించుచున్నాను.

---

పరస్మైజ్యోతిషే నమః

# పోతనభక్తి—భాగవతరచన.

— జనమంచి శేషాద్రిశర్మగారు-కడప —

మోక్షసామ్రాజ్యమున నధివసింపఁజేయు మార్గమును దెలుపు గ్రంథములలో భాగవత ముత్తమోత్తమ మనువిషయము సర్వజనాంగీకృతము. అట్టిది దేవీభాగవతమా శ్రీభాగవతమా యనుచర్చ చిరకాలమునుండి వచ్చుచున్నది. ఇట నది యనవసరము. బమ్మెర పోతన మహాకవి. మహాభక్తుఁడు. ఆమహాపురుషుఁడు శ్రీభాగవతమును దెనిఁగించెను. ఖ్యాతిని గోరికాదు. ముక్తిని గోరి యని స్పష్టముగాఁ జెప్పెను.

ఒనరన్ నన్నయతిక్కనాదికవు లీయుర్విం బురాణావళుల్
తెనుఁగుం జేయుచు మత్పురాకృతశుభాధిక్యంబు తా నెట్టిదో
తెనుఁగుం జేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననమ్మున్ సఫలంబు చేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్.

అనుపద్య మాయభిప్రాయమును దె పెడిని.

పోతన శివభక్తుఁ డనియుఁ దుదకు రామభక్తుఁ డయ్యెననియుఁ గొంద ఱందురు. ఆమాట విశ్వాసార్హము కాదేమో యని నే నూహింతును. మహాభక్తుఁడగుట నామహనీయుఁడు శివకేశవభేదమును బాటించువాఁ డన వలనుపడదు. కావుననే—

చేతులారంగ శివునిఁ బూజింపఁ డేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁ డేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁ డేని
కలుగ నేటికిఁ దల్లులకడుపుఁ జేటు.

ఈపద్య మాంధ్రీకరణమున దలిది కాదు. స్వాభిప్రాయద్యోతకము. దీనింబట్టి మహాత్ములచిత్తవృత్తి నీటిమట్టమువలె సమముగ నుండు ననియు సకలదేవతల న్నొకరూపముగనే వారిదృష్టి తిలకించుననియు నామధేయమును బట్టి యట్టివా రులికిపడ రనియు స్పష్టమయ్యెడిని. దీనికే మహోక్తియు దాహృతి

యుఁ గననయ్యెడిని. రామచంద్రుఁడు స్వప్నమున దర్శనమిచ్చి "తా రామ భద్రుండ మన్నామాంకితముగా శ్రీమహాభాగవతమ్ము తెనుంగుసేయుమునీకు భవబంధఁబులు తెగును" అని యానతిచ్చినట్లు పోతనయే వ్రాసెను. అట్టి కవి "నాచిత్తంబున శ్రీరామచంద్రుని సన్నిధానమ్ము గల్పించుకొని" అనియు వ్రాసి వెంటనే షష్ఠ్యంతములకుపక్రమించి,

"హరికి నందగోకులవిహారికి" అని నాలుగుపద్యములు చెప్పి యందుఁ బ్రతిపాద్యవస్తువు కృష్ణమూర్తిగాఁ దెలిపెను. రామమూర్తి నానామాంకిత ముగాఁ దెనిఁగింపు మని యాజ్ఞాపింపఁ గృష్ణనామమున షష్ఠ్యంతములు దెలు పుటకుం గత మేమి? స్కంధాంతమునను స్కంధాదియందును రాఘవరామా యని నుడువ హేతువేమి? రామకృష్ణాదినామములు గలపరతత్త్వ మ్మొక్కఁడే యనికదా. శివశంకరాదినామములాపరతత్త్వమునకుం జెల్ల వనువా రున్న చో వారి క్కొన్నమస్కార మర్పింపవలయును. సర్వశబ్దము లాపరతత్త్వమున కుఁ జెల్ల వన్నచో నది యద్వితీయ మేలా గగును? సర్వాంతర్యామి యె ట్లగును. నిర్గుణుఁడు నిరాధారుఁడు సర్వాధారుఁడు నగునాపరమేశ్వరుఁడు భక్తానుగ్రహార్థము భావనానుకూలరూపములఁ దాల్చు నన్న శ్రీభాగవతాది సద్గ్రంథసిద్ధాంత మేలాగు నిలుచును? నిలువకయున్న "అద్వితీయం బ్రహ్మ" యనుమహావాక్యము వ్యర్థముకాదా. కావున మహాకవి తల్లజుని చిత్తమున నద్వైతము తాండవమాడుచుండు ననుట సత్యమని వచియింప నాకు ధైర్య ముగలదు. అంతియగాదు. పోతనదృష్టి సద్గ్రంథము లన్నియుఁ బురాణములే యని చూచును.

'నన్నయతిక్కనాదికవు లీయుర్విం బురాణావళుల్ తెనుఁగుంజేయుచు.'

అన్నచోట మహాభారతము పురాణ మనఁదగునా? ఇతిహాసవర్గము కాదా? మహాకవి కంతమాత్రము తెలియదా? భగవచ్చరిత్ర భాసురము లన్నియుఁ బురాణము లనియే వారిభావము. సకలసద్గ్రంథము లాపరమేశ్వ రు మహిమమునే పలుమార్గములఁ దెలుపును. అన్నింటికి గమ్యస్థాన మ్మొకతత్త్వమేకదా? ఆయామహా యామహాత్మునకుఁ జక్కఁగాఁ గల దని తోఁచెడిని ఇంతయేల? పక్షపాతము మానవులయందుఁ బోలె దేవతలయందును గొం దఱకుండును. అది కర్మభేదమునఁ గలుగునది యనుట సర్వమహాశయ స మ్మతము.

భాగవతరచన:—భాగవతము నాంధ్రీకరించుకార్యమునందు మహాకవి భక్తిరసపారవశ్యమునఁ దన్నే తా మఱచెను. శృంగారరసమున భగవంతుని వర్ణించుఘట్టములందుఁ బోతనకు లోకదృష్టియే లేదనకతప్పునా? మూలమే మూలమున్నదో యాతఁ డెఱుఁగఁడు. భగవంతుని దివ్యసుందరవిగ్రహము మ్రోలఁ గనఁబడఁగా విశ్వమునే మఱచును. కావుననే మూలమును వీటిఁబుచ్చి స్వేచ్ఛగాఁ బద్యముల నల్లెను. భాగవత మాధారముచేసికొని తనబుద్ధిచమత్కృతిని గనఁబఱిచెనని కొందఱందురు. నేనుమాత్రము తప్పొయొప్పొ పైనవ్రాసినట్లే భావించితిని. తప్పైన క్షమింపుఁడు. ఒప్పైన నానందింపుఁడు. ఇంకక నాయాశయ మిదియని తెల్పినాఁడను. కొన్నితావుల భాషాంతరీకరణముం దెలిపెద.

త్రిభువనకమనం తమాలవర్ణం రవికరగౌరవరాంబరం దధానే
వపు రలకకులావృతాననాబ్జం విజయసఖే రతిరస్తు మేఽనవద్యా॥ ౩౩

స్క ౧- అధ్యా ౯.

మ. త్రిజగన్మోహనశీలకాంతిఁ దనువు ద్దీపింపఁ బ్రాభాతనీ
రజబంధుప్రభ మైనచేలము పయిన్ రంజిల్ల నీలాలక
వ్రజసంయుక్తముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా
విజయుం జేరెడువన్నెకాఁడు మది నావేశించు నెల్లప్పుడున్.

ఇది మూలాను సారమే యనవలయు. వ్యత్యాసించిద్భేదముగలిగిన నది సంస్కృతమునకు మెఱుఁగుపెట్టినట్లే యున్నది.

తత్రాగమద్భగవాన్ వ్యాసపుత్త్రో యదృచ్ఛయా గామటమానోఽనపేక్షః
అలక్ష్య లింగో నిజలాభతుష్టో వృతశ్చ బాలై రవధూతవేషః॥ ౨౫
తం ద్వ్యష్టవర్షం సుకుమారపాదకరోరుబాహ్వంసకపోలగాత్రమ్
చార్వాయతాక్షోన్నసతుల్యకర్ణసుభ్ర్వాననం కంబుసుజాతకంఠమ్. ౨౬
నిగూఢజత్రుం పృథుతుంగవక్షస మావర్తనాభింవళివల్గూదరంచ
దిగంబరం వక్త్రవికీర్ణకేశం ప్రలంబబాహుం స్వమరోత్తమాభమ్॥ ౨౭
శ్యామం సదాపీచ్యవయోంగలక్ష్మ్యా స్త్రీణాం మనోజ్ఞం రుచిరం స్మితేన।
ప్రత్యుత్థితా స్తే మునయ స్స్వాసనేభ్య స్తల్లక్షణజ్ఞా అపి గూఢవర్చసమ్॥

ప్రథమస్కం॥ ౧౯ అధ్యా.

సీ. ప్రతినిమేషము పరబ్రహ్మంబు వీక్షించి మదిజొక్కి వెలుపల మఱచువాఁడు
కనులంబు మీఁదిభ్రూగములకై నడి మోముపై నెఱసిన కేశపటలివాఁడు
రెుట్టాసి మాయనంగీకరించినభంగి వసనంబుఁగట్టక వచ్చువాఁడు
సరిగాఁడసవెటఁ జాటుభూతములు నాబాలురహాసశబ్దములవాఁడు
తే. మహితపదజానుజంఘోరుమధ్యహస్త, బాహువక్షోగళాననఫాలకర్ణ
నాసికాగండమస్తకనయనయుగళుఁ, డైనయవధూతమూర్తి వాఁడరుగుదెంచె.
ఉ. ఈరని లోకులంగినిసి, యొగ్గులు పల్కినివాఁడు కోరికల్
కోరనివాఁడు గూటువలఁ, గూడనివాఁడు వృథాప్రపంచముం
జేరనివాఁడు దైవగతిఁ జేరిన లాభముఁ జూచి తుష్టుఁడై
నేరనివాని చందమున, నేర్పులు చూపనివాఁడు వెండియున్.
ఆ. అస్త్రహాసషోడశాబ్దవయోరూప, గమనగుణవిలాస కౌశలముల
ముక్తికాంతచూచి మోహితయగుసనన, నితరకాంత లెల్ల నేమిచెప్ప.
ఆ. వెర్రితనము మాని విజ్ఞానమూర్తియై, బ్రహ్మభావమునను బర్యటింప
వెర్రియంచు శుకుని వెంటనేతెంతురు, వెలఁదు లర్భకులును వెఱ్ఱులగుచు.

ఈఘట్టమున మహాకవి మూలానుసారము వ్రాసియు నత్యంతవిచిత్రముగా యవనిక నలంకరించెను. మూలమున గూఢముగ నున్నయర్థమును విస్తరించెను. దాన శుకమహర్షి మహత్త్వము వెల్లడియగు ననియు నట్లుచెప్పుట కవిధర్మమనియుఁ బోతనభావమైనట్లు కనుపట్టెను.

"సుకవితా యద్యస్తి రాజ్యేనకిమ్"

అన్నసూక్తిని బోతనమహాకవి నమ్మెనని మన మూహింపవలయును.

శ్రవణం కీర్తనం విష్ణో స్స్మరణం పాదసేవనం।
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్॥ ౨౩
ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చే న్నవలక్షణా।
క్రియతే భగవత్యద్ధా తన్మన్యేఽధీతముత్తమమ్॥ ౨౪

సప్తమస్కం॥ ౫ అధ్యా.

మ. తనుహృద్భాషల సఖ్యముఁ శ్రవణముఁ దాసత్వముఁ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయుఁ సంకీర్తనల్ చింతనం
బను నీతొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలతున్ సత్యంబు దైత్యోత్తమా.

ఈపద్యముం గాంచినచో భాషాంతరీకరణ మెట్టులుండవలయునో తెలిసికొనవచ్చును. ఎందు హెచ్చుగాఁ జెప్పవలయునో, ఎందు సంగ్రహించి చెప్పవలయునో, ఎందు నున్నదున్నట్లు తెలుపవలయునో యీపద్యమున నీమహాకవి తెలిపెను. ఈమార్గము ననుసరించినచో మూలమునఁ గలభావము లోకుల కేరీతిఁ దెలుపవలయునో తెల్లమగును. మక్కికిమక్కి యన్నరీతి మార్చిన బాగుండునా. కొందఱు మహాత్ములు "తపస్స్వాధ్యాయనిరతుండును, తపస్వి వాగ్విదాంవరుండును, నారదుం బరిప్రచ్ఛించెను, వాల్మీకిమ్మునిపుంగవుండును కోన్వస్మిన్ సాంప్రతుండును, అని వ్రాసిననే భాషాంతరీకరణ మనఁబడు నని సిద్ధాంతము చేయుదురు. ఈసిద్ధాంతమును దలంచిన నాకొకకథ స్మృతిగోచర మయ్యెడిని.

మున్ను శ్రీనాథమహాకవి నైషధమును దెనిఁగించి శ్రీహర్షునికడ కరిగి వినిపించెనఁట. అపరమకవిచంద్రుఁ డాపద్యముల వినుచు "నందు గమికర్మీకృతనైక నీవృతుఁడనై" అన్న వాక్యమును విన్నయంతనే దిగ్గన లేచి వత్సా! నీదుముప్రులు నీవే తీసికొని నాశ్లోకము నాయొడిలో వేయుమా యని వేఁడెనఁట. ఈకథ కల్పితమే కాని సత్యము కాదు. కాని పైసిద్ధాంతమునకు సహకారి యగును.

మహాశయులారా! భాగవతమునఁ గొన్నితావులఁ జూపితిని. భాషాంతరీకరణమునఁ గవి యిష్టము ననుసరించి మెలంగవచ్చును. కాని దాన లోకమున కుపకారము గలుగవలయును. పోతనవంటి మహాకవి అట్టిభక్తుఁడు మరలఁ బుట్టుటరిది. పరమపావనచరిత్రుఁ డగుట నేఁటికి నామహామహుని నామస్మరణము భగవన్నామస్మృతివలె నస్మదాదులకు నైనది. వారిమార్గము ననుసరించినఁ దరింపవచ్చును. స్థాలీపులాకన్యాయమున వారిభాగవతమునఁ గలపద్యముల వ్రాసితిని. పోతనభక్తి సర్వమతసమ్మత మనియుఁ దెలిపితిని. అట్టి భక్తి కుదుర్చుకొనుటకు నావంటిపామరులు ప్రయత్నింపవలయును. మూఁడు నామములు పైకిఁజక్కఁగా దిద్దినఁగాని విష్ణుభక్తుఁడు కాఁడనియు, మూఁడడ్డగీతలుగా భస్మమును దీర్చినఁగాని శివభక్తుఁడు కాఁడనియుఁ జెప్పువారిమాటలు హేయములు గాని గేయములు కావనియు మనమెఱుంగవలయును. బాహ్యలక్షణములు భక్తికిమార్గములే కావనియు, నేమతస్థుఁడైనను భగవంతుని సేవింపనర్హుఁ డనియు భగవంతునకు జిహ్నములే లేవనియు నవిమానవులచేఁ గల్పింపఁబడిన వనియు మనము తెలిసికొనవలయును. ఇఁక విశేషించి వ్రాయ నిదిసమయము కాదు. ఒక్కసారి భక్తశిరోమణి యగుపోతనమహాకవి నామమును స్మరించి యీవిషయమును ముగించుచున్నాఁడను.

# పీఠిక.

మా కాశీభట్టకులజులును పండితవరులును కవలివాస్తవ్యులును నగు లింగమూర్తిశాస్త్రులవారు తమపుత్త్రునకు నాంగ్లేయవిద్యను నేర్పించిరి. అతఁడు కొంత భాషాపరిచయము కలిగిన తరువాత ఆంగ్లేయవైద్యమునందుఁ గొంత వైదుష్యమును సంపాదించుకొని రాజమహేంద్రవరములో వైద్యముచేయ మొదలిడెను. ఆహేతువుచే లింగమూర్తిశాస్త్రులవారు రాజమహేంద్రవరమునందలి ఇన్నీసుపేఁటలో సకుటుంబముగాఁ గాఁపురముండిరి. ఇట్లుండ వారి పుత్త్రకుఁ డసహాయోద్యమములోఁ బ్రవేశించి శ్రద్ధాభక్తులతోఁ బనిచేయుచు రాఁగాఁ దుద కాతని కీనడుమ 2½ యేండ్ల కారాగారప్రాప్తి సంప్రాప్తమాయె. ఈవిధముగా, ప్రియపుత్త్రవియోగము సంప్రాప్తమగుటచే మిక్కిలి వృద్ధులైయున్న శాస్త్రులవా రావియోగమును సహింపఁజాలక దశరథునివలె హా పుత్త్రా యని విలపించుచు స్వర్గమున కేగిరి. ఈ విచారకరవార్తను హిందూపత్త్రికలో నొకవిలేఖకులు ప్రచురించుచుఁ బ్రమాదవశమున లింగమూర్తిశాస్త్రులవారు స్వర్గస్థులైరనుటకు మాఱుగా బ్రహ్మయ్యశాస్త్రులవారు స్వర్గస్థులైరని వ్రాసిరి. అయ్యది యాంధ్రలోకములోఁ గొంత యలజడిని గలిగించినది. నాకు స్వర్గప్రాప్తికలిగినట్లు లోకము భ్రమింపఁ జొచ్చినది. నాయందు ప్రేమగల పత్త్రికాధిపతులు తమపత్త్రికలలో నన్నుం గూర్చి యనుతాపవాక్యములఁ జాలఁ బ్రకటించిరి. ఇతరాప్తులు మాయింటికిఁ బరామర్శలేఖలు వ్రాసిరి. పలువురు సందేహించి మా యింటికడకు వచ్చి సంగతులు తెలిసికొనఁ జొచ్చిరి. ఇట్లు ప్రమాదవశమునఁ గలిగిన యపవాదమును దొలఁగించుటకై మాసోదరుఁ డగు చిరంజీవి సుబ్బయ్యశాస్త్రి మున్నగువారు పత్త్రికాతల్లజమగు నాంధ్రపత్త్రికలో నాక్షేమవార్తను దెలుపుచు సవరణమును బ్రకటించిరి. ఈరీతిగా నన్నుఁగూర్చి లోకమునఁ గలిగిన భ్రాంతి నివారింపఁబడినది. ఏమైనను నాయింట నేను సుఖముగఁ గూర్చుండియుండఁగనే విబుధలోకసందర్శనము గావించుకొను భాగ్యము పట్టినది కావున నీచిత్త్రవిశేషమును గావ్యముగా నొనరింపఁదగునని యెంచి నే నీ చిన్నిపద్యకావ్యమును విరచించితిని. దీనికిఁ దగినతావు నాంధ్రపండితలోకము దయతో నొసంగును గాక !

కాకినాడ, }
11-2-31. }

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి.

శ్రీరస్తు.

# నా విబుధలోక సందర్శనము.

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు, కాకినాడ.

---

మాదువంశభవులు మానితకీర్తులు, లింగమూర్తినాఁ జెలంగుబుధులు
స్వర్గమేగ వారిస్వర్గప్రాప్తి భ్రాంతిచే, నాకునంటఁగట్టె లోకజనము.

తే. గీ. భూమిపై నుండఁగనె నాకుఁబొలుపుమీఱ
విబుధలోకానుభవ మబ్బె విశదముగను
నాప్తమిత్రావళి యనుగ్రహంబువలనఁ
గాన వారికిఁ దగ నమస్కార మిడుదు. ౧

గీ. బొందెతోడ నెయీమధ్యఁబోయి వింత, విబుధలోకంబువీక్షించివిశదముగను
నేనుగాంచినచిత్రంబు లెల్లవినుఁడు, ధర్మరతులార నామీఁది దయనుబూని.

గీ. సర్వలోకవిశేషముల్ చతురమతుల, సరయుచుండెడు పైవార లంపినట్టి
పత్రికలఁబట్టి నాకు నీచిత్రమైన, స్వస్థతను గాంచు భాగ్యము పట్టె నేను. ౩

గీ. విబుధలోకఁబువీక్షింప వేడ్కమీఱ, ఘనపథంబును జేకొని యనుపమగతిఁ
ద్రోవయందలిచోద్యముల్ సావకాశ, ముగనుగనుఁగొంచుమెల్లఁగఁబోవుచుండి

సీ. సవనంబులను భక్తిశ్రద్ధల సాగించి, వచ్చెడుకర్మఠపాళిఁ గంటి
వ్రతముల నిష్ఠను వదలక కావించి, వచ్చెడువ్రతుల దొవరుసఁ గంటి
ధర్మకార్యంబులఁ దప్పక యొనరించి, వచ్చెడుధార్మికావళిని గంటిఁ
బరమేశుపాదముల్ భక్తితో సేవించి, వచ్చెడుభక్తులపంక్తిఁ గంటి
దేశమాతను సేవించి దీక్షఁబూని, యుద్ధమొనరించి వచ్చెడు యోధవరుల
మఱియు వీరసతులఁగని మార్గమందు, ధన్యవాదంబుసలిపితిమాన్యఘణితి. ౬

క. ఉన్నతగోత్రజ సన్ముని, సన్నుత నిర్మలపవిత్రజలధారాసం
పన్నను గంగను గాంచితిఁ, గన్నులకఱ వెల్లఁదీఱ ఘనమార్గమునన్. ౭

సీ. సన్మార్గమున నిట్లు చనిచని ముందటఁ, గనుఁగొంటి విబుధలోకంబు నెల్ల
వరసుమనఃపాళివర్తనం బంతయు, గాంచిన చోద్యంబు గలిగె మిగుల
ననుగాంచి విబుధులు మనముల నేమియో, సందేహములుపొందసాగిరెంతొ
నేను వారిని జేరి నెమ్మదితోడను, సంభాషణంబును సలిపినంత

పూర్వసందేహముల్ వీడిపోవవారు, నన్ను దరిజేరఁగానిచ్చి నయముమీఱ
నాదరాయత్తచిత్తులై యతిముదమున, నాకుఁజూపి రలవిబుధలోకఘనత.

క. సంతతముం గనువారల, సంతసమందించి విబుధసన్నిధిఁ గనుచుం
జింతలఁ బాపుచు నుండెడు, చింతామణిఁ గాంచినాఁడఁ జేతం బలరన్. ౯

క. కాంచితినమరనగరమున, నంచితసౌధాగ్రసీమలందున వరుసం
బ్రాంచచ్ఛోభాయుతవర, కాంచనసమచారుగాత్రకలితల సతులన్. ౧౦

ఉ. వారివిలాసవిభ్రమము వారివిశాలవిలోకనప్రభల్
వారిమనోహరాకృతులు వారిమనోగతవృత్తిసంపదల్
వారివిహారచేష్టలును వారివిహారవిచిత్రకేళులున్
వారిజసూతిఁ బోలుకవివర్యులకైనను నెంచ శక్యమే. ౧౧

సీ. బువ్వనువండరు బోనంబు మెసవరు, నవసుధాపానంబు నడపుచుంద్రు
భూమిని నడువరు బుడుతలఁ గాంచరు, ఆకాశగమనాప్తి నడరుచుంద్రు
కష్టముల్ గాంచియుఁ గన్నులమూయరు, కఠినహృదయులౌచుఁ గ్రాలుచుంద్రు
భోగప్రియత్వంబు పొలుపొందఁగా నెప్డు, గాంచుచునుందురు కాంక్షమీఱ

గీ. ఇట్టివారలతోడను నెసఁగుచుండు, గాఢసంసార మేరీతిఘనతనొందు
లేదుసంసారసౌఖ్యంబు లేఖకాళి, కెంచి చూడంగ లోకాళి నెందునైన. ౧౨

క. చందనచర్చితదేహుల, సుందరమందారదామ శోభితగళులన్
మందొసఁగియనంతామర, బృందంబులఁ దేర్చువిబుధభిషజులఁ గంటిన్. ౧౩

గీ. స్వస్థతంగాంచియున్నట్టి సఖులగురుల, బంధుసందోహముల ఘనపండితులను
బరిచితులఁగాంచిచారు సంభాషణముల, సలిపిమోదాబ్ధిలోఁ దేలఁగలిగినాఁడ.

గీ. నడుమనడుమను ననుగూర్చి నవ్యగతుల
వచ్చుచుండెడు లేఖాళివరుసమూడ
నాకె యెంతో యద్భుతమును నవ్వపొడమఁ
జొచ్చె నా లోకగమనిక చోద్యముగద. ౧౫

క. సుందరకుసుమచయ ములఁ, బొందుగధరియించియెంతొ పొలుపొందెడునా
నందనశోభనుగనియా, నందాంబుధిఁ దేలినాఁడ నయమొప్పారన్. ౧౬

ఆ.వె. తేఁటితేటపాట తేటపడెడుచోట్ల, పూలజాల మొలిఁగ్రాలుదిశలు
చిలుకకలికిఫలుకు లొలికెడుపట్టులు, పూనికానసాను పుష్పవనుల. ౧౭

శా. పొందారన్ మదిఁ బుట్టుచుండెడు తలంపుల్ తీర్చి వేయంగ నా
సౌందర్యాంచితపత్త్రపుష్పఫలవచ్ఛాయంబులై యుండు నా
మందారంబులఁ బారిజాతములచే మాన్యంబులౌ తోఁటలా
నందం బేర్పడఁ జూచినాఁడను నిదానం బొప్ప నవ్వీటిలోన్. ౧౮

క. రంభను గాంచితి నొక్కెడ, శుంభత్తార్క్ష్యానుసార శోభితఫలభు
క్సంభోగోచితరుచిసం, రంభంబున నొప్పుదాని రమ్యాకారన్. ౧౯

గీ. సుందరచ్ఛాయలొప్పారసొంపు నింపు, చుండు కొమ్మలు సొగసుగాఁ జుట్టియుండ
తీవి మెఱయనున్నతమగు తావునందు, గ్రాలు నింద్రాణిగను గొంటి ఘనముదమున

గీ. అచట వేశ్యల చర్యలత్యనుచితములు, ఫలము తనుకు లేకున్నను బ్రభువు మెచ్చ
బరమసాధువులై యుండు భవ్యబుధుల, పూతతపములు చెఱతురు పొంతఁ జేరి.

ఆ.వె. గాణ వేణువీణ కరములఁ జేకొని, గోటమీట పాటనీటుగాఁగ
బాడ నాడుబోడి బసువడి నాడంగఁ, జటుల విటుల పటలి సంతసించు. ౨౨

మ. వశమే తెల్పఁగ బ్రహ్మకైనను బుధీవైచిత్ర్యసౌందర్యముల్
అశనంబై విలసిల్లుచుండును సుధాహారాదిసద్వస్తువుల్
కుశలత్వంబును గూర్చుచుండు విలసద్గోచారుమహౌషధుల్
విశదంబై చనుచుండు నెప్డు నగరీవేశ్యాపణాది క్రియల్. ౨౩

చ. అచటి సభాస్థదివ్యమణికాద్భుతనాట్యవిశేషవైభవం
బచటి విపంచికాహృదయహారిమహోన్నతగానమార్దవం
బచటి మృదంగకుంభజతాళముల నాదమనోహరత్వముం
బ్రచురముచేసి చెప్పుటకు బ్రహ్మకునైనను శక్యమెట్లగున్. ౨౪

సీ. పెక్కువిమానంబు లెక్కి హాయలు మీఱ, వినువీధి వాహ్యాళి వెడలువారు
జంటలుగాఁ గూడి సరసత మీఱఁగఁ, బూఁదోఁటలందునఁ బొదలువారు
భువి దీవ్రతపముల పుణ్యశాలిగఁ దమ, పుట్టి మునుఁగు నంచుఁ బొగులువారు
దివ్యరూపంబులఁ దేజరిల్లెడు వేశ్యలం గాంచి మదిని వలచెడువారుఁ

గీ. గానఁబడిరందు నంతటఁ గలయఁ జూడ, దేవదేవుని పాదసంసేవనంబు
సలుపు చెప్పెడు సన్మార్గచారులైన, భక్తవరు లెందునుం గానఁబడరదేమొ!

గీ. అట ననంతామరులు సిరు లలరుచుండ
సుందరాకారవేషముల్ సొంపు నింప

భోగభాగ్యానుభవమును బొందు చెపుడు
చారుసంచారములఁ దమి సలుపుచుంద్రు. ౨౬

సీ. డంబుమీఱంగ నన్నంబును గొనక యే పానంబుమీఁదనే బ్రతుకువారుఁ
బెద్దతనము లేక పెంపెక్కి పూర్ణయౌవనభోగమే గన వలచువారుఁ
బుణ్యజనంబులపొత్తును గోరక హింసించివేయంగ నెంచువారుఁ
దేటతెల్లంబగు మాటలనుడువక గీర్వాణముల నెప్డు కెరలువారుఁ
గీ. గానఁబడి రలవిబుధలోకంబునందె, గొప్పగా దీని నెంచిరి కోవిదాళి
విబుధలోక మీరీతిగా వెలుఁగఁజొచ్చె, విధివిధానంబుచూడంగ వింతకాదె.
గీ. కనకముపయిని నివసించుకారణమున, నిద్రయనునది యెఱుఁగ రీనెలవువార
లరయధనమె యాసకలసుఃఖాకరంబు, దానినెఱుఁగరుజనములీధరణిమీఁద.

ఉ. పన్నుగ రాజనీతి తెలుపంగల శాస్త్రమెఱింగినట్టి వి
ద్యోన్నతుఁ డౌగురుండు సచివోత్తముఁడై యలరారుచుండఁగాఁ
గ్రన్నన బంధుజాలములు కార్యవిచారము చేయుచుండఁగా
నెన్నిక లోకమేలు విబుధేశుఁడు స్వప్రజ మెచ్చుచుండఁగాన్. ౨౯

గీ. పాకశాసను భాగ్యమే భాగ్యమనుచుఁ, బొగడుచుందురు భూప్రజ పోల్చిచూడ
భుక్తి కాధారమతనికి భూక్రతువులె, కనఁగ దూరపుకొండలునునుపగుఁగద.
గీ. విబుధనాథుండు కనుఁగొని వేయికనులఁ, దనదువారికె గలిగింపఘనతనంత
పాటుపడుచుండు నెప్పుడు పరులనెల్ల, నణఁచివేయంగఁ జూచునహర్నిశంబు.
గీ. విబుధు లొనరించుపరిషత్తువిధము వేఱు, గురుల సంభాషణంబులగురుత వేఱు
విబుధనాథుండు తుదిఁ దీర్చువిదిత మైన, పక్షపాతంపుతీర్పులవరుస వేఱు.
గీ. అమలసౌధాళి యెంతయో యలరుచుండు
విమలభోగంబు లెన్నియో వెలయుచుండు
నమితచోద్యంబు లెన్నియో యడరుచుండుఁ
గ్రమత నాతిథ్య మెచ్చటఁ గానరాదు. 33
ఆ. వె. మారువిజయభేరి మఱిమీఱి మ్రోగు నీ
పురవరంబునందు మరుఁడు కెరలి
వావివరుస లేక వర్తిలఁగాఁ జేసి
దొరల గురులఁ గూడ మరులుకొలుపు. ౩౪

శా. సంతానంబులఁ గాంచుటెల్ల వనినా శౌర్యక్రియల్ మాటనా
పంతంబుల్ ఘనకేళిసౌధములనా ప్రాఁబల్కులం బ్రజ్ఞలా
స్వాంతంబుల్ వరభోగభాగ్యతతినా సంచారముల్ గాలినా
చింతల్ యజ్ఞవిభంగకృత్యములనా చిత్రంబుగా నచ్చటన్. ౩౯

సీ. పాపకార్యం బని భావింపకయె మది గురుభార్యఁ గూడెడునరసుఁ డొకఁడు
దోషకృత్యం బనుభావనంబుఁ గానక రుసికొమ్మఁ బట్టెడురసికుఁ డొకఁడు
నీతి పాడగుననుభీతిని బొందక యన్నభార్యను జేరునార్యుఁ డొకఁడు
ప్రేమను దెగఁగోసి పినతల్లి గర్భంబె ఖండించివేసెడు ఘనుఁ డొకండు

గీ. నగుచు నుందురు విబుధులీనాఁటియందు, భోగభాగ్యంబులందు నెబుద్ధినిలుపు
నాగరకతకు నిలయమౌ నగరసీమ, నీతి యింతయు నిలువంగనేరదు గద.

గీ. విబుధలోకంబునను గూడఁ బెలుచఁ దొల్లి
బ్రహ్మహత్యాదు లొనరింపఁబడుటచేతఁ
బరులచేతను రాష్ట్రంబు పడఁగఁ జొచ్చె
నీతి లేకున్నరాష్ట్రముల్ నిలుచుటెట్లు. ౪౦

క. పొంపుగ సుమనఃపురవర, సౌందర్యం బెల్లఁజూచి సాకల్యముగా
నందలి నాథుని గనకయె, క్రందుగఁ జనుటొప్ప దంచు రభసము మీఱన్.

ద్విపద. అని చని విబుధేశు నాలయ మెదుట, గని ద్వారపాలుర కరుణనుబడసి
మందిరశోభను మఱిమఱిఁ గనుచుఁ, బొందుగా లోనికిఁ బోయి వేడుకను

చ. సురుచిరసౌధభాగమున శోభిలు చావడియందు నొప్పుసుం
దరతరరత్నపీఠమున దర్ప మెలర్పఁగఁ గూరుచుండి యా
దరమున స్వీయకార్యములఁ దాలిమి మీఱఁగఁ జూచుచున్న యా
దొర విబుధేశుఁ గన్గొని కుతూహలమొప్పఁగ మ్రొక్కి నిల్చితిన్. ౪౧

ద్విపద. ఆతఁడు ననుఁగని యాశ్చర్యమొంది, యేతీరునను వచ్చి తీ విప్పు డిటకుఁ
జెప్పు మనంగను జేతులు మోడ్చి, యొప్పిద మగునయ మొప్ప నిట్లంటి. ౪౨
సెల వైన దంచును జెప్పఁగాజనులు, నిలయంబునం దుండి నేవచ్చితిటకు
ననుచును నేఁబల్క నచ్చెరు వంది, యనువుగ యోజించి యతఁ డిట్టులనియె.

మ. సరిగా నిక్క మెఱుంగలేక జనముల్ సంభ్రాంతియుక్తాత్ములై
నరుఁ డొక్కం డరుదెంచ నాకమునకుం దా మర్త్యుఁ డం చెంచఁగాఁ

విరసంబౌ నపవాద మిట్టు లొదవెన్ వీక్షింప నీపట్టునం
బరమేశుం డొగి నీకు నిచ్చుత మహాభాగ్యాయురారోగ్యముల్

గీ. ఎలమి నీవింక నీయింటి కేగు మనుచు, నతఁడు పలుకంగ ధన్యోస్మి యనుచు మదిని
దిరిగి యింటికి రాఁగను దివురుచుండఁ, బలికె ననుఁగని మరల నాభవ్యుఁ డిట్లు.

గీ. ఒక్క టడుగంగ మఱచితి నోయి నేను, దనరుచున్న దె శాస్త్రీయధర్మ మిపుడు
క్రతువు లెల్లను సాగునే క్రమముగాను, మీ సుప్రాంతంబులందున మేదినిపయి.

గీ. అనుచు నాతండు భాషింప నాదరమున, నేను బదులు చెప్పితి నిట్లు నూనభక్తిఁ
గాలమహిమంబునుంబట్టి కర్మరతియు, ధర్మమును సాగును నొకవిధంబుగాను.

గీ. సోమపానంపు తావున సొంపుమీఱ, కాఫిపానంబు చేరెను క్రమముగాను
బశువిశసన మిప్పుడు బహువిధముల, హింసశాలల సాగు నహీనగతుల.

గీ. ధనముఁ గూర్చెడు క్రియ లగుధర్మ మిపుడు, వేదమును ద్రోసి రాజనివింత మీఱ
సత్యవేదంబు గ్రాలు నీజగతిపయిని, బీరలకు నేతిబీరలు వెలసినట్లు. ౫౧

క. పావనమును సంభావ్యము, నైవఱలెను స్వీయధర్మ మడుగున నిడుచుం
బైవారి యల్పధర్మము, గైవారము చేయుచుంద్రు కడు మావారల్. ౫౨

గీ. పెక్కులేటికి మావారు వివిధగతులఁ, బొదలఁ జొచ్చిరి పశ్చిమబుద్ధి కలిగి
దూరపాలోచనము లెల్లఁ దొలఁగిపోయె, మర్కటీకరణమె మాకు మార్గమాయె.

క. నేనిటు పలుకఁగ విని మది, నూని కరుణ నతఁడు పల్కె నొప్పులు గులుకన్
మీనియతకర్మజాలముఁ, బూనికతో సాఁగఁజేయు బుద్ధిని గొనుఁడీ. ౫౩

క. బలిమిని గలిమిని జేకొని, కలి యీకాలంబునందు ఘనుఁడగు ప్రభువై
యిల నేలుచు నున్నందునఁ, గలధర్మము తాఱుమాఱుగాఁ జొచ్చెఁ జుమీ.

గీ. సర్వవిధములఁ గష్టదసమయమైన, యీకలిని స్వేచ్ఛఁ జేకొని యిష్టమైన
చేఁతలను జేయ యత్నంబు చేయకుండ, సరిగ నడుపుఁడు కాలానుసారముగను.

గీ. కలికి వ్యతిరేక కృత్యముల్ సలుప కెపుడు
చనుము మీయింటికిని సంతసంబు మీఱ
ననుచు నాతండు పల్కంగ నమలధర్మ
మెపుడు విడనం చిలు సేరి యెలమి నుంటి. ౫౪

గీ. దైవకృపచేత మానేల దాఁటకుండఁ, జూచినాఁడను బరలోకచోద్యమెల్ల
వింతఁ గలిగించు నీవార్త వినినవారు, ఘనతరముదము నెపుడుఁ గాంతు గాక.

గీ. నేను స్వస్థుఁడ నౌచు మన్నిలయమందె, కన్నుల కెదుటఁ గాన్పించుచున్న కతన
నాకుటుంబమువారు నానవ్యయాత్ర, కద్భుతామోదములఁ దగనంది రెంతొ
గీ. నాకుఁ గల్గినదగు నీయనేక నాక, దర్శనంబును జూప నీదర్పణంబు
సిద్ధమొనరించినాఁడ నాచిత్రయాత్రఁ, గాంచి దీనికిఁ దగుతావుఁ గవులొసఁగుత
గీ. నేను బొందినవిబుధలోకానుభవము, నున్నదున్నట్లు వర్ణించి యున్నవాఁడఁ
గాన నిందున్న చిత్రంబుఁ గాంచి బుధులు, సత్యముం గాంత్రు గావుత స్వాఁతములను.
ఆ. వె. కట్ట! లింగమూర్తిగారికుటుంబంబు, పూర్ణదుఃఖవార్ధి మునిఁగిపోయె
దాని దేర్చి పరమదైవంబు మోక్షమ్ము, కరుణ లింగమూర్తిగారి కిడుత. ౬౨
సీ. సురలనుగాదని నరుల మోహింపరే, వరవరూథిన్యాదిసురవనితలు
ఘనమృతసంజీవినినిఁ గోరి సురగురుసుతుఁడు పొందఁడె దాని క్షితిని జేరి
దివి యరాజకమైన స్థితికిరా దేవతల్ నరునహుషుఁ గొనరె నాథుఁ గాఁగ
దైత్యులఁ దునుమాడ దశరథముఖనరవీరుల విబుధులు కోరుకొనరె
దివిని లేని విశేషముల్ భువిని గలవు, భువిని లేనివి దివియందుఁ బొడమవచ్చుఁ
గాని పరికింప దివికంటె ఘనము భువియె, శాస్త్రచయ మెల్ల నారీతి చాటెడుఁ గద.

ఓం తత్సత్.

(65) సురాభాండేశ్వరోపాఖ్యానము. గ్రం సం. 1018.

ఇది యేకాశ్వాసపద్యకావ్యము- కుచేలోపాఖ్యానమును, యాజ్ఞవల్క్యపురాణమును రచియించిన గట్టుప్రభువు దీనికవి. ఘట్టప్రభుఁడనివాడుక.

గద్యము:—ఇది శ్రీమద్భ్రమరాంబికా వరప్రసాదలబ్ధ కవితాధురంధర సరస కవిమిత్ర యెల్లనామాత్యపుత్ర గట్టుప్రభునామధేయప్రణీతంబైనసురాభాండేశ్వరోపాఖ్యానంబునందు సర్వంబు నేకాశ్వాసము.

గట్టనఁగాఁ బర్వతము-పర్వతమనఁగాఁ బ్రసిద్ధికెక్కిన శ్రీశైలము-శ్రీశైలేశ్వరునిపేరు గావున గట్టుప్రభుఁడు అనితల్లిదండ్రు లొనర్చిననామకరణము కావచ్చును. కొండలరాయఁడు, ఉప్పుకయ్య,కొండయ్య,సింహాచలము, తిరుపతయ్య,అణ్ణామలై, అరుణాచలము-ఇత్యాదిగా వచ్చినపేరగును.

ప్రారంభ మిట్లున్నది.

క. శ్రీమత్కాశీపట్టణ, ధాముఁడు విశ్వేశ్వరుండు ధరణీధరజా
భామాకుచకుంభయుగ, స్థామలవత్కుండు మముఁ గృతార్థులఁ జేయుఁన్.

చ. హరిణపినాకహస్తుని బురాసురఘోరమదాపహారునిం
బరమపవిత్రునిం గుముదబాంధవపావకమిత్రనేత్రునిన్
సురగణవంద్యుని న్శివుని శుభ్రభశేఖరు సర్వమంగళా
వరదుని గాశికాపురనివాసిని విశ్వపతిన్ భజించెదన్.

ఈకథకు మూలము స్కాందాంతర్గత కాశీఖండములో నున్నదని చెప్పుచున్నాఁడు.

సీ. ... ... ...
కలవందుఁ బర్వత ఖండంబు కేదారఖండంబునన భువి ఘనతగాంచి
యొందును నందుల నెక్కుడు కాశికాఖండంబు ముక్తికిఁ గారణంబు
పరఁగె నందుల సురాభాండేశ్వరం బను పుణ్యచరిత్రము భూరిమహిమ
నట్టికథఁ దేట తెనుఁగుననతులమృదుల,సరసమాధుర్యవాక్యముల్ సంఘటించి
కవులకరుణావిశేషంబు కలిమికతన, విశ్వపతి కంకితంబుగ విన్నవింతు.

క. భ్రమరాంబాకరకలితా, త్యమలిన సద్వర్ణసముదయాంకిత జిహ్వా
సుమహితుఁడ నేను గవితా, ప్రమదాజనకుండ గట్టుప్రభువాంకుండన్.

కథలోని రెండుపద్యములు——

క. చెక్కలు విదలిచి యీఁకలు, ముక్కులఁ జక్కంగ దిద్ది ముందటికి మెడల్
నిక్కించి మిన్నుఁ జూచుచుఁ, గొక్కొరో కో యటంచుఁ గోడిలుగూసెన్.

వ. అంత.

గీ. వారుణీవిక్రయుఁడుగృహద్వారమునను, నిల్చిశనఖర్మ గేహినిఁబిల్చుటయును
గడగడవడంకుచును లేచికమలనయన, యవనిదేవోత్తమునకిట్లనుచుఁబలికె

శా. ఏబూమెల్ మెటువచ్చునో యనుచు మున్నే నెన్నియుం జెప్పిన
న్నాబుద్ధుల్ వినవైతి విపుడ కటా నాథుండు వచ్చెఁ గదా
యేబూంకు ల్జొలగావు పోవు మిఁక నీ వెందైనఁ బోనోపవే
నీబాన న్వసియింపు వారుణిరసం బేపాటి యందున్నదో.

శ్రీముఖసంవత్సర జ్యేష్ఠ బ౧ అంగారవారము వఱకు జంగం నాగలింగం సురాభాండేశ్వరము. తాడేపల్లి సుందరరామయ్య వ్రాసియిచ్చెను. అని గ్రంథాంతమునఁగలదు. మొదట నొత్తుపటామీఁద త్సనువుల రామలింగయ్య గారి కుమారుడు బసవశంకరయ్య సురాభాండేశ్వర మని యున్నది.

(66) దేవాంగచరిత్రము. గ్రం. సం. 931.

ఇది యొక పద్యకావ్యము. కవి యెవ్వరో తెలియదు. ఆశ్వాసవిభాగము లేదు. వ్రాఁత గొలుసుకట్టు. గొలికిగొలికి కొట్టికొట్టి దిద్దిదిద్ది వ్రాసినపంక్తులు కనఁబడుచున్నవి, చూడఁగా నిదియే ప్రథమప్రతియేమో యని తోఁచుచున్నది. పద్యములు ధారాళముగాఁ జదువ ననువుపడదు. కష్టముమీఁద దెలిసికొని చదువవలయును. కవిత్వము చక్కనిది. హృద్యము లగుపద్యములు గలవు. ఇందు వస్త్రనిర్మాణము దానికై తంతుసంపాదనము దేవతలు మొదలుగా నందఱకు వస్త్రప్రదానముం జెప్పఁబడినది. దేవాంగముని యిందు కథానాయకుఁడు, లోకమునకుఁ దెలియుటకై యందందుఁ గల కొన్నిపద్యభాగములం జూపి విడువఁబడును.

ప్రారంభమున——

క. వందన మొనర్తు సేవక, సందోహానందునకు గజాస్యునకు జగ
ద్వందితునకు ధూమాంకున, కుం దుర్దమ విఘ్నభేదకోద్యోగునకున్

క. వాణికి వీణాపుస్తక, పాణికి భక్తజననివహపావనికి ఘన
శ్రోణికి మ్రొక్కెద సుగుణ, శ్రేణికి ననిశమును సురకరీంద్రస్తనికిన్.

చ. వితతఖ్యాతివహించు నైమిశనివేశుల్ పార్వతీశార్చనా
వ్రతులాత్మజ్ఞులు సంశ్రితైకగుణు లార్యాచారసంపన్ను లం
చితవిజ్ఞానులు శౌనకాదులు మహర్షుల్ సూతుఁ బౌరాణికా
యతపీఠస్థితుఁ గాంచి యిట్లనిరి ప్రత్యాసక్తితో నందఱున్.

ఉ. మానుగ దేనిచేత నభిమానము గోపనమయ్యె నట్టివ
స్త్రానకు సాధనంబులు తిరంబుగ నెవ్వనిచేతఁ గల్పనం
బైనవి గోప్యగోపనము లర్థి నొనర్చి మనుష్యులందఱా
బూని పరంబుఁ జేరుటకుఁ బూనిక నెవ్వఁడు చేసె నాదటన్.

గీ. ఇతరకథలవలన నీఁగనిపాపముల్, దేని వినినఁ బాసి దివ్యులగుదు
రట్టిప్రశ్న మీర లడిగితి రిప్పుడు మ, హారహస్య మిది మహాత్ములార.

చ. గురుఁడగు బాదరాయణుని గోరి నమస్కృతి చేసి తొల్లియ
ప్పురమునీంద్రుచే వినినభంగిని దెల్పెద మీకు మీరు సా
దరణమనస్కులై ననుఁ గృతార్థునిఁ జేసి కథార్థతత్త్వత
త్పరమతులై వినుం డని పదంపడి యిట్లని పల్కె వారితోన్.

గీ. పరమయోగీంద్రులకు నైనఁ బడయరాని, శైవసాయుజ్యమేకథాశ్రవణమునను
గలుగు నుత్తములకు నైన నెలమి దీని, మహిమ వర్ణింపఁదరమె సన్మౌనులార

ఉ. పాయక యెల్లలోకములఁ బ్రస్తుతికెక్క సృజించినట్టి ప్ర
జ్ఞాయుతుఁడైన బ్రహ్మవలనన్ జగదీశ్వర గుహ్యరక్షణో
పాయము గల్గదయ్యె ననపాయముగాఁ దగులోకరక్షణం
బీయెడ నెట్లు గల్గు జను లెట్లు సుఖింతురు సర్వకాలమున్.

వ. దేవీ నీకు నమస్కారంబులు గావించెద ననుగ్రహింపు మని వెండియు
నిట్లనియె.

క. తంతువు దెచ్చుట కొఱకై, యొంతయు విష్ణ్వంతికమున కేగెదు నన్నుం
జింతింపుము రక్షింపుట, కింతట దీవించి వంత లెడలెడునట్లున్.

గీ. అయినరంగులుచిహ్నితమైనవస్త్ర, మొకటిగావించినీనేర్పుప్రకటమొందఁ
దాపసోత్తమ నీశుభదంబు కొఱకు, నీశ్వరున కిమ్ము ముందు ధరించుటకును.

(67) ఉత్తరరామాయణము. గ్రం సం. 999.

తిక్కనసోమయాజికృత నిర్వచనోత్తరరామాయణము పదియాశ్వాస
ములు తరవాయిని బదునొకండవయాశ్వాసము. జయంతి రామభట్టను కవి

రచియించినది, యీగ్రంథములోఁ జివరఁ జేర్పఁబడినది. ఇందు వచనములు గూడఁ గలవు. కవిత్వ మంత రసవంతముగా నుండదు. అచ్చుపడినదానిలో నీభాగము నెవ్వరును జేర్పలేదు. కావున దానివిషయమై కొంత యిందుఁ దెల్పఁబడుచున్నది. ప్రారంభము.

క. శ్రీమద్రఘుకుల జలనిధి, సోమా పరమాత్మనామ సుగుణస్తోమా
 భీమాహవదైత్యకులవి, రామా భద్రాద్రిధామ రాఘవరామా.

క. శ్రీరాముఁడు చెలువ బుగ, ధారుణిఁ బాలింపుచుండి ధర్మాన్వితుఁడై
 సారెకు మైథిలిఁ దలఁపుచుఁ, గారుణ్యము కలిమి చెలిమి గౌరవ మొప్పన్.

క. కుశలవపుతత్త్వబోధము, కుశలవులకు ననుజులకును గుశలముఁ జెందన్
 విశదముగ వేదశాస్త్రో, పశమమునగు రాజ్యనీతి పద్ధతిఁ దెలిపెన్.

ఉ. జానకిఁ బాసి రాఘవుఁడు స్వర్ణమయుం బగు సీతతోడుతం
 బూని సమస్తయజ్ఞములు పొందుగ దక్షిణ లిచ్చి సేయుచున్
 మానుగ సర్వభూప్రజల మన్ననఁ బ్రోవుచు నాఁడునాఁటికిన్
 భానుతుఁడై వసుంధరను బూజిత మొప్పఁగ నేలునంతటన్.

క. కౌసల్యాదిగఁ దల్లులు, వాసవపురి కేగినంత వారలకొఱకై
 భూసురులఁ బంపె రాముఁడు, భాసురముగ భర్తృలోకపదమునఁ బొందన్

గద్యము—ఇది శ్రీమద్భద్రాద్రిరామ వరప్రసాదలబ్ధ కవితా(విచిత్ర)గాఙ్గేయ గోత్రపవిత్ర జయంతి కృష్ణభట్టారక సుభద్రాంబావరతనూజ రామభట్టప్రణీతం బైన శ్రీమద్రామాయణకావ్యంబున నుత్తరకాండ తిక్కనసోమయాజి రచితంబై యున్నశేషంబునం గల్గు మీఁదటికథయందు ..........
 సర్వము న్నేకాదశాశ్వాసము.

కథలోని రెండుపద్యము:—

ఉ. భూపతి నన్నుఁ దా విపినభూముల కంపిననాఁడు వెంబడిం
 బ్రాపయి కందమూలఫలరాసులఁ దెచ్చియు మమ్ముఁ దన్వఁ దాఁ
 గాపరియై వసించుచును గాచుకొ యుండును నిద్రలేక హా
 బాపురె నేఁడు లక్ష్మణుని బాయఁగఁ జేసితి మాయదైవమా.

గీ. అమరగంధర్వమానిగణాంశజనిత, మైనమర్కటభల్లూకయాతుధాన
 సంఘ మంతయు నిర్మలస్వాంతు లౌట, నన్నుగమనమ్మున కొడఁబడియాదరించె

క. పదివేలవత్సరంబులు పదినూఱులయేండ్లు నిండెఁ బదపడి సమయుం
బిదె వచ్చెఁ బ్రతిన వేళయుఁ, బదపడ వైకుంఠ లోకపదవికి రామా.

ఖరసంవత్సర ఆషాఢబ 3 బు స్వర్గి మేడవర్పు ఆదినారాయుడు మళ్ళచేనుల కొమారుఁడు రాజగోపాల్కున్ని వ్రాసి యిచ్చెను.

—(68) బాలభారతమ్—గ్రం. సం. 936.—

అగస్త్యకృత బాలభారతమ్. పరిషత్పుస్తకభాండాగారములోని సం. 855 గ్రంథ మసంపూర్ణము. ఇందు ౨౦ సర్గలు సంపూర్ణముగనున్నవి. ప్రారంభము:—

అస్త్యత్రినేత్రప్రభవః కలాత్మా శశీతి నక్షత్రగణస్యనాథః
యం వారిజశ్రీహర మాహుస్తవాచో వామం హరే ర్లోచన మామనన్తి.
సేవ్య స్సురాణాం హిమవద్గిపాద స్సంభావనీయ శ్శిరసా శివేన
మహీధ్రభర్తేవ తమోపహంత్రీం యః కౌముదీందివ్యనదీం ప్రసూతే.
నజాహ్నవీయైశ్చ నయామునైశ్చ నచాపరాసాః సరితాం పయోధిః
యస్యోదయే నైవసుజాతధామ్నో బహీర్వయసీమ్న్యభ్ధి ముపైతి వార్ధిః.

అంతమున—

సచైన మాహస్మ చిరాత్రిణేన శునా సునాసీర వినామునా మే
నరోచతే నాకవిహారసౌఖ్యం శ్లాఘ్యం పరం భ్రాతృసమాగమోవా.
విహాయ తచ్ఛ్వానకరూప మగ్రే మూర్తేన ధర్మేణ సహక్షితీశః
ఆరోపితో మాతలిచోదితాశ్వం రథం మఘోనా దివ మారురోహ.
ఆందోళయ న్నభనదీతరంగాన్ సమోదయో నందనగంధవాహః
నృపాయ కల్పద్రుమపుష్పగంధ ముపాయనత్వం గమయాంబభూవ.
పాంచాల్యాసమ ముద్ధితై ర్నిరయతః కర్ణాదిభి ర్భ్రాతృభి
స్స్వంస్వం ధామగతై రభిష్టుతయశా దివ్యైశ్చ తై ర్బంధుభిః
సింహో దిగ్గజదాన దిగ్ధపయసి త్యక్త్వా వపుర్మానుషం
సర్వాసా దివిషద్గృశాం సవిదధే శర్మాణి ధర్మాకృతిః.

ఇతి శ్రీ అగస్త్యకృతౌ బాలభారతే వింశఃసర్గః—

—(69) అజ్ఞానధ్వాంతచండభాస్కరము—గ్రం. సం. 4313.

ఇదియొక వేదాంతవచనగ్రంథము. కంభముపాటి అమరేశ్వరకవి రచితము. భాష సంభాషణరూపముగా నున్నది. గద్యము—“ఇది శ్రీమదద్వైత బ్రహ్మవిద్యావిశారదుం డైనకంభ్భముపాటి అమరేశ్వరశాస్త్రుల్లఁ వారి చాతను

శిష్యానుగ్రహార్థమై ఆంధ్రభాషా ప్రబంధరూపముగాను రచియింపఁబడినఅజ్ఞాన ధ్వాంతచండభాస్కర మనేటి విచారదశరూపక మైన వేదాంతప్రకరణంసమా ప్తము.

ఇందు అనుబంధవిచారము—జీవేశ్వరవిచారము, సృష్టివిచారము, ఇట్లు పది ప్రకరణములు గలవు. కొంతమచ్చునకు—

“పుత్రదోషాలనువివరించేము.

“పుత్రుఁడు పుట్టకమునుపు పుట్టడాయనని తల్లిదండ్రులకు దుఃఖము గర్భము నిలిచి స్రవిస్తే దుఃఖము స్రవించక శిశువు పుట్టేటప్పుడు శిశువుకైనా హాని తల్లికైనా హాని హానిపొందకవుంటేనా గ్రహదోషాదిదుఃఖము రోగాదులవలన దుఃఖము నడిచేకాలమందు ధూర్తుఁ డాయనా యవంట్లుకొట్టబోతున్నారో అని దుఃఖము వాడుగుగాదాయనని చదువురాదాయనని పెండ్లిగాదాయనని దుఃఖము. వయస్సువాడాయనాంట్టే పరదారాగమనం చేసెనా లోకులు నిందించేరు అని రాజులు దండించేరు అని పరలోకమందు నరకానబడేనని దుఃఖము”......

ఇట్లేయర్థదోషాములు వివరింపఁబడినవి.

బ్రహ్మజ్ఞానోపాయము—శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీసచ్చిదానందేంద్ర శ్రీగురుచరణకమలశిష్య శ్రీరామకృష్ణానందవిరచితము.

గురుశిష్యసంవాదకీర్తన- కావి తిర్మనతాయునర్చిన ౧౦౭ చరణములు వేదాంతము-కొన్నిచరణములు—

కాలినవిత్తులు క్రమ్మరమొలవావు లీలజ్ఞానికి పుట్టు లేదు సుమ్మోయి
కారణమణఁగిన కార్యమెక్కడనుండు నారీతి సంసారమని చూడుమోయి !

మడికిసింగన్న వాసిష్ఠరామాయణము- మొదలైనవింకఁగలవు.

౨౩ వ పత్రములో నీక్రిందిపంచరత్నములు గలవు.

మ. నిగమాంతప్రతిపాద్యమై విమలమై నిర్వాసనాభాగ్యమై
సగుణాతీతము నిర్గుణాదికమునై శశ్వత్సుఖాన ద స
ర్వగురుత్వం బగు రామలింగగురుచంద్రావాసమైనట్టి మా
మగరాల్పట్టణ మెంతదవ్వు చెపుమా మర్త్యాంగనారత్నమా. ౧

మ విగతాశాభయుఁడై మహాశుభదుఁడై విశ్వాత్మకుఁడై నిత్యుఁడై
జగదజ్ఞాదివికారదూరుఁడయి దోషధ్వంసియై సద్గురుం

డగుచుం బ్రోచెడి రామలింగగురుచంద్రావాస మైనట్టి మా
మగరాల్పట్టన మెంతదవ్వు చెపుమా మర్త్యాంగనారత్నమా. ౨
మ. జగమం దెన్నఁగ భక్తకల్పతరువై సర్వప్రసౌఖ్యంబులం
దగరక్షించి వరించి ముక్తిలలనా తాదాత్మ్యమొందింప ధీ
రగుణుండై తగు రామలింగగురుచంద్రావాస మైనట్టి మా
మగరాల్పట్టణ మెంతదవ్వు చెపుమా మర్త్యాంగనారత్నమా. ౩
మ. జగతిం బుట్టి ముముక్షులైన సుమనస్సంప్రార్థితుండై సదా
జగదుద్యద్వరిజాలభీషణలసత్సన్మాత్రకుండౌచు వే
తగ రక్షించెడు రామలింగగురుచంద్రావాస మైనట్టి మా
మగరాల్పట్టణ మెంతదవ్వు చెపుమా మర్త్యాంగనారత్నమా. ౪
మ. పగడా ల్పాసవనీలగారుడమణీవైడూర్యరత్నంబుల
న్మగరాల్గెంపులు చంద్రకాంతరుచుల న్మానౌచు వెల్గొంది పా
దగుచుఁ శ్రీకరరామలింగగురుచంద్రావాస మైనట్టి మా
మగరాల్పట్టణ మెంతదవ్వు చెపుమా మర్త్యాంగనారత్నమా. ౫
శా. ముక్తిద్వారకవాటగుం దెఱచి పై ముక్కంటిపైకంటిలో
రక్తిన్మాని విరక్తిచే మిగులఁ బేరాకంటిపై కంటిలో
యుక్తింబొందినయోగి మూకజడబాలో న్మత్తులం బోలు నీ
భక్తిఁ శ్రీమగరాలపట్టణవరా భావజ్ఞ సర్వేశ్వరా.
ఇట్టివే "కొట్టా మిక్కడికెంతదవ్వు చెపుమా కొమ్మాసరోజాననా-
పొందూ రిక్కడి కెంతదవ్వు చెపుమా పూర్ణేందుబింబాననా-
అను మొదలగుపద్యము లీప్రాంతములలోఁ గొందఱు చదువుచున్నారు.

—(70) హంసవింశతికథలు-గ్రం. సం. 1087—

ఇదియొక్క చక్కనివచనకావ్యము. మొదటిపత్రము లేదు. చివరపత్ర మున్నదిగాని ముక్కలై పోయినది. ప్రతిపత్రమును జివరఁ గొన్నియక్షరములు గలభాగము విఱిగిపోయినవి. భాష చాలభాగము శుద్ధముగా నున్నది. కల్పనలు మనోహరముగానున్నవి. కొంత మచ్చు చూడుఁడు—

"ఎనిమిదవనాఁటిరాత్రి హేమావతి మణిఖచితతాటంకకాంతులును ముక్తాహారంబులకాంతులును రత్నకంకణంబులకాంతులును దిగంతంబు లావరింపఁ గుంకుమపంకంబు పొంకం బగుచుండఁ జెంతకు వచ్చిన దానిం గాంచి

యోశృంగారవతి రాజగృహంబునకుం బోయెద వేమొ నాముచ్చట విని పో వుదుగాక యని ముద్దులు గులుకఁ బలికిన హంసవాక్మాధుర్యంబునకుఁ జిక్కి య్యక్షక వినియెదఁ దెలుపు మనిన నిట్లనియె. పున్నాగపుంజం బను (పురంబున) ధనచిత్తుం డనువైశ్యశిఖామణి యుండు నతండు కాయధాన్యంబులు గలకణ జంబులును బియ్యంపుగరిసెలును చిల్లరలమ్మెడు దుకాణములును గట్లసంచులు ను దక్కెడయును, అటకయుం గలిగి జాజికాయలును జాపత్రియును ... మొద లగు సమస్తవస్తువులు బేరంబాడుచుండు నాతనికి వసుమతి యను సతిగలదు. దానిమోము గోము దాని కావిమోవి, దాని కప్పుకొప్పు దానియారుతీరు దానిచెన్నగుచిన్నెలు దానిజగ్గునిగ్గు దాని తేటగుమాటలు ... దానిం జూచిన మానవుం డాత్మలో మెచ్చి శిరంబు గదల్చి మీసంబులపైఁ గేలువైచి నిట్టూ ర్పుపుచ్చి మజ్జారే యనక మానండు"

—(71) బహువిధగ్రంథములుగల సంపుటము గ్రం. సం. 1244.—

ఇం దనేకవిషయములు గలవు. అష్టాంగయోగక్రమము- యుగకాల సంఖ్యయునుగలవు.

(1) నానార్థపద్యములు:—ఇప్పేర సంస్కృతపదముల నానార్థములం దెలుపు ౫౦ కందములు గలవు.

క. సంస్కృతము లక్షణోక్తము, సంస్కృతమన శ్రుతియుగతియుస్వర్గముభూమిన్
సంస్కృతము చెడనిపదవియు, సంస్కృతమనఁబట్టిపండుసభ మొదలయ్యెన్.

క. ఘృత మనఁగ నెయ్యి నీళ్లును, ఘృత మనఁగాఁబాలుచల్లగుగ్గిలమినుమున్
ఘృత మనఁగఁ దేనె నెత్తురు, ఘృత మనసంసారసుఖముగెల్పునునయ్యెన్.

క. న్యగ్రోధ మనఁగఁబామును, న్యగ్రోధంబనఁగ వ్రేలు నెత్తురుఁ బొత్తున్
న్యగ్రోధ మనఁగ మఱ్ఱియు, న్యగ్రోధం బనఁగ బార నగడును నయ్యెన్.

(2) శివస్తోత్రము: — ద్విపద సుమారు నూఱుచరణము లుండును. పా ల్కురికి సోమనాథకృతమే మెం!

"కులజుండనైన దుష్కులజుఁడనైన, బలుపుణ్యనిధి యైనఁ బాపాత్ముఁడైనఁ
గాని నీసద్భక్తి కలితుఁడనైన, వానినీరూపులో వర్ణింపఁజేయు
పుడమిభక్తులయిండ్లఁబడిపనుల్ సేయు, పడఁతికడ్పునవైనఁ బ్రభవింపఁజేయు
... ... ... ... ... ...
పరమవరుండైన పాల్కురినిలయు, కరుణతోఁ బ్రోచును గలకాలమెల్ల."

(3) షట్స్థలసంబోధతత్త్వరహస్యము:—

సంస్కృతశ్లోకములును, తెనుఁగువివరణమును గల శైవగ్రంథము.

గద్యము:—ఇతి శ్రీగురులింగజంగమపాదారవిందమకరందపానమిళింద మానసే శ్రీసద్గురునల్లమాహ్వాయకరుణాకటాక్షవీక్షణంబునం మురుమళ్ల నామ్న ప్రణీతంబైన షట్స్థలసంబోధతత్త్వరహస్యంబు ... ..."

తెనుఁగువాడుక మాటలతో నున్నది.

శివతత్త్వపరే సూక్ష్మ బిందురూపంతు జాయతే
బిందునాదసముత్పన్నం నాదాంతే శక్తిజాయతే
శక్తిస్తు జాయతే శబ్ద శ్శబ్దేజాయంతి వాగ్భవం.

యిట్లు పరమసూక్ష్మమైన వ్యోమాతీతమైన శివతత్త్వమందు బిందురూపమైన పరాశక్తి బుట్టెను. ఆపరాశక్తి నాదం బుట్టెను. ఆనాదమే ఆదిశక్తివలన ఇచ్ఛాశక్తి బుట్టెను. ఆయిచ్ఛాశక్తియందు శబ్దము బుట్టెను. ఆశబ్దమే జ్ఞానశక్తి ఆజ్ఞానశక్తివలన వాక్కు పుట్టెను. ఆవాక్కుయనెడిదే క్రియాశక్తి... ..." దీనిని రుధిరోద్గారినామసంవత్సర వైశాఖ శు ౫ సోమవారం సాయంత్రం స్వర్గి వచనటీక నిమ్మన బసవానందయోగిగారి మాతృకను వున్నట్టుగా మాచిరాజు బుచ్చన్న సంపూర్ణంగ్గా శ్రీసద్గురుపాదాల అనుగ్రహంవల్లను వ్రాసెను.

ఈసంపుటములో మఱియు ద్విపదప్రమథస్తోత్రము వర్ష ఫలము రుద్రాక్షధారణవిషయము సోమనాథుని ప్రభులింగలీలలునుగలవు.

(4) జీవయెఱుకులకొఱవంజి. సన్నిధిరాజు జగన్నాథకవిప్రణీతము.

గద్యము:—శ్రీమద్వేదవేదాంతరహస్య ప్రణతగుహాంతరాళనిలయ పరమహంసపరివ్రాజకాచార్యచర్య సర్వతంత్రస్వతంత్ర శృంగుభేరిసింహాసనస్థిత శ్రీమచ్ఛంకరాచార్యపాదారవింద మకరందపానమిళిందమానమానస సన్నిధిరాజవంశపారావార రాకాశశాంక అమ్మయసుపుత్ర జగన్నాథనామధేయప్రణీతం బైన జ్ఞానయరుకలకురువంజి యను మహాప్రబంధంబునందు సర్వంబు నేకాశ్వాసము.

యక్షగానము— వేదాంతవిషయము- మొదటిపత్రము పోయినది. కొంతవినుండు-"...గలిగిన తామరకమల మున్నది. ఆకమలమందు మానసహంస యనేరాజహంస గలదు. దానిఖగాంతరమందు నవరత్నదీప్తులు గల చిద్బ్రహ్మము వున్నది. అని చెప్పగాను దాని పట్టి తెమ్మనుమని మాళింగ్గి అని

కొాట్టె దేవరా నేను ప్రాకృతపురుషుణ్ణి గనక రాజహంసను పట్టి తేలే ననగా నామీాద కోపించ్చి రాజహంసకొారకు సుకర్మేచ్ఛచేత పారిపోయి వచ్చినది. సామీా, నేను దాని వెదుకవచ్చినాను సామీా, మాశింగ్గిని నేను విడిచిపెట్టితే యీాఅనంత్తకోటి బ్రహ్మాండాలు చెడిపోవడానకు హేతు వౌతుంద్ది గనక శిం గిని జూడవచ్చినాను సామీా, యని యన్నంత హాస్తగాడు అడిగీమాాట, వోరీ శింగ్గా మీాశింగ్గిని నీవు చూడకపోతే యీాఅనంత్తకోటి బ్రహ్మాండ్డాలు చెడి పోతున్నవని తెలియజెప్పు మనిన, చెప్పమంటాావు సామీా, ఎనిమిదిశరీరాలు న్ను నాలుగుపాదాలున్ను మూాడుస్తానాలున్ను అయిదుగురుదేవతలున్ను వీటి తోగూాడిన ప్రణవజ్యోతిరూాపమైన పరబ్రహ్మము నన్ను చేపట్టి సర్వలోకా లున్ను ఆడిస్తూావున్నాడు సామీా, నన్నుగాదని మాశింగ్గి తనపేరు దెచ్చు కోవలెనని విడనాడి వచ్చినదిసామీా."

ఇది ద్వితీయభాగము.

---

## చాతుర్వర్ణ్యగృహిణులు.

క. చాతుర్వర్ణ్యోదితగృహి, ణీతిలకంబులకుఁ గలుగు నేరుపులును ద
జ్జాతివిశేషగుణంబులు, నాతతముగఁ దెలియవలయు నవి యెట్లనినన్.

క. గరగరికయు గాంభీర్యము, సరసోక్తులు గలుగుఁ గాని సద్ద్విజసతికిన్
సురతకళానిపుణత్వము, దొరకొన దెప్పుడును సిగ్గు దొడవై యునికిన్.

క. బింకము చెలువును ధృతియుఁ గ,డంకయు మచ్చరము గలిగి డాసినచో మీ
నాంకుని దేవికి నెనయై, కొంకక విభుఁ గవయు రాచకోమలి గరిమన్.

క బుడిబుడిమాటలతఱచు, న్వాడబుద్ధులు మలినమైన వేషముఁ గడుఁ జొ
ప్పడియుండుఁ గాని కోమటి, పడఁతికి నేరుపులు లేవు పతిఁ గవయు నెడన్.

క. కమ్మలుఁ గడియము గాజులు, నమ్మడుఁగులుఁ జుక్కబొట్టు నమరఁగ రతితం
త్రమ్ములఁ బస గలిగి ప్రమో, దమ్ము పతికిఁ జేయు శూద్రతరుణి ధరిత్రిన్.

## మన్మథమాహాత్మ్యము.

సీ. శృంగారరాజ్యాభిషిక్తుఁ డుద్యత్కళాచతురుండు మన్మథచక్రవర్తి
యతనిపట్టపుదేవి రతిదేవి పువ్వులరథము వాహనము సారథి వసంతుఁ
డాయుధ మిక్షుశరాసన మమ్ములు కమ్మతావ్విరులు పెక్కైమ్ముమీను
కలకంఠ శుకశారికామధువ్రతములు సేనలు దళవాయి సీతకరుఁడు
కృతకపర్వతారామ దీర్ఘికలయందు, విడిసి మలయసమీరుండు వేగుఁజూడ
నాకవిభునైనఁ గైలాసనాథునైనఁ, జెలఁగి సాధించు మర్త్యులఁ జెప్పనేల.

క. చూత మశోకంబును జల, జాతము నీలోత్పలము నెసఁగువిరవాదిం
జేతోజాతుని బాణము, లాతఁడు సాధించు వీన నఖిలజగంబుల్.

క. కన్ను లశోకమునకు గుఱి, చన్నులు చూతమున కరుణసరసిజమునకుం
జెన్నుగ నురమది దిరిసెము, నున్నతమస్తకము యోని యుత్పలమునకున్.

క. కూడుడిగించు నశోకము, వాడించును మల్లెవిరి వివర్ణతచేయుం
జూడఁగఁ జూతము తలఁపులు, జోడించును దమ్మి చంపిచూపుం గలువల్.

క. వినుతవచనరచనంబుల, ఘనతరముగ నిట్లు నాయకప్రకరణమిం
పున వివిధనాయికావ,ర్ణనసహితంబగుచు నూతనస్థితిఁ దనరెన్.

శా. జానొందన్నకవర్షముల్ బుతుశరజ్వాలేందులై యొప్పన
య్యానందాబ్దమునందు మాఘమునఁ గృష్ణైకాదశీభౌమయు

క్తానామామృతవేళ నీకృతి యనంతార్యుండు సమ్యగ్రస
శ్రీనిండఁ ధ్రువపట్టణాధిపున కిచ్చె న్భక్తిపూర్వంబుగన్.

క. తలఁచిన తలఁపు ఫలించును, జెలు లగుదురు శత్రులైన శ్రీ యొడఁగూడుం
గలికాలదురితములు దుష్ఫలఁ దూలును ధ్రువపురీశు భాసురకరుణన్.

గద్యము—ఇది శ్రీవాణీవరప్రసాదలబ్ధవాగ్వైభవ తిక్కనామాత్యసంభవ సుక
విజనవిధేయ అనంతనామధేయ ప్రణీతంబైన రసాభరణంబునందు
సాధారణ నాయకచతుష్టయంబుల తెఱంగును జతుర్విధనా
యికా విశేషంబును దత్సఖసఖీభేదంబులును నాయికా
ప్రకరణంబు నన్నది సర్వంబును
జతుర్థాశ్వాసము.

ఓమ్.

# భూమిక.

౧

తిక్కన కొమరుఁ డగు ననంతామాత్యుఁ డీరసాభరణమును రచించె నని యిందుఁ గల గద్యమునఁ గలదు. ఈ గ్రంథమునకుఁ దుదఁ గల "జా నొందఁగ శకవర్షముల్" అను పద్యమును బట్టి లెక్కించుచో నితఁడు రసాభరణమును క్రీ. శ. ౧౪౩౫ జనవరిలో దేవాంకిత మొనర్చినటుల నిర్ధారింప నగును. ఈవిషయమును బట్టి యీతనికాలమును నెల్లరును నిర్ణయించుకొనఁగలరు.

ఇతని తండ్రి తిక్కన భారతమును జెప్పిన కొట్టరువు తిక్కయజ్వ కాఁడు. ఈసంగతి నీతఁడు రచించిన భోజరాజీయమునఁ దనకు ముత్తాత యైన బయ్యనమంత్రిని వర్ణించిన పద్యము వలన స్పష్టపడును. ఆపద్య మిది;—

క్షితిఁ గ్రతుకర్తృతామహిమఁ జేకొని పంచమవేదమైన భా
రతముఁ దెనుంగుబాస నభిరామముగా రచియించి నట్టి యు
న్నతచరితుండు తిక్కకవినాయకుఁ డాదట మెచ్చ భవ్య భా
రతి యనఁ బేరుఁ గన్న కవిరత్నము బయ్యనమంత్రి యల్పుఁడే.

ఈ గ్రంథకర్త కౌండిన్య గోత్రుఁడు. ఇతని ముత్తాత కవిబ్రహ్మ యగు తిక్కన వలన భవ్యభారతి యనిపించుకొనియెను. ఈ బయ్యనకుఁ బినతండ్రి యగు త్రిపురాంతకుని కుమారులలో నొకఁడగు తిక్కన "ప్రశస్తసాహిత్యుఁడ"ని భోజరాజీయముననే తెలుపఁబడినది. తన యన్నదమ్ములను గూర్చి తెలుపు నీ పద్యమునఁ దన తమ్ముఁడు చిట్టనసత్కవి యని తెలిపినాఁడు గ్రంథకర్త.

భూనుత కీర్తి ముమ్మడివిభుండు మదగ్రజుఁ డేను వైష్ణవ
ధ్యానసమాహితాత్ముఁడ ననంతసమాఖ్యుఁడ నాదు తమ్ము ల
జ్ఞానవిదూరు లక్కనయు, సత్కవి చిట్టనయుఁన్, వివేకవి
ద్యానిధి రామచంద్రుఁడు, నుదారుఁడు లక్ష్మణ నామధేయుఁడున్.

వీనిని బట్టి చూడఁగా వీరి వంశము కవితావంశ మనఁ దగి యున్నది. ఇట్టివంశమున జనించినవాఁ డగుటనే యితఁడు పద్యరచనకుఁ బ్రథమ సోపాన

మగు నొక ఛందోగ్రంథమును, గవితకుఁ బ్రాణ మనఁ దగు రసము స్వరూపి మును వెల్లడించుటకై రసాభరణమును గూడ రచించినాఁడు.

ఇతఁడు తా నాఱువేలనియోగి బ్రాహ్మణవంశమువాఁడ నని సగర్వ ముగా నీక్రిందివిధమునఁ జెప్పికొనినాఁడు.

“ఈ యార్వ్వుల నొక్కొక్కఁడు, వేయిండ్లకు మొదలుగాఁగ వెలయుదు రని కాదే యాఱువేల పేరిడి, రీ యన్వయమునకు నేమ్య మెఱిఁగిన పెద్దల్”

ఇతఁడు కృష్ణాతీరమువాఁడు. తండ్రి “ శ్రీకాకుళంబున కొడయఁ డైన యంధ్రవల్లభ హరిసేవనలరుచుండు” వాఁ డని వర్ణింపఁ బడినది. రసా భరణము ధ్రువపురీశున కంకితము చేయఁబడిన దని కవి తెల్పుచున్నాఁడు. ఈధ్రువపురి ప్రస్తుతము గుంటూరుమండలమునఁ గృష్ణాతీరప్రాంతమునఁ గల ధూళిపూడి యను గ్రామమా యని యూహ పొడముచున్నది.

భారతకవియగు తిక్కయజ్వకు శిష్యుఁడును దిక్కనయను వాని పుత్త్రుఁ డు నగు మారనయు నితనివంశ్యుఁ డేమో యని సందేహము పొడముట కవ కాశము గన్పట్టుచున్నది. తిక్కయజ్వచే భవ్యభారతి యను బిరుదము నందిన బయ్యనమంత్రికిఁ బినతండ్రియగు త్రిపురాంతకుని యారుగురు కొమరులలోఁ జివరవాఁడు ప్రశస్తసాహిత్యుఁడు తిక్కన కలఁడు. వానికి సమకాలికుఁడే తిక్క యజ్వ. ఆతిక్కనకుమారుఁడు విద్యాభ్యాసము చేయువాఁడై కవితాసామ్రాజ్య పట్టభద్రుఁడైన తిక్కనను శుశ్రూషఁ జేసినాఁడన నూహకు లోపముండదు. కాని, యిందలి యథార్థమును బెద్దలు నిర్ణయింతురుగాత మని యీప్రస్తుతముగాని విచారణ నింతతో వదలుచున్నాను.

ఇప్పటికిఁ గవిని గూర్చి మనకుఁ దెలిసిన చరిత్రాంశములు:—ఇతఁడు కౌండిన్యగోత్రుఁడగు నియోగి; కృష్ణాతీరవాసి; విద్వత్కవివంశమువాఁడు; భోజ రాజీయ మను ప్రబంధమును, ఛందోదర్పణ మను లక్షణగ్రంథమును, రసా భరణ మను కావ్యలక్షణగ్రంథమును జెప్పినాఁడు; క్రీ. శ. ౧౪౩౫ ప్రాంత మున నున్నవాఁడు.

౨

తెనుఁగు బాసను గావ్యము లక్షణము లాదిగాఁ గల వానిని విచారిం చు సాహిత్యశాస్త్రము లతిస్వల్పముగా నున్నవి. ఇప్పటికి వెల్లడి యైన వానిలో రసాభరణమే ప్రాచీన మనఁదగి యున్నది. ఈ కవి తన భోజరాజీయ

మున "కావ్యం యశసే౽ర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే" యను మమ్మటాచార్యుఁడు నుడివిన కావ్యప్రయోజనమునే,

"సకల విద్యలయందుఁ జర్పింపఁగవిత యుత్కృష్టమం(డి) నిత్యకీర్తి కొఱకు, నర్థాప్తికొఱకు, నా వ్యవహారలక్షణం బెఱింగెడుకొఱకు, ననేకవిధములగు నమంగళముల హరియించుకొఱకు, నుచిత నిత్యసౌఖ్య సంసిద్ధికొఱకు, నొనరఁగాంతాసమ్మితోపదేశమ్మునఁ బ్రీతిమై హిత మాచరించుకొఱకు, నయ్యెఁగాన......"

అని నుడివినాఁడు. సాహిత్య శాస్త్ర గ్రంథములను బరిశీలింపఁ గావ్యమున కాత్మ రసమని మొదట నొడివినవాఁడు క్రీ.శ. ౧౩౾౪ ప్రాంతమున భారతభూమి నలంకరించిన సాహిత్యదర్పణకారుఁ డైన విశ్వనాథకవిరాజే. వారి మతమున కనువుగ రసాభరణమును దెనుఁగున వ్రాసిన యనంతామాత్యుఁడు విశ్వనాథుని దర్పణమును మమ్మటుని కావ్యప్రకాశమును గూడ మేలవించి యెందే విషయము ప్రశస్తమైనదో దాని నెల్ల గ్రహించినాఁ డనవచ్చును.

ఇ ట్టియ కాదు. ఇంకొక యూహము పొడచు వచ్చును. ఇతఁడు కేవలము రసమును గూర్చియే యీ గ్రంథమును వ్రాయుట వలనను, ధ్వని గుణ, దోష, ధ్వన్యలంకారాదులను వివరింపక పోవుట చేతను దృశ్యకావ్య ప్రశంసయే మనమునం దిడికొనినాఁ డేమో యనవచ్చును. రసము నాట్యమునకు ముఖ్యముగా సంబంధించినది గాని శ్రవ్యకావ్యములకు ముఖ్యము కా దని పలువుర పూర్వాలంకారికుల మత మనునది యే యీ కవికిని నచ్చినదేమో. కావ్యకౌతుకమునఁ 'బ్రయోగత్వ మనాపన్నే కావ్యే నాస్వాద సంభవః' అని యున్నదని యభినవగుప్తుఁడు చెప్పి "కావ్యం తావ న్ముఖ్యతో దశరూపాత్మకమేవ... నాట్యే ఏవ రసాః। నలోకే। కావ్యం చ నాట్యమేవ।" యని తన యభిప్రాయమును నుడివి "నానాభావాభి వ్యంజితాన్ వాగఙ్గసత్త్వోపేతాన్ స్థాయిభావా నాస్వాదయన్తి సుమనసః ప్రేక్షకాః హర్షాదీంశ్చాధిగచ్ఛన్తి, తస్మాన్నాట్యరసా ఇత్యభివ్యాఖ్యాస్యామః" యను భరతాచార్యుని వాక్యమును బ్రమాణీకరించెను. ఈభరతవాక్యమే యనంతామాత్యునకుఁ బ్రమాణమై యీ గ్రంథమును రచించుటకుఁ బురికొల్పినదేమో. ఈ యూహ కా దనుట కొక సందేహమ్ము కల్గుగవచ్చును:—ఇతఁడు నాట్యరసముల నెనిమిదింటినే తెలుపక

శాంతమును గూడ తెలిపినాఁడు గదా యని. ఈ విషయమున నాట్యాచార్యుఁడు పూర్వుల మతమును స్వమతానుకూలమనియే "ఏవం నవరసా దృష్టా నాట్యజ్ఞైర్లక్షణాన్వితాః" అని పేర్కొనెను గావున శాంతముతో నాట్యరసములు తొమ్మిదియని యనంతుని మతమునై యుండునన నీ ప్రతిపత్తి యేమియుఁ గన్పింపదు. ఇతఁడు భరతమును మనమున నిడికొని స్వగ్రంథమును వ్రాసెనా యను ప్రశ్న ముత్పన్నమగుట కేయవకాశము లేదు; కాని, రసాధిదేవతలను బేర్కొను నపుడు బ్రహ్మ యద్భుతరసమున కధిదైవ మని 'అద్భుతో బ్రహ్మదైవతః' అను భరతు వాక్యమునే గ్రహించెను గాని "అద్భుతో విస్మయస్థాయిభావో గంధర్వదైవతః" అను దర్పణకారాది వాక్యములను గ్రహింపమిచే నితఁడు భరతాచార్యు ననుసరించె ననవచ్చును. ఈ యూహను ద్రోసిపుచ్చుయుక్తి తెనుఁగున రూపకములు లేమియే యనవచ్చును. కాని, యిచట మా మనవి యొకటి కలదు. సంస్కృతము నందు వలెఁ దెనుఁగున లక్ష్యములనుగాఁ జూపుటకు దశరూపకములు, నుపరూపకములును బ్రస్తుత మలభ్యము లనుట నిజమే. ఐనను యక్షగానాదులను బరికించినచో రూపకోపరూపకము లొక కొన్ని మన తెనుంగు బాసను గూడఁ గల వని నిర్ధారింపనగును. ఆదృశ్యములను బండితులైన కవులు వ్రాసిరా యనఁ గూడదు. నారికేళపాకమున నజచరిత్రమును వ్రాసి రాజాస్థానములఁ బాడితులతో వ్యాకరణాది శాస్త్రముల శాస్త్రార్థము లొనర్చి పెక్కు జయములఁ గొన్న మతుకుమల్లి నృసింహవిద్వత్కవి సుమారు వందయేండ్లలోఁగా నివసించినవాఁడు శ్రీకృష్ణజలక్రీడ లను నొక నాటకము నతిమృదుశైలిని రచించినాఁడు. కావున రూపకముల ధోరణుల కనువగు మార్గమున రసస్వరూపము నితఁడు తెలిపి యుండవచ్చును.

ఇఁక నొక్క యూహ. అనాది నుండియు నాట్యశాస్త్రము వేఱుగాను, శ్రవ్యకావ్యములకు సంబంధించి యలంకారశాస్త్ర మని వాడఁబడు సాహిత్యశాస్త్రము వేఱుగాను దర్పణకారుని వఱకుఁ బరిగణింపఁబడినయవి. రూపకములకుఁ బ్రధాన మైనది రస మనియు, శ్రవ్యములకుఁ బ్రధాన మైనది ధ్వని యనియుఁ బలువురు చెప్పిరి. ఆధ్వనియందు భేద మగు నసంలక్ష్యక్రమ మను దానియందు రసాదులు పేర్కొనఁబడినవి. అందుచేతనే కావ్యప్రకాశము ధ్వన్యాలోకము మున్నగు గ్రంథములయందు రూపక ప్రకరణమే లేదు. రూపకములను దెలుపుటకు దశరూపకాది గ్రంథములును, నాయికాది భేదములను

దెలుపుటకు రసమంజరి ప్రభృతిగ్రంథములును వెలువడినవి. దర్పణకారుఁడు రసాత్మకమగు వాక్యము కావ్య మని తెలిపి రూపకములను గూర్చిన విషయ మును గూడఁ దన గ్రంథమున వ్రాసినాఁడు. నాఁటి నుండియుఁ గూడ గంగా నందాదులు రసమును గూర్చియే ప్రత్యేక గ్రంథములను వ్రాసినారు. మఱియు శారదాతనయాదులు భావప్రకాశాదులను గేవల రసవిషయ బోధకములను నిర్మించిరి. కనుక మన సాహిత్యశాస్త్రమున నాట్యమును గూర్చియు, నాయి కాదులను గూర్చియు శ్రవ్యకావ్యములను గూర్చియు, రసభావాదులను గూ ర్చియుఁ బ్రత్యేక గ్రంథములు పెక్కులు వెలువడినవి. ఈ సమస్తవిషయ సం గ్రహమును గలవి యు దర్పణ, ప్రతాపరుద్రయశోభూషణాదులు, బయలు వెడలినవి. అట్లులనే తెనుఁగునఁగూడఁ గేవల రసమును గూర్చి యీ రసాభ రణము వెలువడి యుండనగు.

ఈ పై విషయ మప్రస్తుత మని పలువురకుఁ దోఁపవచ్చును, ఒక దృ ష్టిని నిది ప్రస్తుతమే యని నా మనవి ఇట్టి గ్రంథము లనేకములు తెనుఁగున నొ కప్పు డుండి కాలవశమున మన కప్రాప్తములై మరల నన్వేషణమున లభ్యములు కావచ్చు ననియు నీదృష్టితో వెదకుట యత్యవసర మనియు సహృదయులకుఁ దెలుపుటకే యింత వ్రాసితిమి.

3

ఈ గ్రంథము స్వతంత్ర మైనదో లేక యేసంస్కృతగ్రంథమునకైనఁ బ రివర్తనమో తెలియదు. మాతృక కన్పించువఱకు స్వతంత్రగ్రంథమే యిది యని యనుకొనవలెను.

దీనికి 'రసాలంకార'మను నొక పర్యాయనామము కూడఁ గలదని ప్రథ మాశ్వాసాంతగద్యమునఁ దెలియఁ గలదు. ఆయాయి వ్యాఖ్యలందుఁ బేర్కొ నఁబడు రసాలంకార మను సంస్కృతగ్రంథమున కిది తెనుఁగుసేఁత యేమో యని భ్రమను గొలుపుచున్నది. ఉదాహరణముగా నీవిషయమును దెలుపు చున్నాను. హారవిలాసము శ్రీనాథుని స్వతంత్రగ్రంథమని గదా లోక మను కొనుచున్నది. హేమచంద్ర కృత కావ్యానుశాసన వ్యాఖ్యానమున 'సుజన దుర్జనస్వరూపం యథాహారవిలాసే' అని కన్పించుచున్నది. ఆవ్యాఖ్యానోదా హృత మగు హారవిలాసము మృగ్యమగుటచే నిపుడు మనమేమనుటకు నవకా శము లేదు. కనుకస్పష్టనిదర్శనము కన్పించువఱకు నీ రసాభరణమును స్వతంత్ర గ్రంథమే యనవలయును.

౪

రసాభరణమునఁ బ్రథమాశ్వాసమున స్థాయిభావములకు లక్ష్యలక్షణములను, విభావానుభావ సాత్త్విక భావలక్షణములను శృంగారాది నవరసములకు నుదాహరణముల నొసఁగి కవి రసము సామాజికానుభావ్య మని నిర్ధారించెను.

రెండవ యాశ్వాసమున నాలంబనోద్దీపన విభావములకు లక్షణమును దెలిపి, భావహావాదులగు శృంగార చేష్ట లుద్దీపనాంతర్గతము లని లక్ష్య లక్షణములతో వాని నొడివి, యుద్దీపనాలంకృతులను, నుద్దీపన స్థలంబులఁ జేర్చాని యనుభావమును దెలిపి, యష్ట విధ సాత్త్విక భావములకు, ముప్పది మూఁడు సంచారిభావములకు సోదాహరణముగా లక్షణములను జెప్పెను. ఇందు సంచార్యాది భావలక్షణముల నొండు రెండు చోటుల మతభేదము కన్పించును గాని యది పాటింపఁ దగినది కాదు. ఈ ప్రకరణమున నేర్చుకొనఁదగిన విషయ మొకటి కలదు. సంస్కృతమున నాలంకారికులు పలువురు తెలుపని శృంగార, భక్తి, వాత్సల్యములకు నైకకంఠ్యమును గవి సాధించినాఁడు:—

"రతి దా నాయకనాయికాదిపరతన్ రంజిల్లు శృంగారమై
క్షితిలో దేవగురుద్విజాదిపరతం జెన్నొందు సద్భక్తియై
సుతమిత్రాశ్రిత సోదరాది పరతన్ సొంపారు వాత్సల్యమై"

తృతీయాశ్వాసమున సంభోగ విప్రలంభ శృంగారములను జూపి యాలంకారికులు సంస్కృతమున సాధారణముగాఁ జేర్చనని, నాట్యవేదమున మాత్రమే తెలుపఁబడిన, పంచవిధ మగు వాగ్విలసన, నైపథ్యాంగక్రియా, సంకీర్ణ,మిశ్ర, శృంగారమును గూడ విస్పష్టముగాఁ గవి దెలిపినాఁడు; పిదప భావోదయాదులను రససాంకర్యములను దెలిపెను. నాలవ యాశ్వాసమున నాయికానాయకులఁ గూర్చి దిఙ్మాత్రముగా వ్రాసినాఁడు.

౫

స్థాలీపులాకన్యాయమునఁ బాఠ భేదముల నొకింతఁ జూపుదును. రసాభరణము రెండవపుటలో నుత్సాహలక్షణముఁ దెలుపునపుడు "లోకోత్తర కృత్యంబులు గైకొని యవి యెడపకుండ"నను పాఠము నాదరించి"యవి యెడఁపకుండ"ననుపాఠమును సూచించినారు ప్రకాశకులు. రెండుపాఠములకు సామాన్య తాత్పర్యమున భేద మంతగాఁ బొడకట్టక పోయినను సూక్ష్మముగ

నాలోచించినచో భేదము విస్తారముగా నున్న దని 'కార్యారంభేషు సంరంభః స్థేయా నుత్సాహ ఉచ్యతే" మొదలుగాఁ గల వాక్యములను జూచినపుడు తోఁపక పోదు. మఱియు మూఁడవ పుటలో విస్మయ లక్షణమునఁ 'జేతోవిస్మృతి విస్మయ..." అను పాఠమునే ప్రకాశకు లేల యంగీకరించిరో తెలియదు. "విస్మయశ్చిత్త విస్తారః పూర్వాదృష్ట విలోకనాత్" మొదలగు నాలంకారిక వాక్యములను జూచినచో "విస్తృతి"యనుపాఠమే సరియగు నర్థబోధమునకుఁ దోఁడగు ననియు 'విస్మృతి' యనర్థబోధక మనియుఁ దెలియక పోదు. నాలవపుటలో, "నీసమూహంబు రసముల కెల్ల నిట్లు" అని యే యుండ నగును గాని యాదృతమైన పాఠ మనర్థబోధక మని తెలియనగు. పదునొకండవపుటలోఁ జకితలక్షణమును జెప్పు పద్యమునఁ "జూపులు చలింపఁగాఁ గడు" ననుపాఠమునే సహృదయులు గ్రహింపనగు. పందొమ్మిదవ పుటలో వ్యాధికుదాహరణమైన పద్యమునఁ "దరుణి హరి బాళి" యను పాఠమే సొగసైనది. బాళి యనఁగాఁ గాంక్ష. ఇరువదిరెండవ పుటలో మొదటిపద్యమునఁ "దగు నాతని కీకపట ప్రయోగముల్" అనుదాన వ్యంజిత మగు నర్థమే యాదృతపాఠము నర్థము కంటె బాగుగనున్నదని సహృదయులు తెలియకపోరు.

ఈ గ్రంథప్రకాశకులు తా మొసఁగిన పాఠములు చెన్నపురి దొరతనమువారి లిఖితపుస్తక భాండాగార ప్రతినుండి గ్రహింపఁబడిన వని తెలుపుచున్నారు. అట్టి పాఠములను గ్రహించుట యవసరమే కాని యుప పాఠములను బద్యమున నచ్చొత్తించి సరియగు పాఠములను గ్రింద గుర్తించుటకై వదలుట న్యాయముగా లేదని నా తలంపు. బీభత్సరసోదాహరణ పద్యమునఁ బ్రకాశకు లాదరించిన పాఠమున కెట్లర్థము చెప్పవలయునో నాకు బోధపడుటలేదు. క్రింద వారుదాహరించిన పాఠభేదము నంగీకరించిన నేనైనఁ బద్యమర్థము కాలే దనఁగలరా యని నాకు సందేహము. బహుపాఠముల నిచ్చుట యవసరమే, కాని గ్రంథమున నాదరణీయ పాఠము నచ్చొత్తించుటయు నవసరమే యని నా విన్నపము.

ఇంక నొక్కమాట. ఇందును లేఖకప్రమాదములు నచ్చుతప్పులును సంభవించియున్నవి. చూ. "బోదవిననీలవేణియునుబున్నమచందురు నాదరించు నవ్వదనము" ఇత్యాదులు.

రసాభరణమునఁ గైతను గూర్చి విస్తారము చెప్పఁ దగిన దేదియు లేదు. పద్యములు శ్రుతిమాత్రతో నర్థబోధకములగు శబ్దముల కూర్పును గలిగి ప్రసాదగుణ విలసితములై యలరారుచున్నవి. ఇట్టి గ్రంథముల ప్రయోజన మనల్పముగా నిప్పుడు మనభాషకుఁ గలదు. దీనిని బైకిఁ దెచ్చినందులకుఁ బ్రకాశకులు సర్వవిధముల గేయులు. మఱియు నిట్టిగ్రంథములను లోకమునకు నాంధ్రసాహిత్యపారిషదులు ప్రసాదింతు రని నమ్ముచున్నాను. ఇచ్చటికే భూమిక మితినిమీఱినది. ఇతో౽ధిక మనపేక్షణీయము. సెలవు.

కాకినాడ,
౨౩—౨—౧౯౩౧.

విద్వాన్ కోపల్లె శివకామేశ్వరరావు,
F. A. R. U. & P. O. L.

# రసాభరణము.

ఈగ్రంథము పరిషత్తునకుఁ జాలకాలముక్రిందటనే కాకినాడసమీప మునం దున్న కుయ్యేరుగ్రామనివాసులు బ్ర॥ హరిసోమయాజుల సుబ్బారావు గారు పంపినది. క్రోధన సం॥ ఆషాఢ బ ౧ శుక్రవారమున శృంగారకవి వెంక య్యగారు వ్రాసినది. పరిషత్పుస్తకభాండాగారములో సంఖ్య 1781 గలదిగా నున్నది. తాళపత్రప్రతి. దీనిని, చెన్నపురిలో దొరతనమువారి పుస్తకభాండా గారములోని రెండుప్రతులతో సరిచూపించితిమి. ఆరెంటిలో నొకటి కాగిత పుప్రతి. రెండవది తాళపత్రప్రతి. అందు నిందునుగూడ కృత్యాదిని బద్య ములు లేవు. కవి యట్లేప్రారంభించెనా యనఁజాలము. కొన్నిసందేహములును లేఖకప్రమాదములును నెందును దీఱలేదు. ఒకవిధముగా నీప్రతిని లోకములో విడిచినారము. ఎవ్వరియొద్దనైనఁ బూర్ణగ్రంథ మున్నవారు తప్పులు సవరణలుఁ దెలిపినచో ద్వితీయముద్రణ మింతకంటెఁ బరిశుభముగాఁ జేయింపఁదలఁచు చున్నారము. సంపూర్ణప్రతి నిర్దుష్టమైనది ముందు దొరకునను నూహతో నిపుడు స్వల్పప్రతులే ముద్రింపించినారము.

ఈపుస్తకమునకు భూమిక వ్రాసియిచ్చి మాకు సాయపడిన విద్వాన్ కోపల్లె శివకామేశ్వరరావుగారియెడల మేమెంతయుఁ గృతజ్ఞులము.

ఆం. సా. ప.

# విషయసూచిక.

— ప్రథమాశ్వాసము —



— ద్వితీయాశ్వాసము —

—తృతీయాశ్వాసము—

—చతుర్థాశ్వాసము—

ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటితము — సంఖ్య. ౭౮

శ్రీరస్తు.

# రసాభరణము.

ఇది

అనంతామాత్యకృతము.



(పరిషత్పత్రికనుండి పునర్ముద్రితము)

కాకినాడ:

ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచేఁ బ్రకటింపఁబడినది.

కాకినాడముద్రాక్షరశాల.

1931

వెల రు ౦-౮-౦.

ఇదంతంబునకునిత్యంబు
మఱియుద్విరుక్తంబునబహులోపాగమా
దులుం గలవు
ప్రాఁతాదులకు సమాసంబునం దాద్య
క్షరశేషంబు బహుళంబు
నెఱకుంజెలిప్రభృతులు రా మీఁదిహ
ల్లునకు ద్విత్వంబు
ఇరునకుం దిగాదులురా
మూఁడునకు సంతటం బ్రాయికంబు
నలులోనగువానికి నూఱులోనగునవిరా
నివ్వెఱ,నివ్వెఱంగు,పుప్పొడి,సన్నాఱు
క్రొత్తకు
పట్వాదులు రా నుమ్మగు
తొమ్మిది పదులొండొంటికిరా
ఏకాక్షరంబునకు శేషంబునకుం బరు
షంబురా నగు
క్రిందునకుం గ్రియు నగు (క్రేగన్నిత్యే
వదృశ్యతే-నహిక్రేవశబ్దస్యసర్వత్ర
శేషోదృశ్యతే)
పట్టివిభక్తిరా
యొక్కలోపంబున నుత్వంబునకునచ్చురా
ధాతుజభేదకంబునకు
అందురా
మువులకొండె
తత్పురుషంబున
సమాసంబుల స్త్రీసమంబులకుం బరుష
సరళంబులురా పుంపులకు
స్థిరంబురాఁ గానంబడియెడి
తనంబురా

ఇరునకు మడ్వాదులురా
భేద్యంబురా నివర్ణకంబొండె నగు
నవర్ణకంబు భావంబున
విజయంచేయుట పూజ్యాగమనంబు
ముబులతోడనన్యార్థంబునగు
కొంపోవుట కొనిపోవుట ప్రాపణంబు
ప్రథమామువర్ణంబునకుఁబడ్వాదులురా
నెఱబొట్లొండెఁ జూపట్టెడు
లోపంబు
తొమ్మిదిపదులొండొంటికిరా
ఏకలఘుపూర్వనువర్ణంబునుత్వంబునకు
లిట్టువర్ణంబురాఁ జనుద్రిక్తనగు
తన్నువర్ణంబు సున్నయగు
తిమఁటలురా
ఉండుడువర్ణంబునకు లోపంబు
ఆసున్నమీఁది దాకు డకారంబు
పూంచుట పూనుచుట
ద్రుతప్రకృతికంబు ద్రుతఁబునకు లో
పంబగు
స్వరపరుషంబులురాఁ గలుగదు
సమాసంబులం దెల్లెడల నిత్యంబు
హల్లురా సంశ్లేషంబొండె నగు
స్వత్వంబు
లాంతబంధంబున నవసానంబున
నుమ్మునకునుంగలుగదు
ప్రథమమీఁదం బరుషంబులకు గసడ
దవలగు
క్రియాపదంబులమీఁద
సంస్కృతంబుమీఁదనే సాంస్కృతికంబు
లకు

కాకుసంబోధనజడావ్యయంబులపై నె
ల్లెడల బహుళంబు
ప్రాసంబునందు
కర్మధారయంబునందు
ద్వంద్వంబున నిత్యంబు
అంతట సవలు బహుళం బని కొందఱా
ర్యులు
కాంతుడుజ్జునకుఉఅలురానిత్యంబు
డువర్ణంబు నుత్వంబునకురురలురా
పకారంబునకు వకారంబు ప్రాసంబున
నిత్యంబు
ద్రుతప్రకృతికంబుమీఁద సరళంబులగు
అద్రుతంబు బిందువొండెనగు
భవత్యర్థకానుప్రయోగంబుననిత్యంబు
సరళంబులురా నెఱసున్న క్వాచిత్కంబు
గం జూపట్టెడు
దాని కచ్చురా మకారంబగు
నములురాఁ బరసవర్ణంబగు
ద్రుతంబున కొకానొక్కెడం గానంబడు
చకారంబునకు హల్లురా
తాను నేను ద్రుతప్రకృతికతుల్యంబులు
వానినువర్ణంబునకు లోపబిందువు లగు
టుగాగమం బుత్వంబున కచ్చురా సా
మానాధికరణ్యంబున
సమాసంబులందు
చిగురుప్రభృతులకుం బాక్షికంబు
పుంపులకు నిత్యంబు
అలురా సమంబునకత్వంబును ఝక్కును
నగు
గొడ్డురాలు వియ్యంకురాలు

పేదాదులకు ఝక్కగు
పొదరిల్లు బొమ్మరిల్లు పాఁపరమ్ము
పుంపులు మువర్ణంబునకగు
చేతలోడవలనల యత్వంబున కిత్వంబు
సమాసంబునందగు
అందాద్యాదులకలి యగు (జిహ్వన కుత్వం
బునకలియగు)
దంగు పోఁడి పిరవాజ్యాదుల దడజలకు
డణాదులగు
దంగు ప్రభృతులకు దాకుడకారంబగు
అనఁటి పనఁటుల నవర్ణంబునకు రలో
పంబులగు
అపదాదికి నసంయుక్తంబునకుఁ గాకు
నకారంబగు
పొదుఁగు ప్రభృతులందు బొట్టుం బొ
లియు
రులుడులయుపోత్తమంబున కేత్వంబు
నకు హ్రస్వంబగు
దీర్ఘసమాసంబునం గొండొకచో జిహ్వ
నకుం గనంబడెడు
నీలుఁగు ప్రభృతులందు
సవర్ణంబగు హల్లురానిత్యంబు
బిందువు గలుగదు
ఓయారాదులం దొలివ్రాయుపయిహల్లు
నకు ద్విత్వంబగు
యథామాత్రంబుగ నామ్రేడితాద్యక్ష
రంబునకుఁ గుత్వ గివర్ణం బగు
వాక్యావసానంబున సంధి లేమియు
నొప్పునండ్రు

ఏలాదుల యంత్యప్రాణంబునకుం బ్లుతం బొండెనగు
ఏమ్యాదులకు సమ్యగ్జిజ్ఞాసయందు
ఆమ్రేడితంబునకు
టింట్యాదు లౌపవిభక్తికంబులు
విభక్తిసమాసంబులన్ ద్వంద్వంబునందు బహుళంబుగనగు
ట్విక్కంతాదులకగు
ముందునకు
అన్ని ప్రభృతులకసామానాధికరణ్యంబు ననిత్యంబు
నిన్నాదుల కంతటనగు
రేయికి యిలోపంబునం గలుగదు
అహరాదుల యుత్వంబున కిత్వంబు టిక్కురానగు
ప్రాతరాదుల కత్వంబు
ముందటి టాకు రేఫంబొండెనగు
మీఁదు క్రిందుల కిత్వంబు నిత్యంబు టిక్కురానత్వంబగు
ఏమ్యాదుల కడప్రాయికి లోపంబొండెనగు
విలుకురుపదిరులకు నిత్యంబుటివర్ణంబాదేశంబగు
నెత్తురుప్రభృతులకు విభక్తియందప్రాయికంబు
గృహదంతకంటకకార్ముకవాచకంబుల సలలువర్ణంబునకు పాషాణవాచికి
నయనకుచాంతరిక్ష వాచకంబుల ననను వర్ణంబునకు
ఉభయంబులకు సమాసంబుల విభాషనగు
మృత్తికామఘకోశంబుల నువర్ణంబుల కంతటనగు
సంఖ్యమీఁది టింటుల కిట్టగు
అదను ప్రభృతుల కిత్వంబగు
నడుము ప్రభృతులకొండె
అజ్జుప్రభృతుల కితిక్కునుపధాలోపంబును నిత్యంబు
కనుములోనగువానిమువర్ణంబు పవర్ణంబు సమాసంబునందగు
నాము లోనగువానికి పజ్జుహల్లురానగు
అమ్మునకు రవర్ణకంబురా
వేఁపాకు తామరపాకు
చేఁదుమువర్ణంబు తివర్ణంబంతటనగు
గోయిప్రభృతుల యివర్ణంబు బహుత్వంబున నైతము
ఎఁడురా
ఈఁదుమువర్ణంబు తవర్ణంబగు
అంతట లఘ్వేకాక్షరంబుమీఁద టివర్ణంబు పూర్ణపూర్వంబగు
తక్కుంగలతావులం బాక్షికంబు
చాఁపుమీఁదంగాదు
సమస్తం బీయది యార్యప్రయోగంబులెన్నట్లు గ్రాహ్యంబు.

ఇది పరవస్తు చిన్నయసూరి విరచితం బైనయాంధ్రశబ్దానుశాసనంబునందు సంధిపరిచ్ఛేదము.

## — తత్సమపరిచ్ఛేదము —

* * * * * *

గుణవదాదికంబు హలంతం బమంతతుల్యం బిందునామంబగు
దానిమకారంబు లోపించు
లాంతిప్రథమైకవచనతుల్యంబు
శ్వానము- (శునిశ్వానో శ్వఃమృగ ఇతి హేమచంద్రోక్తే రదంతః శ్వానశబ్దోప్యస్తి తేనైవ సిద్ధే గుణవదాదిత్వేన పరిగణనం వ్యర్థమితి)
నామంబునకడహల్లున కుక్కగు
ద్విత్వంబు
చాంపుమీఁద బహుళంబు
అగుణవదాదికి హలంతంబునకు నులోపంబు నిత్యంబు
లాంతికి డుజాదులు తొంటియట్ల యగు
భవదాదులకుం బ్రథమాంత తుల్యతయు నుత్వఘఙ్ఞులు నగునని కొందఱాచార్యులు
ప్రశానుఁడు
పరీక్షిదాదులకు బహుళంబు
ముదాదులకు లింగవ్యత్యయంబగు
వేధో బ్రహ్మ యువ విశ్వకర్మాదులకు డాప్పగు
ఆత్మేమనిచ్చులకొండె
మనుజసంజ్ఞకు నాంతంబునకుం గ్వాచిత్కంబు
మహత్వంబున రాజశబ్దంబు రాజునాఁబడు
జగదాదులకు లోపంబొండె నగు
సాకుంబ్రాయికంబు
పయఃప్రభృత్యులకుం గల్గుగద్దు
ఉపసర్జనంబునకు స్త్రీత్వంబున నిత్యంబు
దారార్థకంబురా గుణవద్భావంబు సంజలయందగు
మహత్వంబునందట్లు
ఉశనఃప్రభృతులకు
మనఃప్రభృతులకు ద్విత్వంబొండెనగు
అప్సరస-
హృదయంబునకు హృది
ద్యుశబ్దంబునకు దివి
నభవదాదీనామత్రయోగః
అన్నిప్రభృతి సంఖ్యావాచకంబులు సర్వనామంబులు
అన్నిలోనగువాని లులలకు లుక్కగు
మహత్వంబున వాని నివర్ణంబునకు దవర్ణంబును ఱుఱులునగు
అందొఱుంగలదు
ఎల్లవారెల్లరు
పెక్కండ్రుపెక్కురు పలువుండ్రు పలువురు
ఆ ఈలు తదేతదర్థకంబులు
ఏ యత్కిమర్థకంబు
పీనిసూకు డుజ్జగు
తొలివాని దురులకు డుట్టొండెనగు
లులలకు ర్ట్సు నిత్యంబు
డుద్విరహంబున రవర్ణంబు ఱివర్ణంబగు
వుట్టు విభక్తిరా నగు
అమహత్వంబున నిమ్మూటికి శసాది బహువచనంబురా నిక్కగు
అమహదేకవచనంబు రా దుట్టగు
సుజస్సులకు దివియగు
పీని శస్సునకు నివర్ణకంబగు నని సూచింపవలయును

అవిరా హ్రస్వంబగు
ఏకొండె
తక్కు_రా మూఁడిటికి
టివులకు ద్విత్వంబు
వుడాదికంబు తక్సామానాధికరణ్యం
బులందుఁ గలుగదు
తదామలకుం దచ్ఛబ్దంబను ప్రయుక్తం
బొండెనగు
మహత్వంబునంగాదు
ఏకొండె (యత్రిమర్థంబున కొండె)
హ్రస్వంబు మీఁది వుట్టుపై దీర్ఘంబు హ్ర
స్వంబగు
ద్విత్వలోపంబున నిత్యంబు
ఎవ్వయు నేకార్థంబున కట్లు తిత్తిర్తులు
ను మహత్వార్థంబునం దగు
అవ్వకె యాయింతి (అవ్వత యామె)
తగాగమం బాయీయేలకు మహత్వం
బునం దేకవచనంబు రాఁ బూజ
యం దగు
స్త్రీత్వంబున మమెపెకె లగు (హే
దంతంబులగు)
నిగే వచనాంతంబుల కుపవిభక్తి కట్ల
త్వంబగు
అందిందెందులు జాడ్యంబున శసాదులు
రానగు
వీనిమీఁది సప్తమికి లోపంబు నిత్యంబు
స్త్రీశబ్దంబునకుం దచ్ఛబ్దంబునకు సం
బుద్ధిని దాన యగు
నువులురా
దాన దీన దేన నని తృతీయాసప్తములం
జూపట్టెడు
యుష్మదస్మత్సామానాధికరణ్యంబునం
దు తాశబ్దంబాత్మార్థకంబు

దాని కస్మచ్ఛబ్దంబునకుం బోలె నువ్వు
లగు
తన యని టూప్వరా
తమ యని బహుత్వంబునందు
రువర్ణకంబురా నొండె
నీనాలు యుష్మదస్మదర్థకంబులు
వాని సుజస్సులకు వురు నుము లగు
న్నుమ్ము లమ్మస్సులకగు
బహుత్వంబున నకారంబునకు మకా
రంబు
మువర్ణకంబు రా నొండె
అత్వంబున కేత్వంబు ప్రథమరానగు
నములు లోపించు నొండె
వురులు రా
మీఁ పయి లువర్ణకంబును దానికి రట్టు
ను నిత్యంబుగనగు
మనశబ్దం బుభయార్థకంబు
దీని జశ్శస్సులకు ములలగు
సంఖ్యావాచకంబుల కిందు నమహత్వం
బున నేకవచన బగు
సముదాయ సంఖ్యావాచకంబున బ
హువచనంబులగు
గణాభిధానంబున బహువచనంబగు
రురలురా నుక్కగు
దిలోపంబునం గలుగదు
రెండు మూఁడు నాలుగైదాఱేడెనిమిది
తొమ్మిదిపది నా ద్విప్రభృత్యభిధా
నంబులు
ఏనునానైదు
వృత్తియందుఁ బదిప్రభృతులురా దీని
తొలి వ్రాయి మివులు
ఇరువది యేఁబది యఱువది డెబ్బది యె
న్బది న్నూఱేన్నూఱె నమన్నూఱు

తొమ్మనూటలు వేయి వేనవేలు వేయివేలు

ఏకాదులురాఁ బదికుత్వంబు (క్రియల యందుఁ బదాఱవపాలు)

నూఱు ఱువర్ణంబు ట వర్ణంబగు

సంఖ్యరా సమాహారంబగు

పది కుగాగమం బేకాదులు రానగు

దానికచ్చురా నుమ్మగు

ఇరువది యఱువది డెబ్బది యెనుబది నూ ఱెనమనూటలు తొమ్మనూటలు వేయి నా వింశతి షష్టి సప్తత్యశీతి శతాష్టశతనవశతసహస్రంబులు. ఏకోనవింశతి పర్యంత సంఖ్యావాచకంబులకిందుఁ బ్రయోగంబు లేదు.

మహత్వంబున రెండున కిద్దయుఁ బైఱులు నగు

ఇరు రువర్ణక సమాసంబులందు

నలునాలుగునకు

ఎనమండ్రు తొమ్మండ్రు పదువురు పదురు పదుండ్రు

ఇర్వాదులురాఁ బదికిం బన్నగు

ఇరువది ప్రభృతులకు రవర్ణకంబు రాదిలోపంబును దానికి మట్టనగు

పదికి రెండురా

అవపూరణార్థంబునం దగు

ఒక్కటి మొదలగు

నాలుగు గువర్ణంబు లోపించునొండె

ఒక్క యన నేకంబు

దాని యత్వంబున కోత్వం బగు

టివర్ణంబు మువర్ణంబుం బోలె నూకగు నుండెడి

మహత్త్వంబున నిత్యంబు

సుప్పురా రుక్కొండె నగు

రుక్కురాఁ దొలిప్రాయి మిన్నులు

రుక్కునకు వృక్కగు

రువర్ణంబునకు డుట్టగు

సాగమంబునకు లుల లగు

అచిరా రుక్కురకారంబు శకారంబొండె నగు

ఒండొండులుం గలవు

ఓరని సమాసంబునం గ్వాచిత్కంబు

లితరస్తులు మహత్వార్థంబునం దగు

లితలకు డుదిట్టు లొండెనగు

రుదాదివర్ణకంబులురాఁ దొలిప్రాయి శేషించి నిడుద యొండెనగు

వర్ణాంతంబున కేత్వంబు గానంబడి యెడి

ఒంటి యొంటరి యొంటిగాఁడు నానేకాకియేకాత బుశారుండేకచరంబునోలినగు ఒకానొక్కయనివిశేషాభిధానంబునందు ఒండొక్కయని పరస్పరార్థంబు

ఒరిమ యేకత్వంబు

పదంబు కడ నలరల యుత్వంబునకు లోపంబు బహుళంబు (ఒండొకండవై)

ఆయీయేలకు సర్వనామంబులకుం బయియసంయుక్తహల్లునకు ద్విత్వంబగు

ఊష్మరేఫలంబుల కెల్లచోఁ గలుగదు

పుడువర్ణకంబు కాలంబునం దగు ద్విత్వం బనిత్యంబగు

ద్విత్వ బు చేయం జోటునోత్వంబునకు
హ్రస్వం బత్వంబొండెనగు
కడప్రాయి పొలియం గలుగదు [టులు
ముచ్చోటులు ముచ్చొటులు ముచ్చ
అదిమతుబర్థంబునం గల్లాదులకగు
ఇత్వంబు కడలుప్రభృతుల కగు
వెరవు లోనగువానికి డి వ్యతిరేకంబు
నం దగు
తవర్ణంబురా నెత్వంబు క్వాచిత్కంబుగ
నగు
కత్తియ వేఁడుకాదులకు
కాఁడు మహత్వంబునందు
ఆఁడు లాగమంబుమీఁద
ఆఁడి స్త్రీత్వంబున
మారి యంతటం దాచ్ఛీల్యంబునం గు
త్సనుందగు
పోతు మాలగు ప్రభృతులకు
రూపరి, కాలువురు, చూపరు, పగతుఁ
డు, పగఱ, పెండ్లము, నా- రూపరి,
పదాతులు, చూచువారు, దాయ,
దాయలు, జాయయు
చిచ్చఱ, చిచ్చఱ యగ్నిమయంబు
అంపఱ బాణజాలంబు
కాఁడుఁడు కత్తియలు స్వార్థంబునం
జూపట్టెడు
వీని కకారంబు గకారంబు కొండొక
చోనగు
కాఁడు మీఁద ఱుఱలు మహత్వంబు
నం దగు
రురలొండె
ఆఁడుమీఁద నిత్యంబు [పించు
ఈఁడురా నుక్కివాదుల కడప్రాయిలో

హ్రస్వంబొండె నగు
బూజ్యత్వంబున గారు బహుత్వంబునం
దగు- ప్రకృతిప్రథమైకవచనాంత
తుల్యంబగు
శశాదులం దీరువర్ణంబు రివర్ణంబు
చిన్నాదుల కిత్వంబు మంజిమాది బో
ధకంబు
స్త్రీసంజ్ఞల కాయియు లగు
నివాళి ప్రభృతులకుఁ గవర్ణంబు స్వా
ర్థంబునందగు
అదిరాఁ జిఱుతాదుల కుత్వంబగు
తనము త్వార్థంబునందు
పేదాదులకు ఱికె మొండెనగు
అదిరా నుత్వంబున కత్వంబుసదాయగు
పోఁడి ప్రభృతులకు మివర్ణకంబునుఁ
బూర్వోత్వంబున కిత్వంబు నగు
అదిరా ధాతువునకు వ్యతిరేకంబునందు
చెలికారము చెలిమి
మగఁటిమి మగతనము
కోమలికము కోమలితనము
మోఱకము మోఱకుఁదనము
తెలుపు నలు పెఱుపులు ధవళిమనీలిమ
రక్తిమములు
పసుపు హారిద్ర
పసరపసిరిక హరితవర్ణంబు
చలిమిరి చలిమిడి చలువ శీతంబు
(అత్ర స్వార్థంబునం దిత్యపనీయ భావం
బునం దితివక్తవ్యమ్) [పించు
నేరుచు ప్రభృతులం దుదిప్రాయియులో
అదిరా, ధాతువున కి త్యేతత్ప్రిత్యాఖ్యే
యమ్

# ఆంధ్రశబ్దానుశాసనము.

## ప్రకీర్ణకపరిచ్ఛేదము.

---

ప్రథమాంతమున కస్మద్విశేషణంబున
కు బహుత్వంబున మువర్ణకం బగు
యుష్మద్విశేషణంబునకు రువర్ణకం
బౌండె
ఇదంతంబుల కివి యేకత్వంబునం డగు
లాంతులకు నువులు నిత్యంబు
అగ్గలాదుల కింక యగు
అముప్రభృతులకు స్వార్థంబునందు
ఇంకములో నగునవి భావస్వార్థాదులం
బెక్కులుగలవు
ప్రథమాంతంబుల కస్మద్యుష్మ ద్విశేష
ణంబులకు మురులు బహుత్వంబు
నం దగు
నువు లనిదంతంబుల కేకత్వంబునందగు
నివియొండె నిత్వంబున కగు
ఉత్వంబున కత్వం బీవర్ణకంబురా నగు
మిన్నులోనగువానికి బహువచనంబౌం
డె నగు
సస్యవాచికి ధాన్యంబున నిత్యంబు
లోపాది వికారంబులుం గలవు
వికృతిని స్త్రీలింగంబుల భేదకంబులకు
స్త్రీత్వంబగు
అప్రాణివాచి స్త్రీలింగంబుల భేదకం బు
భయవిధంబగు
అన్నింటికి స్త్రీలింగంబులకు స్త్రీ ప్రత్య
యం బనియతంబు

క. మీగలు పెద్దలు త్రైరిలో
క్యారాధ్యుల రేమియన్ననంటిరిగాక
వ్వారలు మాన్చెదరిటనే
మారసి యాడితిరో యనుచు నడి
గితిననఘా.

(అత్ర పెద్దలితి యుష్మద్విశేషణాత్ రువ
ర్ణకస్తు న ప్రయుక్తః అతఏవ తస్య
వైకల్పికత్వం వక్తవ్యమ్)

మహద్విశేషణంబు సమాసంబున ము
వర్ణకాంతంబు గలదు
అన్వయంబునం బదంబుల నైక్యంబు
సమాసం బండ్రు
అయ్యాది తత్పురుషాదిసంజ్ఞల నిటసయి
తము పెక్కువిధంబుల నొప్పు
కేవల వికృతి పదంబులతోడిది సమా
సకంబు
ప్రకృతి వికృతిపదంబులది మిశ్ర సమా
సంబు
పరిమితం బాంధ్రపదంబు సంస్కృతభే
ద్యంబుతో సమసించు
ఇందు స్త్రీసమంబులే వికృతిపదంబుల
తో ద్వంద్వంబు నందు
ఋత్వంబునకు రవర్ణంబునగు
నూఱునకు నూటయని సంఖ్యరానగు
రేవగలు ప్రభృతుల కేకవచనంబు
ద్విగువునకుం బ్రాయికంబు
మిశ్రంబునకు లేదు

త్రేవదంతంబు సమవ్యతిరేకంబుతో ద్వంద్వంబగు

ఆత్మాస్మద్యుష్మదుభయార్థకంబులు సామానాధికరణ్య సంఖ్యావాచితో సమసించు

అపుడుషష్ఠ్యంతతుల్యములగు

నిక్కలాదులు పృషోదరాదులట్లెందు గ్రాహ్యంబులు

అత్వ మిత్వ ముత్వంబు సమాసంబున నుత్వర్థంబుల గ్రదు

యుష్మ దస్మ దాత్మ వాచకంబులకు సంబంధమున దువర్ణకం బొండెనగు

సర్వంబునకుం దచ్ఛబ్దం బనుప్రయుక్తంబగు

అమహత్త్వంబునందదియని యెల్లెడలనగు

స్త్రీసమభేదకంబులకు భేద్యవ్యపాయంబున స్వార్థంబునందు

ధాతుజభేదకంబులకు

అట్టిక్రొండెనగు

బహువ్రీహినుపమానంబుమీఁద మేనునకు స్త్రీత్వంబునఁ బోఁడియగు

తుస్పజ్ఞులువిలునకుంబుం స్వంబునందగు

వాయికి నంతిమాక్షరలోపంబును హ్రస్వంబుం గొండొకచోనగు

విశేషణసమాసంబుం గలదు

పెక్కుఁబు సంస్కృతాంధశబ్దములు స్వవిభక్తివికారంబులతోడంగూడి విచ్ఛలవిడి నొండొంటితో సమసించు

జననామంబులకు రాజాదులురా నత్వం బాత్వం బిత్వంబునుం గానంబడియెడు

గ్రామ మానుష బిరుదశబ్దంబులకు సంస్కృతంబుతో సమాసంబగు

అంతాది సంఖ్యా పరిమాణార్థాదుల మీఁద వీప్సయుం దేసి యగు

అవాంతర కథాస్థానవిశ్రాంతి యాశ్వాసంబునాఁబడు

ఆశ్వాసాద్యంతంబుల మంగళం బొనర్పవలయు

అయ్యాది సంబుద్ధ్యంతంబులతోనేని డుజాంతంబులతోనేని షష్ఠ్యంతంబులతో నేనిం గూర్పవలయునండ్రు. అయ్యాది యొక్కవిభక్తింగూడిన విశేషణంబులతోఁ దుదవిశేష్యంబుతోఁ బ్రయోగించునది. అశరీరంబీయది. అంతంబున సంబుద్ధితోడ గ్రంథాదిని యథేచ్ఛం బశరీరంబు చెల్లదు

గానబంధంబునందు హ్రస్వంబునకు దీర్ఘశ్రుతియగు

ప్రాసపూర్వంబునకుం దగదు

దీర్ఘంబునకుహ్రస్వశ్రుతిదోషంబండ్రు

ఏవార్థకాదు లవ్యయంబులు

క్రియాదు లింమఁ బ్రకారార్థంబులు

ఉపమానంబు దీనితో సమసించు

ధాతుజభేదకంబులు కర్తతోడం బోలెఁ గారకంబులతో (సూత్రమిదం ప్రత్యాఖ్యేయమ్)

ఉత్వంబునకత్వంబువ్యతిరేకంబునందగు

* * *

## క్రియాపరిచ్ఛేదము.

ఆగామికర్త్రనుబంధ తుమాద్యర్థంబుల ద్రుతంబునగు
భూతంబునం దిత్వంబగు
తిప్పునకు నెత్వంబునగు (ప్రథమైకవచనం బెత్వంబగు)
ధర్మంబునందు డిదు తల్లోపంబులగు
ఎత్వంబు డిదులురానగు
దువర్ణంబురా నొండె
అవర్ణకంబు మీఁదిదానియుత్వంబున కత్వంబు నిత్వంబునగు
ఉభయార్థంబునందు
వులోపంబునం గలుగదు
ద్విలఘువున కిక్కొండెనగు
ఎత్వంబున కిడాగమంబున వలయు
ఇంచుక్కుఁ జూపట్టెడు
లఘ్వకారాక్షరపూర్వంబునకు
అయాంతంబునకుం గలుగదు
ఏకత్వబహుత్వంబుల వులు మధ్యమంబునకగు
వ్యతిరేకంబునంబోలెఁ దుమర్థంబునం దగు
తుమర్థకంబునకు ద్రుతంబునగు
ఎత్వంబురా నగు నత్వంబునకు దీర్ఘంబగు
అగుకడహల్లున కెత్వంబురా ద్విత్వంబగు (ఆయెను, అయ్యెను)
దానియాకు ద్విత్వం బొండెనగు
నుము లుత్తమంబునకు
దుజ్రులు ప్రథమంబునకు
అమహత్త్వంబున దువులగు
వర్తమానంబున దివి యగు
భూతతద్ధర్మంబుల బహువచనంబున కేకవచనంబగు
ప్రార్థనాదుల మధ్యమంబునకు ముజ్జులగు
కువర్ణకంబు వాని ముందు వ్యతిరేకంబునందగు
దీనిపై ముజ్జులకు వులు ఎదాద్యను ప్రయోగంబున నగునండ్రు
తవర్ణకం బాశీస్సులం దిజ్జునకగు
ఎవర్ణకం బొండె
కేవలధర్మంబు గలదు
దానిమీఁదఁ గాత కావుత కాక లను ప్రయుక్తంబులగు
ఎమత వర్ణకంబుల ద్రుతం బచ్చురామకారంబగు
విధియందు తద్ధర్మప్రథమైక వచనంబును మీఁద నదిశబ్దంబును వైభాషికంబగు
తానుపదంబు కర్తృవాచియగుచో నంతట నొండెనగు
మధ్యమముజ్జులురా హ్రస్వ మగు
తలోపంబునం గలుగదు
కృతహ్రస్వంబుమీఁది మువర్ణకంబునకు ద్విత్వంబగు

సర్వచువర్ణకంబుఁ దాదివర్ణకంబు రా
లోపించు
ధర్మంబున దువర్ణకం భాఖ్యాతంబు రా
నగు
షోవు వువర్ణంబు
చుక్కునా సువర్ణంబు
నేరుచుచుచులకు ధర్మవ్యతిరేకంబులఁ
బ్రథమైకత్వంబునం గలుగదు
తివర్ణకంబు భూతంబునం ద ప్రథమంబు
రానగు
ఆఖ్యాతోత్వంబున కిత్వంబగు
చులోపంబు మీఁద దకారంబు తకా
రంబగు
మధ్యనువివర్ణకంబునకు లోపం బొండె
నగు
ఉత్వంబుపై వువర్ణకంబగు
క్రియాఫలంబుకర్తృగామిగాఁ గొనుధా
తువు నిత్యంబుగా ననుప్రయోగిం
పఁబడు
స్వార్థంబునం గ్వాచిత్కంబు
కొనురా నిత్యంబగు
యోగఘంబునకు నిత్యంబు
ఇదేత్వంబులురా నగుషోవుల కొనవ్రా
లకు యకారంబగు
ఆత్మనేపదార్థక్త్వాభూతతద్ధర్మంబులందు
యకారంబు సకారంబగు
ఉపోత్తమోత్వంబున కిత్వమంతటనగు
ఇంచుక్కుదాబహుళంబు

ఇల్లుక్కున న్స్కాలకారంబునకు లోపంబు
మధ్యమముజ్జులమీఁద నదాదిదీత్తు
లగు
వ్యతిరేక తిజ్జునకుం బ్రార్థనంబున నెత్వా
దులగు
భూతంబున భవత్యర్థం బనుప్రయుక్తం
బగు
ప్రార్థనంబునం దుమర్థంబుమీఁద నె
త్వాద్యంతంబై కదయగు
కర్మంబునం బడుధాతు వనుప్రయుక్తం
బగు
కర్తయందుంబోలెఁ దద్విధులగు
కూలు ప్రభృతులకొండె
కనుప్రభృతులకుంబట్టుంగానఁబడియెడి
ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తం
బులై యర్థవిశేషంబులం దెలుపు
అనుస్వారాద్వర్ణస్యతష్టః
దోడోన్యతరస్యామ్
చేదర్థయోగంబున భూతతుల్యం బొం
డెనగు
బిందువుమీఁదవర్ణకదకారంబునకు డ
కారంబు బహుళంబు
టకారంబు తీకినిత్యంబు
షోవుప్రభృతులకుం దెంచుధాతు వను
ప్రయుక్తంబగు
అరుగేగుచనుల కాగమంబున
పీనిసువర్ణంబు బడిరా లోపం బొండె
నగు (కొనుబడి)
చువర్ణంబునకు నిత్యంబు

ఉక్తుమీఁదిదానికి దకారంబగు
న్యర్థంబునం దుమర్థంబుతోఁ జేయు
క్రియ వాడంబడు
చను ప్రభృతులకు నిత్యంబు
లాఁతికంటె యుష్మదర్థకార్యంబు బలీ
యంబు

దానికంటె నస్మదర్థకార్యంబు
లాఁతికంటె మహాత్మార్యంబు బలీయం
బగు

* * *

తద్భవలక్షణము.

ఆకాశాదుల మధ్యగంబునకు హ్రస్వం
బగు
ఏకాంతాదుల బిందువునకు లోపంబగు
దాంత్యాదులఖండంబగు
... ... ...
సతియుఁ దానువెలుఁగు శతముఖుండును
బోలె- అ. ౪ ప. ౭౫
సులభ మయ్యె నీ కిహాపరశోభనములు
అ. ౪ ప. ౭౫
పురమునకకాదు నాదగుసిరి
చక్కనిమాటలు
ప్రేలపిండిప్రభృతులములోపంబు
కర్తృకర్మార్థేభ్యోసద్యత్
నాకుసుతుండు పుట్టె, అతనికి యదుం
డు పుట్టె నిత్యాద్యా పంచమ్యాః
షష్ఠీ
ఉకారంబునకు పువర్ణకంబగు- విష్ణువు
ప్రావు
ఒరంట గుడభేదంబు
"కోలలఁ బరఁగింపంగాఁ
గేలుంగవ వడిగలట్టి కృతహస్తుండై
గ్రాలుకతంబున జిష్ణుఁడు
పోలుంగవ్వడియనంగ భుజగశయానా
నిత్యాది యగుటంజేసి కవశబ్దాంతంబ
గు నత్వంబునకు లోపం బని యె
ఱుంగునది
లాగమవిధానంబున బహువచనగ్రహ
ణ బుచేసె న్యాగమస్థలంబునం దేక
వచనంబనునది వారింపవలయు
ఉమంతంబునకు
ఏకవచనంబగుటాన్ప్రాంనిగాగమంబగు
సమంబునకు బహుళంబు
ఉత్తరైకవచనంబును భూతతద్ధర్మప్రథ
మైక వచనంబులు ద్రుతంబులు
నిత్యనిగాగమంబు నివర్ణంబునకు వికా
రంబు లేదు
ంబు మీఁదిద్రుతంబునకు స్వత్వం
బు లేదు
టవర్గంబు కొఱుకుకంటెలురా లోపిం
చునొండె.

* * * *

ఆంధ్రశబ్దశాసనము- సంపూర్ణము.

శ్రీరస్తు.

# పరవస్తు చిన్నయ్యసూరిగారు.

ఈపరవస్తు చిన్నయ్యసూరిగారిని గుఱించి యెఱుఁగని యాంధ్రు లుండరు. వీరురచించిన నీతిచంద్రిక, బాలవ్యాకరణములు, విద్యార్థిలోకముచేఁ జదువఁబడుచున్నవి. వీరిజీవితము కొంత యొకప్పుడు పరిషత్పత్రికలోనే ప్రకటింపఁబడినది.

ఈసంస్కృతసూత్రాంధ్రవ్యాకరణమును, ఆంధ్రశబ్దశాసనమును శ్రీసూరిగారు రచించిన యితరగ్రంథములలోనివి. వీనిని సాధారణముగా నాంధ్రలోక మెఱుఁగదు. చెన్నపురిలో, కోమలేశ్వరముపేఁట కార్పొరేషను పాఠశాలలో నుపాధ్యాయులు, నామిత్రులును సూరిగారి బంధుకోటిలోనివారునగు శ్రీయుత నారాయణవనము వకుళాభరణముగారుశ్ర మపడి చిన్నయ్యసూరిగారిజీవితాదులు వ్రాసికొనుచున్న హస్తపుస్తకమునుబట్టి యీరెండసంపూర్ణగ్రంథములను సంగ్రహించితిని. సూరిగారి జీవితచరిత్రములో నీసంస్కృతసూత్రాంధ్రవ్యాకరణము సంపూర్ణము గావింపఁబడ లేదని తెల్పియున్నారు. చిత్తగింపుఁడు.

ఆ 1865 సంవత్సరము డిసెంబరు నెల సుజనరంజనీపత్రికలో బి. సీతారామాచార్యులుగారు, సి. సుబ్బరాయలునాయనివారు, కృష్ణమాచార్యులుగారును వ్రాసినవిషయము.:—

“ ఈవచనకావ్యము (నీతిచంద్రిక) మిక్కిలి ప్రౌఢముగాను లక్షణములకు ముఖ్యలక్ష్యములుగాను జక్కనిప్రయోగములు గలదిగాను గానఁబడుటచేత లోకమునం దిది విశేషవ్యాప్తి గలిగియుండఁదగినది. దీనిని రచించిన పరవస్తు చిన్నయసూరిగారి కాంధ్రమునందును తదుపయుక్త సంస్కృతప్రాకృతములయందు దలస్పర్శియగుపరిజ్ఞానము గలదని వారు చేసినలక్ష్యలక్షణగ్రంథములే నిరూపించుచున్నవి. మేము వారితోడఁ జిరకాలము సావాసముచేసి యాంధ్రమునందలి యనేకవిషయంబుల నెఱింగినవారము గనుక వారిపాండిత్యము మాకనుభవసిద్ధము. వారు రచించినగ్రంథములలో ముఖ్యములు:-శబ్దలక్షణసంగ్రహము, బాలవ్యాకరణము, నీతిచంద్రిక. వీ రారంభించి ముగింపనివి అకారాది నిఘంటు వొకటి, సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణ మొక్కటి. విశ్వనిఘంటువు

టీకయొకటి. ఈమూఁడును ముగిసియుండెనేని యాంధ్ర భాషకు మఱి యపేక్షణీయ మేమియు నుండనేరదు. ఆంధ్ర భాషయొక్క యభాగ్యమే వారిని గీర్తిశేషులను గావించెను. ఈగ్రంథములను సమగ్రములనుగాఁ జేయింపవలె నని మ॥ రా॥ రా॥ Honourable గాజుల లక్ష్మీనరసింహులు సెట్టిగారు C. S. I. బహుప్రయత్నములు చేయుచున్నారు. వారియత్నము సఫలము కావలయు నని మేము సర్వేశ్వరుని బ్రార్థించుచున్నాము." అని-

సూరిగారి జీవితచరిత్రములోనే- "చిన్నయ్య సూరిగారిజననము 1806, సూత్రాంధ్ర వ్యాకరణము (చిన్నయసూరీయము) రవిధీభావత్సరే 4942" ఇత్యాదిగా వ్రాయఁబడియున్నది. శాలివాహనశకము ౧౭౬౫ ఇప్పటికి ౮౫ సంవత్సరములక్రిందటిది. అనఁగా నించుమించు 1842 కావచ్చును. ఆంధ్రశబ్దశాసనము రచించిన కాలము వేయఁబడలేదు. ఒక్కసారి యీసూత్రాంధ్రవ్యాకరణము ముద్రింపఁబడినదాని నేనొక్కరియొద్దఁ జెన్నపురిలోఁ జూచియున్నాఁడను గాని యదియు నిదియు నొక్కటియేనా యనుట కది యెవ్వరియొద్దఁ జూచినదో జ్ఞప్తియందు లేదు.

ఆంధ్రశబ్దశాసనము శబ్దలక్షణసంగ్రహముకంటెఁ గొంచెము భిన్నముగాఁ గనఁబడుచున్నది. దానికంటె నిందు సూత్రము లెక్కుడుగాఁ గలవు. శ్రీవకుళాభరణముగారియొద్దనే నేనొక్క సూత్రములకాగితము (పూర్వపు పేఁచుకాగితము) చూచితిని. అందలి యక్షరములును ధాతుమాల వ్రాసిన వారి యక్షరములు నొక్కరీతిగానున్నవి. దీనిప్రతిబింబము తీయించి పంపుఁడని కోరియుంటిని గాని "ఫొటోగ్రాఫరుగా"రేవో యసందర్భములు చెప్పినా రని వీరు నాకు దానిని బంపలేదు. అవి చిన్నయ్యసూరిగారి యక్షరము లేమో యను సంశయముగలదు. ఆవిషయము ముందు తెలిసికొందము. సంస్కృతసూత్రాంధ్ర వ్యాకరణములో మొదటిపరిచ్ఛేదముచివరమాత్రము :—

"ఇతి సకలభాషాకవికమలమిత్ర గాఙ్గేయస గోత్రాపస్తంబసూత్రయజుశ్శాఖాధ్యాయి వేంకటరంగరామానుజార్యపుత్ర శ్రీనివాసాంబాగర్భ శుక్తముక్తాఫలాయమాన దిగంతవిశ్రాంతచిరంతనకీర్తి విరాజమాన సంస్కృతాది భాషాష్టక లక్ష్యలక్షణజ్ఞాన మహాపండిత జేగీయమాన నిరంకుశ నిరర్గళశేముషీ ధారాలంకృత సంస్కృతాంధ్ర భాషానుశాసన బహులక్ష్యలక్షణగ్రంథరచనా ధురీణ సర్వదర్శనసంగ్రహ కుసుమాంజలీ మహాభాష్య శ్రీభాష్య భగవద్విష

యపాఠప్రవచనపారీణ శాత్తాద శ్రీవైష్ణవకుల కలశాంబుధి పూర్ణచంద్రేణ ఆంగ్లరాజకీయసర్వకలాశాలాంధ్ర ప్రధానపండిత చిన్నయసూరిణా ప్రణీతగీర్వాణభాషారూపాంధ్రశబ్దానుశాసన సంజ్ఞాపరిచ్ఛేదః. కరారవిధీభావత్సరే విజయతేతరామ్."

ఈగద్యములోని విషయములు కొన్ని టింబట్టి యిది శ్రీసూరిగారు స్వయముగా వ్రాసికొనినదా యను సందేహముతో గ్రంథములో దీనిం జేర్పలేదు. ఏయితరగ్రంథములోను నిట్టిగద్యము లేదు.

పై రెండిటియందును వ్రాంతతప్పులు కొన్ని, ద్విరుక్తములు, గ్రంథపాతములు కొన్ని, యస్ఫుటసూత్రములు కొన్నియుం గలవు. బ్ర॥ శ్రీ॥ విద్వాన్ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారు వారిబుద్ధికిందోంచినట్లుంపవలసిన సూత్రముల నుంచి, ద్విరుక్తములు తొలంగించి, ప్రమాదములనుకొంతవఱకు సవరించి, చెప్పినరీతిని బ్రతి వ్రాసి యీరూపమునం బరిషత్పత్త్రికలోం బ్రకటించుటకు సిద్ధము చేసి నాండను. అభిజ్ఞులు, రెండవప్రతి సంపాదించిగాని యున్నలోపములు సమర్థతచే సవరించిగాని యుపయోగించుకొందురుగాక యనియు, నమమ నాతప్పులను మన్నింతురనియు వేండుచున్నాండను.

చిన్నయసూరిగారి వంశాదికము బాల్యచరిత్రము మొదలగునవి నేను సంపాదించిన ప్రతిలోనున్నవి. అప్పు డప్పుడు కొన్ని పరిషత్పత్రికలోం బ్రకటింపం బడుచుండును. ఈవ్యాకరణసూత్రముల మాతృకయుం బరిషత్కార్యాలయమున నేయుంపంబడియున్నది. ఇందలి రెండవభాగమునకు- ఆంధ్రశబ్దశాసనము, అనియే చాలచోటుల వ్రాయంబడియున్నది గాని యెట్లో ప్రమాదమున ఆంధ్రశబ్దానుశాసనము, అని ప్రారంభింపంబడినది. కొంత ముద్రింపంబడిన పిమ్మటం దెలిసికొనంబడెను.

క్రొత్తపల్లి సూర్యారావు.

ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటితము. సంఖ్య. ౨౬.

శ్రీరస్తు.

# పరిషత్పుస్తకభాండాగారము.



పరిషత్పత్రికనుండి పునర్ముద్రితము.

కాకినాడ:

ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచేఁ బ్రకటితము.

కాకినాడముద్రాక్షరశాల.

1931

వెల రు ౦-౮-౦.

# పీఠిక.

పరిషత్పుస్తకభాండాగారములోని ముఖ్యగ్రంథములవిషయమై పరిషత్పత్రికలోఁ దఱచుగ వ్రాయఁబడుచున్నది. కొన్నిసంవత్సరములలోఁ బ్రచురింపఁబడినవానిని వేఱుగాఁ బ్రతులు తీయింపలేదు. ఇటీవల వానిని బాఠకు లుపయోగించుకొనుచున్న యుక్తి ననుబట్టి యిదిగూడఁ గొన్నికొన్ని గ్రంథముల విషయ మొక్కొక్క పుస్తకరూపముగానుండుట మంచిదని ద్వితీయభాగమునుండి యేర్పాటుచేసియున్నాము. ఇందనేకుల కనేకవిషయములు తెలియఁగలవు. వివిధములగు చాటుధార లాయాగ్రంథములలో నున్నవానిఁగూడ నిందెక్కించుచున్నారము. వానినింబట్టి పలువురుపురుషులఁ, బట్టణములఁ, గవులఁ దెలిసికొనుటకవకాశముగలదు. ఇదివఱకుఁ బ్రచురింపఁబడిన చాటుధారాదిపుస్తకములలోఁ జేరనిపద్యములుగూడ నిందున్నవని మానమ్మకము. ప్రస్తుత మీరీతి గ్రంథములలో మేము సాధారణముగా నాంధ్రగ్రంథములను గూర్చియే వ్రాయుచున్నారము. అందందు సంస్కృతగ్రంథములు చూపఁబడును. మా ప్రచురములలోఁ గవులపేరులు తెలియని గ్రంథములు కొన్ని యున్నవి. వాని నెఱిఁగియున్నవారు మాకావిషయ మెఱిఁగింతురేని మాపరిషత్తునకుఁ జాలసహాయమగును. ఈద్వితీయసంపుటము ప్రారంభించియు దీర్ఘకాలమగుటచేఁ బ్రమాదమున రెండుమూఁడువిషయములు స్థలాంతరములఁ జూపినవే చూపఁబడినవి, కాని రచనము భిన్నముగా నుండుటచేఁ బాఠకులు విసువరని తలంచెదము. ఆయాగ్రంథములలోనుండి తెలిసికొనవలసిన కవి, కృతిపతి, గ్రంథవిషయము మొదలగునవి సాధ్యమైనంత విస్తారముగను సంగ్రహముగను గూడఁ దెలుపఁబడుచుండును గావునఁ బాఠకుల కసంతుష్టి కలుగదని తలంచెదము. చరిత్రములు, ఇతిహాసములు, కావ్యములు, ప్రబంధములు, యక్షగానములు, జ్ఞానమార్గగ్రంథములును గద్యపద్యాత్మకములు పండితపామరరంజకము లిందుఁ గలవు. కావున సర్వజనాదరణీయమగునని విశ్వసించుచున్నారము.

ప్రజోత్పత్తిసంపుటమునుండి మరలఁ దృతీయభాగము ప్రారంభింపఁ బడును

శ్రీ

# పరిషత్పుస్తక భాండాగారము.

## ద్వి తీ య భా గ ము.

---

—॥ విషయసూచిక ॥— పుట.

# పరిషత్పుస్తకభాండాగారము.

(ద్వితీయభాగము.)

## 1. మహాభారతము-ఆదిపర్వము-గ్రం. సం. ౧-౧౧.

ఆంధ్రమహాభారతమునందలి యాదిపర్వప్రతులు. ఈ రెండును దక్షిణదేశమునుండి వచ్చినవి. భిన్నస్థలప్రతులు. వ్రాఁతలో మిగులఁ దప్పులున్నవి. ౧ సంఖ్యగలదానికంటె ౧౧ సంఖ్యదానిలో నన్నితప్పులు లేవు. ప్రారంభమున శ్రీఛాయాపతయే సూర్యనారాయణాయనమః శ్రీఅశ్వత్థనారాయణాయనమః క. హరిదాసును వనవాసును పరిచితపరమోపవాసు (౩) ప్రాంశుపయోదనీలతనుభాసితు (౪) అంబనవాంబుజోజ్వల అనువానితర్వాత శ్రీ వాణీగిరిజాశ్చిరాయ అని కలదు. ౧౧ సంఖ్య గలదానిలో శ్రీగణాధిపతయేనమః వాగీశాద్యాస్సుమనసా యనుశ్లోకముమాత్రము వ్రాసి పిమ్మట శ్రీవాణీగిరిజా యని మొదలిడెను. మాటలలోఁ జాలభేదములు గలవుగాన రెండు భిన్నమాతృకలనుండి వ్రాయఁబడినవని విదితము.

౧ లో—అని సకలభువన రక్షణ ప్రముఖులై - - వాణీపతుల స్తుతియించి

౧౧ లో—అని సకలభువనరక్షణప్రభువులైన - - వాణీపతుల స్తుతియించి

౧ లో—బలిమి నెయ్యమున భూవలయుపతుల ౧౧ లో—బలిమి నియ్యని భూమివలయుపతుల

౧ లో—నాకు ననవరతంబు శ్రీమహాభారతంబునందలి యభిప్రాయంబు పెద్దయునై యుండు

౧౧ లో—నాకు ననవరతంబును మహాభారతంబునందుల యభిలాష పెద్దయునై యున్నయెడ

౧ లో—పాయక పాకశాసనికి భారతఘోరరణంబునాటి నా
రాయణునట్లు మానసధరామరవంశవిభూషణుండు

౧౧ లో—పాయకపాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణునట్లు దాను వసుధామరవంశవిభూషణుండు.

ఇట్టివెన్నియో భేదము లుండనిండు. "అనవరతార్థదాన యజనాభిరతుక్షాభరతాన్వయాభివర్ధను" అను పద్యమునకుఁ దర్వాత ౧౧ దానిలో దథప్రాసములై మనము కొల్లాడు "కాఁడనకిట్టివాటియుపకారము" అనుపద్యము విడిచిపెట్టఁ

బడినది. మాకీయును ౯౭౧౨ సంఖ్యగలదానిలోఁగూడ నీపద్యమిటువిడువఁబడి నది. ౧ దానిలో-ప్రథమాశ్వాసములో "సంబోధనచేసి చేసె నృపసుందర"యని ద్వితీయాశ్వాసము కడపట - సంబోధనచేసిచేసె నృపసుందర-యనియుం గలదు. ౧౧ లో ప్రథమాశ్వాసములో లేదు గాని ద్వితీయాశ్వాసములోఁగలదు. "సంబోధనచేసిచేసెనృపసూదన"యనియున్నది. ౧ దానిలో ౧౧ లోఁగూడ "ఏడ క్షోహిణు లెన్నఁ బాండవబలం బేకాదశాక్షోహిణుల్ సాధింగౌరవసైన్య" మనియే యున్నది. ఆంధ్రగ్రంథములలో నగ్రగణ్యముగానఁ బ్రథమమున మంగళార్థ మీపుస్తకము నెత్తి చూపినారము. ౧ వ దానిలో నష్టమాశ్వాసము పూర్తిగా లేదు. ౧౯౭ పత్రములు. ౧౧ వది ఆదిపర్వము పూర్తిగ నున్నది. ౨౬౫ పత్రములు. కడపట—

క. వ్రాలా తప్పులుశిథ్రులు, చాలంగల వేను నట్టిశబ్దసంగతు లెరుగం
గేలిం బెట్టక తిట్టక, పోలంగా దీర్చరయ్య బుధజనులారా.

గీ. వ్రాఁతతప్పువలన వాచకు లలుగక, తప్పు గలిగెనేని తగినయెడల
నలయు నక్షరములు వెలయంగ నిలుపుఁడీ, సుకవులయినవారు సుస్థిరముగ.

సౌమ్యనామసంవత్సర కార్తిక బ-౧౨ ఆరంభం చేసి పుష్య శు ౧-లు సరికి ఆదిపర్వం యెనిమిది ఆస్వాసాలు కొత్తకోటకరిణం తిమ్మప్ప వ్రాసినది సర్వం శ్రీకృష్ణార్పణమస్తు అనియున్నది. (కొత్తకోట - పుదుకోట.)

## ౨. ముహూర్తమార్తాండమ్. గ్రం. సం. ౭.

ముహూర్తభాగము—౨౬౦ శ్లోకముల గ్రంథము. మొదటి ౮౮ శ్లోకములు లేవు. కాని గ్రంథము ప్రారంభమున ౧-౨ పుటలవరుసనే శ్రీరామాయనమః శ్రీగణేశాయనమః అథాగ్న్యాధానప్రకరణం వృత్తైకేనాహ అని ప్రారంభించినాఁడు. మొదటి ౮౮ శ్లోకములు మొదటిభాగముక్రింద గణింపఁబడుచున్నదో యేమొ. శ్లోకమును దానికి వ్యాఖ్యానమునుగా ౮౮ పత్రముల గ్రంథము.

గద్యము—ఇతి శ్రీమదనంతాఖ్య చాతుర్మాస్యయాజిపుత్ర నారాయణ విరచితాయాం ముహూర్తమార్తాండటీకాయాం మార్తండవల్లభాయాంముహూర్త మార్తండ స్సమాప్తః.

కవియే దీనికి వ్యాఖ్యానము వ్రాసెను. కవివంశాదికము.

ఆసీత్సమమణౌరునామనగరే శ్రీకౌశికస్యాన్వయే
యోనంతో వాజసనేయపూజ్యచరణో మాధ్యందినేయాగ్రణీః

కృష్ణ స్సత్తేజసాం శ్రుతిస్మృతివిదా మగ్రేసరో జ్యోతిహారి
స్తస్యాత్రేః శ్రేష్ఠస్సద్విద్యాజనకో నంతాగ్నిహోత్రిగ్రహః
తత్పుత్ర స్త్వనుగ్రహార్హ్యఘనో నారాయణాస్తాపుర
ప్రాచ్య శిష్యగణేచ్ఛయా నిజకృతగ్రంథస్య టీకాం స్ఫుటాం
చక్రే తాం కృపయా పరోపకృతయే తోషస్సం సదయుక్తిం
ప్రాప్యశిష్యస్య విలోక్య భాష్యముఖి తే కుర్వంతు నో సజ్జనా
సుఖనిధిపురుషార్థత్త్వానసమాభిస్సమాభిః
పరిమితశకకాలే ముహూర్తమార్తాండటీకాం
లిఖతి పఠతి విప్ర స్సోత్రభూయాస్థరిత్ర్యాం
సుఖనిధిపురుషార్థ త్త్వానసమావాన్ కుమావాన్.

3. చంద్రాంగదచరిత్రము—గ్రం. నం. ౧౨.

పైడిమఱ్ఱి వేంకటపతికవిరచితము. ౧ - ౨ - ౩ - ౪ - ఆశ్వాసములు పూర్ణ
మ్మది యసంపూర్ణముగను గలదు. ప్రారంభమున—
నాస్తాస్తకంబు నిజదోర్వీర్యంబునం గూకుదం
గంగకు మునీశ్వరప్రియతముం డై భార్గవా మేయబా
ంబు దా నగణమీయన్ జానకీకాంతుతో
రంగైన గృహప్రవేశ మగుశ్రీరాము న్మదిం గొల్చెదన్.
అనవంశ మి ట్లొకపద్యమునం జెప్పుకొనియెను.
సత్కవిపూజ్యసుకవిత్వసామ్రాజ్యనిర్వాహకుఁడు పెదపర్వతన్న
వివిధభాషాహార్యవిరచనాచాతుర్య సర్వంకషుఁడు పొట్టిపర్వతన్న
వరపద్యదాకారవాచాచమత్కారనిరుపమమతిశాలి తిరుమలన్న
యనధానకృతిగర్భకవితాచ్ఛసందర్భకీర్తిత ప్రజ్ఞుండు కేశవన్న
యునుఁ దనకు నన్నలుగ నుర్వి నొప్పుకృష్ణ, రాయభూషణకులరామరాజతనయు
కేశవాత్మజపర్వతాధీశు వేంక, టాద్రి నీకావ్య మేనిత్తు నంకితముగ.

గద్యము—ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందభృంగాయమాన మానస
సకలశాస్త్రార్థవిరరంస పైడిమఱ్ఱిపన్నాభార్థవిరతంస కృపాభూషణ కృష్ణరాయ
భూషణ పర్వతరాజతనయ వేంకటపతివిరచితం బైన - - - -

ఇందలికథ నిషధపురాధీశుఁడైన యింద్రసేనుఁడు సంతానముంగోరి విష్ణు
నారాధించి చంద్రాంగదుఁ డనుపుత్రుం బడయుట—చంద్రాంగదుని బాల్యము,
యౌవనము, వేఁట—ఒక్కశారికను బట్టికొనిపోయిన నది యొకస్త్రీయై పలు
కుట మొదలైనవి.

ఇం దాఱవయాశ్వాసములోఁ గొంతభాగము లేదు. స్త్రీ మనినాఁడ బహు కాల మనవస్యగతి జనుల్ గొనియాడ భూమిపాలన మొనర్చి, వినినాఁడ నయ మనుల్ వినుపింప నయశాస్త్ర - - - అంతతో ముగిసినది. చాలకాలముక్రిం దట నెల్లూరిలో నీగ్రంథ మచ్చుపడినది. అప్పుడు వారికిని షష్ఠాశ్వాసము ప్రాప్తిగా దొరకలేదు. కొన్నిపద్యములు:—

చ. అని తెలియఁగాఁచు నూఁచి వగ హాయను హాయని నవ్వు నవ్వి వ
చ్చినతను దూఱు దూఱి విధినీయను నీయని కుందుఁ గుంది ప
ల్విన నెతఁ దూలుఁ దూలి మదివేసరు వేసరి రోఁజు రోఁజి చె
క్కు సఁ జెయిఁ జేర్చుఁ జేర్చి హరికోసము మోసమునచ్చెనాకనుక్. ౨ ఆ.

ఉ. ఆయెడఁ బంచబాణసముదగ్రసమగ్రజయోగ్రదోస్సమా
ఖ్యాయుత చిత్రసేనతనయా తనుసంభృతపాండిమాహృత
చ్ఛాయత వోలె నెంతేయును జక్కవ లొక్కట జోడుగూడ వే
వేయురియాడఁ దోడ రహివీడె వినిర్మలసాంద్రచంద్రికల్. ౫ సు......

ఇందుఁ బత్రసంఖ్య 126 గలదు, చతుర్థాశ్వాసములేదు. శ ౧-లు సరిక్రి నడుమఁ గొన్నిపత్రములు విడువఁబడినవి. వ్రాసినది సర్వం

4. కన్నశతకము. గ్రం. సం. ౩౮.

ఈశతకములో 135 కందపద్యములు గలవు. వేదాంతరహస్య శ్లోక పాదకము లైనచక్కనిపద్యములు. 18 పత్రముల చిన్నపుస్తకము 129 పద్యములు మొదట వ్రాయఁబడినవి. తక్కినపద్యములు తర్వాత వ్రాయఁబడినట్లు వ్రాఁత క్రొత్తప్రాఁతలు, అక్షరముల భేదమును దెల్పుచున్నవి. ప్రతిపద్యమునకును కన్నా యని మకుటముగలదు. కొన్నిపద్యములలో యెరగుడికన్నా, యినకులకన్నా, రవికులకన్నా యనియుఁ గ్రొత్తగా వ్రాయఁబడిన వానిలోఁ గన్నా యనియుఁ గలవు. మొదటిపద్యములు.

అబ్బురపు బాలపదముల, జొబ్బిల్లెడి రసముగ్రోల జోకనహింపక్
నిబ్బరపుఁగవిత లబ్బుట, యబ్బురమా యెఱుకగన్న యరగుడికన్నా. ౧
ఎబ్బెట్టుమతము రోయుచు, నిబ్బరముగ బాలపాదనీరజరసముక్
ఉబ్బుచుఁ గ్రోలిన యంతట, నిబ్బంగిని గవితలన్న యెరగుడికన్నా. ౨
అంజనిపుత్రుని కృపచే, రంజిల్లుచు శారదాంబ రసికత మెఱయక్
మంజుళవాక్యము లిచ్చెను, రంజితబాలాప్రసన్న రవికులకన్నా. ౩

ముందర నుండయుని కృపఁగని, యానందపయిఁ యోగివరుని యనువునయిం
పొందఁగ బుచ్చనగురుదయ, నిందిర నీకబ్బెరన్న యెరగుడికన్నా.
పిల్లలమఱ్ఱి బుచ్చనగురు, చల్లని వాగమృతఘటన సమరస మొప్పన్
గిల్లప్రపంచము రోసియు, నెల్లప్పుడు నెఱుకగన్న యెరగుడికన్నా. ౯
సుబ్బయగురుకృప నల్లను, నబ్బెను బాలాంబకరుణ యానందముతో
గొబ్బునఁ గైకొని సుమతిగా, యిబ్బంగిని నెఱుకగన్న యెరగుడికన్నా. ౧౦

ఈపద్యములంబట్టి పిల్లలమఱ్ఱి బుచ్చన్నగురునికి శిష్యుఁడై బోధముం గాంచెననియును సుబ్బనగురునిచే బాలాంబప్రసాదముంగాని కవియయ్యె ననియు, ఆంజనేయోపాసకుఁడుగానుండె ననియు, గవివిషయము తెలియవచ్చును గాని కవిపేరెవ్వరో-ఒకవేళ యెఱగుడికన్నయ్య యేమో-యనియూహించుటకును నవకాశమున్నది. ఈకర్ణయ్య, కన్నయ్య యని వ్యవహరింపఁబడు నాతఁడినకుల వంశజుఁడు క్షత్రియుఁ డనికొనవచ్చును:—

నాసికము మొదలఁ జిత్తము, భాసిల్లఁగ నుంచి చాలభావము గురుపై
నాసక్తితోడ నిల్పుట, యాసుఖమే నీవటన్న యరగుడికన్నా. ౧౬
గంగకు యమునకు సందున, సంగతిగా ద్రోవగనిన సమరసమారా
రంగైన బ్రహ్మపదమున, కింగితమా యెఱుకగన్న యినకులకన్నా. ౫౧
అంతయుఁ దానని యుండుము, అంతకు మదినిల్వదేని యంతకు వెలియై
సంతోషమంది నిల్చిన, యంతేరా యెఱుకగన్న యెరగుడికన్నా. ౧౦౩

పద్యములలో వ్రాఁతకాండ్ర వ్రాఁతతప్పులు దొలఁగించిన బద్యములు శుద్ధముగా మృదువులుగా నున్నవి. గ్రామనామాదులలోఁ గొంతస్వేచ్ఛను విడిచిరిగావున యరగుడి, యెరగుడి, యని యతులలో రెండుదెఱఁగులవాడి యున్నాఁడు. ఎల్లన, యెల్లన, యల్లన యని యిట్టితరగ్రంథములలోఁగూడఁ గానవగును. ఇదిదక్షిణదేశప్రతి.

5. సభాపతి లక్షణము—వచనము—గ్రం. సం. ౨.

ఈపుస్తకమును దక్షిణదేశమునుండి వచ్చినదియే వేంకటకృష్ణప్పనాయకుని యహల్యాసంక్రందనములోఁ (దీనిని బరిషత్ప్రాఁతకు లిదివఱకే యెఱుఁగుదురు) జివర వ్రాయఁబడి యున్నది. 7 పత్రములు గలవు. పూర్వభాగము పూర్ణముగా నున్నది. ఉత్తరభాగము కొంతలేదు. కవియెవ్వరో తెలియదు. సభాపతులే కాదు సకలజనులు నెఱుంగవలసిన యనేకవిషయము లిందుఁ గలవు ప్రారంభము.

క. శ్రీరమ్యుఁడు సంశుశృం, గారుఁడు రాజాన్వయప్రకారుండును
బాహాశూరుఁడు సకలకలా, పారంగతుఁ డనఁగఁ దా సభాపతి వెలయుక్

క. తగుఁణుండై ననరత్నా, భరణుండై గంధపుష్ప పరిమళయుతుఁడై
పరనారీ పోదరుఁడై, పరఁగినవాఁ డెన్నఁబడు సభాపతియనఁగన్.

క. సంపతియు ధనియును, స్థిరమతియు సకలవిబుధకవితావిద్యా
పరిణతుఁడై చతురుండై, పరఁగినవాఁ డెన్నమతి సగ పతియనఁగన్.

క. తనయుల మిత్రుల --- నునిచిన సమీపమునఁ దనిన యోగులవిద్వ
జ్జనులను మాన్యులన --- దగు నార్యులు చుట్టును గూర్చుండఁదగున్.

క. భావజ్ఞు లరసి కులసం, భావనగలవారి రాయబారులఁ గవులన్
శివిని యథాసనంబుల, భావింపఁగ నుంపఁదగు సభాపతియనఁగన్.

క. వీరాహవమున విజయుఁడు, ధీరోదాత్తుండు సద్గుణనిధయై
యారయ సింహాసనమున, నారూఢత నొందుచుండు నాసభనడుమన్.

అని యిట్లు సభాపతిలక్షణము లెట్లనిన:—సోమసూర్యవంశోద్భవుం డైనస్వామి యమాత్య రాష్ట్ర భృత్య కోశ దుర్గబలంబులను రాజసప్తాంగంబులు గలిగి, ఆందోళికాభరణాంబర వాహనచ్ఛత్ర రాజ్యాధిపతి కస్తూరికర్పూరతాంబూలంబులను నుచితసప్తాంగంబులుం గలిగి, సామభేదదానదండ మాయోపేక్షేంద్రజాలంబులను సప్తోపాయంబులుం గలిగి స్త్రీద్యూతపానమృగయా వాగ్దోషదండదోషనిరర్థకవ్యయంబులను సప్తవ్యసనంబులు విసర్జించి పౌరాణిక సుతనిధి దేవగేహ వన బ్రహ్మస్థాపిత తటాక సత్కావితలను సప్తసంతానంబుల వెలసి విద్వాంస పౌరాణి కైతిహాసిక భట్ట పరిహాసక గాయక వందికులను సభాసప్తాంగంబులు గలిగి లవణేక్షుసురాసర్పిదధిక్షీరశుద్ధోదకంబు లనుసప్తసాగరంబులు గడచి ------ దానధర్మపరోపకారంబులను ధర్మత్రయంబు నెఱింగి ప్రభుమంత్రోత్సాహంబులను శక్తిత్రయంబు గలిగి శత్రుమిత్రోదాసీనంబులును త్రివిధంబుల, నుత్పత్తిస్థితిలయస్వరూపత్రి గుణంబుల నెఱింగి, ప్రభాతిమధ్యాహ్ననాయంకాలసంధ్యాత్రయ నియమవంతుండై ---- అర్థకామమోక్షంబులను చతుర్విధపురుషార్థుఁడై వేదశాస్త్రపురాణేతిహాసంబులు.... క్షౌరాభ్యంజన దంతధావనధౌతవస్త్రంబు లను చతుర్విధముల గరగరిక లెఱింగి వస్త్రాభరణగంధపుష్పంబు లను చతుర్విధశృంగారవంతుండై, ఉన్మదనమోహన వశీకరణ సంతాపంబు లను చతుర్విధ మదనమార్గంబులం దెలిసి ----- ధనధాన్యకుమారవస్త్రవాహనభూషణబంధుదాసదాసీజను లను సప్తైశ్వర్యంబులు గలిగి భోజప

వస్త్రగంధపుష్పతాంబూలప్రియకామినీసంగతగోష్ఠి. పూవుపాన్పులను నష్టభోగంబు లనుభవించి - - - -

ఈరీతిగా రెండుభాగములందును, సంఖ్యలతో నిరువదితొమ్మిదిగణములు, యిరువదిప్రాసంబులు, నేఁబదియతులు, దోషములు నలంకారములు సంగీతరాగములు, నష్టాదశపురాణోపపురాణంబులు, ముప్పదిరెండాయుధములు ఛప్పన్నదేశంబులు - - - - జెప్పఁబడియున్నవి. సమయస్ఫూర్తి కిట్టివిషయములు గూడ తెలిసికొనియుండుట మంచిది. పూర్ణప్రతి సంపాదించి పరిషత్పత్రికలో మున్ముందు పూర్తిగా ముద్రింపఁబడును. విషునామసంవత్సరము నవరాత్రులలో వ్రాయఁబడినది. రాయబ్బద్ధిసుబ్బాశాస్త్రులవారి పుస్తకము. సుబ్బాశాస్త్రులవారే వ్రాసినట్లు కనఁబడుచున్నది.

6. ఆంధ్రకౌముది. గ్రం. సంఖ్య. ౧౬

ఇది, గణపవరపు వేంకటకవి సర్వలక్షణశిరోమణిలోని యాంధ్రవ్యాకరణభాగము. ఇది 31 పత్రములలో వ్రాయఁబడిన పెద్దసీసమాలిక—ఇందుఁ దత్సమపదములు, తద్భవములు, దేశ్యములు, గ్రామ్యోక్తులు, సంస్కృతసంజ్ఞాప్రకరణము, అజంతములు, విభక్తులు, సంధులు, ఆదేశయకారసంధి, పరరూపములు, హలంతసంధులు, లుప్తవర్ణపదసంధులు, ద్విత్వవిధానము, జస్త్వవిధానము, హలంతప్రథమ, ఏకవచనబహువచనరూపములు, దేశీమూల తెనుఁగుప్రథమైకవచనములు, సతిసప్తములు, అప్రాణివాచకాదంతాల సప్తమితృతీయల - - - అవ్యయములు, అప్రత్యయములు, ఆఱువిధముల కారకములు, సమాసములు, కృదంతములు, క్విప్రత్యయములు, వర్గచతుర్థఘకారధకార - - - - నకారణకారములు వట్రువసుడులు మొదలగునవి వివరింపఁబడినవి. ప్రారంభము—

క. శ్రీభామాసర్వోత్తిక, భాభననిజసుందరహాస భాగధగశ్రీ
శోభితశుభతత్కుచకుం, భాభోగకేలాస వేంకటాచలవాసా.

అవధరింపుము.

సీ.మా. శ్రీకరమ్ముగను సంస్కృతమునకును బ్రాకృతమునకుఁగలలక్షణములు చెప్పి
తెనుఁగున నావిధమ్మున లక్షణము చేయరాకున్కి యదియు నేరంబు గాదు
తొల్లిటి సుకవు లెల్లను నను ధన్యుఁగావించు తలఁపింతె కాని యనుచుఁ
గుకవిజనాజ్ఞానఘోరాంధతమసము పోఁగొట్టఁ గల్గు కౌముదివిధాన
నిల మున్నుఁ దెనుఁగున నెవ్వా రెఱుంగని యాంధ్రకౌముది యనుసత్కృతిని

సీసమాలికగాఁగఁ జేసితి నిపుడున్న కవులకు రానున్న కవులకెల్ల
నుపకారముగఁ నిది యెప్పుడు నాచంద్రతారార్కమై కౌముదియటుల వెలయుఁ
గననిందు సంజ్ఞాప్రకరణమ్ము మొదలుగఁ దత్సమప్రకరణము ల్పదారు నవునఁ
దత్రిలింగపదంబు తద్భవం బగుటచేఁ దెలుఁగనఁ దగినట్టి తెలుఁగు ప్రాకృ
తాభిధానముగాన నాలక్షణమ్ములు తెలుపఁ గవులకెల్లఁ దెలియవలయు ---
తత్సమ దేశ్యతద్భవములఁ గలయని తేటనుడుగు లచ్చతెనుఁ గనఁదగు
నదియెట్టులన నింకనలరు పేరు కొలంకు నూనెనా నాముదం బానవాలు
బండి పసర మొద్దు పండు పప్పున్ను దూకలాకులు నాకు శాకు మేకు
గుజ్జు మేనిక యెంక కోట వెన్నెల కొల్ల గడి పులి నెల వలి నాడుగన నిఁక
గ్రామాలు జాలు పురాణాలు దోసాలు శాస్త్రాలు వేదాలు సంబరాలు
గంటలు పౌక్కులు గ్రద్దలు బొందలు గానాలు మొదలుగాఁ గలపదములును
వాసేవు పైపెక్కి రాగేసేవు నీవూను కూసుకుంటా గోంతిగుద్దరాకు
పాడేవు కాలెత్తి యాడేవు వన్నానె నూసేవు దానికంతాసమీరె
ననుక్రియల్ మొదలైనయవి గ్రామ్యములు -------
అఖిలప్రబంధమ్ములందలి లక్ష్యముల్ వేశ్వేర నొకకొన్ని విస్తరింతు
నెమ్మెచ్చెనాఁగను దమ్మంట్లు నాఁగను దివ్వంతయనఁగ మదించెనఁగ
వానిదవంధ్య జీవనమనంగ ననలజ్యోతుండ నన నిచ్చచాండు ననఁగ
నంతంతనఁగఁ బరమాత్ముండురనఁ దామరసనేత్రలింగ్లన బ్రహ్మాండన
శౌరిచ్చుభక్తి వేసారక నెంతధికంబన గురునాజ్ఞ గనుఁగొన్నసన
మీరిప్పు డంద ఆర్మిఁను బొల్తిదియన నేయు నయు మనునేయేయనంగ
--------------- నింకస్థావరాప్రాణి వాచకములగుచుఁ
దగునుకారాంతశబ్దము లకారాంతములను బంచమీ తృతీయలను సప్త
మినల బహుళ నేకతను రెండును జెలంగు గట్లనుపచ్చెను గట్లవచ్చె
ననఁ జెలి ప్రేంఁజూపెను ప్రేళ్లఁజూపెనా నొకయూర నిల్చువాండూళ్లనిల్చె.

ఇశ్లేవ్యాకరణముంతయు వ్రాయఁబడియున్నది. ఈ 16-వ పుస్తకములో శబ్దమంజరి (సం.) ఆంధ్రనామసంగ్రహము, అకారాది దేశీయ తెనుఁగులు, వేంకటేశాంధ్రము, ఆంధ్రకౌముది, ఆంధ్రశబ్దచింతామణి యనునవి గలవు. సిద్ధార్థినామసంవత్సరము ఆనణి నెల ౧౫-వ తేది రాచవేల్పు కృష్ణమరాజు స్వహస్తలిఖితమైన సర్వలక్షణశిరోమణియందలి యాంధ్రకౌముది తృతీయోల్లాసము సంపూర్ణము -- అని కలదు.

7. భగవద్గీతావచనము - గ్రం - సం - 37.

ఈవచన మెవ్వరు రచియించినదో తెలియరాదు. ఈసంపుటములో నిదియు, నవధూతస్వాముల గురుశిష్యసంవాదము, మహావాక్యము, నాత్మైకబోధము ను గలవు. సంస్కృతమునకు సరియైన తెనుఁగునలెఁ గనఁబడుచున్నది. ప్రారంభము.

క. శ్రీరమణీహృదయప్రియ, సారసపత్త్రాయతాక్ష సకలాధ్యక్షా
 హారికరుణావిలాస, శ్రీరాజితసుగుణజాల శ్రీగోపాలా.

వ. అవధరింపుము భవదీయచరిత్రాశయం బైనశ్రీమహాభారతంబున భీష్మపర్వంబునందుఁ గౌరవశ్రేష్ఠుఁ డైనధృతరాష్ట్రుండు వ్యాసప్రసాదలబ్ధదివ్యజ్ఞానసంపన్నుం డగుసంజయువలన భూగోళవిస్తారంబును జంబూద్వీపవిస్తారంబును జెప్పిన్న దేశప్రవర్తనంబులును విని కౌరవులును బాండవులును గురుక్షేత్రంబునందు యుద్ధసన్నద్ధు లైనమనవారును బాండవులు నేమి గావించిరని యడిగిన ధృతరాష్ట్రునిం జూచి సంజయుం డిట్లనియె. వ్యూహాకారంబుగా నిలిచియున్న పాండవబలంబు నీక్షించి దుర్యోధనుండు ద్రోణాచార్యసమీపంబునకుం జని యతనితో ని ట్లనియె. నీశిష్యుం డైనదృష్టద్యుమ్నునిచే వ్యూహాకారంబుగా నిర్మితం బై సన్నద్ధం బైనపాండవబలంబుం గనుంగొనుము. ఆసేనయందు భీమార్జునులకు సమానులు శూరులగు మేటివిలుకాం డ్రెవ్వరెవ్వ రం టేని యుధామన్యుండును, ఉత్తమౌజుండును—

- - - - - - - -

ప్రకృతిపురుషయోగములో:—

భారతా క్షేత్రంబులయందలి క్షేత్రజ్ఞుం డగువాని నన్నుఁగాఁ దెలియుము. ఈక్షేత్రజ్ఞస్వరూపం బెఱింగెడిజ్ఞానంబు తనకు సమ్మతంబ క్షేత్రం బననెట్టిది, ఏవికారంబు గలది, యెందువలన జనించినది, యెటువంటిభేదంబు గలది. క్షేత్రజ్ఞుం డన నెవ్వఁడు, ఎటువంటి ప్రభావంబు గలవాఁడు. ఆయర్థంబు సంక్షేపంబుగా వివరించెద."

ఇట్లు సర్వత్ర మృదుమధురముగా వ్రాయఁబడినది.

ధాతృనామసంవత్సర మాఘశు ౧౨ సోమవారమువరకు రాజశ్రీ చేనన కొండరామప్పనాయనివారి కొమారుడు బొజ్జానాయనివారికి శ్రీశైలపతికొమారుడుపాసు దేవుడు వ్రాసిన భగవద్గీతావచనము ౧౮ అధ్యాయంలు సంపూర్ణము

శీఘ్రమేవవివాహప్రతిష్ఠాసిద్ధి రస్తు అనేకరాజ్యాభివృద్ధి రస్తు దేవతాబ్రాహ్మణే ష్వచంచలా భక్తి రస్తు అనవరతభూసురాశీర్వాదసిద్ధి రస్తు. - - - అని యున్నది.

## 8. చిల్లరపద్యములు - గ్రం - సం - ౬9.

ఇది యొక 16 పత్రముల చిన్నపుస్తకము ఇందు దక్షిణదేశములో నున్న ప్రసిద్ధులపై పద్యములు వ్రాయఁబడినవి. పుదుక్కోట నుదురుపాటి రామనాథ నయ్యగా రిచ్చినది ఇందుఁ గొన్ని మనుచరిత్రము వసుచరిత్రము విజయవిలాసము మొదలగు గ్రంథములలోని పద్యములును గలవు గువ్వలచెన్నశతకము, కవిచౌడప్పశతకములలోనివియు నున్నవి. కొన్నిపద్యము లిం దిచ్చుచున్నాము

సీ. వలికెనా కపురంపుఁబలుకులై వనసంపు మొలకలై ఘుమఘుమల్ దొలఁకఁబలుకు
నవ్వెనా విరవాజిపువ్వులై తెలుగంటిపువ్వులై ధళధళల్ దొలఁగ నవ్వుఁ
జూచెనా యమృతాంశు రోచులై కరుణాబ్ధివీచులై నిగనిగల్ వెలయఁ జూచు
నిచ్చెనా వేయింటి కెచ్చులై ముత్యాలమచ్చులై మదిఁ గవుల్ మెచ్చ నిచ్చు
బుధులమన్నించు క్షేమమునిధులఁ బెంచు, స్వజనులను బ్రోచు మదవైరిజనుల నేఁ
బ్రియదశుభవనమధ్యమాభిఖ్యభువన, పాలనపరుండు రాజగోపాలవిభుఁడు [చుఁ

క. వకుళవననిత్యవాసిని, సకలాభీష్టముల నిచ్చు చక్కనితల్లీ
ప్రకటితము సేయు నీకృప, నృకలుషగిరిభేదశంబ శ్రీబృహదంబా.

మ. గణుతింప న్వశమా భవద్విజయజాగ్రద్వీరవిద్యావిజృం
భణపాండిత్యము నీకుఁ జెల్లు భళిరా భద్రేభఘంటాఘణం
ఘణనిక్వాణనిరాఘృణినిర్భరమహాగంభీరభేరీధణం
ధణధాణంధణధాణరాయరఘునాథా యోధయూధాగ్రణీ.

క. అందజు నీసరిదొరలా, మందరధరకుహరవిహారమాణమృగేంద్రా
స్పందితనిజజయపటహా, మందరవా రాయభూప మధురాలాపా.

క. కోటిగదా వితరణశత, కోటిగదా నుతి సహస్రకోటీరలుఠ
త్కోటిగదా పాదతులా, కోటి బలీ కోటిరాజగోపాలపతీ.

క. అహాహా నీపలుకా శ్రీ, మహిమకుచగంధగంధవహమోముహ్యా
త్కుహనానృపరిద్వృషీయః, కహకహరవమొప్పఁ బచ్చకస్తురికుప్పా.

క. వచియించెద నొకపరి నిన్, రుచిరగుణప్రథితకీర్తిరుక్ఛకితసుధా
రుచిబలహరి పచికిలహరి, ఖచరలహరికాంతరంగ కస్తురిరంగా.

క. ఎంతు న్నిను నామునళీ, కాంతారవమృషితఘోష కాంతాలనదే
కాంతాలనకాంతాలన, కాంతాలనవంతేంగ కస్తురిరంగా.

క. శంకా నాకింక భవ, త్కింకరుఁడను శమనదమన కేళీహళీ
ఝంకరణ గుహాసనోపాస, సంకర్షణ వేంకటాచలనివాసా.

క. కొద్దిగఁ జపించె నాననది, సిద్ధావాలెఱుకు జెఱుకు నేజాసుంధా
బుద్ధియవా యొకతీయుని, మొద్దీయవా చలి కోనంగ ముద్దులనుంగా.

క. చెందొవలవిందు నీముఖ, మందమునకు నంది కైశ్వ్ర మొసింది మరా
కెందున నీయుగముప నిరం, పొందినదే పొందు విను కహారానందీ.

క. శ్రీమంతుఁడ వై పసఁచుకొ, సామంతుఁడ వై మనీషిసన్నుతవిలస
ద్ధీమంతుఁడ వై వర్ధిల్లు, రేనుంతా ముద్దుపడుగ రాజవతంసా.

శా. తంజాధీశుఁడు పంపఁగా దళము లుత్సాహంబుతో నచ్చు నీ
గంజాతిండిమరాటిరౌజులపయిం గత్తెత్తఁగా వేలరా
కెంజం జొత్తుగు నీదుచేతిగొరడా కీయాతభా కేసునిరా
కంజాక్షీసుమచాప ముద్దువిజయుత్కాపా నృపాలద్విపా.

మ. చిలుతా తాళునా గొగ్గి మానుకొనునో చేవస్తువా నిల్చునో
తళుకుం గేడెపుఁబిళ్ల నష్టముగనో (ద్ధ)త్తివచ్చునో యొడ్డినన్
ఘళుఘుల్ ఘల్లుఘుణిల్ ఘళిక్కురని ప్రక్కల్ సేయునీఖడ్గకో
శల మొక్కొక్కఁడఁ బోవ ముద్దువడుగత్కాపా నృపాలద్విపా.

క. కుంకుమ లేదో మృగమద, పంకము లేదో పటీరపాంసువు లేదో
సంకుమదము లేదో యశు, భంకర మగుభస్మమేల బాలానిశ్శ.

క. దాశికుఁ బద్యము లిచ్చిన, నాతఁడు ధన మొసఁగఁ గవుల కపుడే సెలవాఁ
గాఁతురి నమ్మిన రీతిని, రీతిని చంద్రగిరిరామకృష్ణనృపాలా.

క. కలిమిగలనాఁడె మనుజుఁడు, విలసితసత్కీర్తిచేత వెలయఁగవలదా
కలి మేమి యెల్లకాలము, కులగిరులా కదలకున్న గుహ్వలచెన్నా.

క. రంపలకొడుకులు యాచక, తంపంబుల కేమి త్రవ్వి తలకెత్తేరా
రెండాకు లొక్కపోఁకయుఁ, గొండనుచిరా దానశర్వ కోమటిగుర్వా.

క. కోమటి వేమనత్యాగము, భూమి ప్రసిద్ధంబు కల్పభూజము చెంతం
బాముమన్నయట్లు తురకా, రాముం డున్నాఁడు చేగరా దెవ్వరికిన్.

క. ఈరేడు జగము లనియెడి, మూరయఁ బదునాల్గుగ్రుడ్లు సనిశము ప్రక్కల్
ధీరతఁ బొదుగుచు నున్నది, కోరికి నీకీర్తిహంస కోమటివేమా.

ఈరీతిగా 1 జానకులపాటికుల కొండ్రాజా 2 లక్షణరంగా 3 బంగరు యాచా 4 కచ్చిరంగభాగ్యశరంగా 5 చిన్నరంగ బుద్ధిభుజంగా 6 రాయని బాచా 7 శాఖమూరి యల్లయజన్నా 8 యాతముగంగా 9 పులుగంటన్నా 10 అళియతిరుగులరాజా 11 పిచ్చయరంగా 12 బొమ్మయలింగా 13 కుమార భట్టారార్య 14 భట్టుగుతిక్కా 15 గంగయ్యసింగ 16 సంకడిమల్లా 17 దాసర చెన్నా 19 కవివెంకన్నా 18 రాయబిరుదాంకరఘునాథరాణ్మృగాంక యనుసం బోధనలతోఁ బెక్కుపద్యములుగలవు. మఱియుఁ దంజావూరిమీఁద:—

క. పురమునసుండేకవులే, చొరఁబడి తినఁ గూడులేక చుంబించంగాఁ
   బరకవు లేటికి వచ్చిరి, తరమెఱుఁగక అరికి విరికిఁ దంజాపురికిన్.

క. లేదా తంజావూరిదొ, రాదొరలున్నారు లంజలకు మాపోడిం
   జేఁ దేవా రెవ్వరు నీ, యాదరణ వినాగ నరసయప్రభునాఁగా.
   అను నీరెండుపద్యము లేసందర్భములోనివో కలవు.

9. ఆంధ్రమహాభారతము. ఆరణ్యపర్వము. గ్రం | సం ‖ 1077

ఈసంపుటములో నారణ్యపర్వమును స్త్రీపర్వమును గలసియున్నవి. 308 పత్రములు గలవు:—ప్రారంభమున.

ఉ. ఆసరసీజయోనిరసనాగ్రములందుఁ బ్రభూత మైనవే
   దాసవపానమత్తు నపరాం (బుజ) లోచను భారతార్థవి
   ద్యాసువిలాసుఁ బ్రావృడసితాంబుదకాంతితనూవిభాసు న
   వ్యాసమునీంద్రవర్యుని పదాంబురుహంబుల కేను మ్రొక్కెదన్.

అనుపద్యము తరువాత శ్రీకీర్తిశ్రీవల్లభ-యనుకందపద్యము వ్రాయఁబడి నది. ప్రథమాశ్వాసాంతమున శ్రీకుడుపూరుహరిహరాయనమః.

శ్లో. వైదేహీకుచమండలాగ్రవిలసన్మాణిక్యహస్తాంబుజం
   కాంచీకంకణహారనూపురలసత్కేయూరహారాన్వితమ్
   దివ్యశ్రీమణికుండలోజ్జ్వలమహాభూషాసహస్రాన్వితం
   వీరశ్రీరఘుపుంగవం శరకరం సీతాసమేతం భజే.

శ్రీవేంకటరమణాసహాయం శ్రీరామాయనమః శ్రీరాములుమాదైవము-అనుపద్యమునుగలవు. ద్వితీయాశ్వాసాంతమున శ్రీకుడుపూరినీలకంఠేశ్వరాయ నమః, శ్లో. సాకేతేశరదిందుకుందధవళే-అనునదియు, తృతీయాశ్వాసాంతమున శ్రీకుడుపూరినీలకంఠేశ్వరాయనమః.

శ్లో. కస్తూరాంగవిలేపనం రఘుపతిం రాజీవనేత్రాయుతం
కస్తూరీతిలకాకృతిం విమలసత్యాంత్రాత్మా మేకంప్రభుం
కందర్పాయుతకోటికాంతిసదృశం కారుణ్యపాథోనిధిం
కాంతంకా—ఇంతే—యున్నది.

చతుర్థాశ్వాసమునడుమ — అంబరపూరితంబులై — యనుదానితర్వాత ,, యిక్కడనుంచియు ప్రగడ గారికవిత్వమారణ్య పర్వశేషము అని—౧౨౭-వ పత్రము రెండవప్రక్కను "స్ఫారదరుణాంశురాగ" ప్రారంభించెను. ఆశ్వాసాంతమున శ్రీకుడుపూరు నీలకంఠేశ్వరాయనమః అని. పంచమాశ్వాసములో గద్యమున్న ౧౮౩ పత్రము లేదు. సప్తమాశ్వాసము చివర—

సీ. భవ్యచరిత్రుఁడాపస్తంబసూత్రుండు శ్రీవత్సగోత్రుండు శివపదాబ్జ
సంతతధ్యానసంసక్తచిత్తుఁడు సూరనార్యునకును బోతమాంబికకును
నందనుం డిలబ్రాంకనాంటిలో నీలకంఠేశ్వరస్థానమై యొసకమెసంగ
గ్రుడ్లూరి నెలవున గుణగరిష్ఠతనొప్పు ధన్యుండు ధర్మైకతత్పరాత్ముం
డెర్రనార్యుండు సకలలోకైకవిదితుం డైన నన్నయభట్టమహాకవీంద్రు
సరససారస్వతాంశప్రశస్తి తన్నుఁ, జెంద్దుటయు సాధుజనహర్ష సిద్ధిగోరి.

క. ధీరవిచారుడు తత్కవి, తారీతియ కొంతదోంప దద్రచనయకా
నారణ్యపర్వశేషము, పూరించె గవీంద్రకనకాపుటపేయముగన్.

క. వీరావతారవిమలా, చార అని కలదు—గద్యాంతమున శ్రీకుడుపూరునీలకంఠేశ్వరాయనమః శ్రీసీతారామార్పణమస్తు. శ్రీకుడుపూరుమదనగోపాలాయనమః. సౌమ్యనామసం॥ శ్రావణబ ౧౦ సో॥ వర్కు బాలాంత్రపు కృష్ణంరాజుగారిప్రతినున్న క్రమాన అరణ్యపర్వం సంపూర్ణంగా మల్కపల్లి బోగిరాజు ఖానాకువ్రాశెను. వ్రాలాశభ్రలు ఇత్యాది ౨౬౭ పత్రము. ౨౬౫ నుండి స్త్రీపర్వముగలదు. గ్రుడ్లూరునీలకంఠేశ్వరస్వామికి గుడుపూరునీలకంఠేశ్వరస్వామికి నేమైనఁ జుట్టరికమున్నదా. మల్కపల్లి జోగిరాజుగారిచ్చినది.

## 10. ఆంధ్రమహాభారతము - ఆరణ్యపర్వము - గ్రం - సం. 1123.

ఇందును అరణ్యపర్వముతో సౌప్తికపర్వమును గలదు. ఆరణ్యపర్వము 235 పత్రము. ఇందుఁ బ్రత్యాశ్వాసమునందును వరుససంఖ్యతో నాశ్వాసమునందలి పత్రసంఖ్య వేఱుగా వేయఁబడినది. ఇందు మొదట క. శ్రీకీర్తి స్త్రీవల్లభ

అని తర్వాత అక్కథికుండు శౌనకాదిమునీంద్రులకు—అను చో కథకుండు అని మొదట వ్రాసి థిక్రింద దిద్దినాఁడు సర్వత్రకథికుఁ డనియే కలదు. వ్రాఁతలో సున్నలపిమ్మట దిత్వములు లేవు అఱసున్నలు శకటరేఫలును లేవు. పద్యాంత ములన్, పూర్తిగా వ్రాశినాఁడు. కొన్నిటికి, ఇట్లనియే, ముహూర్తమాత్రంబునా యనిదీర్ఘము లున్నవి. ౧౦౬-వ పత్త్రములో అనఁగా నాల్గవయాశ్వాసము ౧౧ పత్త్రములో—శారదరాత్రు లను పద్యము తర్వాత "నన్నయభట్టుకవిత్వము యిక్కడికి సంపూర్ణము యింతటనుంచి అరణ్యపర్వశేషము యర్రాప్రగడ విరచితము—

చ. స్ఫురదరుణాంశురాగరుచి బొంపిరివోయి నిరస్తనీరదా
వరణముల౽ దళత్కమలవైభవజృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతర హంససారసమధువ్రతసిస్వనముల్ చెలంగఁగా
గరము వెలింగె వాసగముఖంబులు శారదవేళ జూడఁగాన్." అని

అన్నితావులను, అక్షరమున ద్విత్వము వచ్చునపుడు "నీరదావరణముల౽ వైభవజృంభణము ఇట్లె యున్నది గాని యెత్వమిచ్చి వైత్వమిచ్చినతా వెక్క డను లేదు. భవ్యచరిత్రుఁ డనుపద్యములో పోతనార్యునకును సూరమాంబిక కును" అనియును, ధీరవిచారుఁడు అనుదానిలో "తత్కవితారీతియె, తద్రచనయె కానిరియు భేదములున్నవి. ఎవ్వరువ్రాసినది తెలియదు. ఏలూరిలో మల్లంపల్లి కోటీశ్వరశర్మగారిచ్చిన గ్రంథమిది.

11. ఆంధ్రమహాభారతము. ఆరణ్యపర్వము గ్రం. సం. 1107.

ఇది యొక్కటే—యిందు రెండవపర్వ మేదియుఁ జేరలేదు. 228 పత్త్రములు. ఇది పిశిపాటితిమ్మయ్యశాస్త్రులుగారికొమారుడు వెంకటదాసు భారతము అరణ్యపర్వము సంపూర్ణముగా వ్రాసుకొనెను (సౌమ్యనామసంవత్సర భాద్రపదశుద్ధ సప్తమీశుక్రవారంవరకు)—ఏలూరునోరిసీతారామశాస్త్రిగారిచ్చినది. దీనియందును ఐత్వము ౹ పైదానిలోవలెనే కలవు సమస్తవిధములఁ బైప్రతిని బోలియున్నది. నాల్గవయాశ్వాసములో ౧౦౫-వ పత్త్రము (అనఁగా చతుర్థాశ్వాసము ౧౦-వ పత్త్రము) లో యథాప్రకారము నన్నయభట్టుకవిత్వము యిక్కడికి సరీ సంపూర్ణము యింతటనుంచి అరణ్యపర్వశేషము యెర్రాప్రగడ విరచితము అనియును చిట్టచివర భవ్యచరిత్రుఁడు, ధీరవిచారుఁడు ననునవియుఁ గలవు. పోతనార్యునకు సూరమాంబిక కనియేకలదు.

## 12 ఆంధ్రమహాభారతము. ఆరణ్యపర్వము. గ్రం. సం 108.

ఇందొక్క యారణ్యపర్వము మాత్రమే కలదు. శ్రీకీర్తిప్రియవల్లభ యనిప్రారంభము. వ్రాఁతతప్పు లనేకవిధములఁ గలవు. అయ్యోడకు, అయ్యడ; వలసెకు వలశె ననియు ఏమిశేయుదు, దరిశి తల్లివంశ్యులు ఇంచ్వంపు మొ॥ అనుసున్న లకు బదులెల్లచోటుల నిండుసున్నలు నిండుసున్నలతర్వాతియక్షరము ద్విత్వము— శకటరేఫములు పాటింపలేదు అయ్యోడమని కలదు. ౧౧౫ పత్రములో, యింత్రటనుంచ్చి యఱ్ఱాప్రగడగారు చెప్పిన ఆరణ్యపర్వశేషము అనికలదు. సూరన్నారాధ్యునకును బోతమాంబ్బికకును, బ్రాంకనాటిలో - గుంట్టూరినెలవున గుణగరిష్ఠు-సరసనారసస్వతాంత్త ప్రసక్తి-శద్రీతియ తద్రచనయయునికలదు. ౩౬౯ పత్రములు సంపూర్ణము. ఎవ్వరిచ్చినదో యెక్కడనుండి వచ్చినదో తెలియరాదు. ప్రమాదినామసంవత్సర ఫాల్గుణశు ౭ ఆ॥ సర్కి నాద్రెవు కామయ్యగారు వ్రాశిన ప్రతినుంన్న క్రమాణను శ్రీమహాభారతములో ఆరణ్యపర్వము షష్ఠాదివెంకయ్యకొమాళ్లు నరశింహ్వులు వ్రాయించుకొనెను. మంగ్గళమః.

## 13. ఆంధ్రమహాభారతము. ఆరణ్యపర్వము. గ్రం. సం. 103.

ఇందు శ్రీకీర్తిశ్రీవల్లభ యనిప్రారంభము: ఆరణ్యపర్వ మొక్కటియే 257 పత్రములలోఁ గలదు. ఇందును వ్రాఁతతప్పులు కావలసినన్ని. వ్రాయసకాండ్రయాచారప్రకారము కంటె నెక్కుడు గలవు. అన్నింటితోపాటు శమిఇంచు మొ॥ రూపము లింకెక్కుడు. ఎఱ్ఱాప్రెగడగారి భాగము నాలవయాశ్వాసములోఁ గలదు. ఇంత యఱ్ఱాప్రగడగారు చెప్పిన ఆరణ్యపర్వశేషము అని ౧౧౧ పత్రము రెండవవైపునఁ గలదు. తర్వాత స్ఫురదరుణాంశురాగమునబొంపిరిపోయి యని మొదలు - చివరసీసములో సూరనార్యునకుఁ బోతమాంబికకు -గుంటూరు నెలవునగుణగరిష్టతి, యనియున్నది. అక్షయనామసంవత్సర ఆశ్వీజబ ౨. గురువారంసర్కి జొన్నలగడ్డవ్యాసులుగారి పెద్దకొమారుఁడు కామయ్య స్వంతముకు శ్రీపార్వతీపరమేశ్వరార్పణముగా వ్రాసుకొనెను. వ్రాలాశభ్రలు తప్పులు త్రాసలాగలవేను శబ్దసంఖ్య లెరుగనుం - అనుపద్యమున్నది.

## 14. ఆంధ్రమహాభారతము—ఆరణ్యపర్వము. గ్రం. సం. 944.

ఇదియు నొక్కపర్వమే విడిగా నున్నది. శ్రీకీర్తిశ్రీవల్లభ, అక్కధికుండు, ఊరుభంగం బయ్యెడమని, నన్నభట్టుగారు చెప్పినకవిత్వము సమాప్తము, అరణ్యపర్వశేషము యఱ్ఱాప్రెగడంగారివిరచితము, స్ఫురదరుణాంశురాగరుచి బొం

విరిపోయి యనియుంగలదు. సప్తమాశ్వాసముచివరఁ గొంత లేదు కాఁబట్టి భవ్య చరిత్రుఁ డాదిపద్యములుగలభాగము కనఁబడ లేదు. మొత్తము 255 పత్రము లున్నవి. నడుమనడుమఁ గొన్నిపత్రములలోఁ గొంతభాగము వ్రాయఁబడ లేదు. మాతృకలో లేదు కావలయును. నర్సాపురం గంగ విశ్వనాథశాస్త్రిగారిచ్చి నది. అక్కడక్కడ శ్రీగిరీశ్వరా! ఉమామహేశ్వరా! ఆపన్నార్తిహరేశాయ శంకరాయ నమోనమః అనుమాటలుండుటంబట్టి యెవ్వరో శైవుఁడు వ్రాసి యుందురు.

15. ఆంధ్రమహాభారతము—ఆరణ్యపర్వము. గ్రం. సం. 363.

ఇదియొక్కపర్వమే యీగ్రంథములోను గలదు. ఇది దక్షిణదేశప్రతి. నత్తం వేంకటేశయ్యగారిచ్చినది. దక్షిణదేశమునఁ బ్రచారముచేసిన వారి నేతు రామయ్యగారు సంపాదించినది. 231 పత్రములు గలది. ఊరుయుగళంబు భగ్నంబయ్యెడమని కలదు. అక్కఢిశుండు, సర్వత్రపూర్ణబిందువుతరువాత ద్విత్వ ములు వ్రాఁతతప్పులుం గలవు. అక్షరలోపములు పెక్కుతావులఁ గలవు. చతుర్థాశ్వాసములో యింత్తేనుండి యెఱ్ఱాప్రగడ వారికృతము అనితరువాత "స్ఫుర దరుణాంశురాగరుచిఁ బొంపిరివోయి "యని ప్రారంభించెను. సప్తమాశ్వాసము కడపట భవ్యచరిత్రుఁ డాపస్తంబసూత్రుం డనుదానిలో భూతమాంబిక, పాకనాటి లో, గండ్లూరు నెలవున గుణగరిష్ఠత, పూరించె కవీంద్రకర్ణపుట మోదము గానూ అని పాఠభేదములు కలవు. ఈరీతినే వ్రాఁతతప్పులు పెక్కులు. శుభకృతునామ సంవత్సరం పుష్యశుద్ధ ౧౨ యిందువాసరమున్ను పుష్యమీనక్షత్రమున్ను కూ డినశుభదినమందలి గోకివరం వెంకట్రామయ్య ఆరణ్యపర్వం సమాప్తః అని యున్నది. కొంతకాలమున కీవల నొక్కరు సమాప్తః అనుదానిక్రింద "వ్రాసి నది" అని చేర్చినారు. వ్రాలాశభ్రలు పద్యముగలదు.

16. ఆంధ్రమహాభారతము—ఆరణ్యపర్వము. గ్రం. సం. 1131.

ఇదియొక్కటే పర్వము. 226 పత్రములు. ఏలూరు కె. వ్యా నాగేశ్వర సిద్ధాంతిగారిచ్చినది. ఇందును శ్రీకీర్తిస్త్రీవల్లభ, అక్కఢిశుఁడు, ఊరుయుగంబు భగ్నంబయ్యెడమని శాపంబిచ్చెన, ఇట్టివిగలవు. కొంతయొక్కరుఁ గొంతయొక్క రును వ్రాసినట్లు భేదము గలదు. ఒక్కరు వ్రాసినదానిలో "భార్గవుండ్డనచ్యవ నుండు, కృతవ్యానుల్లనవారు నిట్లు గలదు. రెండవవారివ్రాఁతలోఁ నిరస్తనీర దావరణములై దళత్కమత వైభవోజృంభణముల్లసిల్ల, అనియేత్వైత్వములు గలవు ఈరెండవవారివ్రాఁతలోఁ దప్పులుతక్కువ.

శా. దానాంభఃపటలంబునం బృథుపయోధారావలిం దాల్చి గ
ర్జానిర్ఘోషము బృంహితచ్ఛలన నాచ్ఛాదించి ప్రావృట్పయో
దానీకంబు శరద్భయంబున నిగూఢాకారతన్ డిగ్గనా
గా నొప్పారె మదోత్కటద్విరదసంఘంబుల్ వనాంతంబునన్.

ఇట్లున్నది. నన్నయభట్టుకవిత్వము యిక్కడికి పరిసంపూర్ణము యింతట నుంచి అరణ్యపర్వశేషము యెఱ్ఱాప్రగడవిరచితము, అనికలదు. పోతినాయ్యనకును సూరమాంబికకును అని యున్నది వ్రాసినవారి పేరులు తెలుపఁబడ లేదు. మూఁడవవ్రాఁతకాఁడును సాయపడినట్లు కొన్ని పత్రములలోఁ గనవచ్చును. అక్షరములు చక్కనివే గాని యీతఁడును దప్పులు వ్రాయువాఁడే. “గనుబ్రద్ధమిదియు గర్కోటకుని దమయంతి పుణ్యమూర్తి యనవలును, ఋషిచరిత్రకథన ఋతుపర్ణు గీర్తింప, గభయంబులెల్ల గ్రాగుచుండు”, అని యిట్లుండును. శీఘ్రముగా ముగించుకొనుటకు ముగ్గురుంగలసి కొంతకొంత భాగము పుచ్చుకొని వ్రాసికొనిరి.

## 17. కువలయాశ్వచరిత్రము. గ్రం సం. 72.

సవరము చిననారాయణనాయకప్రణీతము.

గద్యము—ఇది శ్రీమదనగోపాలకృపాకటాక్షవీక్షణసమాసాదిత సరస కవితావైభవ సవరమన్వయాభరణ తిమ్మభూపాలతనూభవ శఠగోపతాపసేంద్ర చరణారవిందసంచరన్మానసమిళింద సంతతభాంతభాగవతాదిశ్రవణానంద కామినీ మనోహర రూపరేఖావిజితచైత్ర కాశ్యపసగోత్రపవిత్ర జాతివార్తాకవిజనామోద సంధాయక చిననారాయణనాయకప్రణీతం బైనకువలయాశ్వచరిత్రం బను మహాప్రబంధంబునందు—

ప్రారంభ పద్యములు:—

శా. శ్రీరాధాలలనాధరాధరసుధాబృందాతిమాధుర్యగా
ధారీతుల్ ప్రకటించి లీల మురళీధారేయుఁడై గీతసం
చారంబు ల్వెలయించు కృష్ణుఁడు దయాసర్వస్వతాగౌరవం
బూరన్ సౌరమునారణాధిపుఁ జిరాయుశ్శ్రీయుతుం జేయుతన్.

సీ. తనమందహాసనూతనకాంతి కాంతుకీర్తికలాపములును సంధించుకొనఁగఁ
దనయాస్యఘుస్మంబు ధవరాగరసఝరీపటలితోఁ డుత మాటపలుకులాడఁ
దనతనూదీప్తిసంతతులు నాయకమహస్స్తోమంబునకును విందులు ఘటింపఁ
దనయురోజాలసత్వంబు మనోనాథకఠినధైర్యముతోడఁ గలసిమెలఁగ

రాజులఁ దిరస్కరించుచు రమణుఁ డున్న, యుందమెక్కి నరుక్మిణీసరసిజాయ
తాక్షి సవరిచు నారాయణాధిపేంద్రు, శుభదయాపూర్ణవీక్షఁ జూచుఁగాత

ఈనారాయణాధిపుఁడు కవికిఁ బాలకపితయుఁ దనజనకపితకు సవతితమ్ముఁ డునై యున్నాఁడు.

మ. అలతిమ్మాధవునారణేంద్రుఁడు దయోదారుండు సన్మం జయో
జ్జ్వలుఁ గృష్ణాధిపుపుత్రు వేంకటపతిత్మ్యాకాంతచంద్రుం గుమా
రుఁ గాఁ గైకొని ప్రోచెఁ గాన నతఁడే రూపించఁగా దల్లిదం
డ్రులు దైవంబును నయ్యె నిందులకు నెందుకా సందియుం బేటికిన్. అని.

పాలకజనకునకే యీయైదాశ్వాసముల ప్రబంధముం గృతి యిచ్చెను. ఈ నారాయణనృపాలుఁడు వీరవేంకటరాయలకరుణఁ బరఁగువాఁడఁట. కర్ణాట రాజ్యములోని వాఁడగును. ఈతని నివాసస్థానము.

క. మణినాగనగరకాంతున, కణుమధ్యాజనమనోజయంతునకు సుధీ
గణగణితరామణీయక, మణిఘృణిపణితాతిమంజిమనిశాంతునకున్.

అనుషష్ఠ్యంతపద్యమునుబట్టి మణినాగనగరమని తెలియవచ్చినది. మణి నాగనరము నిప్పు డేమందురో! ఈతని సమకాలనృపులు—

సీ. తనమాట చెంజికాతంజాపురీమధురాధినాథులకు నెయ్యంబు నెఱపఁ
దనచీటి గోలకొండనరేంద్రముఖధరాధవపక్షబంధు లాఁదల వహింపఁ
దనకీర్తి నుల్లనంతనృపాలముఖ్యగోత్రానరేంద్రులు గొనియాడికొనఁగఁ
దనదానగుణము గోదావరీతీరభూనిర్జరేశ్వరులు వర్ణించికొనఁగ
వెలయు వేతంపగండనిర్గళదనర్గ, ళమదధారాధునీనాథకుముదబంధు
కాంట్యకృష్ణెండిమానాఘర్య సైన్యుఁ,డతఁడు ప్రభుమాత్రుఁడే నారనాధినేత.

అను పద్యమువలన నెఱుఁగఁబడుచున్నారు. ఈనారాయణనాయకకవి కవిత్వము ప్రౌఢమైనది. కల్పన లద్భుతములు. అం దందుఁ గొన్నిలక్షణవిరుద్ధ పదప్రయోగములును గలవు మచ్చునకుఁ గొన్నిపద్యములు.

సీ. తనయిల్లు విడిదిసేయ నటంచుఁ జలపట్టు కొడుకు చేతులు పట్టుకొనఁగవలసె
నలరంభ వారి కీయ నటంచు వాదించు కౌబేరి కుడుగర గప్పవలసె
నులుపక్కై యిూగిమ్రాఁకుల చెంతకునుదా నెచనియిప్పుడా దుకొమ్మనఁగవలసెఁ
దెల్లి తేజీఁగన్నఁ దెమ్మందురో వార లని దాని వెస దాఁచికొనఁగవలసె
నౌర తిప్పనృపాలు బాహాసిధార, నవని విడనాడి ఱొమ్ముగాయముల వచ్చు
కడిఁదిపగరకు నుచితము ల్నడుపునపుడు, చాలు వజ్రికి నమరరాజత్వగరిమ.

సీ. విడు పైఁట చెఱఁగు నే వెఱతు గాయము మానని నినుఁ జాయ యొంతేసి వేఁడ
నళ్వినుల్ మందుఁగా ద్రోణగిరికి నిచ్చలు వోవుకీశను వేసరుకొనఁగ
నిరుపద్రవము గాయి నిలుపరా దని రమాపతి వేఁడె పాళెంపుఁబట్టు వెదక
నాయయ్య కిది యుపాయం బనుచ నలసింహ కాతనూభవుఁ డైనఁగ అచికొనఁగఁ
జెలఁగు తొగకొమ్మ మోము ముంత సేసికొనఁగఁ, దిమ్మనృపశౌరిదినదినోద్భవన్న వైరి
వారబహువార భేదనసద్ధమూన, మైన దివిమేని పనుగిండి మానవయ్య.

సీ. ఐశ్వర్యగతి మీఁద నరుచి పుట్టినఁగాని బలహంత మీఁదెంత నిలువ వెఱచుఁ
జక్కఁదనంబుపైఁ జౌక దోఁచినఁగాని సురభామ మీఁసీనుఁ జొరఁగ వెఱచుఁ
దన పేరుమాత్రంబు కనరు వేసినఁగాని హరిపట్టి మిము గిట్ట యడుగ వెఱచు
విబుధదాతృత మీఁద వెగటు గల్గినఁగాని వనజారి ఘటముఁ జేరి చెనక వెఱచుఁ
గాన తావకనియమనువిఘ్నంబు నడుగ, నళికెదను గాని యోమహాని యట్టులేని
ఘోరవమానుకతూణీరగుప్తశాశ, శరములకు నొక్కచరంగాట సౌదరింపు.

ఈ కవుల యాశ్వచరిత్రమును గొంతకాలముక్రిందటఁ గాకినాడ సరస్వతీ పత్రికాధిపతులు కీ॥ శే॥ పోలవరము జమీందారుగారు ముద్రించిరి.

### 18. చంద్రాననాదండకము--గ్రం. సం॥ 55.

నుదురుపాటి సాంబకవిరచితము. ఈసాంబకవి యాంధ్రభాషార్ణవకర్త యగు వేంకటకవిపుత్రుఁడు - తొండమాన్ నృపాలురయాస్థానములోని కవి యితఁడు. ఆసంస్థానములోని తనప్రభువుపైఁ జెప్పినదే యీదండకము. కారణ మేమో యెక్కడఁ జదివినను రాజుపేరు, వంశము వచ్చినతావుల నెల్లఁ జోటు విడిచిపెట్టినాఁడు గాని వ్రాయలేదు కాఁబట్టి వారిపేరులు తెలియరావు.

దం॥ శ్రీదక్షిణాభిఖ్య గోకర్ణవక్త్రారవిందస్ఫురద్దివ్య తేజస్సదాధ్యానసక్తాత్మ భావుండు భావోద్భవామిత్రఫాలాక్షి కీలాసమానప్రతాపాక్క బింబద్విషద్ధూక వారుండు, వారాశిగాంభీర్య గాథత్వదానప్రవీణాతిగంభీరతాశాలి శాలీనవిద్వద్ధరాపాలమాలీస్ఫురద్రత్న రత్నచ్ఛవిచ్ఛన్న చక్రాదిరేఖోల్లసత్పాదపద్ముండు, పద్మాసనఘాటీపదాబ్జస్ఫురద్రత్న మంజీరసంగావతులోల్లసద్రమ్య తౌర్యత్రికస్నాన భాస్వన్నిశాంతుండు శాంతాతిదాంతద్విజాశీర్వచఃప్రాప్త దీర్ఘాయురారోగ్య సామ్రాజ్యలక్ష్మీసనాథుండు - - - వంశాబ్ధిసోముండు సర్వజ్ఞతాతుల్య కాముండు - - - - మహీనాథుపౌత్రుండు, సల్లక్షణోపేతగాత్రుండు - - - - దాత్రీంద్రపుత్రుండు రాకేందునీకాశ సత్కీర్తుండు, హూణాదిరాజన్యసంస్తూయమానోల్లస - - - - సమాఖ్యాభిరాముండు - - - - తానొక్కనాఁటన్ హజారంబునం

భేటికై భూపతుల్ కాచి యున్నారనే జాడఁ దెల్పంగనో నాఁగ భూపాలకాగా దులన్ మాగధుల్ వేకువ స్నానముల్ సేయఁ దద్రాగనామంబు డెందంబునం దోఁచ స్వీయేతరంబైన భూపాలశబ్దాక్షమిశ్వంబునం గిన్కనుంబోలె నోనాఁగ విప్పేను నొప్పారు నేత్రారవిందంబులం గెంపుడా ల్కొంత ఛెన్నొంద భూమండలి న్నీసమానంబునుం జూడఁగాఁ గోరితే దర్పణంబందునే గాక వేఱెందునం గానరా నంచుఁ జూపించె నోనాఁగ వాల్గంటి యొక్కర్తు తాఁ జేతినిం బూనునద్దంబునం జూచి ------ స్వర్ణస్ఫురత్పూర్ణకుంభంబునుం గాంచి ------ స్నానగేహంబునం జేరి బల్చెల్లనౌ చుక్కరారాత్రితీపంచ కాల్ పీఠఁ గూర్చుండి --- కృతస్నానుఁడై ----- ఫాలమ్మునన్ భూతినింబూసి --- సద్బంధువర్గంబుతో భుక్తిని న్సల్పి వాల్గంటి యొక్కర్తు తాపండుటాకుల్ శుకీతుండహస్తంబుచేఁ జుట్టి యియ్యంగ బాగంబునుం జేసి ---- హాజారముం జేరి కొల్వుకై మూగియున్నట్టి దళ్వాయులన్ శౌర్యచాతుర్యయుక్తుల్ జెమేదార్లనుం దాకృపాకటాక్షంబుచేఁ జల్లఁగాఁ జూచి సాది న్నిరీక్షింపఁగా వాఁడు ---- ముస్తీదుగా వించి సర్వోత్తమత్వంబునుం దెల్పు మేల్దేవమణ్యాది నానా విధావర్తసల్లక్షణంబైన బారాహజార్ తేజి ముమ్ముంగలఁ న్నిల్పఁగాఁ గాంచి యత్యున్నతంబైన యంకెం బదంబూని ---- వాగె కేలాసరాగాఁ జివ్వక్కంచు పైదాఁటి దౌర్చుక్కఁగాదీర్చునాలోన నే నిల్వకే చిండులంద్రొక్కుచోఁ గంబముం దట్టుచుండ ---- నవ్వేడుక ల్బాడఁగా మేడలన్ సంభ్రమం బొప్పఁగాఁ బాలమున్నీటిలోనుండి పైవచ్చు లక్ష్మీసరోజాక్షి యో నాఁగ నీరాడుచున్నుండి యట్టే వెసన్నార్ద్రభావంబుతో నొక్కపూఁబోఁడి వచ్చెన్ ---- (అని మొదలైనది. ఇంకమీఁద నాపూఁబోఁడి విరహము --- ఈరాజుగారితో వివాహము) ఆకాంతతోఁ గూడ హాయిగా మానసానందసంధాయిగాఁ గూడి --- యారాధికం జేసు శ్రీవేణుగోపాలుచందంబున న్నిత్యలక్ష్మీసనాథుండుగా నుండుమంచున్ శుభాకారుఁడై సద్గుణాధారుఁడై సత్కళాభోజుఁడై రాజ్యసంరక్షణోద్యుక్తుఁడై ---- సద్గర్భవారాశిరాకానిశాకాంతుఁడై సద్యశః కాంతుఁడై యొప్పు ---- క్షితీంద్రుపేరన్ స్ఫురన్నిత్యసామ్రాజ్యసత్పుత్రసంతానసంపత్తు లింపొంద నుద్దండవిద్వత్కవిత్వాంకనుండైన శ్రీసాంబనాభిఖ్యవిద్వత్కవీంద్రుండు కైసేయచంద్రాననాంకంబగున్ దండకం బుర్వి నాచంద్రమస్తారమిత్రంబుగా వర్ధిలున్.

ఈదండకము ౨౨ చిన్నపత్రములలో వ్రాయఁబడినది.

౨ ఈపుస్తకములోనే, పిళ్లారప్పాయనునవి తొమ్మిదిపద్యములు వేంకటాచలరమణాయనునవికొన్ని పద్యములు నున్నవి. తల్లీనన్ను, ఏణీలోచన, అంబసవాంబుజోజ్జ్వల, తొండమునేకదంతము, మోదకహస్తునిక—వీనితరువాత.

క. శ్రీకర రుచివిజితసు, ధాకర మృడపార్వతీముదాకర గుణరా
త్నాకర సంధీకర పర, భీకర పదనతరక్షప్ప పిళ్లారప్పా.

క. మల్లెలు మొల్లలు జాజులు, గొల్లలుగాఁ గోసి తెచ్చి కొనియాడి నినుం
జల్లగఁ బూజింతుము కృప, వెల్లువగాఁ జూడుమప్ప పిళ్లారప్పా.

క. ఓరీ బాలుఁడ నీపటు, రారా యని నన్నుఁ బిలిచి రంజిలునయచేఁ
గోరిక లొసఁగుము భువి నీ, పేరును బ్రకటించిచెప్పఁ బిళ్లారప్పా.

క. భక్షింపుము కావలసిన, భక్షణములు నీకునిత్తు భక్షించియు నీ
కుక్షిగల విద్యమాకుం, భిక్షంబిడి కావుమప్పా—ఇత్యాదితొమ్మిది.

క. ఒక తేప నీగుణస్థితిఁ, బ్రకటింతుఁ బరాకు చకితబలభిన్మణిమే
చరచకచకవికచస్ఫుట, - - - - - వేంకటాచలరమణా.

క. శంకా నాకింకభవ, త్కింకరుఁడను శమనదమన కేళీహాళీ
ఝాంకరణగుహాసరోవర, దంకూరక్రమణ వేంకటాచలరమణా

క. ఎక్కడు నీకొండేగా, యెక్కుడు నీదారిసభల నిభవిక్రమ ఘ
నక్రగ్రాతబలధిక్కృతన, మ్యక్కృతఘీంకరణ వేంకటాచలరమణా.

క. ఎల్లప్పటికిని మాకిఁకఁ, గొల్లలు మీదాస్యధనము గుహాపుష్కరిణీ
కల్లోలమతల్లీమత, హల్లీసకచరణ వేంకటాచలరమణా.

క. సింహాము మెడఘంటను నా, జిహ్వను నినుదలఁచినపుడె సేవనమాత్రా
రంహోజ్జ్వలబంహిష్ఠల, తాంహోసంహారణ వేంకటాచలరమణా.

క. ఆమిడి మొక్కులసామివి, మామకనుతు లెంతచూడు మణిదామసము
ద్దామఘనస్తోమచతు, ర్యామాలంకరణ వేంకటాచలరమణా. మొదలైనవి

క. వకులవననిత్యవాసిని, సకలాభీష్టములనిచ్చు చక్కనితల్లి
ప్రకటితముసేయు మీకృతి, నృకలుషగిరిభేదశంబ శ్రీబృహదంబా.

క. మడువుకుఁజని కాళిందుని, పడిగలపై భరతశాస్త్రపద్ధతి వెలయన్
గడువేడుకతో నాడెదు, నడుగులు నామదిఁదలంతు నచ్యుతకృష్ణా.

గీ. నిన్నఁగుప్పయునేఁడాళ్లు నెలఁత తాను, గోరి నామీఁదనే చేసెఁ గారుబారు
ముక్కుపచ్చలుమానకమునుపె బిరుదు, పిచ్చికలతోడఁ గాట్లాడవచ్చినట్లు.

గీ. మూఁడుశిరంబులు ముదమొప్పఁ బదికాళ్లు, కలుఁవతోఁక రెండుకన్ను లాఱు
చేతు లెన్న - - - చెవికిఁగొమ్ములు నాల్గు, దీనిభావము దెల్పుతిరుమలేశా.

కొన్ని సంస్కృతశ్లోకములు గలవు.

గరుడేన వినాయాతి గగనే మధుసూదనః
ముక్తకం వృషమారుహ్యా భిక్షామటతి శంకరః
జగదధిపాలో మోరో నాయోనరి - - - భం
తం దమయ దుర్వినీతం మర్త్యానివ సూను రంశుమతః
అభిసారిసమానోసి వ్యభిచారి సమస్తథా
రూపే పరాక్రమే చైవ నరపాలశిరోమణే ॥
నూకరః కంకణం ధత్తే కంకణే రమణిస్థితా
తత్రాపి తరళశ్చిత్రం కిం దీర్ఘసురతం వినా.
విరాజరాజపుత్రారే ర్యన్నామచతురక్షరమ్
పూర్వార్ధంతవశత్రూణా ముత్తరార్ధం తవైవహి ॥
రావణస్యకియద్వక్త్రం, నూపురంకుత్ర ధార్యతే,
ఆంధ్రగీర్వాణభాషాభ్యా మేకమే వోత్తరంవద ॥ పది ॥
ప్రభాతేకిం్వృశంవ్యోను ప్రమాణేకింకృశంవచః, ఆంధ్రగీర్వాణ ॥ నీతోడు ॥
కింప్రియంలోహకారాణాం వాహనంకింశచీపతేః
ద్రావిడానురవార్తాభ్యా మేకమే వోత్తరంవద ॥ కరీ ॥ కరి = బొగ్గు.
దమయంతీవశంవృష్ట్వా యయాపరవశీకృతా
సీతాఇత్యుత్తరంయస్య ప్రశ్నస్యతదిహోత్తరమ్ ॥ రాధుమకా
ఉత్తిష్ఠోత్తిష్ఠరాజేంద్ర ముఖంప్రక్షాళయస్వతః (టః)
ఏషఆహారాయ తేకుక్కు చనైతుహిచనైతుహి.

ఇట్టిసంస్కృతశ్లోకములు సుమారు డెబ్బదివఱకుఁ గలవు. మఱియు జానకీపతి యను తెనుఁగుపద్యములు కొన్ని గజేంద్రమోక్షములోనిపద్యములు కొన్ని ఎఱుపుపద్యములు, పచ్చపద్యములు, నలుపుపద్యములు, తెలుపుపద్యములుం గలవు. వీనిని దసరాపండుగలలో బాలురు చదువుదురు, గాని, యిందలిపద్యములు చాలఁ దప్పులుగా నుండుటచే నా సీసపద్యములును బ్రస్తుతము విడిచి పెట్టఁబడినవి. ఇది దక్షిణదేశమునుండి తెచ్చినపుస్తకము

19. ఆంధ్రమహాభారతము. ఆరణ్యపర్వము. గ్రం. 2644.

ఈసంపుటములో, ఆది, సభా, ఆరణ్య విరాటోద్యోగపర్వములు గలవు. 359 పత్రములు గలవు. 126 మొదలుకొని ఆరణ్యపర్వము వ్రాయఁబడినది. ప్రారంభము; శ్రీమతేరామానుజాయనమః,

క. శ్రీకీర్తిశ్రీవల్లభ, లోకజనస్తుత్య సర్వలోకాశ్రయర
త్నాకరపరివృత సకలధ, రాకాంతజతారి రాజరాజనరేంద్రా.

వ. అక్కథికుండు శౌనకాదిమహామునులకుం జెప్పినట్లు, అనికొన్ని తావులనుగొన్ని తావుల "అక్కథకుం" డనియుఁగలదు. భీమునగదాఘాతంబున నియ్యూరు యుగళంబు భగ్నం బయ్యెడు మని యే శాపమిచ్చినాఁడు

నాలుగవయాశ్వాసములో యంత్తెల చదలు వాడ యర్రా పెగడ కవిత్వం॥ అని తర్వాత, భూసతికిం దినంబునకుం బొల్పెసఁగంగ శరత్సమాగింబని ప్రారంభించినాఁడు. సప్తమములో నంకె వేయుచోట, యింత్తట రెండో వారికవిత్వం, అని సూచించినాఁడు. ఈపుస్తకములో నాయాఘట్టముల విషయసూచిక ప్రక్కలను యుగధర్మాలు, కలియుగధర్మం, కృతయుగప్రవర్తనం, వామ్యాశ్వహరణం, యింద్రద్యుమ్నోపాఖ్యానం, దుంధుమారచరితం అని సూచింపఁబడినది. వ్రాఁతతప్పు లనేకవిధములైన విందును గలవు. పూర్ణబిందువు పిమ్మట నక్షరముక్రింద ద్విత్వ ముండుటయు లేకుండుటయుఁ గూడఁగలదు. సప్తమాశ్వాసము చివర "సూర్య నామ్యనకును బోతమాంబికకును నందనుం డిలపాకనాటిలో నీలకంఠేశ్వరస్థాన మై యెసకమెసగు గుండ్లూరి నెలవున గుణగరిష్ఠతనొప్పు - - - - - సకలలోకైక విదితుడైన యంన్నయభట్టమహాకవీంద్రు - - - - - అనియు, తత్కవితారీతియ కొంత దోప దద్రచనయకా. నారణ్యపర్వశేషము బూరించ్చె కవీంద్రకర్ణపుట పుటపేయముగ౯ అనియునున్నది.

ఈసంపుటములో నన్నిపర్వములలో నన్నియాశ్వాసములలో మొట్ట మొదట జిత్రజిత్రములైన లతలు, చిత్రములు, శంఖచక్రాదులు, బహునిపుణముగా వ్రాయఁబడియున్నవి. ప్రత్యాశ్వాసముచివరను, శ్రీమత్పదాచార్య శేష గురువేయనమః శ్రీమద్వేంకటవరదాచార్య గురువేయనమః అనియున్నది ఏసంవత్సరములో వ్రాయఁబడినదో యెవ్వరు వ్రాసిరో తెలియరాదు. దత్తమండలములలో సంపాదింపఁబడినది.

ఆదిపర్వములో "అని సకలభువనరక్షణప్రముఖులై - - - - - పద్మోమా వాణీపతుల నుతియించి - - - - - భారతభారధరణంబునందు నారాయణునట్లు దాను వసుధామరవంశవిభూషణుండు - - - - - అది మికప్పంబులు మోదముతోఁ గొనుచును బలిమిని యుంన్నభూవలయపతుల నుక్కణగింపుచు దిక్కుల దనయాజ్ఞ వెలిగించుచు - - - - గలవు. పదిదినము లైదుప్రొద్దు లను కంద పద్యము లేదు. దూఢిం గౌరవసైన్య మీయుభయము౯ అని కలదు. "కాదన

కిట్టిపాటియుపకార" యను పద్యము ప్రథమాశ్వాసములో లేదు ద్వితీయాశ్వాసములో, నేకవిప్రసంబోధన చేసిచేసె రిపుసూదన అని యున్నది విరాటపర్వములో, శ్రీయను గౌరినాఁ బరఁగుచెల్వలచిత్త మని కలదు. వ్రాఁత మంచిది.

20. కచ్చిరంగరాజదండకము గ్రం. సం. 67

ఇదియుఁ జంద్రాననాదండకమువంటిదే.

దండ. శ్రీమత్సమస్తావనీనాథయూథైకసంస్తుత్యనిస్తుల్యకల్యాణనానాగుణశ్రేణికాపాదనానూన కచ్చన్వయక్షీరవారాశిసంపూర్ణచంద్రుండు చంద్రాభ్రమాతంగ చంద్రాతపాభంగ సాంద్రామృతాంభోధిసీభంగ రంగత్సుధాశారదా శారదాభ్రౌఘనిర్భ్రాజితాదభ్రశుభ్రస్వకీర్తి ప్రధావాహినీబుద్బుదీభూతకంజాతగర్భాండసంఘుండు సంభూతితారాతిభూపాతి మాత్రోన్నమత్కుంభికుంభస్థలీనిర్గళద్వక్త్రముక్తాతతిస్ఫీతశోభాభరప్రాపితక్ష్మా రాజద్విరాజాధికద్యోతిమానాభ్రదేశుండు దేశాంతరాయాత (శుంభ) త్కవీంద్రాద్య విద్యాధికశ్రేణి సంరక్షణాక్షీణ కారుణ్యధారాధురావార సత్సత్కటాక్షుండుదాంతా దానభద్రుండు భద్రేభయానానవీనప్రసూనాస్త్రకల్పుండు కల్పావనీజాత భాస్వత్ప్రసూనజాతకంజాత - - - - - దానధారాసుధాపూర పాత్రీకృతాశేషధాత్రీ వరశ్రేణికర్ణుండు కర్ణాటరాజన్య - - - - - - - - కచ్చన్వయాధీశరంగక్ష్మామండలాఖండలస్ఫీతగర్భాబ్ధిచంద్రుఁడు జ్ఞానప్రసూనాంబికాపుత్ర రత్నాగ్రగణ్యుండు - - - - - శ్రీయౌవరాజ్యాభిషిక్తుండు సర్వక్షమాపాలనాశక్తియుక్తుండు శ్రీకచ్చిరంగావనీపాలచంద్రుండు తానొక్కనాఁ డెక్కువౌ మక్కువల్ పిక్కటిల్లంగఁ దొల్లుబ్బలి న్నిబ్బరంబొప్పఁగాఁ గన్కనెత్తమ్మిరామేటి గాటంపుఁగెంజాయచే నట్టె గన్పట్టు నప్పట్టునన్ వందిబృందస్తవంబుల్ చెవిన్ సోఁకగా తీవి నెత్తావి చెంగల్వ చేతుల్ పొసంగం బసంగాంచు పూసజ్జలొ మెల్ల నేనిద్రమేల్కాంచి యుక్కాంచనాంచ చ్ఛుభాంభకుంభాది సద్వస్తువుల్ గాంచి నిద్దంపు పెన్నిల్వుటద్దంబు వీక్షించి, - - - - - - చల్లడంబుం గడుం బాగుగాఁ దాల్చి వాటంబుగా నాముకూటంబునం జేరి - - - -

ఈరీతిగా వర్ణనాంతరములతో రాజుస్నానము భోజనము వేషము సభాప్రవేశము వీథులవెంట వాహ్యాళి, మేడమీఁదనుండి యొక్కవోపడుచుఁ జూచి విరాళిఁబొందుట దాని సంధానము-ఇదియే కథ-కవి యెవ్వరో తెలియరాదు. కవిత్వము చంద్రాననాదండకములోకంటె విశేషవర్ణనలు, పదజటిలముఁ గలది. యమకములు గమకములు రెండు-పూర్తిగాలేదు. 4( పత్రములుగలవు.

దక్షిణదేశప్రతి-చళవనూరు కళ్యాణరామయ్యగారిచ్చినది.

21. ఆముక్తమాల్యద - వ్యాఖ్యానము - గ్రం. సం 63.

ఇది దక్షిణదేశప్రతి. పుదుకోట వేంకటశాస్త్రిగా రిచ్చినది. ప్రాచీన వ్యాఖ్యయే యనితోఁచుచున్నది, గాని, యెవ్వరు వ్రాసిరో యెఱుఁగరాదు. పద్యములను బూర్తిగా వ్రాయక కొంచెము సూచించి యర్థము భావము వ్యాఖ్యానము వ్రాసినారు పూర్తిగా లేదు. అన్నిపద్యములకును లేదు. నడుమనడుమ గొన్నిపద్యములు విడిచి పెట్టినారు. కొన్నింటికి - అర్థము, కొన్నింటికి - భావము నీరీతిగా వ్రాసినారు. కృత్యాదిని కవింగూర్చిన పద్యములు చాలభాగము లేవు. కీ. శే. వావిళ్ల రామస్వామిశాస్త్రిగారు వ్యాఖ్యానము వ్రాయునప్పుడు పరిశీలించిన బహుప్రతులలో నిద్దాని ప్రతియుఁ గలదని కనఁబడుచున్నది. వాఁడుక మాటలలో వ్రాయఁబడినది. ఇందు మొదటిపద్యమును గడపటి పద్యమును మాత్రమిందుఁ దెల్పఁబడుచున్నవి.

ఉ. శ్రీకమనీయహారమణిఁ జెన్నుగఁ దానును గౌస్తుభంబునం
దాకమలావధూటియు నుదారతఁ దోఁపఁ బరస్పరాత్మలం
దాకలితంబులైన తమయాకృతు లచ్ఛతఁ బైకిఁ దోఁప న
స్తోకత నందుఁ దోఁచె నన శోభిలు వేంకటభర్తఁ గొల్చెదన్.

వ్యాఖ్యానగ్రంథములో నీపద్యము లేదు. వ్యాఖ్యానము మాత్ర మున్నది. పాఠకులకై యిందు వ్రాయఁబడినది. వ్యాఖ్యానమువ్రాఁత కొంచెము సవరించియే యిందువ్రాయఁబడినది.

శ్రీకమనీయ శ్రీ మహాలక్ష్మియొక్క కమనీయ మనోజ్ఞమైనట్టి హార ముత్యాలదండయందలి మణి నాయకరత్నమందు చెన్నుగఁ దానును నిరవధిక సౌందర్యధుర్యుఁడైనటువంటి తానును కౌస్తుభంబునందు స్వకీయవక్షఃస్థలంబున నున్న కౌస్తుభంబునందు ఆకమలావధూటియు ఆమహాలక్ష్మియును ఉదారతఁదోఁప తిన్నదనమునఁ గనుపట్టఁగా పరస్పరాత్మలం దాకలితమ్ములైన అన్యోన్యహృదయగతములైన తమయాకృతులు తమయాకారములు అచ్ఛతఁ బైకిఁ దోఁచి అపగతరజస్తమోవిమోహము లైన అన్యోన్యహృదయముల స్వచ్ఛతచేతను వెలుపటికిఁ గనుపట్టి అస్తోకతను ఆధిక్యముచేతను అందుఁ దోఁచె ననఁ బరస్పరహృదయవినిహితనాయకరత్నములందు కనుపట్టెనో యనఁగ శోభిలు ప్రకాశించునటువంటి వేంకటభర్తఁ గొల్చెదన్ వేంకటాచలపతిని సేవించెదను. అనిపద్యార్థము. ఈపద్యమందు మొదట కర్తృద్వయము నేకవచనగ్రహణము చేసినందుకు, అభిప్రాయము, యతో హరిస్తతో లక్ష్మీః యనియు, విష్ణోరేషానపాయినీ యనియు,

హాగ్నావి॥సంస్పృక్తా సనియు, అనన్యార్హాఘవేణాహం॥ భాస్కరేణప్రభా యథా ఇత్యాద్యనేకమైన ప్రమాణసహస్రములచేత నారాయణ పదార్థగ్రహణము చేత లక్ష్మీపదార్థగ్రహణము సిద్ధము. ఈపద్యార్థము చేత నీప్రబంధమందు వక్ష్యమాణమైనటువంటి యాముక్తమాల్యద రంగనాయక పరిణయసముచిత పరస్పరాభిముఖ్యావస్థితి స్వంగత్వసూచనచేత సూచితమగుచున్నది ప్రబంధములయందు మగణాస్త్రిశ్లోకముగా శార్దూలము ప్రయోగించుట కలిగినప్పటికి నిక్కడ నుత్పలమాలికావృత్తము ప్రయోగించినది యాముక్తమాల్యద చెంగలువపోమాలెగదా యను యుత్పలమాలికాసమర్పణము. అందునుంచి భగవన్ముఖోల్లాసము కలిగిన కథ రచియించువాఁడు గనుక ఉత్పలమాలికా వృత్తరూపమైన వాక్పుష్పదామము సమర్పించినాఁడు.

కడపటనున్న నాల్గవ యాశ్వాసములోని పద్యము.

క. నాని శిఖి వంటచెఱకుల, చేనవి వెండియును వంటచెఱకులె యగుటన్
బోనములు ప్రజకు జక్కులఁ, బోసంబులె యయ్యెఁ బ్రొయ్యి పొగయమివృష్టిన్.

టీ. అని వేఁడికట్టెలు లేవు గనుక మిక్కిలి కలువకాఁడలవలెఁ దడిసినకట్టెలు పైవేసినందుచేతను తడిసి యారిపోఁగాను అవి ఆయింధనములు మఱి విచారించిన బెల్లము వంట యోగ్యమైన చెఱకులె యగుటన్ బెల్లమువండ యోగ్యమైన చెఱకు లెటువలె రసమైయుండునో అటువలె.

ఇం తేయున్నది ౧౦౦ పత్రములు గలవు

## 22. వేదాంతప్రకరణము - గ్రం. సం. 60.

ఈ 60 సంఖ్యగలది కాగితముల పుస్తకము. పూర్వపు పీఁచు కాగితములు. ఇందు దీనితో పాటు నవనీతోపదేశము, నిజానందయోగి కృతమైన యుమామహేశ్వరసంవాదము, నారదమాహాత్మ్యని గురుగీతాసారము, వేదాంతకీర్తనలు, పంచీకరణము, దృగ్దృశ్యవివేకము నుత్తరభాగమును గలవు. ఇద్దఱు ముగ్గుఱు వ్రాఁతలిందున్నవి. మొదటఁ గొన్ని పాటలును "అందరాని మానిపండు అందెత్రిమూర్తుల కలవిగాకుండు' మొదలైనవి గలవు తర్వాత కఠవల్లి ఉపనిషత్తునకుఁ దెనుఁగు నాచికేతు కథగలదు. కొంతమచ్చునకు వ్రాఁతసవరించి వ్రాయఁబడుచున్నది.

"సాధనచతుష్టిసంపత్తి గలశిష్యుఁడైనవాఁడు, ఉపశాంతి గలటువంటి గురునిజోయి శరణుపొంది యడుగు ప్రకారము.

అయ్యా, శరీరమే యాత్మయో, లేక శరీరము కాక వేఱేయాత్మయా యని యడిగిన శిష్యుని జూచి గురునైన సనత్కుమారుడు చెప్పిన ప్రకారము, వాజశ్రవుడనెడు ఋషి తానొనర్చు సర్వస్వదక్షిణయాగము చేయునప్పుడు పాలు లేని యావులను దక్షిణగా నిచ్చెను. అప్పుడు నాచికేతుండను కొమారుడు చూచుకొనుచుండి పాలు లేని యావులను దక్షిణగా నిచ్చిన నరకముకలుగదే, నన్ను దక్షిణగా నిమ్మని మూడు మాఱులుగా జెప్పెను. మూడవసారి చెప్పునప్పుడు వాజశ్రవుడను ఋషికి మహాకోపమువచ్చి "నిన్ను మృత్యువునకిచ్చితి" నని చెప్పెను. అప్పుడు పితృవాక్య మసత్యముగా బోగూడదని యింద్రునిదగ్గఱకు మృత్యుదేవత తీసికొని ధర్మరాజు పట్టణమును బొందెను. ధర్మరాజు పట్టణమును బొంది యు ధర్మరాజును గానక మూడుదినములు వుండిరి. నాల్గవదినము ధర్మరాజువచ్చి యగ్నికి సమానమయిన బ్రాహ్మణులు మూడుదినములు వస్తున్నారే ఆయుస్సును ఐశ్వర్యమును పుత్రులను పశువులకును వీనిదేనికిని నాశము వచ్చుచున్నదా యని మూడు దినములు వస్తున్నందుకు మూడువరాలడుగుమని చెప్పినారు. నేను మా తండ్రి దగ్గఱ చేరవలయునని యొకవరము నడిగినాడు. రెండవవర మేమి కర్మముచేసి ధర్మరాజుపట్టణము పొందితి నని యడిగినాడు. రెండువరముల నడిగి మూడవ వరము డుగు ప్రకారము:—అయ్యా పరలోకానికి బోయెడు నాత్మనుగొందఱున్నదని చెప్పుచున్నారు. కొందఱు లేదని చెప్పుచున్నారు. ఉన్నదని చెప్పిరా కర్తగాను భోక్తగాను సంసారిగాను నుండును లేదంటిరా మైనా యాత్మకు సంసారమే లేదు దీనినిమీరు నాకు జక్కగా జెప్పవలయునని వినయముగా నమస్కరించిన నాచికేతునిజూచి ధర్మరాజు—

పదిపుటలుగలదు. కడపట ఆచార్యస్వామి చెప్పిన వేదాంతప్రకరణము సంపూర్ణ మని యున్నది.

2. నవకృతోపదేశము:—"ఎవ్వరు రచించినదో తెలియదు. దీనిలోని కొన్నివాక్యములు:—దిద్ది వ్రాయబడినది

"తత్త్వజ్ఞానము వలననుండి యజ్ఞాననివృత్తికావలయును, తత్త్వజ్ఞానమొందు వలన వచ్చునంటేని గురుకృపచేతను, ఈశ్వరానుగ్రహముచేతను, అనేకజన్మ సుకృతవిశేషముచేతను, వేదాంతశ్రవణముచేతను రావలెను—వేదాంతశ్రవణ మనగా నేదంటేని, శ్రవణమనననిదిధ్యాససమాధిలక్షణములతో గూడుకొని యుండును. శ్రవణమునకు లక్షణమేది, మననమునకు లక్షణమేది, నిదిధ్యాసకు లక్షణమేది, శ్రవణమునకు లక్షణమనగా నెటువలె నంటేని—ఉపక్రమము, ఉప

సంహారము, అభ్యాసము, అపూర్వతాఫలము, నర్థవాదము, నుపపత్తి, లింగము, తాత్పర్యనిర్ణయము. మననమునకు లక్షణమనఁగా నెటువలెననంటేని శ్రుతులు చెప్పినయర్థమునకు నాచార్యులు చెప్పినవాక్యమునకు, నింకను విశేషతః తన యొక్కబుద్ధి నిశ్చయముచేతను గూడును గూడ దని యనుసంధానము చేయు నదియే మననమునకు లక్షణము - - పదిపత్రములలోఁ గలదు. కడపట-

"యథాసౌమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం వా జ్ఞాతం కస్మాత్ వాచారంభణం వికారనామధేయం మృత్తికేత్యేవ సత్యం ఉపక్రమం ఉపసంహారం అభ్యాసం, అపూర్వతాఫలం అర్థవాద ముపపత్తిలింగం తాత్పర్యనిర్ణయం నవకృత్వోపదేశం సమాప్తః అనియున్నది.

౬. ఉమామహేశ్వరసంవాదము-ఇదియు వేదాంతమే- పార్వతికీశ్వరుఁడు చెప్పినది. " - - - - జ్ఞానంబుకొఱకుఁగాక వివాదంబు ప్రసంగోచితకరమై వర్తించునో, అటుగనుక వేదశాస్త్రపురాణాదులచేత జ్ఞానసిద్ధికొఱకుఁ దెలియఁబోయిన బహుకాలవ్యాప్తియు ననేకవిఘ్నములును దేహము క్షణభంగురము గనుక సకలలోకోపకారముగా సకలార్థసారానుగ్రహమైన యాత్మతత్త్వబోధ యాత్మానాత్మవివేకంబుకొఱకుఁ జెప్పఁబడెను. ఇందులవివరంబున జన్మస్థితిలయంబులును తొలంగును. మహదాదిభూతంబులును సకలచరాచరజంతుజాల లక్ష్యాలక్ష్యబ్రహ్మాండ పిండాండలక్షణంబులును బ్రకృత్యాత్మవిచారంబును మోక్షహేతువు బంధకంబును మిథ్యయునైనప్రకృతిని శ్లేషముగా లయముచేసి నిజమైనయాత్మ తానేస్వయంప్రకాశుఁడును నై వెలుంగుచుండును. శాస్త్రపురాణాదు లనంతములు, అందు గ్రంథము విస్తరమును కాలము స్వల్పమును గాఁగా హంసగదా పాలుగ్రోలి యుదకము విడిచినట్లు ఆత్మజ్ఞానులు సర్వార్థపరమైన పరమాత్మనిష్ఠులై యితరవాంఛలు విడుతురు - - - - - "

ప్రథమప్రకరణముచివర యిది వుమామహేశ్వరసంవాదే ప్రథమప్రకరణం సంపూర్ణం శ్రీవేమనసద్గురు తిరువేంగళగురుబ్రహ్మకే, అర్పితం. స్థిరకాల జీవన్ముక్తి స్థిరంజీవి వర్ధతాతిం అనియున్నది. రెండవప్రకరణము చివర శ్రీసద్గురు భావేస్కందపురాణే వుత్తరకాండే వుమామహేశ్వరసంవాదే నిజానందయోగ విరచితన్నామద్వితీయప్రకరణము సమాప్తము అనియున్నది. మూఁడవప్రకరణము పూర్ణముగాలేదు.

4. గురుగీతాసారము:—కవి కంభముపాటి నారపామాత్యుఁడని

క. క్రమమున సద్గురుముఖమున, నమలినశర్మమైన బ్రహ్మానురయుటచేఁ గం
భము పాటి నారసనిధధర, సుమతులచే నెన్నఁబడితి శోభనరాత్మన్.

క. శ్రీరామగురునికరుణను, దారకయోగానుభవవిచారము మదినే
మారఁక ధ్యానించుటచే, నీకృతిని నాంధ్రభాష నేర్పుఁ జేతున్.

ఈగ్రంథము మూఁడాశ్వాసముల పద్యకావ్యము మొదటి పద్యములు.

శా. శ్రీకైవల్యవిశేషస్థానము మదింజేరంగ నేఁగోరితిన్
లోకాచార్యుని దత్తవంశజుని సత్కారుణ్యపాథోధియై
లోకాచారవిచారసంపదల కాలోకింపకవ్యాఖ్యల
శ్రీకాంతుం డగు రామబ్రహ్మగురునే స్తోత్రింతు నశ్రాంతమున్.

చ. శివకరలీలఁ బ్రాణుల సృజించు నెడం గమలాసనుండు నై
యవని సమస్తజంతునివహంబులఁ బ్రోవఁగ నచ్యుతుండు నై
ప్రవిమల జీవసంఘముల ప్రాణముఁ బాపి హరింప రుద్రుఁడై
యవలఁ ద్రిమూర్తి లోక్కటగు నాద్యు ననంతుని వేఁడి మ్రొక్కెదన్.

కొందఱు నాకుఁ గవిత్వము చెప్పుట చేతఁ గాదు కాకపోయినను వెఱ్ఱియుత్సాహముతోఁ గడఁగితిని క్షమింపుఁడని వేఁడు నాచారము గదు. ఈతఁ డట్లు గనఁబడఁడు.

మ. సరసోదారకవీంద్రు లీకవితలో సవిశేషముల్నిండి శ్రీ
కరమైయుండ దటంచు నెంచెదరుగా గాంభీర్యవాక్చాతురి
న్నరుల న్వేఁడి గజాశ్వయానములకు న్నాసక్తులై పల్కు తా
త్పరణల్ గావు మహాత్ములా ఘనులకున్ సారస్యమైయుండునా.

క. ప్రాసములు యతులు గణములు, భాసురముగనుండ ననుచుఁ బలికెదరేమో
దేశికగురువరుచరణో, పాసకులకు నేలయిట్టిభ్రాంతులఁ బొందన్.

గీ. ప్రాసములు యెంచ గురుపదప్రాప్తి సుమ్ము
యతులు గురుపాదసేవ సుమతి నిలుచుట
గణము సద్భక్తజనములఁ గలసియుంట
సకలమీభావములు గూర్చి చెప్పువాఁడ.

అని ధైర్యముగ నుడివెను. భావమే ప్రధాన మనువారిలోని వాఁడుగా నున్నాఁడు. దీనికిఁ బైపద్యములో

క. పలికెద శ్రీ గురుగీతలు, పలికించెటివాఁడు రామబ్రహ్మము నాలో
పలనిలిచి యే విధంబునఁ, బలికించునో యావిధమునఁ బలికెద సుమ్మీ.

ఈతని గురువు ధేనువు కొండతిన్నన యోగి శిష్యపరంపరలోని రామబ్రహ్మ గురుఁడు. ఈకథకు మూలము పార్వతీ శంకరుని—

క. ఏమార్గమునను నోహర, యీమహి దేహాత్మభావ మెఱుఁగుదురది యె
ట్లామహిమంతయునే వినఁ, గాంక్షించితిఁ దెలియఁబలుకు గజదైత్యహరా

అని యడిగిన బోధించిన వేదాంతము. అక్కడక్కడి కొన్నిపద్యములు.

క. చావులు తనువుకుఁ గలుగును, జీవునకెప్పటికిఁ జావు చెప్పఁగరాదే
యోనవిత జీర్ణవస్త్రము, పోవిడిచియుఁ గ్రొత్తవస్త్రమును గట్టుగతిన్.

గీ తెలివిలేనివాఁడు దేహమే కాదనీ, నాఁడు విడిచెనేని నందుముక్తి
ఆత్మగన్నవాఁడు సమవసనంగంబు, బాసెనేని జనులు పాపియంద్రు.

గీ. గురువుకంటెను నిహపరమునయ లేదు
యనుచు శ్రుతులందు పలుమాఱు నెన్నఁబడును
వాక్కుకాయంబు మనసుచే వకటిగాను
నెంచి గురుపదపూజ లొనర్చవలయు.

చ. రవియుదయించి లోకక్రియలన్నియుఁ జేయఁగ నీడగత్రియల్
రవికిని నెట్టులంట వటు రాజిలుచున్ దనుధర్మలీల లీ
శివకరమైన యాత్మునకు జెల్వనఁటనటంచు భ్రాంతులం
దవులకు సాక్షిరూపుని మదింపలపోయుచు జ్ఞప్తినందుమీ.

5. మఱియుఁగొన్ని వేదాంతకీర్తనలు, జోలపాటలు, లాలిపాటలు, పంచీకరణమనువచనము నున్నవి. కీర్తనలలోఁ జాలభాగము— "భుజంగగురుకృపను బుధుఁడై యున్న నిజగోపాలశిష్యునికి నిత్యానందము" అను మొదలుగానుండును. భుజంగ గురుఁడెవ్వరో గోపాలశిష్యుఁడెవ్వరో తెలియదు.

6. దృగ్దృశ్యవివేకము; - ఈవచనము మఱియుఁ దప్పులతడిక — మచ్చునకు–కొన్నియున్నవున్నట్లు.

"శ్రీగురుచరణారవిందవేనమః, యిఖను జీవుడు యవడంటె స్థూలశరీరమందు అభిమానంచేశ్ని జీవుడికి విశ్వుడని పేరు, వీడికి అవస్థజాగ్రదవస్థ సూక్ష్మశరీరమందు అభిమానం చేశ్ని జీవుడికి తైజసు డని పేరు వీడికి అవస్థస్వప్నావస్థ కారణశరీరమందు అభిమానం జేశ్ని జీవుడికి ప్రాజ్ఞుడనిపేరు వీడికి అవస్థసుషుప్తి యీప్రకారంగా జీవభేదంచెప్పబడెను, యిఖను యీశ్వరభేదం యేటువలెనంటేను."

చిట్టచివర, ఈయొక్క పంచవింశతితత్త్వ ప్రకరణము లోకోపకారము కొఱకు, ఆచార్యస్వాముల వా రనుగ్రహము చేసినారు, గనుక ౨౫ తత్త్వములు

నెంరైన నేమిశోధించి కన్నవారికి సంతానమునొసగు సంబంధము వివరించును. సిద్ధము అనియున్నది.

23. శృంగారాంధ్రరసమంజరి—గ్రం. సం. 97.

దీనికవి నారాయణకవియని—

శా. పన్నొల్లీలఁగ నుల్లసిల్లిన భరద్వాజీయగోత్రార్ణవో
త్పన్నశ్రీగానుసూరి చంద్రుఁడు దలిర్పన్ వేంకటాచార్యశ్రీ
సన్నారాయణసత్కవీంద్రు నొనరింపన్ రమ్యమైయాంధ్రమై
యున్నన్నారసమంజరీకృతి చతుర్థాశ్వాస మొప్పెం దగన్.

అను కడపటి పద్యమునుబట్టి తెలియవచ్చుచున్నది. ఈక్రింది వాక్యములు ప్రతి వ్రాసినవారు వ్రాసినవి. దీనిలో దీనివివరమంతయుఁ గలదు.

"ఇరాంసమంజరి యనుగ్రంథము నవనాలపురి మనునట్టి యిాపుదుకోట సమస్తానమున్నటువంటి పడమటి నగిరి ప్రభువుపై శ్రీనన్నారాయణయ్యం గారు అనెటి మహాకవిచే రచింపంబడినది. పచ్చిమిరియం ఆదిప్పయ్యగారి మనముడు కుప్పణ్ణయ్యగారి కుమారుడైనట్టి సుబ్బయ్యవ్రాశినది. ఆశ్వాసములు నాల్గింట మొదటియాశ్వాసం వంశావతారం మాత్రం వ్రాయలేదు. శ్రీముఖ నామ సంవత్సరము ఫాల్గుణ బహుళ త్రితియ్యభృగువారం సమాప్తమైనది." అనికలదు. (కాగితపుప్రతి)

ఇక్కవి గద్యములకు బదులు పద్యములే రచియించెను.

శా. విశ్వానందననాయికౌఘగణనావిభ్రాజితంబైసుధీ
విశ్వాసప్రియహేతువై కృతిరనావేశప్రహృష్టాత్మన
ద్విశ్వంబై రసమంజరిం దెనుఁగునన్ విద్యోతితంబై ద్వితీ
యాశ్వాసంబిది నారణార్యరచితం బై యొప్పువేడ్కన్ మహిన్. (ద్వి - ఆ.)

మ. ఇది శ్రీమన్నవనారణార్యరచితప్రేంఖత్తరప్రౌఢిమ
త్పదవృత్తిన్ రసమంజరిన్ నవవిధోద్యన్నాయికా లక్షణా
భ్యుదిత శ్రీగుణచేష్టితప్రకటనాభోగప్రసక్తిన్ రసా
స్పదమై యాంధ్రమునై తృతీయమగునాశ్వాసంబు ధాత్రిందగున్. తృతీయా

పుదుకోట సంస్థానప్రభువు కోటె విజయరఘునాథరాజునకు (తొండమానునకుఁ) గృతియిచ్చెను. ఒక్క యాశ్వాసమంతయుఁ గృతిపతి వంశావతార వర్ణనమున్నది వ్రాయమానినారు. అందెంతవిశేషమున్నదో! ఆశ్వాసాంతము నందలి పద్యములు సంక్షేపవర్ణనలతోనున్నవి. చతుర్థాశ్వాసముచివర—

శా. సర్వోర్వీనుతవిక్రమా దయా దయానాంగత్వలక్ష్మీసఖా
ఖర్వోర్వన్నత్యవిలాసలాసక సుధ్రుగ్రాగాభిలాపాత్మభూ
పర్వార్వీశింజితరంజితాఖిలసభామర్త్యాళిసంశ్లాఘితా
గీర్వైఖర్యనువాదిపంజరవసత్కేళీశుకీశారికా.

మాలినీ- దివిజదుపటితాప్తా దివ్యగంధానులిప్తా
కవనకృపనుంక్తా కంతుజద్భక్తియుక్తా
భువనభరణదక్షా పుణ్యలబ్ధాత్మవీక్షా
కువలయనుతినాంద్రా కోటివంశాబ్ధిచంద్రా.

మ. విజితారాతిమహాధనీశ మకుటావిర్భూతముక్తాఫల
వ్రజకోచిస్తటినీతరంగితపదాబ్జాత ప్రభానంది
ద్విజయోపార్జితభవ్యదివ్యబిరుదోద్వేల ప్రకాశాంకురా
విజయశ్రీరఘునాథభూవర జగద్విఖ్యాత తేజోభరా.

ఇట్లే ప్రతిపద్యము చివరను గొంచెముకొంచెముగా నీరాజును సంబోధించుచు వచ్చినాఁడు. ద్వితీయాశ్వాసము ప్రారంభము.

క. శ్రీగుహినిలయితధ్వజ, సామంతనరేంద్రమకుటచయమణికిరణ
శ్యామలితపదనఖాంకుర, ధీమత్కులశంసనీయ ధిషణాభ్యుదయా.

వ. అవధరింపు మమ్మునివర్యులు సూతుంగనుంగొని రసమంజరి తెనింగించిన ప్రకారంబును వివరించి పలుకరింపుమనవుడు నక్కథకవర్యుం డిట్లనియె. అప్పు డక్కవీంద్రుఁ డానృపతనుఁ బరీక్షించి.

మ. నిజపాదంబున మున్ను నిల్పి నడుచు న్నిమ్నోన్నతోర్విన్ దరుల్
నిజహస్తమ్మున నందికొమ్మపిరులందిచ్చున్ శ్రమాశంకచే
నిజభాగంబిడి జింకతోల్పుఅపునన్ నిద్రింతు నే నాశ్వసుం
డజమూర్తిన్ దరినాలుసైక ప్రియభార్యం దాల్చి యంగంబునన్.

క. నీకతఁ డొసఁగుఁ జిరాయు, శ్శ్రీకీర్తులు శౌర్యవీర్య ధృతిమతులుతదీ
యాకృతులు లోకరక్షణ, ధీకృతులిన శశికరక్షితి ఖమణులినా.

సీ. శ్రీకరసత్కీర్తి జితపూర్ణకుముదబాంధవ రాజగోపాల తనయవిజయ
రఘునాథనీపేర రసమంజరి తెనుంగు నంకితంబొనరింతు నాలకింపు
లక్ష్యైకదేశతల్లక్షణావర్తిత్వ మవ్యాప్తియగు నతివ్యాప్తి యింక
లక్షణంబునకు నలక్ష్యవర్తిత్వంబుఁ దెలివిచే నీరెండుఁ దెలియవలయు

రసములంచెల్ల శృంగారరస మెముఖ్య, మగుఁదదాలంబన విభావమతి వలగుట
లక్ష్యములతోడనాయికాలక్షణములు,నరసవివరించిపలుకంగవలయు మొదట

సీ. చనుస్వీయపరకీయసామాన్యయనఁగనునాయికాత్రితయంబునయముమీఱు
స్వామియందే యనురక్తయైనది స్వీయ యన నందుఁ బరిణీత యన్యపురుషు
నభిలషించిన నతివ్యాప్తియగు నని పల్కనలదు లక్ష్యము పతివ్రతయె గాన
పరునియం దనురక్తి పడయంగఁబరకీయ యగుఁగానియదిస్వీయ యనఁగఁదగునె
యలపతివ్రతయే స్వీయ యనఁగఁ జెలఁగు, దానిలక్షణలక్ష్యము ల్దానిచేష్ట
లాలకింపుము రాజగోపాలవిభుని, విజయరఘునాథనృపచంద్ర విభవసాంద్ర.

స్వీయకులక్షణము:—

క. పతిశుశ్రూషయు శీల, వ్రతరక్షయు లజ్జ యార్జవంబును క్షమయుఁ
బ్రతి లేనిస్వీయచేష్టలు, రతిపతిసమరూప విజయరఘునాథనృపా.

స్వీయకులక్ష్యము.

సీ. వనజాతములుగదా పదము లట్లగుట నం దేణలోచనచూపు లెలమి వ్రాలు
బింబ మాట సుధాంశుబింబాస్య కెమ్మోవి చిఱునవ్వు వెన్నెల చెలఁగు నందుఁ
పతి చెవ్వి ద్రోణియైపరఁగుట శుకవాణి పలుకు తేనియ లందె చెలువు మెఱయుఁ
జల్లనికరుణారసమున కిల్లగునుల్లమునఁ గోపశిఖి రవ్వైనను జనింప
దదిజనించిన నొకయప్పుడం దెయణఁగుఁ, బతియె దైవంబుగానుసంతతమునతని
యందె సతులకు సద్భక్తియలరియుండు, విజయరఘునాథనరపాల విమలశీల.

నాయకలక్షణము.

క. మును విధ్యుక్తకరగ్రహ, మొనరించినఘనుఁడు పతి సమున్నతిగ నతం
డనుకూలుం డన దక్షిణుఁ, డన ధృష్టుండన శఠుండు ననఁగను వెలయుఁ.

పతికిలక్ష్యము.

చ. అమృతమయూఖ నీవు తుహినాంశుచయమ్ముల ముంచనించు మం
దముగ ఫణీంద్ర నీవును ఫణాగ్రములఁ గొడుగుంచు వీచు మో
యమరతరంగిణీ మిగుల నంబుకణంబులఁ జల్లు త్రోవలో
హిమగిరిపుత్రి మెత్తని మెయిఁ రవికాంతులు గాసి చేసెడిఁ.

ఈపుస్తకముతుదను గొన్ని సంగీతవిషయములు గలవు. రాగముల
పేరులు రాగమాలికయుఁ గలవు.

రాగమాలికలోని కొన్నిపంక్తులు:—

ఒక్కరాగమునుండి యువిద వచ్చినది - - సౌరాష్ట్ర.
ఒక్కరాగము వెలయుఁ జక్కనిప్రతాపసింహేంద్ర- శ్రీరాగము.
ఒక్కరాగజాతికి సమ మొప్పియుండును రూపము - గుజ్జరి.
ఒక్కరాగంబువలె నువిద కౌను - - - - ఆహిరి.

మొదలైనవి 18 రాగములు గలవు.

కనకాంగిరాగమునకుఁ గలశుద్ధస్వరములను మహత్తుగానుంచి ప్రస్తరించితే మేళాధికారశుద్ధమధ్యమరాగములు ౩౬ భేదములు గల్గును. పై గలుగదు.

సాలగరాగంబునకుం గల శుద్ధస్వరములున్ను ప్రతిమధ్యమమూను మహత్తుగానుంచి ప్రస్తరించితే మేళాధికారప్రతిమధ్యమరాగములు ౩౬ భేదములె బుట్టును. పై గలుగదు.

యిందున వకమేళాధికారమును బెట్టి ప్రస్తరించితే షాడవౌడసంపూర్ణరాగము లెన్నిజనించునో అన్నేశిరాగములే. వక్కవక్క మేళాధికారమున్ను బెట్టి ప్రస్తరించితే బుట్టునే వినా అధికమైనా తక్కువైనా బుట్టనేరదు. యిదే సిద్ధాంతము. అయితే యిప్పటివాడికరాగములు గురువులకల్పనలే వినా ప్రస్తారజన్యములుగాదు. సంశయపడవలశినదే లేదు.

ఇట్లేకొన్నివిషయములుగలవు.

## 24. తత్త్వచంద్రోదయాదులు—గ్రం. సం. 77.

ఈతత్త్వచంద్రోయముతోపా టిందుఁ జాలగ్రంథములు గలవు. ఉన్నవానిలో మొదటిది గనుక ముందు దీనినిగూర్చి వ్రాయుచు దానికి ముందున్న యొక్కపత్రములో శిథిలప్రాయముగా నున్న కొన్నిపద్యములు వ్రాయుచున్నారము.

శ్రీకనకవల్లీసమేత శ్రీతిరువల్లూరు వీరరాఘవాయనమః, శ్రీయలమేల్మంగాసమేత శ్రీవేంకటాచలపతయేనమః.—భర్తృహరి ప్రథమాశ్వాసము.—

ఉ. శ్రీలలితాద్రిజాఘుసృణచిత్రకరాగముఁ గాంచి తారక
భ్రూలత పల్లవించె ననఁబోఁడి నిజం బని మించుటద్దముం
గేల ధరించి ప్రేమఁ దిలకింపఁగఁ జూచు విలాసశాలికిం
బాలితసర్వభక్తజనపాళికి మ్రొక్కెదఁ జంద్రమౌళికిన్.

ఉ. తోయధిసారమై యితరదుర్లభమై గుణరమ్యమై జగ
ద్ధేయమహత్త్వమై భువనదీపకమై కమలాఖ్యమై నిశా

నాయకసోదరంబయి మనఃప్రియమౌ రతనంబు ఓమ్మునం
బాయక తాల్చుశౌరి నిరపాయసుఖంబులు మాకు నీవుతన్.

ఉ. ప్రామినుకుల్ ముఖాబ్జముల భారతి నెచ్చెలులై వసింప నె
త్తామరపూవు పీఠముగఁ దాపసముఖ్యులు సర్వనిర్జర
గ్రామణు లాత్మకింకరులుగా జగమేలెడు మేటిభక్తచిం
తామణి మాకు సత్కృపఁ బితామహుఁ డిచ్చుఁ జిరాయురున్నతుల్.

ఉ. శంకరచారుదృక్కుముదచంద్రిక యోగిజనప్రసన్నహృ
త్పంకజరాజహంసి శ్రుతిదర్పణదృశ్యనిజస్వరూప వి
శ్వాంకురజన్మభూమి తుహినాద్రితపఃఫలరాశి చంద్రరే
ఖాంకితరమ్యమౌళి జగదంబ శుభంబులు మాకు నీవుతన్.

చ. మినుకుఁగడానిపైఁడిపసమించిన నెమ్మెయిడాలు జాళువా
ననజడికైవడి న్నగనినల్లనిమేనికి వన్నె వెట్టఁగా
గొనబువహించుజవ్వని ముకుందునిపట్టపుదేవి ప్రేమతో
వననిధికన్య మామకనివాసముల న్వసియించుఁగావుతన్.

చ. నెలకొని తియ్యగాఁ బదమునేర్పుము మాకని గేరుభంగి రా
చిలుకయు వీణయందున భజింపఁగ గీతసుధాపయోధిలోఁ
బొలుపుగ నోలలాడు ననఁబోణి నిరంతరసుప్రసన్నయై
పలుకువెలంది నావదనపద్మమున న్విహరించుఁ గావుతన్.

శా. శ్రీవాణీరమణాదు లెవ్వని జయశ్రీకాములై కొల్తు రే
దేవుం బ్రాజదువుల్ గజాననునిగాఁ దెల్పున్ జగత్కర్తగా
నావిద్యాగురునిన్ గణేశ్వరుని భక్తాభీష్టసంధాయకున్
సేవింతు న్మదిలో వినాయకుని సుశ్రేమార్థసంసిద్ధికిన్.

ఉ. మూఁడుగుణంబులుం బరమమూర్తులు మూఁడును మూఁడువేదముల్
మూఁడుమహాక్షరంబు లొకమూర్తిగఁ బూనిన మేటివేలుపుం
బ్రోడల కేలుమోడ్పులు సమున్నతిఁ గైకొను సామి చూడ్కికిన్
వేడుకసేయు దేవునిఁ గవిస్తుతతేజు రవిన్ భజించెదన్.

చ. ఇనజునితోడ మైత్రిఘటియించియు వారిధిదాఁటి జానకిం
గనుఁగొని వచ్చియున్ జవముగైకొని మందులు దెచ్చి లక్ష్మణు
న్మనిచియు దైత్యులం బిలుకుమార్చియు రాఘవుచేత మెప్పులం
దినహనుమంతు శాంతు వినుతింతుఁ దలంతు.... నెంతయున్.

గీ. యుక్తినొక్కొక్కపద్య మత్యుగ్రపాప, విదళనము సేయ శతకోటివిస్తరముగ
రామచరిత మొనర్చిన వామలూరు, సంభవునకుఁ బ్రణామముల్ సంఘటింతు

అనునీపద్యములు మాత్రము కలవు. ఏభర్తృహరిసుభాషితములను దెనిఁగి[illegible]నకవి పీఠికపద్యములో తెలియదు.

1. ఇంకఁ దత్త్వచంద్రోదయవిషయము:—ఈ 77-వ సంఖ్యగలది యొక్క కాగితపుపుస్తకము. దీనిలోఁ దత్త్వచంద్రోదయము పదిప్రక్కలలో వ్రాయఁబడినది. వేదాంతవిషయమునుగుద్విపద-ప్రారంభము:—

శ్రీలీల వైభవాంచిత మైనయట్టి, భూలోకమునను జంబూద్వీపమునను
నవఖండములకెల్ల నాయకమైన, కవినుతభారతఖండంబునందుఁ
దెలియ నేఁబదియాఱు దేశంబులందు,
శ్రీధాన్యకటకమై చెలువొందుచున్న, యాధేనుకొండాహ్వయగ్రామవర్తి
కరుణాకరుండైన కరుణాకరుండు, కరుణఁగాంచినయట్టి ఘనకుమారుండు
నాణెమై తగుపాకనాఁటిశేఖరుఁడు, రాణించు శ్రీతిమ్మరాజప్రధాని
తత్త్వకథార్థావతారమై నైజ, తత్త్వంబు మోక్షార్థిదాసకోటులకుఁ
దెల్పుపరానందతీర్థదేశికుని, వేల్పుగాఁగొల్చి సేవించి తావారి
యుపదేశమున రాజయోగియై నన్నుఁ, గృపతోడనటులు రక్షించెఁగావునను
సద్గుణాంభోరాశిచంద్రుఁ డైనట్టి, మద్గురుస్వామిఁ దిమ్మయరాజయోగి
భావించి సేవించి భక్తితో నిష్ట, దేవతాస్తుతిచేసి ద్విపదమార్గమున

అనిప్రారంభించి ద్వారకలో రుక్మిణి శ్రీకృష్ణుని గోరఁగా నామెకు లోకానుగ్రహకాంక్షచే నద్వైతమార్గమును దెల్పినట్లు వ్రాసినాఁడు. మధ్యభాగమున—

ఒకయిచ్చయును లేకయుండెడి బయలు, సకలంబు తానైన చక్కనిబయలు
లోకంబు లన్నియుఁ బోఁగొన్నబయలు, రాకపోకలు లేక రంజిల్లుబయలు
మునులకు నల్లారుముద్దైనబయలు, వినవినవీనుల విందైనబయలు
ఎందుఁజూచిన గాని యెడలేని బయలు, సందీక యంతట సాఁగినబయలు.

ఈబయలు దగ్గఱదగ్గఱ నూఱుచరణములలో వివరించినాఁడు. అంతమున:—

అని ధేనుకొండ తిమ్మార్యప్రసాద, మున కొప్పరావూరి ముమ్మిడిరాజు
గంగనామాత్యుండు గన్నపుత్త్రుండు, శృంగారనిధియైన కృష్ణమంత్రికిని
రఘుప తెమ్మకును గారావుసుతుండు, అఘనాశమైన బ్రహ్మానందపూర్ణ
మఖిలవైభవయోగి మల్లనయోగి, సహజకోదండదీక్షాగురు పేర

భావనాకృతిపేరఁబరమాత్ముపేర, జానకీపతిపేరసదయాళుపేర
శ్రీనిధానముపేర శ్రీరాముపేర
ధరనెంచఁగా సంకీతము చేసినట్టి, సరసమా నీతత్త్వచంద్రోదయంబు
ఆచక్రవాళాద్రియంతపర్యంత, మాచంద్రతారార్కమై యొప్పఁగాత.

ఈమల్లనయోగివంశాదికము సతనిశిష్యుఁడు జ్ఞానసూర్యోదయమను ద్విపదలో నీక్రింద వివరించినాఁడు. తనవంశమును దెల్పకున్నాఁడు.

2. జ్ఞానసూర్యోదయము:—దీనికవి వేంకటాఖ్యుఁడు, తనగురువగు మల్లనయోగికే కృతియిచ్చి చెప్పినాఁడు. ఇదియు వేదాంతవిషయమే. ౨౬ ప్రక్కలుగల పెద్దపుస్తకము, నాలుగాశ్వాసములు. ప్రారంభము:—

శ్రీకరు మోక్షలక్ష్మీమనోహరు, ప్రాకటనిజపరబ్రహ్మావతారు
నానాముముక్షుమానసరసోత్తారు, భానుకోటిప్రభాభాసురోత్కారు
గురుమతశాస్త్రానుకూలప్రసారు, వరరాఘవస్తవవాక్పమత్కారు
తత్త్వవాద్యున్మత్తదంతికంఠీరు, తత్త్వమస్యర్థసాధకనిర్వికారు
పరమమంత్రార్థ దర్పణవాక్యసారు, వరసుషుమ్నాంతర ప్రజ్ఞాసమీరు
తిమ్మార్యగురుపాదతీర్థకాసారు, సమ్మోదహృదయ నిశ్చలబోధధీరు
సురుచిరాపస్తంబసూత్రప్రచారు, సరసయజుర్వేదసమ్యగాచారు
గురుతరశాండిల్యగోత్రప్రకారు, ధరణీసురాన్వయ ధర్మశృంగారు
తనరుకృష్ణానదీదక్షిణతీరు, తెనుఁగుదేశమునఁ బొందికఁ గొమరారు
కులజనార్జితమైన కొప్పరాపూరు, ఇల రాజధానిగా నేపున మీఱు
సతతముమ్మిడిరాజ సత్కులధీరు, ధృతిని గృష్ణయరఘుప తిమ్మకుమారుఁ
డగుమల్లనాచార్యు నాత్మసుస్థైర్యు, నిగమోక్తి హృద్వీథి నిలిపి సేవించి....
సుకవీంద్రవర్యుల సారిదిఁ గీర్తించి, సకలశాస్త్ర వివేకసారంబు లెంచి
నిరతిశయానందనిపుణతఁగాంచి, యెఱిఁగింతు మద్వంశ మెట్లన్న మఱియు
ఘనడిల్లితమ్మయ గాయమ్మ సుతుఁడు, వినుతసజ్జనుఁడు గోవిందయనరస
మాంబసుతుండు నాయన్నార్యలక్ష్మ, మాంబసుతుండు నాశ్వలాయననామ
సూత్రఋగ్వేదభాసురుఁడ వసిష్ఠ, గోత్రుండ వేంకటాఖ్యోన్నతయశుఁడ
మునిజనహృదయాబ్జములు వికసింప, నొనరింతు జ్ఞానసూర్యోదయంబనెడు
ఘనకృతి ద్విపదగాఁ గావ్యులు మెచ్చ,

ఈకథకుమూలము శ్రీరాముఁడు సీతాదేవి యడుగఁగా బోధించినట్లు తెల్పుచున్నాఁడు. మచ్చునకుఁ గొన్ని—

విను తత్త్వమస్యాది విమలవాక్యముల, పుట్టిసజ్ఞానంబు పొందునఁ దోఁచు,....
భాగంబు లానందపనలక్షణములు, ప్రాగను నొక్కటి ప్రధ్వంస మొకటి
అన్యోన్య మొక్కటి యత్యంత మొకటి,శూన్యముల్నాలుగుఁసారిదినిత్యమును
నెలయును వీనిని వివరింతు వినుము,కలుగుమృత్తికయందుఘటములు మొదట
పరికింపఁగా నిది ప్రాగభావంబు, వెరవైన ఘటములు వెనక లేదనుట
పటువుగఁబ్రధ్వంసభావశూన్యంబు,ఘటములుపటమందుఁబటములాఘటము
కణఁగి లేదనుట యె కణఁగి యన్యోన్య, మనయభావంబింక నాకాశపుష్ప
మనుట యత్యంతమా నలయభావంబు, ఘననిత్యపదమిది కంజాక్షి మఱియు.
(ప్రథమాశ్వాసములోనిది.)

...పటివాక్యములు:——
శ్రీశైలమను నామ శిష్యునిగూడి, వాసనతో బాహ్యవాసనమాని
భాసురస్థితితోడఁ భాసిల్లుచుండె, - - - - - -
ఇదివిన్నఁ జదివినసిష్టార్థసిద్ధి, కొదుకక సిద్ధించు గురుకృపచేత.

3. తత్త్వదీపికాప్రబోధము:——ఇదియును మల్లన యోగిశిష్యులలో నొక
డగు:——
అనుచు శ్రీమల్లనాచార్యప్రసాద, ఘనత మారేపల్లి కామార్యసుతుఁడు
సుతుఁడు వేంకటభట్టు సూనృతయశుఁడు, అతనికిల్లాలు నర్సాంబ వారలకు
గారాపుసుతుఁడు వేంకటయోగివరుఁడు, సారత వేంకటాచలపతిపేర
నాయాథు లెంచఁగా నంకింతంబైన, ధీరతనీతత్త్వదీపికాబోధ.

అనుదానిలోనున్న మారేపల్లి వేంకటయోగి వ్రాసినట్లు విదితము. ఇది చిన్న ద్విపద ౫౪ ప్రక్కలుగలది. ఇది శ్రీతిరుపతి వేంకటేశ్వరస్వామి అలుమేల్మంగాంబకుఁ గరుణించిచెప్పిన వేదాంతము. ఈకృతిని:——

పరసత్కవిరాజసంఘుంబు వొగడ, - - - -
ద్విపదగా శ్రీతత్త్వదీపికాబోధ, అపరిమితశుభాంగ యలమేలుమంగ
మది వెలుంగుచునున్న బ్రహ్మము పేర, విదితమాతత్కథావిధ మెట్టులనిన.
అని శ్రీ వేంకటేశ్వరులకే యంకితమిచ్చినాఁడు.
ఈకవి కొన్ని వాక్యములు చిత్తగింపుఁడు—
నిదురందుఁ బ్రాజ్ఞుని ర్వాసనాను, హృదయంబునను జీవుఁడుండును మఱియు
త్రిగుణధామత్రయత్రిపురందు నిగుడి, నిగుడు జీవుండును నీవు నేననుచు
కల్పితరాగాదికర్మంబు లెల్లఁ, గల్పితదేహిపిగాఁగ నెఱుంగు

సరి యవస్థాత్రయసాక్షివై యె నట్టి, యెఱుకస్వరూపంబు నెఱుఁగు మెట్లన్న
దేహేంద్రియప్రాణ ధీమనోచిత్త, మోహాదిగుణధర్మములు నీవుగావు.

౪. వేదాంతసారము:—కొండముదిగోపాలరాయ కవి. నాలుగాశ్వాసముల చిన్న పద్యకావ్యము. గద్యము-ఇతిశ్రీభుజంగరాయ గురువరప్రసాదలబ్ధ కవితావిలాసగోపాలరాయప్రణీతంబైన సర్వవేదాంత సారామృతంబునందుఁ బ్రథమాశ్వాసము.

ప్రారంభము:—

క. శ్రీకళ్యాణగుణగణా, ద్యాకరభయహరణ నిపుణ యార్యారమణా
రాకేందుమౌళిభూషణ, ప్రాకటభవబంధహరణ పంకజచరణా.

గీ. ఓంనమశ్శివాయ యోంకారరూపాయ, యీశ్వరాయ పార్వతీశ్వరాయ
ఫాలలోచనాయ భవబంధనాశాయ, శాశ్వతాయ శంభు శంకరాయ.

ఉ. కంటిని నీదురూపమును గన్నులునిండను సర్వమందునన్
వింటిని మంత్రగోప్యమును వీనులనిండను నాస్యమందునన్
అంటిని మైదునక్షరము లమృతధారఁగ జిహ్వయందునన్
తింటిని హాయిహాయిగను తృప్తిగ శంకర లోకనాయకా.

క. శివపంచాక్షరిమంత్రము, వివరంబుగ శివునివలన వినుటయు వలనన్
సవిశేషపదము గలిగెను, గవనంబును జయమునకును గారణమయ్యెన్.

క. ఏరామనామమంత్రము, తారకమని సాంబశివుఁడు దాక్షాయణికిన్
గోరఁగ నుపదేశించిన, యారాముఁడె బ్రహ్మమనుచు నభినుతిసేతున్.

గీ. పరమవేదాంతకవులను బ్రస్తుతించి, సకలగ్రంథాదిసారంబు సంగ్రహించి
చెప్పఁబూనితిఁ గృతిగాను జిత్తమలర, ననుభవంబును జెప్పుట యలవియగునె.

కవిస్వవిషయముం జెప్పుకొనుచున్నాఁడు:—

సీ ఆంధ్రదేశంబున నతిశయమ్మై కొండవీటిసీమయందు వెలయుకొండ
ముదిపురవాసుండు నదెకొండముదివంశజుండు వెల్నాటిద్విజుండు మఱియు
గోత్రంబు కాశ్యప సూత్రమాపస్తంబ మార్వేలనియోగి యైనఘనుఁడు
పాపయ్యయనుమంత్రి పణఁతి సీతాంబయు నాదంపతులసుతుఁడైన ఘనుఁడు
వేంకటాచలమనఁగను విమలమతుఁడు,యతనిపత్నియు బుచ్చాంబయనసుబడి
నావధూవరులకు సుతులేవురైరి, కీర్తిమంతులనఁబడిరి కేవలముగ. [యె

క. గోపన్న వేంకటాద్రియు, నాపయుఁ బుచ్చయ్య మఱియు నప్పయ్యయునున్
బూపులకృష్ణయయొక్కఁడు, ప్రాపితముగనైదుగురును బ్రజ్ఞాన్వితులై.

క. వ్యవహారయోగ్యులై మఱి, శివకేశవులాలయములు చెఱువులు వనముల్
సవిశేష కార్యకరములు, నవిరళముగఁ జేసినా రిలార్యులు మెచ్చన్.

ఉ. అందున వేంకటాద్రియును నందె నలంకృతకన్యదానముల్
సుందరరామునివ్వలన శోభనలగ్నమునందుఁ బ్రీతిగా - - - - -

ఈ వేంకటాద్రిభార్యయాదిలక్ష్మి, యీదంపతులు సంతానములేక పం డ్రెండేండ్లు తపస్సుచేయఁగా దపఃఫలముగా నీకవిపుట్టి నాఁడఁట. ఈతనితమ్ముఁడు యోగానందము.

కథాశైలికిఁ గొన్నిపద్యములు:—

క. అలరపథి కర్మమనఁగన్, విలసితయజనాదికములు విశ్రుతమాయెన్
ఫలమందు స్వర్గభోగము, నలలితముగఁ జెప్పఁబడెను సంగతులరయన్.

సీ. యజనాదికములెల్ల నిజముగాఁ జలుపను గఠినతరంబుగఁ గానఁబడియె
ద్రవ్యంబులేకను సవ్యంబుగాఁబూర్తి గానేరదందునఁ గార్యములును
ద్రవ్యమార్జింపను ధనికులయాచింప నధికదుఃఖముకెల్ల నాలయంబు
విత్తమార్జనచేసి విధిగాను జలిపినఁ గడట ఫలమేమొ గానరాదు
కాయకష్టంబు నధికమై కానఁబడును, వినఁబరోక్షంబునై యుండు వేడుకలర
ఫలముఁ జెందిననల్పమై యలరుఁ దిరిగి,జన్మమానని చెప్పె నాశాస్త్రములును.

గీ. అలర నింద్రాధిపత్యంబు ననుభవింప
భ్రాంతినహుషుఁడు రఘుమహారాజవరుఁడు
మఱి యయాతియు మాంధాత మహిమదెలియ
నేమిపొందిరి స్వర్గులై యింద్రపదము.

క. అదిగాన చలనకారణ, నిదిబాహ్యమునను చు విడిచి యేర్పడమదినిన్
సదమలయంతర్యాగము, విదితంబుగఁ జలుపఁబడితె విరతిని జెందన్.

ఈగోపాలరాయఁడే తనగురుఁ డగుభుజంగరాయనిసంబోధించుచుఁ గొన్నికీర్తనలు వేదాంతమార్గమునఁ జెప్పినవి వెనుకటిసంచికలయందుఁ బాఠకులు తెలిసికొనియున్నారు.

పేఁచుకాగితములమీఁద వ్రాయఁబడినది. ఇదియే కవిస్వహస్తలిఖిత మగు మొదటిమాతృకయా యని సవరణలు దిద్దుబాటులుఁ జూడ ననుమానము కలుగుచున్నది. అక్షరములు కలిపివ్రాఁత కొన్నితావుల స్ఫుటముగానగపడుటలేదు.

ఇంకఁ బ్రసంగరత్నావళివిషయముం దెల్పుచున్నారము:—

24. a ప్రసంగరత్నావళి— గ్రం. సం. 77.

ఇందు 316 శ్లోకములు ప్రసంగోచితములైనవి కలవు. ఇందలిశ్లోకములనేకకవుల గ్రంథములనుండి సంగ్రహింపఁబడినవి. కొన్ని మచ్చునకు—

శ్లో॥ పక్షద్వంద్వవిరాజితోఽపి మమలో మీనప్రసేవీసదా
పూర్ణాంగ స్సకలోదితః పరిభవశ్చంద్రస్సమః కిమను
సర్వస్థాణుశిరోగతోఽపి మనిశం చంద్రం బకోహాసతే
మాత్సర్యేణ దురాత్మకోపి సుజనం దృష్ట్వా సదాహాసతే. 3౨

కర్పూరధూళీరచితాలవాలః కస్తూరికాచందనదోహదశ్రీః
పన్నీరసీరై రభిషిచ్యమానః ప్రాఙ్చం గణం ముంచతి కిం పలాండుః.

వాఙ్మాధుర్యా త్సర్వలోకప్రియత్వం వాక్పారుష్యాత్సర్వలోకా ప్రియత్వమ్
కోవాలోకే కోకిల స్యోపకారః కోవాలోకే గార్దభ స్యాపకారః.

పరోపి హితవాన్బంధుః బంధుర ప్యహితః పరః
అహితస్యాంగజవ్యాధే హ్రిశ మారణ్య మౌషధమ్.

—। ఇందే—పద్యావళి గ్రంథము గలదు ।—

ఈపుస్తకములో 300 శ్లోకములుగలవు- మొదట-

శ్లో॥ పద్యావళీ విరచితారసికైర్ముకుంద సంబంధబంధురపదా ప్రమదోర్మిసింధు రమ్యాసమస్త తవ సోదముని క్రమేణసంగృహ్యా తేకృతికదంబక కౌతుకాయ ప్రారంభే మంగళాచరణమ్।

నమో నలిననేత్రాయ వేణువాద్యవినోదినే।
రాధాధరసుధాపానశాలినే వనమాలినే- కస్యచిత్.

ఇందుఁ గలశ్లోకముల కర్తలపేరులును జాలభాగము తెల్పఁబడినవి.

సారాంగస్య; శుభాంగస్య, రహస్య, కస్యచిత్, దాక్షిణాత్యస్య, విష్ణుపురీశ్రీపాదానాం, తేషామేవ, సర్వజ్ఞస్య, శ్రీరామానందరాయస్య, శ్రీధరస్వామినోక్తం, శ్రీలక్ష్మీధరస్య, శ్రీవిశ్వపురీశ్రీపాదానాం, శ్రీభగవతః, కేషాంచిత్, శ్రీవేదవ్యాసపాదానాం, కవిరత్నస్య, శారదాకారస్య, పురుషోత్తమదేవస్య, సమాహర్తుః, శ్రీగోపాలభట్టానాం, ఔత్కలస్య, సర్వానందస్య, ఈశ్వరపురీశ్రీపాదానాం, ధనంజయస్య, మాధవేంద్రపురీశ్రీపాదానాం, రఘూపాధ్యాయస్య, శ్రీకవిరాజమిత్రస్య, శ్రీకరాచార్యాణాం, గోవిందస్య, భవానందస్య, సార్వభౌమభట్టాచార్యాణాం, జీవమాళీనాం, సంజీవస్య, గజ

పతిపురుషోత్తమదేవస్య, శ్రీమతః, మయూరస్య, వసుదేవస్య, ఉమాపతిధరస్య, అభినందస్య, సర్వానందస్య, యోగీశ్వరస్య, కవిచంద్రస్య- ఇత్యాది కలవు.

మచ్చునకుఁ గొన్ని శ్లోకములు—

కల్యాణానాం నిదానం కలిమలమథనం పావనం పావనానామ్
పాథేయం యన్ముముక్షోః సపదిపరపదప్రాప్తయే ప్రోచ్యమానమ్
విశ్రామస్థాన మేకం కవివర వచసాం జీవనం సజ్జనానాం
బీజం ధర్మద్రుమస్య ప్రభవతు భవతాం భూతయే కృష్ణనామ॥

దీనికి శ్రీమద్విశ్వపురీశ్రీపాదానాం అని యున్నది, దీనినే "రామనామ"యనుమార్పుతో హనుమన్నాటకము మొదటఁ జూచుచున్నారము.

శ్రుతి మితరే స్మృతి మపరే భారతమన్యే భజంతు భవభీతాః
అహమిహ నందం వందే యస్యా వందే పరబ్రహ్మ॥
శ్రవణే మధురా నయనే మధురా తనేమధురాహృదయే మధురా
పురతో మధురా పరతో మధురా మధురా మధురా మధురా మధురా.
అబద్ధకృత్రిమసటా జటిలాంబిభర్తి స్వారోపితో మృగపతేః పదవీయతశ్చ
మత్తేభకుంభపరిపాటనలంపటస్య నాదం కరిష్యతి కథంహరిణాధిపశ్చ ౨౧౦
యాలాభా యాపరద్రోహా యాపాత్రే యాపరార్థకః
ప్రీతిర్లక్ష్మీర్వ్యయః క్లేశః సాకిం సాకిం సకిం సకిమ్. ౨౨౮

25. అంగపాతాళసంఖ్యపద్యములు—గ్రం. సం. 92.

అంగపాతాళసంఖ్యపద్యములు, తాళప్రస్తారపద్యములును గల యొక విడివిడి పేఁచుకాగితముల పుస్తకము. ఇందు మొదటియంగతాళ సంఖ్యను గుఱించి లేదు.

"కోవిదులందఱుఁ గొనియాడఁగానుద్వ్యయంగపాతాళసంఖ్యయు చెలువుకు
భళిభళి యనిమెచ్చ భరతశాస్త్రజ్ఞులు లీలత్రియంగపాతాళసంఖ్య"

ఇట్లొకొక్కపాతాళసంఖ్యలో ననేకవిధముల పద్యములు గలవు. ప్రస్తారములో దేని కెన్నివచ్చునో లెక్క తెల్పఁబడినది.

క. ఆరయ శరత్రియంగము, భూరిగభరతజ్ఞు లెఱుఁగ ముప్పదివేలా
ర్న్నూఱుండొంబదియైనను, ధారుణిలో పలను వెలయు దశరథరామా.

గీ. ధరణి ద్రుత శేఖరద్వయ గురువ్రకమును, రెండులఘులనలువదియొండునొక్క
వేలనిన్నూటపదియును వెనుకఁదొమ్మి, దియును నారసికవివరుల్ దెలియరామ

ఈరీతిని బదిపాతాళసంఖ్యలు చెప్పఁబడినవి. కొన్నితావుల నక్షరము
లు మాసిపోయినవి.

౨. తాళప్రస్తారములోని పద్యములు— ఇందు చతురశ్రజాతి, త్రిశ్రజా
తి, మిశ్రజాతి, ఖండజాతి, సంకీర్ణజాతి ప్రస్తారసంఖ్యలకుఁ బద్యములు చెప్పఁ
బడినవి.

చతురశ్రజాతిలోనష్టము—

సీ. చతురశ్రజాతినష్టము చెప్పు మనినను కాల్మాత్రయాదిగాఁ గలిగియుండు
నిన్నియక్షరముల కింతసంఖ్య యటంచు నెఱిఁగి యేసంఖ్యలో నెవ్వరైన
నిన్నగుభేదము లెటువలె నుండును జెప్పుమీ నాతోడఁ దప్పకుండ
వనియడిగిన సంఖ్యలన్నియు వ్రాసుక యడ్డమునుద్రుతములయందు ద్రుతము
చతుర్థమున లఘువు చెలఁగ నష్టమగురువు ద్వాదశప్లుతముతోదొరయఁగూడ
తన నడిగిన సంఖ్య గొనియు నాయింటను........................

క. ధరఁ ద్రిశ్రజాతి యరచం, దురునిసిమొక్కటియు మఱియు ద్రుతమున రెండుఁ
శిరమునను జుట్టునాలుగు, స్థిరముగ మముఁ బ్రోవుప్రేమ సీతారామా.

క. ఒకటిం గాలుకు నాఱు, న్నొకటియు ద్రుతలఘున నీనునొకపదమూఁడుఁ
ఇఁక రెంట నిరువదైదగు, శుకసన్నుత దివ్యనామ సురసుత్రామా.

ఈపుస్తకముకడపట నిట్లున్నది.

" శుభమస్తు "

శ్రీరంగరతిజయ శ్రీరంగమకరంద కందర్పదర్పణకంతుకాది
రతిలీల వనమాలి రాజచూడామణి ప్రత్యంగరూపక పంచభూత
రాజమార్తాండైక రాజనందన కోకిలప్రియోద్వీక్షణ లలితబసవ
శంకరప్రతిరాయ వెంకోలఖత్తాఖ్య మట్టికాపుత్రికోచ్ఛ్వస కుడుక్క
చంచత్పుటాభంగ చాచపుటానంగ జయమంగళద్వంద్వ శరభలీల
వర్ణభిన్న త్రిశ్రవర్ణ వర్ణయతి త్రిభిన్నవిలోకిత బిందుమాలి
కరుణద్వితీయకోఘట్టకళధ్వని శ్రీకీర్తిచౌతాళ సింహనాద
చతురశ్రవర్ణక రాజవిద్యాధర హంసనాద త్రిభంగి సమరవినుము

మల్లికామోద లీలాదు లెల్లఁదెచ్చి, సాహితీగీతికుచకుంభ శారదాంబ మెచ్చి శరభోజభూప నిన్నిచ్ఛగించు, నలరుఁబోణి పదంబున మెలఁగఁజేసె.

దీనింబట్టి యీపుస్తకము తంజావూరురాజగు శరభోజిభూపాలుని యాస్థానములోని సంగీతవిద్వాంసుఁ డెవ్వరో రచియించియుండు నని తేలుచున్నది. కర్తపేరు తెలియలేదు.

**26.** శృంగారపుపాటలు - ఖడ్గలక్షణము—గ్రం. సం. 95.

ఇదియు నొక్క పేఁచుకాగితపు గ్రంథము; చిన్నది. కొన్ని మచ్చునకు—

వందేత్వాం గోకర్ణేశ వకుళారణ్యనివేశ మహేశ॥

1. వందారుదానవసందోహసేవా మందానంద బృందముకుంద నందము కుందపురందరవందిత వందేత్వా॥

4. సంగరరంగవిరూపా నిజకరసంగతసురగిరిచాపా మంగళకరచిద్రూపా రవిరథాంగ వేదనుత గురుతరకోపా॥ వందే॥

5. కాండభాండలయలీలా। పరవేదండాజినవరచేలా పాండరకపాలమాలా। కోటితొండమాన్ కులజనవరపాలా భండనమండలఖండనపండిత। చండపిచండిలకుండలికుండల। వందే।

—♦రాగమాలిక♦—

గౌరీమనోహర గోకర్ణమాంపాహి గౌరమహానట నారాయణప్రియ
సారంగధరకళారంజిత మస్తక సామగానప్రియ సర్వలోకశరణ్య
దశముఖారివినుతచరణ సరసీరుహ దళైలవిశహరిప్రముఖభాగ్యోదయ
విశదపూర్ణవ్యోమలహరీజటాజూట విమలశంకరాభరణాయితాహీశ
సకలచరాచరనాటనాకార శమితారివేగవాహినీశనిషంగ॥
వికటవరాళికాక్షీహతమన్మథ వినుతజనకళ్యాణిమాదిభాగ్యప్రద.........

ఇంతయలుగ నేల యేనేమిచేసితి నింతిరో బాగాయెనే॥

రంతుకాఁడౌ కోటిరాజాబహద్దరుని యింతిపేరేమని యేఁ దెలియవేఁడితి.

ఖడ్గలక్షణము - వచనము - ఇందుఁ గత్తులపేరులు పొడవు వెడలుపు లక్షణము ముద్రలు పిడులవివరము మొదలగునవి వ్రాయఁబడినవి.

కత్తులు 1 యిందుస్థాన్ సురై 2 అబ్బియాబాగుసురై 3 బక్ దర్ త్యాగా 4 న్యహార్ త్యాగా 5 రుమ్మీత్యాగా 6 బిందుపాన్ త్యాగా 7 హీరార్ త్యాగా 8 అబ్బాసీత్యాగా 9 పరర్ సెరీత్యాగా 10 బగ్దాత్యాగా 11 సరవరి

త్యాగా 12 మావిలీత్యాగా 13 హైదరాబాద్ త్యాగా 14 కుచ్చిత్యాగా 15 చెంగ్లామాత్యాగా 16 విలాతిఅబాసీ 17 ఖురాసాఁఅబాసీ 18 మంమమాభీర 19 అందాబాదిగురువా 20 మెర్నల్ అనునవి చెప్పఁబడినవి. ఒక్కదానికుదాహరణము.

ఖురాసాఁఆబాసీ:—కత్తి గడుసుగా నుండును. తక్కినలక్షణములు విలాతిఆబాసువలెను.

మిశ్రకత్తి: —(మిసర్ కత్తి?) కాలుతక్కువ నాలుగుజేనలు. వెడలుపు 3 వ్రేళ్లు. పెణికదగ్గర నొకదోరెము. పెణికెలావు. పిల్లదోరెము ౧౹ బీరకాయపీచువలె ఛాయ,

నాలువాలు:—నిడివి 3 జేనలు. పెణికెకొనదాఁక సన్నగా నుండును. నడుమ నొకదోరెము, ఉక్కుటల్గు. నీరునల్పు వెడలుపు రెండువ్రేళ్లు.

ఖండా:—నిడివి కాలుతక్కువనాలుగుజేనలు వెడల్పు 3 వ్రేళ్లు. చూరి ముందు వంగియుండును. అడుగు దుత్తెడు. 3 దోరెములు. పెణికెదగ్గఱ కడవెళ్ల బటువుముద్దర. దుగళం పేరామిదపుగిజవలె కత్తిగడుసు ' రందాపట్టు ...............దప్పం కత్తిలఘువు.

ఆయాతావులఁ గత్తియొక్క ముద్రలు చిత్రింపఁబడియున్నవి. ఫరుజులు ఢాల్లు కేడెములు పేరులు గుర్తుకొఱకుఁ గొన్నివ్రాసికొన్నారు.

కెడెయములు— బరువుగానుండును. క్రొత్తది కోసిన నేరేడుపండు చెక్కినట్టుండును. ప్రాఁతగిలిన దోరబీరకాయచిక్కనఁ గోసినట్లుండును. నఱుకుదగిలినఁ గూడిపోవును. నాలుగుతావులను బెట్టునది కెడయము. తక్కినతావున పెట్టేది చిలువట్టు. ఇత్యాదిగలదు.

ఈపుస్తకముజదివిన పుదుక్కోటసంస్థానములోనిదని తెలియవచ్చును.

27. స్కాందాంతర్గత ధర్మఖండము — గ్రం. సం. 117.

కవి యీఁదులపల్లి భవానీశుఁడు; కవి యీగ్రంథమును శ్రీశైలమల్లికార్జునిని కంకితముచేసెను.

గద్యము:— ఇది శ్రీమత్సద్గురుకరుణాతిశయలబ్ధ కవితావైభవ యీఁదులపల్లి శంకరమంత్రితనూభవ సుధీజనవిధేయ భవానీశనామధేయప్రణీతంబైన స్కాందపురాణంబున ధర్మఖండంబునందు......ఆశ్వాసము.

ఈక్రిందిసీసపద్యములోఁ గవి తనవంశము జెప్పుచున్నాఁడు.

సీ. ధాత్రిభారద్వాజగోత్రపవిత్రుఁడై సురుచిరాపస్తంబసూత్రుఁ డగుచు
నిరతాన్నదానాభిరతుఁ డౌనీఁకులపలి నరసామాత్యుపౌత్రవరుని
సంతతపూజితశంకరుం డగుశంకరామాత్యమౌళికి నాత్మభవుని
బ్రాజ్ఞుని నచ్చమాంబాగర్భశుక్తిముక్తామణి నీశ్వరధ్యాననిరతు
భవ్యశృంగారమంజరీకావ్యరత్న, మాంధ్రభాష నొనర్చిన యనఘచరితు
శంభునిభుఁడగు నివటూరిశంభుశిష్యు, ననుభవాసీశనాముఁ గన్గొనుచుఁబలికె.

ఇప్పద్యమందలి యివటూరిశంభుఁడు మతగురువును-

ఉ. శ్రీనుయవాగ్విలాసుఁడు నశేషలిపిప్రవణుండు భూరిశో
భామహనీయమూర్తియుఁ బ్రబంధనిబంధనబంధురక్రియా
భామహతుల్యసూత్రుఁడు నృపాలకపూజ్యుఁడు నంచుఁ దక్జనుల్
వేమఱు నెంచ దిట్టకవి వేంకటరాయకవీంద్రుఁ డొప్పుగన్.

చ. అతనికృపాకటాక్షవిభవాతిశయం బనిశంబుగల్గ నే
నతులకవిత్వతత్త్వమహిమాఢ్యతఁ బ్రౌఢిమఁగంటిఁ గావునం
గృతమతిచేఁ బ్రబంధ మొనరించు తలంపును స్వప్నమున్ సమం
చితగతి నమ్మహాత్మునకుఁ జేతులుమోడ్చుచు విన్నవించితిన్.

అనుపద్యముంబట్టి యీ వేంకటరాయకవి విద్యాగురువు నని తెలియ వచ్చును. ఇంతకంటె నీతనివంశాదికము వివరముగాఁ దెలియదు. సుకవిస్తోత్రము కుకవినింద స్వప్నము నిందును గలవు.

ప్రారంభము.

ఉ. శ్రీనగకన్య ముత్యములచేఁ దలఁబ్రా లిడువేళ శీర్షగం
గానదిఁ జిందు బిందువులక్రందున సర్వసుపర్వకోటి ను
ర్వీనుతవైభవంబునఁ బవిత్రితగాత్రులఁజేయు శంభుఁ డా
శ్రీనగరాజమందిరుఁ డశేషశుభంబులు మాకు నీవుతన్.

మ. గరిమం గౌస్తుభరత్నబింబిత నిజాంగస్ఫూర్తి వేఱొక్కసుం
దరియంచున్ సిరి యెంచునత్తఱి నితాంతప్రీతి సంధిల్ల న
య్యురుభూషామణిఁ దత్కుచాగ్రమున నాయోజించి కేళీకళా
స్ఫురణన్ రంజిలఁజేయు శౌరి దయఁ బ్రోచు న్మమ్ము నెల్లప్పుడున్.

చ. సురరమణీమణీచికురచుంబితపాదసరోజ మారఘు
స్మరనిరవద్యవామతనుసౌధనివాసిని యోగిలోకహృ
త్సరసిరుహభ్రమద్భ్రమరి సర్వజగజ్జనయిత్రి సీత భూ
ధరవరపుత్రి నిత్యశుభదాత్రి ననుం గృతకృత్యుఁ జేయుతన్.

..........................................................................

గీ. అనుచు నిష్టదేవతాదిను సత్కవి, వందనంబుఁ గుకవినిందనంబుఁ
జేసి తెనుఁగుబాస భాసురమగుగతి, కబ్బమెలమిఁ జేయఁగా దలంచి.
గీ. స్కాందమునఁదగు నేఁబదిఖండములను, ధరణిధరములఁ గనకభూధరముకరణి
మేటియై ధర్మఖండంబుమిగులనలరు, నదియునానేర్పురీతిఁ జెప్పెదముదమున.

ఇట్లనుకొనుచుండఁగా స్వప్నములో నమృతలింగమూర్తి యీశ్వరుఁడు
సాక్షాత్కరించి తనకాకృతి నిమ్మని కోరి పుచ్చుకొన్నాఁడు.

ఈప్రతిలో మిగిలిన పత్రములలోఁ దొమ్మిదియాశ్వాసములు మాత్రము
కలవు. తొమ్మిదవది పూర్తిగాలేదు. రామాయణకథలో నాగపాశములపిమ్మట.

క. సురవరులు నసురయోధులు, హరిపీసులు గనఁగ రాఘవానుజుఁ డస్త్రై
శరవృష్టిన్ ముంచిన న, య్యురుభుజుఁ డజశరము వింటయోజించి వెసన్.
గీ. అనఘుఁ డీరాముఁడు పరాత్ముఁ డయ్యె- అనునింతవఱకెకలదు.

ఈకవి యింతకుమున్ను శృంగారమంజరి యనుకావ్యమును రచించియు
న్నట్లు వంశవర్ణనము పద్యమునంబట్టి తెలిసికొంటిమి.

—— కవిత్వశైలికై కొన్నిపద్యములు ——

క. అడిగెడుధనికులు గడులే,వడి మాకని యతిథిఁ దిట్టి స్వల్ప మొసఁగి యా
కడఁ బశ్చాత్తాపితు లగు, జడమతులకు నల్పసుఖము సమకూరుఁ దుదన్.
గీ. ఏలరానిచ్చి తని ద్వారపాలుఁ గినిసి, యతిథి గడనిడి కడువడి నారగింప
కిష్టమృష్టాన్న పానీయతృప్తుఁ జేయ, వలయు నైశ్వర్యకాములై వఱలువారు.
శా. ఆతం డధ్వరకర్మ కర్తలకుఁ దా నార్త్విజ్యముం జేయుచున్
శ్రౌతస్మార్తవిధిజ్ఞుఁడై నిఖిలదేశస్తుత్య సద్విద్యుఁడై
భూతాఘుండు వినిర్జితేంద్రియుఁడు సంతుష్టాంతరంగుండు నై
ఖ్యాతి న్సర్వమహీసుపర్వ నృపలోకాచార్యుఁడై వర్తిలున్.
ఉ. ఇష్టముఁ బూర్తముల్ వ్రతము లిద్ధతపంబుసు దీర్థయాత్రలు
త్కృష్టపరోపకారములు నిమ్ముగఁ జేసినవాఁ డగు న్నిజా

దృష్టతఁ గాశి కేగి నిటలేక్షణు నీశ్వరు విశ్వనాథు భ
క్తేష్టదుఁ జంద్రశేఖరు మహేశ్వరుఁ జూచినవాఁడు పోఁడిమిన్.
శ. శంభుద్వేషులు దోషదూషితులు హింసాతత్పరుల్ క్రోధులున్
శుంభత్కర్మవిదూరులు న్బుధజనస్తోమక్రియాదూషణా
రంభగ్రస్తులు నైనభక్తులు సురేంద్రా తామసుల్ విష్ణుఁ డా
దంభాచారుల దుష్కుమారులఁ బలెం దాఁ గన్గొనన్ నిష్కృపన్.

వ్రాఁతతప్పులు మెండుగాఁ గలవు. ప్రతి మంచిస్థితిలో నున్నది.

28. గోపాలవిలాసము—గ్రం. సం. 135.

ఇది యొక్క యక్షగానము. దీనికిఁ గాళింగచరిత్ర మను నామాంతరము గలదు. ౫౧ పత్రముల పుస్తకము. ప్రారంభము :—

శా. శ్రీరామా విను నే నుతింతు మదిలో సీతామనోనాయకా
ఘోరాకార మదారిదైత్యహరణా కోట్యర్కతేజోమయా
నీరేజాసనసేవితాంఘ్రికమలా నీవాఁడ నన్నేలు మీ
కారుణ్యాకర రాఘువాన్వయమణీ కాకుత్స్థవంశాగ్రణీ.

వ. ఇట్లు కృతీశ్వరుండైన రామస్వామిని వినుతించి హరిహరబ్రహ్మాదుల నేమని కొనియాడుచున్నాఁడు.

త్రిపుట—సిరికిఁ జెప్పక యటికి మకరిని నటికివేగమె దరికి నీడ్చుకఁ గరికి
నభయం బొసఁగు శ్రీనరహరికి శరణు॥

మట్టిరథమఁట గట్టువిల్లఁట జంటనాలుకదంట నారఁట కంటిమంటల
మరునిగెల్చిన ఘనునిఁ గొలుతున్॥

తమ్మిఁ బుట్టినదాత తానై క్రమ్మి లోకములెల్ల నేలిన। బొమ్మదేవరపద
ములెన్నుదు నెమ్మిమీఱన్.

వ. ఇందిరా గౌరీ వాణీ మహాదేవుల నేమని సన్నుతించుచున్నాఁడు..........

ఇట్లు సకలదేవతాప్రార్థనంబును సుకవులకు వందనంబు నాచరించి శ్రీమన్మహాభాగవతంబున దశమస్కంధంబునందు శ్రీకృష్ణలీలలు వర్ణన సేయం దలంచి యున్న నొక్కనాఁడు.

సీ. నిగమగోచరుఁ డైననీలాద్రినిలయుండు విప్రవేషముదాల్చి వేడ్కతోను
నొకచేత బెత్తము నుత్తరీయంబును ముసిముసినగవుతో మోదమునను

మధ్యాహ్నవేళను మందిరంబున కొచ్చి దాహముదెస్సుచుఁ దరువులివచు
మాధవు చరితలు మఱచినాఁడవునీవు రచియింపుమీ చాల రమ్యమౌను
వినుము మాటల్లు లన్నియు వీనులలరఁ, గనుము మోక్షము శ్రీహరికథలవలన
మనుము సుజ్ఞానివై చాల మన్ననఱది, మనసుర జిల నిట్లనె మహిసురుండు
క నడవడి గలిగిన యప్పుడె, పడయఁగవలె విష్ణుభక్తి పదిఁబుఁడవైతే
వినువక కృష్ణునిచరితలు, కనువేడుక వెన్నముద్దగణపతిపెద్దా.

వ. అనుచు నానతిచ్చి యదృశ్యుండైనఁ బరమేశ్వరుండని నిశ్చయించి చూచి యేఁగూర్చుండి భాగవతార్థంబున దశమస్కంధంబున నేను రచియింపబూనిన గోపాలవిలాసంబను యక్షగానంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన నెటువలెను.

సీ. అభిమన్యుపుత్త్రుండు హస్తంబుతోడను శుకయోగరాయని జూచిపలికె...

ఈపైవాక్యమువలనఁ గవియభిప్రాయము తేటపడినది. కథాసందర్భమును దెలిసినది. "కనువేడుక వెన్నముద్ద గణపతిపెద్దా" యను మాటలోఁ గవి గణపతి కొడుకుపెద్దన కవియేమో యని యోజింపవలయును. ఇంతకంటె నాతనివిషయము తెలియరాలేదు. కథాభాగములోని కొన్నివాక్యములు:—

త్రిపుట- బింకమున గాల్ద్రవ్వి అంకెలు పెల్లుగా మ్రోయించు వృషభము వంకఁజూచిన యపుడె గ్రక్కున తెంకిద్రోపెఁ...

జిఱ్ఱుజిఱ్ఱున నఱ్ఱులెత్తుక గుఱ్ఱములవలె దుమికి కోడెలు నఱ్ఱుకొఱ్ఱులు నడిచెఁ గదుపులనడుమ నపుడు......

వ. అట్టికదుపులముందలు కుమర్చుకొని పాలు పిండుచు నీళ్ళు...దినదినంబును వింతలు గులుకుచు నావులమేఁపుచున్న రామకృష్ణులు ప్రలంబతృణావర్తబకధేనుకర్కరి మొదలైనరాక్షసుల...

జంపె. ఓదేవమీయాజ్ఞ నుల్లంబురఁజిల్లె నావిన్నపంబొకటి నలినాక్షువినుము।
వాడుచే గరుడుండు వైరంబు మదినుంచి భేదించునను జాల భీతిఁజెందెదను.

వ. అనినఁ గృష్ణుం డేమనుచున్నాఁడు.

జంపె. మాపాదములు నీదుమస్తకంబున నిలిచె నాపక్షిరాజు నిన్నలయింపఁ డిఁకను.

చిట్టచివర మంగళహారతియు వ్రాలాశ్వభ్రలుపద్యమును గలవు.

చిత్రభానునామసంవత్సర కార్తిక శు ౯ శనివారము కార్తికి నెల ౧౦ తేదివఱకు వ్రాసిన కాళింగచరిత్ర గరటయ సెట్టికి ముత్తరాజు కృష్ణయ్య వ్రాసి

యిచ్చినది. మొదటి యొత్తుపుటమీఁద "విఠోబా కాళింగచరిత్ర యెత్తినవారు చదివి యిచ్చేది. యిద్యుకపోతే కొట్లో వేళి కోటు శెలుపుతో తీశియిచ్చేది. అని యున్నది. ఈవిఠోబా యెవ్వరో తెలియదు. దక్షిణదేశప్రతి- పుదుకోట వేంకటేశయ్యగారిచ్చినది.

(29) రామశతకము- గ్రం. సం. 136.

ఇది యొక కందపద్యశతకము. కాని యిరువదియొక్క పద్యములు మాత్రము గలవు. కవిపేరు తెలియదు- నైచ్యానుసంధానప్రకరణము, నిష్ఠురోక్తిప్రకరణము, అంతఃకరణదోషనివేదనప్రకరణము, చిత్తశుద్ధిప్రార్థనాప్రకరణము, నవిప్రకరణము నని కైదేసిపద్యములు వ్రాయఁబడినవి. కొన్నిపద్యములు-

శ్రీరమణా నీచరితము, ఘోరము లగుపాపములను గొట్టుటచేతన్
సారతమ మైననామము, తారకమని తలఁతు మదిలో దయగలరామా.

సరసుఁడ నీనామముచే, స్థిరముగ వేడంగఁజేయు దీనశరణ్యా
కరతలుఁడు గావె భక్తుల, మఱవక ననుగావు సుగుణ మతిగలరామా.

తామసగుణంబుచేతనె, పామరుఁడుగఁ దిరిగినాను పరమాత్మక నీ
ప్రేమను గలిగెడి యతులిత, నామసుధం గ్రోలఁజేయు నరవరరామా.

ఇదియును బై వేంకటేశయ్యగారిచ్చినదే.

(30) పాండవాశ్వమేధవృత్తాంతము- గ్రం. సం. 138.

జైమినిభారతము- అశ్వమేధపర్వము కథ- వచనము. మొదటి ౧౫ పత్రములు లేవు. మొదటిది యమునాసురునికథ, రెండవది నీలధ్వజునియుద్ధము. మూఁడవది యమృతధ్వజునికథ- ఇతనికుమారుఁడు సుధర్ముని కథ, నాలుగవది సురథునికథ, ఈసురథుఁడు సుధర్మునితమ్ముఁడు, అయిదవది వరాహదేశకథ, ఆఱవది బృహల్లీలకథ, ఈబృహల్లీలస్త్రీ- ఏడవది బభ్రువాహనునికథ. ఏడు భాగములు. ౨౩౭ పత్రములు. భాష వ్యావహారికభాష. దానికిఁదోడు వ్రాఁత తప్పులు. కవిపేరు తెలియుట కాధారము లిందేమియుఁ గనఁబడవు. అఱవము చదివిన దక్షిణాదితెలుఁగువారు వ్రాసినది. ఉన్నదున్నట్లు వరాహదేశకథలోని కొంతచిత్తగింపుఁడు.

"అటుపిమ్మట అశ్వం సంరక్షణశాయవచ్చిన అర్జునుడు అమృతధ్వజ రాజును చుట్టంచేసుకొని సకలమైనరథగజతురగపదాదులతోకూడా అర్జునుడు రథారూఢుడై అశ్వం వెనకపాశ్వముగా నడిచి దేశం దాటి అవతల పొయ్యే

టప్పుడు అనేకమైనవాళ్లుఁ వచ్చి నోరుతెరచుకొని చూచి అష్టాదశవాద్య ఘోషముల శబ్దములు విని భయపడి కిరీటిదండును జూచి భ్రమశి పరుగెత్తిరి. దండు రెండామడదూరం అవతలనడిచి పొయ్యేటప్పుడు అక్కడ వకదండకార ణ్యావనం కనిపించును. అందుకు అవతల దక్షిణముగా నడిచి పశ్చిమ దిక్కుగా పొయ్యేటప్పుడు వరాహదేశ మని వకదేశం ఆదేశం యొక్క వర్తమానం యేలాగంటేను అందులో వుండే మొగవాండ్లు ఆడవాండ్లు నిర్మాణముగా వృక్షశాఖలులో గెబ్బలమువల వేలాడుకొని వుండేదిన్ని పగులు ముప్పైన్ని వృక్షములమీద తొత్తుకొని వుండేదిన్ని ఆ స్తమానమునకు సంచారములు చేశేదిన్ని ... ... ... అర్జునుడు అమృతధ్వజరాజును అడుగగా వినవయ్యా కిరీటిమహారాజా తెలుస్తున్నదే ఆపట్నం బ్రహ్మదేశం ఆదేశములో నాల్గు విధములు గల్గినకొమ్ములు వుండే మనుష్యులు వుందురు. అనిపల్కరించగా అశ్వం ఆపట్నం సమీపమున పొయ్యేటప్పుడు రణభేరి శబ్దం విని అందులో వుండేజనులు బయలుదేరి వాళ్ళకు వొకరికి వొకకొమ్ము వొకరికి రెండుకొమ్ములు వొకరికి మూడుకొమ్ములు ... ... వాల్లుఁ వెయి రెండువేలు మూడువేలు యీప్రకారంగా వచ్చి దూరముగా నిల్చి చెతులుకట్టుకొని కొమ్ములచాత పొడిచేభావముగా కొమ్ములు ఆడించుకొని నిల్చివుండగా అర్జునునిదండు జూచి భయపడి ... ... ... ...

బృహల్లీలలోని కొన్ని వాక్యములు:—"వినవయ్యా కిరీటిమహారాజా యీఅశ్వంపొయ్యేది మదనమండలదేశమని వొకదేశం ఆదేశం యెలెటటువంటిది బృహల్లీలయనె ఆడది- ఆదేశములో ఆడవాండ్లువినాగ మొగవాండ్లు మందుకుకూడా తగలదు. అటువంటి బృహల్లీల తపస్సుజేశి సర్వాస్త్రఘాతి అని అస్త్రము పరమేశ్వరుని దగ్గరతీసుకొని వచ్చింది. కాబట్టి యీఉత్తరకురుక్షేత్రములో వుండతగ్గ రాజాధిరాజులు దేశాధిపతు లంధరున్ను బ్రహ్మరుద్రాదులున్ను నేటివఱకున్ను దానిం జయించింది లేదని అమృతధ్వజుడు చెప్పగా— అర్జునుడు విని పరమేశ్వరుడు మహావంచనజేశిరి నేను పోయి అడిగినందుకు పాశుపతాస్త్రము ఇచ్చను నాకు ఆ అస్త్రము యియ్యరాదా ... ..."
ఆంధ్రజైమినిభారతములో- సురథుఁ డనిన- దీనసురుతుఁడని, ప్రమీలకే కావచ్చును- బృహల్లీలయని- వృక్షదేశమునకు వరాహదేశమని యుండుట కథల భేదముచే నటవగ్రంథ మొక్కటి యున్నదేమోయని తలంపుగలుగుచున్నది.

(31) శ్రీపతీయమ్. సవ్యాఖ్యానమ్ గ్రం. సం. 143.

శ్లో॥ జగదుదయస్థితిసంహృతికారణ మవికారి సచ్చిదానందమ్।
శ్రీమంతం కృష్ణాఖ్యం తేజో మే హృది సదా స్ఫురతు॥
ఆచార్య శ్రీపతికృతా జాతకర్మాఖ్యపద్ధతిః।
వ్యాఖ్యాయతేమ..................దేవేనయజ్వనా॥
పశ్యంతు త మిమం గ్రథం శాస్త్రన్యాయోపబృంహితమ్
పూర్ణం జాతకశాస్త్రాణా మలంకారం విపశ్చితః॥

శ్రీపతి రాచార్యో భీష్టదేవతానమస్కారపూర్వకం ధాతిక.........
త్యాఖ్యం గ్రథకరణం శ్లోకేన ప్రతిజానీతే। నత్వేతి॥

శ్లో॥ నత్వా తాం గురు దేవతాం త్రిసమయజ్ఞానోద్గతేః కారణం
తత్పాదాంబురుహప్రసాదవికసద్బోధో బుధః శ్రీపతిః
శిష్యప్రార్థనయా విచార్య సకలాన్ హోరాగమార్థాన్ బహూన్
వక్ష్యే జాతకకర్మపద్ధతి మహం హోరావిదాం ప్రీతయే॥

నత్వేతి జాతకర్మపద్ధత్యాఖ్యం గ్రంథం జాతకజ్ఞానాం ప్రీత్యర్థం కరిష్యామి॥ అత్రజాతకశబ్దేన యవన బాదరాయణ విష్ణుగుప్త వరాహమిహి రాదికృతాని జాతక శాస్త్రాణ్యుచ్యంతె। తైరుపాదీయమాన భావాద్యానయనోక్తం గణితకర్మ జాతకర్మ తస్యపద్ధతిః తదపేక్షిత గణితకర్మానుపూర్వప్రతిపాదకో గ్రంథో జాతకర్మపద్ధతి రిత్యన్వర్థా సంజ్ఞా......

జాతస్యాయుర్దశావిపాకాది తనుపయోగాని యాని జ్ఞాతవ్యాని తాని ద్వితీయేనశ్లోకే నానుక్రామతి.

శ్లో॥ క్షేమోత్ర ప్రథమాహి జన్మసమయచ్ఛాయాదియంత్రై స్ఫుటం
తత్కాలప్రభవావిలగ్నసహితాం కార్యాస్తతశ్చ గ్రహాః
సిద్ధాంతోక్తపరిస్ఫుటోపకరణైస్తైచాసకృత్కర్మణా
భావాః ఖేటదృశో బలానిచతతః తేషాం విచింత్యానిషట్॥

ఇత్యాదిగా ౫౫ పత్రములు గలప్రాంతపుస్తకము దక్షిణదేశప్రతి. వ్యాఖ్యాతపేరు తెలియుటకాధారము లేకుండ మొదటం గొన్నిపంక్తులు పోయినవి.

(32) లీలావతీదండకము- గ్రంథసంఖ్య 151.

ఈదండకమును శేషయార్యుండు రచించెను. కచ్చిరంగరాజదండకము చంద్రావనాదండకాములు చదివినవారికిదిచదివిన దండకములు పూర్వకాల

మునవారు రచించు ప్రణాళిక బోధపడఁగలదు. ఇందును రాజువర్ణన లేవఁగనే యద్దముఁజూచుట, తర్వాత సాముచేయుట, స్నానముచేసి భోజనానంతరము సభలోఁ గూర్చుండి కొంతసేపైనపిమ్మట గుఱ్ఱమెక్కి బైలుదేఱుట, వీథిలో నొక్కతె చూచి రాజును మోహించుట, దానివిరహము నిత్యాది- ఈదండకములోఁగూడ రాజుపేరు మొదటవ్రాసి పిమ్మట నాయాతావుల దుడిచివైచి రామస్వామిక్షితీంద్రుండు, ఆనందపృథ్వీంద్రపుత్రుండు, అని సవరించినాఁడు, కారణము తెలియదు. పలుతావుల దిద్దుబాట్లు జాగ్రత్తగాఁ బరిశీలించి వెలికిఁ దీయఁగా "శ్రీమానకరాజాన్వయాంభోధి సంపూర్ణచంద్రా" యని యొక్కచోటను. "శ్రీవేంకట పెరుమాళ్ళరాజుభూనాయకుం" డనియొక్కచోటను దోఁచినవి. ఇందలి రామస్వామిక్షితీశుఁ డెవ్వరోగాని దండకాంతమునఁ గ్రొత్తగా నీతనిపైఁ జెప్పఁబడిన పద్యములు చేర్పఁబడినవి. అవి పిమ్మటఁ గనఁబఱుపఁబడును. ఈ దండకకవిత్వము పటుత్వము గలది.

శ్రీజానకీమంజులాస్యోద్యదానందసంజాతమందస్మిత శ్రీనిదానీకృతాత్మీయనర్మోక్తి లీలావహద్దివ్యతేజః పదద్వంద్వసేవాధురీణుండు......వారాశికన్యామణీ నృత్తరంగాయితాపాంగవీక్షాకృతైశ్వర్య సంతోషితార్యాతిచాతుర్య ధుర్యానివార్యత్వస్ఫురత్సాహితీమార్గసంశోభితాత్మీయకీర్తి ప్రభావుండు...("భాస్వచ్చిదానందచిత్తాంబుజానంద పృథ్వీంద్ర") ఇంతవఱకు గ్రొత్తగాఁ జేర్పఁబడినది- పుత్రుండు, శ్రీరామస్వామిక్షితీంద్రుండు......తానొక్కనాఁ డక్కజంబైన రంగారు బంగారు మేలద్దపు న్మేడలో నంబుజాక్షీవికాసస్ఫురద్గంధసంబంధి మందానిలాంకూరముల్వీవ......నిద్రమేల్కాంచి కాంచీకనత్కింకిణీకంకణంబుల్ క్వణింపంగ నచ్చెంగట న్నిల్చి.....చీనాపనీహార్యులన్నిగ్గులన్ ముద్దులంగుల్కు మేలద్దముల్ ముందట న్నిల్ప...నించువిల్కానివారించుచందంబుతో దంతపుం బల్కపావాలొయారంబుగా మెట్టి......కెంబట్టుదట్టి న్సొలంగట్టి- బస్కీలు గర్తాపురాల్ కొంతసాధించి జోడీలునున్ సంగడాల్ లోడులం దీసి గోతాము పైకెత్తికొన్నానులాసించి...ప్రొద్దైనఁ బొంజెట్టితో మల్లుపోరాడి...పట్టాను చిల్లోడి కేడెంబునున్ బానిమాష్టీలితోఁ జేరభంగాయమానంబులౌ కాయమానమ్ములం జేసి తత్తాహ తద్ధిక్కు తద్ధెయ్య తద్ధిమ్మి తజ్జంత తక్కిణ్ణ తద్ధోం తహోయంచు...నటుండాడు బోటిం దగందిద్దుచందాన బారెంట మూరెంట జేనెంట దుత్తెంట బెత్తెంట వేద్రిప్పుచో మేలుమాజ్ఞావహా భలా చాంగు డాడా యటం

చుం గడుం బ్రీతిఁ దారంగికు లెచ్చ వాహ్యాళిగా వచ్చు నవ్వేడుకన్ దక్కు గుల్కం బదార్వన్నెబంగారపున్నేసలన్ ఘుమ్మఘుమ్మంచు నెత్తావులంగుల్కు నక్కల్వపూచప్రపు న్నీడల న్వ్యాన్నెలల్ బోలు చిర్నవ్వు చెక్కిళ్లపైం గుల్కు నెమ్మేను శృంగారముల్ చిల్క...బిల్చుండి కన్నుందువై చూచు నప్పౌరవారాం గనాకోటిలో మేటినెత్తావికిం బేటి పూవిల్తుమేల్బొన్న పూఁబోండ్లకున్నిన్న... (ఒక్కతెప్రార్థింపఁగా) లాలించి తేలించి మెప్పించుచున్...సుఖానన్ చిరంజీవిగా వేశ్యనున్నాఁడటంచున్ జగద్గీతచర్యాతివిస్తారుపేరన్ గుణాధారుపేరన్ సంపన్నిదానీకృతాక్షయ్యపద్మాక్షసేవాధురీణోల్లసన్మాన సాంభోజుపేరం గలాంభోజుపేరన్.........కవీంద్రు ల్నుతింపంగ నుద్దండవిద్వత్కవిత్వాంకుఁడైనట్టి శ్రీశేషయార్యుండు కైసేయఁ శృంగారిణీదండకం బుర్వి నాచంద్రతారార్కమై వర్ధిలుంగాత !”—

దండకముపేరు మొదట లీలావతీదండకమని యొత్తుపత్రము మీఁదనున్నది దండకము చివర శృంగారిణీదండక మని చెప్పఁబడినది. ఈకవి కుద్దాముఁ డని బిరుదముగలదఁట. ఈదండకమంతయు ౧౩ పత్రములలోఁ గలదు.

ఈదండకము తరువాయిని విశేషముగా ననేకులు రాజులపేర నంకితములైన చాటుపద్యములు గలవు.

(1) పైరామస్వామినృపునిమీఁది పద్యములు.

శా. శ్రీరంజిల్లఁగఁ బ్రాణభర్తయొకఁ డోఁచె స్వానురాగోదయం
ఛాయాఢ్యం దనలోన నిండి వెలికిం బైఁబర్వెనా నాఁగరం
గారుణ్ లేఁదొగరొప్పు మేనుగల శ్రీకాంతాంబుజాతాక్షిగం
భీరుండై తగు రామసామినృపునిం బ్రీతిం గృపం బ్రోవుతన్. ౧

మ. ధరలో నాజికుమారవృత్తి విబుధత్రాణోత్సుకస్ఫూర్తి శం
కరధర్మాహృతసారరక్తి సుమనఃకాంతాత్మవిఖ్యాతిచే
వరల న్నీవలరామమూర్తివె యనన్వర్ధిల్లి తౌరార మేల్
స్మరసౌందర్యనిదాన దానఖని రామస్వామి భూపాగ్రణీ. ౨

శా. నీమాన్యం గటికేవి ? గనినంతే యాహిరణ్యోదరుం
డేమో యాహరినాభిగహ్వరము నందేదాఁగె నంతన్ హరిన్
ధామాంచద్భవదేకభక్తిదహరాంతర్లీనుఁ డైనిల్చె శ్రీ
రామస్వామి నృపాలచంద్ర యిది చిత్రం బయ్యెడిం దెల్పుమా. 3

కొన్ని పత్రములు విఱిగిపోయినవి. అందుఁ బెక్కుసీసములు విమలగుణ హార యానందవిభుకుమార, సరసవాగ్ధార శ్రీరామస్వామిధీర? అని యేమో కలవు నిండుపద్యములు వ్రాయవలను లేదు. ఇట్టివి ౨౦ పద్యములున్నవి.

(2) అళుఘురిచామధీరునిపై పద్యములు-

సీ. శ్రీనారాసింహరాజీవాక్షుపదభక్తి భూమిసత్కవులను బ్రోచుశక్తి
సకలవిద్యలయందు సంతతం బనురక్తి నీతిధర్మములందు నిండుయుక్తి
కలిదోషవిజయవిఖ్యాతియం దాసక్తి శిష్టులయం దెల్ల శీతలోక్తి
తరుణులయందుఁ గందర్పకాభివ్యక్తి యిష్టులతోఁ గూడి యెపుడు భుక్తి
యొసఁగ వెలసితి వౌదార యింపుమీఱ, నంగజాకార కల్పద్రుమావతార
భళిర శ్రీలండకదిరి భూవరకుమార, సంగరకుమార యళుగరిచామధీర. ౧

సీ. చక్కెరపొంగలే సమరాన నెదిరించు మదవద్విరోధులమాంసరాశి
కమ్మనికూరలా కక్కసంపుతుటారి కుటిలవిద్వేషులగుండె లెల్లఁ
దాళిఫలమ్ములా దంటగొంటరి వీరమాన్ట్రీల కుండలమస్తకములు
కజ్జాయరాసులా గడెమసేదారుల మేరుఁగ్రొవ్వులు మెదడుమండఁ
బానకంబా రణాంగణవైరిభటుల, రాశిగావించు శిరముల రక్తధార
ధరను నీకత్తి యనెడు బేతాళునికిని, సంగరకుమార యళుగరిచామధీర.

ఇట్టివి ౧౬ పద్యము లున్నవి. నకుమ మూఁడాకు లిందు లేవని వ్రాసినారు. తొమ్మిదవ పద్యమునుండి ౧౩ పద్యమువఱకు దానిలోఁ బోయినవి.

రఘునాథరాజు మీఁది పద్యములునుగలవు. ఈపద్యములమకుటము కలితగుణపేటి కవికోటికల్పవాటి రమ్యవాగ్ధాటి రఘునాథరాట్కిరీటి॥ కచ్చియచ్యుతభూపాలుఘనకుమార వినుతకవిచంద్రరఘునాథమేదినీంద్ర॥ మొ।

కొన్ని పద్యములు పూర్ణముగా లేవు.

మ. స్థిరలో యళ్గరిచామభూమిపతి హేఁ నీవు ఘోరాజిరం
బరరాజన్యముఖాబ్జబింబములు తేఁ గంటిసే యంగ భా
స్కరబింబంబును జంద్రబింబము వియత్కంజాతపత్రేక్షణా
ధరబింబంబును గంటిమై చెలఁగెఁ జిత్రం బేకవాక్యోన్నతిన్.

(3) చంద్రశేఖరనృపాలునిపై పద్యము.

శా. శృంగారాస్పదమైన సత్కరుణచే శ్రీరంగనాథుండు మా
తంగోత్తుంగతురంగముఖ్యబహుళార్థశ్రేణి నీకిచ్చెనా

గాంగయోపమ నీతిశౌర్యయుత వేఙ్కటగచ్చిసద్వంశజా
రంగాధీశ్వరుచంద్రశేఖరనృపాలా పాలితార్థివ్రజా.

ఈప్రాసములో మూఁడునాల్గు చరణాలు మకుటముగాఁ గొన్నిపద్యములున్నవి.

ఉ. తెల్లమిగాఁగ ధీమనుమఁ దేజినిమీటి పిరంగికత్తిచేఁ
బెల్లునఁ దాఁకి శాత్రవుల పిక్కలు డొక్కలు జెక్కులక్కులుం
జిల్లులు చేసి వేసితివి చెంగటిరాజులు మేలుమేలనన్
వల్లపమున్దురంగనరనాయకచంద్ర సురేంద్రవైభవా.

ఇట్టిమకుటముతో ౧౫ పద్యములున్నవి.

మ. దినమధ్యోద్భటసూర్యశౌర్యగుణసద్రీచీనసంభూతిచే
తను శత్రుక్షితిపాలజాలముల సందున్ సందులన్ గొందులం
దున ఘూకావళిచొప్పున న్నిలిపి తోడ్తో మేలుగన్నావహా
విను సర్వేశ్వరవిశ్వనాథ సుకృతీ విస్తారవాగ్గిస్ఫుతీ.

ఇట్టిపద్యములుకొన్నిగలవు.

చ. వరవిజయాభిరామ శుభవైభవవిక్రమవిక్రమార్క నీ
గురుతరకీర్తికాంతకుచకుంభముల న్విలసిల్లుస్వర్ణపు
న్వరమణిహారజాలముల నైపుణభాసిలె నబ్జజాండముల్
స్థిర మనుబ్రోలురంగఘనతిమ్మనృపాల కృపారసోజ్జ్వలా

ఉ. దానదయాస్వయాపబలధర్మపరాక్రమ చాపనైపుణిన్
ధీనిధిరంగరాజఘనతిమ్మనృపాలుఁడు పోలుఁ జాన్రున్
వానిమఱంది వానిసుతు వానిపితృవ్యుని వానిబావనున్
వానసుజన్ము వానరుజు వైఖరిమీఱఁగ ధారుణీస్థలిన్.

ఇట్టివి పెక్కుపద్యములున్నవి.

చ. ఘటనమొనర్చి స్వామిహితకార్యముతప్పక నిర్వహించి వి
స్ఫుటముగఁ గీర్తిఁగాంచె మును పొందుగ మంత్రియుగంధరుఁడు ది
క్తటముల వానిచందమునఁ గంటివి కీర్తిని పత్తికొండవేం
కటపతిరుప్పయప్రభుశిఖామణి దానకళామరున్మణీ.

ఈప్రాసముపైఁ గొన్ని పద్యములున్నవి.

సీ. పదచాళి వినిపించు వైభవస్ఫురణకుఁ గొమరొందు ముత్తేలకుచ్చుచెల్లు
జక్కిణివినిపించు చాతుర్యమహిమకు రంజిల్లు వింజామరములు చెల్లు
తాళవిన్యాసభేదమున నాట్యానకుఁ దులలేని బిరుదుకాహాళలు చెల్లు
అభినయం బొనరించు నతిశయప్రౌఢికి నిరతంబు డవిణెమల్హారులు చెల్లు
ననుచు నేకోజిభూపాలుఁ డనుదినంబు, మెచ్చి ముత్తేలకుచ్చు నీకిచ్చుసభను
గలితగుణపేటి యాశ్రితకల్పవాటి, భావజునిఘోటి ముద్దుమంగావధూటి.

సీ. శివునికంధరముపై శేషునిశిరముపై జలజారియురముపైఁ జఱచిచఱచి
భారతివేణిపై బలునికృపాణిపై నారదువీణపైఁ దూఱితూఱి
తారాద్రితరులపైఁ దార్క్ష్యునిగరులపై వలిమలచరులపై వ్రాలివ్రాలి
నరసింహునక్కుపై నందిబల్మొక్కుపై గజపతిచెక్కుపైఁ గవిసికవిసి
చెలఁగె జగములఁ దావకోజ్జ్వలితయశము, హారహీరపటీరడిండీరరుచుల
కచ్చియచ్యుతభూపాలుఘనకుమార, వినుతకవిచంద్ర రఘునాథమేదినీంద్ర.

సీ. మలయకేతన పాండ్యమధురాధినాథాగ్రసామంతనృపనీకు జయముజయము
కున్నమన్వయవార్ధికువలయినీనాథ సజ్జనావననీకు జయముజయము
మళ్వరాయాధిప మహనీయబిరుదాంక సంగరార్జుననీకు జయముజయము
అనుచుసత్త్రవిరాజులు వినుతిసేయ, విశ్వధాత్రీస్థలంబున వెలసితౌర......
తక్కినదిలేదు.

ఇట్టిపద్యములు కవిపేరు దెలియకుండ 25 గలవు. మఱియునైదుపత్త్రములలో నిల్లేమెవ్వరివో పేరుతెలియని సీసపద్యము లున్నవి.
ఇతఁడుసామాన్యుఁడే తిర్మలేంద్రుకోటి, విజయరఘునాథతొండమాన్విభుకిరీటి,
రాయబిరుదాంకరఘునాథరాణ్మృగాంక, యను మకుటములతోఁ గొన్నిపద్యము లున్నవి. కొన్నిమాలిక లున్నవి.

(33) దత్తాత్రేయశతకము. గ్రం. సం. 158.

ఈశతకము వేదాంతబోధకము. మూఁడవపద్యములో :—

క. పరమానందయతీంద్రుఁడఁ, బరమవివేకానుబంధభాగ్యోన్నతిచే
తరచించెదఁ గృతిఁ గైకొను, తరుజతికరుణావిధేయ దత్తాత్రేయా.

అని కవిపేరు పరమానందయతీంద్రుఁ డని తెల్పఁబడెను. శతకములో మొదటినుండి 47 పద్యములు మాత్రమే కలవు. కొన్నిపద్యములు —

1. శ్రీవిలసిత వరసంయమి, సేవితపాదారవింద చింతితఫలదా
కావుము నను నెల్లప్పుడు, దావరముగ గుణవిధేయ దత్తాత్రేయా.

2. శరణాగతవత్సల మిా, చరణాంబుజములకుఁ బద్యశతకం బిపుడే
కరమర్థి విన్నవించెద, ధరలోఁ గగుణావిధేయ దత్తాత్రేయా.

3. ఎఱిఁగించుకొన్న దెఱుఁగదు, యెఱిఁగెను నెఱుఁగించుకొదవె యెప్పటికిని నీ
యెఱుకకలవాఁడె ముక్తుఁడు, ధరలోపల గుణవిధేయ దత్తాత్రేయా.

8. తను లెందు తనకు లేకే, తగిలితి మని భ్రమసి కర్మతతిచే జీవుల్
మగుడ జనించుచు మాయం, దగిలిరయో మోసమాయె దత్తాత్రేయా.

9. పుట్టక మునుపును దానే, పుట్టిన పిమ్మటను దానె పొలిసిన వెనుకన్
గట్టిగఁ దానే నిజమున, దట్టంబగు మాయ పోయె దత్తాత్రేయా.

47. గురుశిష్యులనఁగ నిద్దఱి, గుఱుతులు చెడ్డపుడె ముక్తికుదురై నిలుచన్
గురుశిష్యభావ మెఱుఁగను, దరిమే సన్మానిగేయ దత్తాత్రేయా.

దత్తాత్రేయశతకములోని దని-

క. ఎంతదయో దాసులపైఁ, బంతంబున మకరి పట్టి బాధింపఁగ శ్రీ
కాంతుండు చక్రముంపెను, దంతావళరాజుఁ గాయ దత్తాత్రేయా.

అనుపద్యమును బల్లెటూరుబహులలో నోరవడికుదుర్చుటకై వ్రాయింతురు. పైశతకములో నిట్టిపద్యమునకుఁ దావుండునా? వేఱొకదత్తాత్రేయశతకములోనిదా :

42. కర్మము జన్మము కొఱకే, కర్మత్యాగంబు ముక్తి కైకొనుకొఱకే
మర్మ మిది తెలియ జనులకు, ధర్మమయా గుణవిధేయ దత్తాత్రేయా.

44. హంసగతివలన నజ్ఞుఁడు, సంసారై మగుడఁ జచ్చి జనియించు నయా
హంసగతినిలువఁ బ్రాజ్ఞో, త్తంసుండయ మానిగేయ దత్తాత్రేయా.

శతకముపూర్తిగా లేదు. ఈపుస్తకమునందుఁ గాంతాలలామశతకము, భాస్కరశతకము, ఆంజనేయదండకమును బలువితము లగుశృంగారాదిపద్యములును గలవు.

క. నలు గురు నినుఁ బలుమాఱును, గెలుతువు సుగుణోక్తి దీప్తికృత్యాకృతులన్
నలుగురు నినుఁబలుమాఱును, బళిబళియనఁ గచ్చిరంగ భాగ్యతరంగా.

క. చక్రివి దయచే నౌదార్యక్రమమునఁ గర్ణుఁడౌ పరాక్రమవక్రో
పక్రమణక్రమపరభీ, మక్రోధారాయతొండమూన్రఘునాథా.

క. నేఁటిదొఁ లెల్ల నీకును, సాటియ యూవిద్ధయుద్ధజాంఘాలికసం
ఘాటనిరాఘాటశర,ద్ఘోటకరాట్ప్రతతి రాజగోపాలపతీ.

క. వెలవను పోరా నాతో, సరసాలా రూకలీక జాణతనాలా
పొరుగింటిదాని కైతే, వరహాలా రామకృష్ణ వసుధాపాలా.

సీ. చౌకట్లు పోగులు సరిపణల్ తాళీలు గదలంగఁ దేజి నెక్కంగవచ్చు
ఉద్దాపరంగులు నిద్దంపు కేడెముల్ వెలయంగ వీథిని వెడలవచ్చు
పండుగ వేఁటలు పందెముల్ వేసుక చేకొద్ది తుంటలు సేయవచ్చు
పలమాంత్ర కేళికల్ వేడుకల్ చూచుచుఁ గోరమీసము దిద్దికొనఁగవచ్చు
గాక యందులకేమి సంగ్రామభూమిఁ, గక్కసపుబిరుదువజ్రీలఁ ద్రొక్కుటరుదు
కోటికులవర్యరణనిరాఘాటధైర్య, రాయబిరుదాంక రఘునాథరాణ్మృగాంక.

సీ. చలువచీరలుగట్టి కలుగుసొమ్ములువెట్టి నిలువుటద్దంబున నీడగాంతుఁ
బరిమళంబులుగూర్చి బాగాలపొడిచేర్చి నిగ్గైనతట్టలు నిండనింతు
రక్తిగాఁ గనిపింప రాగము ల్వినిపింప మేలైనవీణలు మేళవింతుఁ
దోడిమ పోవఁగ గిల్లి విడిపూలు వెదచల్లి యనువుగాఁ బానుపు నలవరింతు
నీవు వత్తు వటంచును భావముననుఁ, అవుర బాగాయెఁ గానీయ దతివమాయ
గూడ నీతోడ తోరణాగాళికూడ, కామినీమోహనాంగ గోకర్ణలింగ.

ఈగోకర్ణలింగ యనుమకుటము గలశృంగారపద్యములుపెక్కులున్నవి.

సీ. ఇది మనోహర కాంతి కింపైనబింబంబు బింబంబుగా దది బెడఁగుకెంపు
కెంపుగా దది కంటి కింపైనమంకెన మంకెన గా దది మంచిచిగురు
చిగురుగా దది మంచి జిగిహెచ్చు పగడంబు పగడంబు గా దది పానకంబు
పానకం బదిగాదు పలుచని చెఱకుపాల్ చెఱకుపా లవిగావు కుఱుచతేనె
కుఱుచతేనియ గాదదికుసుమరసము, కుసుమరసమునుగాదదిగొనబుజున్ను
జున్ను గాదది సవిగల్గు సుధల దీవి, సుధల దీవియుఁ గాదది సుదతిమోవి.

సీ. గోత్రామరేంద్రుల కొంగుబంగారుగా ధనములు వెసనిచ్చు దానకర్ణ
కవులదారిద్ర్యాంధకారంబు లణఁగింప తరుణార్కసీభువి (?) దానకర్ణ
నిరుపేదలను గన్న నిమిషమాత్రంబున దయను గటాక్షించు దానకర్ణ
పాత్రులంచని విన్న మాత్రాన నేవారి దైన్యము ల్మాన్చిన దానకర్ణ
నీసమానుల మహిలోన నేనుగాన, ఘనముగానొక భూరూపధన మొసంగి
ననుగరుణఁ జూడు మిప్పుడు నయసకలస, నాథ రాజావిజయరఘునాథరాయ
తొండమాన్ బహదరు ధరామండలేంద్ర.

పాపమీయర్థి యెవ్వరో, అడిగిన ట్లిచ్చినాఁడో లేదో.

(34) రామాయణవచనము. గ్రం. సం. 168.

శ్యామరాయకవి రచించిన వచనకావ్యము, అరణ్యకాండమునందలి 75 సర్గలకుఁ దెలుఁగు. కవింగూర్చి—

"...సాహిత్యవిద్యాగోష్ఠీప్రసంగంబున నాశ్వలాయనసూత్రుండును వాసిష్ఠగోత్రసంభవుండును కృష్ణయామాత్యపుత్త్రుండును షడ్దర్శనీపారంగతుండును లక్ష్మీపతినామధేయాగ్రజానుజుండును సంస్కృతాంధ్రభాషాకవితానిర్వాహక సకలవిద్యాపారంగతుండును అనగాను శ్యామరాయవిద్వత్కవి యగు నన్నుం బిలిపించి చతుశ్శాస్త్రపండితుండవు కవికులతిలకుండవు....కళావల్లభుండ వని కొనియాడి కర్పూరతాంబూలం బొసంగి" కృతిపతి యైనసుబ్బరాయసెట్టి పలికి నట్లున్నది. కావున కవివిషయము తెలిసినది. సుబ్బరాయసెట్టి యెవ్వరు?

శ్రీకాంతిమతీశాలివాటీశ్వరకరుణాకటాక్ష ప్రశమితసకలాంతరాయుండును సేతుహిమాచలమధ్యవర్తి విద్వత్కవినికరసంస్తూయమానుండును దక్షిణకాశీతటతామ్రపర్ణీతీరస్థిత నిరంతరసత్రాన్నదానసమ్మోదమాన భూసురాశీర్వాదసంప్రాప్త సమేధమానోత్తుంగశతాంగమాతంగ తురంగపదాతిసంగతనవరత్నవిరాజితమందిరుండును చతురుదధిముద్రితవిశ్వవిశ్వంభరావలయపరిపాలన రాజాధిరాజసన్మానితుండును సకలగుణగణాలంకృతుండును వాసవకన్యకావరప్రసాదశాశ్వతైశ్వర్యవిలాసుండును వైశ్యకులరత్నరత్నాకరుండు పరిసెట్ల గోత్రసంభవుండును తుమ్మలపాటి మన్నారుసెట్టిపౌత్త్రుండును మణప్పార వేంకటకామిసెట్టిపుత్త్రుండును నిజసుకృతవిశదీకృతమహనీయ పాతివ్రత్యాదిగుణకదంబ యగుకృష్ణమాంబావధూగర్భశుక్తిముక్తాఫలుండును......గురుమూర్తి సహోదరుండును...... శ్రీవిజయరంగచొక్కనాథమహీవరకరుణాకటాక్షవీక్షణపాత్రుండును వణిగగ్రణి యగు సుబ్బరాయవైశ్యధౌరేయుండు"

ఈశ్యామరాయకవి విజయరంగచొక్కనాథునికాలములోనివాఁడైయుండియు సుబ్బరాయసెట్టితో— "......శ్రీమద్రామాయణంబు వచనకావ్యంబుగాఁ జేయు మని పలికితివి నీవు కృతార్థుండ వైతివి. తొల్లి వాల్మీకియు రామాయణ మహాకావ్యంబు భాస్కరకవి పద్యకావ్యంబుగా రచనచేయించె రంగనాథకవి ద్విపదకావ్యంబు చేసె నితరులెవ్వరును వచనకావ్యంబుగా రచనచేయనిది నీవు నేను జేసినపుణ్యంబుగా నీపేర నంకితంబుగా రచనచేసెద నని"

(కవిపలికి)...నవరసాలంకారంబుగా చాతుర్వర్ణాశ్రమజనంబులు పఠియింపయో
గ్యంబుగా శ్రీమద్రామాయణంబు...చేయుంబూనినాఁడు. దీనింబట్టి యిప్పుడు
మనకుఁ గనఁబడు వచనకావ్యము లగురామాయణము లీరామాయణము
నకుఁ దరువాతివా ?

ఈసంపుటములో నారణ్యకాండ మొక్కటియే యున్నను, బాలకాండ
ము మొదట నుండఁదగిన యీపీఠికకృత్యాదిపద్యములు నిక్కడఁ జేర్చుట మన
కీయొక్కకాండమే కాక యన్నికాండములును రచింపబడినవని స్పష్టపఱుచు
టకుఁబనికివచ్చినవి. కృత్యాదిపద్యములు వ్రాసిన ౧౨ పత్రములలోనివ్రాత
యొక్కనిది తక్కినకథాభాగమువ్రాఁత వేఱొక్కనిది. ప్రతిసర్గమునకును "ఇది
శ్రీమదారణ్యకాండంబునందు అసహాయశ్యామరాయవిరచితం బగువచనకా
వ్యంబునందు పదాఱున్నొకటవసర్గార్థము" అనియిట్లుగలదు. ఆరణ్యకాండము
సర్వమును డెబ్బదిమైనసర్గలున్నది. సహస్రసంఖ్యను దెనుఁగులో "వేయి" అనిన
గోదనసంఖ్యయని పేరుపెట్టి ఛాందసముగా అఱువొక్కటియనుట కలదు.
అట్లే యిక్కడియుఁ బదాఱున్నొక్కటి యనిచెప్పినాఁడు. ఆయాసర్గముల
ప్రారంభమునను —

క. జాయాహరణానంతర, కాయజసంతాపజాత ఘనతరచింతా
భూయోన్వేషణలక్ష్మణ, ధీయుతవచనాభిరామ తేజోరామా. ౨౩ సర్గము.

క. రాక్షసకృపాణవిదళిత, పక్షద్వయపాదజానుపార్శ్వకరోటీ
కుక్షివిలోచనచంచూ, పక్షీక్షణమోక్షదాన భాగ్యనిదానా. ౬౨ సర్గము.

క. భీకరకబంధబాధన, సాకల్యభుజప్రసార సంగ్రహవార్తా
శోకనలక్ష్మణరాజ, ద్రాకాశశికీర్తిజాల రామకృపాలా. ౭౦ సర్గము.

ఇట్లాయాతావుల కథాసూచనము విషయసూచికవలెఁ బద్యములు చే
ర్చినాఁడు. మొదట శ్యామరాయకవి పద్యకవిత్వముం గొంత చూపి తర్వాత
వచనరచనఁ గనఁబఱుతము.

క. శ్రీతులసీదామోజ్జ్వల, వాతాత్మజసేవితాంఘ్రివనరుహయుగళా
కాతర నతజనకైరవ, శీతలగుణసాంద్రసోమ శ్రీరఘురామా.

సీ. ఎవ్వని మదినెంచ నిందిరాదేవియు మందిరంబుననుండె మహిమలొసఁగు
నెవ్వని నుతియింప నీప్సితకవనంబు నిచ్చి శారదయు సన్నిధియొనర్చు
నెవ్వని బింబంబు నీక్షింప నింద్రియగ్రామంబు లన్నియుఁ గదలకుండు

నెవ్వాని నామంబు నెన్నుచో జనులకు బహుపుత్త్రలాభంబు పరఁగుచుండు
అతఁడు శ్రీరాముఁ డఖిలసన్నుతచరిత్రుఁ, డాశ్రితవనవసంతుఁడునబ్జజాది
వినమదమరముకుటతటవివిధరత్న, కాంతికలితపదయుగుండు కాంతినొసఁగు.

సీ. ఎవ్వనిప్రాయంబునవ్వంపుదోఁటకు దీర్ఘాంగ తాటక దృష్టియెముక
యెవ్వనికరకరి కిక్షుఖండముగదా చండీశుకోదండదండవరము
ఎవ్వని బాణాగ్ని కిందనమ్ములుగదా యతికాయకుంభకర్ణాసురతతి
యెవ్వనివిశిఖధారేందీవరాక్షికిఁ బంక్తికంఠుని తలల్ బాతులాట
అతఁడు శ్రీరాము...

శా. శ్రీమత్కోసలరాజు ప్రేమ నిజలక్ష్మీకాంతికై చేయఁగాఁ
గామార్థంబులు ధర్మమోక్షము లిలంగాంక్షింపఁ దానీయఁగా
సీమాతీత దయావిశేషఘనుఁడై చేదోయిపద్మంబుచే
ధామశ్రీసర్వ సుబ్బరాయకృతినేతం బ్రోచి శ్రీలీవుతన్.

క. శ్రీవేంకటాద్రినేతయు, భావంబునఁ దన్నుఁ దలఁచుభక్తుండగు నా
ధీవరు సుబ్బారాయని, కావిశ్రుత...కీర్తికాంతులనొసఁగున్.

మ. శరమావిష్ణువు బ్రహ్మసారథియు నశ్వంబు ల్మహావేదముల్
పరఁగన్ ధారుణి తేరు సూర్యశశులుం బండ్లొప్పధానుష్కుఁడా
పురముల్ గూల్చినజోదు నాసుకృతికిన్ బొందొప్ప శ్రీలాదిగా
సిరి మాణిక్య మహాధనాఢ్యజయలక్ష్మిప్రాప్తుఁగాఁ జేయుతన్.

ఇట్లేవో మనశ్యామరాయకవి పద్యములు వ్రాసికొనుచుండఁగా—

సీ. తీఁగెచెంగటనున్న తిలకవృక్షముమాడ్కి బలువిల్లుమూఁపునఁబరఁగువాఁడు
కాఁడతోఁ జెలువొందుకమలంబు తెఱఁగునఁగరమునఁ జెన్నొందుశరమువాఁడు
కరుణారసమ్ములు కనుఁగవ నలరంగఁ జిఱునవ్వుమోమునఁ జెలఁగువాఁడు
పాదసేవకుఁ జేరుపవనజుకరమునఁ గైదండగైకొని కదలువాఁడు
రాజపుత్త్రుండొకఁడు వత్సరాశయనెడి, పలుకులను ననుబిలువఁగ భక్తితోడ
వేకువను గలలోనను వెఱఁగునంది, యేమిపనియనంగను నిట్టులనియె.

"నాదుచరిత్రము నీవును, నాదరమునఁ దెనుఁగుఁ జేయు" మని చెప్పి
నాఁడఁట. వచనశైలిఁ జిత్తగింపుఁడు:—ఏకాదశసర్గప్రారంభము:—

క. సీతాసాంత్వనపూర్వక, ఘాతుకరక్షస్సమూహ ఖండనవార్తా
జాతాదరవనచర, చేతోనయనాభిరామ శ్రీరఘురామా.

దండకారణ్యంబునఁ జనునపు డగ్రభాగంబున శ్రీరామదేవుండును ముఖ్యంబునందు సుమధ్యమయగు సీతాకాంతయుఁ బిఱుందివెస బాణబాణాసనంబులను పాణిఁ జేరాశించు లక్ష్మణుం డనువర్తించి చనునపుడు నారాజకుమారులిద్దరు నానావిధములగు పర్వతములమధ్యప్రదేశములు వనములు విశదవింతలై రమణీయములగు నదులుంజూచుచు సీతాకాంతామణితోడంగూడి చనునపుడు ఆనదీమధ్యభాగమునఁ జెలువలరు నిసుకదిబ్బలందు సంచరించు బెగ్గురులు జక్కవలు జలంబునందు జనితములగు నీరుకోళ్ళు నీరుకాకులతోడంగూడి తామరలచేఁ దవరారు కొలంకులు గుంపుగుంపులుగ సంచరించు జింకలను మదగర్వితములై గొప్పలగు కొమ్ములచేఁ గొమరొప్పు వృషభములను గారెనుపోతులను వనవరాహములను జెట్లను విఱిచి పడవైచు వేతండములను నవలోకించుచు దూరంబగు మార్గంబును గడచి సూర్యుం డస్తగతుండగు సమయంబున సహస్రదళములచే సంకులంబగుపద్మములు నూఱురేకులచేఁ బొలుపలరు పుష్కరంబులనెడి తామరసనహితంబును సమీపదేశంబున సంచరించు సామజములచే సమలంకృతంబును......యోజనదూరవిశాలం బగుతటాకంబు నవలోకించి ప్రసన్నజలంబును రమణీయంబునగు నాతటాకంబునందు గీతంబు వాదిత్రంబు నాట్యవీణయు మర్దలంబు పిల్లగ్రోవి కంచుతాళం బనెడి చతుర్విధవాద్యములనాదంబు వినంబడునపుడు నచట నొక్కనిం గానక......ఇట్లు 151 పత్రములలో నారణ్యకాండము గలదు.

పరిషత్తులో—బాలాయోధ్యాకాండములును గలవు.

(౩౫) శ్రీబాలగోపాల శతకము. గ్రం. సం. 901.

ఈశతకము పుసులూరి యుమాపతికిని బాపమాంబకును సుతుండును, శ్రీమదాత్రేయగోత్రుఁడు నగు సోమనామాత్యునిచే రచియింపఁబడినది. అష్టోత్తరశతసీసములతో నలరారుచు గ్రంథము సమగ్రముగ నున్నను, గ్రంథకర్తనివాస మెచటను దెల్పఁబడి యుండలేదు. గ్రంథకర్త కాలమును సూచించు నితరకవులుగాని రాజులుగాని వర్ణింపఁబడియుండలేదు. గ్రంథాంతమున 'శోభకృతు నామసంవత్సర మార్గశిరబహుళ ౬ జయవారం పోడూరి సూరప్పగారి మనుమలు రామప్పగారికుమారుఁడు మృత్యుంజయుఁడు అనువారు నిత్యపఠనార్థమై వ్రాశ్శిమాతృక చూచి కస్తూరి సోమరాజుగారి కుమారుఁడు వెంకన్న.........వ్రాసెను'...ఇందుదహరింపఁబడిన శోభకృతు

సంవత్సరము క్రీ. శ 1743 నకు సరిపోవుటచే శతకము 18 శతాబ్దమున రచియింపఁబడియుండవచ్చు నని తోఁచుచున్నది. శతకమందలి శైలి సరళముగ నున్నను గ్రంథపాతలేఖకప్రమాదములతోఁ గొన్నిస్థలముల ననన్వయముగ నున్నది. నీలశైలపాలుఁ డగు గోపాలబాలు నుద్దేశింపఁబడుటచే గ్రంథ మా ప్రాంతమున రచియింపఁబడిన దేమో యనుసందేహ మొదవుచున్నది, గాని, యిదమిత్థ మని నిర్ణయింప వలనులేదు. శైలిని దెల్పుటకై యీక్రింది పద్యముల నుదాహరించుచున్నాము.

సీ. శ్రీశుభద్రాకృతిఁ జెలువొందు లచ్చికిఁ బ్రాణేశుఁడయ్యె నేపరమపురుషుఁ
డవని నీలాచలం బనెడివైకుంఠంబుఁ బాలించుచుండు నేభద్రమూర్తి
పతితపావనయశఃపాండురచంద్రికా ధవళితాజాండుఁ డేదైవరాయఁ
డపవర్గదానదీక్షాంకమై భువనైకపావనం బెవ్వని పాదయుగము
అట్టిసీపాదములకు సాష్టాంగవినతిఁ, జేసి కీర్తింతుఁ బురుషార్థసిద్ధికొఱకు
బాలగోపాల కరుణాలవాల నీల, శైలపాలవనీపాల చారులీల-

సీ. గోపికాకుచకుంభ కుంకుమారుణహార కలితవిశాలవక్షంబువాని
రాసకేళికళావిలాసకుతూహలారంభసంరంభవిభ్రమమువాని
గోపికాగీతానుకూలనృత్యక్రమ ప్రకటహస్తావలేపములవాని
కటకనూపురఝణత్కారానుగత కరతాళప్రబంధకృత్యములవాని
గొమరుగోపాలకాకృతిగొన్నవాని, నిన్ను భజియింతు నామనోనిలయమందు.

సీ. ఇందీవరశ్యామ సుందరాంగముతోడ శిఖిపింఛభూషిత శిరముతోడ
మాణిక్యమణివర వేణునాదముతోడ రమణీయపీతాంబరంబుతోడ
గోపాలకాకృతి కొమరుప్రాయముతోడ వరహసితాస్యపద్మంబుతోడ
వనమాలికాగంధ వక్షఃస్థలముతోడ నవరత్నమయభూషణములతోడఁ
గన్నుదోయికిఁబండువుగాఁగమదికిఁ, బ్రేమపుట్టఁగ సాక్షాత్కరింపవయ్య......

సీ. నిరుపమాగమసార నిగమాంతసంచార నవనీతచోరవందనము నీకు
సకలామరాధ్యక్ష సన్నుతఫాలాక్ష తామరసాక్ష వందనము నీకుఁ
బతితపావననామ భద్రగుణస్తోమ దైవలలామవందనము నీకు
సకలలోకత్రాణ సత్కృపాపారీణ దానధురీణవందనము నీకు
అనుచునానంద భావమగ్నాంతరంగ, జనితరతినీకు నిత్యవందనమొనర్తు...

(36) అకారాదిదేశీయతెనుఁగునిఘంటువు. గ్రం. సం 16.

ఇది ౧౦ పత్రముల యకారాదినిఘంటువు. దేశీయపదము లన్నియు నేర్చి వ్రాయఁబడినది. కవి యెవ్వరో—ముందు వెనుక నేమియు వ్రాయఁబడి యుండలేదు. గణపవరపు వేంకటకవి లక్షణశిరోమణిలోని భాగము కావచ్చును.

| | |
|---|---|
| అరెది—అబ్బురము | ఉత్తరించి—ఖండించి |
| అట్టిద—అటువంటిది | కివ్వెను—మడిసెను |
| అసలు—బురద | కిట్టి—దగ్గరి |
| అయిద—వెంబడి | చుచ్చులు—మేఁకలు |
| అలకి—కలశము | చెయిద—చెలికాఁడు |
| అల్లోనేరేళ్ళు—నమస్కారము | పవాడము—బిరుదు |
| అకరులు—కేసరములు | సురెయాళుండు—చండాలుండు |
| అత్తము—గుంపు | హాస—క్రొత్త |
| అల్లారుముద్దుగ—జనసమ్మతిగా | |

(37) చంద్రాననాదండకము. గ్రం. సం. 61.

పుదుక్కోటరా జగు రాజాబహద్దరుమహీనాథుని పౌత్త్రుఁడును, రఘుస్వామిధాత్రీంద్రపుత్త్రుఁడును నగు శ్రీరామచంద్రక్షితీశునిపైఁ దదాస్థానకవి—నుదురుపాటి వేంకనార్యుని మనుమనిచే రచియింపఁబడినది. కాగితపుప్రతి. వ్రాఁత పరిశుభ్రముగా నున్నది. పుస్తకము మంచిస్థితిలోనున్నది. అక్కడక్కడఁ గొంత మచ్చుచూపఁబడును.

“ శ్రీమద్బృహన్నాయికాన్వగరోద్భక్తి విన్యేరవక్త్రారవిందస్ఫురద్దివ్యతేజస్సదాధ్యానసక్తాత్మభావుండు, భావోద్భవామిత్రఫాలాక్షకీలాసమానప్రతాపార్కబిభ్యద్విషద్ఘూకవారుండు, వారాశిగాంభీర్యగాఢత్వదానప్రవీణాతిగంభీరతాశాలి, శాలీనవిద్విడ్ధరాపాలమౌళిస్ఫురన్మంజురత్నచ్ఛవిచ్ఛన్నచక్రాదిరేఖోల్లసత్పాదపద్మండు—జంభారివంశాబ్ధిసోముండు సర్వజ్ఞతాతుల్యసోముండు రాజాబహద్దర్ మహీనాథపౌత్రుండు సల్లక్షణోపేతగాత్రుండు శ్రీమద్రఘుస్వామిధాత్రీంద్రపుత్రుండు......హూణాధిరాజన్యసంస్తూయమానోల్లసద్వైక్సెలెన్సీసమాఖ్యాభిరాముండు శ్రీమద్బృహన్నాయికాపాదసేవాప్తకాముండు శ్రీరామచంద్రక్షితీంద్రుండు తానొక్కనాఁటన్ హజారమ్మునన్...భూపాలరాగాదులన్స్మాగధుల్ వేడుకన్ గానముల్ సేయ...స్వీయేతరంబైన భూపాలశబ్దార్థమిత్వంబు

నం గక్షనుంబూని నోనాఁగ విప్పుచునొప్పారు నేత్రారవిందంబులు గెంపుడా క్రాంతచెన్నొందఁ (నిద్రలేచి యద్దముఁజూచికొని) సాముకూటమ్మునుం జేరి యుం దుండు నబ్బాలగోపాలమూర్తిం గనంజేయు దండంబులోనాఁగ దండంబులుం దీసి...గోవర్ధనాద్రిం గయి బూను శ్రీవేణుగోపాలు చందంబునన్నిల్చి గోతా ము చేసెత్తి (స్నానముచేసివచ్చి సభలోఁగూర్చుండి తర్వాత పురముంజూడ వెలువడిన) కోటీసులంగాంచి యీమేటిసాళువ్వరున్ లేమిచేఁ గోటిభూపాలవ ర్యుం డితండంచు లోకు ల్నుతింపంగ (చూచి చంద్రానన విరాళిగొని) "హా హాతాస్మిహా కోహితు ర్నాసీ దిదం కిం వరాకే కిలాహా" మ్మటంచున్విని ష్పేష ణోద్యుక్తహస్తాబ్జయై (యిత్యాదిదండకవర్ణనలు) ఉద్దండవిద్వత్కవిత్వాంకనుండైన శ్రీవేంకనాభిఖ్య ధీరేంద్రపౌత్త్రుండు శ్రీమాతృభూతాఖ్య ధీమంతు పుత్త్రుండు శ్రీమచ్చిదాకారవిద్వత్కవీంద్రుండు సైచేయుచంద్రాననాదండకము.

(38) రుక్మాంగదచరిత్రము. గ్రం. సం. 81.

ప్రౌఢకవి మల్లనకవిచే రచియింపఁబడి దక్షవాటికా భీమేశ్వరున కంకిత ముచేయఁబడిన యైదాశ్వాసముల కావ్యము. ప్రారంభము-

చ. వసుఁ డగ మ్రొక్కెదన్ లవణవార్ధివిజృంభణతానివర్తికిన్
దశదిగధీశమౌళిమణిదర్పణమండితదివ్యకీర్తికిన్
దశశతభానుమూర్తికి సుధామృదుభాషికి సాధుపోషికిన్
దశరథరాజుపట్టికిని దైత్యసతిం బొరిగొన్నజెట్టికిన్.

ఉ. రాముఁడె యిష్టదైవతము రాఘవుఁడే జనకుండు జానకీ
స్వామియె బాంధవుండు రఘువల్లభుఁడే సఖుఁ డంశుమత్కుల
గ్రామణియే సహోదరుఁడు రావణవైరియె సద్గురుండు గా
నామదిలోఁ దలంతు రఘునాథనృపాలవతంస మెంతయున్.

ఉ. శ్రీమయపత్త్రముల్ జడలు చెల్వగునభ్రతరంగిణీకణ
స్తోమము పుష్పముల్ ఫలము సోముఁడు నై పొలుపొంది పార్వతీ
కోమలదేహవల్లిఁ బెనఁగొన్న సముంచితదక్షవాటికా
భీమయదేవకల్పక మభీష్టఫలంబులు మాకునీవుతన్.

ఈపద్యమునకుఁ బైనున్నరెండుపద్యములును జాటువులు గావచ్చును.

చ. కలశపయోధికన్య మృదుగండమరీచుల నీడఁజూచుచుం
దిలకముఁ గమ్మకస్తురి ప్రదీప్తముగాఁ గొనగోర దిద్దును

త్పలదళమేచకద్యుతికదంబశరీరుఁడు మాధవుండు ని
చ్చలుఁ గరుణాకటాక్షముల...నితో మను ... గావుతన్.

ఇత్యాది కృత్యాది రచియించి విన్నవిస్తున్నాను——

క. మనమున సేవింపుదు మ, జ్జనకుని శ్రీవత్సగోత్రసాగరచంద్రున్
ఘనుఁ బోతనమంత్రీశ్వరు, ననయంబును భక్తి నమ్మలాంబాప్రియునిన్.

సీ ...యాదిశంభుస్వరూపస్థైర్యాధికమహిమ, నుస్నతికెక్కు శివదేవయోగిపౌత్రు
శక్తినాథుని మద్గురుస్వామిఁ దలఁచి——

అని చెప్పఁబడినపద్యభాగములంబట్టి యిక్కవితండ్రి శ్రీవత్సగోత్రుఁడైన పోతనమంత్రి యనియుఁ దల్లి యమ్మలాంబయనియు, గురువు శక్తినాథుఁడనియు తెలియవచ్చుచున్నది.

గద్యము:——ఇది శ్రీమత్పార్వతీశ్వరవరప్రసాదలబ్ధకవితాపవిత్ర పోతయామాత్యపుత్ర సకలజనానందచర్య ప్రౌఢకవి మల్లనార్యప్రణీతంబైన రుక్మాంగద...

ఇంతకంటెఁ గవివంశాదికము దీనిలోఁ దెలియదు.

ఈమల్లనకవి యీగ్రంథమును దక్షవాటి భీమేశ్వరున కంకితమిచ్చెను. ఈదక్షవాటి తగవులకుదూరమైన గోదావరిజిల్లాలోని ద్రాక్షారామమే యని "సప్తగోదావరీజలనవీనవిహారహారవిస్ఫురితమహాభుజంగజంగమస్థావర... దక్షపురిభీమలింగకాంతాశుభాంగ" యనుపద్యమును బట్టి యనుకొనవచ్చును. ఈతనినివాసముకూడ నచ్చటికి సమీపమై యుండవచ్చును.

సీ. హరితభీమేశుఁ డచ్యుతశర్మ యక్షావధాని యక్షేశుఁ డాధానయాజి
చల్లవల్లభుఁ డార్గచర్చు గోవిందుండు భట్టమాధవుఁడు దర్భలముకుందుఁ
డీశ్వరభట్లు బ్రహ్మేంద్రసోమజ్జలు క్రముదాడిమాధవుఁడు జంద్యాలపెద్ద
భాస్కరోజ్జలు చక్రపాణి చతుర్వేది శాంతికృష్ణుడు మల్లసోమయాజి
వామదేవుండు నరసింహవాజపేయ, వాదికేసర్లు వద్దిరామోదరుండు
పట్టవర్ధనమయలన్న పల్లమంచి, యాదియగు విప్రులేతెంచి రచటికపుడు.

అనుపద్యములోని వైదికబ్రాహ్మణశాఖవారు చాలమంది ద్రాక్షారామసమీపగ్రామములలో నిప్పుడునున్నారు.

హరివాసరవ్రతవిశేషముం దెలుపు రుక్మాంగదనృపాలుని చరిత్రమిందు వర్ణింపఁబడినది. దీని కేకాదశీమాహాత్మ్యమనునురెండవపేరు వాడుకలోనున్నది.

కవిపురాతనుఁడు గా వినుచున్నాము. కావున "దశమినాఁడేకభుక్తము చేసి మఱునాఁడహోరాత్రముల భక్తి నుపవసించి" ఇత్యాదిప్రథమాశ్వాసములోని సీసపద్యము-ఆముక్తమాల్యదలోని యిట్టిపద్యమునకు మాతృకమై యుండును ఈప్రతి చాల శిథిలమైనది 121 సంఖ్యగల ప్రతి శుభ్రముగానున్నది. వ్రాఁతతప్పు లిందు సందురు మెండుగాఁగలవు. కొన్నిపద్యములు-

మ. ధరఁ బాలించెఁ బురూరవు న్నగరునిం దైత్యకంకునిన్ హైహయుం
బురుకుత్సు న్నలు నంబరీషు శశిబిందున్ రంతి నంగు స్తను
త్తు రఘూత్తంసు భగీరథుం బృథు సుహోత్రు న్నాహుషున్ భార్గవున్
భరతక్ష్మాధిపునిన్ దిలీపు గయు మాంధాతృన్ శిబిం బోలుచున్.

ఉ. స్నానమొనర్చి ధౌతపరిధానయుగంబున్ ధరియించి యంటఁగాఁ
గానిమనుష్యులం గనక కల్లలు వల్కక యుగ్రకృత్యము
ల్మాని వినింద్యుఁడై నియతమానసుఁడై తములంబు దక్కి శ్రీ
జానిపురాణము ల్వినుట సంగతి శ్రీహరివాసరంబునన్.

రెండవప్రతిలో "స్నానమొనర్చి" యని కలదు.

శా. ఓకంజాతసుతాజ నీమదకరాళోగ్రక్రియాసైర్భో
శ్నైకగ్రీవ...ప్రకల్పితభయోద్రేకస్ఫురద్ఘంటికా
నీకానేకఘుణాఘుణ త్ప్రియసర్పిద్రధ్వను ల్వీనులం
దాకర్ణింపఁడు పద్మనాభపదపద్మారాధకుం డెన్నఁడున్.

క. మానినులు నూర్వురుండఁగ, నా నను నేరీతి మేలు గా నేర్చెదవో
భూనాథజరుపవచ్చునె, *గానుగునుదలారికముఁబ్రగల్భముతోడన్.

ఉ. కాయజుమేనమామ కలఁకంతుని యాఁదలపున్వ వాహినీ
నాయకుకూర్మిపట్టి నలినాత్మునిముద్దుమఱంది కౌముది
ప్రాయముదుంప యంబురుహబంధుని యుద్ధి చకోరజీవనో
పాయమహాపథంబు శితభానుఁడు కానఁగవచ్చెఁ దూర్పునన్.

ఈప్రతి ఆనందనామసంవత్సర పుష్యబహుళ విదియా అంగారకవాసరమందున వెలికంటి రంగప్పయ కొమారుడు వెంకట్నారయణ వ్రాసినది. (దక్షిణదేశపుఁప్రతి) 121 ప్రతి సర్వధారినామసంవత్సర వయిశాఖ శు ౯ బు॥ వరకు తెలిదేవర సుందర్రాముడు రుక్మాంగదచరిత్రము వాద్రేవు కృష్ణమ్మగారు

* గానుగునవలాబ్ధి కఁద్భుతిఁగల్భముతోడన్ — అచ్చుప్రతి.

వ్రాసిన ప్రతిక్రమానను సదరుహీం చరిత్రలో...ఆశ్వాసము వ్రాసెను.

(39) కవికర్ణరసాయనము—గ్రం. సం. 134.

ఇది యాఱాశ్వాసముల ప్రౌఢకావ్యము. కవి తనపేరు.

క. గురువరభట్టపరాశర, చరణసరోరుహానముల్లసన్మానసుఁడన్
నరసింహనామధేయుఁడ, బరిచిత సత్కృతిరసానుభవహేతువునన్.

క. కవితాదిదృష్టి గలిగినఁ, గవికంఠవిభూషణముగఁ గైకొనవలయున్
గవివరనృసింహవిరచిత, కవికర్ణరసాయనాఖ్య కావ్యము దీనిన్.

అను పద్యములంబట్టియు, "ఇది శ్రీమద్భట్ట పరాశరదేశికేంద్ర చరణ సరసిజ శరగోపసేవక నరసింహనామధేయప్రణీతంబైన కవికర్ణరసాయనం బను కావ్యంబునందు" అను నాశ్వాసాంత్యగద్యములంబట్టియు నరసింహకవియని తెలియవచ్చుచున్నది. ఇంతకంటె నీగ్రంథమునందుఁ గవి తన్నుం గూర్చి యేమియుఁ జెప్పకొనలేదు. స్వప్నములోఁ గవి చెప్పఁగా మిగిలిన- తలిదండ్రులు, వారువారు చేసిన గ్రంథములు, నుద్యోగంబులు నింటిపేరులుం జెప్ప నిష్టదైవతములును వచ్చి చెప్పలేదు. ఈకఁడు చేసినరెండవగ్రంథమును గనఁబడదు. మఱి యీకవియింటిపేరు సంకుసాలవారని సుంకుసాలవారని సింగసాళ్ళవారని టంకసాలవారలని యనేకులు నిరాధారముగాఁ జెప్పకొనుచున్నారేల. కులము తెలియదు గోత్రము తెలియదు. ఇట్టివాని యింటిపేరెట్లు తెలిసినదో.

క. నేరిచిన సుకవి కృతిచేఁ, బేరెఱిఁగించుకొని జగతిఁ బెంపగుటొప్పున్
నేరక కృతిఁ జెప్పట తన, నేరమి యపకీర్తి జగతి నిలుపుట గాదే.

అని కవి తనపేరు తెల్పుకొన్నాఁడు. ఆడంబరములేని పరమభక్తాగ్రేసరుఁడగునీకవి రచించినయీగ్రంథములోని కథ మాంధాతృచరిత్రము. శ్రీరంగనాథునికిఁ గృతిసమర్పణము చేసినాఁడు.

సీ. "ఆందోళికలయందు నంతరచరులైన సవికృతాకృతులఁ బిశాచజనులఁ
బరకరాలంబులై ప్రార్థింపఁ గనుఁగొనక వాయెత్తకుండు జీవచ్ఛవముల
వాలవీజనములం గ్రాలుచు నీఁగకు నాండీని ఖరవర్తులాండసముల
వేత్రపరంపరావిల కంటకాకృతిఁ జేరంగరాని బర్బూరతరుల
........ప్రభుదురాత్ముల నెవ్వాఁడు ప్రస్తుతించు." అనుపద్యమునందు నరపాలనింద కావించుట యొక్కటి విచారింపవలసియున్నది.

సీ. జగదేకపతియయ్యుసకలాభిగమ్యుండుసర్వశాసనుఁడయ్యుసదయహృదయుఁ

డభిమతప్రదుఁ డయ్యు నంజలిసాధ్యుఁడు పరిపూర్ణుఁడయ్యును బ్రణతికాముఁ
డతిగతేంద్రియుఁడయ్యు ననిమేషదృగ్గ్రాహ్యుఁ డనిరూప్యుఁడయ్యు భక్తానుయాయి
సాక్షియయ్యు నతాపచారానభిజ్ఞుండు సముఁడయ్యు నార్తరక్షాపరుండు
భద్రగుణనిధి నిర్గుణప్రతిభటుండు, సముఁడునధికుండు లేని యుత్తమపురుషుఁడు
వెదకిచూచిన శ్రీరంగవిభునివంటి, ప్రభువు నత్యంతసుఖుండుఁ బరుఁడు గలఁడె.

అనుపద్యమునకు వ్యతిరేకాభిప్రాయమునకై వ్రాసినపద్యమే కాని కేవలప్రభువుల నిందించుటకుఁ గాదనవలయును. ధనాపేక్ష లేదు. పరమదైవభక్తుఁడు, ఆత్మస్తుతివిముఖుఁడు నిట్లు చెప్పుట పరనిందకుఁ గానగునని తలంపఁగూడదు. ఈపద్యమునుండియే కాంబోలును, వింతకథలు పుట్టి యల్లసానిపెద్దనార్యునకుఁగూడ నపకీర్తిం దెచ్చుచున్నవి.

ఈక్రిందిపద్యములో సత్కవులసామర్థ్యముం దెల్పినాఁడు.

చ. మనమునఁ గొన్ననెవ్వగలు మాన్పి ఘటింతు రసాంద్రసమ్మదం
బనఘకథాముఖంబున హితాహితబోధ మొనర్తురింపుగాఁ
గనుఁగొనుకన్న నద్భుతముగా నెఱిఁగింతు రతీంద్రియార్థముల్
ఘనమతులెల్లవారికి సకారణబాంధవులు గారె సత్కవుల్.

ఈక్రిందిపద్యములోఁ దనకవిత్వసామర్థ్యము వెల్లడించినాఁడు.

గీ. యతి విటుఁడు గాకపోవునె ట్లస్మదీయ, కావ్యశృంగారవైభవాకర్ణనమున
విటుఁడు యతిగాక పోరాదు వెస మదీయ, కావ్యవైరాగ్యవర్ణనాకర్ణనమున.

కృతి ప్రారంభపద్యములు.

మ. శ్రీరామావసుధాపయోధరములం జేదోయి రెంట న్సను
ప్రారంభంబునఁ జిత్రభంగి మకరీపత్త్రాంకముల్ వ్రాసి ని
ర్వైరప్రేముల నిద్దఱుం దమసారస్యంబునం దేలునా
శ్రీరంగేశుఁడు మమ్ము నిర్మల శుచిశ్రీయుక్తులం జేయుతన్.

చ. పొలయలుకన్ జపంబునకుఁ బూని కనుంగవ లెల్ల మోడ్చియుం
దలఁచిన మాత్రవర్ణమయతం గనుపట్టిన వాణిఁ జూచి న
వ్వొలయఁ గవుంగిలించి సుసుఖోన్నతిఁ జెందెడు సర్వతోముఖుం
డెలమి దలిర్ప మత్కృతికి సీవృత విశ్వజనాభిముఖ్యమున్.

మ. ముకుళేందుద్యుతిజాలముల్ సతతమై ముంపం బ్రభాతం బెఱుం
గక శశ్వత్పరిరంభణావిరతసౌఖ్యస్నిగ్ధుఁడై జాయఁ బా

యక లీలాపరుఁడైన శంకరుఁడు నిత్యప్రీతి సంధించుతన్
సకలాహ్లాదముగా మదీయకృతికిన్ శబ్దార్థదాంపత్యమున్.

కథాభాగములోని రెండుపద్యములు.

శా. కస్తూరీతిలకంబులై హరిశిలాకల్పంబులై కజ్జల
ప్రస్తారక్రియలై నవాగరుమషీపంకానులేపంబులై
శస్త్రానీలపటావగుంఠనములై జన్మించె దిక్కామినీ
రిస్తోమంబులయందు నూతనతమోరేఖాంకురశ్రేణికల్.

ఉ. దారుశిలాదిభావనలదైవముల న్నిరసించి తామసుల్
గోరుదు రింతచేరువనెయోకో తమ కాత్మవివేకపాకముల్
వారిధరంబుల న్విడిచి వచ్చినచాతకధూర్తు లంబుధిం
దారు గొనంగ శక్తులె సుధామధురోదకపానసౌఖ్యముల్.

(40) పద్మపురాణోత్తరఖండము- గ్రం. సం. 115.

అయ్యలమంత్రిపుత్త్రుఁడు మడికిసింగనార్యుఁడు రచించినది ఇది "గౌతమీ దక్షిణంబున...సబ్బినాటిరాష్ట్రంబున రామగిరిపట్టణంబు నిజరాజధానిగా... గలు, నిరువెత్తుగండ గండగోపాలాది బిరుదాంచితుఁడగు గురుజాలముప్పభూపాలకుని మంత్రి యోబళామాత్యుని పుత్త్రుఁడగు వాణస కందనామాత్యున కంకితము చేయఁబడినది. తొమ్మిదియాశ్వాసములు నిండుగా నున్నవి. పదియవది పూర్తిగ లేదు. ఈకందామాత్యుఁడు సింగనకవీశ్వరునకు మిత్త్రముయినట్లు "నీ సహవాససౌఖ్యముల నెమ్మిఁజరించుట జేసి దిక్కుల న్వాసికి నెక్కి యిష్టజన వర్గముచేఁ బొగడొందె...ప్రస్తుతికెక్కితి"నను కృతిపతి వాక్యములోఁ దేట పడుచున్నది.

"ధాత్రిఁబద్మపురాణఖండత్రయమున, సర్వసారాంశమై పుణ్యజననమగుచు
మండితంబైన యుత్తరఖండ మీవు, తెనుఁగుగావింపు నాపేర ననఘచరిత.

గీ. బాదరాయణమునిముఖప్రభవ మైన,యిప్పురాణార్థ మిలఁగొందఱెఱుఁగనేర
కునికి నేఁటికినంధ్రభాషోక్తిఁ దెలియఁ, జెప్పిలోకోపకారంబు సేయవలయు.

వ. అట్లయిన నేను కృతకృత్యుండ నగుదు నీకును గీర్తిసుకృతంబులు సంభవించు—అని కవిని గందామాత్యుఁడు కోరినాఁడఁట.

చ. అమరిన మత్స్యకూర్మవిభవాదులు దీవులు వేదవాక్యసా
రము జలపూర మున్నతతరంగము లాగమశాస్త్రపద్ధతుల్

విమలయశోభిరామమగు విష్ణుచరిత్రము భోగితల్పమై
యమృతపయోధినాఁగఁ బఱపై చనుఁబద్మపురాణమిమ్ములన్

సీ. ధర్మభోగైశ్వర్యతతిమూలనికరంబు విమలాదిశక్తుల వెలయుకంద
మామ్నాయశాస్త్రంబు లనుపమశాఖలు బహుకథాసూక్తులుపల్లవమ్ము
లుపనిషద్వాక్యంబు లురుపుష్పసంఘంబు పొలుపారహరిభక్తి పుష్పరజము
వరయోగివైష్ణవవరులు భృంగంబులు పరమసౌఖ్యాసక్తి పరిమళంబు
బాదరాయణువాక్సుధాప్రౌఢిఁ బరఁగి, నిఖిలధర్మంబులకు నిల్వనీడ యగుచు
విష్ణురూపంబు దానయై వెలసి సౌఖ్య,రసికమై యొప్పుఁ బద్మపురాణతరువు.

వ. కలికాలజనితమహాదోషాతపసంతప్తాంతరంగులును సంసారపథశ్రాంతస్వాంతులు నగు మనుష్యు లీపుణ్యతరుశీతలచ్ఛాయ నాశ్రయించి-తాపత్రయంబుఁ బాసి జరామరణభయబుభుక్షారహితులై యవ్యయానందంబు నొందుదురు. అని దీనిఫలశ్రుతినుండే యాంధ్రీకరణోద్యమమునకుఁ గారణముగాఁ దెలిపినాఁడు. ప్రారంభపద్యములు.

శా. శ్రీరమ్యం బగుదుగ్ధవార్ధి నడుమన్ శేషాహితల్పంబుపై
నారూఢంబగు నిందిరా సహితుఁడై యానందలీలన్ గనా
ధారుండై వరసంయమీంద్రులకు నాత్మజ్ఞానరూపంబుఁ దా
నై రంజిల్లెడు వేల్పు ప్రోచుఁ గృపఁ గంబామాత్యు నెల్లప్పుడున్.

చ. చెలువగు జూటరంధ్రములఁ జెచ్చెరఁ బిల్లలఁ బెట్టి యెప్పుడున్
వెలయు చకోరదంపతులు వెన్నెలమీఁగడలంచు ముక్కులం
జెలయుచుఁ గుప్పసంపుదొరఁ జివ్వఁగ మేల్లని చూచు శేషుమై
యలకున గాంచినవ్వు శివుఁ డబ్బయకందని ధన్యుఁ జేయుతన్.

చ. తనకు నివాసమైన వెలిదమ్మిఁ జెలంగెడు చంచరీకని
స్వన మొగి విన్నవారలకు సామకృతాభ్యసనప్రవృత్తి శి
ష్యనివహమోయనంగఁ గడు నింపెసలారెడు వేల్పు పెద్ద శో
భనయుతుఁ జేయుఁగాతఁ బ్రతిభావిభు సాభళమంత్రి కందనిన్.

ఇక్కవిగద్యము-ఇది శ్రీనరసింహవరప్రసాదలబ్ధ కవితావిలాస భారద్వాజగోత్ర
పవిత్ర అయ్యలామాత్యపుత్రసరసగుణధుర్య సింగనార్యప్రణీతంబగు...

ఈతఁడొనర్చిన వాసిష్ఠరామాయణము, ద్విపదభాగవతము నిటీవలివి కావచ్చును. ఇందు వాసిం దెల్పలేదు.

## (41) రసమంజరి—గ్రంథ. సం 165.

గుడిపాటి కోదండకవి రచించినది. మూఁడుగుచ్ఛములు మాత్రము కలవు. నడుమనడుమం గొన్నిపత్రములు లేవు. ప్రతిగుచ్ఛమునను బ్రథమకుసుమము ద్వితీయకుసుమము అష్టాదశపద్యదళంబుల తృతీయకుసుమము నని భాగము లున్నవి.

సీ. శ్రీకరనందవరీకాగ్రగణ్యుండు వహిమీఱు గుడిపాటివంశభవుఁడు
బిరుదుగా నవఘంటసురధాణిపేరంది మహితుఁడౌ వెంగళమంత్రిపౌత్రుఁ
డతులితుం డగురంగమామాత్యతనయుండు వీరమాంబానందవృద్ధికరుఁడు
సింగనవెంగళశ్రీనిధు లనుజులై భాసిల్లు కోదండపతి ఘనుండు
సరసకవితాచమత్కారసార్వభౌముఁ, డవని శ్రీరంగధామదయాశ్రితుండు
ఎలమిరసమంజరినిరచియించెనందుఁ, బ్రథమగుచ్ఛంబు మాధ్వీకఫలితమగును.

ఈవంశావళి వివరముగా మొదట నిచ్చియున్నాఁడు, గాని, పూర్తిగా లేదు. అక్కడక్కడఁ గొన్నివిషయములు:—

స్వాధీనపతిక:—అష్టవిధనాయికలయందు స్వాధీనపతిక యనునది యెల్లప్పుడును దనయింగిత మెఱింగి తనయాజ్ఞకు లోనుగా నడిచెడు పతిగలయది. ఈస్వాధీనపతికకు వనవిహారాదులు మదనమహోత్సవములు మదాహంకారములు మనోరథావాప్తులను జేష్టలుగాఁ గలిగియుండు- లక్షణము.

చ. గరిమ కుచంబులం గ్రసిమ కౌనునఁ గాంతిమ యంగకంబులం
బిఱుఁదుల మిక్కిలిం బ్రథిమ స్ఫీతిమ నవ్వుల వాక్పటుత్వముం
వరనటన న్మహాప్రతిమ వక్రిమ చూపుల మందయానముం
గొరవడి లేకయున్న సతి మిక్కిలి చూడ ని దేమి చిత్రమో.

2. అభిసారిక:—తాను నాయకుని గూర్చి యభిసరించునదైన నాయకుని నభిసరింపఁ జేయునదైన నభిసారిక యనందగు, నీనాయకకీచేష్టలు సమయోచితమైన భూషణములు ధరియించునదియు, శంకయు, బుద్ధినిపుణతయుఁ గపటము, సాహసమును లక్షణములు, స్వీయాభిసారికా పరకీయాభిసారికలకుఁ బ్రకృత మొక్కటే యుండును.

ఇందు ముగ్ధాభిసారిక, మధ్యాభిసారిక, ప్రౌఢాభిసారిక, జ్యోత్స్నాభిసారిక, దివసాభిసారిక, స్వీయాభిసారిక, సామాన్యాభిసారిక లనుభేదములు గలవు. అందు స్వీయాభిసారికాలక్షణము.

చ. కులుకుచుఁ దారహారములు గుబ్బల వెన్నెలగాయ నందియల్
ఘలుఘలుఘల్లుమం చనఁగఁ గాంచి ఝుళంఝుళ లుప్పతిల్లఁగా
నలయఁగ ఘక్కప్రాయ యభిసారికవైతి మతేల తెల్పుమా
సొలయుచు మిక్కిలిన్ బెదరి చూచెద వెంతటిమూఢురాలవే.

3. సకలనాయికలయందును సమమైన సహజానురాగము గలవాఁడు దక్షిణనాయకుఁడు.

ఉ. ముందట నున్నవారు పరిముగ్ధవిలోచన లెందఱైన నే
నిందఱియందు నక్షియుగ మేక్రియ నిల్పెద నంచు నెంచి తా
నందమువీఱ విాలితదృగంచలుఁడై మధుసూదనుండు నిం
పొందఁగ మేనఁ గ్రొంబులక లూరఁగ నిల్చె దరస్మితుండునై.

ఈరసమంజరి కర్తారిలో శ్రీపతికుల సుధాకరులైన గానవిద్యాపారంగతులైన కోనుకోలు వేంకట్రాయలవారి తనుజునికొఱకు తిరుమలస్వామి వ్రాసి యిచ్చినది.

ఈపుస్తకములోనె మొదట (మువ్వగోపాలపదములు) క్షేత్రయపదములు గలవు. దానికి మొదటఁ బదములపట్టిక యీయఁబడినది. ఇందు 184 పదములున్నవి.

కొంత సాహిత్యలక్షణము గలదు. గణలక్షణములు సాహిత్యరత్నాకరము, సాహిత్యచంద్రోదయము, అలంకారచూడామణినుండి కొన్నిశ్లోకము లిచ్చియున్నాఁడు. పంచమస్థానమందు కకారవిషమాక్షరం యేలూరి శేషయ్యయుంచి చెప్పినకవిత—

చ. మునుపొకకేల రావణుఁడు మోదమునన్ రజతాద్రి నెత్తినం
తనె హరుఁడప్పుడే తనపదంబునఁ ద్రొక్కి మదం బడంచెఁ గా
మనమయగారి తుక్కసచివా నెలశ్రీగిరి గడ్డపాఱలం
గనలుచుఁ ద్రవ్వి సర్వమును గైకొన నీకును నాతఁ డోపఁడే.

కొన్నిపత్రములు, సంగీతరత్నాకర మని సంస్కృతముగలదు.

శ్లో. సప్తాధ్యాయాత్మకం గ్రంథం శార్ఙసూరిస్వమాతనోత్
శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గీతరసం ఫణి
అజ్ఞాతవిషయా గోపాల మురళీశబ్దశ్రవణాత్ దూరరూపగోచరాత్। అగత్య
పరితో గావః పిబన్తి సుషిరామృతమ్। వ్యాళగ్రాహికగానేన స్థితా అహి,

కార్వదండవత్ । నిర్భిద్య ర్భోగముద్ధృత్య పిబన్తిస్మ స్వరామృతమ్
అస్తిస్వస్తి గ్రహాం వంశే శ్రీమత్కాశ్యపసంభవమ్
యజ్వభిర్యత్ర భిభూర్యైః వేదసాగర పారగైః
తత్రాభూ ద్భాస్కరః ప్రఖ్యో భాస్కర స్తేజసాంనిధి
అలంకర్తు ర్దక్షిణాశాం యచ్చక్రే దక్షిణాయనమ్.
తస్యాభూ త్తనయః ప్రభూతవినయః శ్రీశార్ఙ్గశః ప్రౌఢధీః
యేన శ్రీకరణప్రవృద్ధవిభవాభూవల్ల......
ఇట్లసంపూర్ణముగా నైదాకులుగలవు.

(42) గజారణ్యమాహాత్మ్యము. గ్రం. స. 167.

ఇది యొక వచనకావ్యము. కవి పేరు తెలియదు. గ్రంథము పూర్తిగా లేదు. చిట్టచివర కవిపేరు వేసికొనియుండును. ఇదియును దక్షిణదేశప్రతియే దాక్షిణాత్యులందఱును సంస్కృతభక్తినే యధ్యాయములుగా రచించి కొన్ని యధ్యాయముల కొక్కయాశ్వాసముగాఁ దెనుఁగురీతి ననుసరించువారు. వచనము చక్కనిది. పద్మపురాణంబున మధ్యమఖండంబున ఉమామహేశ్వరసంవాదంబున నూటముప్పదిరెండవ యధ్యాయమునుండి ప్రారంభింపఁబడినది. 142 వ యధ్యాయము దాఁకఁ గలదు. కొంతశైలికై చూడుఁడు. 139 అధ్యాయములో-

"తదనంతరంబ లోకపితామహుండైన సురజ్యేష్ఠుండు ఫాలాక్షునికిం బ్రత్యక్షంబుగావించి నమస్కరించి బహువిధంబులం గొనియాడిన భగవంతుండైన యమృతేశ్వరుండు విరించి స్తోత్రంబునకు సంతసించి కమలగర్భా నీతపంబునకు మెచ్చితి వలయువరమ్ము లొసంగెద వేఁడు మనుటయుఁ జతుర్ముఖుండు పంచముఖుం జూచి దేవా నీ వేసరోవరంబున నావిర్భవించితి వాసరస్ను బ్రహ్మపుష్కరిణి యనం బ్రసిద్ధిఁ గాంచవలయు బ్రహ్మపుష్కరిణి తోయంబున మునింగిన మనుజులు దురితవిముక్తులై భవదీయసాయుజ్యంబు నందవలయు- దేవా! ధ్వజారోహణంబు సేయించి నేటిమొదలు నీకు నుత్సవంబు సేయించెద నీ యుత్సవం బాచంద్రార్కంబుగాఁ బ్రతిసంవత్సరంబు నడువవలయు, నానక్షత్రంబైనరోహిణియందు రథారూఢుండవైన నిన్ను సేవించి నీతోడంగూడ నవభృథస్నానంబు సేసిన నరులకు సాయుజ్యంబు గలుగవలయు ననిన "... అమృతేశ్వరుండు నలువపలుకు లాలించి...మాఘమాసంబున మృగశిరానక్షత్రం

బున నుత్సవంబునకు నారంభించి ఫాల్గునమాసంబున రోహిణియం దవభృథస్నానంబు...ఈయిరువదియేనుదినంబులును నాగమోక్తవిధానంబున శైవాచారసమన్వితుండవై—సేవింపు మని యానతిచ్చిన..."

దీనికిఁ బ్రారంభ మెట్లుండునో తెలియదు. ఉన్నదాని మొదటనే "అంకితంబుగా నాయొనర్పంబూనిన గజారణ్యమాహాత్మ్యంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన" యని మొదలిడినాఁడు. ఈపుస్తకము గరిమెల సుబ్రహ్మణ్యశాస్త్రిగా రిచ్చినది.

## (43) ఆంధ్రరసమంజరి—గ్రం. నం. 148.

ఈగ్రంథమును పుదుక్కోట గరిమెల సుబ్రహ్మణ్యశాస్త్రిగారొసఁగినదియే. ఇందు మొదట శ్రీభానుదత్తమిశ్రవిరచితమైన సంస్కృతరసమంజరి కలదు. అది రాక్షసనామసంవత్సర వర్షరుతు శ్రావణబహుళత్రయోదశీస్థిరవారం-వచ్చిమిరియం ఆదిప్పయ్యగారి మనుమఁడైన వీణకుప్పణ్ణయ్యగారి కుమారుఁడు వీణసుబ్బయ్య వ్రాసినది. 20 పత్రముల గ్రంథము పూర్తిగాఁ గలదు. తరువాత నాంధ్రరసమంజరి కలదు. ఈరసమంజరి పుదుక్కోటసంస్థానప్రభు వగు కోటి రాజగోపాలభూపవిజయరఘునాథవసుమతీవిభుని సభలోని నారాయణయ్యంగారు రచించినది. సమగ్రము. ప్రారంభము-

క. శ్రీరంగస్థలవక్షః, స్ఫారశ్రీవత్సకౌస్తుభప్రభలుతమ
స్సూరులఁ గేరు స్త్రీకర, శ్రీరంగస్థలపతిని భజింతును భక్తిన్.

ఉ. వల్లభు నుల్లమందుఁ గృతవాస యగుం దనదివ్యదేహము
త్కుల్లసితద్యుతి న్వెలికిఁ దోఁచె ననం దదురస్థలంబునం
జెల్లువడి న్నిరంతరము చేరి వసించు సరోజపాణి మ
త్తల్లి యభీష్టసిద్ధి సతతంబు నెసంగ నొసంగు నెంతయున్.

క. వినతియొనరింతు మలయు, ల్లునికి వటసచలితముకులులుత దమరధునీ
ఘనతరతరంగ బింబిత, వనజారికలాసహస్రవల్గనగతికిన్.

క. కేవలకాంచనకటకవి, భావిష్కృతియుతులు కాళిదాసాదికవుల్
భావింప రత్నకటకము, హావిభవులు నన్నయాదు లాంధ్రకవీంద్రుల్......అని

వ. ఎద్దియేని యొకసరసకృతి చమత్కృతి కృతసమున్నతిగ రచియింప మతిఁ బూనియున్న సమయంబున,

సీ. కోటివంశాంభోధికుముదినీరమణుండు కువలయానందైకగుణగణుండు...
కలితనిజ నామబోధిత కాంతివిభవ, సమరసాహససత్యవాక్క్రమసమాన
శీలపురుషుండు రాజగోపాలభూప, విజయరఘునాథవసుమతీవిభుండు మహిని.

మ. ప్రసరచ్ఛాస్త్రుని నప్పయార్యవరసత్పౌత్రున్ ద్విషన్నీరద
శ్వసనస్ఫూర్తిని జిట్టివేంకటమహాచార్యాత్మజున్ విశ్వవి
శ్వసనీయు న్నరగోపయోగికరుణాసంప్రాప్తసారస్వత
స్వపనాథున్ ద్వయపూర్వవాక్యముఖమద్వర్ణప్రసిద్ధాహ్వయున్.

మ. ...ప్రతిభోదంచితకావ్యకల్పను భరద్వాజీయగోత్రున్ జగ
న్నుతచారిత్రుని నన్నుఁ జూచి పలికెన్...............

మ. సుకవీంద్రుండవు మద్గురుండవు జనస్తుత్యుండ వత్యాదరుం
డకళంకాత్ముఁడ వాంధ్రసంస్కృతకవిత్వాత్యంతవిఖ్యాతుఁ డో
సకలోర్వీనుతకీర్తి నీవొక కృతిన్ సంతుష్టుఁడై చేసి వే
డుకఁ గావింపు మిల న్మదంకితము ప్రౌఢోక్తిన్ సుధీంద్రాగ్రణీ.

క. శీలితబుధమానసమధు, పాళి రసానంగహేతువై యలరఁగ వా
క్కేళిని నేరసమంజరి, బాళిఁ బ్రకాశింపఁ జేసె భానుఁడు జగతిన్.

క. ......ఆ, రసమంజరి తెలుఁగొనర్చు రసికులు పొగడన్

వ. అని రాజు పలుకఁగా నీకవి యాంధ్రీకరించెను. కృతిపతివంశావలి విశే
షముగ వర్ణించియున్నాఁడు. నాలుగాశ్వాసములు- ప్రత్యాశ్వాసాంతము
నను గద్యము, పద్యరూపమున రచించెను. చిట్టచివర-

శా. వన్నెల్మీఱఁగ నుల్లసిల్లిన భరద్వాజీయగోత్రార్ణవో
త్పన్నశ్రీఁగోమసూరిచంద్రుఁడు దలిర్ప న్వేంకటాచార్య శ్రీ
మన్నారాయణసత్కవీంద్రుఁ డొనరింప న్రమ్యమై యాంధ్రమై
యెన్న న్నారసమంజరీకృతిఁ జతుర్థాశ్వాస మొప్పెందగున్.

వ. అనియున్నది. "నవసాలపురమున నుండే పడమటినగరుధోరావై యంకితము
గా శ్రీమన్నారాయణయ్యంగారు జేసిన రసమంజరి యను గ్రంథము-"
దీనిని గూడ వీణె సుబ్బయ్య యే రాక్షసనామ సం॥ శ్రావణశు॥ షష్ఠికిఁ
బూర్తిగ వ్రాసెను. దీనితరువాతను సంగీతరత్నాకర మను సంస్కృతగ్రంథ
ము కొంత కలదు.

"భరతాఖ్యసుధాసింధుసంభూత ఇవ కౌస్తుభః
రఘువీరపదాంభోజమిళిందశుచిచేతసా
గోవిందనామ్నా సంగీతశాస్త్రః సంక్షేపశోచ్యతే" ఇట్లు —

28 పత్రములుగలవు. కటపట- ద్విసప్తతితమే భేదే రసికప్రియనామకమ్ తజ్జాతం రసమంజర్యా రాగద్వయమితీరితం ద్విసప్తతితమే వాశ్చజాతం రాగః ప్రకీర్తితాః" శ్రీరామజయం అనియున్నది.

(44) హాలాస్యమాహాత్మ్యము. గ్రం. సం 170.

ఇది యొకవచనకావ్యము దక్షిణమధురాక్షేత్రమాహాత్మ్యము. 71 యధ్యాయము. 8 ఆశ్వాసములుగ రచియింపఁబడినది. అధ్యాయాంతంబుల "ఇతి శ్రీస్కాందే మహాపురాణే హాలాస్యమాహాత్మ్యే... అధ్యాయః" అనియున్నది. ఆంధ్రీకరించినకవి- శ్రీపతి రామభద్రకవి- అతఁడు తనగద్యము నీక్రిందివిధమున వ్రాసికొనియెను.

ఇతి శ్రీమీనాక్షీసుందరేశ్వరసాంద్రకృపారసలబ్ధ కవితామాధురీధురీణ కాశ్యపగోత్రాశ్వలాయనసూత్ర శ్రీపతికులపవిత్రచరిత్ర శ్రీగిరియమాంబాసత్కళత్ర సూరయామాత్యపుత్ర కవిరామభద్ర ప్రణీతంబైన హాలాస్యమాహాత్మ్యంబునందు వచనకావ్యంబున... ఆశ్వాసము."

కవి దక్షిణదేశస్థుఁడు. పుస్తకమును దక్షిణదేశమునుండి వచ్చినదియె- వచనము సంస్కృతజటిలముగ నున్నది. వ్రాఁతపొరపాటులు గలవు. ఉభయభాషలయందును యమకములు తఱుచుగాఁ గనఁబడును. కొన్ని పంక్తు లుదాహరణమునకై చూపఁబడును.

"అశ్వినీదేవతలు చూచి యిది యపరిహార్యం బనిన నిరుద్యోగులై జాగులైరి. తద్రోగపరిహారార్థంబుగా నొక్కయుపాయంబు దేవరానతీయవలయు ననిన వరుణమూఖావలోకనంబు చేసి వాసవుండు విను మోసంబు లే దనిసుధాసారసమానవచనంబులు పలికినపుడు- ఏమహావ్యాధిపీడితులై పాపకృత్యులై యపమృత్యుపీడితులై కాలమృత్యువశులైనవా రెవ్వరో వారందఱు సుందరమూర్తి సందర్శనంబునఁ బునీతు లగుదురు గావున మనోవాక్కాయపరిశుద్ధుఁడై యాయభిషేకపాండ్యరాజాగ్రణి భక్తిప్రభావంబును, ఆదేవుని మహిమాతిశయంబును నీవు తెన్నుఁగఁ బరీక్షించి తెలిసి తల్లింగార్చనంబు గావించితి వాయెనా నీరోగంబు తొలఁగు నిందుకు సందియంబు లేదు. అనిన శక్రునివాక్యంబులు విని

వరుణుండు చొక్కమని యాచొక్కనాథుని శోధింపం దలంచి గ్రక్కున లేచి యతనికి మ్రొక్కి మక్కువతోడ మిక్కిలి యెక్కువైన హర్షభరవశుండై చక్కగం దనపురంబునకుం జని యంత నొక్కనాండు- ఆరాజును సుందరరాజును జక్కన శోధింపందలంచి వరుణుండు సముద్రుని బిలిచి సముద్ర నిద్ర లేచి నీయందుం గలజలచరపరివృతుండవై యనేకతుంగతరంగావృతంబుగ నామధురానగరం బుంగబళింపు మనిన-"

పరిషత్పుస్తకభాండాగారములో నంజరాజకృత మైనహాలాస్యమాహాత్మ్యవచనముం గూడ నున్నది.

ఈరామభద్రకవిగ్రంథము "గర్భపురీక్షేత్ర నిత్యనివాసు లగు బ్ర|| శ్రీ లక్ష్మీనృసింహసూరినప్త్రిండును శ్రీలక్ష్మీనృసింహార్యపౌత్రుండును శ్రీరామార్యవర్యుల పుత్రుండు నగు నెందవగోత్రాశ్వలాయనసూత్రుండు నగు శ్రీసీతారామయ్యది." అని మొదలంగలదు. వ్రాతచక్కనిది. మంచిస్థితిలోనున్నది.

(45) హరివంశము. గ్రం. నం. 4534.

ఎఱ్ఱాప్రెగడరచించిన పూర్వోత్తరభాగములతోంగూడిన యొకతాళపత్రగ్రంథము. ఇం దుత్తరభాగమున, చతుర్థాశ్వాసము తరువాత 5, 6, 7 ఆశ్వాసములు నేమానిభైరవికవి రచియించినవిగలవు. ముద్రితప్రతులలో నివిలేదు. 8 వ యాశ్వాసము, ఎఱ్ఱాప్రెగడ పంచమాశ్వాసముక్రిందను లెక్కింపంబడుచున్నది. ౨౦౯ పత్రము మొదలు పంచమాశ్వాసము ప్రారంభమున- "ఈ మీఁదట నేమానిభైరవావధాన్లకవిత్వము" అనికలదు. ౨౫౫ లో నాల్గవపంక్తిలో "యీమీఁదట యఱ్ఱయకవిత్వము" అనియున్నది. ప్రారంభము-

ఉ. శ్రీరమణీయకౌస్తుభశుచిప్రభలందున బింబితాంగియై
శ్రీరమణీలలామ తనచక్కిటం జెన్నుఘటింపంగాంచి య
త్తోరపుటబ్బుం దీర్చుతఱిం దొయ్యలిపాదములంటి యంటి వే
మాఱును మారుకేళి బతిమాలెడు వెన్నుడు మమ్ముం బ్రోవుతన్.

చ. వరగుణశాలి కోటగిరివంశభవుం డగు శ్రీనివాసభూ
వరుం డతిభక్తితోడ హరివంశకథాశ్రవణైకచిత్తుండై
యరయుచుం బారిజాతహరణాదికథావళి లేకయున్నచో
సురుచిరదృష్టిచేత ననుంజూచి దయామతితోడ నిట్లనన్.

గీ. ఎఱ్ఱనార్యుండు తెలింగింపం డేలనొక్కొ, తెలుంగుం జేసినంబిదపను దొలంగనొక్కొ
యీకథలునీవు దెలింగింపుమింపుమీఱం, బ్రకటనేమానిభైరవసుకవిచంద్ర.

క. వేంకటభర్తకుఁ సీకృతి, సంకితముగఁ జేయుమేలయగు నాతని హే
మాంకితరుచిరదేదీప్య, త్తకంకణగతమైన కెంపుకరణిం బొలుచున్.
వ. అనిపలికి, తాంబూలాంబరజాంబూనదాగ్రహారాదిప్రదానంబుల నాదరిం
చినఁ బ్రహృష్టాంతరంగుండనై షష్ఠ్యంతములం జెప్పెద-
అని షష్ఠ్యంతంబులు రచించెను. పైదానింబట్టిచూడ నీకవి పారిజాతాప
హరణాదికథ లింకఁ జెప్పి చేర్చియున్నట్లు తేలుచున్నది. భైరవకవి తనమూఁ
డవయాశ్వాసము పూర్తిచేయలేదు. చివర-
క. "హరిగరుడారూఢుండై, సురనగరీతులితభద్రశోభాంకితమై
మెఱసిన తద్ద్వారవతీ,పురమంతటఁ జూచె నపుడు భూపతితిలకా."
ఇట్టి భైరవకవికడపటిపద్యమును,
వ "అట్లుగాంచి భగవంతుండైన హరి మణిపర్వతయంత్రంబులను క్రీడాగృహం
బులను-" ఇత్యాది యెఱ్ఱాప్రెగడ వచనముతో సంబంధముకలిపెను. పైలి
ఖిత రెండుపద్యములు-
ఉ. ఆతతకీర్తి కాశ్యపవరాన్వయజాతముఁ లొట మీరు మ
ద్ర్యాతలు దేవపుణ్యజనభాసురదివ్యవిమానవాహవి
ఖ్యాతము లైతిరేకద సురాళికి శత్రుహ కార్యసాధనం
బీతఱిఁ జేయఁగావలయుఁ జేయుఁడు కూడదు మంత్రభేదముఁ గా.
మ. హరిపై చేఁ దివిజారినాథుపయిఁ గోపాటోపమేపాఱఁగా
నిరవద్యామితకాంతిదర్శనదశాంధీభూతభూచక్రముఁ గా
శరణార్థీంద్రముఁ ఖామరావనలసత్సాలభ్యనిర్వక్రముఁ గా
వరధారాహతఘోరరాతుసవిభాస్వన్నక్రముం జక్రముఁ గా.
ఇక్కవి గద్యము. ఇది శ్రీమత్కల్యాళిగౌరీచరణసరసిజషట్పదాయమానమా
నసోభయకవితాసార్వభౌమబిరుదాంక వేంకటభట్టారకపౌత్ర సూర్యనా
రాయణ సోమయాజిసత్పుత్ర నితుందినసగోత్రపవిత్ర నేమానిభైరవావ
ధాని ప్రణీతంబైన హరివంశంబునందు......ఆశ్వాసము.
" ప్రమోదూతనామసంవత్సర శ్రావణబహుళ ౧౦ శుక్రవారము
వరకు రాజశ్రీ రావు రామయ్యగారికిఁ మాళ్లు వెంకయ్యగారు హరివంశము
యిరవై మూఁడాశ్వాసాలు రాజశ్రీ కోటగిరి శ్రీనివాసరాయసింగరి ప్రతిస
సంపూర్ణంగాను వ్రాయించిరి-" ఈపుస్తకమును, పెండ్యాల వెంకటసుబ్రహ్మ
ణ్యశాస్త్రిగారొసంగిరి.

### (46) హనుమద్దండకము—గ్రం. సం. 176.

వేదపురీనివాసుఁడైన శ్రీయాంజనేయునిపై రచియింపఁబడిన దండకము. కవిపేరు లేదు. దక్షిణదేశప్రతి. తుదనుగూడఁ గవిపేరు లేదు. చాల శిథిలమైనది. కొన్నియాకులు విఱిగిపోయినవి. ఆంజనేయుండు సీతాన్వేషణమునకై బైలుదేఱినది మొదలు యుద్ధకాండము చివరవఱకుఁ గలరామాయణకథయంతయు నీదండకములో వర్ణింపఁబడినది. అక్కడక్కడఁ గొన్నివాక్యములు:—

"శ్రీజానకీనాథ పాదాంబుజధ్యానహృత్సన్నిధానా! నిధానా! సదానంద! సుజ్ఞానపారీణ! వేదాగమజ్ఞానవైమాని కానేకగంధర్వగానా! మహన్నందనా! వందనానేకభక్తాభిమానా! సుధాబృందనాన్యాతురీభావమానా! మనోల్లాసకైలాసవాసప్రియా! యుక్తసద్వీర్య సద్రంజనీయాంజనీగర్భసంజాత సంజీవరాయా! మహారాయ......శ్రీవేదపుర్యాశ్రమావాస! హృన్మంతరాయా!...... నిన్ను నుతింపంగ నేనెంతవాఁడ న్నసమర్థుండనా మైనవానేర్చినంతం బ్రపంచంబున న్విన్నవింతు న్వినోదంబుగా నీవు త్రేతాయుగంబందు శ్రీరామకార్యార్థమై పార్థివుల్మెచ్చఁగా నంగరంబంది మెంతో ప్రమోదంబునం జెంది బల్వానరానీకము ల్గొల్వఁగా సీత నీక్షింపఁగా వచ్చి............ఎల్లచోటుల విచారించి మెచ్చొటనుం గానక............" వ్రాఁత తప్పులు మెండు. మందబుద్ధినిరా! నన్నాదయోధ్యాపురం బేలరా! ఇట్టి ప్రయోగములున్నను పదములకూర్పు నియమములు బాగుగానున్నవి. "రాక్షసనామసంవత్సరము, అధికాషాఢ బహుళ చతుర్దశీ శుక్రవారమునాడు వ్రాసిన దీపుస్తకము." అనియున్నదిగాని వ్రాసినవారి పేరుగూడ లేదు. ౧౩ పత్రములు గలవు.

భారతారణ్యములోని "శ్రీకంఠలోకేశ" యనుదండకముగూడఁ గొంత కలదు. మఱియు,

సీ. శృంగారరాయుని చెలువుమీఱినకొండ ఫణిరాజుపేరింటి పసిఁడికొండ
పుష్పజాతులకెల్లఁ బూజింపఁగలకొండ కల్పవృక్షము లెల్లఁ గల్గుకొండ
చిలుకలు కోయిల ల్చెలఁగి యాడెడుకొండ మృగరాజకోట్లెల్ల మెలఁగుకొండ
ఘోరదురితము వాపు కోనేరుగలకొండ తలఁచిన మోక్షంబు దగులుకొండ
అమరవరులకు వైకుంఠమైనకొండ, ఆఱు నాడికి ప్రత్యక్షమైనకొండ
యర్థిఁ జాచిన బ్రహ్మాండమైనకొండ, యేచు గనుఁగొంటి శ్రీవేంకటేశుకొండ.

అనుపద్యమును నామగిరీశునిమీఁది పాటలు కన్యకామ్మ వారి హెచ్చరికలు మొదలైనవి.—

"సీ. హ్రీంకారి హుంకారిహిమశైలకన్యక అష్టాదశస్వరూపిణి బహుపరాకు
మలయధ్వజునిపుత్రి మధురాపురేశ్వరి వరకౌశికసుకీ బహుపరాకు
సౌందరేశ్వరురాణి శాంభవి జగదంబ భవవిమోచన దుర్గ బహుపరాకు

... ... ... ... ...

అఖిలలోకైకవందితా యాదిశక్తి, పరమకల్యాణి మాయమ్మ బహుపరాకు
పావనంబైనమీపాదపద్మములకు, దేవి మీనాక్షి కృపఁజూడు బహుపరాకు."

ఇట్లు కొన్ని తప్పులతో నున్నవి. నవతులకొట్లాట యని కృష్ణునిగూర్చి యఱవత, తెలుఁగుది, వాదించుట గలదు.

"ఎన్నఁడీవడువాచ్చిమన్మథక్కాళియాడీఅతికప్రసంగమాయి, తిట్టాదడీసాన్నేఁ
అఱపదాన నాదేవుని చెయిబట్టితే, మాలకూశేవు వాత్తోనువగలాఁడిపోపోవే.
వహామెన్న కాండామెడీ వడుహాచ్చి వంజనె శయ్యావేండాం,
మింజాదె మెన్నుడయ రంగసామి నెక్కూడి శెంఘుఁ కలవిశయ్యావో.

కూడినగర్వమున, అఱపదాన, కాట్లావచ్చితివేమి, ఆడరానిమాటలాడేవు నాతోనుఅవునె చెంపవేతునే॥ చెంపె యంగిర దెన్నడీ వడుహాచ్చి అతుమాత్రం కొల్లువాయిా కడుకడతు మెత్తగె మింజి వారాదే కన్నత్తులె యడిప్పేఁ."

ఇట్టే రెండుభాషలలో నత్తకుఁగోడలికి సంభాషణ కొంతకలదు.

(47) రంగపురిపారిజాతము. గ్రం. సం. 184.

యక్షగానము- 106 పత్రముల పుస్తకము. పుస్తకమువ్రాఁత చాలఁ దప్పులుగా నున్నది.

క. శ్రీరంగపురనివాసుని, సారకృపం బారిజాతసంగ్రహణంబుం
గోరి రచియించినాఁడను, ధారుణిఁ గవిశ్రీనివాసదాసుఁడఁ బ్రేమిఁ.

ద్వి. అగణితసౌందర్యశైనట్టిబుధులు,
శేషాంబ శేషాగ్యశిష్టులరకును, భాషావళీకృపఁ బాలుఁడ నగుచు......

అనువాక్యములంబట్టి కవికులగోత్రములు తేలుచున్నవి.

సత్యభామకథ, కృష్ణునికథ, దేవకికథ యిట్లు భాగములుఁ గలవు.

సీ. అమితతమాలవృక్షములార కానరే ఘననీలదేహు నొక్కరుని నిందు
లలితజ్యోతిర్లతావళులార కానరే శ్రీమించు పీతకౌశేయవాసు
విమలమా కమలాకరములార కానరే కళలఁ జెన్నొందుమొగంబువాని
ఆత్తగంధఫలీలతాంతములార కానరే నవహ్రాక్తికాగ్రనాసంబువాని

అనుచు నాసత్యభామ మదాంధత్వమున, శిరోమణి కొలువులోనను జిన జీమూష్మరింప
రంగపురవాసుఁ గానకయుంగభవ్రుని, ధాటిగాఁ బుచుచెడకెనాంతరుద్రకముల.

(48) సుందరకాండము.— గ్రం. సం. 181.

యక్షగానము—కట్టాభిరామకవికృతము. ఈకవికవిత్వము తక్కినయక్షగాన కవులకవిత్వముకంటె నిర్దుష్టముగా నున్నది.

ద్వి. ఇది భక్తరక్షణహితమతిపేర. విదితపూర్ణానందవిధవృపపేర
సదనారతప్రభాసాంద్రునిపేర, సదయుఁ డౌ శ్రీరాముచంద్రునిపేర
రచియించె నవసుధారసధారలీల, సుచరిత రఘురామస్ఫురణసొంపునను
సూర్యనారాయణసోమయాజికిని, వర్ణనీయుఁడనుఁ డైనకట్టాభిరామ
సుకృతి సుందరకాండసుకృతి నాంధ్రమున నొప్పుగ తలఁచి యీప్రబంధముగ.

శా. శ్రీసీతాలలితాంగి యంకమున రంజిల్లంగ సంగాంగలీ
లాసంగంబున నెంగలింపుచును గల్పద్రుమచ్ఛాయకు సు
ద్యాభ్యప్త్రోన్నతరత్నపీఠమున మోదంబొప్పఁగా నున్నయా
కౌసల్యాసుతుఁ డిచ్చు మాకు నెపుడుం గళ్యాణసాకల్యముల్.

అని యిష్టదేవతావందనంబు గావించి శ్రీరామదాసాగ్రేసరుం డైన యాంజనేయుని గవి యేమని వినుతింపుచున్నాఁడు—ఇది ప్రారంభము.

ద్వి. కోటవాకిటిమీఁది కొత్తళంబునకు, గాటంబుగను జివ్వకున వేగ దుమికి
వదలించి కట్ల నావలఁ బడద్రోచి, నడచుచుఁ దనవాలమున నద్భుతముగ
జ్వలియించుచున్న యాజ్వాలనుని జూచి, వెలయ నీయగ్నికిఁ బ్రీతిగా లంక
వెలిఁగింతు నని యతివేగంబు మీఱ, నప్రహస్తునియింట నగ్ని రగిల్చి
యింద్రజిత్తునిగృహంబున దహించి, సాంద్రంబుగా నగ్నిసముఁ గాల్పియుచట.

ఇది కథాభాగములోని యంశము. పిలవంగనామసంవత్సరం పంగుని నెల ౧౭ తి శెవ్వుడాయపట్టి యేర్లగడ్డ వేంకటసుబ్బావధానుల కుమారుఁడు రామసుబ్బయ్యశాస్త్రి వ్రాసినది.

(49) బచ్చుపురిమల్లికార్జునశతకము.—గ్రం. సం. 206.

స్వప్రకాశశతకమును.

ఈపుస్తకములో దాశరథిశతకము, నరసింహశతకము గూడఁ గలవు. కొన్ని యతివము వేదాంతపద్యములు గలవు ధన్యోహం కృష్ణాకృష్ణధన్యోహం, బ్రహ్మాభిర్ధన్యోహం. అను సంస్కృతకీర్తనలు గలవు. బచ్చుపురీశ్వర మల్లికార్జున

శతకములో అంబికకు మల్లికార్జునునకును సంభాషణముగా నగపడుచున్నది. "బచ్చపురీశ్వర మల్లికార్జునా" అని యంబిక ప్రార్థింపఁగా "బచ్చపురీశుఁడ నంబికానఖి!" యని మల్లికార్జునుని ప్రత్యుత్తరమును గలవు. శృంగారభూయిష్ఠముగా నున్నవి.

ఉ. శ్రీరజితాద్రివాస మునిసేవిత మీకు నమస్కరించి నే
నేరిచినట్లు వృత్తములు నెమ్మది రంజిల నూఱుపద్యముల్
కోరికలూరఁ జెప్పెదను గొబ్బునఁ గైకొని వేడ్కఁ బ్రోవఁగా
పాదము మీఁద మ్రొక్కెదను బచ్చపురీశ్వర మల్లికార్జునా' ఇది కవిప్రార్థన.

మ. చల మిఁక మానరా సరసనద్గుణ నిన్నిఁక నమ్మితింతురా
నిలువరప్రాణ మీమొదల నేరము లెన్నకు మేలుదానరా
బిలిచినఁ బల్కవేమి యిఁకఁ బ్రేమతో చూడర కోర్కి దీర్చరా
పలుమఱు నీకు మ్రొక్కెదను బచ్చపురీశ్వర మల్లికార్జునా.

చ. సరసుఁడ నాదు నెచ్చెలియ సారసలోచన ముద్దుగుమ్మరో
విరసము లాడకే యిఁకను వేడుకచేయవె జోడుగూడవే
నిరతము నీమనోకమాగ నిండుగ నున్నది ప్రేమ నామదిం
బరమహితుండ నెవ్వరికి బచ్చపురీశుఁడ నంబికానఖి.

తొంబదియేడుపద్యములు మాత్రముగలవు కవిపేరు తెలియదు.

స్వప్రకాశశతకము- గీతపద్యములు- "సకలతత్త్వకాశ స్వప్రకాశ" అని మకుటము- మచ్చుచూడుఁడు.

పద్మనేత్రశంభుబ్రహ్మాత్మరూపుల, నొప్పులవడియాన్వయోన్నతముల ?
నతిమదంబుతోడ నతిరాత్రయాజుల,ననవరతము హృదయమందుఁదలఁతు.
పెండ్లికోరువారు పెండ్లాలుగలవారు, యతులు మునులుశూద్రులంగనలును
జ్ఞానమార్గమునకు శ్రవణాధికారులు, సకలతత్త్వకాశ స్వప్రకాశ. ౨
భాగ్యవంతుఁడైనవాఁడు మోక్షముగోరి, యుండెనేని వాఁడు నుత్తముండు
జ్ఞానసాధకుఁ డని శాస్త్రజ్ఞు లంకురు, సకలతత్త్వకాశ స్వప్రకాశ. 3

వేదాంతమార్గమును బోధించును. ఎనుబదిరెండుపద్యములు మాత్రమే కలవు. కవిపేరు కానరాదు.

(50) నానార్థ సంగ్రహపద్యకావ్యము. గ్రం. సం. 201.

ఇందుఁ బెక్కుపద్యములు నానావిధములవి గలవు. ముప్పాతికపాలు శృంగారరసము.

భూరిగుణహారి శ్రీబృందపురవిహారి, దితిజకులవైరి కేశవదేవశౌరి- ముద్దుశ్రీహరి నేలుకో ముద్దుగుమ్మ- బుధజనానన్న వరకూరిపురముచెన్న- రాజగోపాలుఁ దేవమ్మ రాజవదన- వనితసీవేగి శ్రీవాయలూరిశౌరిఁ, దోడితేవమ్మ పోవమ్మ తోయజాక్షి- బళిర వినవయ్య యీబాలప్రౌఢతనము- సరసమైనట్టి మాటలసత్య మెఱిఁగి, తగవులీర్చినవాఁడె పో ధర్మరాజు- రార యేలుకో కోదండరామచంద్ర- విపులకరుణాంతరంగ శ్రీవిజయరంగ, చొక్కనాథధరాపాల సుగుణలోల. ఇట్టిమకుటములతోఁ గొన్ని పద్యములున్నవి.

ఇందు మొదట బాలసుబ్రహ్మణ్యశతకములోని పది నాల్గుపద్యము లున్నవి ఆపత్త్రము శిథిలమైనది. కావున వానిని మాత్రమిందుఁ బ్రాసిగఁ జూపుటయైనది.

సీ. శ్రీకంఠవరపుత్త్ర శృంగారతరగాత్ర సన్మునిస్తుతిపాత్ర జలజనేత్ర
వల్లీమనోహార వాహీకృతమయూర యఖిలలోకాధార యరివిదార
దేవసేనాలోల దివిజసన్నుతశీల భూధరజాబాల సద్గుణవిశాల
భానుకోటిప్రతాప బ్రహ్మణ్యవరరూప యమరసేనాటోప యహికలాప
నీదుపేరిట శతకంబు నేర్చినటులు, విన్నవించెద వినవయ్య వేడ్కమీఱ
శూరసంహార కిరిగిరి సుఖవిహార, సుకవిజనగేయ శ్రీబాలసుబ్బరాయ. ౧

సంతసంబున నిన్ను సంస్మరించుచు భూమి సంచరించెడువాఁడె సజ్జనుండు
నీపదాంభోజముల్ నిర్లజ్జుఁడై సదా భజన చేసెడువాఁడె భాగవతుఁడు
నిర్మలచిత్తుఁడై నిన్ను సేవించుచు ధరనుండు వాఁడె పో ధన్యుఁడరయ
సకలచరాచర సంతానుఁ డౌనిన్నుఁ బూజచేసెడివాఁడె పుణ్యతముఁడు
వీను లలరంగ నీనామగానరసము, విని సుఖించెడు వాఁడె వివేకధనుఁడు. శూ-

మంచుకొండవిలువాఁడు మార్తాండుఁ గనిగట్లు		త్రిగాంచినట్లు
క్షుద్బాధితుఁడు దివ్యసుధగన్న యట్టులు కడుదరిద్రుఁడు నిధిపడసినట్లు
జడమధ్యగతునకు సుడుప మబ్బినయట్లు ధరఁ దపస్వికి సిద్ధిదొరకినట్లు
తిమిరంబులో మంచి దివ్వెఁ జూచినయట్లు శిశువు తల్లిని జూచి చెలఁగినట్లు
నిన్ను గనుఁగొంటిశుభములు నింపగంటి, భవనదారిద్ర్యభూతంబు పాఱఁగంటి.

నట్టింట(లోనున్న) నవ్యనిక్షేపంబు గానక యాచించువానికరణి
యమృత మపేక్షించి యౌషధకాంక్షియై వనమూలికల కేఁగువానిపోల్కిఁ
గల్పకంబును బాసి కాంతారములలోనఁ దుమ్మచెట్లను బోయి నమ్మురీతి
భాగీరథినిపేడి వల్వలోదకముల వెతకిగ్రుంకెడు వట్టివెఱ్ఱిమాడ్కి

నిన్ను నేమఱిమూఢుఁడై యన్యసురులఁ గొలువఁబోవుటవ్యర్థంబు కావలయమున
దానధర్మములేని ధనరాసు లవియేల భోగింపఁగాలేని పొలఁతి యేల
ఆప్తులు గాకున్న యన్నదమ్ములు సేల దయతోడఁ బ్రోవని దైవ మేల
శరణన్నఁ గావని నరపతి బ్రతుకేల సత్యంబు మాలిన సఖ్య మేల
వేదహీనుండైన విప్రజన్మ మేల తనయులఁ బ్రోవని తల్లియేల
బుధులు వచించిరిన్నియు వృథయటంచు, నిన్నుఁ గొల్చినవారెల్ల ధన్యులండ్రు.

కవి యెవ్వరో తెలియదు. కొన్ని సంస్కృతశ్లోకములుగలవు. వ్రాఁతతప్పులు మెండుగానున్నవి.

శ్లో. లంకానాథకుహేళికావరిభవః ప్రద్యోతనో జానకీ
వక్షోజద్వయహేళికేళిరసిక స్త్రావాం రమాకాతర్పితా (?)
సర్వేభ్య స్వపదారవిందయుగళీభాజాం నిలింపద్రుమః
శ్రీరామ శ్శివతాతి రస్తు భగవా నామ్నాయ చూడాస్పదః.

(51) దండకములు- చిల్లరపద్యములు- గ్రం. స. 208.

(1) నామగిరి దండకము- నామగిరినరసింహస్వామి దేవియైనమహాలక్ష్మిపై దండకము- కవిపేరు లేదు. మచ్చునకు-

శ్లో. తారాధీశసహోదరీ భవమహాదారిద్ర్యసంహారిణీ
కారుణ్యాంబుధి సర్వలోకజననీ కల్యాణి కాంతామణీ
చారుశ్రీకరశోభనాంగి నరపంచాస్యప్రియా-
క్షీరాంభోధికుమారి నామగిరిలక్ష్మీ భక్తసంరక్షిణీ.

దండకము—శ్రీమన్మహానిత్యకళ్యాణి నీలాంబుభృద్వేణి నీరేజపాణీ బుధశ్రేణి సంరక్షిణీ సైకతశ్రోణి కంజాతసంజాత మాతా జగద్వ్యాతవిఖ్యాత శశ్వద్గుణోపేత......గర్వమర్యాదఁ గా నిత్యసర్వాపరాధిం గృపం జూడు మావంత మావంతలుం దీర్చి నాయొక్కవిజ్ఞాపనాలాపము ల్వింపు లాలించి పాలించి చేకొంగదే.........శర్వాణియు న్వాణియుం జామర ల్పట్టి నింద్రాణి కాళాంజి పట్టం సుపర్వాంగనల్ ఊడిగంబుల్ ప్రమోదంబుతో సల్ప...... ఓయమ్మ యవ్వారిగా వారికిప్పింపవే బాళిఁ గాళీపురీ వేంకటాధీశ్వరుం డైన శ్రీమన్మృకంఠీరవస్వామి గారాపుపూఁబోఁడి శ్రీనామగిర్యంబ లక్ష్మీజగన్మాత......నమస్తే నమః.

దండకము చివఱకుఁ జక్కగానున్నది.

(౨) ఆర్యపురీనాథదండకము—కవిపేరు దీనికినిలేదు. మచ్చుచూపెదము.
శ్రీమానినీమానసాంభోజసారంగ సారంగసంగత్కరా నిత్యకల్యాణ కల్యాణగోత్రేశధీరా సుధీరప్రజాధార విశ్వంభరాకాంత ధారాధరాకార...... ధూళీకృతాక్రూర మారీచదోస్సాటదోస్సాటవిభ్రాతకంజాతకంజాతనేత్రా అసత్రాంబుసుగ్రీవ సుగ్రీవమిత్రానుచారిత్ర...ప్రార్థించి నేమ్రొక్కెద౯ యెక్కువ న్మక్కువ న్నిక్కువ౯ బొవ్వ నావిన్నపం బాకట్టాలింపవే మంచి నీపాదపాథోరుహ ధ్యాన మెక్కాల మేమాటికి౯- నమ్మితి నమ్మితి న్నిన్ను......నామాతయు౯ ధాతయు౯ భ్రాతయు న్నీవె నీవాడ...కృపం బ్రోవుమార్యాస్తుతార్యాపురీనాథుడైనట్టి దేవోత్తమా యుత్తమాంగాచలాధీశ్వరా దేవదేవా నమస్తే.

ఆర్యాపురములో నుత్తమాంగాచలము కలదు కాబోలును, ఆయచలముపై నీస్వామి వేంచేసియుండును. కొన్నిమాటలంబట్టి పైదండకము కిదియు నొక్కరే రచియించిరా యను సంశయము కలుగుచున్నది.

(౩) కామాక్షీదండకము:—శ్రీమన్మహాదేవి శీతాద్రిజాతా జగన్మాత లోకైకవిఖ్యాతదేవాంగనా రాజితాద్రిప్రపాదంబునందుం మందారకాదంబజంబీర పున్నాగబిల్వాదిభూజంబులుం గల్గు నారామమధ్యంబున న్వజ్రవైడూర్యరత్నావళీ నిర్మితం బైనసన్మంటపంబందు మాణిక్యసింహాసనాసీనుడై యున్న ముక్కంటికి న్వామభాగంబునన్ భద్రపద్మాసనాసీనవై భక్తులం బ్రోచు.........తల్లీ నినుం జూచి సాష్టాంగదండప్రణామంబులం జేసెదన్ నన్నురక్షించు............సర్వలోకేశ్వరుండైన యేకాంబరాధీశ్వరుంగూడి యున్నట్టి కాంచీపురీనాయకీ.....నన్ను రక్షింపవే చాల నాపాలిదోషాంధకారంబునుం బాపు పోచూరి శ్రీకేశవస్వామికిం జెల్లెలైనట్టి యోకాంచి కామాక్షిదేవీ నమస్తే.

ఈకవి పోచూరినివాసియేమో-పేరు తెల్పుకొనలేదు.

(౪) సూర్యదండకము:—శ్రీమన్మహాకశ్యపబ్రహ్మపుత్రా పవిత్రా జగన్మిత్ర పూషార్క మిత్రా.....సూర్యనారాయణా వేదపారాయణా దేవదేవా నమస్తే నమః
ఈదండకము క్రొత్తదిగాదు. పలువురు నిత్యమును బఠించునదియే. దీనికిని కవిపేరు తెలియదు.

(౮) చిల్లరపద్యములు:- కాంతాలలామశతకములోనివియు, నలుపు, తెలుపు, పసుపు సీసపద్యములును గలవు.

రామచంద్రునివంటిరాజు తాఁ గల్గెనా పవనసందనువంటి బంటుగలఁడు
ధరణి గృష్ణునివంటి తండ్రి దాఁగల్గెనా కుసుమబాణునివంటి కొడుకు గలఁడు
విక్రమార్కునివంటి వీరుండు గల్గెనా భట్టివంటి యుపాయపరుఁడు గలఁడు
రమణ భోజునివంటి రసికుండు గల్గెనా కాళిదాసునివంటి కవియుఁ గలఁడు
నాఁటివారికిఁ దక్కువే నేఁటివారు, ఎంతవారికిఁ గలుగుదు రంతవారు
కలఁడు వేయింటికొక్కఁడు కడమలేదు, ఆశ్రితామరయూథ సింహాద్రినాథ.

సీ. ఎలనాఁగ నీదేశ మేదేశ మన్నను జెలువంపుఁగానొక్క చేతఁజూపెఁ
బద్మాయతాక్షి నీపట్టణం బేదన్న శిలలతటాకంబు పేరబలికె
నిందీవరాక్షి నీయిల్లెక్కడన్నను దలవాయి మోచినతరువుక్రింద
వేటిదానవె కోమ లెఱిఁగింపుమన్నను యేటిలో గొన్నల్లు మొదురుబుచ్చె
నళినాయతాక్షి నీనామ మేదన్నను తరువాతఁ దినముని తరుణిబలికె
వెలఁది నీకు విభుఁడు గలఁడే యటన్నను, నీళ్ళమీఁదవ్రాసి నెలఁతచూపె
నెలఁత నీకు నిద్ర గలదెంత యన్నను, చుక్కఁజూపి సుదతి సున్నచుట్టె.

... ... ... ... ...

క. అంబా పూర్ణసుధాకర, బింబానన త్రిజగదతులబిసరుహనయనా
జంభారివినుత శ్రీబృహదంబా జగదంబ శ్యామలాంబ మదంబా.

బృహదంబపైఁ బద్యములు చాలఁగలవు.

భళిరరవితేజ శ్రీకంచివరదరాజ-రమ్యగుణయూథ కావేటిరంగనాథ-చందమామ- ఏలతరితీపుఁజేసేవు మొహ్మోలాఁడి- ఇట్లంత్యనియమములు గల పద్యములు కొన్నిగలవు. నాదబ్రహ్మానందయోగి- పదములు గలవు.

ముక్తిమిచ్ఛసి చేత్తాత విషయాన్ విషవత్త్యజ
క్షమార్జవదయాశౌచసత్యం పీయూషవద్భజ.

ఇట్లు శ్లోకము లనేకములుగలవు.

ఉ. బూరుగమ్రానియున్నతమఁ బువ్వులఁ బిందెలఁ జూచి యాశతోఁ
గీరము లాలుసెల్లు తమకింపఁగఁ గాచి ఫలాభిలాషియై
చేరి రసంబుగ్రోలఁ గొనఁ జంచినదూదియు రేఁగినట్లపో
కూరిమిలేనిరాజులను గొల్చినఁ బెమ్మయసింగధీమణీ.

## (52) వచననైషధము- గ్రం. సం. 263.

ఇది దాక్షిణాత్యుఁడు వ్రాసినవచనము. దక్షిణదేశమునం దున్నయాంధ్రుఁడే కావచ్చును. భాష గ్రామ్యము గా నున్నది. కథ కేవలభారతములోనిదే కాదు నైషధకథకూడఁ గొంత చేర్చినాఁడు; అఱవనైషధకథ కూడఁ జేరియున్నదేమో యన్న ట్లున్నది. గ్రంథము పెద్దదియే కాని సంపూర్ణము గాదు; ఉన్న దున్నట్లు కొంతభాగము చూపఁబడును.

"అదింన్ని మీారుంన్ను కూడి వుండ్డేటప్పుడు అది చెప్పగా మీాకు సకలమున్ను తెలియపోసుంన్నది. ఓనళమహారాజా। మీారు శీఘ్రముగా పోతే దానికి ప్రాణము నిలుచును, ల్యాకపోతే నిలువచాలదు కాబట్టి అతిశీఘ్రముగా మీారు పొండ్డని చెప్పి ఆనళమహారాజు దగ్గర వుత్తరవు తీసుకొని ఆఅంసము తనకూటముతో కూడా యెగరి ఆకాశమార్గణముగా పోయి బ్రహ్మయొక్క మానస సరస్సులో పోయి చేరెను వింట్టిరా ధర్మనందనా। అవతల ఆనళమహారాజు అంసను అంప్పించ్చివేశిఁ మన్మథుని కోపించ్చుకొని విరహతాపము తాళజాలక అలిసి క్రిందపడి నిద్రపోయేటప్పుడు మన్మదుడు వచ్చి తంన్ను దమయంతితో కూడా చేరుకొన్నట్టుగా స్వప్నంకని లేచి కలగనినామని లేచి చూచి వఖరితోనుంన్ను మాటాడగనే మన్మథబాణములు చురుకు చురుకుమని నాటేట్టందుచేతను నిండ్డావ్యాకులముతో- అంన్నమూ హారనిద్ర ల్యాకనే హరికీర్తనము చేసుకొనుచుంన్ను వఖక్షణం వఖయుగముగా కాలం దొబ్బుకొని నళమహారాజు వుండ్డెను...."

"వోయి ఋషులార నేను నాపురుషుడుంన్ను నాబిడ్యలుంన్ను కూడుకొని వుండ్డేద్దానికి యెన్నిదినాలు చెల్లు నని అడుగగ మునీశ్వరులు యోచన చేశి అంమ్మా దమయంత్తి యింక్కా మూడుసంవ్వత్సరములు పోయినవెనుక నీవున్ను నీపురుషుడుంన్ను నీబిడ్యలుంన్ను చేరివుంద్దురు. అప్పుడు మేము చెప్పినమాటను నీవు తలచుకొపోసునావు" ఈవాక్యములు కడపటనున్నవి తరువాతకథ లేదు. 79 పుటలు- కవిపేరు తెలియదు.

## (53) తపతీసంవరణోపాఖ్యానము- గ్రం. సం. 292.

పద్యకావ్యము- కొట్ర నరసింహకవివిరచితము. చతుర్థాశ్వాసము చివర గద్య మి ట్లున్నది.

" ఇది శ్రీనరసింహవర ప్రసాదలబ్ధవాగ్విచిత్ర కౌశికసగోత్రపవిత్ర

కొట్ట్ర నారాయణార్యపుత్ర నయగుణవిధేయ నరసింహనామధేయ ప్రణీతం బైన సంవరణోపాఖ్యానం బను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము."

అద్దంకి గంగాధరకవికృత తపతీసంవరణోపాఖ్యాన మొక్కటి కాకి నాడ సుజనరంజనీముద్రాక్షరశాలలో నచ్చుపడినది గలదు. ఇందు నడుమనడు మఁ గొన్ని పత్రములు లేవు. ప్రారంభము కనఁబడదు. కవిత్వము 'సరసమైన ది. ఉన్నపత్రములు వరుసగా లేవు. కొంతభాగము శిథిలమైనది. కొన్నిపద్య ములు మచ్చుచూపఁబడును.

మ. మధురంబై యతిశీతమై విమలమై మందానిలాలోలమై
సుధతో సాటువయై మనోహరమునై శుద్ధంబునై యొప్పు నీ
పథికవ్రాతవిదాహతాపహరణప్రావీణ్యతోయంబు త్వ
ద్విధ మెవ్వారు నుతింపనోపుదురు కావేరీ నదీరత్నమా.

చ. ఖరకరధాటికి న్వెఱచి కాదె హిమంబు కురంగలాంఛనా
గురుకుచశైలమార్గములఁ గూపముల స్తతి న్రూఁకునీడలఁ
శరణము నొందె నట్టియెడ సందియమైనఁ దుషారవేళ లం
దరయఁగ నందు వేఁడి మెనయఁ బనియేమి జగత్ప్రసిద్ధిగన్.

మ. హితునిం గన్గొని పల్కెఁ నాపురికి నీవే తెంచి యక్కార్యముఁ
మతిదోఁప న్రుచిమంతుతోఁ దెలిపి హేమంబు ల్సుచేలంబులు
న్వితత శ్రీయుత రత్నభూషణములు న్విఖ్యాత తత్తత్క్రియో
చితవస్తూత్తర మిచ్చి పంపు మని పంచెం గౌతుకావాప్తుఁడై.

క. యమునానది పుణ్యానికా, యమునా నది యొంపెసంగె నంభోనిధి సం
భ్రమదా భ్రమదాపహావి, భ్రమదారితదురితదావపావక యగుచున్

ఉ. అంతఁ బురంబు వెల్వడి నిరంతరభూసురకోటి సంతతా
క్రాంతము రాజమార్గపరికల్పితభూరితరాన్నసత్త్రశో
ధ్రాంతము వేదశాస్త్రనిజతత్త్వవిశాంతము చోళమండల
ప్రాంతము సహ్యజాసలిలభావుకవంతముఁ గాంచె వేడుకన్.

(54) ప్రపన్నజనచింతామణి. గ్రం. సం. 331.

ఇది యొకపద్యకావ్యము- కవిపేరు తెలియఁజేయు భాగము లేదు. ఇందు పరబ్రహ్మలక్షణ వినిర్ణయ ప్రకరణము, పూర్వాచార్యావతార ప్రకర ణము, సంప్రదాయ రత్నాకరప్రకరణము నని కొన్నిభాగములు గలవు-

విశిష్టాద్వైతమతసంప్రదాయము తెల్పఁబడినది. కవిత్వము సొగసైనది గాదు. ఒక్కొక్క ప్రకరణమున 50, 60, 80 పద్యములు గలవు. అన్నియుఁ గందములే.

క. కదలక నిలిచినవారికిఁ, గొదవేమియు లేదు శౌరి కొనసాగించుఁ
మదిలోఁ దలఁచిన కోర్కులు, తుదముట్టఁగఁ జేయునతఁడు తోడాసింపఁ

క. ఎఱిఁగించెద బరవస్తును, దిక్కులయం దవతరించెఁ దిరుమలపతిచేఁ
జెఱుఁగును సారము నందిన, పెరియగు గోవిందులకును బెరియప్పకునూ.

క. కూడారగించెఁ దిరువడి, తోడను సహభోజనంబు దొలఁగక శబరిఁ
జాడలు యెన్నక యామెచె, వేడుకతో నారగించె విష్ణుఁడు ప్రీతిఁ

క. పరవస్తగు రంగేశులు, చరణద్వయ మైనవారు శఠ వైరులు త
చ్చరణులు యతిరాజులు త, చ్చరణులుపరయోగివారిచరణులుజియ్యరూ.

క. ఉండఁదగుచోటు గురువరు, నండను నెపుడుండఁ దగును నది మే లదిలే
కుండిన హరిసన్నిధిలో, నుండుట గుణ మితరచోట్ల నుండఁగఁ జెప్పరూ.

క. తనుబాధింతురు రాజులు, ధన మిచ్చని దొంగవాండ్రు దాయాదులు స్త్రీ
జనములు మందులు పెట్టుదు, రనయము కామాదిలోభ మైనది ధనమూ.

కడపట కులశేఖరాళ్వారుల ముకుందమాలయు, అష్టశ్లోకియుఁ మొదలగునవి గలవు.

## (55) చాటుధారాపద్యములు

ఈపద్యములు గ్రం. సం. 2531 భాగవతములో ౧౨౦వ పత్రము తరువాయిని శ్రీమదస్మద్గురుభ్యోనమః అని యొకపత్రములో వ్రాయఁబడియున్నవి. గ్రంథభాగములోఁ గలసిపోయినవే గాని క్రొత్తగాఁ జేర్చినవి కావు.

సీ. "శ్రీకరకవిభటాశ్రితజనావళులకు విరివిగా సిరులూఱు వెల్లటూరు
తాంబూలకదళికాజంబీరతతులచే విఱ్ఱవీఁగుచుఁ గేరు వెల్లటూరు
ద్విజరాజవిట్శూద్రసుజనవ్రజమునకు వేల్పుగి డ్డనమీఱు వెల్లటూరు
సతతంబు దేవతాసంతర్పణంబుల వేడుకఁ జేకూరు వెల్లటూరు
అట్టి వెల్లటూరు కధిపతులైనట్టి, కమలకాళిపతుల గరుడవృషభ
గమనులను పినాకఘనశార్ఙ్గహస్తుల, శూలికేశవులను జాలఁ దలఁతు.

క. పురుషోత్తమ లక్ష్మీపతి, నరసిజభవ వామదేవ సంస్తుత్యహరీ
నరసఖ శౌరి జనార్దన, గరుడగమన పాండురంగ కలుషవిభంగా,

క. శ్రీమానినీమనోహర, దామోదర వాసుదేవ దశరథతనయా
  కామితఫలదాయక ని, న్నేమఱు వినుతింతు బిజనవేముల చెన్నా.
క. వర్ణించెద హరిభక్తిని, బ్రార్థించెద నీమదివ్యపాదాబ్జంబుల్
  కర్తయు నీవని సతతముఁ, గీర్తించెద వెల్లటూరి కేశవమూర్తీ.
క. కమలాప్తుని శిష్యుఁడవై, కమలాప్తుని వంశ్యుఁడైన ఘనునకు సీతా
  ప్రమద సుఖం బెఱిఁగింపవె, యమడాలలో వెలసినట్టి యంజనితనయా.
గీ. దహనమిత్రపుత్ర తపననందనమిత్ర, శక్రరిపులఁ బట్టి విక్రమమున
  భంగపఱిచినట్టి బలవంతుఁడవు నీవ, యమడవాళ్ళనుండు నాంజనేయ.
క. కోటిమదనసౌందర్యా ని, శాటభయద శూలహస్తశార్ఙ్గధరసఖా
  పాటించి నిన్నుఁ బొగడెదఁ, దాటిపరితి రామలింగ ధవళశుభాంగా.
క. కంతుని జనక మురాంతక, శాంతహృదయ తావకాంఘ్రి జలజంబులు నే
  సంతతమును మదిలోపలఁ, జింతించెదఁ దాటిపర్తి చింతలరాయా.
శ్లో. వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేఃపౌత్ర మకల్మషమ్
  పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్.
శ్లో. మునిం స్నిగ్ధాంబుదాభాసం వేదవ్యాస మకల్మషమ్
  వేదావాసం సరస్వత్యా వాసం వ్యాసం నమామ్యహమ్.
శ్రీవేదవ్యాసభగవాన్ నారాయణాయనమః
శ్లో. తత్త్వవిద్యాపయఃపూర వర్ధితచ్ఛాత్రబాలకమ్
  రాగయోగసుధాతాన్కన్య సుబ్రహ్మణ్యగురుంభజే.
క. విద్వన్నజకంఠీరవుఁ, డద్వైతవిచారి షణ్మతాధికగుణసం
  పద్విభవమతోద్ధరుఁ డ, స్మద్వరగురు సుబ్బయోగిమండను గొఁ
శ్రీమదస్మద్గురుభ్యోనమః"- అనికలవు.

(56) పృథుచరిత్రము- గ్రం. సం. 534.

ఈప్రబంధ మెన్నియాశ్వాసములదో కాని పరిషద్గ్రంథాలయములో నున్నది యసంపూర్ణగ్రంథము- తృతీయాశ్వాసములోఁ గొంతభాగమును జతుర్థాశ్వాసములోఁ గొంతభాగమును మాత్రము కలవు. తృతీయాశ్వాసాంతగద్య మిట్లున్నది.

"ఇది శ్రీమత్పంచాక్షరీపంచదశాక్షరీమంత్రప్రసాదాసాదితైకసంథాగ్రహణనవ్యకావ్యవిద్యావధాన షట్సహస్రసుల ప్రధానప్రధాన హరితహరితస

గోత్రపవిత్ర చరిత్రప్రభట్ట పట్టమట్టపోతనామాత్యపౌత్ర పెద్దనామాత్య పుత్ర సారసారస్వతవిభ్రాజి సరస్వతిసోమయాజిప్రణీతం బైసవృషచరిత్రం బనుమహాప్రబంధంబునందు తృతీయాశ్వాసము-

క. శ్రీమద్గంగాజూటీ, హైమవతీభానుమితమహత్త్వగుణమయ
త్వామితమూర్త్యనుషంగా, ప్రేమావితశిఖితురంగ భీమయలింగా !

ఇది చతుర్థాశ్వాసాదిపద్యము. కృతి భీమలింగేశ్వరస్వామి కీయఁబడినది. ఈకవి గోదావరీమండలములోనివాఁ డనుకొనవచ్చును. కృతిద్రాక్షారామభీమలింగమున కిచ్చుటయుఁ దత్సమీపముననే వెలువలపల్లిలో పట్టమట్టవా రుండుటయుదానికిఁ గారణము. పట్టమట్ట సోమనాథకవి యనునతఁడు స్కాందపురాణములోని సూతసంహితను దెనిఁగించి బిక్కవోలిప్రభు వగుకామారెడ్డి కంకితముచేసెను. సోమనాథకవియు సోమయాజియు జ్ఞాతులే యని తోఁచుచున్నది. సూతసంహితను గృతినొందిన కామారెడ్డి షట్చక్రవర్తిచరిత్రమును రచించిన మల్లారెడ్డియన్న. ఈమల్లారెడ్డియే శివధర్మోత్తర మనుగ్రంథమును రచించి తనయన్న కామారెడ్డికిఁ గృతియిచ్చెను. కామారెడ్డికాలము కవులచరిత్రమునకుఁ దెలియలేదఁట. మల్లారెడ్డి ఇబ్రాహింకాలములోనివాఁడనియు ౧౫౫౦-౧౫౮౧ సం॥ లో నుండుననియు నిర్ణయించియే యున్నది. కావున కాలనిర్ణయములోఁ జిక్కులేదు. బిక్కవోలును గోదావరిజిల్లాలోని బిక్కవోలని కవులచరిత్ర మనుకొనుచున్నది. రాజమహేంద్రవరమును బాలించిన వీరభద్రరెడ్డి మొదలైనరెడ్లసంబంధుఁ డనితోఁచుచున్న దనుచున్నది. అది నిజాం రాజ్యములోని సిద్ధరామేశ్వరక్షేత్రమునకుఁ జేరిన బిక్కనవోలు గాని యీబిక్కవోలు గాదు. దోమకొండసంస్థానాధీశ కామినేని వంశసంభూత రాజామల్లారెడ్డికవిప్రణీత శివధర్మోత్తరము పీఠికఁ జదివినఁ దేటపడును. దానిని శ్రీరాజా మహారణనీరవంత్ బహద్దరుగారు దోమకొండ సంస్థానాధిపు లచ్చువేయించి ప్రకటించిరి. మల్లారెడ్డి షట్చక్రవర్తిచరిత్రను రచించినపిమ్మట రచించిన దగుటచే శివధర్మోత్తరము విషయమును బలువురు తెలిసికొనుటకు వలనుపడలేదు.

సరస్వతీసోమయాజి గోత్రసూత్రాదులు పైగద్యమువలననే స్పష్టమగుచున్నవి. కవిత్వము రసవంతమైనది. చూడుఁడు-

మ. అనలం బున్నది నీకుఫాలతలమందో నవ్వేఁడి లేకున్న నీ
తనుమధ్యంబున లాంచనచ్ఛలమునం దగ్ధాము ముప్పొంగునో
వనితామానసదేహదుస్సహతరజ్వాలాశిఖావైఖరుల్
గనునో నీయమృతస్వరూపకరముల్ కాకోలకంఠాకృతుల్.

ఉ. ఏమని దూఱుదాన జగదీశ్వర నిన్ను సముద్రనేమిమ
త్స్వామినిగా మహాఘనులఁ గన్నదిగా కమలాసపత్నిగా
సోముని మూర్తిగా యనక చూచెద వాగ్రహదృష్టి నయ్యయో
కాముని తల్లిఁ జెప్పెడిదిగాక నృపాలుర నేల చెప్పఁగన్.

ఉ. అత్త సుధాబ్ధిపుత్రికిని నాయమకోడలికొమ్మ శారదా
మత్తచకోరనేత్రికిని మైత్రియ కాని విరోధ మెయ్యెడన్
హత్తగఁ జేయఁ డీధరకు నాదిమభూపతి ప్రజ్ఞ యెట్టిదో
చిత్తజమిత్రశత్రులకుఁ జేయు మహత్తరమిత్రభావముల్.

ఉ. సారసజీవనంబులను సర్వజగజ్జనజీవనంబులన్
నీరసతీవ్రధామములఁ నిష్ఠురతం దపియింపఁజేయఁగా
సారసబంధుశబ్దమును సర్వజగజ్జనబంధుశబ్దమున్
సూరున కింకఁ జెల్ల దనఁ జొచ్చిరి వేసవి నెల్లవారలున్.

ఈపృథుచరిత్రము సంపూర్ణప్రతి యున్నవారు పరిషత్తునకుఁ బ్రతి వ్రాసికొనుట కొక్కసారి పంపఁగోరెదము.

(57) ముక్తిచింతామణి- గ్రం. సం. 539.

ఇది యొక్క వేదాంతపద్యగ్రంథము. మూఁడాశ్వాసములు. కవి అండలూరి మల్లికార్జునకవి- గద్యము. "ఇది శ్రీమదఖిల విద్వత్కవిజేగీయమాన నరసకవితావిచిత్ర అండలూరి శరభనార్యపుత్ర సమధిగతవీరశైవాచారవిధాన మల్లికార్జునాభిధానప్రణీతంబైన ముక్తిచింతామణి యను వేదాంతప్రబంధంబునందు రాజయోగనిరూపణం బన్నది సర్వంబును దృతీయాశ్వాసము.''

ఈగ్రంథమును సృష్టికరణకుశలజుఁడును ముఖికాశీపతిపృథ్వీరమండలరమణలబ్ధవిభవుఁడు నగు కృష్ణమంత్రి కంకిత మిచ్చెను. ముఖికాశీపతిపృథ్వీరమణుఁడు శృంగవరపుకోటప్రభువు. శృంగవరపుకోట విశాఖపట్టణమండలము లోనున్నది. ఈకృష్ణమంత్రి, పాత్రుని కృష్ణమంత్రి కావచ్చును. గ్రంథ ప్రారంభము:—

ఉ. శ్రీకుచకుంకుమం బెదను జెందఁగ డెందమునందుఁ జెందున
స్తోకదయారసంబు కురియుదోఁచె ననం దగుభక్తలోక ర
క్షాకరుఁ డిందిరాధరుఁడు శాశ్వతవైభవలక్ష్మి నిచ్చి సు
శ్లోకుని గృష్ణమంత్రి నతిశోభనదృష్టిఁ గృతార్థుఁ జేయుతన్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా- అని- కృత్యాద్యుపద్యములు విడువఁబడినవి. ప్రథమాశ్వాసాంతమునందు-

చ. అతిబలభీమ సృష్టికరణాన్వయవారిధిసోమ కీర్తి గుం
భితకకుబంత బంధుకవిమిత్రవనాంత వనంబు సాధువ
ర్ణితకృతధర్మ షడ్గుణవినిర్జితశాత్రవమర్మ మేరుప
ర్వతసమధైర్య కాశిపతిరాజహితా దృఢకార్యధీమణీ.
ఘనవైభవసాంద్ర సృష్టికరణకులేంద్రా ! అను మొదలగునవి కలవు.

క. శ్రీముఖకాశీపతిపృ, థ్వీమండలరమణలబ్ధవిభవైశ్వర్యో
ద్దామముఖసీపంకజనీ, స్వామిఘృణిక్రిష్ణమంత్రి సామంతగుణీ.

ఇది ద్వితీయాశ్వాసాదిపద్యము. ఆశ్వాసాంతపద్యములు లేవు.
తృతీయాశ్వాసాదినిగూడ "శ్రీముఖకాశీపతి" యనుపద్యమే కలదు.
తృతీయాశ్వాసాంతపద్యములును లేవు. కవిత్వము మచ్చుచూడుఁడు.

గీ. అన్యసాధనంబు లన్నిటికన్నను, బోధనంబు మోక్షసాధనంబు
పాకమునకు వహ్నిపగిది నీజ్ఞానంబు, గలుగకున్న ముక్తిగలుగ దనఘ.

చ. వెలుచ ఘటాదులందుఁ బ్రతిబింబితమైన నభంబు మాడ్కి లో
నిలిచి యుపాధిసంగతి ననేకవిధంబుల భిన్నమూర్తియై
చెలఁగి శివుండు ప్రొద్దులు నశించినఁ గేవలుఁడై చిదాత్మయై
యలరుటఁ జేసి యాశివుని కన్య మొకించుక లేదు చూడఁగన్.

చ. మనసు నివృత్తిగాక లవమాత్రము చిత్తము శుద్ధిగాదు లో
నోసరఁగఁ జిత్తశుద్ధి గనకుండిన జ్ఞానము లేదు జ్ఞానమా
త్మను సమకూడకున్నఁ బరతత్త్వముఁ గానరు తత్త్వ మబ్బకం
గనుఁగొనరాత్మ సాత్త్వికడగానక ముక్తులుగారు యెవ్వరున్.

శ్రౌద్రి సం॥ అధిక ఆశ్వీయుజ బ ౧౦ ఆ॥ వరకు మలాల పాపయ్య వ్రాసెను.

(58) ఆంధ్రకుసుమావళి—గ్రం. సం. 552.

వారణాసి వేంకటరాయకవిప్రణీతము.

ప్రారంభపద్యములంబట్టి కవియుద్దేశము తెలియును.

క. శ్రీకంఠ భక్తవత్సల, లోకైకస్తుత్యనామ లోకాతీతా
శ్రీకళిమికోటపురహర, శ్రీకర త్రిపురాంతకాఖ్య శివశివలింగా !

గీ. పొసఁగ నాంధ్రశబ్దపుష్పంబు లొకకొన్ని, పద్యరూపగుచ్ఛపటలిఁ జేసి
యదియు మీకు మదికి నర్పణచేయుదుఁ, జిత్తజారి దీనిఁ జిత్తగింపు.

గీ. ఆంధ్రకుసుమావళియనునట్టిపేరఁ, దెనుఁగుభేదములొకకొన్ని తేటపఱుతుఁ
గోరి సత్కవిప్రభు లాధారముగను, దేవ నీదగుకరుణచేఁ దెలిసినట్లు.

గీ. ఆంధ్రశబ్దశాస్త్ర మనువార్ధినేర్పాటు, చేయనోరుల కెట్లుచెల్లనేర్చు
నల్లసానిపెద్ద నన్నయభట్టాది, శబ్దవేత్తలకును జనునుగాక.

గీ. తొలుత సంజ్ఞల నొకకొన్ని దెలిపిపిదప, సంధిభేదంబులొకకొన్నిజాడదెలిపి
శబ్దసంగతు లెఱిఁగినసరణిఁ జెప్పి, యందుమార్గంబుఁజెప్పెదనరసికొనుఁడి.

ఈకవిగద్యము—

"ఇది శ్రీమద్గౌతమసగోత్ర వారణాసిలక్ష్మీనృసింహార్యతనూభవ వేంకటరాయనామధేయప్రణీతంబైన యాంధ్రకుసుమావళి యనుశబ్దశాస్త్రంబు నందు సంజ్ఞాపరిచ్ఛేద సంధిపరిచ్ఛేద శబ్దపరిచ్ఛేదంబులు సర్వంబును నేకాశ్వాసము" మచ్చుపద్యములు—

గీ. దీర్ఘవర్ణమందుఁ దేరిచూడంగను, సున్న లేనియట్లు నున్నయట్లు
నర్ధబిందు వనఁగ నరసున్న యనఁగను, పేర నిదియుఁ జెల్లు బ్రేమ్రరుద్ర.

క. పుల్లింగశబ్దజాలము, చెల్లు మహత్తులనఁగ మఱి స్త్రీజడపశ్వా
ద్యుల్లసిత శబ్దజాలము, నెల్లెడ నమహత్తులనఁగ నీక్రియఁజెల్లున్.

క. నీవును వచ్చితి వనఁగను, వావిరి మరియొకఁడు వేఱె వచ్చినయట్లే
నీవును జనుమని యనఁగను, భావంబున వేఱ యొకని బంపెదననుటన్.

"శేనాధిపత్యం శేషాచార్యులు నల సం॥ జేష్ట బ ౧ లక్ష్మింవారం సరికి యీకుసుమావళిలో వకప్రకరణం వ్రాసె నని తెలియగలందులకు సుజను లయినవారిని ప్రార్థిస్తాను" అని చివరనున్నది.

(59) త్రిమలమాసాదినిర్ణయము-గ్రం. సం. 596.

చోళరాజీయ మనునోక్త సిద్ధాంతగ్రంథములో మొదట నొకపత్రము మీఁద నీవిషయము వ్రాయఁబడియున్నది.

శ్రీమద్విజయాభ్యుదయప్రాభవశాలీ సశాలివాహనరాట్
జీయా ద్యస్య శకాబ్దా శ్చతురంబుధిశైలభూమిపరిమితయః. ౧
అద్యతనచిత్రభానౌ మాసత్రితయం మలీమసం భవతి
ద్వామాసౌ విగతరవీ ద్విరవి ర్మాస స్తథైక ఇత్యేవమ్. ౨
రవిరహితః ప్రా క్ఛుద్ధ స్సంసర్పాఖ్య స్తతో ద్విసంక్రాంతః
అంహస్పతి రపి శుద్ధ స్తమప ర్యరవి ర్మలిమ్లుచ స్త్వశుచిః. ౩
భాద్రపదమాసదర్శే కన్యామాప్నోషతి భూయ ఆదర్శః
తదను ప్రతిపది తౌళే మారూఢో మాసి మార్తాండః. ౪
తదుపరి దర్శ మతీత్య త్వష్టా సముపైతి వృశ్చికం భూయః
తౌళీవృశ్చికసంస్థే దర్శసమాప్తి ర్విభావ్యతే యత్ర. ౫
తత్సమసంఖ్యా మాసౌ తౌ ద్వౌ భవత స్తథాశ్వికార్తికికౌ
బాహుళదర్శ మతీత్య ప్రతిపది ధనురేతి తదను దర్శేచ. ౬
మకరప్రవేశ ఇతిత న్మాసో భవతి ద్విసంక్రమాక్రాంతః
కుంభస్థేర్కే మాఘ స్సతి మీనస్థేచ భవతి ఫాల్గునికః. ౭
సంక్రాంతిహీనమాసః తత ఏక స్త్రిమలసంభవ స్త్వేవమ్
ఆశ్వినమాసవిధేయ ప్రత్యాబ్దికకర్మరూప ముభయత్ర. ౮
సాంకల్పికం సపిండం కుర్యా దిత్యేవ శాస్త్రసిద్ధాన్తః
మార్గశిరః పౌషగత శ్రాద్ధా న్యేకత్ర మాసి విదధీత. ౯
పూర్వాపరాహ్ణభేదా దిత్యేషా భవతి శాస్త్రమర్యాదా
దశమాస్యాః ప్రకృతిస్థాః వైకృతికాస్తు త్రయో భవం త్యేవ. ౧౦
సంసర్పాంహస్పత్యో మలిమ్లుచశ్చ త్యేత త్రయోదశేతే
వెల్లాలాన్వయజనుషా హోబలనరసింహనామధేయజుషా. ౧౧
విదుషా మేత త్త్రిమలీమసమాసవివరణం శరణమ్
వేదాద్రినందవర్షే శాకే పూర్వం గతోథ తిథిరంధ్రైః. ౧౨
పశ్చాదంగశరాక్షిక్షితిభి రథాష్టాద్రిరామ శశిభిశ్చ ౧౩౭౮

అథపర్యాయత్రితయా దేకో నవభో(౧౯)నశశిజలేందు మిత్యైః(౧౪౧)౧౨౨
సముపాగతా దుపేత స్త్రీమలీమసమాసవర్ష ఉదయాయ
వేదాబ్ధిశైలభూమితి రభిధేయ శ్చిత్రభానుశబ్దేన
ఉపరిష్టాదప్యేనం క్షయమాసః క్వాపి సంభవే దేవ. ౧౪
ఆపంచాబ్దముపేయుషి ద్విరధికే మాసేవ నైవ త్యజేత్సంసర్పి
పితృవార్షికం తదుభయోః కుర్యా దపిండం పురా. ౧౫
తచ్చాంహస్పతిమాస ఏవ విధివ త్కుర్యాద్వయో ర్మాసయో
యః కర్తవ్య మహః పురాపరభిదా మాశ్రిత్య ధర్మస్థితేః. ౧౬

(60) శ్రీరంగమాహాత్మ్యము—గ్రం. సం. 672.

ఇది యొకపద్యకావ్యము-ఐదాశ్వాసములు.

గద్యము—శ్రీమద్రఘురామచంద్ర చరణారవింద నిష్యందమరంద బిందు సందోహాలాలసేందిందిరాయమాన మానస తాండవకేళికాతుకోజ్జృంభమాణ మహాభుజంగపుంగవవిభూషణోత్తమాంగ రంగద్గంగాతరంగాభంగుర చతురకవితారచనాధురీణ శ్రీహరిభక్తామృతసార ప్రబంధ నిర్మాణప్రవీణ చేకూరువంశపయఃపారావార రాకాసుధాకరాయమాన సిద్ధులు నామధేయ ప్రణీతంబైన శ్రీరంగమాహాత్మ్యంబను మహాప్రబంధమునందు......అని—దీనివలనఁ గవిపేరు సిద్ధులు (సిద్దయ్య) యని తేలినది. ఈతఁడు శ్రీహరిభక్తామృతసార మను ప్రబంధమునుగూడ రచించియున్నాఁడఁట.

శ్రీనలగొండ్లలక్ష్మీనరసింహకవీంద్రుకృపావలోకనా
నూనసుధారసంబున వినూతనసాహితి లక్షణాదిక
జ్ఞానము గల్గి సత్సుకృతికాండము దండిగ నిచ్చమెచ్చి యా
సేనన రంగనాయకమహాత్మ్య మనం గృతి సేనొనర్చెదన్.

అనుపద్యముంబట్టి నల్లగొండ్లలక్ష్మీనరసింహకవిగారిశిష్యుఁ డని తేలినది.

వ......లబ్ధమనోరథు లగుగంఢకరబలిజకులంబునం జెలువలరు జలకలగోత్ర పవిత్రులనం బరఁగు నాగునువంశం బలఘుతరంబై ప్రవర్తిల్లు.

ఉ. శ్రీమత్తంజదళాక్షు సత్కరుణ నాచేకూరువంశాంబుధిన్
సోముం బోలి జనించెఁ గృష్ణుఁ డనఁగా సువ్యక్తశీలాత్ముఁడై
శ్రీమంతుం డగుకృష్ణదేవపదరాజీవార్చనాసక్తతన్
ధీమంతుం డన బుచ్చమాంబను మహాతేజంబునం బెండ్లియై.

దీనింబట్టి కవి గండవరబలిజకులస్థుఁడు జలకలగోత్రుఁడు నని తెలిసినది, పైపద్యములోని కృష్ణయ్యకు గోపాలుఁడు వెంగళయ్య యను నిద్దఱుసుతులు. ఆవెంగళయ్యకుఁ జలమయ్య, కృష్ణుఁడు నని యిరువురుతనయులు. చలమయ్య గృహిణి మంగమాంబ.

గీ. .........మంగమాంబాభిధాన, సాధ్విగర్భాబ్ధిసంపూర్ణచంద్రమూర్తిఁ
బరఁగి సిద్ధాఖ్యఁజెలువొందిపద్మనాభు, మదిని భావింతుఁబూర్వజన్మానుసరణి.

ఇట్లీ కవివంశావళి దీనిని బట్టి తెలియవచ్చుచున్నది. ఈతనికవిత్వము సంస్కృతపదజటిల మైనది గానున్నది. కృత్యాదిపద్యములు కొన్ని—

ఉ. శ్రీమిథిలాధినాథనృపశేఖరజాతసనర్మభాషణ
స్తోమలసద్దరస్మితుఁడు సుందరవిగ్రహుఁ డార్తపాళికా
రామవసంతుఁ డర్యమకులాంబుధిపూర్ణసుధాకరుండు శ్రీ
రాముఁడు సత్కృపామతి నిరంతరము న్నముఁ బ్రోచుఁ గావుతన్.

ఉ. ప్రీతి నమోనమో యనుచుఁ బెక్కువిధంబుల మ్రొక్కెదన్ మనో
జాతుని తల్లికిన్ సుకవిసంస్తుతకల్పకవల్లికిన్ ఖనీ
భూతదరిద్రవారిధరపుంజప్రభంజనదృగ్గత్రయీ
పూతకు దుగ్ధసాగరసముద్భవకున్ జగదేకమాతకున్.

మ. సరిదిభ్యావృతగోభృదండజవిభూపాంగార్చరాజన్మహీ
ధరరాట్సంభవ కబ్ధిజాబ్జభవకాంతానంత సంతోషశ్రీ
కరమాధుర్యహితానులాపకు సముగ్రానుగ్రహాలోకనో
త్కరసంరక్షితభక్తజాలకుఁ గవితాకాంక్షినై మ్రొక్కెదన్.

గ్రంథభాగములోనిపద్యములు—

చ. అన విని రామ రామ విను మాఁడది యంచుఁ దలంచెదీవు నీ
వనితఁ గనం గృతాంతయభవాబ్జభ వాదులకైన మృత్యువై
నను భయమున్ ఘటించు మునినాథసుపర్వవినాశకారిణిన్
హనన మొనర్చి సంతతము హర్షమొనర్పుము సాధుకోటికిన్.

ఉ. అచ్చటివానికాంతలు ధరాత్మజఁ గాంచి మహానుభావు లీ
సచ్చరితు లసమున్నతులు శస్త్రధనుర్ధరు లర్కతేజు లి
ట్లచ్చపువానివేషు లెవరన్న మఱంది నెఱుంగఁ జెప్పితా
హెచ్చినలజ్జ నుండ నగి రింతి జనంబు గిలాకిలంబుగన్.

ఉ. రాముఁడు రావణాసురు శిరంబులు బాహులు ద్రుంచె మొల్చె నా
స్తోమము ద్రుంచె మొల్చె మఱిద్రుంచెను మొల్చెను ద్రుంచె మొల్చినన్
వేమఱుఁ ద్రుంచుచుండ నవి వేమఱు మొల్చె నవిస్మయంబుగా
నామహీ శీర్షముల్ కరము లర్గలభంగిఁ దనర్చె భూవరా.

(61) బాలభారతమ్-గ్రం. సం. 855.

ఇదియొక సంస్కృతకావ్యము. అగస్త్యకృతము. దీనినిఁ గొంత బ్ర॥ కోలాచలము శ్రీనివాసరావుగా రాంధ్రీకరించి ముద్రింపించియున్నారు. వారికి మొదటినుండి పండ్రెండుసర్గముల గ్రంథము దొరకినదఁట. అందాఁకసర్గములే వారు తెనిఁగించిరి. ఈపుస్తకములో, తృతీయసర్గము మొదలు షోడశసర్గము వఱకుఁ బదునాలుగు సర్గములుగలవు. "అగస్త్యకృతే బాలభారతే" యనియున్నది. ఒక్కచోట అగస్త్యసంవాదే యనివ్రాసి సంవాదే యనుదానిని గుండలీకరించినారు. పరిషత్పుస్తకభాండాగారములోని గ్రంథము ప్రారంభమునందలి కొన్నిశ్లోకములు:—

జాతు జహ్నుదుహితు ర్జలే చిరం పద్మగంధిని విహృత్య నిర్గతైః
పౌరవైః పటగృహేషు భూషితైః భుక్తవద్భి రుషితం తతః సుఖమ్.
తత్ర వారివిహృతిక్రమాలసం నిద్రయా పరవశం వృకోదరమ్
సింధుసీకరభృత శ్శిషేవిరే మందరాద్రినవిరామవాయవః.
ఆయతాభి రహితం సుయోధన స్తం సుషుప్తి మవబుద్ధ్య వల్లిభిః
భోగిబద్ధ మివమందరం హరిః సింధుగర్భవ ముసి న్యపాతయత్.
సప్రబుధ్య సరిత స్సముద్ధితః ఛిన్నబంధనశతః స్వపన్ పునః
విద్విషా కుసుమతేన మోచితై రుద్విషాగ్నిభి రదృశ్యతోరగైః—౩ సర్గః.
పవనతనయే నాశ్వత్థామ్నః సనామ్ని హతే ద్విపే
చకితమనసా ద్రోణా దభ్యర్థితో మురవైరిణా
పతతి సమితా వశ్వత్థామా హతః పరవారణః
స్ఫుట మితి గిరం రాజా ధర్మాత్మజః స్వయ మబ్రవీత్-
ససత్యవచసో గురుర్ గిర మజాతశత్రోస్తదా
నిశమ్య సుతవత్సలః సపది హాసుతేతి బ్రువన్
విసృజ్య సశరం ధనుః ప్రబలశోకముహ్యన్మనాః
రథోపరిని షేదివానభవ దశ్రుధౌతాననః.

దృష్టద్యుమ్నేన సద్యస్సముపగతవతో వాహినీం తస్యరోషా
దున్ముక్తప్రాణవాయోః కరకలితకచే నాసినా మూర్ధ్నికృత్తే
సంక్షుబ్ధే సైన్యసింధౌ శ్రుతపితృనిధనః క్ష్మామపాలా మకృష్ణాం
కర్తుం నిష్పాండవంచ వ్యసృజ దరిబలే ద్రౌణి రాగ్నేయ మస్త్రమ్.
దగ్ధైకాక్షౌహిణీకే జ్వలితదశదిశా పార్థముక్తేనతస్మి
బ్రహ్మాస్త్రేణ ప్రశాంతే సపది గురుసుతం రోషసన్న్యస్త శస్త్రమ్
వ్యోమ్నః క్లుప్తావతార స్తరళతరజటావిద్యుదుద్యోతదీప్తా
ద్వ్యాసః కాంతారవాసవ్యవసితముచితై ర్వారయామాసవాక్యైః-౧౬-సర్గ.

పరిషత్పత్త్రిక 19 సం. 1-2 సంచికలలోఁ బ్రకటింపఁబడిన నలకీర్తి కౌముదిని రచించిన యగస్త్యుఁడు నీయగస్త్యుఁడు నొక్కఁడేసఁట. నలకీర్తికౌముది పూర్తిగ నెక్కడనైనఁ గలదా!

(62) శకుంతలనాటకము—గ్రం. సం. 695.

ఇదియొక యక్షగాననాటకము. నరసింహకవికృతము- ప్రారంభము:—

ద్విపద.

శ్రీమంతుఁ డఖిలలక్ష్మీప్రసన్నుండు । భూమి సోమాన్వయాంబునిధిసుధాధాముఁ
డరిశైలపవిధారుఁ డసహాయబలుఁడు । వరుసతో నంద్యాలవంశవిస్తారుఁ
డమలసదాచారుఁ డాత్రేయగోత్రుఁ । డమరేంద్రనిభవైభవస్ఫీతుఁ డనఁగ
రమణ నారాయణ రాజశేఖరుఁడు । విమలయశోరూపవిజితాంకుఁడు
అనుపేంపాలున కనుఁగుతనూజుఁ । డైమించు రాఘవావనినాయకుండు
అతులప్రతాపుఁ డూర్జితశక్తియుతుఁడు।నతనికగ్రసుతుండు నయగుణయుతుఁడు
రణకోవిదు ........................... అనృపవర్యునకనుజన్ముఁడగుచు
అమలగాంభీర్యరత్నాకరుం డగుచు । రమణనారాయణ రాజదేవేంద్రుఁ
డొప్పునానృపవర్యుఁ డొకనాఁడు ... ... ...
అనుదార వర్యులనరసింహసుకవి । వరయంచు రావించి ......
అంబరతాంబూలజాంబూనదాది ... ... లొసంగి
పరికింప నన్నయభట్టారకుండు । విరచించె దుష్యంతవిభుచరిత్రంబు
నాకథ యక్షగానంబుగా మిగుల । శ్రీకరంబుగఁ గీర్తి చెలువొందఁ జేయు
మనిపల్క దీవించి .........వెనుపొందహరిపేరఁ బ్రబలుసీకృతియు

కమనీయముగు కథాక్రమ మెట్టిదనిన:—

దీనివలనఁ గవిసంగతియు తత్కృతికిఁబ్రోత్సాహ మొనర్చిన నంద్యాల ప్రభువుల పేరులును, కథ యెందుండి గ్రహించినదియు, దెలిసికొనుచున్నాము, కథాకల్పనము యక్షగానములకుఁ దగినట్లే యున్నది. భామవేషకథవలె నున్నది.

క. పచ్చలబాను కరంబున, ముచ్చటగ హుమాయిపిట్ట ముంజేతిపయిన్
మచ్చికలర మంత్రులతో, వచ్చును దుష్యంతనృపతి వైభవమలరన్.

గీ. ఎవరయా మీర లేదేశ మేలువారలు, ఇపుడు మీకిటు వచ్చుట యెందుకొఱకు
తల్లిదండ్రులు యెవ్వరు ధరణినాథ, తెలియ జెప్పుము మీ నామధేయమేమొ.

దుష్యంతవచనము:—

ప్రేమమీరఁగ నాదు పేరేమ నెదవు, ఏమిరా ప్రియభృత్య యెఱుఁగవా నన్ను.

భటునివచనము— రాజేంద్రా !

గీ. మీరు యిటఁజేరినది మొదల్ మేదినీశ, సభికులందఱుఁ జాలఁగా సంతసించి
యెదురుచూచెదరయ్యయింకేలతడవు, తెర వెడలిరమ్ము యిచటికిఁ దీవ్రముగను.

రాజు— ఆలాగే వచ్చెదమురా భృత్యా !

దరువు. వెడలివచ్చెనూ వేడ్కమీఱ దుష్యంతనృపతి— వెడలివచ్చెను—
పైమాటలే సర్వమును వేత్తలకుఁ దెలియఁ జెప్పుచున్నవి.

విళంబినామసంవత్సర భాద్రపద బ ౧౦ లు నాఁటికి సమాప్తముగా శ్రీమన్మహామండలేశ్వర నంద్యాల నారాయణరాజు దేవమహారాజులుంగారు స్వహస్తముగా వ్రాసినది.

## (63) లక్షణచంద్రిక—గ్రం. సం. 552.

దీనికి గవి యెవ్వరో తెలియదు— తొమ్మిదిపత్రములు గలవు— ప్రారంభము—

గీ. శ్రీమనోనాథ నుతచర్య శ్రీమహేశ, సర్వనత లసదచలాత్మజాకళత్ర
బాలజనములకెల్ల విస్పష్టముగను, జేతు లక్షణచంద్రిక చిత్తగించు.

గీ. పూర్వకవులకు భక్తితో మ్రొక్కి నూత్న, కవుల వేడ్కనుతించి కాకవుల విడిచి
లఘుతరంబుగ జనులు సులక్షణంబు, దెలియ లక్షణచంద్రికఁ దెలుపు దీశ.

క. సుకవికృతిఘటపదార్థ, ప్రకరము గ్రుచ్చిలుచు నెపుడుఁ బరఁగుచు నుండీ
కుకవిశునకముల కిలము, తుకృతిస్నేహాభిలాష చొప్పడు నెటులన్.

గీ. మునుపులక్షణంబు గనువా రెఱింగితే, దీనఁ గొన్ని మరలు తేటపడును
మున్నెఱుంగకుండి కన్న సూక్ష్మంబుగా, లక్షణంబు దెలియు లక్షణముగ-
(విషయము క్రొత్తదియును గాదు, చెప్పినంత సుకరముగాఁ దెలియుపద్ధతి యును గాదు.)
క. కంద మిారీతిగా కొక, యందంబుఁ నైనఁ జెల్లు నాదిమపాదం
బందుఁ బదిరెండు మాత్రలు, చెందిరువది రెండవదియు శేషం బటులన్.
ఇందుకులక్ష్యము- జ్ఞానవాసిష్ఠరామాయణము.
క. ఇది తత్త్వరహస్యార్థము, పదసంగతిఁ దెలుఁగుపఱుచు ప్రాజ్ఞులకును బె
ట్టిదము తాత్పర్యవాసన, విదితంబుగఁ గవులుమెచ్చ వివరింతుఁ దగన్.
భారతము- శాంతిపర్వము-
జననీజనకసోదరులు, తనూభవులు ... ... ...
తేలుమందా యె బోనము, పాలాయెను మంచినీళ్ళు పండితవర్యా.
ఉ. బ్రహ్మవిరామమున్ భరనభారలగంబుల నుత్పలంబగున్.
మ. పదమూటన్ సరభంబులున్ నమయవల్ వర్ణిన్న మత్తేభమా.
చ. నజభజజల్ జరేభల గనంగ దశాయతి చంపకంబగున్.
క. పదుమూఁడుగోటులును న, ల్బదిరెండగులక్షలు దగుఁ బదియేడు వేల్
పిదపేఁడునూఱులు న్నిరు, వదియాఱుసమాంఘ్రివృత్త పంక్తులు దేవా.

49 పద్యములైన పిస్మట- సేనాధిపత్యము శేషాచార్యులు నలనామ సం॥ జ్యేష్ఠ బ ర ఆదివారముసరికి యీలక్షణచంద్రికవ్రాసెను. అని- తర్వాత మరల మకారయెతికి యరలవశషసహమాత్రలకు యీ ౘ అక్షరములకు దాపల సున్నలు వున్నయెడల మకారము మాత్రమే యెతులుచెల్లును- ఇత్యాది గొన్నిపంక్తులు గలవు. పూర్తికాలేదు.

(64) అచ్చతెనుఁగునిఘంటువులు. —

ఒక తాటియాకుల చిన్నపుస్తకము. ఇందు చౌడప్ప సీసములు- ప్రగడపువారికందము లని రెండుభాగములు గలవు. ప్రగడపువారికందము లని యే కాని కవిపేరు లేదు. సుమారు 80 పద్యములు గలవు. చౌడప్పసీసములు ప్రారంభములో,
క. కప్పామెయిజేని పేరిట, ముప్పదిసీసంబు లాంధ్రముగఁ జెప్పెను చౌ
డప్పయు నీకబ్బంబునఁ, దప్పెంచకుఁ డార్యులార తగనుతిసేతున్.

అనియున్నది. ఈతఁడు కవిచౌడప్పయో మఱియింకొకరో తెలియదు.

అంద్యోక్తపద్యము——

సీ. గోలనా ముగుదారిగోలనాఁ గను ముల్లుఁగోల యోడయుఁబరిగోలయనఁగ
డిందు వనంబు కడిందు తోరంబు ను డిందు నుంటకు ను బేరిందు క్రీడ
తీర్థంబు చికిలి మెట్టంత్రు మట్టాట వా డంత్రు వాసంట వ్రేగంత్రు బరువు
వెల్లి నిండుట పాలవెల్లి పాల్కడలి రే పెల్లి నాఁగను గొడు గెల్లి నాఁగ
తక్త్రియన యెక్త్రె పెనుచోంపక్త్రె మీఱు, తొక్త్రుప ట్టాలదొక్త్రి ప్రోజక్త్రె నాఁగ
మక్త్రిచిట్టఁ బరున్న రాకుక్త్రమిన్న, కక్త్రిచెలివేల్ప ముజ్జగాల్బొక్త్రిదాల్ప.

ప్రగడపువారికందములు ప్రారంభము.

క. శ్రీరమణీకుచలిప్తసు, సౌరభఘనసారగంధసారవసీరా
సారఘనసారసారస, సారరజోవత్స వత్ససారవిదారీ!

క. ఇన్మహి నిరసించుట కగు, గిన్మో నవఘుళించె నేవగించెను బలుమే
లమ్మాడెఁ దెగడె నెకస, క్కిమ్మాడె దురంగలించెఁ గేడించెనహా.
పేరొప్పును మనుభూమికి, మోరపురతనాలమెట్ట మొరకబువి యనా
వారిజము బొడిపము నిం, డారును గంకేళి పేరు లంబురుహాక్షా.
ఏక్తెఱయు సాంపరాయము, నేక్తెఱయు నితాంతమునకు నిలఁబేరొప్పుం
దోక్తోనన సంప్రతి యగుఁ, దోక్తోననఁ బూర్వమునకుఁ దొడరరమేశా.
సారవయనఁ గేదారము, సారవయన సేతువునకుఁ జనుఁ బే రవనిన్
బూరుగయన శాల్మలియును, బూరుగయనఁ గొహాళంబు భూసురవినుతా.

ప్రాంతతప్పులు మెండుగా నున్నవి. దానితోపాటు కవి బుద్ధిపూర్వకముగాఁ జేర్చిన "బుయనాఁగయోని గెబ్బుయనా జయింపు మబ్బుయనాఁగ మొయిలు గబ్బుయనత్రుల్లు" ఇట్టి పొరపాటులును గలవు.

క. వనదేవత కాక్త్రేఁడనఁ, దనరును గువ్వకరి యేకతమునకుఁ బేరై
చను వంకళక్త్రి లాతా, మనఁ గూఁకటి యనఁగఁ జుట్టు అంబుజనేత్రా.

అను కందపద్యముకూడ సీసములచివర నున్నది. దీనిచివర సంస్కృతము ద్విరూపకోశముకొంతఁ గలదు.

వికృతినామసంవత్సర చైత్ర బ ౧ సోమవారము వఱకు క్రొత్తపల్లి లచ్చయ్య స్వంతమునకు వ్రాసికొనినపుస్తకము.

---

(65) సురాభాండేశ్వరోపాఖ్యానము. గ్రం సం. 1018.

ఇది యేకాశ్వాసపద్యకావ్యము- కుచేలోపాఖ్యానమును, యాజ్ఞ వల్క్యపురాణమును రచియించిన గట్టుప్రభువు దీనికవి. ఘట్టుప్రభుఁడనివాడుక.

గద్యము:—ఇది శ్రీమద్భ్రమరాంబికా వరప్రసాదలబ్ధ కవితాధురంధర సరస
కవిమిత్ర యెల్లనామాత్యపుత్ర గట్టుప్రభునామధేయప్రణీతం బైనసురా
భాండేశ్వరోపాఖ్యానంబునందు సర్వంబు నేకాశ్వాసము.

గట్టనఁగాఁ బర్వతము-పర్వతమనఁగాఁ బ్రసిద్ధికెక్కిన శ్రీశైలము-శ్రీశైలేశ్వరునిపేరు గావున గట్టుప్రభుఁడు అనితల్లిదండ్రులు లొనర్చిననామకరణము కావచ్చును. కొండలరాయఁడు, ఉప్మాకయ్య, కొండయ్య, సింహాచలము, తిరుపతయ్య, అణ్ణామలై, అరుణాచలము-ఇత్యాదిగా వచ్చినపేరగును.

ప్రారంభ మిట్లున్నది.

క. శ్రీమత్కాశీపట్టణ, ధాముఁడు విశ్వేశ్వరుండు ధరణీధరజా
భామాకుచకుంభయుగ, స్థామలవక్షుండు మముఁ గృతార్థులఁ జేయున్.

చ. హరిణపినాకహస్తుని బురాసురఘోరమదాపహారునిం
బరమపవిత్రునిం గుముదబాంధవపావకమిత్రనేత్రునిన్
సురగణవంద్యుని న్శివుని శుభ్రభశేఖరు సర్వమంగళా
వరదుని గాశికాపురనివాసిని విశ్వపతిన్ భజించెదన్.

ఈకథకు మూలము స్కాందాంతర్గత కాశీఖండములో నున్నదని చెప్పుచున్నాఁడు.

సీ. ... ... ...
కలవందుఁ బర్వత ఖండంబు కేదారఖండంబునన భువి ఘనతగాంచి
యొందును నందుల నెక్కుడు కాశికాఖండంబు ముక్తికిఁ గారణంబు
పరఁగె నందుల సురాభాండేశ్వరం బను పుణ్యచరిత్రము భూరిమహిమ
నట్టికథఁ దేటతెనుఁగున నతులమృదుల, సరసమాధుర్యవాక్యముల్ సంఘటించి
కవులకరుణావిశేషంబు కలిమికతన, విశ్వపతి కంకితంబుగ విన్నవింతు.

క. భ్రమరాంబాకరకలితా, త్యమలిన సద్వర్ణసముదయాంకిత జిహ్వా
సుమహితుఁడ నేను గవితా, ప్రమదాజనకుండ గట్టుప్రభువాంకుండన్.

కథలోని రెండుపద్యములు——

క. తెక్కలు విదలిచి యీఁకలు, ముక్కులఁ జక్కంగ దిద్ది ముందటికి మెడల్
నిక్కించి మిన్నుఁ జూచుచుఁ, గొక్కోరో కో యటంచుఁ గోళ్లుగూసెన్.

వ. అంత.

గీ. వారుణీవిక్రయుఁడుగృహద్వారమునను, నిల్చికనధర్మగేహానిఁబిల్చుటయును
గడగడవడంకుచును లేచికమలనయన, యవనిదేవోత్తమునకిట్టులనుచుఁబలికె

శా. ఏబూమెల్ యెటువచ్చునో యనుచు మున్నే నెన్నియుం జెప్పిన
న్నాబుద్ధుల్ వినవైతి విపుడ కటా నాథుండు వచ్చెఁ గదా
యేబొంకు ల్గొఱగావు పోవు మిఁక నీ వెంద్రైనఁ బోనోపవే
నీబాన న్వసియింపు వారుణిరసం బేపాటి యందున్నదో.

శ్రీముఖసంవత్సర జ్యేష్ఠ బ ౬ అంగారవారము వఱకు జంగం నాగలింగం సురాభాండేశ్వరము. తాడేపల్లి సుందరరామయ్య వ్రాసియిచ్చెను. అని గ్రంథాంతమునఁగలదు. మొదట నొత్తుపటామీఁద తనువుల రామలింగయ్యగారి కుమారుడు బసవశంకరయ్య సురాభాండేశ్వర మని యున్నది.

(66) దేవాంగచరిత్రము. గ్రం. సం. 931.

ఇది యొక పద్యకావ్యము. కవి యెవ్వరో తెలియదు. ఆశ్వాసవిభాగము లేదు. వ్రాఁత గొలుసుకత్తు. గొలికిగొలికి కొట్టికొట్టి దిద్దిదిద్ది వ్రాసినపంక్తులు కనఁబడుచున్నవి, చూడఁగా నిదియే ప్రథమప్రతియేమో యని తోఁచుచున్నది. పద్యములు ధారాళముగాఁ జదువ ననువుపడదు. కష్టముమీఁద దెలిసికొని చదువవలయును. కవిత్వము చక్కనిది. హృద్యము లగుపద్యములు గలవు. ఇందు వస్త్రనిర్మాణము దానికై తంతుసంపాదనము దేవతలు మొదలుగా నందఱకు వస్త్రప్రదానముం జెప్పఁబడినది. దేవాంగముని యిందు కథానాయకుఁడు, లోకమునకుఁ దెలియుటకై యందందుఁ గల కొన్నిపద్యభాగములం జూపి విడువఁబడును.

ప్రారంభమున——

క. వందన మొనర్తు సేవక, సందోహానందునకు గజాస్యునకు జగ
ద్వందితునకు ధూమాంకున, కుం దుర్దను విఘ్నభేదకోద్యోగునకున్

క. వాణికి వీణాపుస్తక, పాణికి భక్తజననివహపావనికి ఘన
శ్రోణికి మ్రొక్కెద సుగుణ, శ్రేణికి ననిశమును సురకరీంద్రస్తనికిన్.

చ. వితతఖ్యాతివహించు నైమిశనివేశుల్ పార్వతీశార్చనా
ప్రతు లాత్మజ్ఞులు సంశ్రితైకగుణు లార్యాచారసంపన్ను లం
చితవిజ్ఞానులు శౌనకాదులు మహర్షుల్ సూతుఁ బౌరాణికా
యతపీఠస్థితుఁ గాంచి యిట్లనిరి ప్రత్యాసక్తితో నందఱున్.

ఉ. మానుగ దేనిచేత నభిమానము గోపనమయ్యె నట్టివ
స్త్రానకు సాధనంబులు తిరంబుగ నెవ్వనిచేతఁ గల్పనం
బైనవి గోప్యగోపనము లష్టి నొనర్చి మనుష్యులందఱా
బూని పరంబుఁ జేరుటకుఁ బూనిక నెవ్వఁడు చేసె నాదటన్.

గీ. ఇతరకథలవలన నీఁగనిపాపముల్, దేని వినినఁ బాసి దివ్యులగుదు
రట్టిప్రశ్న మీర లడిగితి రిపుడు మ, హారస్య మిది మహాత్ములార.

చ. గురుఁడగు బాదరాయణుని గోరి నమస్కృతి చేసి తొల్లియ
ప్పరమమునీంద్రుచే వినినభంగిని దెల్పెద మీకు మీరు సా
దరణమనస్కులై ననుఁ గృతార్థునిఁ జేసి కథార్థతత్త్వత
త్పరమతులై వినుం డని పదంపడి యిట్లని పల్కె వారితోన్.

గీ. పరమయోగీంద్రులకు నైనఁ బడయరాని, శైవసాయుజ్యమేకథాశ్రవణమునను
గలుగు నుత్తములకు నైన నెలమి దీని, మహిమ వర్ణింపఁదరమె మనస్సులార

ఉ. పాయక యెల్లలోకములఁ బ్రస్తుతికెక్కి సృజించినట్టి ప్ర
జ్ఞాయుతుఁ డైన బ్రహ్మవలనన్ జగదీశ్వర గుహ్యరక్షణో
పాయము గల్గదయ్యె ననపాయముగాఁ దగులోకరక్షణం
బీయెడ నెట్లు గల్గు జను లెట్లు సుఖింతురు సర్వకాలమున్.

వ. దేవి నీకు నమస్కారంబులు గావించెద ననుగ్రహింపు మని వెండియు
నిట్లనియె.

క. తంతువు దెచ్చుట కొఱకై, యెంతయు విష్ణ్వంతికమున కేగెడు నన్నుం
జింతింపుము రక్షింపుట, కింతట దీవించి వంత లెడలెడునట్లున్.

గీ. అయిదురంగులుచిహ్నితమైనవస్త్ర, మొకటిగావించినీ నేర్పు ప్రకటమొందఁ
దాపసోత్తమ నీశుభదంబు కొఱకు, నీశ్వరున కిష్టు ముందు ధరించుటకును.

(67) ఉత్తరరామాయణము. గ్రం సం. 999.

తిక్కనసోమయాజికృత నిర్వచనోత్తరరామాయణము పదియాశ్వాసములు తరవాయి - బను నొకండవయాశ్వాసము. జయంతి రామభట్టను కవి

రచియించినది, యీగ్రంథములోఁ జివరఁ జేర్పఁబడినది. ఇందు వచనములు గూడఁ గలవు. కవిత్వ మంత రసవంతముగా నుండదు. అచ్చుపడినదానిలో నీభాగము నెవ్వరును జేర్పలేదు. కావున దానివిషయమై కొంత యిందుఁ దెల్పఁబడుచున్నది. ప్రారంభము.

క. శ్రీమద్రఘుకుల జలనిధి, సోమా పరమాత్మనామ సుగుణస్తోమా
భీమాహవదైత్యకులవి, రామా భద్రాద్రిధామ రాఘవరామా.

క. శ్రీరాముఁడు చెలువం బుగ, ధారుణిఁ బాలింపుచుండి ధర్మాన్వితుఁడై
సారెకు మైథిలిఁ దలఁపుచుఁ, గారుణ్యము కలిమి చెలిమి గౌరవ మొప్పన్.

క. కుశలవపుత్త్రబోధము, కుశలవులకు ననుజులకును గుశలముఁ జెందన్
విశదముగ వేదశాస్త్రా, వశమునగు రాజ్యనీతి పద్ధతిఁ దెలిపెన్.

ఉ. జానకిఁ బాసి రాఘవుఁడు స్వర్ణమయాం బగు సీతతోడుతం
బూని సమస్తయజ్ఞములు పొందుగ దక్షిణ లిచ్చి సేయుచున్
మానుగ సర్వభూప్రజల మన్ననఁ బ్రోవుచు నాఁడునాఁటికిన్
భానుతుఁడై వసుంధరను బూజిత మొప్పఁగ నేలునంతటన్.

క. కౌసల్యాదిగఁ దల్లులు, వాసవపురి కేగినంత వారలకొఱకై
భూసురులఁ బంపె రాముఁడు, భాసురముగ ధర్మలోకపదమునఁ బొందన్

గద్యము—ఇది శ్రీమద్భద్రాద్రిరామ వరప్రసాదలబ్ధ కవితా(విచిత్ర)గార్గేయ
గోత్రపవిత్ర జయంతి కృష్ణభట్టారక సుభద్రాంబావరతనూజ రామభట్టప్ర
ణీతం బైన శ్రీమద్రామాయణకావ్యంబున నుత్తరకాండ తిక్కనసోమయాజి
రచితంబై యున్న శేషంబునం గల్గు మీఁదటికథయందు..........
సర్వము న్నేకాదశాశ్వాసము.

కథలోని రెండుపద్యము:—

ఉ. భూపతి నన్నుఁ దా విపినభూముల కంపిననాఁడు వెంబడిం
బ్రాపయి కందమూలఫలరాసులఁ దెచ్చియు మమ్ముఁ దన్విఁ దాఁ
గాపరియై వసించుచును గాచుకొ యుండును నిద్రలేక హా
బాపురె నేఁడు లక్ష్మణుని బాయఁగఁ జేసితి మాయదైవమా.

గీ. అమరగంధర్వమానిగణాంశజనిత, మైనమర్కటభల్లూకయాతుధాన
సంఘ మంతయు నిర్మలస్వాంతు లౌట, నన్నుగమ్యనమున కొడఁబడియాదరించె

క. పదివేలవత్సరంబులు పదినూఱులయేండ్లు నిండెఁ బదపడి సమయం
బిదె వచ్చెఁ బ్రతిన వేళయుఁ, బదపడ వైకుంఠ లోకపదవికి రామా.
ఖరసంవత్సర ఆషాఢబ 3 బు స్థిర్వారము మేడవర్పు ఆదినారాయుడు మళ్ళచేనుల కొమారుఁడు రాజగోపాల్కుని వ్రాసి యిచ్చెను.

—(68) బాలభారతమ్—గ్రం. సం. 936.—

అగస్త్యకృత బాలభారతమ్. పరిషత్పుస్తకభాండాగారములోని సం. 855 గ్రంథ మసంపూర్ణము. ఇందు ౨౦ సర్గలు సంపూర్ణముగనున్నవి. ప్రారంభము:—
అస్త్యత్రినేత్రప్రభవః కలాత్మా శశీతి నక్షత్రగణస్యనాథః
యం వారిజశ్రీహర మాహ స్తవాచో వామం హరే ర్లోచన మామనన్తి.
సేవ్య స్సురాణాం హిమవద్గిపాద స్సంభావనీయ శ్శిరసా శివేన
మహీధ్రభర్త్రేవ తమోపహంత్రీం యః కౌముదీందివ్యనదీం ప్రసూతే.
నజాహ్నవీయైశ్చ నయామునైశ్చ నచాపరాసాః సరితాం పయోధిః
యస్యోదయే నైవసుజాతధామ్నో బహీర్వయసీమ్న్యప్రి ముపైతి వార్ధిః.
అంతమున—
వచైన మాహస్మ చిరాత్రిణేన శునా సునాసీర వినామునా మే
నరోచతే నాకవిహారసౌఖ్యం శ్లాఘ్యం పరం భ్రాతృసమాగమోవా.
విహాయ తచ్ఛ్వానకరూప మగ్రే మూర్తేన ధర్మేణ సహాక్షితీశః
ఆరోపితో మాతలిచోదితాశ్వం రథం మఘోనా దివ మారురోహ.
ఆందోళయ న్నభనదీతరంగా న్నమోదయో నందనగంధవాహః
నృపాయ కల్పద్రుమపుష్పగంధ ముపాయనత్వం గమయాంబభూవ.
పాంచాల్యాసమ ముద్ధితై ర్నిరయతః కర్ణాదిభి ర్భ్రాతృభి
స్స్వంస్వం ధామగతై రభిష్టుతయశా దివ్యైశ్చ తై ర్బంధుభిః
సింహా దిగ్గజదాన దిగ్ధపయసి త్యక్త్వా వపుర్మానుమం
సర్వాసా దివిషద్గృశాం సవిదధే శర్మాణి ధర్మాకృతిః.
ఇతి శ్రీ అగస్త్యకృతౌ బాలభారతే వింశఃసర్గః—

—(69) అజ్ఞానధ్వాంతచండభాస్కరము—గ్రం. సం. 4343.

ఇదియొక వేదాంతవచనగ్రంథము. కంభముపాటి అమరేశ్వరకవి రచితము. భాష సంభాషణరూపముగా నున్నది. గద్యము—"ఇది శ్రీమదద్వైత బ్రహ్మవిద్యావిశారదుం డైనకంభముపాటి అమరేశ్వరశాస్త్రుల్లుగారి చాతను

శిష్యానుగ్రహార్థమై ఆంధ్రభాషాప్రబంధరూపముగాను రచియింపఁబడినఅజ్ఞాన ధ్వాంతచండభాస్కర మనేటి విచారదశరూపక మైన వేదాంతప్రకరణంసమాప్తమూ.

ఇందు అనుబంధవిచారము—జీవేశ్వరవిచారము, సృష్టివిచారము, ఇట్లు పది ప్రకరణములు గలవు. కొంతమచ్చుకు—

"పుత్రదోషాలనువివరించేము.

"పుత్రుఁడు పుట్టకమునుపు పుట్టడాయనని తల్లిదండ్రులకు దుఃఖము గర్భము నిలిచి స్రవిస్తే దుఃఖము స్రవించక శిశువు పుట్టేటప్పుడు శిశువుకైనా హాని తల్లికైనా హాని హానిపొందకపుట్టినా గ్రహాదోషాదిదుఃఖము రోగాదులవలన దుఃఖము నశించేకాలమందు ధూర్తుఁడాయెనా యమదండ్లకొట్టబోతున్నారో అని దుఃఖము వొడుగుగాదాయనని చదువురాదాయనని పెండ్లిగాదాయనని దుఃఖము. వయస్సువాఁడాయనాంటే పరదారాగమనం చేసెనా లోకులు నిందించేరు అని రాజులు దండించేరు అని పరలోకమందు నరకానబడేనని దుఃఖము"......

ఇట్లేయర్థదోషాదులు వివరింపఁబడినవి.

బ్రహ్మజ్ఞానోపాయము—శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీసచ్చిదానందేంద్ర శ్రీగురుచరణకమలశిష్య శ్రీరామకృష్ణానందవిరచితము.

గురుశిష్యసంవాదకీర్తన- కావి తిమ్మకవియొనర్చిన ౧౦౭ చరణములు వేదాంతము-కొన్ని చరణములు—

కాలినవిత్తులు క్రమ్మరమొలవాపు లీలజ్ఞానికి పుట్టు లేదు సుమ్మోయి
కారణమణఁగిన కార్యమెక్కడనుండు నారీతి సంసారమని చూడుమోయి !

మడికిసింగన్న వాసిష్ఠరామాయణము- మొదలైనవియుఁగలవు.

౨౩ వ పత్రములో నీక్రిందిపంచరత్నములు గలవు.

మ. నిగమాంతప్రతిపాద్యమై విమలమై నిర్వాసనాభాగ్యమై
సగుణాతీతము నిర్గుణాదికమునై శశ్వత్సుఖానంద స
ర్వగురుత్వం బగు రామలింగగురుచంద్రావాస మైనట్టి మా
మగరాల్పట్టణ మెంతదవ్వు చెపుమా మర్త్యాంగనారత్నమా.

మ. విగతాశాభయులై మహాశుభదులై విశ్వాత్ములై నిత్యులై
జగదక్షాదివికారదూరుఁడయి దోషధ్వంసియై సద్గురుం

డగుచుం బ్రోచెడి రామలింగగురుచంద్రావాస మైనట్టి మా
మగరాల్పట్టన మెంతదవ్వు చెపుమా మర్త్యాంగనారత్నమా. ౨

మ. జగమం దెన్నఁగ భక్తకల్పతరువై సర్వప్రసౌఖ్యంబులం
దగరక్షించి వరించి ముక్తిలలనా తాదాత్మ్యమొందింప ధీ
రగుణుండై తగు రామలింగగురుచంద్రావాస మైనట్టి మా
మగరాల్పట్టణ మెంతదవ్వు చెపుమా మర్త్యాంగనారత్నమా. 3

మ. జగతిం బుట్టి ముముక్షులైన సుమనస్సంస్తుత్యుఁడై సదా
జగదుద్యద్వరిజాలభీషణలసత్సన్మాత్రికుం డౌచు వే
తగ రక్షించెడు రామలింగగురుచంద్రావాస మైనట్టి మా
మగరాల్పట్టణ మెంతదవ్వు చెపుమా మర్త్యాంగనారత్నమా. ౪

మ. పగడా ల్పూసవనీలగారుడమణీవైడూర్యరత్నంబుల
న్నగరాల్మెంపులు చంద్రకాంతరుచుల న్మానౌచు వెల్గొంది పా
దగుచుం శ్రీకరరామలింగగురుచంద్రావాస మైనట్టి మా
మగరాల్పట్టణ మెంతదవ్వు చెపుమా మర్త్యాంగనారత్నమా. ౫

ముక్తిద్వారకవాటముం దెఱచి పై ముక్కంటిపైకంటిలో
రక్తిన్మాని విరక్తిచే మిగులఁ బేరాకంటిపై కంటిలో
యుక్తింబొందినయోగి మూకజడబాలోన్మత్తులం బోలు నీ
భక్తిన్ శ్రీమగరాలపట్టణవరా భావజ్ఞ సర్వేశ్వరా.

ఇట్టివే "కొట్టా యిక్కడి కెంతదవ్వు చెపుమా కొన్మాసరోజాననా-
పొందూరిక్కడి కెంతదవ్వుచెపుమా పూర్ణేందుబింబాననా-
అను మొదలగుపద్యము లీప్రాంతములలోఁ గొందఱు చదువుచున్నారు.

## —(70) హంసవింశతికథలు-గ్రం. సం. 1087—

ఇదియొక్క చక్కనివచనకావ్యము. మొదటిపత్రము లేదు. చివరపత్ర మున్నదిగాని ముక్కలై పోయినది. ప్రతిపత్రమును జివరఁ గొన్నియక్షరములు గలభాగము విఱిగిపోయినవి. భాష చాలభాగము శుద్ధముగా నున్నది. కల్పనలు మనోహరముగానున్నవి. కొంత మచ్చు చూడుఁడు—

"ఎనిమిదవనాఁటిరాత్రి హేమావతి మణిఖచితతాటంకకాంతులును ముక్తాహారంబులకాంతులును రత్నకంకణంబులకాంతులును దిగంతంబు లావరింపఁ గుంకుమపంకంబు పొంకం బగుచుండఁ జెంతకు వచ్చిన దానిం గాంచి

యోశృంగారవతి రాజగృహంబునకుం బోయెద వేమో నాయుచ్చట విని పో వుదుగాక యని ముద్దులు గులుకఁ బలికిన హంసవాజ్మాధుర్యంబునకుఁ జిక్కి ... విని యెదఁ దెలుపు మనిన నిట్లనియె. పున్నాగపుంజం బను (పురంబున) ధనచిత్తుం డనువైశ్యశిఖామణి యుండు నతండు కాయధాన్యంబులు గలకణ జంబులును బియ్యంపుగరిసెలును చిల్లరలమ్మెడు దుకాణములును గట్లసంచులు ను దక్కెడయును, అటకయుం గలిగి జాజికాయలును జాపత్రియును ... మొద లగు సమస్తవస్తువులు బేరంబాడుచుండు నాతనికి వసుమతి యను సతిగలదు. దానిమోము గోము దాని కావిమోవి, దాని కప్పుకొప్పు దానియారుతీరు దానిచెన్నగుచిన్నెలు దానిజగ్గునిగ్గు దానితేటగుమాటలు ... దానిం జూచిన మానవుం డాత్మలో మెచ్చి శిరంబు గదల్చి మీసంబులపైఁ గేలువైచి నిట్టూ ర్పువుచ్చి మజ్జారే యనక మానండు"

—(71) బహువిధగ్రంథములుగల సంపుటము గ్రం. సం. **1244.**—

ఇం దనేకవిషయములు గలవు. అష్టాంగయోగక్రమము- యుగకాల సంఖ్యయునుగలవు.

(1) నానార్థపద్యములు:—ఇప్పేర సంస్కృతపదముల నానార్థములం దెలుపు ౫౦ కందములు గలవు.

క. సంస్కృతము లక్షణోక్తము, సంస్కృతమన శ్రుతియుగతియుస్వర్గముభూమిన్
సంస్కృతము చెడనిపదవియు, సంస్కృతమనఁబట్టిపండుసభ మొదలయ్యెన్.

క. ఘృత మనఁగ నెయ్యి నీళ్లును, ఘృత మనఁగాఁబాలుచల్లగుగ్గిలమినుమున్
ఘృత మనఁగఁ దేనె నెత్తురు, ఘృత మనసంసారసుఖము గెల్పునునయ్యెన్.

క. న్యగ్రోధ మనఁగఁబామును, న్యగ్రోధంబనఁగ వ్రేలు నెత్తురుఁ బొత్తున్
న్యగ్రోధ మనఁగ మఱ్ఱియు, న్యగ్రోధం బనఁగ బార నగడును నయ్యెన్.

(2) శివస్తోత్రము:—ద్విపద సుమారు నూఱుచరణము లుండును. పాల్కురికి సోమనాథకృతమేమొ!

"కులజుండనైన దుష్కులజుఁడనైన, బలుపుణ్యనిధి నైనఁ బాపాత్ముఁడైనఁ
గాని నీసద్భక్తి కలితుఁడనైన, వానినీరూపులో వర్ణింపఁజేయు
పుడమిభక్తులయిండ్లఁబడిపనుల్ సేయు, పడఁతికడ్డునయైనఁ బ్రభవింపఁజేయు
... ... ... ... ... ...
పరమపరుండైన పాల్కురినిలయు, కరుణతోఁ బ్రోచును గలకాలమెల్ల."

(3) షట్స్థలసంబోధతత్త్వరహస్యము:—

సంస్కృతశ్లోకములును, దెనుఁగువివరణమును గల శైవగ్రంథము.

గద్యము:—ఇతి శ్రీగురులింగజంగమపాదారవిందమకరందపానమిళింద మానసే శ్రీమద్గురునల్లమాహ్వాయకరుణాకటాక్షవీక్షణాంబునం మురుమల్ల నామ్న ప్రణీతంబైన షట్స్థలసంబోధతత్వరహస్యంబు ... ..."

తెనుఁగువాడుక మాటలతో నున్నది.

శివతత్వపరే సూక్ష్మ బిందురూపంతు జాయతే
బిందునాదసముత్పన్నం నాదాంతే శక్తిజాయతే
శక్తిస్తు జాయతే శబ్ద శ్శబ్దేజాయంతి వాగ్భవం.

యిట్లు పరమసూక్ష్మమైన వ్యోమాతీతమైన శివతత్వమందు బిందురూపమైన పరాశక్తి బుట్టెను. ఆపరాశక్తి నాదం బుట్టెను. ఆనాదమే ఆదిశక్తివలన ఇచ్ఛాశక్తి బుట్టెను. ఆయిచ్ఛాశక్తియందు శబ్దము బుట్టెను. ఆశబ్దమే జ్ఞానశక్తి ఆజ్ఞానశక్తివలన వాక్కు పుట్టెను. ఆవాక్కుయనెడిదే క్రియాశక్తి... ..." దీనిని రుధిరోద్గారినామసంవత్సర వైశాఖ శు ౫ సోమవారం సాయంత్రం సద్వచనటీక నిమ్మన బసవానందయోగిగారి మాతృకను వున్నట్టుగా మాచిరాజు బుచ్చన్న సంపూర్ణంగ్గా శ్రీసద్గురుపాదాల అనుగ్రహాంవల్లను వ్రాసెను.

ఈసంపుటములో మఱియు ద్విపదప్రమథస్తోత్రము వర్షఫలము రుద్రాక్షధారణవిషయము సోమనాథుని ప్రభులింగలీలలునుగలవు.

(4) జీవయెఱుకులకొఱవంజి. సన్నిధిరాజు జగన్నాథకవిప్రణీతము.

గద్యము:—శ్రీమద్వేదవేదాంతరహస్య ప్రణతగుహాంతరాళనిలయ పరమహంసపరివ్రాజకాచార్యచర్య సర్వతంత్రస్వతంత్ర శృంగుభేరిసింహాసనస్థిత శ్రీమచ్ఛంకరాచార్యపాదారవింద మకరందపానమిళిందమానమానస సన్నిధిరాజవంశపారావార రాకాశశాంక అమ్మయసుపుత్ర జగన్నాథనామధేయప్రణీతం బైన జ్ఞానయరుకలకురువంజి యను మహాప్రబంధంబునందు సర్వంబు నేకాశ్వాసము.

యక్షగానము— వేదాంతవిషయము- మొదటిపత్రము పోయినది. ౮ ౦౦వినుండు-"...కలిగిన తామరకమల మున్నది. ఆకమలమందు మానసహంస యనేరాజహంస గలదు. దానిఖగాంతరమందు నవరత్నదీపులు గల చిద్బ్రహ్మము వున్నది. అని చెప్పగాను దాని పట్టి తెమ్మనుమని మాశింగ్గి అని

కొట్టె దేవరా నేను ప్రాకృతపురుషుణ్ణి గనక రాజహంసను పట్టి తేలే ననగా నామీద కోపించ్చి రాజహంసకొరకు సుకర్మేచ్ఛచేత పారిపోయి వచ్చినది. సామీ, నేను దాని వెనుకవచ్చినాను సామీ, మాశింగ్గిని నేను విడిచిపెట్టితే యీఅనంత్తకోటి బ్రహ్మాండాలు చెడిపోవడానకు హేతు వౌతుంద్ది గనక శింగిని జూడవచ్చినాను సామీ, యని యన్నంత హొస్తగాడు అడిగీమాట, వోరీ శింగ్గా మీశింగ్గిని నీవు చూడకపోతే యీఅనంత్తకోటి బ్రహ్మాండ్డాలు చెడిపోతున్నవని తెలియజెప్పు మనిన, చెప్పుమంటావు సామీ, ఎనిమిదిశరీరాలున్ను నాలుగుపాదాలున్ను మూడుస్తానాలున్ను అయిదుగురుదేవతలున్ను వీటితోగూడిన ప్రణవజ్యోతిరూపమైన పరబ్రహ్మము నన్ను చేపట్టి సర్వలోకాలున్ను ఆడిస్తూవున్నాడు సామీ, నన్నుగాదని మాశింగ్గి తనపేరు దెచ్చుకోవలెనని విడనాడి వచ్చినదిసామీ."

ఇది ద్వితీయభాగము.